వారి ప్రాంతములలో పోర్చుగీసే రాజభాష. భారత స్త్రీలనే వివాహమాడి వలసరాజ్యమును స్థాపింప జొచ్చిరి. వారి పనుల కన్నింటికి వెనుక క్రౌర్యము ప్రముఖభావముగ నుండెడిది.

పోర్చుగీసువారు వారి మొట్టమొదటి గిడ్డంగి (Factory) ని కాలికట్టులో 1500 లో స్థాపించిరి. దానికి అధికారి 'పెడ్రో ఆల్వారెజ్ కేబ్రల్' (Pedro Alva Rez Cabral) అనువాడు. వారి మొదటి గవర్నరు 'అల్బూకర్క్' (Albuquerque) అనునాతడు ప్రజ్ఞావంతుడు. ఈతడు అరబ్బులను ఓడించి వారి చేతులలోనుండి సముద్ర నౌకా మార్గములను తప్పించి వానిని పోర్చుగీసు వర్తకుల పరము చేసెను. ఇతడు 1509 మొదలు 1515 వరకు పరిపాలించెను. గోవాలో 1510 లో ఒక నౌకా కేంద్రమును నెలకొల్పి, అచటనుండి దండ యాత్రలను నడపుచు మలాకా (Malacca) ఆర్మజ్ (Ormuz) డయ్యూ (Diu) లను వశము చేసికొనెను. ఈ విధముగా ఎఱ్ఱసముద్రమునకుపోవు వాణిజ్యమును పోర్చుగీసువారి చేతులలోనికి తెచ్చెను. ఇట్లు భారతభూమిపై అడుగుపెట్టిన ఒక శతాబ్ది లోపుననే పోర్చుగీసువారు పైని పేర్కొన్న ప్రాంతములనేగాక— మంగళూరు, నాగపట్టణములనుగూడ వశపర్చుకొనిరి.

ఇట్లు అధికారము హస్తగతమైన వెంటనే తమ పద్ధతి ప్రకారము మత ప్రచారమునకు గడంగిరి. అతి క్రూరమైన పద్ధతుల నవలంబించి ప్రజలను తమ మతములోనికి చేర్చుకొన జొచ్చిరి. 1560 నాటికి వారు పరిపాలించుచున్న ప్రతి గ్రామమునను ప్రజల మతమును పరీక్షించి, వారు రోమను కేథలిక్కులు కానిచో శిక్షించు సంస్థలను స్థాపించిరి. నాడు ఎందరో హిందువులు, ముసల్మానులు, సిరియను క్రైస్తవులు; పోర్చుగీసువారు స్థాపించిన సంస్థలచే కఠిన శిక్షలకు పాత్రులయిరి.[8] పోర్చుగీసువారు ముసల్మానులను 'మౌరో' (Mouro) అనియు, హిందువులను 'జెంటియో' (Gentio) అనియు పిలిచెడివారు. ఈ పదములు రెండును ఇంగ్లీషు భాషలో 'మూర్' (Moor), జెంటూ' (Gentoo)గా మారినవి. ఈ 'జెంటూ' శబ్దము ముసల్మానులు కాని క్రైస్తవేతరులకు సాధా

---

8. "In 1560 the Inquisition was introduced and an officer of that body was posted in each of the Portuguese towns with power to arrest any person who said or did anything opposed to the Catholic faith, and to send him to Goa, where he was tried by the Inquisitor General."

—Modern India and the West; Page—45

రణముగా మొట్టమొదట వాడబడుచువచ్చి,[9] కాలక్రమమున తెనుగువారికి పర్యాయ పదముగ పాశ్చాత్యులచే ప్రయోగింపబడుచువచ్చెను.[10] ఈ 'జెంటూ' అను శబ్దమునకు బదులుగా 'జెంటైల్' (Gentile) అని వాడుట కూడ కలదు. ఈపదము తెలుగు భాషకు, తెలుగువారికి ఎందులకు ప్రయోగింపబడెనో 'యూల్-బర్నెల్ గ్లోసరి' (Yule and Burnell) ఇట్లు చెప్పెను—"For the terms gentio and gentoo were applied in two senses :

*a.* To the Hindus generally.

*b.* To the Telugu-speaking Hindus of the Peninsula specially and to their language.

The reason why the term became thus specifically applied to the Telugu people is probably because, when the Portuguese arrived, the Telugu monarchy of Vijayanagara was dominant over great part of the Peninsula. The officials were chiefly of Telugu race, and thus the people of this race, as the most inportant section of Hindus, were par excellence the gentiles, and their language the gentile language.[11]" హిందువులను 'జెంటు' ప్రజలు అని పిలుచుటకు అలవాటుపడిన పోర్చుగీసువారికి విజయనగర సామ్రాజ్యముతో వాణిజ్య సంబంధమైన సంపర్కము కలుగగానే, తెలుగువారినట్లు పిలువ మొదలిడిరి. సామ్రాజ్యములో అధిక సంఖ్యాకులు తెలుగువారేగనుక ఆపేరు వారికి, వారి భాషకు (తెలుగు) రూఢమయ్యెను. ఇట్లు

---

9. "This ambergris is not so highly valued among the *Moors* but it is very highly prized among the *Gentiles*" — Garcia (1563)

"The peculiar patience of the *Gentoos* in Bengal, their affection to business, and the peculiar cheapness of all productions either of Commerce or of necessity had concurred to render the details of the revenue the most minute, voluminous, and complicated system of accounts which exist in the Universe."

—Orme (1778)

10. "Their Language they call generally *Gentu*...........the peculiar name of their speech is Telinga".

—Fryer (1673)

"I mean to amuse myself with learnig *Gentoo*, and have brought a Moonshee with me. *Gentoo* is the language of this part of the country ( Godavary Delta) and one of the prettiest of all the dialects."

—Letters from Madras (1837)

(ఈ ఉదాహరణములన్నియు 'A Glossary of Anglo-Indian Colloquial Words and Phrases' by Henry Yule and A. C. Burnellad Pt; London. 1886; నుండి గ్రహింపబడెను. పేజీల సంఖ్య 280-281)

11. A glossary of Anglo-Indian Colloquial Words and Phrases. —Page-280.

వచ్చిన ఈ పేరు (జెంటు) చిరకాలము వాడుకలోనుండెను. 1817 లో తెలుగు వ్యాకరణమును ప్రచురించిన విలియమ్ బ్రౌన్ (William Brown) తన వ్యాకరణమునకు 'A Grammar of the Gentoo Language' (జెంటూ భాషా వ్యాకరణము) అని పేరు పెట్టెను. ఇట్లు పేరు పెట్టుటయేగాక, దీనిలో ఔచిత్య భంగమేమియు లేదనికూడ వ్రాసెను.[12] తెలుగునకు వ్యాకరణము వ్రాసిన ఎ. డి. కాంబెల్ (A. D. Campbell) దొర తన వ్యాకరణగ్రంథ ముఖపత్రముపై 'A Grammar of the Teloogoo Languge *Commonly termed the Gentoo,* **peculiar to the Hindoos inhabiting the North-Eastern provinces of the Indian Peninsula'** అని వ్రాసెను. ఈ పేరునకు నాడుగల ప్రచారము నివి తెలుప గలవు. కాని తెలుగు భాషాభివృద్ధికై విశేష కృషి చేసిన సి. పి. బ్రౌను **(Charles Philip Brown)** దొర తన తెలుగు వ్యాకరణములో 'తెలుగు' శబ్దమునకు బదులుగా 'జెంటు' శబ్దమును వాడుటను ఖండించెను.[13] నాటినుండి ఈ పదమునకు ప్రయోగము తగ్గిపోయెను.

క్రమక్రమముగ వారు చేయుచున్న ఘోరకృత్యములవలన పోర్చుగీసు వారి పలుకుబడియు తగ్గిపోయెను. వారు చేసెడి బానిసల వ్యాపారము షాజహాన్ చక్రవర్తికి నచ్చక, 1632 లో వారి మూలస్థానమగు 'హుగ్లీ'ని నాశనము చేయించెను. దీనికి తోడుగ సముద్రముపై వారికిగల ప్రభుత్వమును డచ్చివారు లాగికొన జొచ్చిరి. 1648 నాటికి పోర్చుగీసువారికి భారతదేశములో గోవా, డయ్యూ, డామన్ ప్రాంతములు మిగిలెను. క్రమక్రమముగా వారి పలుకుబడి అడుగంటెను. ఇరువది సంవత్సరముల తరువాత 'బర్నియర్' **(Bernier)** వ్రాయుచు పోర్చుగీసువారి దుస్థితిని వర్ణించెను.[14]

---

12. "And this leads us to notice the pertinacity of some writers on the reverse of this practice, who fix upon the word Tenoogoo, or Telinga as a more appropriate term than Gentoo. The word Gentoo is condemned as beneath the notice of the learned; whilst, some will tell you with equal solemnity, "that the name is by many of the Natives corruptly pronounced Teloogoo"—William Brown. (A Grammar of the Gentoo Language; 1817. Preface; Page—XVII.)

13. "It is high time to abolish the absurd name Gentoo which was introduced by the Portuguese and is ignorantly used by some persons for the name Telugu"—C. P. Brown. (A Grammar of the Telugu Language. 1840, First Book; Page—13.)

14. "...Wretched, poor and despised..." Bernier. (Travels in the Mogul Empire 1891; Page—196.)

పోర్చుగీసువారి పతనమును గూర్చి ఆల్ఫాన్జో డి సౌజా (Alfonzo de Souza) ఇట్లు వ్రాసెను : "The Portuguese entered India with the sword in one hand and the crucifix in the other ; finding much gold, they laid aside the crucifix to fill their pockets, and not being able to hold them up with one hand — they were grown so heavy, they dropped the sword too ; being found in this posture by those who came after, they were easily overcome." ఈ విధముగా పోర్చుగీసు వారి ప్రభావము, వారితో మనకు గల సంబంధము కూడ సన్నగిల్లినది.

కాని అనేక విధములుగ పోర్చుగీసువారు తక్కిన పాశ్చాత్యదేశస్థులకు మార్గదర్శకులైరి. వీరు చూపిన మార్గము ననుసరించియే ఇంగ్లీషు వారు సామ్రాజ్యమును స్థాపింపగలిగిరి. ప్రాచ్య పాశ్చాత్య దేశముల నడుమ వీరు స్థాపించిన వాణిజ్య సంబంధములు ప్రాచ్యదేశముల చరిత్రనే మార్చివేసెను. ప్రాచ్యదేశములతో వాణిజ్యము చేయుటవలన కలుగు లాభములను తక్కిన దేశస్థులకు చూపి, వారిని గూడ ఈ మార్గమును త్రొక్కునట్లు చేసినవారు పోర్చుగీసువారే. కాని వీరి ప్రభావము దేశీయులపై అంతగా లేదు. అందునను భారతదేశము యొక్క తూర్పుభాగమున అసలే లేదనవచ్చును. ఇందులకు కారణము పోర్చుగీసువారు కోస్తాప్రాంతములలోనే - ముఖ్యముగా పశ్చిమ తీరముననే— గాని భారతదేశము యొక్క లోపలి భూభాగముపై ప్రభుత్వమును నెలకొల్పలేకపోవుటయే వీరిని లోపలి ప్రజలు వర్తకులనుగా, రోమను కేథలిక్కు మత ప్రచారకులనుగా, మాత్రమే ఎరుంగుదురు కాని ప్రభువులుగ ఎరుంగరు.

పోర్చుగీసువారు చేసిన ఇంకొక మహోపకారము, తమ తరువాత వచ్చిన పాశ్చాత్యులకు, ఒక మిశ్రభాష నిచ్చుట దీనిని ఇండో-పోర్చుగీసు భాష (Indo-Portuguese) అని వ్యవహరింపవచ్చును. పోర్చుగీసువారి ప్రాబల్యమున్న భారత భూభాగముపై ఈ భాష వ్యవహారమున నుండుటచే, వీరి తరువాత వచ్చిన విదేశీయులందరు ఈ భాషను నేర్చుకొని ప్రజలతో సంభాషించెడివారు. కెప్టెన్ హేమిల్టన్ (Captain Alexander Hamilton) ఈ విషయము నిట్లు చెప్పెను,

"Along the sea-coasts the Portuguese have left a vestige of their language, tho' much corrupted, yet it is the language that most Europeans learn first to qualify them for a general converse with one another, as well as with the different inhabitants of India."[15]

15. A New Account of the East Indies— Captain Alexander Hamilton- —Edinburgh 1727 ; Preface-Page-XII.

తీరస్థప్రాంతములోనివా రందరును పాశ్చాత్యులయినను, భారతీయులయినను- ఈ మిశ్రభాషనే పరస్పర సంభాషణలో ఉపయోగించెడివారు. క్రొత్తగా భారతదేశమునకువచ్చిన క్రైస్తవమత ప్రచారకులు, ఉద్యోగులు, శ్రమపడి ఈభాషనే నేర్చుకొనెడివారు. మతప్రచారమునకు ఈ భాషనే వినియోగించెడివా రనుటకు ఈ క్రింది వాక్యములు తార్కాణము.

"The early Lutheran Missionaries in the South, who went out for the S. P. C. K., all seem to have begun by learning Portuguese, and in their diaries speak of preaching occasionally in Portuguese."[16]

పదునెనిమిదవ శతాబ్ది ప్రారంభమునాటికే ఈ మిశ్రభాష బహుళ ప్రచారములోనున్నట్లు ఈ క్రింది వాక్యములు తెలుపును.

"This they (the Portuguese) may justly boast, they have established a kind of Lingua Franca in all the sea ports in India, of great use to other Europeans, who would find it difficult in many places to be well understood without it."[17]

పోర్చుగీసు భాషలోని పదములెన్నియో మిగిలిన దేశభాషలలోనికి వచ్చిచేరినవి భారతీయ భాషలలోనికి ఆ భాషాపదములు వచ్చిచేరుటయేగాక, ఆంగ్లాది పాశ్చాత్య భాషలలోనికిని చాలమాటలు పోయిచేరెను.[18] అట్లు చేరిన మాటలు, మొట్టమొదట భారతదేశమునందున్న పాశ్చాత్యులచే మాత్రము వాడబడినను, కాలక్రమమున ఆయా దేశములలో కూడ ప్రచారమునకు వచ్చెను.

తెలుగులోకూడ కొన్ని పోర్చుగీసు పదములు నేటికిని కన్పట్టుచున్నవి.

తెలుగులో చేరి వాడుకలో నున్నవిగా సి. పి. బ్రౌను. తన మిశ్రభాషా నిఘంటువు (1854) లో పేర్కొనిన పోర్చుగీసు మాటలను చూపుచున్నాను.

16. Hobson-Jobson : By H. Yule and A. C. Burnell; 1886; Introductory Remarks; Page-XVII.

17. An Account of the Trade in India; London-1711 ; Page-286.

18. "Of words which are essentially Portuguese, among Anglo - Indian Colloquialisms, persistent or obsolete, we may quote 'goglet, gram, plantain, muster, caste, peon, padre, mistry or maistry; almyra, aya, cobra, mos-quito, pomfret, cameez, palmyra'. still in general use; and among more or less obsolete terms, 'Moor', for a Mohammedan, still surviving under the modified form Moorman, in Madras and Ceylon; 'gentoo', still partially kept up, I believe, at Madras in application to the Telugu language......"

(Hobson - Jobson ; Page - XVII)

అల్మారి — "Portuguese 'Almārio'; An almira. A Press, Chest of drawers, book case. ఈడ్పులు గల పెద్ద పెట్టె, అల్మారకోనేరు, a well with steps down into it." (Page - 7)

గమేళా — "Portuguese, Camera? The tops of masts (in which the men stand) వాడ స్తంభములో మనిషి నిలిచేటట్టుగా కట్టియుండే అంతస్తు." (Page - 18)

చావి — "A key: (from the Portuguese Chave: Haughton's Beng. Dict. page 1075)" (Page - 39)

బాతు — "A duck: (borrowed from the Portuguese word bato?) ఒక జలపక్షి." (Page - 72)

( బాతు అనుమాటకు శ్రీకృష్ణరాయలు రచించిన ఆముక్తమాల్యదలో ఈ క్రింది పద్యమున ప్రయోగము కలదు.

"తలఁ బక్షచ్ఛట గ్రుచ్చి బాతువులు కేదారంపుఁ గుల్యాంతర
స్థలి నిద్రింపఁగఁ జూచి యారెకు లుషస్స్నాతప్రయాత ద్విజా
వలి పిండీకృత శాటికల్సువిఁ దదావాసంబుఁ జేర్పంగ రే
వుల డిగ్గన్వెసఁ బాఱువానిఁ గని నవ్వున్బాలి గోప్యోఘముల్."
(ఆశ్వాసము 1; పద్యము - 65)

శబ్దరత్నాకరము' లో బాతువు అనునది బాతు రూపాంతరమనియు, దేశ్య మనియు కలదు. అర్థము మాత్రము గ్రామ్యములోవలెనే 'జలపక్షి' విశేషమని కలదు. పై పద్యమే ప్రయోగమున కుదాహరణముగ నీయబడెను. )

మరియాఁను ఆట — "Maria's game." Playing at cards. A word perhaps of Portuguese origin." (Page - 88)

మేస్తరి or మేస్త్రి — "Maistre (French or Portuguese) A head workman. పనివాండ్ల పెద్ద" (Page - 98)

పోర్చుగీసుభాషలోనుండి తెలుగులోనికి వచ్చి, విపులార్థమును గడించిన ఇంకొక మాట 'ఫాదరి లేక పాదరి' అనునది. ఈ మాటను గూర్చి 'యూల్ - బర్నెల్ గ్లోసరి' (H. Yule and A. C. Burnell) ఇట్లు చెప్పెను: "The word padre ) has been taken up from the Portuguese, and was ofcour

applied originally to Catholic priests only......It is a curious example of the vitality of words that this one which had thus already in the 16 th century in India a kind of abnormally wide application, has now in that country a still wider, embracing all Christian ministers."

(Page - 496.)

పోర్చుగీసువారితో భారత దేశము యొక్క పశ్చిమ తీరముననున్న వారికి కలిగినంత సంపర్కము, తూర్పు కోస్తానున్న వారికి కలుగకుండుటచే, వారి ప్రభావ మంతగా మనపైగాని, మన భాషపైగాని, కానరాదు. కాని మొట్ట మొదట తెలుగును చదివి వ్యాకరణములు వ్రాసిన దొరలకు, భారత దేశములో మిశ్రభాషగానున్న పోర్చుగీసును గూర్చి తెలియును గనుక, వారు మిశ్ర భాషలను గూర్చి వ్రాయునపుడు, ఈ పోర్చుగీసు భాషతో ఆయా భాషలనుపోల్చి మాటలాడుట కలదు. మదరాసులోను, ఇంకను దక్షిణమునను మాటాడబడు తెలుగునుగూర్చి వ్రాయుచు, అది విశేషముగా తమిళశబ్దమిశ్రితము గనుక స్వచ్ఛమైనది కాదనియు, భారత దేశములోని పోర్చుగీసు భాషవంటిదనియు 'విలియమ్ బ్రౌన్' (William Brown) వ్రాసెను.[19] ఇట్లు జనబాహుళ్యములో దీనికి ప్రచారముండుటచేతను, దీనిలోని మాటలు కొన్ని అయినను భారత భాషలలో చేరియుండుటచేతను,[20] పోర్చుగీసువారితరువాత మన దేశమునకు వచ్చిన పాశ్చాత్యులకిది చాలకాలము వ్యవహారభాషగా నుండెను. డచ్చి

19. "Nor should we be surprised at the degeneracy conspicuous, perhaps as much in the individuals as in the language of the Gentoo people who occupy the South, if we consider the degenerate state of the Portuguese people and language at the present day all over India."

(A Grammar of the Gentoo Language by William Brown - 1817; Preface Page—VIII.)

20. "The only abiding marks of the relatively brief and superficial intercourse of the Portuguese with the Tamils are to be found in the few words they contributed to the Tamil tongue, such as the names of things which they brought into the country for the first time" (Modern India and the West); Oxford 1941. అను పుస్తకములో తమిళముపై ఎస్. ఎస్. భారతి, ఎమ్.ఏ.,బి.ఎల్. వ్రాసినవ్యాసమునుండి.) అందే, పుట-506, పుట్‌నోట్ లో ఈ క్రిందిమాట లీయబడెను.

"For instance, annasi (pine - apple), koyya (guava), pappali (pa paw), pambuli (pomelo), vathu (duck), peengan (china - ware), koppai (cup); puttam (button), mejai (table), punal (funnel), chavi (key), pena (pen), kaduthasi (paper) Vivilliam (Bible), padre (pastor), thuppakki (gun), sepoy (soldier), kuESsbe (com pass), nanguram (anchor) etc."

ఈ మాటలలో కొన్ని తెలుగుభాషలో కూడ కలవుగదా !

వారును, ఇంగ్లీషువారును పదునేడవ శతాబ్దిలో పోర్చుగీసు దుబాసీలను నియమించుకొనవలసి యుండెడిదట![21]

పోర్చుగీసువారిని గూర్చిన ప్రస్తావన, తంజావూరు నాయకరాజైన రఘునాధనాయకుని దిగ్విజయముల నభివర్ణించు సంస్కృత గ్రంథములలో చాల కలదు. రఘునాధనాయకుడు తన రాజ్యకాలమందేగాక, తన తండ్రి రాజ్యకాలమునను పోర్చుగీసువారితో యుద్ధములు చేయవలసిన వాడాయెను. పోర్చుగీసువారు పదునారవ శతాబ్దిలో బాగుగ విజృంభించి, నాయకరాజుల మంచితనమును, భారతీయుల సహనమును దుర్వినియోగము చేసి, నాయక రాజుల శత్రువులతో చేరి కుట్రలను పన్నుచుండిరి. వీరిని, వీరి ప్రాభవమును రఘునాథనాయకుడు నాలుగైదు యుద్ధములలో నాశనము చేసెను. ఉత్తర భారతమునకూడ, షాజహాన్ చక్రవర్తి ఆజ్ఞవలన 'హుగ్లీ' నాశన (1632) మగుటతోడనే, పోర్చుగీసువారి ప్రాభవము క్రమక్రమముగా అడుగంటెను.

పోర్చుగీసువారి ప్రస్తావన-రామభద్రాంబ రచించిన 'రఘునాథాభ్యుదయ కావ్యము'నను; రఘునాథుని సమకాలికుడును, శిష్యుడునగు యజ్ఞనారాయణ దీక్షితుని 'సాహిత్య రత్నాకరము'నను - కలదు. ఈ గ్రంథములలో పోర్చుగీసు వారిని వర్ణించినవారు, స్వయముగ వారి ఔద్ధత్యమును చూచినవారగుటచే, చక్కగా వ్రాసిరి.

రఘునాథాభ్యుదయ కావ్యమున పోర్చుగీసువారు, "నిశ్శంకం సలిల నిధౌచరంతి నిత్యం" అని వర్ణింపబడిరి. పోర్చుగీసువారు, రఘునాథనాయకుని మిత్రుడయిన 'జాఫ్నా' (సేపాశము) రాజును రాజ్యచ్యుతుని చేయగా నాతడు వచ్చి రఘునాథునితో నిట్లు పలికినట్లు కలదు.

"మహీపతే మమ కులజైర్మహో భుజైః
పరాజితా స్సమితి ఫరంగి వంశజాః
తదాది తే మనసి దృఢం విరోధితాః
ప్రవర్ధయం త్యవమతిపంకరూషితాః"

(రఘునాథాభ్యుదయము. సర్గ - 8; శ్లో - 18.)

21. "The Portuguese language contributed many words to the vocabularies of Indian languages, and a bastard form of it was for a long time a Lingua Franca in the sea-ports and European settlements along the coast. Both the Dutch and the English in the Seventeenth Century had to employ Portuguese interpreters." ('The Impact of European civilisation' by L. S. S. O' Malley n the book 'Modern India and the West' Oxford. 1941 ; Page - 47.)

విజయనగర (హంపి) చక్రవర్తియైన రామదేవరాయలను సింహాసన మెక్కించుటకై రఘునాథుడు బద్ధకంకణుడగుటచే నాతనికి, జగ్గరాజుతో పోరు వచ్చెను. ఈ జగ్గరాజు తన కుహనాదౌహిత్రుని చక్రవర్తిగ చేయనెంచు చుండెను. జగ్గరాజు సేనలో పోర్చుగీసువారు కూడ నుండిరి. వారిని, సాహిత్య రత్నాకరములో యజ్ఞనారాయణదీక్షితు లిట్లు కన్నులకు కట్టునట్లు వర్ణించెను.

"సద్యోమృష్ట స్వచ్ఛ తామ్రోపమానైః
దీర్ఘశ్మశ్రుశ్రేణి దీప్తైర్మహద్భిః
శూన్యాళీకైః అక్షతశ్రోత్ర యుగ్మైః
వక్త్రైః క్రూరాన్ వక్రిత భ్రూకుటీకైః"
"ఉద్భ్రాంతాక్షాన్ లోహితోష్ణీషబంధాన్
తామ్రచ్ఛాయైః సావతంసా న్గరుద్భిః
వజ్రప్రాయైః వర్మితాన్ వారవాణైః
నిస్తాంబూలాన్ నిత్య మద్యావలిప్తాన్"
"కట్యాలంబిప్రౌఢ కౌశేయసక్తం
తూణీభారం బిభ్రతో దుర్విదగ్ధాన్
సవ్యేనోచ్చైః పాణినా శార్ఙ్గచాపం
ద్విత్రా నన్యేనాపి తీక్ష్ణాన్ పృషత్కాన్."

ఇంత చక్కగా 'పురతకేశు' (బుడతకీచు) లెచ్చటను వర్ణింపబడలేదు. రఘునాథాభ్యుదయ కావ్యమందు రఘునాథునిచే ఓడింపబడి, పారిపోవుచున్న పోర్చుగీసువా రిట్లు వర్ణింపబడిరి.

"ఉదస్త నానాయుధ ముత్పతాక
మభిద్రవంతీ మవనీశ సేనామ్
ఆలోకితుం స్థాతు మశక్నువంతః
భయాత్పలాయంత ఫరంగి వంశ్యాః"
"ధనాని దారై స్సమ మార్జితాని
శస్త్రాణి శౌర్యేణ సమం ధృతాని
విహాయ సర్వే భయవిహ్వలాస్తే
నిధౌ జలానాం న్యపతత్సవేగమ్"

రఘునాథాభ్యుదయము సర్గ - 9 ; శ్లో - 21, 22)

వీరిని గూర్చి కవు లింతగా వర్ణించినకాలమందును, వీరి ప్రభావము తెలుగు భాషా సాహిత్యములపై విశేషముగలేదు. ఇందులకు ముఖ్యకారణము వీరి పరిపాలనాదికము యొక్క ప్రాబల్యము ఆంధ్రదేశమున లేకుండుటయే యని గ్రహింపవలెను. సాధారణముగా విదేశీయులు అను నర్థమున చాల కాలము వాడుకలో నున్న 'ఫరంగి' అనుమాట మొట్టమొదట పోర్చుగీసువారికి ప్రయోగింపబడి, కాలక్రమమున మిగిలిన పాశ్చాత్యుల కందరికిని సామూహికార్థమున ప్రయోగింపబడినది. విజయరాఘవ నాయకుడు వ్రాసిన 'రఘునాథ నాయకాభ్యుదయము' అను ద్విపద కావ్యములో 'ఫరంగి' అను శబ్దము వాడబడినది.

"వనితను దోకొని వచ్చి యిర్వురును
జెనుతురంగి *ఫరంగి* పీటల మీద
సమముగాఁ గూర్చున్న సమయంబునందు"

(ఆశ్వాసము - 3 ; పాదములు - 711, 712, 713)

బ్రౌణ్యా మిశ్రభాషా నిఘంటువున 'ఫరంగి' యను శబ్దమునకు అర్థవివరణ మిట్లు చేయబడినది.

"ఫరంగి N. S. Frangi : plu ; ఫరంగులు or ఫరంగీలు.

Europeans, జాతివాండ్లు. (Madras, 1854 ; Page - 66.)

పోర్చుగీసువారి వలన మనకు సంక్రమించినది, మన నాగరకతపై విశేష ప్రభావము చూపినది 'పొగాకు.' ఇది వారిచే భారతదేశములో ప్రవేశబెట్టబడి అచిరకాలములోనే ప్రజలకు ముఖ్యవస్తువయినది. దీని వాడుక ఆసేతుశీతనగము వ్యాపించినది. అగ్బరు పాదుషా కాలములో నిది మొగలుదర్బారులో ప్రవేశించినది. అమీరు, ఫకీరు అను భేదములేకుండ దీనిని ఉపయోగింపజొచ్చిరి. అగ్బరు దర్బారులో దీని వాడుక ఎట్లు వచ్చినదో తెలియజేయు ఈ క్రింది వాక్యములు పరిశీలింపదగినవి. అగ్బరు పాదుషా అంతరంగికులలో నొకడు 'అసద్ బేగ్' బీజపూరునుండి పొగాకును తెచ్చి చక్రవర్తికి చూపెనట !

"In Bijapur I had found some tobacco. Never having seen the like in India, I brought some with me, and prepared a handsome pipe of jewel work.........His Majesty (Akbar).........expressed great surprise and examined the tobacco which was made up in pipefuls ; he inquired what it was and where I had got it.........His Majesty looked at it, and ordered me to prepare and take him a pipeful. He began to smoke it.........After that the merchants began to sell it,

so the custom of smoking spread rapidly. His Majesty, however, did not adopt it"[22] తుదకు దీనికి బాధ పడలేక షాజహాన్ దీనిని నిషేధించుచు ఉత్తరువులిచ్చెనట !

ఈ అలవాటు ఆంధ్రదేశమున క్రమక్రమముగ వ్యాపించి, ఇది లేనికాల మనునది ఎప్పుడైనను దేశమున కలదా? అను శంక ప్రజలకు కలుగునంతటి సామాన్య వస్తువయినది.

పదునెనిమిదవ శతాబ్దికి చెందిన అయ్యలరాజు నారాయణామాత్యుడు తన 'హంసవింశతి'లో పొగాకును పేర్కొనెను. దీనినిబట్టి నాటికే పొగాకు ఆంధ్రదేశములో గ్రామ గ్రామములందును వ్యాపించినట్లు తెలియుచున్నది. ఆనాటి గ్రామకరణము యొక్క వేషము, 'పొగాకుచుట్ట'తో నిట్లు పూర్తినొంది యున్నది.

"తెలి తలపాగ, చొక్క, మొలతిత్తి, భుజంబున జల్వపచ్చడం,
బల చిటిబ్రేల ముద్రిక, యొయారముమీర పొగాకుచుట్ట, సొం
పలరెడు కావిదోవతి, పదాబ్జయుగంబుగ ముచ్చెలొప్పగా
నలనిభు డంత గ్రామకరణం బటకై చనుదెంచె నంతటన్."

(హంసవింశతి, ఆశ్వా 3-; పద్య - 92.)

పొగాకునకు రోగములను పోగొట్టు గుణము కలదనికూడ ప్రజలు నమ్మజొచ్చిరి. దీని శక్తి నుద్ఘాటించుచు చెప్పిన చాటువు లెన్నియో గలవు. మచ్చున కొక్క పద్యపాదము.

"దంతలూటి ఘోర దంతి హర్యక్షుంబు
కుష్ఠరోగాచల కులిశధార"

(చాటుపద్యమణిమంజరి - పుట - 190.)

శ్రీకృష్ణదేవరాయల పరిపాలనాకాలమందు పోర్చుగీసువారు విజయనగర సామ్రాజ్యమునకు, రాజదూతలనంపి తమ వాణిజ్యాదులను సంరక్షించుకొను చుండిరి. పోర్చుగీసు చరిత్రకారుడైన న్యూనిజ్ (Nuniz) తత్కాల సాంఘిక రాజకీయాది పరిస్థితులనుగూర్చి వ్రాసి, నాటి భారతీయ సంఘముతో పోర్చుగీసువారికిగల పరిచయమును వ్యక్తముచేసెను. పోర్చుగీసువారి చేతులలో గుఱ్ఱపు వ్యాపార ముండుటచే, బహ్మనీ సుల్తానుల దర్బారులలోను, విజయ

22. Asad Beg (1604), in Elliot's, "The History of India as told by its own Historians." (Edited from the Posthumous papers of Sir H. M. Elliot K. C. B; by Prof. John Dowson; 1867-1877).

నగర రాజాస్థానమునను, పోర్చుగీసువారికి ప్రవేశము, పలుకుబడి కలిగెను. అల్బూకర్క్ (Albuquerque) గవర్నరుగా ఉన్నకాలమున ఫాదర్ లూయిస్ (Fr. Luis) శ్రీకృష్ణరాయల ఆస్థానమున కొంతకాలము పోర్చుగీసు రాజదూతగా నుండెను. రాజ్యతంత్ర నిష్ణాతుడైన శ్రీకృష్ణరాయలు వారితో స్నేహముగా నున్నట్లున్నను వారిని అదుపులోనే ఉంచెను. కనుక వారు విజయనగర సామ్రాజ్యముయొక్క పశ్చిమభాగముననే కొంత విజృంభింప గలిగిరి కాని, మిగిలిన ప్రాంతములలో అణగిమణగి యుండిరి. పశ్చిమసముద్రతీరము రాజధానికి దూరముననుండుటచేతను, ఆ ప్రాంతమును పరిపాలించుచున్న విజయనగర సామంతరాజులు కొంత బలహీను లగుటచేతను పోర్చుగీసువారి ప్రాభవము పశ్చిమతీరమున బాగుగ వ్యాపించెను. కనుక ఆ ప్రాంతములోని భాషలలో చేరినన్ని పోర్చుగీసు పదములు తెలుగులోనికి రాలేదు.

కాని, యూరపులోని పరిస్థితులు విషమము కాగానే, పోర్చుగీసువారి ప్రభావము తగ్గుట మొదలుపెట్టెను. క్రమక్రమముగ వాణిజ్యరంగములోనికి మిగిలిన పాశ్చాత్యదేశములును రాజొచ్చెను. వీని నన్నింటిని మించిన గొడ్డలి పెట్టు, ఫిలిప్పురాజు కాలమున స్పెయిను దేశముతో పోర్చుగల్ దేశము కలిపి వేయబడుట (1580). నాటి నుండియు పోర్చుగీసువారి ప్రభావము నానాటికి సన్నగిల్లినది. వారి ప్రభావము మిక్కిలి ఉచ్చస్థితిలో నున్నప్పుడును, అది వారి వలసలకే పరిమితమై యుండెను. వారి మతప్రచారకులు దేశాటనము చేయు చుండెడివారు గనుక, వారి ప్రభావము మాత్రము స్వల్పముగ తెలుగుదేశము మీద పడెను. ఈ క్రింది వాక్యములు పై విషయములను చక్కగా క్రోడీకరించి చెప్పును.

"Except, however, for missions the range of Portuguese influence was limited by the extent of their territorial possessions"[23].

ఈ పరిశీలనమువలన పోర్చుగీసువారి ప్రభావ మాంధ్రదేశముపై చెప్ప దగినంత లేదని తెలియుచున్నది. వారితోగాని, వారి భాషాసంస్కృతులతో గాని వక్కాణింప దగినంత సన్నిహితత్వము తెలుగువారి కెప్పుడును కలుగ లేదు. మతవిషయమై వారి ప్రభావమేమైన ఆంధ్రదేశమున కలదేమో క్రైస్తవ మతమును గూర్చి వ్రాసిన ఘట్టమున చూపబడును. వీరి భాషాసంస్కృతులతో

23. 'The Impact of European Civilization' by L. S. S. O'Malley in 'Modern India and the West', Oxford University Press - 1941. Page-47.

తెలుగువారి కంతగా ప్రసక్తి లేకుండుటకు కారణము—పోర్చుగీసువారికి ఆంధ్రతీరమున పేర్కొనదగిన వాణిజ్య కేంద్రములు లేకుండుటయే!

## డచ్చివారు

పోర్చుగీసువారి ప్రభావ మింకను పూర్తిగా తగ్గకమునుపే డచ్చివారు ప్రాగ్దేశములతో వాణిజ్యము చేయుచుండిరి. వారు పోర్చుగీసువారి రేవులనే తమ వ్యాపారమునకును ఉపయోగించుకొనుచుండిరి. కాని స్పెయిను దేశము పోర్చుగల్ దేశము నాక్రమించినంతనే పరిస్థితులు మారెను. డచ్చివారికి పూర్వపు సదుపాయములు పోయెను. ఈ స్థితిలో డచ్చివర్తకులు గుంపులుగ ఏర్పడి, దూరప్రాచ్యమునకు పోయి, సాహసముగ వాణిజ్యము చేయజొచ్చిరి 1596 మొదలు జావా, సుమత్ర మొదలగు ప్రాంతములలో వారి వ్యాపార. మభివృద్ధి పొందుట మొదలిడెను. వర్తకులయొక్క యభివృద్ధికి సంతోషించి హాలండుప్రభుత్వము వారికి సాయపడజొచ్చెను. ప్రభుత్వముయొక్క సాయము లభించుటతోడనే వర్తకులు ద్విగుణీకృతోత్సాహముతో, అంతకుపూర్వము ప్రాగ్దేశములతో వర్తకము చేయుచున్న కంపెనీల నన్నిటిని కలిపి, ఒక "డచ్చి తూర్పిండియా కంపెనీ"గా ఏర్పాటు చేసిరి. ఈకంపెనీ మార్చి 20 వ తేదీ 1602 వ సంవత్సరములో స్థాపితమయ్యెను. ఇది స్థాపింపబడిన వెంటనే హాలండు ప్రభుత్వము, ప్రాగ్దేశములతో వర్తకము చేయుటకు దీని కొక్క దానికే హక్కునిచ్చుచు, పట్టా (charter) యిచ్చెను. ఈ కంపెనీ కొలది కాలములోనే విశేషాభివృద్ధిని పొందెను. ఈ అభివృద్ధి వచ్చిన వెంటనే 'కంపెనీ' ప్రత్యేక ప్రభుత్వమువలె మెలగజొచ్చెను. ఈ మార్పు ఆ రోజులలోని అన్ని కంపెనీలలోను వచ్చినదే. కంపెనీలవారు, తమతమ స్వదేశ ప్రభుత్వములనుకూడ లెక్కచేయకుండ ప్రవర్తింప గలిగినంత ఆర్థికశక్తి కలిగి యుండిరి. ఈశక్తిని వారు దుర్వినియోగము చేయుచునే వచ్చిరి.[24]

24. "It was a new state erected within the state itself, which enriched it and increased its strength abroad, but might, in time, weaken the influence of the democratical principle, which inspires the love of equality and economy of the laws, and of one's own countrymen."

—Abbe Raynal.

(Philosophical and Political History of the Settlements and Trade of Europeans in the East and West Indies - Translated by J. Justamond from French; Second Edition 1767. Vol. I; Page - 174.)

డచ్చివారి సాహసోత్సాహములు వారిని, ముఖ్యముగా 'సుగంధ ద్రవ్యములుగల దీవుల' (Spice Islands) తో వ్యాపారమునకు పురికొల్పినవి. కాని వారికి భారతదేశమునను వ్యాపార కేంద్రములు లేకపోలేదు. భారత దేశమున ఎన్ని వ్యాపార కేంద్రములున్నను తూర్పున వారి స్థావరములకు రాజధాని జావా ద్వీపములోని 'బటేవియా'. ఇంగ్లీషువారును జావా మొద లైన దీవులతో వర్తకము చేసెడివారు. కాని, వారి ముఖ్య స్థానములన్నియు భారతదేశమున గలవు. ఈ రెండు జాతులకు వ్యాపార కేంద్రముల విషయ మునగల ముఖ్యభేద మిది.

1658 లో డచ్చివారు పోర్చుగీసువారినుండి 'నాగపట్టణము'ను సంపా దించిరి. కోరమండలముయొక్క కోస్తాయందుగల ముఖ్యమైన 'డచ్చివారి పట్టణ'మిది. మిగిలిన ప్రాంతములనుండి కొనితెచ్చిన సామగ్రినంతటిని ఈ పట్టణమునందు నిలువయుంచి ఇచ్చటనుండి ఎగుమతి చేయుచుండెడివారు.

17 వ శతాబ్దిలో డచ్చివారు ప్రబలులైరి. వాణిజ్యమునను, నౌకా బలమునను వారు తక్కిన పాశ్చాత్యుల మించియుండిరి. ఇందువలన 1641 లో మలాకా (Malacca), 1656 లో, కొలంబో (Colombo), 1663 లో, కొచ్చిన్ (Cochin), వారి వశమైనవి. మొగలు సార్వభౌములుకూడ వారికి సాయము చేయుచుండిరి. వారినిగూర్చి ఫ్రెంచియాత్రికుడగు 'బెర్నియర్' (Bernier) 1 వ తేదీ జూలై 1673 నాడు ఈ క్రిందివిధముగ వ్రాసెను.

"The Dutch have a malt factory in Agra, in which they generally keep four or five persons."[25]

భారత భూభాగము మీద డచ్చివారు మొదట విడిసినది 'ప్రళయకావేరి' (Pulicat) అను ప్రాంతము. ఇది మద్రాసునకు ఉత్తరముగా 25 మైళ్ల దూర మున కలదు. 1609 లో డచ్చివారిచ్చట ఒక గిడ్డంగి (Factory) కట్టిరి. దానిని ఒక కోటవలె బలపర్చిరి. దానికి 'గెల్డ్రియా' (Geldria) అని పేరు పెట్టిరి. 1619 లో ఇచ్చటినుండి జరుగు 'మిరియముల వ్యాపారము' నందు ఇంగ్లీషువారు పాలు సంపాదించిరి. యూరపులో వివిధ దేశముల నడుమ జరుగుచుండెడి యుద్ధములను బట్టి, భారతదేశములోని కంపెనీల పొత్తు నిర్ధా రణమగుచుండెను. ప్రళయకావేరిని 1781 లో ఇంగ్లీషువారు పట్టుకొని మరల 1785 లో ఇచ్చివేసిరి. కాని పదిసంవత్సరములైనను పూర్తికాక

25. Travels in the Moghul Empire - Bernier; 1891, English Edition.

పూర్వమే 1795 లో డచ్చివారు మరల దానిని కోల్పోయిరి. 1818 లో ప్రళయకావేరిని, తూర్పిండియా సంఘము (ఇంగ్లీషు) వారు తిరిగి హోలండునకు అప్పజెప్పిరి. కాని, మార్చి 1824 లో జరిగిన సంధివలన, 1825 లో ఇది శాశ్వతముగ ఇంగ్లీషువారికి వచ్చెను.

మద్రాసునకు ఉత్తరముగ ప్రళయకావేరి యొద్ద వ్యాపార కేంద్రమును నిర్మించినట్లే, డచ్చివారు మద్రాసునకు దక్షిణముగ 'చతురంగపట్టణము' (Sadras) న ఇంకొక వ్యాపారకేంద్రమును 1647 లో నిర్మించిరి. ఇది సన్నని బట్టకు ప్రసిద్ధికెక్కినది. డచ్చివారు సముద్రమునకు సమీపముగ ఇటుకలతో నొక కోటకట్టిరి. దీనిని 1795 లో ఇంగ్లీషువారు పట్టుకొనిరి. కాని 1818 లో హోలండు ప్రభుత్వమునకు దీనిని ఇంగ్లీషువారిచ్చివేసిరి. 1825 లో మిగిలిన అన్ని డచ్చిప్రాంతముల వలెనే ఇదికూడ ఇంగ్లీషువారికి వచ్చివేసెను.

గోదావరి జిల్లాలో డచ్చివారి వ్యాపార కేంద్రములు— పాలకొల్లు, జగన్నాయకపురము అనునవి. పాలకొల్లు నరసాపురమున కుత్తరముగ నైదు మైళ్ల దూరములో కలదు. ఇచ్చటి భూమి చాల సారవంతమైనదగుటచే డచ్చివారు బత్తాయి, నారింజ మొదలగు ఫలవృక్షములను పెంచిరి. జావాలోని 'బటేవియా' నుండి తెచ్చినది గనుకనే పండునకు 'బత్తాయి' అను పేరు వచ్చినది. 1650 సంవత్సరమునకుముందుగనే డచ్చివారిచ్చట తమ స్థావరము నేర్పరుచ్చుకొనిరని చెప్పుటకు తగిన ఆధారములు గలవు. పాలకొల్లులో డచ్చివారల గోరీలు కొన్ని కలవు. చల్లని ఫలవృక్షముల నీడలందవి కలవు. వానిలో మిక్కిలి ప్రాచీనములైన రెండు గోరీలు కలవు. అవి 1662, 1665 నాటివి. వానిపైనున్న వ్రాతలవలన, వాని కాలము తెలియుచున్నది. వానియొక్క 'డచ్చి' మూలమును 'ఇంగ్లీషు' అనువాదమును క్రింద నీయబడుచున్నది.[26]

| | |
|---|---|
| Hier Liÿe Be | Here Lies In- |
| Graven Dzoon Van | Terred The Son of |
| Den Adst Lambert | The Assistant Lambert |
| Hemsinck Gen- | Hemsinck Gen- |
| Gerralri, Geboren | Gerralri, Born |
| In Palicol Adij 17den | In Palicol 17th |
| October A° 1660 En | October A° 1660 |
| Overleden Den | Deceased |
| 9den November A° 1662. | 9th November A° 1662. |

26. 'A Descriptive And Historical Account of the Godavery District in The Presidency of Madras' By Henry Morris; London, 1878. Page - 197.

| | |
|---|---|
| Hier Leÿt Begraven Sÿmon | Here Lies Interred Symon |
| Van Groenewegen Van Delft | Van Groenewegen of Delft |
| In Sÿn Leven Coopman En | During His Life Merchant And |
| Opperhooft Ten Comptore | Chief of The Factory, |
| Palicol Obijt Adij 3en Ivnij | Palicol, Died 3d June |
| A° 1665. | A° 1665. |

నర్సాపురములో డచ్చివారికి ఒక 'ఇనుపగిడ్డంగి' (Iron Foctory) కలదు. మాధవాయిపాలెములో గల 'ఇంగ్లీషు గిడ్డంగి' సమీపమున వారికొక ఇల్లుకూడ ఉండెనట. 1679 లో ఫోర్టుసెయింటు జార్జి (Fort st. George) ఏజెంటు నర్సాపురము వచ్చినప్పుడు, పాలకొల్లులో ఉన్న డచ్చి గిడ్డంగియొక్క ఉన్నతాధికారి ఏప్రిల్ 10 వ తేదీని ఇంగ్లీషు ఏజెంటును చూచుటకు వచ్చెనట. ఏప్రిల్ 14 వ తేదీని ఇంగ్లీషు ఏజెంటు, డచ్చి గిడ్డంగిని చూచుటకు పాలకొల్లుపోయెనట. పోయి, అచ్చట డచ్చివారి గిడ్డంగినిగూర్చి ఇటుల వ్రాసెను.

"The Dutch have there a Factory of a large compounde where they do dye much blew cloth, having above three hundred jars set in the ground for that work; also they make many their best paintings there, the town being first rented by them at 2000 old Pagodas, and is now given them free by the king"[27].

ఇప్పుడు కాకినాడలోని భాగమేయైన 'జగన్నాథపురము' మొట్టమొదట డచ్చివారిది. ఇందున్న గిడ్డంగి, చుట్టుప్రక్కలగల మరి రెండు గ్రామములు డచ్చివారివే. బట్టలను 'కుంఫీ' (Bleach) చేయుటకును, రంగులు వేయుటకును ఈ ప్రాంతమున వారు సదుపాయములను కల్పించుకొనిరి.

డచ్చివారికి మచిలీపట్టణములో నొక గిడ్డంగి యుండెను ఇందు, పాలకొల్లులో తయారయిన గుడ్డకు రంగులువేసి, చీటీ (Chintz) గా తయారుచేసెడివారు. ఈ విధముగా తయారయిన చీటీగుడ్డ విదేశములకు ఎగుమతిచేయబడెడిది.

నాడు మచిలీపట్టణము, తూర్పుతీరమునగల రేవుపట్టణములన్నింటికంటె ప్రఖ్యాతిపొందియుండెను. ప్రపంచములోని అన్ని జాతులవారు, అన్ని మతములవారు, అన్ని దేశములవారు వాణిజ్యమునకై అచ్చటికి వచ్చెడివారు. పదునేడవ శతాబ్దిలో, ఈ భాగములలో తిరిగిన 'ఫిలిప్ బాల్డొరెస్' (Philip Baldores) అను నాతడు వ్రాసిన ఈ వాక్యములను పరిశీలించినచో, నాటి మచిలీపట్టణశోభ కొంత తెలియును—

27. Notes on and Extracts from the Government Records of Fort St. George. 1871. Second Series; Page - 32.

"Masulipatam is a city seated near a large River, where the English and Dutch have their Factories. It is very populous, and the residence of a Governour, who pays a certain yearly Tribute to the King of Golcondar, ..................Here is also a great concourse of Merchants from Cambaja, Suratte, and other places under the jurisdiction of the Great Mogul, as also from Goa, Orixa, Bengala, and Pegu. Here is also a considerable Traffick in Diamonds and Rubies"[28].

డచ్చివారు భారతదేశములో నివసించునప్పుడు మాత్రము మహారాజుల వలె నివసించెడివారట! డచ్చి గవర్నరులు, గవర్నరుజెనరలును ఇటుల జీవించుటకు కారణము; నాటి భారత ప్రజలను, పరిపాలకులైన నవాబులను, రాజులను, దిగ్భ్రాంతులనుగా జేయుటకేయని నాటి విదేశ యాత్రికులు వ్రాసిరి.

1686 లో డచ్చివారు గోల్కొండ నవాబును లెక్కచేయక మచిలీ పట్టణమును పూర్తిగా ఆక్రమించిరి. ఆ సమయమున గోల్కొండ నవాబు, ఢిల్లీ సుల్తానుతో యుద్ధమున నుండెను. మచిలీపట్టణము పూర్తిగా ఏ కంపెనీది యును కాదు. అందు గిడ్డంగులను కట్టుకొనుటకు నవాబు, కంపెనీలయొద్ద పన్ను వసూలు చేయుచు, అంగీకరించెను. కాని, డచ్చివారు పరిస్థితులను గమ నించి మచిలీపట్టణమును ఆక్రమించుటయేగాక, ఇంగ్లీషువారు వాణిజ్యము చేయరాదనియు నిషేధించిరి.[29] ఈ నిషేధాజ్ఞను తాము లెక్కచేయుట

---

28. A True and Exact Description of the most Celebrated East India Coasts of Malabar and Coromandel. By Philip Baldores, Minister of the Word of God in Ceylon. Translated from the High Dutch, printed at Amsterdam, 1672. "Collection of Voyages and Travels." London; 1704, P. 655 (As quoted by Henry Morris in his book on the 'Godavery District.' London; 1878. Page—198.)

29. "A letter sent by the Dutch Governour and Council of Palliacatt, to the English Governour and Council of Fort St. George, bearing date the 3-13th of August 1686."

"...The right Honourable Council of India...have been forced...to take in possession (by the forces now sent us) the city of Metchlepatam ..and by God's blessing and the Companies' Arms, so effected that we now for our company this 26th of July are Masters of the aforesaid city of Metchlepatam...We shall not incommode or hinder your Honours to imbarque...and to disimbarque all your Provisions and Merchandize. ..but not to carry them without the city to dispose of them....so long as our company hath not satisfaction from the king and keep possession of the Town."

(As quoted by Henry Morris in his book on the 'Godavery Distrct'. London; 1878. Page - 201.)

లేదనియు, రపు వర్తకమునకు అడ్డము వచ్చినచో వ్యర్థముగా పరిస్థితులు విషమించుననియు, ఇంగ్లీషు కంపెనీ ఉద్యోగులు తీవ్రముగా, ప్రళయ కావేరి గవర్నరు వ్రాసిన జాబునకు సమాధాన మంపిరి.[30] ఈ సమాధానముతో పరిస్థితులు చక్కబడెను. 1690 లో మద్రాసు ప్రభుత్వము కోస్తా ప్రాంతమున గిడ్డంగులను మరల తెరచుటకు అనుమతించిన ఫర్మానాను, మొగలు పాదుషా యొద్దనుండి సంపాదించిరి.

17 వ శతాబ్దిలోనే డచ్చివారు 'భీముని పట్టణము'లో నొక గిడ్డంగిని స్థాపించిరి. కాని, ఇది ఎక్కువ ప్రసిద్ధికి రాలేదు. 1754 లో జాఫరాలీ దండు దీనిని నాశనము చేసెను. కాని, ఇది తాత్కాలికము గనుక, భీముని పట్టణము 1825 వరకు డచ్చివారి చేతులలోనే యుండెను. ఆ ఏడు ఇంగ్లీషు కంపెనీతో చేసికొనిన సంధి ననుసరించి, ఆ పట్టణము వారి హస్తగత మయ్యెను.

1787 లో 'సర్క్యూటు కమిటీ' (Committee of Circuit) జమీందారుల స్థితిగతులను పరిశీలించుటకు, ఇంగ్లీషువారిచే నియమింపబడునాటికి; పాలకొల్లు, జగన్నాథపురము, గొల్లపాలెము, గుండవరము, డచ్చివారి చేతులలోనే యుండెను. కాని వ్యాపారము బాగుగా క్షీణించెను. యూరపులో డచ్చివారి ప్రాబల్యము తగ్గుటతోడనే, భారతదేశములో కూడ వారి ప్రభావము తగ్గిపోయెను. భారతదేశములోని వారి ప్రాంతములలో నాగపట్టణము మొదలైనవి 'వెర్సేల్సు' (Versailles) సంధననుసరించి 1783 లో ఇంగ్లీషువారి వశమయ్యెను. గోదావరిజిల్లాలోని ప్రాంతములకు వారు, ఇంగ్లీషువారికి పన్ను కట్టుచుండెడివారు. తుట్టతుదకు, పందొమ్మిదవ శతాబ్ది ప్రారంభమగు నప్పటికి, డచ్చివారి వ్యాపార కేంద్రములన్నియు-భారతభూమిపై నున్నవి-ఇంగ్లీషువారి వశమయ్యెను.

భారతీయుల జీవితవిధానమునకు డచ్చివారి ప్రభావము తగులలేదనియే చెప్పవచ్చును. వారు దేశీయులకు దూరముగ నుండుటయు, వారి వ్యాపార కేంద్రములు దూరదూరముగను, తక్కువగను, ఉండుటయు-ఇందులకు ముఖ్య

---

30. "... We must tell you that 'tis too great of you to appoint us wha we have to do in reference to our Trade at Metchlepatam (though you have possession thereof), for we know of no obligation to observe such directions.... we shall not want them that are appointed to give us an account of the least obstruction there to, which we advise you not to do, because of the ill consequences that may be to your own interests." (Ibidem. Page - 202)

కారణములు. ఆంధ్రదేశములో గిడ్డంగులను నెలకొల్పి రెండు శతాబ్దులు వ్యాపారము చేసినను, ఆంధ్రసంస్కృతిపై వారి ప్రభావము లేదనియే చెప్పవచ్చును. తెలుగుభాషలోనే గాక, ఇంగ్లీషుభాషలోను 'డచ్చి' పదములు చాల తక్కువ.[31] డచ్చివారును, ఇంగ్లీషువారును మన దేశమున కించుమించుగ ఒకేసారి వచ్చిరి. ఇరువురును పోర్చుగీసువారివలన చాల లాభములను పొందిరి. క్రొత్త విషయముల నెన్నింటినో వారివలన నేర్చుకొనిరి.

డచ్చివారు హాలండుదేశస్థులు గనుక వారిని మనవారు 'వళందు' లనెడివారు. ఇందులకు ప్రయోగము కదిరీపతి (17వ శతాబ్ది) వ్రాసిన 'శుకసప్తతి'లో గలదు :

"ఈళయు, విళంగయును, బం
గాళయు, మొదలైన పేరుగల దీవులలో
మేలైన సరకు లాతని
కౌలున దిగు మాట నిజముగలవాఁ డగుటన్."

(ప్రథమాశ్వాసము - 176 వ పద్యము)

ఈ పద్యములోని 'విళంగ'ను గుర్తించుటకు; కదిరీపతి ననుకరించి మరి నూరు సంవత్సరములకు 'హంసవింశతి'ని రచించిన అయ్యలరాజు నారాయణామాత్యుని ఈ క్రింది పద్యము సాయపడును :

"ఈడము వళంద బందర యింగిలీషు
కళము మొదలైన పేటల గౌరలెల్ల
సౌరభ ద్రవ్యములు బేరసార మాడ
బిలువనంపిరి తమతమ పేటలకును"

(ప్రథమాశ్వాసము - 112 వ పద్యము)

ఈ పద్యములో, పై పద్యములోని 'విళంగ' స్థానమున 'వళంద' కలదు. 'హాలండు' వారిని 'వలంద' వారు అనుట కలదుగదా! శుకసప్తతిలోని 'విళంగ'కు 'ఇళంద' అను పాఠాంతరముకలదు. ఈ పాఠము హంసవింశతిలోని పాఠమునకు సన్నిహితమైనది. కనుక, కదిరీపతియు నారాయణామాత్యుడును గూడ 'డచ్చి' (హాలండు) వారి ప్రస్తావన చేసినారనవచ్చును.

---

31. "The Dutch language has not contributed much to our store. The Dutch and the English arrived in the Indies Contemporaneously, and though both inherited from the Portuguese, we have not been the heirs of the Dutch to any great extent." ('Hobson—Jobson' by H. Yule and A. C. Burnell. London, 1886. Introductory remarks; Page—XVIII)

'వళంద' అను శబ్దము డచ్చివారికి పర్యాయపదముగా వాడబడినదని చెప్పుట కనేక నిదర్శనము లాంధ్రదేశమున కలవు. డచ్చివారు గిడ్డంగులను స్థాపించుకొని వాణిజ్యముచేసిన కేంద్రములలో, మనదేశమున నేటికిని 'వళంద' నామము వాడుకలో కలదు. మచిలీపట్టణమునందు వారొకప్పుడున్న స్థావరములకు 'వళందపాలె' మని పేరు [32] భీముని పట్టణము సమీపమునగల డచ్చివారి చాకిరేవులను నేటికిని 'ఒళందభూములు' అందురు.

'బ్రౌణ్యమిశ్రభాషానిఘంటువు' లో— "ఒలాందావాండ్లు n. s. plu (Les Hollandois) The Dutch. ఒలందామల్లె the Dutch Tube rose. ఒలందాకమలము a diamond cut in the Dutch fashion." (page-14)

డచ్చివారు ఆంధ్రదేశములో బత్తాయి, పంపరపనాస పండ్లను ప్రవేశపెట్టినారు. ఈ విషయమై 'బ్రౌణ్యమిశ్రభాషానిఘంటువు'నం దిట్లున్నది. "బత్తాయి n. s. from Batavia. ఒకదేశము : also written బత్తావి whencer బత్తాయి, నారింజపండ్లు a kind of orange. బత్తాయి నిమ్మపండ్లు The fruit called Pomelnoses." (page-64)

"పంపరపనసపండు or పంపరమాస పండు n. s. The fruit called Pomelnos or shaddock. (Citrus Decumana) It was introduced from Batavia by the Dutch." (Page—62)

డచ్చివారికి భారతదేశములో రాజ్యకాంక్ష గాని, ప్రజలను క్రైస్తవులుగ చేయవలెనను కోరిక గాని, గాఢముగా లేకుండుటచే, వారి వాణిజ్యమిచ్చుట తగ్గుముఖము పట్టుటతోడనే, తమ వాణిజ్య స్థావరములను ఇంగ్లీషువారికిచ్చివేసి, మన దేశమునుండి వారు తప్పుకొనిరి. కనుకనే వారి ప్రభావము మనపై చాల తక్కువ. కాని, డచ్చివారి వద్దనుండి ఇంగ్లీషువారు రాజనీతిని నేర్చుకొనిరి. తమ స్థావరముల నెట్లు బలపర్చుకొనవలెనో, ఎట్లు అభివృద్ధిచేసి

32. "In this part of Masulipatam it is still possible to distinguish the separate stations of the various nationalities which traded here centuries ago. French-pettah, occupying a space of about 1,300 square yards, the ownership of which (though not the sovereignty) is vested in the French Government, and English-pālem are here; while some distance to the north-west lies *Valanda-pālem* (Hollander-town) with the old Dutch grave-yard."

(Imperial Gazetteer of India; Provincial Series; Madras I; 1908. Page - 324).

దీనినిబట్టి 'మచిలీపట్టణము' న, ఏబది సంవత్సరముల క్రిందట 'వళంద' శబ్దము వాడుకలో నున్నదని తెలియుచున్నది.

కొనవలెనో, డచ్చివారి వద్ద నేర్చుకొని, ఇంగ్లీషువారు క్రమక్రమముగా ప్రబలులైరి. మన రాజకీయ జీవితముపై డచ్చివారి ప్రభావ మిది[33].

## ఫ్రెంచివారు

భారతదేశములో కొంతభాగమును సంపాదించినవారు, ఇంగ్లీషువారికి తుదివరకు ప్రతిద్వంద్వులయినవారు ఫ్రెంచివారు. వారినిగూర్చి కొంత తెలిసికొనిన తరువాత, ఇంగ్లీషువారికిని వీరికిని జరిగిన యుద్ధములలో ఇంగ్లీషువారెట్లు జయమును పొంది దేశమునకంతకు ప్రభువులైరో తుదకు, పరిశీలింపవలెను. ఈ చరిత్ర పరిశీలనము, సాహిత్య పరీక్షకు చక్కని నేపథ్యము కాగలదు.

ఫ్రెంచి ఈస్టిండియా కంపెనీ 1604 లో హెన్రీ IV యొక్క అధికారము క్రింద స్థాపింపబడినది. మొట్టమొదట ఈ కంపెనీ అభివృద్ధికి రాలేదు. దీనికి కావలసిన మూలధనము లేకుండుటయు, ప్రభుత్వముయొక్క సాయము, ప్రజల సానుభూతి లేకుండుటయు, ఇందులకు కారణములు. కాని, లూయీ XIII యొక్క ప్రాపు లభించుటతోడనే 1611 నుండి కంపెనీ అభివృద్ధి పొందుట మొదలిడెను. అప్పుడే దీనికి 'లూయీ' యొక్క మంత్రి అయిన 'కార్డినల్ డి రిషెలూ' (Cardinal de Richelieu) యొక్క సాయముకూడ లభించెను. ఈ ఇద్దరును కంపెనీయొక్క శ్రేయస్సుకోరి అనేకవిధముల దానికి సాయము చేసిరి. 1664 లో లూయీ XIV పరిపాలనా కాలములో అతని ఆర్థికమంత్రియైన 'కోల్బర్ట్' (Colbert) యొక్క సాయము బాగుగ లభించి కంపెనీ బలపడెను.

1669 లో మెర్కారా (Marcara) అను పర్షియాదేశస్థుడు ఫ్రెంచివారి తరఫున పనిచేసి, గోల్కొండనవాబు నొద్దనుండి; ఫ్రెంచి తూర్పిండియా సంఘమువారు, గోల్కొండ రాజ్యములో ఎగుమతి దిగుమతి పన్నులులేకుండ వాణిజ్యము చేసికొనుట కనుజ్ఞ ఇచ్చిన ఫర్మానాను సంపాదించెను. ఇది డిసెంబరు 5 వ తేదీని లభించెను. ఆయేడే వారు మచిలీపట్టణములో గిడ్డంగులను కట్టు

33. "The original settlers began with a factory, the factory grew into a fort, the fort expanded into a district, and the district into a province."

(Lord Palmerston)

(Speeches and Documents on Indian Policy, 1750-1921. By A. B. Keith (1922) Vol I; Page - 321).

కొనిరి. 1693 లో వారు ఫ్రెంచి పేటను నిర్మించిరి[34]. మచిలీపట్టణము వారి వస్తువులకు రేవు.

1750 లో 'యానాం' (Yanam)లో ఒక గిడ్డంగిని కట్టిరి. ఇంగ్లీషు గిడ్డంగి కల 'ఇంజరము'నకు ఇది సమీపముననే గలదు. ఇంగ్లీషు వారు 'ఇంజరము' నొద్ద గిడ్డంగి కట్టిన కొంతకాలముననే ఫ్రెంచివారును దీనిని స్వాధీనము చేసికొని వర్తకము చేయుట ప్రారంభించిరి. ఇక్కడ లభించు వస్త్రమును ఎగుమతి చేయుటకు ఫ్రెంచివారు మచిలీపట్టణమును రేవుగా ఉపయోగించెడివారు.

ఈ సంవత్సరములోనే, అప్పుడు దక్కను సుభాదారైన 'నాజర్ జంగ్' ఆజ్ఞననుసరించి ఆతని సైనికులు ఫ్రెంచివారి స్థావరముల నాక్రమించుకొని; వారి గిడ్డంగులకు, గృహములకు తాళములు వేసి స్వాధీనముచేసికొనిరి. కాని, డూప్లే (Dupleix) రెండు ఓడలను (Fleury, D'Argenson) తీసికొనిపోయి మచిలీపట్టణమును స్వాధీనము చేసికొనెను.

సలాబత్ జంగ్ సింహాసనమునకు వచ్చిన వెంటనే ఫ్రెంచివారి కెంతయో సాయముచేసెను. తన సోదరుడు స్వాధీనము చేసికొనిన ఫ్రెంచి గిడ్డంగుల నన్నింటిని మరల వారికిచ్చివేసెను. ఇంతియేగాక వారికి 'నిజాముపట్టణము' దాని ఉద్ధసరము లందుగల భూములను, గ్రామములను; నరసాపురమునకు సమీపమున నున్న భూములను ఇచ్చెను. ఫ్రెంచివారియొక్క యుద్ధఫలితముల ననుసరించి, 'యానాం' చేతులు మారుచునే యుండెను. 1787 లో యానాం నుండి రెండు మూడు వేల బేళ్ళ ముతుకబట్ట ఎగుమతి అయినదని 'సర్క్యూటు కమిటీ' వారు వ్రాసిరి.

ఆంధ్రదేశములో లేకపోయినను, భారతదేశములో ఫ్రెంచివారి రాజకీయములలో విశేషప్రాముఖ్యమును వహించిన ఫ్రెంచిస్థావరములు కొన్ని గలవు. వానిలో ముఖ్యమైనది పుదుచ్చేరి. ఇది 1674 లో 'షెర్ ఖాన్ లోడి' (Sher Khan Lodi) ఇచ్చినస్థలముపై 'ఫ్రాంకై మార్టిన్' (Francois Martin) చేత స్థాపింపబడినది. ఫ్రెంచి రాజకీయములలో ఈ పట్టణము ప్రముఖపాత్ర వహించెను. 'మార్టిన్' యొక్క కృషి ఫలితముగ ఈ పట్టణము ఫ్రెంచివారి వాణిజ్యకేంద్రమయ్యెను. 1690 లో ఫ్రెంచివారు 'చంద్రనగరము' (Chandernagore) నందొక గిడ్డంగిని స్థాపించిరి. 1693 లో డచ్చివారు పుదుచ్చేరిని

34. Malleson's 'French in India'; Pages - 15, 31

వశముచేసికొని ఆరుసంవత్సరములు తమ స్వాధీనములో నుంచుకొనిరి. ఇది 1699 వరకు మరల ఫ్రెంచివారికి రాలేదు. పుదుచ్చేరిలోని 'ఫోర్టు సెయింట్-లూయీ' ఈ యుద్ధములవలన ఇంకను చక్కగా బలపడెను. 'మార్టిన్' 1706 లో చనిపోయెను. ఈత డంతవరకు ఫ్రెంచివారికి చేసిన సేవయే, తరువాత 'డూప్లే' మొదలగువారి విజృంభణమునకు అవకాశ మిచ్చినదని విజ్ఞుల ఊహ.

ఫ్రెంచి తూర్పిండియా సంఘము, యూరపులో హాలండు ఫ్రెంచి రాజ్యముల నడుమ వచ్చిన యుద్ధములవలన బాగుగ దెబ్బతినెను. కాని 1720 నుండి మరల తేరుకొనెను. 1724 లో మలబారు కోస్తాయందు గల 'మాహే' (Mahe) పట్టణము ఫ్రెంచివారి వశమయ్యెను. తరువాత 'కరైకాల్' వారి వశమయ్యెను. నాటినుండి 1742 లో డూప్లే పుదుచ్చేరికి గవర్నరగు పర్యంతము క్రొత్త ప్రాంతములను ఫ్రెంచి కంపెనీ సంపాదించుచునే యుండెను. భారత దేశములోని పరిస్థితులు వీరికి అనుకూలముగనే యుండెను. ఔరంగజేబు మరణానంతరము మొగలు సామ్రాజ్యము ముక్కలు కాజొచ్చెను. దక్షిణమున ఆసఫ్ జా స్వతంత్రుడై నిజామ్ ఉల్ముల్క్ అను బిరుదుతో పరిపాలింప జొచ్చెను. ఈతడును 1748 లో చనిపోవుటతోడనే, ఫ్రెంచివారి సామ్రాజ్య కాంక్షకు తగినట్లవకాశములును వచ్చెను.

ఆ సంవత్సరమే, కొన్ని సంవత్సరముల యుద్ధము యూరపులో జరిగిన తరువాత ఫ్రెంచివారును ఇంగ్లీషువారును 'ఆక్సి లా ఛేపల్' (Aix La Chapelle) సంధిచేసికొనిరి. దీని ఫలితముగా, 1746 లో ఫ్రెంచివారు పట్టుకొనిన మద్రాసు మరలఇంగ్లీషువారికి స్వాధీనముచేయబడెను. అప్పుడు ఇంగ్లీషు, ఫ్రెంచికంపెనీల నడుమ జరిగిన యుద్ధములలో, భారతదేశమున ఇంగ్లీషువారు గాని, ఫ్రెంచివారు గాని జయము పొందకున్నను; ఇరువురకు ఒక్క విషయము తెలిసెను. మొగలు సామ్రాజ్యము యొక్క క్షీణదశలో బయలుదేరిన చిన్నచిన్న రాజ్యముల యుద్ధములలో జోక్యముకలిగించుకొని, తమ సేనల సాయముతో విశాల సామ్రాజ్యమును నిర్మింపవచ్చునను విషయమే వారు గ్రహించినది. ఉత్తర సర్కారులు పూర్తిగా ఇంగ్లీషువారి చేతులలో పడువరకు, ఫ్రెంచి వారికిని ఇంగ్లీషువారికిని జరిగిన యుద్ధముల కన్నిటికి వెనుక, ఈభావమే ఉభయుల మనస్సులలోను మెలగుచుండినది.

1748 లో అసఫ్ జా మరణించుటతోడనే ఆతని సింహాసనమునకై 'నాజర్ జంగ్' నకును 'ముజఫర్ జంగ్' నకును పోరాటము వచ్చెను. ఈ పోరాటములో ఫ్రెంచివారు ముజఫర్ జంగ్ పక్షమునను, ఇంగ్లీషువారు నాజర్ జంగ్ పక్షమునను చేరిరి. ఈ పోరాటమునకు సమాంతరముగ 'కర్ణాటక' సింహాసనమునకై 'చందాసాహేబ్' నకును 'మహమ్మదాలీ' కిని పోరు సిద్ధమయ్యెను. అంబూరు యుద్ధములో చనిపోయిన (1749) అన్వారుద్దీన్ యొక్క కుమారుడు మహమ్మదాలీ. చందాసాహేబ్ ఫ్రెంచివారి స్నేహితుడు. ఈతడు ముజఫర్ జంగ్ యొక్క సాయముతో 'అన్వారుద్దీన్'ను చంపి ఆర్కాటు నవాబు అయ్యెను. మహమ్మదాలీ 'తిరుచునాపల్లి'కి పోయెను. ఫ్రెంచివారు తనకు చేసిన సాయమునకై చందాసాహేబు వారికి ఎనుబది గ్రామముల నిచ్చెను. ఫ్రెంచివారు ముజఫర్ జంగ్ను హైదరాబాదు సింహాసన మెక్కించిరి. కాని 'నాజర్ జంగ్' తన సేనలను పంపి మచిలీపట్టణములోని, యానాంలోని, ఫ్రెంచివారి గిడ్డంగులను స్వాధీనముచేసికొనెను. తరువాత డూప్లే తన నౌకలను బంపి వానిని తిరిగి వశపర్చుకొనెను. ఈ పరిస్థితులలో డిసెంబరు 1750 లో నాజర్ జంగ్ హత్యగావింపబడెను. వెంటనే ఫ్రెంచివారు ముజఫర్ జంగ్ను దక్కను సుభాదారుగా ప్రకటించిరి. ముజఫర్ జంగ్ కృతజ్ఞతతో ఫ్రెంచివారికి కృష్ణానదికి దక్షిణమునను్న మొగలాయి ప్రాంతములను, మచిలీపట్టణమును, తత్పరిసరప్రాంతములను ఇచ్చెను. ఈ ప్రాంతమున కంతకు 'డూప్లే' గవర్నరుగ నియమింపబడెను. డూప్లే అధికారము, గౌరవము హెచ్చెను. దానితో ఫ్రెంచివారి పలుకుబడియు, ఫ్రెంచి కంపెనీ యొక్క పలుకుబడియు హెచ్చెను.

కాని 'ముజఫర్ జంగ్' చిరకాలము జీవింపలేదు. తరువాత ఒక చిన్న యుద్ధములో ఆతడు చనిపోయెను. కాని ఫ్రెంచివారు జంకక, అసఫ్ జా యొక్క మూడవ కుమారుడైన 'సలాబత్ జంగ్' ను దక్కను సుభాదారునిగ చేసిరి. ఫ్రెంచి సేనాని యగు బుస్సీ ఆతని కండయై నిలచెను. కొన్ని నెలలు సలాబత్ జంగ్ యొక్క సలహాదారుగ ఉన్నతరువాత, బుస్సీ ఆరోగ్యము చెడి మచిలీపట్టణమునకు తిరిగివచ్చెను. వెంటనే నిజాము యొక్క దివాను కుట్రలు పన్ని ఫ్రెంచివారి పలుకుబడిని హైదరాబాదులో తగ్గించుటకు ప్రయత్నించెను. నిజాము నొద్ద పలుకుబడిని పోగొట్టుకొనుట కిష్టపడని బుస్సీ, డూప్లే జాబు వ్రాసిన వెంటనే ఆరోగ్యము సరిగా లేకున్నను, హైదరాబాదునకు బయలు

చేరెను. డూప్లే ఆతనికి అభిమాన ముట్టిపడుచున్నట్లు ఈ క్రింది విధముగా వ్రాసెను.

"Le Sieur de Bussy was too zealous a patriot not to sacrifice even health itself for the benefit of the State"[35].

హైదరాబాదులో బుస్సీ సేన లాతనికి స్వాగతమిచ్చెను. వర్షములు తగ్గిన వెంటనే ఆతడు తన సేనతో ఔరంగబాదులో నున్న 'సలాబత్ జంగ్' దగ్గరకు పోయెను. ఫ్రెంచివారి రాకతో దివాను యొక్క పలుకుబడి తగ్గెను 'సలాబత్ జంగ్' ఫ్రెంచివారికి ఘనమైన స్వాగతమిచ్చెను. స్వాగతమిచ్చుటయే గాక, ఫ్రెంచి సేనల భరణము నిమిత్తము ఉత్తర సర్కారులను, ఫ్రెంచివారికై బుస్సీకి ఇచ్చెను. ఆ 'దానపత్రము' నందిట్లున్నది— "......the provinces of Mustaphanagar, Ellore, Rajamundrum, and Chicacole should be given for the support of the French army; that the sums which Jaffir Ali Khan, at that time governor of those provinces, might have collected before M. Bussy should be able to settle the administration of them, should be made good from the Soubha's treasury, in case Jaffir Ali Khan himself should delay or evade payment of them; and that the French troops should, as before the separation, have the guard of the Soubha's person"[36].

దీనికి సంబంధించిన అధికార పత్రములు సిద్ధము కాగానే, బుస్సీ వానిని మచిలీపట్టణములోని ఫ్రెంచి అధికారియైన 'మొరాసిన్' (M. Moracin) నకు తగిన చర్య తీసికొనవలసినదని పంపెను. తన అధికార నిర్వహణమునకు ప్రతిబంధములు వచ్చినచో వానిని తొలగించుటకు కొంత సేనకూడ బుస్సీ పంపెను. ఈ విధముగా 1753 లో ఫ్రెంచివారికి ఉత్తర సర్కారులు హస్తగతమయ్యెను. దీనితో ఫ్రెంచివారి పలుకుబడి మిన్నుముట్టెను.[37]

కాని, ఈ నాలుగు రాష్ట్రముల గవర్నరు అయిన 'జాఫిర్ ఆలీఖాన్', ఫ్రెంచివారికి వీటిని కట్టబెట్టుట కంగీకరింపక, వారి నెదిరించుటకై విజయనగర

35. Mallenson's 'French in India;' Page - 367

36. Robert Orme - 'History of the Military Transactions of the British Nation in Indostan.' Vol. I; Page - 334.

37. "These territories rendered the French masters of the greatest dominion, both in extent and value, that had ever been possessed in Hindustan by Europeans, not excepting the Portuguese, when at the height of their prosperity"- Robert Orme.

(As quoted by G. B. Malleson, C. S. I; in his book on 'The French in India'; Edinburgh. 1909. Pages - 379-380 ).

రాజైన పెద్ద విజయరామగజపతితో సంధిచేసికొనెను. కాని, 'మొరాసిన్' రాజమహేంద్రము, చికాకోలు సర్కారులను, ఆ [illegible]నకు కౌలున కిత్తునని చెప్పి, విజయరామగజపతిని చీలదీసెను. 'జాఫిర్ అలిఖాన్' చేయునదేమియు లేక, దేశమును దోచుకొని, సర్కారులను విడిచిపోయెను పోయి. వెంటనే ఔరంగబాదులోనున్న నిజామునకు లొంగిపోయెను.

ఈ సమయముననే క్లైవు యొక్క సాయముతో ఇంగ్లీసువారు మహమ్మదాలీని కర్ణాటక నవాబుగ చేయగలిగిరి. ఫ్రెంచివారి సాయమును బొందిన 'చందాసాహెబ్', శత్రువులకు చిక్కి ఉరితీయబడెను. దీనితో డూప్లే పలుకుబడి తగ్గిపోగా, ఆతడు 1754 లో అధికారమునుండి తొలగింపబడెను. ఆతని స్థానమున 'గొడేహు' (Godehu) నియమింపబడెను. అప్పుడు జరిగిన సంధిప్రకారము కర్ణాటకములో ఫ్రెంచివారికిని, ఇంగ్లీషువారికిని హక్కులు సమముగా నీయబడెను. కాని ఇంతలోనే యూరపులో, ఏడు సంవత్సరముల యుద్ధము వచ్చెను.

ఉత్తర సర్కారులు బుస్సీచేతులలో నున్న కొంచెము కాలములోను చక్కని పరిపాలనను చవిచూచెను. శిస్తులు మొదలగునవి సక్రమముగ వసూలు చేయబడినవి. ప్రజలకు పన్నులభారము తగ్గెను.[38] కాని ఇది ఎంతకాలమో నిలువలేదు.

'సలాబత్ జంగ్' ఫ్రెంచివారిని, 'జాఫిర్ అలీఖాన్' యొక్క మాటలను విని, జూలై 1756 లో అధికారమునుండి తొలగించెను. కాని బుస్సీ 'చార్మినార్' సమీపమున నవాబును ప్రతిఘటించి నిలచెను. ఆతనికి సాయపడుటకై 'లా' (Law) అను నాతని నాయకత్వమున పుదుచ్చేరినుండియు మచిలీపట్టణము నుండియు సేనలు పంపబడెను. ఈ సేనలను చూచినవెంటనే 'సలాబత్ జంగ్' పూర్వపు మర్యాద చూపమొదలిడెను.

ఈవిధముగా నిజాముతో మరల స్నేహము కలిసిన తరువాత, ఉత్తర సర్కారులను చక్కదిద్దుటకై నవంబరు 16 వ తేదీని బయలుదేరి బుస్సీ బెజవాడ, ఏలూరు మీదుగా రాజమహేంద్రవరము డిసెంబరు 19వ తేదీని

---

38. "The rent was moderate, enforced without rigour, accurate accounts were prepared, and most of the hereditary officers, if not those possessing rent-free lands, were Confirmed in their property."

—Grant Duff.

(Ibidem)

చేరెను. విజయరామగజపతి అతని కెదురువచ్చి స్వాగతమిచ్చెను. ఈతని సాయముతో బుస్సీ ఉత్తర సర్కారులలో తన కెదురుతిరిగిన వారి నందరిని ఓడించెను. ఈ సందర్భములో, విజయరామగజపతి తనకు విరోధియైన 'బొబ్బిలి' ని కూడ బుస్సీచే ముట్టడింపజేసి నాశనము చేయించెను. అచ్చటి నుండి తిరిగివచ్చుచు, విశాఖపట్టణములోని ఇంగ్లీషువారి స్థావరములను వీరు నాశనము చేసిరి. (1757).

ఉత్తర సర్కారులలో, చికాకోలుసర్కారులో బుస్సీ ఉన్న రోజుల లోనే, వంగదేశములో ప్లాసీ యుద్ధము (1757) జరిగెను. ఆరోజులలో రాజమహేంద్రవరములోనున్న ఫ్రెంచిసేన, గోదావరిజిల్లాలోగల ఇంగ్లీషు గిడ్డంగులను మూడింటిని (మాడపొలము. బెండమూర్లంక. ఇంజరము) పట్టుకొనెను.

బుస్సీ 1757 వ సంవత్సరాంతమున రాజమహేంద్రమునకు తిరిగి వచ్చెను. రాగానే, సలాబత్‌జంగ్ ఫ్రెంచివారి నాదరించుటలేదని తెలిసి. తన సేనతో బయలుదేరి ఔరంగబాదు చేరెను. బుస్సీ సేనతోరాగానే, అంతవరకు సలాబత్‌జంగ్‌ను లక్ష్యపెట్టక పరిపాలించుచున్న నిజామ్‌అలీ, లొంగిపోయెను. ఈ ఘట్టమునుండియే ఫ్రెంచివారి పతనము ప్రారంభమైనదనవచ్చును

ఈ క్లిష్టపరిస్థితులలో 'లాలీ' (Lally) అను ఫ్రెంచి గవర్నరు జనరల్, బుస్సీని వెంటనేబయలుదేరి కర్ణాటకమునకు రా నాజ్ఞాపించెను. ఈ పిలుపు భారతదేశములో ఫ్రెంచివారి నాశనమునకు పిలుపయ్యెను. తన ఉన్నతాధికారి యొక్క ఆజ్ఞననుసరించి -దానివలన నష్టమెంతయోయున్నను- బుస్సీ ఔరంగ బాదును విడిచి మచిలీపట్టణ ప్రాంతమునకు వచ్చెను. ఈ సందర్భమున 'లాలీ'కి 'బుస్సీ' ఈ విధముగా జాబు వ్రాసెనట. "………There is one thing, Sir, which I have always known how to do better than anything else; it is to obey."[39]

కృష్ణానదీతీరమునగల 'రేయూరు' దగ్గర ఆగష్టు 3వ తేదీని 1758 లో బుస్సీ తన సేనను, తనకు ఉత్తర సర్కారులలోగల ప్రభుత్వమును 'మార్క్వెస్ డి కాన్ఫ్లెన్స్' (Marquis De Conflans) న కిచ్చి లాలీని కలిసికొనుటకు కర్ణాటకమునకు పోయెను.

---

39. Letter Dated 15th July 1758 (Memoire pour Bussy) (Ibidem. Page - 505).

బుస్సీ ఉత్తర సర్కారులను విడచిపోవుటతోడనే, సర్కారులలో ఫ్రెంచి ప్రభుత్వముపై తిరుగుబాటు వచ్చెను. ఇందు ముందు పాల్గొన్నది, పెద్ద విజయరామరాజు హత్య తరువాత విజయనగరమునకు రాజైన ఆనందరాజు యొక్క సేన. ఆనందరాజు వెంటనేపోయి విశాఖపట్టణమును ఫ్రెంచివారి చేతులనుండి గ్రహించి, ఉత్తర సర్కారులపై దండెత్తినచో తాను సాయము చేయుటకు సిద్ధమే అని, కలకత్తాలోను, మద్రాసులోను ఉన్న ఉంగ్లీషువారికి కబురంపెను. ఆ రోజులలో క్లైవు వంగదేశములో నుండెను. ప్లాసీయుద్ధము ముగిసినది. వంగదేశములో ఇంగ్లీషువారి పలుకుబడి అత్యున్నత స్థాయిలో నుండెను. ఆనందరాజు పంపినవార్త విని, క్లైవు సేనలను పంపుటకుద్యమించెను. ఆతని సలహాదారు లందరు అందులకు వ్యతిరేకముగనే సలహా చెప్పిరి. కాని క్లైవు ఫ్రెంచివారిని ఉత్తర సర్కారునుండి తరిమివేయుటకు మంచిఅవకాశము లభించినదని గుర్తించి వారి మాటలను పెడచెవినిడి, 'కర్నల్ ఫోర్డు' (Colonel Forde) నాయకత్వముక్రింద విశాఖపట్టణము, సేనలను పంపెను. ఈ సేనలు విశాఖపట్టణమును, అక్టోబరు 20వ తేదీ 1758 లో చేరినవి. అంతకు పూర్వమే సెప్టెంబరులో విశాఖపట్టణము 'జాన్‌స్టన్' (Johnstone) నకు అప్ప చెప్పబడినది. (సెప్టెంబరు 12వ తేదీ, 1758).

ఇంగ్లీషువారి సేన నవంబరు ఒకటవతేదీని బయలుదేరి, కశింకోటయొద్ద ఆనందరాజును కలిసికొనెను. ఆనందరాజుతో చర్చలను జరిపి ఒక సమాధానమునకు వచ్చుటకు, మద్రాసునుండి అంతకు పూర్వము మాడపొలములో అధికారిగా నున్న 'ఆండ్రూస్' (Andrews)ను రప్పించిరి. చాలరోజులు చర్చలు జరిగిన తరువాత వీరిలో వీరికి అంగీకారముకుదిరి యుద్ధసన్నద్ధులైరి.[40] డిసెంబరు 3వ తేదీనాడు ఇంగ్లీషువారికి గొల్లప్రోలు సమీపమున ఫ్రెంచిసేనలు కన్పట్టెను. ఫ్రెంచిసేనలకు అధిపతి 'కాన్లెఫ్లన్స్' (Conflans) 6 వ తేదీని ఇంగ్లీషువారు

---

40. "......all the countries which might be conquered should be delivered to the Rajah, who was to collect the revenues; but that the seaports, and the towns at the mouths of the rivers, should belong to the company, with the revenues of the Districts annexed to them; that no treaty for the disposal or restitution, whether of the Rajah's or the English possessions, should be made without the consent of both parties; that the Rajah should supply 50,000 rupees a month for the expenses of the army, and 6000 for the particular expenses of the officers''—Robert Orme.

(History of the Military Transactions of the British Nation. Vol II; Page - 376).

'చేబ్రోలు'ను ఆక్రమించిరి మూడురోజులు రెండు సేనలును వేచియుండెను. 9 వ తేదిని ఇంగ్లీషు సేనలుకదిలి, 'కొండూరు' (చందుర్తి)నకు వచ్చెను. ఇచ్చట నుండి ఫ్రెంచి స్కంధావారమునకు నాలుగుమైళ్ళు. ఈ రెండింటికి నడుమ ఒక గ్రామముకలదు. ఆ గ్రామమును పట్టుకొనుట ఇంగ్లీషువారి యూహయని తలంచి ఫ్రెంచి సేనాని, తన సేనల నటు నడపెను. ఇంగ్లీషుసేనాని కదలుటకు కారణము, సేనలు చక్కగా మెలగుటకు ఆస్థల మనుకూలముగా లేకుండుటయే. 'చందుర్తి' సమీపమున స్థలము యుద్ధమున కనుకూలముగ నుండెను. ఇది ఫ్రెంచిసేనాని గుర్తింపక యుద్ధమునకు తలబడెను. ఇంగ్లీషువా రాక్రమించు కొనియున్న స్థలము, రణమునకు తగియుండుటచే వారు సులువుగా ఫ్రెంచి వారిని నిర్జింపగలిగిరి. ఇంగ్లీషు సేనలో కెప్టెన్ నాక్స్ (Captain Knox), కెప్టెన్ అడ్నెట్ (Captain Adnet) లుండిరి. వీరిలో కెప్టెన్ అడ్నెట్ యుద్ధములో చనిపోయెను. కాని ఇంగ్లీషువారు ధైర్యసాహసములతో పోరి ఫ్రెంచి వారి నోడించిరి. అపజయముపొందిన ఫ్రెంచి సేనాని కాన్ఫ్లెన్స్ (Conflans) యుద్ధరంగమునుండి గుఱ్ఱముపై పారిపోయి రాజమహేంద్రవరము (సుమారు నలుబదిమైళ్ళు) చేరెను. కొండూరు (చందుర్తి) యుద్ధము (డిసెంబరు 9, 1758) ఉత్తర సర్కారులలో జరిగిన యుద్ధములలో అతిముఖ్యమైనది. ఈ యుద్ధముతో ఇక్కడ ఫ్రెంచివారి వాణిజ్యము, పలుకుబడి పూర్తిగా నాశనమై ఇంగ్లీషు వారు ప్రబలులై నిలచిరి.

పదునెనిమిదవ శతాబ్దిలో ఫ్రెంచివారి పలుకుబడి మిన్నుముట్టియున్న కాలములో రచింపబడిన ఆనందరంగరాట్ఛందము, రంగరాయ చరిత్రములలో వీరి ప్రస్తావన విపులముగా కలదు. ఇందు మొదటి గ్రంథమును కస్తూరి రంగ కవి రచించి, ఫ్రెంచివారికి దుబాసిగ నున్న ఆనందరంగముపిళ్ల కంకిత మిచ్చుటచే ఇందు వారి వర్ణన కలదు. దిట్టకవి నారాయణకవి రచించిన రంగరాయ చరిత్రము 1757 లో జరిగిన (జనవరి 24వ తేదీ) బొబ్బిలియుద్ధమును వర్ణించునది యగుటచేత, ఇందు బుస్సీ మొదలయిన ఫ్రెంచివారి ప్రస్తావన కలదు. ఇట్లీ రెండు గ్రంథములును తెలుగుదేశములో ఫ్రెంచివారి స్థితిగతులను గూర్చి చెప్పునట్టివై పరిశోధనకు పనికివచ్చును.

ఫ్రెంచివారి ప్రస్తావన గల 'ఆనందరంగరాట్ఛందము' యొక్క గద్య యిట్లున్నది.

"ఇది శ్రీమదుమామహేశ్వర కరుణాకటాక్ష లబ్ధ సాహితీ విభవ ధర్మ వెచ్చకులజలధికుముదమిత్ర శ్రీవత్సగోత్రపవిత్ర వేంకటకృష్ణార్యపుత్ర విద్వజ్జన మిత్ర కుకవిజనతాలతాలవిత్ర యార్వేల కమ్మ నియోగి కులీన లక్షణ కవి *కస్తూరి రంగయ* నామధేయ ప్రణీతంబైన *యానందరంగచ్ఛందంబను* లక్షణ చూడామణియందు......" (వావిళ్ళవారి ప్రతి - 1922 - పేజి 32) దీనినిబట్టి కస్తూరి రంగకవి జీవిత విశేషములు కొన్ని తెలియుచున్నవి.

1750 ప్రాంతమున ఫ్రెంచివారికి దుబాసిగ నుండి వారి యాదర రాభిమానములను చూరగొన్న 'ఆనందరంగము పిళ్ళ' కిది యంకిత మీయబడినది. ఈ గ్రంథ 'పీఠిక' పరిశోధకులకు రసాయనప్రాయము. ఇందు, పదునెనిమిదవ శతాబ్ది పూర్వార్థములో ఫ్రెంచివారు దక్షిణభారతమున చేసిన దిగ్విజయములనుగూర్చి ప్రస్తావన కలదు. ఫ్రెంచి ఉన్నతాధికారియైన డూప్లే ప్రభావము దక్షిణదేశమున నత్యున్నతస్థాయిలో నున్నప్పుడు వ్రాయబడిన గ్రంథ మిది.

ఆనందరంగము పిళ్ళ పూర్వులనాటినుండియు వీరి కుటుంబమునకు ఫ్రెంచి ప్రభుత్వముతో సంబంధము కలదు. ఈ గ్రంథమున నా విషయము లన్నియు విపులముగ చెప్పబడెను.

కృతిభర్త కవిని రావించి, "నా పేర లక్షణ గ్రంథమున్ వివరింపుమనుచు" పలికెనట. దీని పుట్టుకకు కారణ మిది. ఈతని వంశములో ప్రసిద్ధ పురుషు డగు తిరువేంగడనాథు డిట్లు కవిచే 'పీఠిక' లో వర్ణింపబడెను.

"తీరని వ్యాజ్యము ల్తిరుగు పూనుచుయుక్తి
తీరని తగవులు దీర్చుశక్తి
ఎటువంటి దొరనైన నెంతలేదను పద్దు
ఫ్రాంసు భాషను కథల్పల్కు ముద్దు;
... ... ... ... ... ... ...
కాంచి యిల జాతిదొరల మెప్పించి మించి
కవులఁ దనియించి చుట్టాల గారవించి
అహితుల నణంచి దిక్కుల యశము నించి
ప్రబలు శ్రీ తిరువేంగడ ప్రభు కిరీటి." (పద్యము - 57)

ఈ తిరువేంగడనాథుడు బహుభాషాకోవిదుడు. వ్యవహారదక్షుడు. వేదాంత విద్యయందు దిట్ట. పాశ్చాత్యులతోగూడ మతసంబంధములైన వాదోపవాదములు చేసి, వారి మెప్పు పొందెను. ఈతని పలుకుబడినిచూచి సహింపలేక,

ఒక ఫ్రెంచి యుద్యోగి ఈతని విషయమున చెడ్డగా ప్రవర్తింపగా, నీతడు చాల ధనము వ్యయముచేసి, ఫ్రెంచి ప్రభుత్వముతో నుత్తరప్రత్యుత్తరములు నడపి, వారిచే నా యుద్యోగిని తొలగింపజేసెను. పీఠికయందీ విషయ మిట్లు కవి వర్ణించెను.

"ఇవ్విధంబున మహాయోగశాలియై *ఫ్రాంసు, హింగ్లీజు దినమార్గ యొలంద*...*పురతకేళు* మొదలయిన జాతి భాషా విశేషంబులఁ బ్రవీణతఁ గాంచి యా యా జాతి ఫాదరులకుం దెలియని గూఢార్థంబులఁ దెలియఁజేసి వారిచే మేలుమేలని పొగడికలు గాంచి యితర మతంబుల మర్మకర్మంబు లన్నియుఁ బరిశీలించి...దిగంత పరివ్యాపిత విశాలకీర్తియై ప్రవర్తిల్లు న మ్మహాపురుషుని ప్రభఁజూచి సైరింపఁజాలక *ఫ్రాంసు కుంపినీ* కార్యధురంధరుండైన *జంౘ్రాలు* పట్టంబునుంబూని దొరతనంబు సేయు ముశియనె జంౘ్రాలు కొన్ని కుచోద్యంబులు సేసి నానాఁట హెచ్చుగా మచ్చరించిన నా జాడ దెలిసి యే విధంబున నైన నితని మట్టుపెట్టెద నని యెంతయుం బంతగించి సీమకు సూత్రంబులు పన్ని లఘాంతరంబులు కర్పుచేసి విస్తారంబుగా దస్తరంబులు వ్రాయించి *ఫ్రాంసు* రాజన్యునకా *జంౘ్రాలు* దుర్వ్యాపారంబు లెఱింగించి తత్క్షణంబునం బదులు దొరను రప్పించి యాతనిచేత...వానిఁబట్టి కట్టించి కొట్టించి గిడ్డంగిన వేయించి తన మనంబునంగల చలం బంతయుం దీర్చికొని..." (వచనము - 58).

ఈ వచనములో కవి యుపయోగించిన వైదేశిక పదముల నిట్లు గుర్తింపవచ్చును.

| | | |
|---|---|---|
| ఫ్రాంసు | పరాసుభాష | **French** |
| హింగ్లీజు | ఇంగ్లీషుభాష | **English** |
| దినమార్గ | డెన్మార్కు దేశభాష | **Danish** |
| ఒలంద | వలందభాష (డచ్చి) | **Dutch—Holland Language** |
| పురతకేళు | బుడతకీచు (పోర్చుగీసు) | **Portuguese** |
| ఫాదరు | పాదరి | **Padre** |
| కుంపిని | కుంఫిణి | **Company** |
| జంౘ్రాలు | జనరల్ | **General** |

ఈ తిరువేంగడనాథుని గొప్పతనమును, కార్యదీక్షను జూచి ఆశ్చర్యపడిన వారై ప్రజ లీవిధముగా ననుకొనిరని రంగకవి 'పీఠిక' లో వ్రాసెను.

"జాతి కౌంసేలు మేజాపల్కపైఁ గొట్టి
　　　లీల నే ఘనుఁడు చెల్లించుకొనియె
సీమమట్టు ఫిరాదు చేసి దస్త్రాల్ వ్రాసి
　　　యే తంత్రి కపితాను నెత్తఁగొట్టెఁ
దగఁ ఫ్రాంసు దొరలతోఁ దగవులకేర్పడి
　　　యే దిటవరి నిర్వహించి మించెఁ
గరితోరు పట్నాలు గలుగు మంత్రులలోనఁ
　　　జెలఁగి యే మేటి ప్రసిద్ధిఁగాంచె,
సకలభాషలు మాటాడఁ జదువ వ్రాయ
నిపుణత వహించి యెవ్వాఁడు నెగడె జగతి
నట్టి తిరువేంగళేంద్రు గుణాతిశయము,
తెలమిఁ బన్నగపతికైన నెన్నవశమె." (పద్యము - 59)

ఇందు కవి యుపయోగించిన అన్యదేశ్యముల నిట్లు గుర్తింపవచ్చును.

| | |
|---|---|
| కౌంసేలు | Council |
| కపితాను | Captain |
| ఫ్రాంసు | France |

కవి, తిరువేంగడనాథు నట్లు కీర్తించిన తరువాత, ఆనందరంగపిళ్ళ యొక్క ఘనకార్యములను వర్ణించి, ఆతడు ఫ్రెంచివారికి దుబాసిగ నుండుట నిట్లు తెలిపెను.

"సీమలో నుండు ఫ్రాంసు రాజ్యేఖరుండు
పసిఁడి బెత్తంబు భూషణాంబరము లనిచి
కుంఫిని దుబాసి తన మీఁయ సొంపుమీఱ
రహిఁ చెలఁగమీఱ యానందరంగశౌరి." (పద్యము - 76)

ఆనందరంగపిళ్ళ ఫ్రెంచిరాజుచేత మిక్కిలి సత్కరింపబడినట్లు కవి ఇట్లు వర్ణించెను.

"ధరణి ఫ్రాంసుమహారాజ దత్త మత్త
కరటి ఘట ఘోటక భటాది ఘనవిభూతి
ప్రబల శ్రీమధ్వజారతరాయవిజయ
లాంఛనానందరంగ ధరావరుండు." (పద్యము - 13)

ఆనందరంగపిళ్ళ సభలో వివిధశాఖలకు చెందిన రాజోద్యోగులతోబాటు 'కుంఫిణీ' వారుకూడ నుండెడివారు. ఈ విషయమును రంగకవి ఇట్లు వచించెను.

"అసురఁ గుంఫిని వర్తకావళి యొకచోట
నొకచోటఁ దక్కు సుద్యోగిజనము." (పద్యపాదము - 14)

ఆనందరంగపిళ్ళకు ఫ్రెంచివారితో గల సాహచర్యమును, స్నేహమును కవి; "...ఫ్రాంసు మహారాజేంద్ర హృదయానుగత చరత్కుంఫినీ ప్రభువర్య సర్వకార్యనిర్వహణచణమనీషావిశేషుండును..." (వచ - 15) అను వాక్యమున వర్ణించెను. ఇదిగాక, ఆతనికి చిన్ననాటినుండియు ఫ్రెంచివారితో స్నేహమున్నదని చెప్పుటకో యనునట్లు, "ప్రభవమొందిననాఁడె ఫ్రాంసురాజేంద్రుండు బహుమానములు చాలఁ బనిచినదియు," (పద్యపాదము - 99) అని వ్రాసెను.

ఆనందరంగపిళ్ళ ఫ్రెంచివారి సాయముతో 'చందాసాహెబు'ను చెర విడిపించినట్లుగా వర్ణించి చెప్పు సందర్భమున, కస్తూరి రంగకవి పరాసువారి ప్రస్తావన నిట్లు చేసెను.

"...తనకు ఫ్రాంసురాజు సాయంబు చేయవలెనని మునుపసంబునం జింతించి, యా పుదుచ్చేరి కుంఫిని కింగార్యస్వతంత్రియుఁ దంత్రియు మంత్రియు నైన విజయానందరంగ నృపాలపుంగవునకుఁ గాగిదంబువ్రాసి తనకు సాహాయ్యంబు చేయవలెనని ప్రార్థించిన నత్తెఱంగంతయు దొరయైన ధూప్లెక్సు మహారాజున కెఱింగించి... చందాసాహెబును విడిపించి...పిక్రము విక్రమార్కులగు ఫ్రాన్సు సోల్దారులను ననహాయశూరులగు బారు సిపాయీలను గూర్చి...ఫ్రాంసు ఫౌజును ము న్నిడుకొని... మహమదల్లిఖానుని భుజంతయుము పటాపంచలై పాఱం దఱిమి... దొరయైన ధూప్లెక్సు రాజేంద్రుని చేత నా నవాబు నిజాములచేత ననేక స్తోత్రంబులంబడసి..." (వచనము - 107)

నాడు ఫ్రెంచివారి పలుకుబడి కృష్ణానది మొదలు కన్యాకుమారి వరకు వ్యాపించి యుండెననియు, దానికి కారణము విజయానందరంగపిళ్లయే యనియు కవి అతిశయోక్తులతో వర్ణించెను. ఇట్లు చరిత్రాంశములను ఫ్రాంసువారితో ఆనందరంగపిళ్ళకుగల సన్నిహితత్వమును విశేషముగా వివరించిన గ్రంథమందును; పాశ్చాత్యులనుగూర్చి పలుకునపు డుపయోగించు ఆయామాటలేగాని, పాశ్చాత్యభావప్రభావమును జూపు ఘట్టములు లేవు. నాటికింకను దేశీయులలో పాశ్చాత్య విద్యావిధానము వ్యాప్తిలోనికి రాకుండుటయే ఇందులకు ముఖ్యకారణముగా గ్రహింపవచ్చును.

ఫ్రెంచివారి ప్రస్తావనగల రెండవ గ్రంథము దిట్టకవి నారాయణకవి రచించిన 'రంగరాయ చరిత్రము'. "ఈ గ్రంథము 1790 వ సంవత్సర ప్రాంతములయందు రచింపఁబడినట్టు తెలియవచ్చుచున్నది" అని శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారు 'ఆంధ్రకవుల చరిత్ర'లో వ్రాసిరి. రంగరాయచరిత్రము, నరసారావుపేట జమీందారగు శ్రీ మల్రాజు రామారాయసింగారికి అంకితమీయబడినది. అప్పటి కప్పుడే మసల్మానులతో తెలుగు ప్రజలకు సన్నిహితత్వమేర్పడియుండుటచే, మిగిలిన ప్రబంధములలోవలెనే దీనియందును ముసల్మానుల భాషలలోని పదజాలము చాల చేరెను పదజాలమే కాదు; వారి ఆచార వ్యవహారములకును, దర్బారు మర్యాదలకును చిహ్నములైన విషయములనేకములిందు వర్ణింపబడెను. నాడు ముసల్మాను ప్రభువులు దేశీయులకిచ్చినట్లే, పాశ్చాత్యులకును బిరుదు లిచ్చుట కలదు. నిజాము, బుస్సీ కిచ్చిన బిరుదములిట్లు 'రంగరాయ చరిత్రము'లో వర్ణింపబడెను. "....అప్పు డప్పరాసులజేనికి నుత్తుంగతురంగమాతంగంబులు మొదలుగాఁ గొన్ని యుపాయనంబులు నుద్ధతుల ముల్కు, గజఫరజంగు, సిఫహో సరదారు గారనియెడి దొడ్డకితాబుల నొసంగి......"(వావిళ్ళవారి ప్రతి–1909: ఆశ్వా–1; వచ–140)

ఈ పద్ధతినే మొట్టమొదట పాశ్చాత్యులు ననుసరించిరి. ఈ విధముగ ప్రాచ్య పాశ్చాత్యులసన్నిహితత్వ మున్న కాలమది.

నారాయణ కవి పాశ్చాత్యులను వర్ణించునప్పుడును, జాతీయమైన పద్ధతిలోనే ఉపమానాదులను ప్రయోగించెను. నిజాము 'మూసాబూసీ' ని రావించి, అతనితో, "భాస్కర సన్నిభంబయిన భవ్యతర స్ఫురణాభినంద్య వర్చస్కత కల్గు నీకు నతి సాహసశీలునకుం గళింగస, న్లస్కరు భారమిచ్చి శుభలక్షణ లక్షితుఁజేసి పుత్తు", నని పల్కెను. (అశ్వా–11 పద్యము 139).

నాడు, బందరు పట్టణముననున్న ఫ్రెంచి స్థావరముల కధిపతి యైన 'గోరుదొర' ను కవి యిట్లు వర్ణించెను.

> "కుతుకంబొప్పగఁ గాంచె నందుఁ గపితు'న్గోరుందొరం' బ్రస్ఫుర
> ద్ధృతిసంరంభనిరస్త మేరుహిమవద్వింధ్యాద్రిరాణ్మందరున్
> శతకోటిప్రసవాస్త్ర సుందరు, రమాచంద్రాననా- పాదప
> ద్మతులాకోటి ఝుళంఝుళారవయుతోదంచన్మణీమందిరున్"
>
> (అశ్వా 2; పద్య.-114)

ఈ 'కపితున్ గోరుదొర' (Captain) నే కవి యింకొక చోట, "బందరు పట్టణాధిపతి భాసురభోగపురందరుండు, గోరుందొరగారు........" అని వర్ణించెను. ఈ వర్ణనలలోని కవిసమయము లన్నియు, నాటి కవులపై పాశ్చాత్యసాహిత్య ప్రభావము సోకలేదని తెలియజేయుచున్నవి. వారి మాటలు, వారిపేరులు, వారి ఉద్యోగపు హోదాలు మాత్రము తెలుగునాట పరిచితము లగుటచే, కవి వాని నన్నింటిని యథాతథముగ వాడెను.

యుద్ధమునకై బుస్సీ బయలుదేరిన విధమును వర్ణించు ఘట్టమున, కవి ఫ్రెంచి సేనానాయకుల నామముల నిట్లు పేర్కొనెను.

> "మూసాశబ్దము పూర్వమందు మెలగన్ ముఖ్యుల్ సజాతీయులా
> లాసూ, మర్తెను, దొమ్మితీరు, విపులాం, లస్సేను, కుప్లాం, పవే
> మాసూ, నాములు వానిఁ జేరి రతిదుర్మానుల్ జిరాకూర్పుమి
> న్మాసన్నంపు బనాతు పింజరుల సొన్నాపాలకీ లెక్కచున్."
>
> (ఆశ్వా-11; పద్య-146)

ఇక్కడ 'మూసా' అనునది Monsieur అను ఫ్రెంచిపదముయొక్క భ్రష్టరూపము. ఇది ఫ్రెంచిభాషలో పురుషుల నామములకు ముందుండును గనుక నే కవి "మూసాశబ్దము పూర్వమందు మెలగన్" అని వ్రాసెను. ఇందు పేర్కొనబడిన ఫ్రెంచివీరుల నామముల భ్రష్టరూపములనుబట్టి, వారిలో కొందరిని నేడు మనము గుర్తింపవచ్చును—బూసీ (M. Bussy); మర్తెను (M. Martin); కుప్లాం (M. Conflans); మాసూ (M. Moracin).

ఈ పేరులలో కొన్ని ద్వితీయాశ్వాసమున మరల మరల ప్రయోగింపబడినవి. అందు 'మర్తెను' అనునది—"భీమప్రతీకాశు మూ, సామర్త్యేను సమాఖ్యునిన్..."(పద్య-124)అనియు, "మంత్రివెంట మ, ర్తెనుఁడని జాతివాని..." (పద్య-127) అనియు ప్రయోగింపబడినది. 'మూసా బూసీ'యనునది చాల సారులు ప్రయోగింపబడుటచే ఆ యా యుదాహరణముల నన్నింటిని ఈయక ఒక్క ఉదాహరణము నిచ్చుచున్నాను. "మూసాబూసీవారి దు, బాసీ లక్ష్మణ సమాఖ్యుఁ బరగు" (పద్య-61) నట్టివాడట. ఇందు ఫ్రెంచివారి దుబాసీ పేరు పేర్కొనబడుటచే నీ పాదము ముఖ్యమైనది.

పరాసువీరుల హోదాలను తెలుపు నీ క్రింది పద్యములో, పరాసు భాషా పదములు రమణీయముగ కూర్పబడినవి.

"సమరోజ్జృంభిత శౌర్యధుర్యులగు సార్జంతుల్, మయూరుల్, కుమం
దములన్ పీరులు సోలుదాదులు సుబేదారుల్ మొదల్గల్గు సై
న్యము లాత్మీయులు గొల్వ నుద్ధతుల ముల్కాఖ్యామహాఖ్యాతి మ
త్సముదగ్ర ప్రతిభాపిఖాని యగు మూసాబూని యుల్లాసియై."

(ఆశ్వా-1 ; పద్య-147)

ఇటులనే వచనభాగమునను, ఇట్టి శబ్దములు చాల కలవు. "ఇవ్విధంబున నానావిధ సేనానాయకుల సమకట్టి యం దగ్రభాగంబున లాడూఖాను కుమందమును, బిటింది దెస జంద్రాల్మహమ్మదు హుస్సేను మయూరును...." (ఆశ్వా-3 ; వచ - 26)

పరాసుసేనలు పిస్తోలు, ఫిరంగుల నుపయోగించి పోరినట్లు కవి వ్రాసెను.

"సారాహంకృతిమన్నిరంకుశగతిన్ సంగ్రామ రంగస్థలిన్
రారాజ న్నవ విక్రమార్కు లనఁగా రాజిల్లువా రెందఱే
పేరుల్గాంచి వెడంద రొమ్ములపయిన్ పిస్తోల్తుపాకీలతో
శూరాగ్రేసరులైన మూసలు పరాసుల్ వచ్చి రుగ్రాకృతిన్."

(ఆశ్వా-3 ; పద్య-12)

ఇం దుపయోగింపబడిన పదముల కన్నింటికి, ఇంచుమించుగా, 'బ్రౌణ్య మిశ్రభాషానిఘంటువు' లో వివరణము గలదు.

సార్జంతులు—ఇది ఇంగ్లీషులోని Sergeant అను పదము. దీనిని, ఫ్రెంచి ఉచ్చారణ ననుసరించి కవి ప్రయోగించిన ట్లున్నది.

"సార్జంటు, సార్జంతు. or సార్జెంతువు— N. S. Sergeant. జాతి బంట్రోతు. Bobbili. 3.106." (Page 122)

మయూరులు—ఇది ఇంగ్లీషుభాషలోని Major అను పదమునకు సరియైన ఫ్రెంచి మాట. ఫ్రెంచి ఉచ్చారణను అనుసరించియే తెలుగులో 'మయూరు' అయినది.

"మయూరు N. S. (French, Majeure) Major in the army. Ranga Rao. 1.157 సమరోజ్జృంభిత శౌర్యధుర్యులగు సర్జంతుల్ మయూరుల్ కుమందములున్ పీరులు సోలుదాదుల్గు." (Page 88)

కుమందములు—ఇది ఫ్రెంచిభాషలోని Commandant అను మాట. ఇంచుమించుగా దీని ఫ్రెంచి ఉచ్చారణనే తెలుగుకవి అనుసరించెను.

"కుమందాన్ N.S. (A French Word) 'Le Commandant' మొనగాడు దీనికే 'కుముందాన్' అను పాఠాంతరము కలదు. "కుముందాన్ N. S. (French Word) Le Commandant. A Leader or Captain. మొనగాడు" (Page 27)

నేటి విశాఖపట్టణము జిల్లాలోని విజయనగరములో గల కోటలోని సైనికాధికారికి 'కుముందాన్' అని పేరు. ఇప్పటికిని ఆపేరు వాడుకలో నున్నది. విజయనగర సంస్థానమునకు, పెదవిజయ రామగజపతిరాజుగారి కాలమున-వీరే ఫ్రెంచివారి సాయముతో 1757 లో బొబ్బిలిని సాధించినవారు-ఫ్రెంచివారితో గల సన్నిహితత్వమునకు స్మృతిచిహ్నముగా ఈ పదము నేటికి మిగిలి యున్నది.

సోలుదాదులు— ఇది ఇంగ్లీషుభాషలోని Soldier అను పదమునకు ఫ్రెంచిమాట (Soldat). దీని ఫ్రెంచి ఉచ్చారణనే, ఇంచుమించుగా తెలుగుకవి అనుసరించెను.

పిస్తోల్— ఇది ఇంగ్లీషులోని Pistol అను మాటకు ఫ్రెంచిమాట (Pistolet). దీని ఫ్రెంచి ఉచ్చారణనే తెలుగుకవి ఇంచుమించుగా అనుసరించెను.

ఈ గ్రంథములో ఫ్రెంచివారికి పర్యాయపదముగా 'పరాసు' శబ్దము విరివిగా వాడబడినది. ఈ శబ్దమే కాక 'ఫరంగు' శబ్దము కూడ చాలచోట్ల కవి వాడెను.

బ్రౌన్యామిశ్రభాషానిఘంటువులో ఫరాసు, ఫరంగి శబ్దముల నిర్వచనమిట్లీయబడినది. "ఫరాసుడు N. S. From Farensis. A French - man. ఫ్రాంసువాడు, ఫ్రెంచివాడు."

"పరంగి N. S. Farangi, Plu. పరంగులు or పరంగీలు. Europeans జాతివాండ్లు." (Pages - 66, 67)

పైని పేర్కొనబడిన పాశ్చాత్యభాషాపదములు కాక; మిగిలిన వర్ణనలు, భావప్రకటనపద్ధతులు, ఉపమానములు, కవిసమయములు మొదలగున వన్నియు దేశీయములేకాని, విదేశీయములైనవి కానే కావు. కవి పరాసువారిని గాని, ముసల్మానులను గాని వర్ణించునప్పుడును సంప్రదాయసిద్ధములైన పద్ధతులనే యనుసరించెను. యుద్ధవర్ణనల యందును, సైనికుల పరాక్రమాదులను వర్ణించునప్పుడును, కవి భారతీయోపమలనే ప్రయోగించెను. ఫరంగుల ఫిరంగులను గూర్చి వ్రాయునప్పుడు నారాయణకవి ఇట్లు మనోహరముగా శబ్దాలంకారములను వాడెను.

"అంగభవారి భూరి నిటలాంబక వహ్నికణంబు లట్టు లు
ప్పొంగుచు గుండు ప్రాలు నెడ భూ గగన స్ఫుటనాకఠోరతా
భంగుర కాలమేఘ రవ భైరవరావము లుగ్గడింప కా
రంగులు మా ఫరంగుల ఫిరంగుల రంగులు మీ రెఱుంగరే."

(ఆశ్వా - 2; పద్య - 43)

ఇట్లు సర్వవిధముల వర్ణనలు జాతీయపద్ధతినే నడచెను. ఇందువలన నాటి కింకను ఆంధ్రసాహిత్యముపై పాశ్చాత్యభాషాప్రభావము పడినంతగా, భావ ప్రభావము పడలేదని తెలియుచున్నది. రంగరాయచరిత్రను గూర్చి కవి— స్వర్గములో నారదుడు దేవేంద్రునకు చెప్పి; దానిని చదివినను, వినినను సంపత్ప్రద మగునని పలికి నట్లు వ్రాసినా డన్నచో, సాహిత్యముపై సంప్రదాయము యొక్క బలము—విషయ మెట్టిదైనను—సడలలే దని తెలియుచున్నది.

## ఇంగ్లీషువారు

'కేప్ ఆఫ్ గుడ్ హోప్' (Cape of Good Hope) మార్గమున వచ్చి భారతభూమిపై మొట్టమొదట అడుగుపెట్టిన ఇంగ్లీషువాడు 'సొసైటీ ఆఫ్ జీసస్' (Society of Jesus) నకు చెందిన 'ఫాదర్ స్టీవెన్స్' (Father Stevens) అని చాలమంది పరిశోధకుల అభిప్రాయము. ఈతడు ఏప్రిల్ 4 వ తేదీ, 1579లో లిస్బన్ నుండి ప్రాగ్దేశములకు బయలుదేరెను.[41] ఈతడు భారతదేశమునకు వచ్చిన తరువాత మహారాష్ట్రిభాషలో మంచి పాండిత్యమును సంపాదించి, అం దొక కావ్యము వ్రాసెను. ఈతడు 'రోమను కేథలిక్కు' అగుటచే నాటి ఇంగ్లండులో ఈతనికి స్థానము లేకపోగా, గోవాలో తనకు మతస్వాతంత్ర్య ముండునని బయలుదేరి వచ్చెను గోవా వచ్చిన వెంటనే ఆతడు మొట్టమొదట ఆలోచించి నది మతమునుగూర్చి కాదు, భారతదేశములో వర్తకమునకు గల అవకాశములను గురించి.[42] ఈ విషయము, ఆతడు గోవాలో అడుగుపెట్టిన వెంటనే తన తండ్రికి వ్రాసినజాబువలన తెలియుచున్నది.

---

41. "On April 4, 1579, Father Stevens of the Society of Jesus sailed from Lisbon for the East Indies. He was the first English man known to have reached India."

—Dennis Kincaid.

(British Social Life in India. London. 1939; Prologue. Page - 1)

42. "One would have imagined that for some time the Jesuit enthusiast would be too much moved by all that Catholic splendour to have thought of

ఈ ఉత్తరము ఇంగ్లండులోని సాహసుల హృదయములలో ఆశను ప్రేరేపించెను. ధనాశాపరులైన ప్రముఖ వర్తకులు కొందరు ఈ సాహసులకు డబ్బు సాయము చేయుట కంగీకరించిరి. ఆ రోజులలో ఇంగ్లండు, ఎలిజబెత్తు I రాణి పరిపాలనక్రింద సుభిక్షముగ నుండెను. సముద్రముపై ఇంగ్లీషువారిదే పైచేయిగ నుండెను. దేశదేశములతో ఇంగ్లీషువర్తకులు వ్యాపారముచేసి ధనరాశులను ఇంగ్లండునకు చేర్చుచుండిరి. ఈ విధముగా సమయము అనుకూలముగ నుండెను.

ఈ సావకాశమును వినియోగించుకొనుటకు, ఇద్దరు ప్రముఖ వర్తకులు (Richard Staper, Sir Edward Osborne) సమకట్టిరి. ముందుగా మొగలు చక్రవర్తి అయిన అగ్బరు రాజసభకు, ఇంగ్లండు రాణి అయిన ఎలిజబెత్తుయొక్క 'సుహృల్లేఖ'తో ఒక రాయబారమును పంపుటకు నిశ్చయించుకొనిరి. ఇది 1583 నాటిమాట. ఈ లేఖను తీసికొని నలుగురు (John Newbery, Ralph Fitch, William Leedes, James Storey) 'టైగర్' (Tyger) అను ఓడమీద బయలుదేరిరి. ఈ ఓడ ఆ రోజులలో 'లండను-ట్రిపోలీ'ల నడుమ తిరుగుచుండెడిది. వీరీ విధముగ పోవుట ప్రజలలో చాల కుతూహలమును కలిగించెను. ఈ కుతూహలమునే, ఇరువది సంవత్సరముల తరువాత, షేక్స్పియరు (Shakespeare) తన 'మేక్‌బెత్' (Macbeth) నాటకమున మొదటి మాంత్రికురాలు (Witch) పలికిన ఈ క్రింది మాటలలో వ్యక్తముచేసెను—

"Her husband's to Aleppo gone
Master O' the Tyger."

వీరు నలుగురు గోవాలో దిగిన వెంటనే, అచ్చటి పోర్చుగీసువారు, వీరు 'రోమను కేథలిక్కు' శాఖకు చెందినవా రగుదురో కారో యని పరీక్షించిరి. వీరికి 'స్టీవెన్స్' యొక్క సాయము లభించుటవలన, ఆ పరీక్షలో కృతార్థులై బ్రతికి బయటపడిరి.[43] వీరిలో 'లీడ్స్' గోవాలోనే ఒక స్త్రీని వివాహమాడి,

---

mundane concerns; yet if we can judge by the letter written to his father soon after his arrival, almost the first thought that occurred to him was that here in India, was a fine market for English trade."

(Ibidem; Page - 2.)

43. "They were under arrest and were 'examined whether they were good Christians', by which, of course, was meant good Catholics. They were ready to profess any creed and Stevens lent his support to their claim to be Catholics, though he must have known very well they were not."

(Ibidem; Page - 2.)

వ్యాపారమువలన ధనముసంపాదింప మొదలిడెను. 'స్టొరే' మొగలుచక్రవర్తి సభలో రత్నవర్తకునిగ చేరెను. 'న్యూబెరి' భారతదేశమునుండి పర్షియా పోయెను 'ఫిట్చ్' మాత్రము, తూర్పు దేశములలో సంచారము చేసి చేసి 1591 లో మరల ఇంగ్లండు చేరెను.[44]

'ఫిట్చ్' తిరిగివచ్చి చెప్పిన మాటలవలన కలిగిన ప్వగుణీకృతోత్సాహముతో, సెప్టెంబరు 24 వ తేదీ, 1599 వ సంవత్సరములో 'ఈస్ట్ ఇండియా కంపెనీ' (East India Company) స్థాపింపబడెను. నామమాత్రముగ స్థాపింపబడిన ఈ కంపెనీ; ఎలిజబెత్తు రాణి యొక్క 'పట్టా' (Charter) క్రింద 1601 నుండి మాత్రమే వ్యాపారము చేయగలిగెను.

1607 లో 'విలియమ్ హాకిన్స్' (William Hawkins) అను నావికుడు జహాంగీరు చక్రవర్తి యొద్దకు పంపబడెను. సూరత్‌లో గిడ్డంగిని నిర్మించుకొనుటకై చక్రవర్తి యొక్క అనుజ్ఞను సంపాదింపవలెనని ఆతడెంతయో ప్రయత్నించెను. కాని, పోర్చుగీసు జెసూట్ ఫాదరులకు రాజసభలో విశేషమైన పలుకుబడి యుండుటవలన, హాకిన్స్ యొక్క కోరిక నెరవేరలేదు.

1609 లో మొదటి జేమ్సు ఇచ్చిన 'పట్టా' వలన కంపెనీకి బలము బాగుగా చేకూరెను. 1615 లో 'సర్ థామస్ రో' (Sir Thomas Roe) జహాంగీరుసభకు మొదటి జేమ్సు యొక్క రాయబారిగా పోయి, రాజనీతిని ప్రదర్శించి సూరత్‌లో గిడ్డంగులను ఇంగ్లీషువారు కట్టుకొనుటకు అనుజ్ఞ పొందెను. దీనివలన ఇంగ్లీషువారివర్తకము వృద్ధిపొందుట మొదలుపెట్టెను. మొగలుదర్బారునుండి తిరిగివచ్చిన తరువాత 'సర్ థామస్ రో' తన అనుభవములనన్నింటిని గ్రంథరూపమున ప్రచురించెను. అందు మొగలు చక్రవర్తిని వర్ణించుచు, ఆత డిట్లు వ్రాసెను. "High on a gallery, with a canopy over him and a carpet before him, sat in great and barbarous state, the great Mogul." ఈ వాక్యమును చదివిన'మిల్టన్' (Milton) మహాకవి తన మహాకావ్యములో సైతాను (Satan) ఈ విధముగనే ఆసీనుడై యున్నట్లు వ్రాసెను.

> "High on a throne of royal state, which far
> outshone the wealth of Ormuz and of Ind"

---

44. Early English Travellers in India By Sir W. Foster. (1921)

ఆ రోజులలో ఇంగ్లీషు ప్రజలు ప్రాగ్దేశముల-ముఖ్యముగా భారతదేశము యొక్క సంపదలను స్మరింపుచు దినములు గడపుచుండిరి. నాటికవులు భారత దేశమునుగూర్చి యాత్రికులు చెప్పు కథలను స్వీకరించి రచనలు కావించు చుండిరి.[45]

1600 మొదలు 1612 వరకు కంపెనీ, ప్రత్యేకములైన వాణిజ్య యాత్రలను ప్రోత్సహించెను. ఇందువలన స్పర్ధలు పెరిగి వ్యాపారమునకు దెబ్బ తగులుచుండెను. మొదటి 'స్టూవార్టు' (Stewart) ప్రభువులు స్వార్థ పరులై 'కంపెనీ' యొక్క మేలు నంతగా కోరకుండుటచే, ఈ కలహములను పోగొట్టుటకు ప్రయత్నింపలేదు ఇంతియేగాక వారు, పలుకుబడిగల కొందరు వ్యక్తులకు, ప్రాగ్దేశములతో వర్తకము చేయుట కనుమతి ఇచ్చిరి. దీనివలన నష్ట మధికమై కంపెనీవారు వ్యాపారవిషయమున నిరుత్సాహపడజొచ్చిరి.

మొదటి ఛార్లసు తరువాత ఇంగ్లండును పరిపాలించిన 'క్రాంవెల్' (Cromwell) కంపెనీ చేయుచున్న వర్తకము, దేశక్షేమమునకును, ఆర్థికాభి వృద్ధికిని ఎంత ఆవశ్యకమో గుర్తించి; 1654 లో డచ్చివారి యొద్దనుండి–అంబోయనాలో ఇంగ్లీషువారిని చంపినందులకు - నష్టపరిహారమును వసూలు చేయుటయేగాక, 'తూర్పిండియాకంపెనీ' పరిస్థితులను చక్కదిద్ది, స్పర్థలను పోగొట్టి 'వర్తక సంఘము'ను నవీనముగ తీర్చిదిద్దెను.[46]

'క్రాంవెల్' తరువాత పరిపాలించిన 'స్టూవార్టు' రాజులు మొదటి 'స్టూవార్టు'ల వలె గాక, కంపెనీ విషయమై ఎక్కువ శ్రద్ధ చూపిరి. వీరిలో ముఖ్యముగా రెండవ ఛార్లెసు 1661, 1669, 1677, 1683 సంవత్సరము లలో ఇచ్చిన 'పట్టా' (Charter) ల మూలమున కంపెనీ యొక్క ఆర్థికస్థితి మిన్నుముట్టెను. రెండవ జేమ్సు 1686 లో ఇచ్చిన 'పట్టా' వలన కంపెనీకి

---

45. డ్రైడన్ (Dryden) కవి 'ఔరంగజీబ్' (Aurangzeb) అను నాటకమును 1675 లో వ్రాసెను. దీనిలో చరిత్రకు ప్రాముఖ్యము తక్కువ. నాటి ఇంగ్లీషుప్రజలకు భారతదేశ విషయమున గల విచిత్రాభిప్రాయముల కిది నిదర్శనము.

46. "His (Cromwell's) union of conflicting Anglo-Indian interests in 1657 anticipated the great Parliamentary fusion of those interests fifty years later. Under his charter the East India Company transformed itself from a feeble relic of the mediaeval trade-guild into the vigorous forerunner of the modern Joint Stock Company."

—Hunter.

(A History of British India. II; 1912. Page - 141)

రాజ్యమునకు గల హోదావచ్చెను. ఆ రోజులలో కంపెనీ, తన 'షేరుహోల్డర్సు' (Shareholders) నకు నూటికి ఇరువదియైదు వంతున 'డివిడెండు' (Dividend) ఇచ్చెడి దన్న కంపెనీయొక్క భాగ్యము తెలియగలదు. సాలునకు ఇంత లాభము పంచి యిచ్చెడి కంపెనీ నాడు లేనేలేదు.

కాని, ఈ భాగ్యము చిరకాలము నిలువలేదు. ఈ కంపెనీ సంపాదించుచున్న లాభము, ఇంగ్లండులోని కొందరు పెద్దలకు అసూయాజనక మయ్యెను. దానికితోడు భారతదేశములోని కంపెనీ ఉద్యోగులు మొగలాయి చక్రవర్తి అయిన ఔరంగజేబుతో కలహము తెచ్చుకొనిరి. దానితో షయిస్తఖాన్ ఇంగ్లీషువారి గిడ్డంగులను నాశనముచేసెను. సూరత్‌లో కూడ వీరి కిట్టి స్థితియే పట్టెను. 1689 లో మొగలాయీలు బొంబాయిని కూడ ఆక్రమించిరి. ఈ స్థితిలో ఇంగ్లీషువారు 1690 లో ఔరంగజేబుతో సంధిచేసికొనిరి. ఈ కంపెనీని ద్వేషించుచున్న పెద్దలకు, భారతదేశములోని పరిస్థితు లీ విధముగా, కంపెనీని విమర్శించుటకు సాయపడెను.

ఈ విమర్శకులు క్రొత్త ఇంగ్లీషు కంపెనీ నొకదానిని స్థాపించి (1698) వాణిజ్యము చేయుటకు ప్రభుత్వముయొక్క అనుమతి పత్రమును పొందిరి. ఈ పోటి ఇరువురకును నష్టముకాగా 1702 లో ఒక అంగీకారమునకు వచ్చిరి. 1708 లో ఆ అంగీకారమే, పార్లమెంటుయొక్క అనుమతిపై శాసనమైనది. ఈశాసనమువలన ఉద్భవించిన కంపెనీ, నూరు సంవత్సరములనుండి ఇంగ్లండులో చెలరేగుచున్న వాదములను తుదముట్టించి, ఇంగ్లీషువారి వాణిజ్యమును విజృంభింపజేసెను. నాటినుండి ఇంగ్లీషు కంపెనీ 1857 వరకు వెనుకచూపే లేకుండ అభివృద్ధి పొందెను.

ఇంగ్లీషువారు క్రమక్రమముగా భారతదేశము నాక్రమించుకొన్నను; ఆంధ్రదేశములో వారి చరిత్ర ఎటుల విస్తరించినదో గ్రహించుట; మనపై వారి ప్రభావమును, మన సాహిత్యముపై వారి సాహిత్య ప్రభావమును అర్థముచేసికొనుటకు ఆవశ్యకము. భారతదేశము నంతను ఆక్రమించుకొనిన తరువాత వారి రాజనీతి, దేశమున కంతకును సంబంధించినదై యుండెను. ప్రారంభ దినములలో అటులగాదు. వారి 'నీతి' వారాక్రమించుకొనుచున్న ప్రదేశములను బట్టియు. వారు వ్యవహరించుచున్న ప్రజలను బట్టియు, ప్రారంభ దినములలో మారుచుండెడిది. వారెన్ని సారులో దక్షిణమున మొగలాయి ప్రభుత్వమును ధిక్కరించుచు, ఉత్తరమున ఆ ప్రభుత్వముతో రాయబారములను

నడపుటకలదు. మిగిలిన పాశ్చాత్యదేశముల కంపెనీల విషయిముననుు వారి 'నీతి' ఇట్టిదియే. కనుక, ఆంధ్రదేశము నంతను పూర్తిగ తమ వలుబడిలోనికి తెచ్చుకొనునంతవరకు, ఆంధ్రదేశములోని ఆంగ్లేయుల చరిత్రను పరిశీలింపవలసి యున్నది.

భారతదేశముయొక్క తూర్పుతీరమున ఇంగ్లీషువారు మొట్టమొదటి గిడ్డంగి మచిలీపట్టణమున 1611 లో స్థాపించిరి. అప్పటి కప్పుడే పోర్చుగీసు వారు, డచ్చివారు మచిలీపట్టణముయొక్క ప్రాముఖ్యమును గుర్తించి వాణిజ్యము చేయుచుండిరి. ఇంగ్లీషువారిచ్చట గిడ్డంగి నెలకొల్పిన కొలది కాలములోనే, తూర్పుతీరమున ఇంగ్లీషువారు తరువాత స్థాపించిన అన్ని గిడ్డంగులకంటె, మచిలీపట్టణములోని గిడ్డంగియే అగ్రస్థానమును పొందెను. ఇటులపొందుటయేగాక వారి వాణిజ్యమున కది కేంద్రమయ్యెను. ఈ గిడ్డంగి యొక్క ఉనికిని తెలియజేయుచు 1611 లోను 1612 లోను వ్రాయబడిన రెండు లేఖలవలన నాటి మచిలీపట్టణముయొక్క పరిస్థితులు మనకు తెలియును. 'లూకస్ యాంథినిస్' (Lucas Antheuniss) అనువాడు పెద్దపల్లినుండి ("Pettapollee") మచిలీపట్టణము లోనున్న 'పీటర్ విలియమ్స్' (Peter Williams) అనువానికి వ్రాసిన ఉత్తరములవి.[47]

1611 వ సంవత్సరము జనవరి నెలలో 'తూర్పిండియా కంపెనీ' డైరెక్టరులు, గ్లోబ్ (Globe) అనుఓడలో కెప్టెన్ హిప్పన్ (Captain Hippon) అనువానిని 'కోరమండలకోస్తా' ప్రజలతో వాణిజ్యము చేయుటకై పంపిరి. ఆ ఓడలోనే 'పీటర్ విలియమ్సన్ ఫ్లోరిస్' (Peter Williamson Floris) అను డచ్చివాడు కూడ ప్రయాణముచేయుచుండెను. భారతదేశములోని డచ్చి ఉద్యోగులతో సంభాషించుటకును, వ్యాపారమునకు సంబంధించినపనులను చేసిపెట్టుటకును, ఇంగ్లీషువారితనిని తమ కొలువులో చేర్చుకొనిరి. వీరిరువురు మొట్టమొదట 'ప్రళయ కావేరి' యొద్దదిగి వ్యాపారమునకు వీలగునేమో పరిశీలించిరి. కాని, అచ్చటి డచ్చివారు వీరిని చేరనీయలేదు. అచ్చటినుండి

47. "The very earliest notice of this factory (Masulipatam) is to be found in two letters addressed by Lucas Antheuniss, at Pettapollee (probably Peddapalli) to Peter Williams, a factor at Masulipatam, in which the particulars of certain petty mercantile transactions are mentioned. These letters are dated respectively December 29, 1611 and Jannuary 8, 1612."

—Henry Morris.

('The Godavery District'; London. 1878; Page - 177.)

'గ్లోబ్' ఓడ మచిలీపట్టణమునకు పోయెను అచ్చటినుండి నూలుబట్టలు, సన్నని వస్త్రములు తీసికొని 'బాంటమ్' (Bantam) నకును 'సయామ్' (Siam) నకును పోయెను ఆరోజులలో 'జావా' (Java) లోని 'బాంటమ్' ఇంగ్లీషు వారిచేతులలో నుండెను. 1682 వరకు ఇగ్లీషువారి స్వాధీనములోనే అది యుండెను. 'గ్లోబ్' ఓడ మరల 1613 లో మచిలీపట్టణమునకు వాణిజ్యమునకై వచ్చెను. ఈ విధముగా ప్రతి సంవత్సరము వచ్చిపోవుచు, ఆ ఓడ విశేషముగా వ్యాపారము చేసినది, ప్రజలందరు సహకరించినను, డచ్చివారికి మాత్రమిది ఇష్టముగా లేదట ! "The Hollanders did all they could to obstruct these Favours, but their influence was not great enough"[48] అనిఫ్లోరిస్ వ్రాసెను.

కాని, డచ్చివారు ఇంగ్లీషువారిని వేధించుట మానలేదు. మచిలీపట్టణమున కధికారులైనవారు, ఇంగ్లీషు వర్తకులకు పీడింపజొచ్చిరి. దీని కంతకును కారణము డచ్చివారి ప్రోత్సాహమే అని ఇంగ్లీషువారికి తెలియును. కాని ఏమిచేయగలరు! ఈ స్థితిలో మచిలీపట్టణములో నుండుటకంటె, ఇంకొకచోట క్రొత్త గిడ్డంగిని నిర్మించుకొనుట మంచిదని తోచి; 1623 లో జరిగిన అంబోయనా హత్యలతరువాత; నెల్లూరు జిల్లాలోని 'ఆర్మగామ్' (Armagon) నకు 1628 లో వెడలిపోయిరి. ఇచ్చట 1625 లోనే ఒక గిడ్డంగి నిర్మింపబడి యుండెను. ఇది 'ఆరుముగ మొదలియారు' అనునాతని పేర పిలువబడినది. ఈతడు మొట్టమొదట ఇంగ్లీషువారు ఈ ప్రాంతమున గిడ్డంగిని కట్టుకొనుటలో విశేషముగ సాయము చేసెనట! దీనికి సమీపమున నున్న 'దుగరాజు పట్టణము' పేర, 'ఆర్మగామ్' ను 'దుగరాజు పట్టణ' మని పిలుచుటయు కలదు[49]. కాని, వాణిజ్యమునకు మచిలీపట్టణమంత అనుకూలముగ 'ఆర్మగామ్' లేకుండుటచే, ఇంగ్లీషు వర్తకులు మరల మచిలీపట్టణమునకు రావెంచి, మచిలీపట్టణము గోల్కొండ నవాబు రాజ్యములోనిది గనుక, ఆ నవాబునకు తమ విషయమును విన్నవించుకొనుచు అర్జీ పంపుకొనిరి. నవాబు దయతలచి 1632 వ

48. "Collection of Voyages and Travels"—Translated from the Dutch. Vol. I; (Page - 443)

49. "It is said to be named after one Ārumuga Mudaliyār by whose assistance one of the earliest English settlements on the Coromandel coast, consisting of a factory defended by twelve pieces of cannon, was established in 1625......The place is now sometimes called Dugarāzupatnam from another village where open communication with the sea ean be maintained."

(Imperial Gazetteer of India; Provincial Series, Madras I; 1908. Page - 364.)

సంవత్సరము నవంబరు నెలలో, ఇంగ్లీషువారి కోరికలను తీర్చెడి 'ఫర్మానా'ను ఇచ్చెను. పర్షియానుండి ఇంగ్లీషువారు దిగుమతిచేసెడి గుఱ్ఱములను, ముందుగా తన కమ్మవలెననునదియే, ఆ నవాబపేక్షించిన ప్రతిఫలము. ఈ 'ఫర్మానా' తో బాటు, ఇంగ్లీషువర్తకులను బాధింపరాదను ఆజ్ఞకూడ, నవాబు మచిలీపట్టణము రాజునకు పంపెను. ఈ 'ఫర్మానా' ఇంగ్లీషువారికి వ్యాపారవిషయమున మిక్కిలి మేలుచేసినదగుటచే, దీనిని 'బంగారు ఫర్మానా' (Golden Firman) అని వ్యవహరించెడివారు.

కాని ఈ 'ఫర్మానా' కూడ ఇంగ్లీషువారి 'ఆశ' ను పూర్తిగ తీర్పలేదు. కనుక వారు నవాబునకు మరియొక అర్జీ పెట్టుకొని, ఇంకను తమకు కొన్ని హక్కులను, భూములను ఈయవలసినదని ప్రార్థించిరి. ఆ నవాబు 1634-'35 లో మరియొక 'ఫర్మానా' ను ఇంగ్లీషువారికిచ్చెను. దీనివలన వీరికి 'వీరవాసరము' ("Verasheroon") లో 'ఏజెన్సీ' ని ఏర్పాటుచేసికొనుట కవకాశము కలిగెను. వీరవాసరములో ముతుకబట్టలు కొని, వానిని లాభమున కమ్మవచ్చునని ఇంగ్లీషువర్తకుల ఊహ. 1650 నాటికి వీరవాసరములో వీరి 'ఏజెన్సీ' ఏర్పడినది.

గోల్కొండ నవాబుయొక్క మంచితనమువలన మచిలీపట్టణములోను, తత్పరిసరప్రాంతములలోను ఇంగ్లీషువారికి పరిస్థితు లనుకూలముగ నున్నను, వారికి పూర్తిగ తృప్తికలుగలేదు. ఇందులకు కారణము మచిలీపట్టణములోని అధికారులు ఇంగ్లీషువారికి పూర్ణముగ సుముఖులు కాకుండుటయే. "దేవుడు వరమిచ్చినను పూజారి వరమీయడ"న్నట్లు; నవాబు 'ఫర్మానా' ఇచ్చి సమస్త సౌకర్యములను ఇంగ్లీషువారికి కలిగింపవలసినదని శాసించినను, మచిలీపట్టణములోని నవాబు తాబేదారులు, డచ్చివారి మాటలు వినుచు ఇంగ్లీషువారి హక్కులను పూర్ణముగ మన్నింపరైరి. ఈ బాధలుపడలేక, ఇంగ్లీషువారు తూర్పుకోస్తాలో ఇంకొక రేవునకై ప్రయత్నములు చేయజొచ్చిరి. ఆ ప్రయత్నమే 'ఫోర్టుసెయింటు జార్జి' నిర్మాణమునకు మూలమయ్యెను.

17 వ శతాబ్దియొక్క ఉత్తరార్థమున మచిలీపట్టణము వాణిజ్యవిషయములో అత్యున్నతస్థితియం దుండెను. నాటి ప్రజల జీవితమును గూర్చియు, పాశ్చాత్యుల వాణిజ్యమునుగూర్చియు తెలిసికొనుటకు, 'ఫెర్నాండెజ్ నవరెట్' (Fernandez Navarette) అను క్రీస్తుమతప్రచారకుడు వ్రాసిన వ్రాతలు ముఖ్యమైనవి. ఈతడు 1670లో మచిలీపట్టణమునకు వచ్చెను. ఈతనికి వాణిజ్యముతో

ఏవిధమైన సంబంధము లేదుగనుక ఈతని మాటలకు విలువ ఎక్కువ. ఆతడిట్లు వ్రాసెను. "The City Masulipatam is famous all along the coast of Coromandel... .. ..The English and Dutch, and at present the French, have erected Factories there. Some years ago, besides these, the Danes had one too. Some Portuguese, Mungrels, and Blacks, who are Catholicks, live there, and have a little Church, where there was a Father of the order of St. Augustin. Some English and Dutch, who have discharged themselves from their Companies, have settled there, and live with their Families ........ All the Country abounds in Wheat, Rice, Sheep, Hens, Geese, Fish and Fruit, all at reasonable rates. The city is singular, and there being such a diversity of Natives, there falls out something new every day among Persians, Armenians, Moors, etc. That city resembles Babel, in the variety of Tongues, and differences of Garbs and Customs, but I liked the natural inclinations of them all. I sometimes went to the Church, which was a considerable distance from the Factory, met several People by the way, and they were all courteous and civil"[50]

ఇంత అభివృద్ధిలో మచిలీపట్టణమున్నను, ఇంగ్లీషు వర్తకులు వారి కేంద్ర కార్యాలయమును 'ఫోర్టుసెయింటు జార్జి'కి మార్చవలెనని తలంచుటకు గల కారణములలో, డచ్చివారి పోటియేగాక ఇంకొకటికూడ కలదు 1648, 1649 లలో బీజపూరు, గోల్కొండ నవాబుల నడుమ యుద్ధము వచ్చెను. ఇందువలన మచిలీపట్టణము, దాని పరిసరములలో బట్టలవర్తకమునకు దెబ్బ తగిలెను దీనివలనకూడ మచిలీపట్టణమునుండి ఇంగ్లీషువారు తమ కేంద్ర కార్యాలయమును, 'ఫోర్టుసెయింటు జార్జి'కి మార్చవలెనను నిర్ణయమునకు వచ్చిరి.

'ఫోర్టుసెయింటు జార్జి' మార్చి 1640 లో పూర్తిఆయెను. ఇది కట్టుటకు స్థలము, ఆగస్టు 1639 లో చంద్రగిరిరాజు నొద్దనుండి 'ఫ్రాన్సిస్ డే' (Francis Day) అనునాతడు సంపాదించెను. 'ఆర్మగాం' లో నున్న గిడ్డంగికి ఈ 'డే' అధిపతి. 'సూరత్'లోనున్న ఇంగ్లీషు అధికారులకు 'డే'; 'మద్రాసు'లో వస్త్రము, నూటికి ఇరువదిపాళ్లు ధర తక్కువగనుక, అచ్చట కోటను కట్టుటకు

50. An Account of China, writtten in Spanish, by the R. F. F. Dominic Fernandez Navarette. Translated in "Collection of Voyages and Travels". London, 1704. Vol. I. (As quoted by Henry Morrris in his boo on the 'Godavery District'. London 1878. Page - 182.)

ఆజ్ఞ నీయవలసినదని వ్రాసెను.[51] ఆజ్ఞ రాకపూర్వమే ఇచ్చటివారు కోట కట్టుటను ప్రారంభించి 1641 లో అన్నివిధముల పూర్తిచేసి. స్థలమునిచ్చిన 'నాయకు'ని తండ్రి పేర ఆప్రాంతమును చెన్నప్ప పట్టణమని పిలువజొచ్చిరి. కోటకు, ఇంగ్లండుయొక్క 'సెయింటు' పేర 'జార్జి' అను పేరుపెట్టిరి. కాని, ఇచ్చట కోటనుకట్టుటకై 'డే' ప్రయత్నించుటకు ముఖ్యకారణము; ఆతని ప్రియురాలు 'సెయింటు థోమ్' (St. Thome) లో ఉండుటయే యనియు, ఈ కోట ఆర్మగాంకంకె 'సెయింటు థోమ్'నకు చాలసమీపమున నుండునని ఎంచియే, ఆతడట్లు చేసెననియు ఆ రోజులలో వాడుక కలదట![52] ఈ కోటను కట్టుటలో ఆతనికి మిక్కిలి సాయపడినవాడు 'ఆండ్రు కోగన్' (Andrew Cogan) అనునాతడు. ఈతడు కోరమండల కోస్తాలో ఇంగ్లీషువారి 'ఏజెంటు'.

ఈ కోట కట్టినవెంటనే, మూడు నాలుగువందల నేతపనివారి కుటుంబములు, కోటచుట్టునున్న భూములకు వలసవచ్చెను. ముప్పది సంవత్సరముల వరకు నేతపనివారికి పన్నులుండవని ఇంగ్లీషువారు హామీ ఇచ్చుటయే ఈ వలసకు కారణము. 1641 లో ఫోర్టు సెయింటుజార్జి కోరమండల కోస్తాలోని ఇంగ్లీషువారి స్థావరములకు కేంద్రకార్యాలయమయ్యెను.[53]

1647 లో గోల్కొండ ప్రధానమంత్రియగు 'మీర్జుమ్లా' (Mir Jumla) మదరాసుయొక్క పరిసరప్రాంతములను జయించి, ఇంగ్లీషువారిక, వారి హక్కులను కాపాడుచు, వాగ్దానమొకటి చేసెను. దీనితో తూర్పుకోస్తాలో ఇంగ్లీషువారి బలము, పలుకుబడి ఇనుమడించెను. 1653 లో 'బాంటమ్' నుండి 'ఫోర్టు సెయింటు జార్జి' స్వాతంత్ర్యము వచ్చెను. 1658 లో 'బాంటమ్'ను, బెంగాలులోని ఇతర స్థావరములను 'ఫోర్టు సెయింటు జార్జి'

51. "... ..excellent long cloath and better cheape by 20 per cent than any-where else........."

(As quoted by William Foster in his book "The English Factories in India, 1637-'41" (1942) Page - 155.)

52. "But the gossip - loving Hamilton believed that the gentleman who received his orders to build a Fort on that coast, chose that place...because he had a Mistress at St. Thome he was so enamoured of that made him build there, that their interviews might be the more frequent and uninterrupted."

(As quoted by Dennis Kincaid in his book on 'British Social life in India, 1608-1937'. London 1939. Page - 48.)

53. "Thus England acquired her first proprietary holding on Indian soil". —Smith.

( Oxford History of India. Page - 339.

ఆధిపత్యముక్రిందకు దెచ్చిరి. ఈ విధముగా చెన్నపట్టణములోని 'కోట' దినదినాభివృద్ధిపొందుచు, ఇంగ్లీషువారి భావిసామ్రాజ్యమునకు పునాది అయ్యెను.

ఇట్లు చెన్నపట్టణము అభివృద్ధి పొందుచుండగా, మచిలీపట్టణములోని ఇంగ్లీషు అధికారుల కది కన్నెఱ్ఱఅయ్యెను. చాలకాలము వరకు మచిలీపట్టణములోనివారు మద్రాసువారి ఆజ్ఞలను శిరసావహించుటకు అంగీకారము చూపలేదు. నాడు మదరాసు, మచిలీపట్టణముల నడుమ నడచిన ఉత్తర ప్రత్యుత్తరములను పరిశీలించినచో ఈ విషయము వ్యక్తమగును. అంతియేగాక మచిలీపట్టణములో కూడ ఉద్యోగుల నడుమ స్పర్థలు పెరిగి ఒకరినొకరు దూషించుకొనుటయేగాక, కొట్టుకొనువరకు వచ్చినదట[54].

ఈ పరిస్థితుల నన్నింటిని గమనించి, 'ఫోర్టు సెయింటు జార్జి' యొక్క 'ఏజెంటు', తూర్పుతీరమునగల ఇంగ్లీషువారి స్థావరముల నన్నింటిని తణిఖీ చేయుట మంచిదని మద్రాసులోని 'కౌన్సిల్' నిర్ణయమునకు వచ్చి ఒక తీర్మానమును చేసెను. (మార్చి 3వ తేదీ, 1679.)[55].

ఈ తీర్మానము ననుసరించి మొత్తము ఇరువదియొక్కమంది మదరాసు నుండి, మార్చి 11వ తేదీ (1679) నాడు బయలుదేరి, నడుమనున్న ప్రాంతములను చూచుచు మార్చి 26వ తేదీ నాటికి మచిలీపట్టణమువచ్చి చేరిరి. వారికి వర్తకులందరు ఘనమైన స్వాగతమిచ్చిరి. ఊరిలోనున్న డచ్చివారి గిడ్డంగుల అధిపతికూడ తరువాత వచ్చి చూచెను. మచిలీపట్టణము యొక్క అధిపతియైన 'ఆగా తెల్లోల్' (Aga Telloll) అను పారసీక ముస్లిము; 'ఏజెంటు' మచిలీపట్టణము పోయినప్పుడు నరసాపురములో నుండుటచే, తిరిగి వచ్చిన తరువాత

---

54. "There had been 'endless debates and mutual aspersions,' and the dispute had gone so far that the Court of Directors remark in a despatch from England, 'We find a complaint against Mr. Wales and Cullen about throwing a brickbat into Mr. Mainwaring's window. We shall not', they add, 'permit any of our servants, of what quality soever, to contemn our authority, which those do that contemn any that act by it'."

(Extracts from Government Records, No. I; Page - 14.)

As quoted by Henry Morris in his book on the 'Godavery District'. London, 1878. Page - 184.

55. "Upon consideration of the Honourable Company's affairs at Metchlepatam and the adjacent factories, it was resolved to be necessary, and for the Honourable Company's interests, for the Agent to visit those factories subordinate to this jurisdiction, a vacancy in business now happening for this conveniency." —The Memoriall.

(Ibidem. Page - 185.)

ఒకరినొకరు దర్శించుకొని గౌరవించుకొనిరి. 'ఏజెంటు' గౌరవార్థము ఏప్రిల్ 4 వ తేదీనాడు, 'ఆగా' పెద్దవిందుచేసి ఒకగుఱ్ఱము నిచ్చెనట. ఇందులకు ప్రతిఫలముగా ఇంగ్లీషువారు, ఆతనికి— ముందుముందు పనికివచ్చువాడని— 'లంచ' మిచ్చిరట.[56] ఇది వారి రాజనీతి!

మచిలీపట్టణములోని వ్యవహారములన్నియు చక్కబెట్టుకొని 'ఏజెంటు' ఏప్రిల్ 7 వ తేదీని బయలుదేరి 'మాడపొలము' (Madapollam) 9 వ తేదీకి చేరుకొనెనట. మాడపొలమునకే 'మాధవాయిపాలెము' అనిపేరు. ఇది నరసాపురమునకు సమీపమున కలదు. ఇక్కడి గిడ్డంగుల నన్నింటిని ఏజెంటు పరీక్షించెను. ఈ సమయముననే, పాలకొల్లులో ఉన్న డచ్చి అధికారి నరసాపురమువచ్చి, ఇంగ్లీషు ఏజెంటును చూచెనట.

ఇంగ్లీషు ఏజెంటు అచ్చటనుండి వీరవాసరముపోయి, 'పెంటపాడు' మీదుగా 18 వ తేదీకి ఏలూరు చేరెను. అచ్చట పర్షియాదేశపు రత్న కంబళములను ముసల్మానులు తయారుచేయుట చూచెను. అచ్చటనుండి నెల్లూరుమీదుగా మేనెల 4 వ తేదీనాటికి ఏజెంటును, ఆతని అనుచరులును మద్రాసు చేరిరి.

ఏజెంటుయొక్క ఈ పర్యటనమువలన 'మాడపొలము'నకు మంచి దశ వచ్చెను. మచిలీపట్టణములోని ఇంగ్లీషు అధికారి చేతులలోనుండి, ఆగిడ్డంగిపై అధికారమును తొలగించి, మద్రాసులోని 'కోట'యొక్క అధికారములోనికి మాడపొలమును తెచ్చిరి[57] నాటినుండి ఈ ఊరులోని గిడ్డంగి ఇంగ్లీషువారికి చాల లాభమును తెచ్చునదయ్యెను.

ఆ సంవత్సరమే (1679) ఇంకొకమారు తూర్పుకోస్తాలోని గిడ్డంగులను, వ్యాపారకేంద్రములను తణిఖీచేయుట మంచిదనితోచి, ఏజెంటు మద్రాసునుండి 'గోల్డెన్ ఫ్లీస్' (Golden Fleece) అను నౌకపై ఆగస్టు ౨౯వ తేదీని బయలుదేరెను. ఈమారు సముద్రముపై బయలుదేరుటచే 4 వ తేదీ

---

56. "Being a person rising in favour of Court, 250 pagodas, ready money, is given to Aga Telloll privately, which will be much more acceptable than a greater summe publickly."—The Memoriall. ( Ibidem. Page - 187. )

57. "One of the principal fruits of the Agent's visit was, that the factory at Madapollam was rendered independent of that at Masulipatam, a position which it had not hitherto enjoyed, and was placed directly under the orders of the Agent at Fort St. George." —Henry Morris.

(The Godavery District; London. 1878. Page - 188.)

మధ్యాహ్న మగునప్పటికి మచిలీపట్టణప్రాంతమునకు చేరెను. కాని, గాలి విశేషముగ వీచుచుండుటచే ఓడ రేవులోనికి రాలేకపోగా, మచిలీపట్టణములోని అధికారులే పోయి ఏజెంటును చూచిరి. ఓడమీద నుండియే ఏజెంటు మచిలీపట్టణము వారికిని, మాడపొలము వారికిని ఆజ్ఞలను ఇచ్చెను. అచ్చటినుండి బయలుదేరి మిగిలిన గిడ్డంగులను, వ్యాపార కేంద్రములను పరీక్షించి జనవరి 26 వ తేదీనాటికి (1680) ఏజెంటు మదరాసు, చేరుకొనెను. ఈతని పేరు 'స్ట్రైన్షామ్ మాస్టర్' (Streynsham Master) అప్పుడు మచిలీపట్టణములోని గిడ్డంగికి అధికారి, 'క్రిస్టఫర్ హేటన్' (Christopher Hatton). మాడపొలములోని గిడ్డంగికి అధికారిగా నున్నవాడు 'జాన్ ఫీల్డ్' (John Field.) 'హేటన్' చనిపోయిన తరువాత 'జాన్ టివిల్' (Jon Tivill) మచిలీపట్టణములో ఇంగ్లీషు గిడ్డంగికి అధికారి అయ్యెను. 'జాన్ ఫీల్డ్' తరువాత 'జాన్ డేవిస్' (John Davis) మాడపొలమునకు అధికారి అయ్యెను. 1681 వ సంవత్సరమునాటికే 'డేవిస్' మాడపొలమునకు అధికారి యైనట్లు తెలియజేయు ఆధారములు కలవు.[58]

బట్టల వర్తకము విషయములో 'మాడపొలము' చాల ప్రఖ్యాతి పొందినది. కాలక్రమమున సన్నని బట్టలకు 'మాడపొలము' అను పేరు సార్థకముగా, ఇంగ్లీషులో ఉపయోగింపజొచ్చిరి. తరువాత ఇది నూలు బట్టకు పర్యాయ పదముగా ఇంగ్లీషు నిఘంటువులలోనికి కూడ ఎక్కినది[59]

1690 లో 'ఎలిహూ ఏల్' (Elihu Yale) అను మద్రాసు గవర్నరు, ఔరంగజేబు సేనాధిపతి యగు 'జుల్ఫికార్ ఖాన్' నుండి, తూర్పుకోస్తాలో

---

58. 'డేవిస్' కూతురి యొక్క గోరీపై ఇటుల కలదు—

Here lyeth the Bo-
dy of Katherine Davis
the daughter of John Davis
Chief of Mada-
pollam who depart-
ed this life the 24th
August anno 1681
Aged 17 months.

(As quoted by Henry Morris in his book on the 'Godavery District'; London. 1878. Page - 192.)

59. Mādapollam, n. A cotton cloth, orig. of Indian make. (F. M. in Madras)

(The Concise Oxford Dictionary of Current English, Third Edition, Page - 688.)

గల ఇంగ్లీషు స్థావరముల కన్నింటికి ఒక కౌలును సంపాదించెను. ఆ కౌలు లోని కొంత భాగమున కిది ఆంగ్లానువాదము—

"Whereas in the time of the late shameless and faithless rebellion, the President of the English, Elihu Yale, Governor and Captain of Chinnapatnam, protected and assisted Mahmoud Ali and other servants of the Mogul, and supplied me with powder with other services; in consideration whereof I have made and given this my Cowle or grant, that the rent of the Fort and Factory of Chinnapatnam with accustomary privileges, the English Factories of Metchelepatam, Madapollam, Vizagapatam, &c; within the territories of the Golconda Country, also their other settlements, according to the former custom and the usual practice of the English, let it remain undisturbed."[60]

ఏప్రిల్ 1692 లో 'ఏల్', వజీరు 'అసద్ ఖాన్' నుండి కూడ 'ఫర్మానా' లను సంపాదించెను. ఈ 'ఫర్మానా' లు పై 'కౌలు' ను ఆదరించుటయేగాక, టంకసాలలను నిర్మించుకొను హక్కులు కూడ ఇంగ్లీషువారి కిచ్చినవి. ఈ విధముగా ఇంగ్లీషువారి ప్రభావము, పలుకుబడి అధికమగుచు వచ్చెను.

ఇంగ్లీషువారు, వర్తకము చేయుచున్న భాగములలో గల ప్రజలను హింసింపక, వారికి కావలసిన సౌకర్యములను కలిగించుచుండుట చేత ప్రజలలో చాలమంది వారి పక్షమగుచుండిరి. ఇంగ్లీషువారి వర్తకము క్షీణింపకుండుట కదియే ముఖ్యకారణము. వారు నవాబులను, వజీరులను, రాజులను మోసము చేయుచుండిరి. దానివలన లాభములను పొందుచుండిరి. ఒక్కొక్కప్పుడు వారి గిడ్డంగులు, స్వదేశ సంస్థానాధీశులచే దోచుకొనబడినను, వారి వర్తకమునకు తీవ్రముగ దెబ్బ తగులకుండుటకు, ప్రజలలో వారు సంపాదించిన పలుకుబడియే కారణము. నాశనము చేయబడిన గిడ్డంగులను మరల బాగు చేసికొని వర్తకమున కుపక్రమింపగనే, ప్రాంత కాతాదారులందరు మరల వచ్చి చేరెడివారు. డచ్చివారిటులగాక, జాత్యహంకారమును మొట్టమొదటి నుండియు చూపుటచే, వారి వర్తకమునకు దెబ్బతగిలినప్పుడు కోలుకొనలేక పోవుచుండిరి. ఈ విషయమున ఇంగ్లీషువారు చాల దూరదృష్టితో వ్యవహరించి వారి పనులను వారు సాధించుకొనిరి. వారిక్రింద పని చేసెడి స్వదేశీయులకు జీతములను సరిగా నిచ్చుచు, ఉద్యోగులు చనిపోయినపుడు కుటుంబ

60. As quoted by Henry Morris in his book on the 'Godavery District'; London. 1878. Pages - 192-193.

ములకు భరణముకూడ నిచ్చుచు, ప్రజలదయను పొందుచుండిరి.[61] కాని, తమ్ముగాని, తమ కంపెనీనిగాని అగౌరవ పరచెడివారి విషయమున మాత్రము వారు క్రూరముగనే వ్యవహరించెడివారు.[62] ఈ ఆత్మాభిమానము వారికి రాజ్య సంపాదన విషయమున చాల సాయము చేసినదనుటలో సందేహము లేదు.

1708 లో 'ఇంజరం' అను గ్రామమునొద్ద ఇంగ్లీషువారింకొక స్థావరము నేర్పర్చుకొనిరి. విశాఖపట్టణమునుండి ఇంగ్లీషువారిచ్చటకువచ్చి గిడ్డంగిని నిర్మించుకొనిరి. ఇది నిర్మింపబడిన మొదటి దినములలో వ్యాపార మంత బాగుగ జరుగలేదనియు, ఆ పరిసరములలో చిన్నచిన్న జమీందారులు చాలమంది గలరనియు, వారందరు పన్నులు వసూలు చేయుటవలన వ్యాపారమునకు లాభము వచ్చుటలేదనియు, నాటి వ్రాతలవలన తెలియుచున్నది. కాని 1725 నాటికి పరిస్థితులు కొంత మారుటచే, ఇచ్చటి గిడ్డంగి మామూలుగ పనిచేయుట మొదలుపెట్టినదని తెలియజేయు వ్రాతలు గలవు.[63] ఇదిగాక, బెండమూర్లంక యొద్దకూడ 1757 నాటికి ఒక ఇంగ్లీషు గిడ్డంగి ఉన్నదని తెలియుచున్నది.[64] కాని ఇది 1786 నాటికి ఉన్నటులలేదు. 1787 లో 'సర్క్యూటుకమిటీ' పంపిన 'రిపోర్టు' లో దీని ప్రస్తావనలేదు.

---

61. "Gruaraz, the former Chief Bramini of the Factory, having died, a successor is appointed, and a pension of 20 pagodas per annum is granted to his widow for her life, to be paid out of the Bramini's part of the Dustoor." (1680) Jan. 7th.

From "the Memoriall of Streysham Master, Esq; Agent of the Coast of Chormandell and Bay of Bengall. His voyage to Metchlepatam and the Bay to visit those Factorys, & c; belonging to the Hon'ble English East India Company."

(As quoted in the 'Extracts from Government Records, Second Series. Page - 36 ) (II Visit)

62. "The Braminy of the Factory and his two sons committed under guard in the Factory for disrespectful behaviour, the former 'having cast out slighting speeches on the Agent." (April 15, 1679)

"The former Contract with the merchants made void, and a new one entered into. Conappa, the Braminy, and his two sons released on paying 500 pagodas, and dismissed the Company's Service." (April 16, 1679)

From 'The Memoriall' (I Visit) (Ibidem. Page - 8)

63. Robert Orme—'History of the Military Transactions of the British Nation in Indostan.' Vol. II. Pages - 218, 261.

64. Ibidem. Page - 261.

17 వ శతాబ్దిలో విశాఖపట్టణములో ఇంగ్లీషువారు నెలకొల్పిన గిడ్డంగి వారి వ్యాపారములో అంత ప్రముఖపాత్ర వహింపలేదు. 1689 లో ఔరంగజేబుయొక్క సేనలు దీని నాక్రమించినవి. అప్పుడు వీరి గిడ్డంగికూడ ఆక్రమింపబడినది. కాని ఈ దండయాత్ర తాత్కాలికము గనుక, మరల వర్తకము ప్రారంభించిరి. 1690 లో జుల్ఫికార్ ఖాన్ ఇచ్చిన కౌలుతో వీరిస్థితి బాగుపడెను. మరల 1757 లో ఫ్రెంచివారి చేతులలో నిది పడెను. అప్పుడు ఫ్రెంచివారికి పెద్దవిజయరామగజపతికూడ సాయము చేసెను. ఆతని మరణము తరువాత 1758 లో ఆనందరాజు మరల దీనిని ఫ్రెంచివారి చేతులనుండి గ్రహించి ఇంగ్లీషువారికి కట్టబెట్టెను. తరువాత ఉత్తర సర్కారులన్నియు ఇంగ్లీషువారి పాలబడినప్పుడిదియు వారికి సంక్రమించెను.

ఉత్తర సర్కారులలో ఇంగ్లీషువారికి మంచి వస్త్రమును తయారు చేసి ఇచ్చిన గిడ్డంగులు మూడును గోదావరి జిల్లాలోనే కలవు. అవి - మాడపొలము, బెండమూర్లంక, ఇంజరము; అనునవి. ఈ మూడింటిని ఫ్రెంచివారు 1757 లో రాజమహేంద్రవరములో వారికి గల సేనయొక్క సాయముతో పట్టుకొని ఆక్రమించినప్పుడు, ఇంగ్లీషువారి బట్టల వ్యాపారమునకు నష్టము వచ్చెను.[65]

కాని, కొండూరు యుద్ధము (9 డిసెంబరు 1758) లో ఫ్రెంచివారు పూర్తిగా ఓడిపోవుటతో, ఇంగ్లీషువారి పలుకుబడి ఉత్తరసర్కారులలో మరల మిన్ను ముట్టినది. ఇంగ్లీషువారికి ఈ విజయము లభించుటకు క్లైవు దూరదృష్టియు, విజయనగరరాజైన ఆనందరాజుయొక్క సాహాయ్యమును కారణములు. ఈ యుద్ధము తరువాత ఆనందరాజునకును ఇంగ్లీషువారికిని, జయించిన భూభాగమును పంచుకొను విషయమున, అంతఃకలహములు వచ్చెను. కాని, ఆనందరాజు సాయము లేనిదే ఈ ప్రాంతముల కాలూని నిలచుట అసాధ్యమని గ్రహించిన ఇంగ్లీషువారు, ఆతడు పెట్టిన షరతుల

65. "The French garrison of Rajahmundry, reinforced by troops from Masulipatam, took the three English Factories at Madapollam, Bendamūrlanka, and Injaram......The capture of these factories must have been for the time a serious blow to the English interests in this district, as they annually furnished 700 bales of excellent cloth for the Company's market in England."

( Ibidem ; Vol II ; Page - 261. దీనినమసరించి Henry Morris తన 'Godavery District' అను గ్రంథములో వ్రాసిన వాక్యములివి; Page - 232.)

ప్రకారము సమాధానమునకు వచ్చిరి. ఈ సంప్రతింపులలో ఇంగ్లీషువారి పక్షమున 'ఆండ్రూస్' (Andrews) - మాడపొలములో కౌన్సిలధికారిగా పనిచేసిన ఇంగ్లీషు ఉద్యోగి - చక్కగా కృషి చేసెను.

తరువాత జనవరి 28 వ తేదీని (1759) ఆనందరాజును, 'కల్నల్ ఫోర్డు'ను బయలుదేరి ఫిబ్రవరి, 6 వ తేదీనాటికి ఏలూరువచ్చిరి. ఈలోపల, 'కెప్టెన్ నాక్స్'పోయి మొగలితుఱ్ఱురాజుతోకలిసి, నరసాపురములోని ఫ్రెంచి స్థావరములను వశపర్చుకొనెను. కల్నల్ ఫోర్డ్ మచిలీపట్టణమును పట్టుకొనుటకై బయలుదేరగనే, ఫ్రెంచిసేనానియైన 'కన్ఫెన్స్' వెంటనే 'సలాబత్ జంగ్'నకు, సాయముచేయ ప్రార్థనపంపెను 'సలాబత్ జంగ్' బయలుదేరెను. కాని, కల్నల్ ఫోర్డ్ ఇందులకు భయపడక మచిలీపట్టణమును నెలరోజులు ముట్టడించి వశపర్చుకొనెను ఫ్రెంచివారికి సాయముచేయవచ్చిన 'సలాబత్ జంగ్'తో 'ఫోర్డ్' మే 14 వ తేదీని సంధిచేసికొనెను. ఈ సంధివలన ఇంగ్లీషువారికి; మచిలీపట్టణము, నిజాముపట్టణము సర్కారులును; కొండవీడు మొదలగు జిల్లాలును ఈనాములుగ లభించెను. ఫ్రెంచిసేనలను పంపివేయుటకు 'సలాబత్ జంగ్' అంగీకరించెను (1759)

తరువాత, 'మొరసిన్' (Moracin) అను ఫ్రెంచిసేనాని దక్షిణమునుండి కొంత సేనతో మచిలీపట్టణము పడిపోకుండ సాయముచేయ బయలుదేరివచ్చెను గాని అప్పటికప్పుడే మచిలీపట్టణము 'కల్నల్ ఫోర్డు'నకు వశమయ్యెను. 'మొరసిన్' అచ్చటనుండి కాకినాడపోయి, ఇంగ్లీషువారితో తలపడనెంచెనుగాని, స్థానికమైనసాయము లభింపకుండుటచే, నిస్పృహజెంది పుదుచ్చేరికి పోయెను. తరువాత, ఒకటి రెండు యత్నములు ఫ్రెంచివారు చేసిరిగాని లాభము లేక పోయెను. 'కల్నల్ ఫోర్డ్' మచిలీపట్టణములో తనసేనలతో కొంతకాలముండి అక్టోబరులో కలకత్తాకు పోయెను. ఈతనితరువాత ఇంగ్లీషుసేనకు నాయకుడైన 'కెప్టెన్ ఫిషర్,' (Captain Fischer) మచిలీపట్టణములో 'ఆండ్రూస్'ను అధికారిగా నియమించి విశాఖపట్టణముచేరెను. అచ్చటనుండి ఇంగ్లీషుసేనలు సముద్రమార్గమున కలకత్తాచేరెను. ఈవిధముగా ఉత్తరసర్కారులలో ఫ్రెంచి ప్రభుత్వము నాశనమయ్యెను. నిజామయిన 'సలాబత్ జంగ్' ఇంగ్లీషువారి కిచ్చిన ప్రాంతములుగాక, మిగిలిన ఉత్తరసర్కారులలోని భాగములు నిజాము పాలన క్రిందకు మరలవచ్చెను.

'కొండూరు' (చందుర్తి) యుద్ధమైన కొలది కాలమునకే, విజయనగర ప్రభువయిన ఆనందరాజు మరణించెను (25 ఫిబ్రవరి 1760). ఈయన చనిపోవుటతోడనే ఇంగ్లీషువారికి, ఈవంశము వారియొక్క పలుకుబడిని నాశనము చేయవలెనను అభిప్రాయము కలిగెను ఆనాడీ రాజవంశము ఉత్తర సర్కారులలో మంచిపలుకుబడినీ, అధికారమును కలిగియుండెను.[66] ఈభాగమింకను నిజాము పరిపాలనలోనే యుండుటచే; పెద్దవిజయరామగజపతిగారి భార్య, ఆనందరాజు మృతితరువాత ఒకబాలుని పెంచుకొని, ఆతనికి తన భర్తపేరుపెట్టి, అప్పటి నిజామయిన 'నిజామ్ అలీఖాన్'చేత ఆబాలునకు పట్టము గట్టించెను.[67] ఈతడు 'మైనరు' అగుటచే ఆతని సవతిఅన్నగారైన 'సీతారామరాజు' రాజకార్యములను తీర్చిదిద్దుట మొదలిడెను.

1761 లో 'సలాబత్‌జంగ్'న్ను తొలగించి ఆతనితమ్ముడు 'నిజామ్ అలీఖాన్' నిజామయ్యెను. ఉత్తర సర్కారులవిషయమై ఇంగ్లీషువారు ఆతనితో సంప్రతింపులు జరిపిరి. మొట్టమొదట ఆతడు, ఇంగ్లీషువారికి వానినిచ్చుటకంగీకరించినను తరువాత నంగీకరింపలేదు. 'హుసేన్ అలీఖాన్' వానిని కవులునకు పుచ్చుకొనెను. ఈతనికి సాయము చేయుటకై ఇంగ్లీషువారు సేనలతో సంసిద్ధులైరి. 'నిజామ్‌అలీఖాన్' సమయము కలిసిరానందున తటస్థముగ నుండెను.

ఈ విధముగా ఉత్తర సర్కారులలోని పరిస్థితు లన్నియు ఇంగ్లీషు వారికి అనుకూలముగ నుండెను ఉత్తర సర్కారులలో ప్రబలమైన రాజవంశమునకు చెందిన, 'చిన్న విజయరామగజపతి' బాలుడు. ఆతని సవతిఅన్న

66. "When the English first got footing in them (Circars) in consequence of the taking of Machilipatam by Col. Forde in 1759 (Lord Clive was invited to this measure by a letter from Anunda Rauzu) he was the most considerable Zamindar in the Chicacole Circar and the whole five Circars were in great measure under his management for the Soubah or himself according to circumstances."

(Extract from a 'Letter to the Court of Directors in January 1777'.)

67. "In Fasali 1169, Ananda Gajapaty Raju joined Col. Forde and wrested Machili Bandar and other places from the French and on his way to his place died at Rajamahendravaram. As he had then no children Vijayarāmarāju's wife Chandramma got a boy aged 12 years named Venkatapati Raju a Kinsman of her husband, installed him and obtained Rajaghery Siriphave from Nizam Alli Khan and got him the title of, after her husband's name - Vijayarama Raju." (విజయనగర సంస్థానమునకు సంబంధించిన 'కాగితములు.' Defendants' Documents)

సీతారామరాజు తన పలుకుబడికై, ఇంగ్లీషువారితో స్నేహముగనే యుండెను. సర్కారులను కౌలునకు పుచ్చుకొనిన 'హుసేన్ అలీ ఖాన్' ఇంగ్లీషు సేనలపై ఆధారపడియుండెను. 'నిజామ్ అలీఖాన్' ఎచ్చటనో దూరముగ హైదరాబాదులో నుండెను. ఫ్రెంచివారు నామరూపములు లేకుండ ఉత్తరసర్కారులనుండి పోయిరి. ఇంతకంటె, సామ్రాజ్యకాంక్షగల ఇంగ్లీషువారికి కావలసినదేమి ?

ఇంతలో లార్డ్ క్లైవు భారతదేశమునకు తిరిగి వచ్చెను. వెంటనే మద్రాసు ప్రభుత్వమువారు, ఉత్తర సర్కారులను సంపాదించు విషయమున ప్రయత్నింపుడని అతనికి వ్రాసిరి. వెంటనే అతడు, ఢిల్లీ చక్రవర్తినుండి - ఉత్తర సర్కారులను ఇంగ్లీషు వారికి దానము చేసినట్లు, ఒక దాన పత్రమును పొందెను. ఈ దానపత్రము (ఆగస్టు 12 వ తేదీని 1765 లో ఈయబడినది) ఆధారముగాచేసికొని, ఉత్తర సర్కారులను బలవంతముగా ఆక్రమింపవచ్చునని ఇంగ్లీషు వారి ఎత్తు దక్షిణమున అందరును విస్మరించిన ఢిల్లీపాదుషాను ఇందులకే, జిత్తులమారి క్లైవు పైకి చూపెను. ఈ సంవత్సరములోనే ఇంగ్లీషువారికి ఉత్తర హిందూస్థానమున ఒరిస్సా, బెంగాలు, బీహారు రాష్ట్రములు కూడ దఖలు పడెను (1765).

కాని, వెంటనే మద్రాసు ప్రభుత్వము ఉత్తరసర్కారులను స్వాధీనము చేసికొనలేదు. అప్పటికప్పుడే ఆ ఏటి శిస్తు 'హుసేన్ అలీఖాన్' వసూలుచేసి యుండుటచేతను, అతడు వారి చేతులలోని వాడే యగుట చేతను, మద్రాసు ప్రభుత్వము వారూరకుండిరి. మరుచటి సంవత్సరము-మార్చి నెలలో వారు పాదుషా యొక్క ఫర్మానాను ప్రకటించి, ఉత్తరసర్కారులను స్వాధీనము చేసికొనుటకు 'జెనరల్ కేలియడ్' (General Calliaud) ను పంపిరి. ఇది 'నిజామ్ అలీఖాన్' నకు కోపకారణమయ్యెను. వెంటనే అతడు కర్ణాటకమును జయించుటకు పూనుకొనెను. అంత మదరాసు ప్రభుత్వము తమ కార్యము నుండి వెనుదిరిగి, నిజాముతో సంధిచేసికొన 'కేలియడ్' ను నియమించిరి. ఈ సంధిలో పాదుషా యొక్క ఫర్మానా ప్రసక్తియేలేదు. ఈ సంధివలన ఇంగ్లీషు వారికి ఉత్తర సర్కారు లన్నియు శాశ్వతముగ ఈనాముగా లభించినవి. ఈ విధముగ ఈ సంధి (12వ నవంబరు 1766) ముఖ్యమైనది.[68] ఈసర్కారులలో

---

68. "The Honourable English East India Company, in return for the gracious favours received from his Highness, consisting of Sunnuds for the five Circars of Ellore, Siccacole, Rajahmundry, Moostafunnugger and Moortizanugger, expressing the free gift thereof on them and their heirs for ever and ever,

'మూర్తిజానగర్' (గుంటూరు) సర్కారు మాత్రము. నిజాము యొక్క సోదరుడగు 'బసాలత్ జంగ్'నకు యావజ్జీవము అనుభవించుటకై ఈయబడి నందున, మిగిలిన సర్కారులతోబాటది వెంటనే స్వాధీనము కాలేదు. కాని, ఇంగ్లీషువారది తరువాత ఆతనినుండియే గ్రహించిరి (1788).

తరువాత కొంతకాలమునకు 'హైదరాలీ'కిని, ఇంగ్లీషువారికిని యుద్ధములు వచ్చినప్పుడు, 'నిజామ్ అలీ' ఈ సంధిని విస్మరించి 'హైదరాలీ'కి సాయము చేసెను. కాని, బెంగాలునుండి ఇంగ్లీషువారి సేన యొకటి హైదరాబాదు వైపునకు రాగానే, 'నిజామ్అలీ' భయపడి ఇంగ్లీషువారితో మరల సంధిచేసికొనెను. ఈ సంధి పత్రమున మొదటిసంధి యొక్క అంగీకారమునుగూర్చి వ్రాయుటయేగాక, ఢిల్లీ పాదుషా యొక్క ఫర్మానా (ఉత్తరసర్కారులను ఇంగ్లీషువారికిచ్చినది) కూడ ఉటంకింపబడినది. ఈసంధితో (23 వ తేదీ ఫిబ్రవరి 1768) ఇంగ్లీషువారికి ఉత్తర సర్కారులలో అన్ని హక్కులును సంక్రమించినవి. 1769 లో 'హుసేన్ అలీఖాను' యొక్క 'కౌలు' కాలము ముగిసినతోడనే, ఇంగ్లీషుకంపెనీవారు ఉత్తర సర్కారులను స్వయముగా పరిపాలింప మొదలిడిరి. కంపెనీ ఉద్యోగులే (పూర్వపు గిడ్డంగుల ఏజెంటులు) పాలకులైరి. ఈ పరిపాలన 1794 వరకు (కలెక్టరేటులు వచ్చువరకు) సాగెను.[69]

1769 నుండి 1794 వరకు గల మధ్యకాలములో కంపెనీవారు జమీందారులను గూర్చి శ్రద్ధతీసికొని, వారిబలమును చాలవరకు తగ్గించుచు వచ్చిరి. ఈ సందర్భముననే వారికి, విజయనగరము జమీందారీని గూర్చి కూడ నిర్ణయమునకు రావలసిన అగత్యము కలిగెను. అప్పటికి పేరునకు

---

do hereby promise and engage to have a body of their troops ready to settle the affairs of his Highness's government in everything that is right and proper, whenever required."

"Aitchison's Treaties, Engagements, and Sunnuds, Page - 14." (As quoted by Henry Morris in his book on the 'Godavery District.' London. 1878; Page - 242)

69. "Hussain Ali Khan's administration came to an end with the lapse of his lease in 1769, and the newly-acquired territory was then placed under the direct management of the servants of the Company.........This system of government continued in force for five-and-twenty years, and during the whole of that period the entire political, civil, and revenue administration of the Northern Circars was under the Provincial Councils established at Masulipatam, Vizagapatam, and Ganjam." —Henry Morris.

(The Godavery District—London. 1878. Page-243.)

చిన్న విజయరామరాజుగారు రాజుగాని, రాజకార్యముల నన్నింటిని నిర్వహించు చున్నవారు ఆతని సవతిఅన్నగారైన సీతారామరాజుగారు. ఈతనికి కంపెనీ ఉద్యోగులయొద్దకూడ మంచి పలుకుబడి కలదు. కనుక రాజ్యపాలనము నిరంకుశముగ జరుగుచుండెను. ఇది చిన్న విజయరామరాజుగారికి, ప్రజలకు మాత్రమేగాక కంపెనీ వారికిని భయముగొల్పుచునే యుండెను. వీరిని తొలగించుట కెన్ని ప్రయత్నములు జరిగినను సఫలము కాలేదు. ఈతడు జమీందారీ యొక్క సేనను 12,000 వరకు పెంచి శత్రుభయంకరుడై యుండెను. కాని కంపెనీవారికి మాత్రము 'పేష్కస్సు'ను సరిగా నిచ్చుచుండెను. కనుక, సర్క్యూటు కమిటీ వచ్చి ఈతని సైనికబలమును గూర్చి వ్రాయువరకు ఈతడు చెక్కుచెదరకుండెను.[70] ఈతడు తాత్కాలికముగ రాజకార్యములనుండి తప్పుకొని, 1790 లో తిరిగి వానియందు ప్రవేశించెను. కాని తుట్ట తుదకు అన్నియువిడిచి కంపెనీవారి కోరికపై 1793 లో మద్రాసుచేరెను.

రాజకార్య నిర్వహణమున అనుభవములేని చిన్న విజయరామరాజును తొలగించినచో, మరల క్రొత్తరాజును నియమించునప్పుడు. జమీందారీని తగ్గించి ఈయవచ్చునని యెంచి; కంపెనీ ఉద్యోగులు 'పేష్కస్సు' సరిగా చెల్లింపబడుటలేదనునెపమున, చిన్న విజయరామరాజుగారిని, విజయనగరము విడిచి మచిలీపట్టణములో 'భరణము'పై జీవింపరండనిరి. సంస్థానముయొక్క బలమునకుజంకి ఇంగ్లీషువారు, మొట్టమొదటినుండియు, దీనివిషయమున కుత్సితముగనే ప్రవర్తించిరి. తాము ఫాదుషాయొద్దనుండియు, నిజాము నుండియు ఉత్తర సర్కారులను ఈనాముగా గ్రహించునప్పుడు, ఆనందరాజుతో 'కొండూరు' యుద్ధభూమిని తాము చేసికొనినట్టి ఒడంబడికను స్మరింపనే లేదు. స్మరింపకుండుటయేగాక, నిజామైన 'నిజామలీఖాన్' ప్రాపున పట్టాభిషిక్తుడైన చిన్న విజయరామరాజును తొలగించుటకును యత్నించిరి. ఈ ప్రయత్నమును సహింపని రాజుగారు ఇంగ్లీషువారికోరిక ననుసరించి మచిలీపట్టణము వెడలక, విజయనగరమునకు సమీపమునగల పద్మనాభమును జేరి, మానహానికంటె మరణము మేలని ఇంగ్లీషువారి సేనలకై నిరీక్షించిరి. ఇందు

70. "In 1784 the Circuit Committee, in reporting on the District brought to notice that Vizianagaram with his feudatories maintained a standing army of 12,000 men, which was reasonably held to be a source of danger to the Company. The only immediate result of this report was the temporary retirement of Sita Ram."

(Imperial Gazetteer of India. Madras I. Page - 255.)

లకు కారణము, ఆయనను కంపెనీవారు, అగౌరవముగ మొదటినుండియు చూచుటయే.[71]

యుద్ధభూమిలోకూడ తమ బలములు ముందు తుపాకులు ప్రేల్చ రాదనియు, కంపెనీసేనలు ముందు ప్రేల్చినచో ఆత్మరక్షణకొరకు తాము ప్రేల్చవలెననియు చిన్న విజయరామరాజుగారనిరట.[72] ఈ యుద్ధము జూలై 10 వ తేదీని (1794) జరిగెను. ఇందు, చిన్న విజయరామరాజుగారును, ఆయన బంధుకోటికిచెందిన క్షత్రియవీరులును, వారి అనుచరులగు హాసనుబేగు మొద లగువారును వీరమరణమును పొందిరి.

వీరిమృతి తరువాత కంపెనీవారు సంస్థానమునకుచెందిన భూములను కొన్నింటిని వశముచేసికొని, కొన్నింటిని మన్నెసుల్తానుల కిచ్చివేసి; జమీందారీ యొక్క బలమును తగ్గించిరి. చిన్న విజయరామరాజుగారి కుమారుడైన 'నారాయణబాబు'గారి కాలములో, జమీందారీ అనేక సంవత్సరములు ఇంగ్లీషు వారి చేతులలోనే యుండెను.

1791 లో ఉత్తర సర్కారులలో మహా క్షామము వచ్చెను. ఈ పరిస్థితులను 'కంపెనీ ఉద్యోగులు' (పూర్వపు గిడ్డంగుల ఏజెంటులు) ఎదుర్కొన లేకపోయిరి. అంతియేగాక ఈ పద్ధతివలన కంపెనీకి శిస్తుకూడ బాగుగ వసూలు కాకుండెను. దేశములోని పరిస్థితులు చక్కగా తెలియకుండెను. ఈ విష యముల నన్నింటిని తెలిసికొనుటకు నియమింపబడిన 'సర్క్యూటు కమిటీ' యొక్క రిపోర్టుకూడ వారికి రాగానే, కంపెనీ డైరెక్టరులు కలెక్టరులను

---

71. "......that the compulsive menaces made use of towards the Rajah and the gross ill-treatment which he received at the Presidency, were humiliating, unjust and cruel in themselves, and highly derogatory to the interests of the East India Company and to the honour of the British nation."

(Charmichael's Manual. Page - 197)

"It was necessary for him to yield up his life to save his honour.'' (Ibidem)

72. "During the time I was forming my line a horseman from the Rajah came and desired to know what business I had there. I desired him to the Rajah that I referred him to the letter which I had sent him two days before. To this he replied that if my people fired, the Rajah's people were ready to fire also."

(Extract from the 'Report of Col. Prendergast. Camp Near Padmanabhum. 11th July 1794.')

నియమించి పరిపాలింపనెంచిరి.[73] ఈ క్రొత్తపద్ధతి 1794 వ సంవత్సరములో (నవంబరు 20 వ తేదీ) అమలులోనికి వచ్చెను.

ఇంగ్లీషువారికి 1766 లో ఉత్తర సర్కారులు లభించినవి. కాని, దత్తమండలములని పిలువబడు రాయలసీమ 1800 వరకు లభింపలేదు. ఈ ఆంధ్ర భూభాగము తీరస్థము కాకుండుటచే, దీనిపై పాశ్చాత్యుల ప్రభావము కొంత ఆలస్యముగ పడెను. ఈ ప్రాంతమున మొదటినుండియు ముసల్మానుల పలుకుబడి హెచ్చు. విజయనగరసామ్రాజ్య పతనానంతరమున (1565) ఈ మండలమంతయు, ఇంచుమించుగ నవాబుల పరిపాలనలోనే యుండెను. ఈ ప్రాంతమునకు మహారాష్ట్రుల దండయాత్రలు కూడ వచ్చినవి.

కడప ప్రాంతమును హైదరాలీ 1780 లో ఆక్రమించుకొని, నవాబును చంపించెను. 1782 లో ఆతడు చనిపోయిన తరువాత, టిప్పుసుల్తానుయొక్క సేనానియగు కమరుద్దీన్ దానిని చక్కగా పరిపాలించెను. 1790 లో టిప్పు సుల్తానుతో యుద్ధము రాగానే, నిజాము గుత్తుముకొండను ముట్టడించెను. కాని, 1792 లో జరిగిన సంధివలన తత్ప్రాంతమంతయు నిజామునకు లభింపగా ఆతడు తృప్తిజెంది హైదరాబాదునకు పోయెను. 1799 లో టిప్పుసుల్తాను మృతితో ఆ ప్రాంతమేకాక, మిగిలిన భాగమంతయు కూడ నిజామునకు లభించెను. 18 వ శతాబ్దిలో జరిగిన కర్ణాటక యుద్ధములలో కడపప్రాంతము ప్రముఖపాత్ర వహించెను.

కర్నూలు ప్రాంతమును ఔరంగజేబు జయించినప్పుడది ఆతని పఠాను సేనానికి జాగీరుగా నీయబడెను. 1733 లో హిమాయతుఖాను నవాబయ్యెను. కర్ణాటక యుద్ధములలో ఈతడు ప్రముఖపాత్ర వహించెను. 1751 లో కర్నూలు సలాబత్‌జంగ్, బుస్సీలు కలిసి పట్టుకొనిరి. 1755 లో హైదరాలీ కర్నూలుపై దండెత్తివచ్చి కప్పము విధించెను. టిప్పుసుల్తాను మృతి తరువాత జరిగిన పంపకములలో ఇది నిజామునకు వచ్చెను. నిజామునకు వచ్చినను కొంతకాలము కర్నూలు నవాబే దీనిని పాలించెను.

---

73. "After the careful inquiry instituted into the condition of the country by the Committee of Circuit, the Government came to the decision of abolishing them (Councils), and of dividing the country into collectorates, the collectors being directly responsible to the Board of Revenue at Madras."—Henry Morris. ('The Godavery District'; London. 1878; Page - 259.)

హంపీ విజయనగర పతనానంతరము ఆ సామ్రాజ్యము ముక్కముక్కలై మున్సల్మానుల పాలబడెను. బళ్ళారి ప్రాంతముకూడ వారి చేతులలోనే పడినది. ఈ భాగమునంతను ఔరంగజేబు దండెత్తి వశపర్చుకొనెను. అతని తరువాత హైదరాలీ యొక్క దండయాత్రలకును, ఆక్రమణమునకును ఇది లోనయ్యెను. 1792 లో టిప్పుసుల్తానుతో జరిగిన సంధి ఫలితముగ ఈ ప్రాంతములోని సగముభాగము నిజామునకు వచ్చెను. 1799 లో టిప్పుసుల్తాను మరణానంతరము ఈ ప్రాంతమంతయు పూర్తిగా నిజాము వశమయ్యెను.

అనంతపుర ప్రాంతమునగల పెనుగొండ, గుత్తి దుర్గములే ఈప్రాంతము యొక్క చరిత్రకు మూలములు. ఇవి హంపీ విజయనగర రాజులకు ప్రాణములతో సమానమైనవి. ఈ రాజులు చంద్రగిరి తరలిపోవు వరకు ఇవి వారి చేతులలోనే యుండెను. తరువాత మున్సల్మానుల హస్తగతములైనవి. పిమ్మట మహారాష్ట్రుల వశమయ్యెను. కాని 1775 లో హైదరాలీ ఈ ప్రాంతము నాక్రమించెను. 1792 లో టిప్పుసుల్తాను; నిజాము, ఇంగ్లీషు వారిచేత ఓడింపబడినప్పుడు ఈ ప్రాంతములో సగము నిజామునకు వచ్చెను. మిగిలిన సగమును శ్రీరంగపట్టణ యుద్ధములో టిప్పుసుల్తాను చనిపోగానే నిజామునకే దఖలుపడెను.

ఈ విధముగా రాయలసీమ ప్రాంతమంతయు 1800 నాటికి నిజాము చేతులలో నుండెను. కాని నిజాము బలహీనుడగుటచే ఇంగ్లీషువారినిగాని, ఫ్రెంచివారినిగాని తనకు అండగా చూచుకొనక తప్పెడిదికాదు. ఇంచుమించుగా నిజాము చరిత్ర ఇట్టిదే. అతని బలహీనతను గుర్తించియే, ఇంగ్లీషువారును, ఫ్రెంచివారును అతనిని లోబర్చుకొనుటకు ప్రయత్నించిరి. అతడు బలహీనుడేకాక, ఢిల్లీ ఫాదుషాకు దక్షిణమున ప్రతినిధివంటివాడు. కనుక, అతని యొద్దనుండి సర్కారులను సంపాదించినచో, ఆ సంపాదనకు ఫాదుషా ముద్రకూడ లభింపకమానదను పరమసత్యమే, పాశ్చాత్యులను దక్షిణభారతమున రాజ్యసంపాదనకై పురిగొల్పెను.

ఈ రాయలసీమ ప్రాంతమునుకూడ నిజామే 1800 లో ఇంగ్లీషు వారికి సేనల భరణమునకగు ఖర్చు నిమిత్తము ఇచ్చివేయవలసి వచ్చెను. ఇటులనే అంతకు పూర్వము ఉత్తర సర్కారులనుకూడ ఇచ్చెను. నెల్లూరు ప్రాంతమునగల దుగరాజు పట్టణమునుగూర్చి పరిశీలించితిమిగదా! ఇక మిగిలిన

నెల్లూరు ప్రాంతమంతయు ఆర్కాటు నవాబుతో ఇంగ్లీషువారు చేసికొనిన ఒడంబడిక ప్రకారము 1781 లో ఇంగ్లీషువారి చేతులలోనికి వచ్చెను. 1801 లో కర్ణాటక మంతయు 'నవాబు అజీముద్దౌలా' ఇంగ్లీషువారికి కట్టబెట్టినప్పుడు నెల్లూరుప్రాంత మంతయును శాశ్వతముగ ఇంగ్లీషువారికి వచ్చెను.

ఈ విధముగా 19 వ శతాబ్ది ప్రారంభమునాటికి ఆంధ్రదేశమంతయు ఇంగ్లీషువారి వశమయ్యెను. హైదరాబాదు ప్రాంతమునగల తెలంగాణమున వారి ప్రభావము సోకెను. ఆంధ్ర భూభాగముపై వారడుగిడిన (1611) తరువాత సుమారు రెండువందల సంవత్సరములకు వారీ భూమికి పాలకులైరి. 1800 తరువాత వారీ ప్రాంతములలో రాజ్యమును నిలుపుకొనుటకు చేసిన పెద్ద యుద్ధముగాని, వారిని దేశమునుండి పారద్రోలవలెనని స్వదేశీయులు చేసిన పెద్ద ప్రయత్నముగాని స్మరింపదగినదేదియు, 1857 లో జరిగిన 'సిపాయీల కలహము' అని పిలువబడు 'స్వాతంత్ర్య సమరము' వరకు లేదు. ఈ ప్రాంతములలో వచ్చిన పితూరీలు, తిరుగుబాటులు; అప్పటికప్పుడే కాలూని నిలిచిన ఇంగ్లీషువారిని కూలద్రోయ గలిగినంత తీవ్రమైనవి కాకపోయెను.

సామ్రాజ్యము లభించిన వెంటనే కంపెనీవారు తమకు మంచి అని తోచినరీతిని పరిపాలన సాగింప మొదలిడిరి. వీరి పరిపాలనలో కొంతవరకు శాంతిభద్రత లుండుటవలన అంతకు పూర్వము వానికి కొన్ని శతాబ్దులనుండి నోచుకొనని ప్రజలు వీరి పరిపాలనను తీవ్రముగ ప్రతిఘటింపలేదు.

ఈ ఐతిహాసిక విషయములను పృష్ఠభాగమున నిడుకొని, మన సాహిత్య సంస్కృతులపై ఇంగ్లీషువారి ప్రభావ మెట్టిదో ఇంక పరిశీలింపవలసి యున్నది. పదునెనిమిదవ శతాబ్ది ఉత్తరార్ధములో బయలుదేరిన గ్రంథములలో ఇంగ్లీషు వారి ప్రసక్తి బాగుగా కన్పట్టుచున్నది పదునేడవ శతాబ్దియందుకూడ తెలుగు సంస్కృత గ్రంథములలో ఇంగ్లీషువారి ప్రస్తావన గలదు. ఇంగ్లీషువారిని వేంకటాధ్వరి[74] తన 'విశ్వగుణాదర్శము'న పేర్కొనెను. అతని కాలమునాటి

---

**74.** "అత్ర (ముమ్బయ్యామ్) కర్ణాటకనామ్ని ముద్రణయన్త్రాలయే ముద్రితపుస్తకే అఙ్గ్లభాషామయ ప్రస్తావనాయామస్య విశ్వగుణాదర్శ కర్తుర్వృత్తం దృశ్యతే తదిత్థమ్—

'అయం విశ్వగుణాదర్శ కర్తా వేఙ్కటాధ్వరినామా కవిః నీలకణ్ఠదీక్షిత సమకాలః తత్సహాధ్యాయీ చాసీత్' ఇతి । తతశ్చైవం ప్రతిపద్యతే—నీలకణ్ఠదీక్షితః అప్పయదీక్షితస్య పౌత్రః నారాయణ దీక్షితస్య చపుత్రః ఆసీత్ ఇతి కావ్యమాలాఖ్య మాసికపుస్తకస్య ప్రథమ గుచ్ఛాన్తర్గత శ్రీమదప్పయదీక్షిత ప్రణీత వైరాగ్య శతకాఖ్యగ్రన్థస్య ప్రథమ శ్లోకటిప్పణ్యాం

కప్పుడే ఇంగ్లీషువారు చెన్నపట్టణమున స్థిరపడిరి. అచ్చట కోటకై 1639 లో స్థలము సంపాదింపబడినది గనుక; వేంకటాధ్వరి, తన గ్రంథమును తరువాత కొన్ని సంవత్సరములకు, వ్రాసియుండును. ఈ క్రింది శ్లోకమువలన వారు బ్రాహ్మణులను గణుతింపరని తెలియుచున్నది. ఇచ్చట బ్రాహ్మణ శబ్దము భారతీయ సంస్కృతికి ఉపలక్షణముగ గ్రహించినచో, నాటి పరిస్థితులు మనకు తెలియును.

"హూణాః కరుణాహీనాః
తృణవద్బ్రాహ్మణగణంనగణయంతి
తేషాం దోషాః పారే
వాచాం యేనాచరంతి శౌచమపి."

(చన్నపట్టణ వర్ణనమ్ - శ్లో. 262)

ఈ శ్లోకములో ఇంగ్లీషువారిట్లు నిరూపింపబడినను, వారిలో కొన్ని మంచిగుణములు గూడ కలవని ఈ క్రింది శ్లోకము నిరూపించుచున్నది—

"ప్రసహ్యనహరన్త్యమీ పరధనౌఘమన్యాయతో
వదన్తి నమృషా వచో విరచయన్తి వస్త్వద్భుతమ్
యథావిధి కృతాగసాం విదధతి స్వయం దణ్డనమ్
గుణా నవగుణాకరేష్వపి గృహాణహూణేష్వమూన్"

(చన్నపట్టణ వర్ణనమ్ - శ్లో. 264)

ఈ రెండు శ్లోకములను బట్టి, 1640 (సుమారు) నాటికే ఇంగ్లీషువారి మంచిచెడ్డలు ఇంత బాగుగా తెలియునంత సన్నిహిత సంబంధము, వారికిని ప్రజలకును కలిగినదని చెప్పవచ్చును

పదునేడవ శతాబ్దిలో ఇంగ్లీషువారిని పేర్కొన్న గ్రంథము, పాలవేకరి కదిరీపతి ("రామభూపతి తమ్ముని కొమారుఁడగు కదిరీపతియు క్రీ. శ. 1660 ప్రాంతమున నుండుట నిర్వివాదముగా నేర్పడుచున్నది"—శుకసప్తతి; 3rd Edition 1951 ; పీఠికలో శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు - Page VI)

---

దృశ్యతే । అనేన నీలకణ్ఠ చమ్పూరచితా, తత్ప్రారమ్భే స్వకీయ గ్రంథ నిర్మాణకాలశ్చాపి నిర్దిష్టః—'అష్టత్రింశదుపస్కృత సప్తశతాధికచతుః సహస్రేషు । (४७३८) కలివర్షేషుగతేషు గ్రథితః కిల నీలకణ్ఠ విజయోఽయమ్ ॥' ఇతి । తస్మాదేవం నిశ్చయతే ४७३८ తమేవర్షే ఖ్రిస్తాబ్దం १६३८ తమం తస్మిన్నేవ వర్షే నీలకణ్ఠ చమ్పూర్విరచితా, తత్సమకాలీన శ్చాయం వేఙ్కటాధ్వరినామాకవి రాసీత్ ।"—విశ్వగుణాదర్శ చమ్పూః; భూమికా ।

( 1899; Page - 8 )

తెలుగులో రచించిన 'శుకసప్తతి'. ఇందలి మొదటి కథలో; చంద్రవతి యను పట్టణములోని రత్నాకరుడను వర్తకు డిట్లు కొలువుండునని వర్ణింపబడినది—

"వలసిన బేరము త్తెలియవచ్చినవారును వాదు గల్గు వా
రలు మటి గుత్తగొల్లలును రత్నపరీక్షులవారుఁ గార్యము
ల్గలిగిన *యింగిలీసుల ముఖాములుఁ* జెంగట నుల్లసిల్లఁగాఁ
*గొలువున నుండుఁ జూపఱలకుం గనుపండువు సంఘటిల్లగాన్.*"

(శుకసప్తతి. ప్రథమాశ్వాసము ; పద్యము - 175)

ఇంతియగాక అతడు వ్యాపారమునకై సముద్రతీరమునకు పోయి అచ్చట 'పరంగుల'[75] తో నెయ్యమున నుండెనట!

"అందలి విచిత్రవేషభాషాభిరాము
లగు *పరంగులతోడి* నెయ్యమునఁ జిక్కి
చొక్కి బహువత్సరంబు లచ్చో వసించి
పిదపఁ బ్రభు కార్యభారంబు మదిఁ దలంచి."

(శుకసప్తతి. ప్రథమాశ్వాసము ; పద్యము - 196)

'ఇంగిలీసుల ముఖాములు' కదిరీపతి మనస్సులో నెంత గాఢముగా నాటుకొనెనో; మూడవ యాశ్వాసములో సోమదత్తుడను వైశ్యుని వర్ణించు పట్టున వ్రాసిన యీ క్రింది పద్యమును జూచిన తెలియును. రత్నాకరుని వలెనే సోమదత్తుడును కొలువుండెనట!

"వలసిన బేరము ద్దెలియవచ్చినవారలు వాదుగల్గు వా
రలు తెగ గుత్త గొల్లలును రత్నపరీక్షులవారు కార్యము
ల్గలిగిన *యింగిలీషుల ముఖాములు* చెంగట నుల్లసిల్లఁగాఁ
*గొలువొనఁగు న్మహీపగతిఁ గోమటి యాత్మగృహాంగణంబునన్.*"

(శుకసప్తతి - తృతీయాశ్వాసము ; పద్యము 10)

ఇంగ్లీషు వారిని పేర్కొనినను, ఇంగ్లీషుమాటలు ఈ గ్రంథమునందు కానరావు.

ఈతని తరువాత ఇంచుమించుగా నూరు సంవత్సరములకు, 'శుకసప్తతి' అనుకరించుచు 'హంసవింశతి' ని రచించిన అయ్యలరాజు నారాయణా

---

75. "పరంగి n. s. Farangi : plu : పరంగులు or పరంగీలు. Europeans, జాతివాండ్లు. (బ్రౌణ్యమిశ్రభాషానిఘంటువు. Madras, 1854; Page - 66)

మాత్యుడు తన గ్రంథములోగూడ ప్రథమాశ్వాసములోనే ఇంగ్లీషువారి ప్రస్తావన చేసెను. విష్ణుదాసు డనువాడు వర్తకమునకు పోయినప్పుడు—

"ఈడము వళంద బందర యింగిలీషు
కళము మొదలైన పేటల గౌరలెల్ల
సౌరభద్రవ్యములు బేరసార మాడఁ
బిలువనంపిరి తమతమ పేటలకును."

(హంసవింశతి. ప్రథమాశ్వాసము ; పద్యము - 112.)

ఇంగ్లీషువారితోబాటు డచ్చి (వళంద) వారుకూడ ఇందు పేర్కొనబడిరి.

ఈ గ్రంథమందుకూడ 'పరంగుల' ప్రస్తావన కలదు. ఇంచుమించుగ ఆంధ్రదేశమునకు వచ్చిన పాశ్చాత్యులందరి జాతినామములును ఈ క్రింది వచనములో ఈయబడినవి. దేవుని ఉత్సవములో పాల్గొన్నవారిలో వీరును చేర్చబడిరి. హిందువుల ఉత్సవములలో పాల్గొనినట్లు వీరిని పేర్కొనుట వింత !

"...కొమ్మూరి దాసళ్లు, తవిరుదాసళ్లు, కోణంగులు, సేవపరులు, పరసలు పడిగెవారు, కంచికావళ్లవారు, *పరంగులు*, *ఇంగిలీసులు*, *పరాసులు*, *వళందలు*, సన్యాసులు, ఏకదండ త్రిదండులు, ఏకాంగులు, వానప్రస్థులు..."

(హంసవింశతి. తృతీయాశ్వాసము ; వచనము - 29.)

కాని, పాశ్చాత్యవాణిజ్యసంఘములు వర్తకస్థావరములను స్థాపించుకొనుచు వచ్చిన క్రొత్తలో, దేశీయుల ఉత్సవములలో పాల్గొనుటకు తమ అధికారులకు అనుజ్ఞ ఇచ్చుచుండిరి. ఈ క్రింది వాక్యములు దానినే తెలుపుచున్నవి.

"The title of 'Dry Nurse to Vishnu' conferred by some critics on the government of those times had some justification. Many temples were managed, and their funds administered, by government officers. The government was often officially represented at temple ceremonies, and its officers were allowed and even encouraged to contribute to the temple treasuries. This official association with non-christian Worship and Practice, condemned for the most part by enlightened India as grossly superstitious and fruitful in grave social evils, was given up only slowly and after long controversy."[76]

---

76. 'Modern India and the West' - Oxford University Press-1941. ('The Christian Ethic and India' by A. I. Mayhew, C. M. G; Page - 322)

ఉత్సవములలో పాల్గొనుటయేగాక హిందూమతమునకు సంబంధించిన వివిధ కార్యకలాపములకు కంపెనీ ఉద్యోగులు సాయపడుచుండిరి.[77] నాటి క్రైస్తవ మిషనరీల కిది బాధాజనకముగ నుండెను. నాటి కింకను మతవిషయమున కంపెనీవారు పట్టుదల చూపకుండుటయే ఇందులకు కారణము.

'హంసవింశతి' లో పాశ్చాత్యులను 'పరంగి' వారనుపేర పిలచుట తరచుగ కానవచ్చుచున్నది. 'అనవాయుని కథ' లో పరంగి శబ్ద మిట్లు ప్రయోగింపబడెను.

"పొలుపగు మావి లేఁజిగురు పొంది కపోఁతపిరంగిలోన నె
క్కొలిపిన పుష్పగుచ్ఛమను గుండు పరాగపుమందు నించి వె
గ్గలపు పరాక్రమాగ్నిఁగొని కంతుఁ డనేటి *పరంగి* భామ గు
బ్బ లనెడు దుర్గముల్ పగిలి పార గుభుల్లున నేసి యార్చినన్."

(ప్రథమాశ్వాసము ; పద్యము - 230)

చిత్రఘనుడను చిత్రకారుని కథలో, ఆతడు సమస్తపక్షుల రూపములను చిత్రింపగలడని వర్ణించు ఘట్టమందు 'బాతు' అను అన్యదేశ్యమును వాడెను.

"గరుడుండు సంపాతి గండభేరుండంబు చీకురాయాడేలు చెవులపంత
వార్ణెము ఖైరి జావళము సాళ్వము డేగ గూడ బాతుల్లంగి కుందటీల."

(తృతీయాశ్వాసము ; పద్యము - 12)

హంస హేమావతితో తాను తిరిగిన దేశములనుగూర్చి వర్ణించి చెప్పునప్పుడు "హూణాఖ్య సర్వదేశములు చూచి (ఆ-4 ; ప-14) తి"నని చెప్పినట్లు కవి వ్రాసెను.

హేమావతి శయనించిన మంచమును వర్ణించుచు కవి 'పరంగి' శబ్దమును మరల వాడెను.

"పరపు *పరంగి* పోషుగల బంగరు మంచముపై వసించి భా
స్కరు డుదయింప మూడిగపు కామిని లేపఁగ నిద్రలేచి త

77. "But a bare half century before his (Anthony Norris Groves, who came to India in July, 1833) coming to India was almost utterly bereft of vital Christian witness. Nominal Christianity was either wholly corrupt, or a dead formalism. The great Company ruling India in Britain's name actually subsided Hinduism, and required its officials to make public offerings, with full military honours, to the idols on occasions of important festivals." ("They were men sent from god" by E. B. Bromley. Bangalore, 1937. Page - 22)

ఖ్ఖరకరుఁ డస్తమించు దను కానొకరీతి మెలంగి చీఁకటుల్
నెరసిన పిమ్మటన్ నలిననేత్ర మహీపతిమీఁది కోరికన్."

(పంచమాశ్వాసము ; పద్యము - 83)

హేమావతి భర్తయగు విష్ణుదాసుడు కొనితెచ్చినవానిలో 'ఇంగిలీషు కుక్కలు' గూడ కలవు.

"వేఁడి కోదమల వింతయౌ యేటిపునుఁగు
పిల్లుల జవాజి పిల్లుల బెట్టు రురుల
ముంగిస సివంగి జోణంగి యింగిలీషు
కుక్కగుంపులఁ గోఁతులఁ గొన్ని గొనియె."

(పంచమాశ్వాసము ; పద్యము - 354)

ఈ విధముగా ఈ గ్రంథమునందును, శుకసప్తతిలోవలెనే ఇంగ్లీషువారు మొదలుగాగల పాశ్చాత్యదేశస్థుల పేరులేగాని, వారి భాషలలోనిమాటలు, చాల కానరావు. ఇందులకు కారణము ; నాటి కింకను పాశ్చాత్యుల - ముఖ్యముగా ఇంగ్లీషువారియొక్క - సాహిత్య సంస్కృతులతో మనవారికి తగినంత సన్నిహితత్వము లేకుండుటయే అని తోచుచున్నది. వారి సాహిత్యసంస్కృతుల ప్రభావము మనపై సోకుట ఆంగ్లవిద్యావిధానము అమలులోనికి వచ్చువరకును గాఢముగా లేదనవచ్చును.

ఇంగ్లీషువారిని పేర్కొనుటమాత్రమేకాక, వారి భాషలోని పదములును చాల వాడిన కవి చత్రాతి లక్ష్మీనరసకవి. ఈతడు 1794 లో ఇంగ్లీషువారి కిని విజయనగర సంస్థానాధిపతియైన చిన విజయరామగజపతిగారికిని పద్మనాభము[78] (విశాఖపట్టణము జిల్లా, భీమునిపట్టణము తాలూకా) దగ్గర జరిగిన

78. "అంతట గోలుకొండ నుంచి నవాబు మీరు నిజామల్లీఖానువారు వచ్చి రాజమహేంద్రవరం ఆవల కొవ్వూరు వద్దను గౌతమీమహానదీతీరమందు దిగియుండగా, పూసపాటి సమస్థానములో ముఖ్య ఆలోచనకర్తలు అయిన పిన్న పెద్ద మనుష్యులు బుర్రా బుచ్చన్న, బుర్రా వెంకన్న, గుండాల అప్పాజీరావున్నూ ఆలోచనచేసి పెద్దాపురములో వున్న పూసపాటి రామభద్రరాజుగారి రెండో భార్య కుమారుడు అయిన విజయరామరాజును వెంటబెట్టుకొని వచ్చి యీయన ఆనందగజపతిగారి తమ్ముడు అని తీసుకొనివెళ్లి మీరు నిజామల్లీఖానువారికి అగపరచగా ఆయనకు ఆ చిన్నవాడి యందు చాలా అనుగ్రహంవచ్చి, ఆ చిన్నవాడికి పూసపాటివారి సంస్థానం పట్టంగట్టి, శిరుపావు మొదలైన బహుమానములు యిచ్చి నిజామల్లీఖానుడు గోలుకొండకు లేచిపోయెను."

—బారాబట్టీ కైఫీయ్యతు.

(Mackewie's Mss. Vol IV ; Pp - 544—'45)

యుద్ధమునుగూర్చి ఒక ప్రబంధమును వ్రాసెను. ఈ యుద్ధమునకును 1757 లో జరిగిన బొబ్బిలి యుద్ధమునకును చాల పోలికలు గలవు. ఈ రెండునుగూడ విజయనగర సంస్థానాధిపతులు గావించిన యుద్ధములే. మొదటిది (బొబ్బిలి) సంస్థాన మున్నతస్థితిలో నున్నప్పుడు జరిగినది. రెండవది; అప్పటికప్పుడే ఉత్తర సర్కారులను ఆక్రమించుకొనిన ఇంగ్లీషు కంపెనీవారు, విజయనగర సంస్థానముయొక్క ఆధిక్యమును, బలమును నాశనము చేయుటకై, చిన విజయ రామగజపతిగారితో 'గిల్లి కజ్జా' తెచ్చుకొనినది. బొబ్బిలి యుద్ధములో శత్రువుల బలములకంటె తమ బలములు చాల తక్కువైనను, చివరివరకును పోరు సాగించి కీర్తిశేషులైన బొబ్బిలివీరులవలెనే పద్మనాభ యుద్ధములోకూడ చిన విజయరామగజపతి మొదలైన వీరులు, తమకంటె ఎన్నియోరెట్లు బలములను కూర్చుకొనియున్న కంపెనీవారితో తలపడి వీరస్వర్గమలంకరించిరి. బొబ్బిలి యుద్ధకథను, దిట్టకవి నారాయణకవి ప్రబంధముగా చేసినట్లే ఈ యుద్ధగాథను చత్రాతి లక్ష్మీనరసకవి ప్రబంధముగా సంతరించెను.

ఈ గ్రంథము అసంపూర్ణము. పద్మనాభ యుద్ధములో చిన విజయరామ గజపతిగారు చనిపోవువరకు గల భాగము, ఏకాశ్వాసముగ ముద్రింపబడినది. (1932 తృతీయ ముద్రణము.) ఈకవి, దిట్టకవి నారాయణకవి రచించిన రంగ రాయ చరిత్రమును చూచినాడనుటకు తార్కాణముగ, ఇందలి కొన్నిపద్యముల పోకడలు తెలుపును. ఆ గ్రంథమునందువలెనే దీనియందును, యుద్ధవర్ణనల యందును, సేనాబలములనుగూర్చి చెప్పునప్పుడును అతిశయోక్తికలదు. ఈ గ్రంథమును రచించిన కవి సూరకవికి సమకాలికుడనియు, 'ఖండనారాతి భీమ శతకము' మొదలగునవి వ్రాసినాడనియు, గ్రంథముయొక్క అవతారి కలో కలదు. గ్రంథము అసంపూర్ణముగనుకను, పద్మనాభయుద్ధము ముగిసి నంతవరకుగల భాగమే దొరకినందునను, కవి ఈ గ్రంథమునకు పెట్టినపేరు ఉపలభ్యమానమైన భాగములో లేకుండుటచేతను, ప్రకాశకులు ఈ గ్రంథము నకు "పద్మనాభయుద్ధము" అను పేరుపెట్టి ప్రకటించిరి. దీనికి 'విజయరామ యశోభూషణ' మను పేరుకూడ గలదనికూడ ప్రకాశకులు తెలియజేసిరి.[79]

ఈ గ్రంథములో ఇంగ్లీషుమాటలు చాలగలవు. మాటలేగన్పట్టుచున్నవి గాని, వారి భావానుసరణమున్నట్లు నిదర్శనములు దొరకలేదు. ఇంగ్లీషువారి

79. పద్మనాభ యుద్ధము - తృతీయ ముద్రణము. 1932 ; ప్రకాశకులు - శ్రీ వత్సవాయి రాయ జగపతివర్మగారు. అవతారిక - Pages - 4, 5.

సాహిత్యముతోగాని, సంస్కృతితోగాని నాటి కింకను (కవి 18 వ శతాబ్ది చివరివాఁడు) ఆంధ్రప్రజలకు తగినంత సన్నిహిత సంబంధము లేకుండుటయే దీనికి కారణము కావచ్చును. నాఁడు దేశములోనున్న ఇంగ్లీషువారిలో చాలమంది సంస్కారమంతగాలేని వర్తకులు. వారికిగాని, వారికి సాయము చేయుటకై స్వదేశమును విడిచివచ్చిన యుద్ధభటులకుగాని ; తమ సంస్కృతియే సరిగా పట్టుబడియుండకపోవచ్చుననుకొన్నను సత్యదూరముకాదు. ఇకనట్టివారు సాంస్కృతికముగ, ఆంధ్రప్రజలపై ప్రభావమును జూపగలరు? కనుక, ఆనాటి తెలుగు గ్రంథములలో - ముఖ్యముగా ఈ గ్రంథములో - కనబడు ఆంగ్ల పదములు; వర్తకమునకు సంబంధించినవి, యుద్ధపరికరములకు సంబంధించినవి, అయియున్నవి.

తత్కాల గ్రంథముల సంప్రదాయముననుసరించి ముసల్మానుల భాషల లోని పదము లిందు చాలవాడబడినవి.

ఈ గ్రంథములో ఈ క్రింది ఇంగ్లీషు ఫ్రెంచి మాటలు ప్రయోగింపబడెను.

1. కుంఫినీ లేక కుంఫిణీ (Company) : ఈ పదము చాలసార్లిం దుపయోగింపబడినది. "......రశీదు, లిమ్మనిన కుంపినీ వారలిట్టు లనిరి" (ఆ-1; ప-42) "ఇది నిమిత్తంబుగా మనతోడం గలహించి కుంపిణీ వార లనేక కాలంబులనుండి యస్మద్రాజ్యాపహరణంబు చేయ నుద్యోగించియున్నవారు" (ఆ-1; ప-60)

"......వే, గానంబంపుము రేపు రమ్మనుచు వక్కాణించియిక్కుంపిణీ
తోనన్........." (ఆ-1; ప-63)

"..... మము గెల్చునో మరియు కుంపెణీ వారని వెన్కతగ్గునో"
(ఆ-1; ప-107)

"కుంపిణీ వారు గా రల గోలుకొండ, పాదుషా తర్లివచ్చిన భయము పడకు." (ఆ-1; ప-112)

"గెలిచెదరు కుంపినీ వారి చలము వినుము" (ఆ-1; ప-121)

"......భూనాథుఁడీ కుంపిణీ, బలమున్ గండెములేక...(ఆ-1; ప-125)

"తెలిసెనె కుంపినీ మయిదు తెల్లముగా నిపుడెల్లవారికిన్ (ఆ-1; ప-136)

"నీవు వెళ్ళి మా, కును పనిలేదు నేరమని కుంపిణీ వారి దురాలు వెట్టి గుప్పున నరుదెంచు మిచ్చటికి........." (ఆ-1; ప-137)

"చని చని కుంపిణీ దొరల సామిరు ముఖ్యులతోడఁబల్కె..."
(ఆ-1; ప-138)

"మీ కోటలోపల మా కుంపిణీ కాడి
నేడు తప్పక నిల్వనియ్యవలయు" (ఆ-1; ప-142)

"శ్రీ విజయరామ మహారాజ దేవేంద్రుండు పేరోలగంబునం గొలువు గూర్చుండి కుంపిణీ వారి మా యోపాయంబునకున్ బ్రతిహతంబు విచారింపుచు."
(ఆ-1; ప-155)

"పంపించిన వారప్పుడు
కుంపిణీవా రిటకు పోటుకున్ వచ్చిరి..." (ఆ-1; ప-162)

"కూక వేయుచు జాగేల కుంపిణీలు" (ఆ-1; ప-163)

"......కుంపిణీలు భూ, వరుని రణంబునం గెలువవచ్చును..."
(ఆ-1; ప-168)

"...పిరుంద హేలు, దాదుల కుంపిణీల్ కట్టంబుగాఁబెట్టి
ఆందోళికావ్యూహమపుడు గట్టి" (ఆ-1; ప-198)

"కూడదు, కుంపిణీ మొనలు గుం డెగిరించిన..." (ఆ-1; ప-205)

"తన కుంపిణీల నుద్యల్లీల ముంగల..." (ఆ-1; ప-228)

"...కుంపిణీలతోడ,కలిసిరంత..." (ఆ-1; ప-271)

"కుంపిణీవారు మనమీద కోపగింప, నేమి హేతువ..." (ఆ-1; ప-61)

2. **సోలుదాదులు** (Soldiers) : ఇది ఫ్రెంచి పదమునకు సమీపమైన ఉచ్చారణ కలదిగా వాడబడినది. ఇంగ్లీషు పదమునకు తగిన ఉచ్చారణ కలదిగా (సోల్జర్, సోజర్) ప్రయోగింపబడలేదు. శ్రీరంగరాయ చరిత్రములో గూడ నిట్లే ప్రయోగింపబడినది.

"అప్పుడు కన్నులందున దవాగ్ని మిణుంగురులొల్కఁగా దొరల్
గుప్పున సోలుదాదులను గూర్చుకొవచ్చి..." (ఆ-1; ప-223)

"సూర్యోదయ కాలంబున
ధైర్యంబున నిలిచి సోలుదాదులు తానున్" (ఆ-1; ప-227)

"సోలుదాదులనేలు కర్ణేలు మీద
ఫయరు సేయించి పిడుగుల వర్షమనగ" (ఆ-1; ప-228)

"సోలుదాదులు మ్లేచ్ఛులు వేలకొలది
గూల మిక్కిలి శలకులు గొట్టిరపుడు." (ఆ-1; ప-233)

"సారంపు ప్రౌఢి మిక్కిలి
ధారాళము కాగ సోలుదాదుల తోడన్." (ఆ-1; ప-249)

"మహారాష్ట్రి ఘూర్జర మగధ నృపాలురు
సోలుదాదులు కుంపిణీలతోడ." (ఆ-1; ప-271)

"అట్టియెడ సోలుదాదులు
మట్టుకొ వచ్చిన కళింగ మహిపతి బలముల్." (ఆ-1; ప-279)

"ధాత్రీనాథుని వీరసైన్యములు సోల్దాదుల్ మహాభీములై"
(ఆ-1; ప-252)

3. లయను (Line) : సేనా విన్యాసమును వర్ణించు ప్రతి ఘట్టమునను కవి దీనిని ప్రయోగించెను.

"...బారుల, లయను దీర్చిన పటాలములు మెరయ." (ఆ-1; ప-7)

"లయను చెప్పెడి తంబురాల ధణంధణ
ధ్వానంబు ఘనఖోంతరము మ్రోయ." (ఆ-1; ప-33)

"లయను దిద్దుచు పటాలంబులం బురికొల్పి
మ్రోల శతఘ్ని కాజాలమంత" (ఆ-1; ప-198)

"...జాతి పటాలం
బరుదెంచి నిలిచె తంబుర
మొరయింపుచు లయను దీర్చి ముంగల నంతన్" (ఆ-1; ప-206)

"లయనులు దీర్చుచు నప్పుడు
ఫయరులు సేయుచును నుభయబలములు గడిమిన్" (ఆ-1; ప-211)

"తన కుంపిణీల నుద్యల్లీల ముంగల
లయను గావించి దుర్లభ శతఘ్ని
కానహస్రంబు శీఘ్రంబుగా దట్టించి
బాణశతంబులు బారుజేసి." (ఆ-1; ప-228)

4. ఫయరు (Fire) : తుపాకులు మొదలగునవి కాల్చుటను వర్ణించు నప్పుడు ఈ కవి, దిట్టకవి నారాయణకవి (రంగరాయ చరిత్ర) వలె గాక, ఈ ఆంగ్ల పదమునే చాలసార్లు వాడెను. ఈ పనికి సాంకేతికమైన ఈ ఆంగ్ల పదమే కవికి నచ్చిన దనుటలో సందేహము లేదు.

"తొలి ఫయరు వారు చేసిన గెలువమనుచు
నూహ చేయుచు జాగ్రత్త నున్నయంత" (ఆ-1; ప-207)

"లయనులు దీర్చుచు నప్పుడు
ఫయరులు సేయుచును నుభయ బలములు కడిమిన్." (ఆ-1; ప-211)

"ఫయరులకున్ శతంబులు తుపాకుల గుండులు దాఁకి ప్రాణ సం
శయముల బొంది వీరవర సైన్యము శోణిత సిక్తదేహులై."
(ఆ-1; ప-215)

"చెకుముకీల బారుసేయు ఫయరు
మంట నింగిమోసె గుండె ఢ డేలున" (ఆ-1; ప-217)

"తప్పక నొక్క ఫైరు బెడిదంబుగ జేసిరి వేలు కూలగా" (ఆ-1; ప-223)

"సోలుదాదుల నేలు కర్నేలుమీద
ఫయరు సేయించి పిడుగుల వర్షమనగ" (ఆ-1; ప-228)

"..........ఫయరొనరించిరి
జడనిధిఘూర్ణిల్ల నల్లజద లవియంగన్" (ఆ-1; ప-253)

5. ఆప్సరులు (officers) : ఇంగ్లీషు వారి సేనలోని సోలుదాదులతోబాటు వీరును పేర్కొనబడిరి.

"సర్వపటాలంబులును, నాప్సరుల సైన్యంబులును........."
(ఆ-1; వచనము-130)

"......కెలంకు లనంగ రెచ్చ గల్గిన నాప్స
రుల నిశ్చయించి........." (ఆ-1; ప-198)

6. కుముందాను (Commandant) : ఫ్రెంచి పదమునకు సమీపమైన ఉచ్చారణ కలదిగ వాడబడెను.

"అట్టి వీరాధివీరుఁడు హసను బేగు
ముసలిమాను కుముందాను..." (ఆ-1; ప-117)

7. కెప్తాను (Captain) : కపితాను అనికూడ ప్రయోగింపబడెను.

"దాట్ల వెంకటపతిరాజు దళముతోడ
తొలగి పోక లడాయీని నిలిచెనేని

హేలుదాదు కెప్తాను లేల కాదు
కుంభసంభవుఁడైన తగ్గుల నిజంబు." (ఆ-1; ప-113)

"...సర్వపటాలంబును, నాప్సరుల సైన్యంబును, కవితానుల పరం
పరలును,........" (ఆ-1; వచనము-131)

8. కర్నేలు (Colonel) :

"అని షామీరు కఠోరవాక్యము లసంఖ్యం బాడి కర్నేలుతో
మనతో రాజు లడాయి సేయు........" (ఆ-1; ప-106)

"అని యిట్లు పద్మనాభం
బున వారు లడాయి సేయ పూనికతో నుం
డిన మాట దెలుప కర్నేల్
కనుదోయిని నిప్పులొలుకఁగా నిట్లనియెన్." (ఆ-1; ప-124)

"సూర్యోదయ కాలంబున
ధైర్యంబున నిలిచి సోలుదాదులు తానున్
శౌర్యంబున నరపతితో
కార్యంబున కతుకు బడియె కర్నేలులకున్." (ఆ-1; ప-227)

"సోలుదాదుల నేలు కర్ణేలుమీద
ఫయరు సేయించి పిడుగుల వర్షమనగ
పుడమి జవజవలాడ భూభుజులు వేడ." (ఆ-1; ప-228)

"కాలుంగేలి యొనర్పజాలిన భుజాగర్వంబు రెట్టింప, క
ర్ణేలల్కం గరవాలమూనుకొని తా నీ సేనపై నుగ్రతన్."
(ఆ-1; ప-229)

"కదన క్షోణి జలింపగా హరిణి వ్యాఘ్రంబట్ల కర్ణేలు సొం
పు దలిర్పన్................." (ఆ-1; ప-230)

"ఆ వచ్చు కర్ణేలు నరసి హసన్ బేగు
శరవేగమున నట కరుదెంచి." (ఆ-1; ప-228)

"సోలుదాదులనేలు కర్ణేలుమీద
ఫయరు సేయించి." (ఆ-1; ప-228)

9. మేస్తరు కల్కాటేరి (Mr. Collector) :

"అంత విశాఖపట్టణమునందున మేస్తరు కల్కాటేరివా, రెంతయు..."
(ఆ-1; ప-104)

(ఇందు పేర్కొనబడిన కలెక్టరు 'షామీరు' (Mr. Chamier) అనునతడు.)

10. ఇంగిలీజు (English) :

"*ఇంగిలీజు* దొరల నెన్నటికిని నమ్మ
రాదు సమయమైన మైదు జేసి
కలిసి భంగపెట్ట గలవారు వారల
రర్థకాంక్ష జెంది రదియెగాక." (ఆ-1; ప-68)

"పరగు జాజ్వల్యమానమై ప్రజ్వరిల్లు
ధూమబాణంబు లయ్యెడ దొడరి వేసె
*ఇంగిలీజుల* పౌఁజు బేలెత్తునట్లు
విజయరామావనినాథ వీరసేన." (ఆ-1; ప-224)

11. పిస్తోలు (Pistol) : ఆంగ్ల శబ్దమునుండిగాని పరాసు శబ్దమునుండి గాని వచ్చియుండును.

".........కడు పచ్చనిరంగు శరీరమందు, పి
*స్తోళులు* మధ్యమందు........." (ఆ-1; ప-16)

12. కంపలేరి (Counsel) : ఆంగ్ల శబ్దభవముగాని, పరాసు శబ్దభవము గాని యగును. 'మంత్రాలోచన' యను అర్థమున వాడబడినది.

"అల్ల విశాఖపట్టణమునందున గల్గు దొరల్ సమస్తమున్
దెల్లముగాగ నందరొక దిక్కున గూడుకొ పెద్దప్రొద్దు రం
జిల్లగ *కంపలేరి* తగజేసి లడాయి నిజంబు రాజుతో
నెల్లి యటన్నమాటలటనెంతయు నా చెవిసోకె భూవరా."
(ఆ-1; ప-53)

13. కావ్యమునందు పేర్కొనబడిన పాశ్చాత్యులు.

(a) షామీరు : Mr. Chamier; Chief officer at the Vizag factory.

"అని షామీరు కఠోరవాక్యము లసంఖ్యం బాడి...." (అ-1; ప-106)

"శతఘ్నికాపాత్రంబు లగ్రభాగంబునం బ్రకాశింపుచుండ షామీరు కర్నెలు......... "

(ఆ-1; వచనము-131)

"చని చని కుంపిణీదొరల షామిరు ముఖ్యులతోడ బల్కె......"
(ఆ-1; పద్య-138)

"The Zamindari of Mogalturu was about this time annexed to the Company's dominions........Since its assignment in 1787, Mr. Revell had been administering its affairs as Collector......He was at this time compelled to proceed on leave to England owing to ill-health, and *Mr. Chamier* was appointed Collector in his stead, but independent of the chief and Council and under the immediate superintendence of the Board of Revenue. Mr. Chamier did not retain the appointment long, being promoted to the chief-ship of Vizagapatam in December 1791." (The Godavery District; by Henry Morris; London - 1878; page—256)

(b) కుపలాము : ఒక పరాసు సైన్యాధిపతి[80] (M. Conflans)

"రావణ కుంభకర్ణ ప్రౌఢిమీరిన
కుపలాము పారువాన్ గొట్టలేదొ" (ఆ-1; ప-123)

(c) మాలీసు :

మాలీసు మాలీసమానుతానసవర్థి
నూర్ద్విసుఖానులన్ మోదలేదొ" (ఆ-1; ప-123)

(d) హిసదు :

"...హిసదు మొదలగు సితాస్యాధినాథ పరిరక్షితంబగు మహీచక్రంబు..."
(ఆ-1; వ-131)

14. రశీదు (Receipt): "A Corruption for 'Receipt' or the Persian 'Rasida.' చెల్లుచీటీ." (బ్రౌణ్య మిశ్రభాషా నిఘంటువు - 1854; Page - 103)

"వెనుకనుంచి చెలాయింతుమని *రశీదు*
లిమ్మనిన కుంపినీ వార లిట్టు లనిరి." (ఆ-1: ప-42)

"...బాకీ, యున్నను *రశీదు* లిమని
చెన్నాపట్టణపు వర్ది చెప్పిరి మాకున్." (ఆ-1; ప-43)

80. "మూసా శబ్దము పూర్వమందు మెలగన్ ముఖ్యుల్ సజాతీయులౌ
లాసూ, మర్తెను, దొమ్మి తీరు, విపులాం, లస్సీను, కుప్లాం, కువే
మాసూ నాములు వానిఁ జేరి రతిదుర్మానుల్ జిరాకూర్పు మి
న్నాసన్నంపు బనాతు పింజరుల సొన్నా పాలకీ లెక్కచున్."
(రంగరాయ చరిత్రము - 1909. వావిళ్ళవారి ప్రతి - ఆశ్వా - 1; పద్య - 146)

ఇన్ని పాశ్చాత్య భాషాపదము లున్న గ్రంథములో కూడ, మచ్చున కైనను, పాశ్చాత్య భావప్రభావమున్న ఘట్టము కానరాదు. ప్రకృతి వర్ణన లలో గాని, వీరుల పరాక్రమమును వర్ణించు పట్టునగాని, సంప్రదాయ సిద్ధములైన కవిసమయములనే వాడెనుగాని, అన్య సంప్రదాయములను కవి స్వీకరింపలేదు. దేశీయులను వర్ణించునప్పుడేగాక విదేశీయులను వర్ణించునపుడును కవి; వారిని వారి భావములనుగూడ, దేశీయతాముద్ర తోడనే చిత్రించెను. ఇందులకు కొన్ని ఉదాహరణములను పరిశీలింపుడు.

పూసపాటివారు మహాపరాక్రమవంతులు గనుక వారిని మోసమున గాని, గెల్చుట కష్టమని 'రమణప్ప నాయకుడు' చెప్పగా, 'కర్నేలు' ఈ విధముగా పలికెను —

"పులి మీసంబుల నూగగా దలచెనో భూనాథు( డీ కుంపిణీ
బలమున్ గండెములేక నిర్భయ మనః ప్రజ్ఞాధురీణుండునై
దెలియం జూచెద మింక నేమిటికి సందేహంబు, దావానలం
బులు మావద్ద ఫిరంగు లీ జగములం బూర్ణాహుతిం జేయగన్."

(ఆ-1; ప-125)

యుద్ధమునకు బయలుదేరిన ఇంగ్లీషువారి సేనలను కవి యిట్లు వర్ణించెను —

" గిరి శిఖరంబుల బెరయు మబ్బుల లీల
తలలందు తోలు టోపిలు దలిర్ప
పూచిన శాల్మలీ భూరుహంబుల మాడ్కి
మేనుల కుడతాలు గానుపింప
కరికరంబుల నుక్కు గదలన జేతుల
చెకుముకి బందుకుల్ చెలువుమీర
తలుపుల గందపట్టెలనంగ రొమ్ముల
కంచుబిళ్ళలతోలుకట్లు మెరయ
శరధి వెడలిన కలియుగాసురులనంగ
కణగి యంత విశాఖపట్టణపుకోట
వెడలె లక్షలు హేలుదాదులు పటాల
ములు మహీచక్రమెల్లను కలచ జాతి."

(ఆ-1; ప-130)

రాజుగారి సేనయు, ఇంగ్లీషువారి సేనయు, "...అఖండల దైత్యానాయకుల" సేనలవలె నుండెనట! ఉభయుల సేనలందును, "ప్రళయకాల మహాకాల ఫాల

వహ్ని విధముగల దివ్యబాణముల్ వేయువారు" కలరట! తన సేనలు నాశన మగుటను చూచి, "కాలుంగేలి యొనర్పజాలిన భుజాగర్వంబు రెట్టింప, కన్నె లల్కం గరవాలమూనుకొని" విజృంభించినాడట! సామాన్యముగా ప్రబంధ ములలో యుద్ధవర్ణనలు వచ్చునప్పుడు కన్పట్టు; భూమి దద్దరిలుట, కులశైల ములు కూలుట మొదలగునవి ఇందునుగలవు—"పుడమి చలియింప, దిశలదర, నభమంతయును గడగడవణంక, రవి తడబడుచునుండన్, జలనిధి చతుష్టయము సుడివడ కులాచలము లుడుగని భయంబునను చిడిముడి పడంగన్." (ఆ-1; ప-240.) నాటికాలమున వాడుకలో నున్న యుద్ధోచిత పారిభాషిక పద ములను (అన్యదేశ్యములైనను) ప్రయోగించుటకు జంకనికవి, పాశ్చాత్య సాహిత్యములతో పరిచయమునే కలిగియుండినచో అందలి భావములను మాత్రము గ్రహింపక విడచునా? కాని నాటి కింకను ఆ యవకాశము లేదు గనుక అన్యదేశ్యములనుమాత్రము ప్రయోగించి కవి తృప్తిజెందెను. భావములు సంప్రదాయసిద్ధము లైనవే. ఈ క్రింది పద్య మీ సాంకర్యమును చక్కగా చూపును.

"గడగడ పుడమి వడంకన్
జడియక య మ్మోటి వీరసైన్యంబు జవం
బుడుగక భయ రొనరించిరి
జడనిధి ఘూర్ణిల్ల నల్ల జర లవియంగన్." (ఆ-1; ప-253)

ఈ గ్రంథములోనే గాక, శ్రీరంగరాయ చరిత్రమునందును పాశ్చాత్యు లకు సామాన్యముగా 'జాతివారు[81], తెల్లవారు' అను మాటలు వాడబడినవి. 'తెల్లవారు' అను పదమును సంస్కృతీకరించి, రకరకములుగా—సితాస్య, శుభ్రాస్య, సితానన, సితవక్త్ర, శుభ్రముఖ;[82] అని వాడిరి. ఈ పదముల

---

81. "....................కృత్రిమ
మతులుగదా జాతివారు మనుజుల లోనన్" (ఆ. 1; ప. 244)
(జాతివాండ్లు Europeans - జాతివాడు an European
జాతిది an English woman. Plural జాతులవారు.)
— Charles Philip Brown; తెలుగు - ఇంగ్లీషు నిఘంటువు. Page - 323

82. "....మది నమ్మగరాదుసుమీ సితాస్యులన్" (ఆ. 1; ప. 67)
"వలదోయన్న సితాననాధిపులు దుర్వారుల్ జుమీ .." (ఆ. 1; ప. 84)
"....అసురభీషణులై సితవక్త్ర సేనపై" (ఆ. 1; ప. 236)

నన్నిటిని కొంచెము నీచార్థమందే ప్రయోగించిరి. వీరి భాషనుగూర్చిన ప్రస్తావన వచ్చినప్పుడెల్ల, దాని పేరు చెప్పక "జాతి భాష"లో[83] అని వ్రాసినాడీ కవి. ఇంచుమించుగా ఈ పూర్వకవులందరు నట్లే ప్రయోగించిరి.

1794 లో జరిగిన యుద్ధమును గూర్చి వ్రాసిన ఈ గ్రంథము. ఆంగ్లేయుల ప్రభావము ప్రభుత్వముగా మారుచున్న రోజులలో బయలుదేరిన గ్రంథమని గ్రహింపవచ్చును. గ్రంథము శ్రీ చిన విజయరామగజపతిగారి కుమారులైన శ్రీ నారాయణగజపతిగారి కంకితముగ చెప్పబడుటచే, గ్రంథము 19 వ శతాబ్ది ప్రారంభమున రచింపబడినదనుట యొప్పు. ఈ గ్రంథమును బట్టి, నాటికి ప్రజలలో ఇంగ్లీషు మాటలు ఎంతవరకు వ్యాప్తిలోనికి వచ్చెనో తెలియును.

భారతదేశమునందు సామ్రాజ్యమును నెలకొల్పనెంచి, చివరివరకును యుద్ధములు చేసినవారు, ఫ్రెంచివారును ఇంగ్లీషువారును గనుక ; వారు స్వదేశప్రభువుల సాహాయ్యములను పొందుటకై వారికెల్ల విధముల సన్నిహితులగుచు వచ్చిరి. ఈ సన్నిహితత్వము; పదునెనిమిదవ శతాబ్ది మధ్యభాగమున మిక్కిలి యధికమయ్యెను గనుక, ఆ కాలములో బయలుదేరిన గ్రంథములలో ఫ్రెంచి, ఇంగ్లీషుభాషల ప్రభావము స్ఫుటముగ గోచరించినది.

పదునేడు, పదునెనిమిదవ శతాబ్దులలో పేరుపొందినకవులు—శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారి లెక్కననుసరించి—సుమారు నూటపాతికమంది కలరు. వారి గణనలోనికి రాని కవు లింకొక పాతికమంది కలరన్నను, కవుల సంఖ్య నూటయేబది దాటదు. ఈ కవులలో చాలమందికి - దక్షిణాంధ్రకవులకు తప్ప - రాజాదరణ గాని, ప్రజాదరణ గాని సరిగాలేదు. ఆ కాల మట్టి సంధి యుగము. కవులలో కూడ ప్రతిభావంతులైనవారి సంఖ్య తక్కువ. సంఘము స్తబ్ధమై యున్నట్లే, కవులును నిస్తేజులై యుండిరి. ప్రాతవానికి మెరుగులు పెట్టుట వీరిలో చాలమంది చేసినపని. దేశమునకు, పాశ్చాత్యుల పాలనరూప

"ధా, త్రిపతుల్ శుభ్రముఖావళుల్ సమరధాత్రిన్ వేనవేల్గాలగన్"

(అ. 1; ప. 267)

83. "అని తనజాతిభాష ననయంబు నయంబు భయంబు దెల్పుచున్"

(అ. 1; ప. 128)

"తమ జాతిభాషల ధారుణీ చక్రంబు
గంపింపనందరు గుంపుగూడి" (అ. 1; ప. 198)

మున, మహోపద్రవము వచ్చుచుండ, వీరు పరిసరముల మాటయే విస్మరించి, పురాణప్రసిద్ధములైన ఇతివృత్తములనే గ్రహించి, ప్రబంధశైలిలో వ్రాయుచుండిరి. అక్కడక్కడ సంఘచైతన్యమున్న కవులు గొంతు విప్పినను, వారి మాటలకు విలువరాలేదు. వారును శతకములలో తమ ఆవేదనను వ్యక్తము చేసి, మిగిలిన కాలములో ప్రబంధములనే వ్రాయుచుండిరి. ఈ రచనలలో ముఖ్యముగా ముసల్మాను భాషలలోని పదములే పడుచుండినవి గాని, అప్పుడప్పుడే ప్రబలుచున్న పాశ్చాత్యులభాషలలోని పదము లంతగాలేవు. ఇందులకు దేశములోగల పాశ్చాత్యులసంఖ్య తక్కువగుటయు నొక కారణము.

ఇట్టి పరిస్థితులలో బయలుదేరిన సాహిత్యములో పాశ్చాత్యభాషాపదము లుండుటయే చాల కష్టము. రచనల ఇతివృత్తములు చాలవరకు పురాణ ప్రసిద్ధములైనవగుటచే, పాశ్చాత్యభాషాపదముల యుపయోగమునకవకాశము తక్కువ. కాని, నాడు బయలుదేరిన గ్రంథములలో, చారిత్రక సంఘటనల నితివృత్తముగ తీసికొని కవులు రచించిన వానిలో, పాశ్చాత్యభాషా పద ప్రయోగ ముండుట కవకాశమున్నది. అట్టివానిలో ముఖ్యమైనవానిని పరిశీలించుట అయినది. ఈ పరిశీలనమువలన, వాటి కింకను పాశ్చాత్య భాషాపదములను గ్రహించుటయేగాని, వారి భావములను గ్రహించుట అంతగా జరుగ లేదనియు, విదేశస్థులతో మనవారు మాటాడునప్పుడు వచ్చు నిత్యవ్యవహారములోని పదములే నాటి గ్రంథములలో వచ్చిచేరినవనియు తెలియుచున్నది. పందొమ్మిదవ శతాబ్ది ప్రారంభమునాటికి పాశ్చాత్యులతోడి మన సంపర్కమున కిదియే ప్రతిఫలము. పాశ్చాత్యుల రాకతో, క్రైస్తవమతమును మనదేశములో వ్యాప్తిని జెందినది గనుక, ఇది మన భాషాసాహిత్యములపై చూపిన ప్రభావము నింక పరిశీలింపవలసి యున్నది.

★

# క్రైస్తవ మతము
# ఆంధ్రభాషా సాహిత్యములు

పాశ్చాత్యులు మనదేశమునకురాకపూర్వమే, క్రైస్తవమతము భారత దేశము యొక్క పశ్చిమతీరమున నుండెను. ఇది ప్రాగ్దేశములనుండి వచ్చినది. కాని పోర్చుగీసువారి రాకతో, ఈ మతవ్యాప్తికై చేయు ప్రయత్నము లధిక మయ్యెను. క్రమక్రమముగ భారతదేశములోని అన్నిప్రాంతములందును పాశ్చాత్యుల సంఖ్య అధికమగుచు రాగానే, వారి మతమును గూర్చియు, ప్రార్థనాదులను గూర్చియు ప్రజలు గ్రహించుచువచ్చిరి. ఆంధ్రప్రజలకును ఈ విషయములు తెలియుచువచ్చినవి. ముఖ్యముగా పాశ్చాత్య వర్తకుల యొక్క వ్యాపార కేంద్రములందును, తత్పరిసరములందును గల ప్రజలకు ఈ మతమును గూర్చియు, మతగ్రంథమును గూర్చియు కొంత ఎక్కువగా తెలిసియుండుట కవకాశమున్నది. ఇక పాశ్చాత్యులతో మనకు సంపర్కము కలిగినప్పటినుండి, సుమారు పందొమ్మిదవ శతాబ్ది తుదివరకు, క్రైస్తవ మత ప్రభావము ఆంధ్రభాషాసాహిత్యములపై ఎట్లెంతవరకు పడినదో పరిశీలింతము.

ఆంధ్రదేశములో డచ్చివారు, ఫ్రెంచివారు, ఇంగ్లీషువారు గిడ్డంగుల నేర్పర్చుకొని వర్తకము చేసిరి. వీరిలో ఇంగ్లీషువారు, రాజ్య సంపాదనమును ప్రారంభించుటకు ముందు, సుమారు ఇన్నూరు సంవత్సరములు వర్తకము తోడనే తృప్తిపడిరి. ఆ కాలమందు దేశమున మతప్రచారకులు విశేష ముగ తిరిగి ప్రచారము చేయకున్నను, మచిలీపట్టణము మొదలగు పెద్ద పట్టణ ములలో క్రైస్తవ మతప్రచారము కొంత జరుగుచుండెనని చెప్పుట కాధార ములు గలవు. 1670 నాటికే మచిలీపట్టణములో ఒక చర్చి (Church) ఉన్నటులను, ఆ పట్టణము మిక్కిలి యభివృద్ధిలో నుండినట్లును ఈ క్రింది వాక్యముల వలన తెలియుచున్నది.

"The city of Masulipatam is famous all along the coast of Coramandal. It is situated sixty Leagues North of Madrasta, a very populous place, and of great Trade. The English and Dutch, and at present the French, have erected Factories there. Some years ago, besides these, the Danes had one too. Some Portuguese, Mungrels, *and Blacks, who are Catholicks,* live there, and *have a little church,* where there was a Father of the order of St. Augustin. Some English and Dutch, who have discharged themselves from their Companies, have settled there, and live with their Families. The

Climate is very bad and unhealthy. They said the Heat from April to August was intolerable. All the country abounds in Wheat, Rice, Sheep, Hens, Geese, Fish and fruit, all at reasonable rates. I stayed with my Chinese in the French factory, where I said Mass to them everyday, and dined and supp'd at their Table; they treated me in Health and a small sickness, I had with extraordinary Kindness, Love and Affection. The ship that was to sail for Suratte lay six Leagues lower at Rosipor (Probably Nursapur—Author). It was to be sheathed, and they had not yet begun to work on it, which troubled me extremely. The city is singular, and there being such a diversity of Natives, there falls out something new every day among Persians, Armenians, Moors etc. That city resembles Babel, in the variety of Tongues, and differences of Garbs and Customs, but I liked the natural Inclinations of them all. *I sometimes went to the Church,* which was a considerable distance from the Factory, met several people by the way, and they were all courteous and civil. I talked with some English and Dutch, visited them, because it was necessary, and found them very obliging in their words, and some no less in their Actions."[1]

ఈ వాక్యములవలన మచిలీపట్టణములో 1670 నాటికే (పదునేడవ శతాబ్ది) ఒక చర్చి యున్నటులను, కొందరు 'నల్లవారు' రోమను కేథలిక్కులుగ నున్నట్లును తెలియుచున్నది. ఆంధ్రదేశములో క్రైస్తవ మత వ్యాప్తికై గొప్పకృషి, పదునెనిమిదవ శతాబ్దియొక్క చివరిభాగమునను పందొమ్మిదవ శతాబ్ది పూర్వభాగమునను బాగుగ జరిగినది. కాని, కవిత్వ వస్తువుగ క్రైస్తవమతమును కలిగియుండి ఉత్తమశైలిలో రచింపబడి మన కుపలభ్యమానములగుచున్న రెండు ప్రబంధములును ఈ కృషికి ముందే బయలు దేరుట విశేషము. ఆ రెండు గ్రంథములును (1) పింగళి ఎల్లనార్యుని 'తోభ్య చరిత్ర' (2) మంగళగిరి ఆనందకవి యొక్క 'వేదాంతరసాయనము'—అనునవి.

ఈరెండు గ్రంథములలో పింగళి ఎల్లనార్యుడు వ్రాసిన 'తోభ్యచరిత్రము' (సర్వేశ్వర మాహాత్మ్యము) మంగళగిరి ఆనందకవి రచించిన 'వేదాంత రసాయనము' కంటె పూర్వము రచింపబడినదని (శ్రీ) వీరేశలింగంపంతులుగారి అభి

1. An Account of China, Written in Spanish, by the R. F. F. Dominic Fernandez Navarette. Translated in "Collection of Voyages and Travels." London, 1704. Vol. I. (As quoted by Henry Morris in his book on the "Godavery District". London 1878; Page - 182)

ప్రాయము.[2] ఎల్లనార్యుని వంశాదులన్నియు ఈ క్రింది గద్యవలన తెలియుచున్నవి. గద్య॥ "ఇది శ్రీమదివటూరి శరభనారాధ్య సద్గురు ప్రసాద లబ్ధాష్టవిధ కవిత్వ ప్రవీణ వినయధురీణ భారద్వాజగోత్ర పింగళి నాగయామాత్య పుత్ర యల్లనార్య ప్రణీతంబైన సర్వేశ్వర మాహాత్మ్యంబను మహాప్రబంధంబునందు..."[3]

గ్రంథమును బట్టి కవి క్రైస్తవ మతమును స్వీకరించినవాడని సిద్ధాంతీకరింపలేము. అంతియేగాక కవియే, భక్తవాడ పురాధీశ్వరుఁడైన తుమ్మరాయపరెడ్డి సబహుమానంబుగా తన్నాదరించి; "మున్ను, మజ్జనకాగ్రజుండును *గొండారెడ్డి*[4] కి జనకుండును, నగు *నోబళరెడ్డి భూకాంతునకుం దదీయాచార్యుండగు సంజీవనాథస్వామి* పరాపర విజ్ఞాన మార్గోపదేశ ప్రసంగవశంబున నిత్యంబైన సత్యాధ్యయన విధాన ప్రవర్తకుండైన తోభ్యుండను నొక్క మహాపురుషుని దివ్యచరిత్రంబుగల *సర్వేశ్వర మాహాత్మ్యంబు చిత్రంబుగా ముఖవచనంబులం దేటపఱచి,* సంక్షేపరూపంబైన *వాక్యగ్రంథం* బొసంగె. దీనిం బరిశీలించి సర్వేశ్వరున కంకితంబుగాఁ దెనుంగున మృదువచనరచనా గౌరవం

2. "ఇతఁడు (కవి) దామెర వేంకటాధిపుని కాలములో నుండినట్టుకూడ స్పష్టమగుచున్నది. బహుళాశ్వ చరిత్రమును రచించిన దామెర వేంకటాధిపుఁడు పదునేడవ శతాబ్దారంభమునం దుండినవాఁడు. ఇతఁ డతఁడుగాక యాతని మనుమఁడయినను, కవి (ఎల్లనార్యుఁడు) పదునేడవ శతాబ్ద మధ్యమునందున్న ట్లేర్పడుచున్నది. దీనినిబట్టిచూడఁగా నీ 'తోభ్యచరిత్రము' 'వేదాంతరసాయనము' కంటెఁ బూర్వమున రచియింపఁబడినట్లు కానఁబడుచున్నది."

(ఆంధ్రకవుల చరిత్ర ; 1911 ; Page - 481)

3. A Descriptive Catalogue of the Telugu Manuscripts in the Govt. Oriental Manuscripts Library, Madras.
Vol. IX; 1947—Page - 2535
సర్వేశ్వరమాహాత్మ్యము No. 2256. (145-a)
(దీనితోబాటు "మంగళగిరి ఆనందకవి యొక్క వేదాంతరసాయనము" కూడ కలిపి బైండు చేయబడినది.)
(వేదాంతరసాయనము 1-a)

4. "కొండారెడ్డి ఘనుండు శౌర్యపటిమన్ గొప్పై న్మరాటీల ను
ద్దండుండన్న యతండు మాకు, సుకవీంద్రశ్రేణిఁ బ్రోచున్ సిరుల్
నిండన్ దామెర వేంకటాధిపుఁడు మన్నించంగఁ బామూరిలో
నుండు న్నిన్ను బహూకరింపగలఁ డీ యుద్యత్కృతిశ్రేష్ఠతన్."
(కొండారెడ్డి అనునాతఁడు రాయపరెడ్డియొక్క పెదతండ్రియైన ఓబళరెడ్డి కుమారుఁడు)

జేర్పడఁ బ్రబంధంబుగా నిర్మింపవలయునని వినయంబు నయంబు ప్రియంబునుం దేటుపడ నానతిచ్చి"నట్లు గ్రంథావతారికలో వ్రాసికొనెను.

ఈ ప్రబంధమున ఇతివృత్త మతి రమణీయముగ వర్ణితమైనది. వర్ణింపబడిన వస్తువు నవ్యమైనదైనను ఈ కవి దానిని ప్రబంధ ఫక్కిలోనే సంతరించెను. కథ యేగాని, మిగిలినదంతయు సనాతన సంప్రదాయ పద్ధతిలోనే గలదు. కవి భక్తవాడ[5] నివాసియైన రాయపరెడ్డిని కీర్తించుచు వ్రాసిన ఈ క్రింది పద్యము సంప్రదాయ సిద్ధములైన పదములతో, వర్ణనలతో, కవిసమయములతో నొప్పారుచున్నది.

"తన కీర్తికామినుల్ దశదిశాభాగ రం
గస్థలంబుల నాట్యగతులు నెఱప
తన శౌర్య వహ్ని దుర్దమ భయంకర శత్రు
ధరణీశ్వరాటవుల్ దరికొనంగ
తన దానధారానితంబినీరత్నము
లబ్ధి నాయకులతో నవఁగి పెనఁగ
తన కరుణారస ఘనతరౌషధ మఖి
లార్థి దారిద్ర్యామయంబులడంప
ఘనతఁ జెన్నొందు జగనొబ్బగండబిరుద
భూషణుఁడు తుమ్మవంశాబ్ధి పూర్ణచంద్రుఁ
డలఘు చరితుఁ డనంతాధిపాత్మజుండు
రమ్యరుచి హేళి రాయపరెడ్డి మౌళి." (గ్రంథావతారిక)

గ్రంథ ప్రారంభమునందలి మంగళశ్లోకము గురు వందనాత్మకమైన ఈ క్రింది పద్యము—

"శ్రీ చైతన్యకళానిరూఢి ఘనతం జెన్నై జగత్పూర్ణమై
ప్రాచీనద్వయ తత్త్వ మేకమనఁగా భాసిల్లు సర్వేశ్వరుం
డీచందంబున శిష్యరక్షణకునై యేతెంచె నౌన న్మదీ
యాచార్యుండగు నివ్వటూరి శరభాంకారాధ్యునిం గొల్చెదన్."

---

5. "తనర, విదర్భసీమ కవతంస మనందగు కొండవీటి కిం
ద్రుని దెస రాజ్యలక్ష్మికి నిరూఢ నివాస మనంగ భక్తవా
డను పురమొప్పు-నుర్వరకు హారమణి స్థితిఁబొల్చి సజ్జనుల్
ధనకనకాంబరామల సదా విభవోన్నతిఁ జెంది వర్ధిలన్".

ఈ పద్యమును బట్టి ఈతనికి శైవాచార్యుఁడు గురువైనట్లును, ఆతనికి సర్వేశ్వరునితో నభేదము చెప్పినట్లును తెలియుచున్నది. దీని తరువాతి పద్యమింకను వేదాంతసంప్రదాయానుసారముగ నున్నది—

"ఒక్క నభం బనేక కలశోదక బింబితమైనరీతిఁ బెం
పెక్కఁ జరాచరాత్మల వహింపుచుఁ గొంచెముకంటెఁ గొంచెమై
యెక్కువకంటె నెక్కువగు నీశ్వరునే శరణంబు వేడుచున్
మ్రొక్కెద మాటిమాటికిని మోదమెలర్ప నభీష్టసిద్ధికిన్."

దీనియందలి ; ఘటాకాశోపమానము, "అణోరణీయాన్ మహతోమహీయాన్" అనువిధముగా ఈశ్వరార్చనము సంప్రదాయ సిద్ధములుగనే యున్నవికదా! లేదన్నచో, ఈ ఉపమానములే—పరాత్పరుడొక్కడే గనుక—క్రైస్తవమత పరముగను చెప్పికొనవలెను. ఏది ఎట్లైనను ఈ రచనలో దేశీయ సంప్రదాయమే ఎల్లెడల గలదు.

కథాప్రారంభమునకు ముందున్న షష్ఠ్యంత పద్యమునందును సనాతన సంప్రదాయమే కన్పట్టుచున్నది.

"దూరీకృత మకరాంక వి, కారమనస్కునకు నిఖిల కల్యాణగుణా
ధారునకును దుర్ణయ సం, సార క్లేశాపహునకు సర్వేశునకున్."

కథకు స్థానమైన పట్టణముయొక్క వర్ణనము తక్కిన తెన్గు ప్రబంధములలోని పట్టణ వర్ణనల కేమాత్రము తీసిపోదు.

"సారాచార నియుక్త సర్వజనమై సౌవర్ణ రత్నాంకితా
గార ద్వార కవాటగోపుర పతాక వ్రాత సంకీర్ణమై
శ్రీ రంజిల్లఁగ వేడ్క జూదమనఁగాఁ జెన్నొంది జంబూనదీ
తీరక్షోణిఁ దనర్చు నొక్క పుర మర్థిన్ ధీజనస్తుత్యమై."

ఆ పురమందు 'సలోమ' (Solomon) భూవరుఁడుండెనట.

"ఆ రాజధాని తనకు స
దారమ్య నివాసమగుచుఁ దనరఁగ వెలయున్
కారుణ్యాంబుధి విలస
ద్భూరి యశోనిధి సలోమ భూవరుఁ డెలమిన్."

గ్రంథములో 'సలోమ' యొక్క సత్యవాక్పాలనమును గూర్చి వర్ణించునపుడు కవి వ్రాసిన ఈ క్రింది పద్యము, ప్రబంధశైలిలో నుండుటయేగాక, కవిసమయములందును భారతీయ మార్గమునే అనుసరించెను.

"ఇల కంపించినఁ దారకల్ చెదరినన్ హేమాచలం బెంతయున్
దలక్రిందైనను భానుఁ డస్తగిరిమీదం దోఁచినన్ దిగ్గజా
వలి యల్లాడిన వార్థులింకిన మనోవాక్కాయ కర్మంబులన్
బలుకంబూనఁ డసత్యమెన్నటికి మానం డాత్మధర్మస్థితిన్."

(ప్రథమాశ్వాసము)

"బాలుడు వీని నీతకును బాముల నొందఁగనీక పెంచితిన్
దాళఁగజాలఁ డాఁకలికి దప్పికి వేళ యతిక్రమించినన్
మేలొనరింపఁ గైకొనిన మిమ్మిక నేమని వేఁడుకొందు నా
జాలి దొలంగుచెట్లు మునిసత్తమ సత్కృప నానతీయవే !"

(తృతీయాశ్వాసము)

గ్రంథాంతమున లోభ్యుని కుమారుడు రాజ్యపాలనము చేసినట్లున్నది.

"నూటరెండేండ్లు విలస దనూన వైభ
వోన్నతి సుఖించి లోభ్యుండు నన్నమాంబ
యును బరంధామమున కేఁగి రొగిఁ ద దనుజుఁ
డపుడు వారల కంత్యేష్టి యాచరించి."

"ధైర్యంబు వదలక తండ్రిచెప్పిన బుద్ధు
లన్నియుఁ దనలోన ననువుపఱచి
సత్యమేమరక నిశ్చల భక్తియుక్తిమై
నాదిమదైవంబు నాశ్రయించి
మరియుఁ బురోహితామాత్య సుహృద్బంధు
పరివార జనములఁ బ్రజలనరసి
పాలింపుచుండి తత్పట్టణం బొక కొన్ని
యబ్దంబులకు ఖిలంబగుట దివ్య
దృష్టినెంతయు నూహించి తేజమలర
రాజకూరి ప్రవేశమై రాజ్యవైభ
వోన్నతి ననేక వర్షంబు లుండి పిదప
హితయుతము గాఁగ నొందె సర్వేశపదము."

"అనిందిత ప్రభావ సద్గుణాఢ్య సేవకావనా
మునీంద్ర మానసాంబుజ ప్రమోద మత్తషట్పదా

వినమ్ర నిర్జరావతంస విద్యుదంఘ్రి పంకజా
ఘనా ఘనా ఘనంచ నంధకార చండభాస్కరా !"

గద్య

"ఇది శ్రీమదివటూరి......ఎల్లనార్య ప్రణీతంబైన..."
పింగళి ఎల్లనార్యుఁడు పదునేడవశతాబ్దికి చెందినవాఁడని నిస్సందేహముగ చెప్ప వచ్చును. ఈ ప్రబంధము నాల్గాశ్వాసములను గలిగియుండి మధురముగ నున్నది.

'వేదాంతరసాయనము' ను మంగళగిరి ఆనందకవి పదునెనిమిదవ శతాబ్ది ఉత్తరార్ధము[6] (1750 తరువాత) ననే రచించెనని శ్రీ వీరేశలింగంపంతులు గారి యూహ. కాని, ఈ గ్రంథాంతమున గల బ్రౌనుదొర గారి విషయసూచిక ననుసరించి ఈ కావ్య మించుమించుగా క్రీ. శ. 1720 ప్రాంతమున రచింపఁ బడినదగును. "ఇతని (నిడుమామిళ్ల దాసయామాత్యుఁడను కృతిభర్త) యన్న యగు రాజయామాత్యుఁడు లాలిప్రభువు నధికారమున కొండవీడేలెననియు, మహమ్మదలీ ఖానుని ప్రాపునఁ బుదుచ్చేరిలో నివసించెననియు నిందు గలదు. ఈ లాలియే ఫ్రెంచి గవర్నరగు కౌంటు డి లాలి యైనయెడల బ్రౌనుదొరగారి తలపుచొప్పున నీ కావ్య మించుమించుగా క్రీ. శ. 1720 ప్రాంతముల రచింప బడినదగును."[7]

ఆనందకవి కాలమును గూర్చి శ్రీ వీరేశలింగము పంతులుగారు తమ ఆంధ్ర కవుల చరిత్రలో (బ్రౌనుదొర గారి తెలుగు - ఇంగ్లీషు నిఘంటువు చూచి కాబోలు) ఇట్లు వ్రాసిరి. "బ్రౌనుదొరగారీ కావ్యము 1700 వ సంవత్సర ప్రాంతమున రచియింపబడినట్లు చెప్పిరి కాని, కవి కృతిపతియైన దాసామాత్యుని సోదరుఁడగు రాజప్పను వర్ణించుచో -

'మదిరాక్షీమదనుండు రాజప మహామంత్రీంద్రుఁడుద్య న్మహ
మ్మదలీఖాను కృపానులబ్ధ మదవన్మాతంగ మాణిక్యహా
రదుకూలాదిక సత్కృతిం ద్రిదశవర్యాస్ఫార సామ్రాజ్య ల
క్ష్మిఁ దనర్చెన్బుధకోటి పేర్కొనఁగఁ బుల్చేర్పట్టణాధ్యాసియై.'

---

6. A Descriptive Catalogue of the Telugu Manuscripts in the Govt. Oriental Manuscripts Library, Madras.
Volume IX, 1947 ; Page-2488.
No. 2208. వేదాంతరసాయనము (1 - a)
(దీనితోబాటు "సర్వేశ్వరమాహాత్మ్యము" (145 - a) కూడ కలిసి బైండైనది).
7. Ibidem. (A Descriptive Catalogue)

అనుపద్యములో నతడు కర్ణాటకపు నబాబగు మహమ్మదల్లీచేత సత్కార మును బొందినట్లు చెప్పియుండుటచేతను, ఈ మహమ్మదల్లీ 1749 వ సంవత్సర మునఁగాని సింహాసనమునకు వచ్చియుండకపోవుటచేతను, వేదాంతరసా యనము. 1750 వ సంవత్సరమునకు తరువాతనే రచియింపఁబడినదని నిశ్చయింప వలెను."[8]

ఇట మహమ్మదల్లీకి సంబంధించిన చరిత్రవిషయములను కొన్ని గ్రహింప వలెను. ఈతడు కర్ణాటక నవాబైన అన్వారుద్దీనుయొక్క కుమారుడు. ఈ అన్వారుద్దీను 1749 లో అంబరుయుద్ధమున ; ఫ్రెంచివారి సాయమును పొందిన ముజఫరుజంగు, చందాసాహెబులచే చంపబడెను. ఆతని కుమారుడైన మహమ్మ దల్లీ శత్రుభీతిచే తిరుచునాపల్లికి పారిపోయి ఆంగ్లేయుల సాయముతో శత్రు నాశనముచేసి నవాబయ్యెను. మహమ్మదల్లీ తాను నవాబయిన తరువాతనే రాజప్పను సత్కరించి యుండుననుకొన్నచో "వేదాంత సాయనము 1750 వ సంవత్సరమునకు తరువాతనే రచియింపఁబడినదని నిశ్చయింపవలెను" అను శ్రీ వీరేశలింగం పంతులుగారి యూహ సమంజసముగా నున్నట్లు తోచు చున్నది.

బ్రౌనుదొర ఈ గ్రంథమునుగూర్చి తమ యభిప్రాయము గ్రంథము నందు ఆంగ్లసూచికలో నిచ్చుటయేగాక తమ 'ఆంధ్రాంగ్ల నిఘంటువు'లో గూడ నీ క్రిందివిధముగ వ్రాసియున్నారు.

"The Vedantarasayanam వేదాంతరసాయణం a Telugu Poem in four books written by a Roman Catholic Christian named Ananda, son of Mangalagiri Timmaia about A. D. 1700. It is a summary of the life of our Lord, selected from the Gospels : with an introduction. The style of this poem is greatly admired."[9]

కృతిభర్తయైన *నిడుమామిళ్లదాసయామాత్యుఁడు* మహావైభవముతో బందరులో నుండెడివాడు.—

" ప్రకటారాతిచమూభయానక ఘనప్రాకార ఖేయంబులన్
సుకరశ్రీఁదగు *బందరాఖ్యనగరిన్* సొంపొందు దీనార్థి క
ల్పకభూజంబన దాసమంత్రి రుచి కుంభద్రత్న జాంబూనదా
దిక వస్తు ప్రకరాన్వితాయతనుఁడై ధీరుల్ ప్రశంసింపఁగన్."

---

8. ఆంధ్రకవుల చరిత్ర (1911) Part III ; Page - 435.
9. Telugu - English Dictionary — C. P. Brown. Page XIV.

ఈ కృతికర్తయు కృతిభర్తయు క్రైస్తవ మతప్రవిష్టులైన నియోగి బ్రాహ్మణులు కావచ్చును. ("వేదాంతరసాయన కృతికర్తయు కృతిభర్తయు నిరువురును క్రైస్తవమతప్రవిష్టులైన నియోగిబ్రాహ్మణులు"— ఆంధ్ర కవుల చరిత్ర) దాసయామాత్యుని సోదరుడగు రాజప్ప పుల్చేరు (పుదుచ్చేరి) పట్టణమునం దుండుటచేత గూడ దాసామాత్యులకును, తత్కుటుంబమునకును క్రైస్తవమతముతో పరిచయముండుటకు అవకాశము గల్గినదని ఊహింప వచ్చును. దాసామాత్యుని పేరిలోని దాసశబ్దము గూడ (ఏసుదాసు మొదలగు వానివలె) ఈ విషయమును స్ఫురింపజేయుచున్నట్లున్నదనవచ్చును.

కవికిని కృతిభర్తకును క్రైస్తవమతాభినివేశ మెంతఉన్నను, కృతిభర్త యొక్క కొలువుకూటమును కవి వర్ణించినదానినిబట్టిచూడగా, సనాతన సంప్రదాయాభినివేశమును వారికి కలదని తోచుచున్నది.

"ఒకవంక నిగమోజ్జ్వలాతిశ
యార్థ విధివాద కౌశల ద్విజనికాయ
మొక చాయ న్యాయశాస్త్రోదాత్త
వాక్యప్రసంగ కృద్విద్వత్ప్రజావితాన
మొకక్రేవ సంస్కృతప్రకటాంధ్ర
భాషా కవిత్వప్రవీణ కవిప్రకాండ
మొకచెంత సప్త స్వరోద్గీత
గీతికావైచిత్ర విస్ఫురద్వైణి కౌఘ
ముల్లసిల వజ్ర కౌశేయకోపమాన
వైభవ స్ఫూర్తి నొక శుభవాసరమున
మహిత గుణశాలి దాసయామాత్య మౌళి
ప్రమదముప్పొంగఁ బేరోలగముననుండి."

ఈ విధముగా సభదీర్చియున్న దాసయామాత్యుఁడు ఆనందకవిని పిలిపించి రక్షకుడైన ఏసుక్రీస్తుచరిత్రమును వ్రాయుమని నివేదించెను. ఈ సందర్భమున కవి తన్నుగురించి వ్రాసికొనిన పద్యములో—

"నను సర్వేశ పదాంబుజద్వయ నితాంతధ్యానపారీణు భూ
రి నయోపేత చరిత్రు మంగళగిరి శ్రీవంశ వారాశిపూ
ర్ణనిశానాథు సుధీజనాభిహితు నానందాఖ్యు సద్గ్రంథక
ల్పను సాహిత్య కళావిశారదుని బిల్వంబంచి పల్కెం గృపన్."

తాను సర్వేశభక్తుడనని వ్రాసికొనెను. ఈ 'సర్వేశ' శబ్దము ఎల్లరును వాడవచ్చునుగదా! కాని, ఎల్లనార్యుని "సర్వేశ్వరమాహాత్మ్యము" ను బట్టి కూడ ఈ శబ్దమును ఈ కవులు విశిష్టార్థములో వాడినట్లు తోచును. కాని, కవి తాను వ్రాసిన గద్యలో—

"ఇది శ్రీమత్సర్వేశ్వర కరుణాకటాక్ష వీక్షాలబ్ధ సరససాహితీధౌరేయ యాత్రేయ గోత్ర పవిత్ర మంగళగిరి తిమ్మయామాత్య పుత్ర సుజనవిధేయ యానందాభిధేయ ప్రణీతంబైన వేదాంతరసాయనంబను మహాప్రబంధంబునందు..." తన గోత్రాదులను పేర్కొనెను. ఈ విషయముననేగాక రచనాది విషయము లందును, సర్వేశ్వర మాహాత్మ్యమునకును, దీనికిని చాల పోలికలు గలవు. ఈ కవులును, కృతిభర్తలును, క్రైస్తవమత ప్రవిష్టులైనను, తమతమ జీవిత విధానములను గాని, ఆచార వ్యవహారాదులను గాని మార్చుకొనినట్లు కన్పట్టరు. ఈ పద్ధతిని నాటి క్రైస్తవమత ప్రచారకులు అంగీకరించినట్లున్నది. నాటి మిషనరీలు దేశీయములైన ఆచార వ్యవహారములలోను, ప్రజల జీవిత పద్ధతులలోను విశేషముగ జోక్యముకలిగించుకొనక మత ప్రచారముచేయుటచే వారు ప్రజలలో మంచి పలుకుబడిని సంపాదించిరి. ఈ క్రింది వాక్యములు దీనిని తెలుపును.

"Xavier's mass conversion, backed by Portuguese official support, carried out with a surprising ignorance of local languages, and not apparently accompanied by systematic education of Christian communities, was followed by the establishment of the Jesuit Mission in 1590, when we hear of 500 missionaries at work among 251,000 converts. As a result of Robert de Nobili's work, this number grew steadily during the 17th century. The mission made a careful study of the local languages and customs and *developed an extremely tolerant attitude towards the caste system*..."

ఏ 'మిషను' (Mission) నకు చెందిన మతప్రచారకులైనను నాడు ఈ మార్గమునే అవలంబించిరనవచ్చును. కంపెనీ పక్షమున దేశములో నుండి

---

10. "Modern India and the West"—Oxford University Press, 1941.
"The Christian Ethic and India" by A. I. Mayhew, C. M G; C. I. E.
Page-324.

వాణిజ్య వ్యాపారములలో భాగస్వాములుగ నున్న పాశ్చాత్యులలో చాల మందికి మతమునుగూర్చిన చింతయే లేదు. వారు క్రైస్తవులైనను, ఆచార వ్యవహారాదులలో దేశీయులనే అనుకరించుచునుండుటచే క్రైస్తవమత విషయమున అభినివేశము గల కొలదిమంది దేశీయులును వారిమార్గమున వారు పోవుచుండిరి. పదునెనిమిదవ శతాబ్దిలోని పరిస్థితు లిట్లుండెను.[11]

ఆనందకవి కృష్ణాజిల్లాకు జెందినవాడు. 1750 నాటికే మధురనుండి వచ్చిన జెసూటు మిషనువారు ఇచ్చట ప్రచారము చేయుచు నుండిరనుటకు ఆధారములు గలవు. పింగళి ఎల్లనార్యుడు కూడ కృష్ణాజిల్లాకు చెందినవాడే. వీరిరువురిపైని, వీరి కృతులకు భర్తలయిన వారిపైని, క్రైస్తవమతప్రభావము పడుటకు ముఖ్యావకాశము, ఆ కాలములో జెసూటు మిషనరీ లీ ప్రాంతమున కృషి చేయుటచే కలిగిన దనవచ్చును. జెసూటు మిషనరీల కృషిని గూర్చి యీ క్రింది వాక్యములు తెలుపును.

"The Pioneers of Christianity in the District belonged to the Roman Catholic Church, being Jesuits who came out to India after the founding of the well-known mission at Madura (1606). Little is now on record regarding their operations, but it is clear that their efforts were less continuous and strenuous than in Districts farther south. The suppression of the Society of Jesus in 1773 almost entirely checked their enterprise, and for many years few priests were left in the District, and some of the converts went back to Hinduism........."

"The Protestant missoins are of much more recent origin. The best known of their missionaries, the Rev. Robert Noble, came to Masulipatam in 1841."[12]

---

11. "The majority of Europeans ignored or defied the sanctions of religion, and were sunk into a state of moral turpitude akin to that of their heathen neighbours, some indeed openly embracing the native religion, and maintaining harems. The sole redeeming feature was the work of the FIRST PROTESTANT MISSIONARIES in the south — Ziegenbalg; Schwarz, and others; BUT EVEN HERE CASTE HAD BEEN ALLOWED TO INVADE THE CHURCHES, with all its withering effects." (In the 18th century)

('They were men sent from God' by E. B. Bromley, Bangallore, 1937. Page—22.)

12. Imperial Gazetteer of India; Provincial Series; Madras 1; Calcutta 1908; Page—305.

'వేదాంతరసాయనము' లోని పద్యములలో చాలభాగము భగవంతుని సర్వేశ్వరుడనియే సంబోధించును. ఇట్టి సంబోధన కేవలము ఏ ఒక మతమునకు సంబంధించినదియుగాక అన్ని మతములకును సంబంధించినదియే యని యనవచ్చును. ప్రత్యేకముగ కథాగమనమునకై ఏసునాథుని పేరు స్మరింపబడిన ఘట్టములందు తప్ప మిగిలిన ఘట్టములందెల్ల భగవంతుని సనాతన సంప్రదాయానుసారమయిన నామములతోడనే కవి సంబోధించెను. ఇట గుర్తింపవలసిన విషయమిది. గ్రంథ ప్రారంభమునం దీ క్రింది పద్యముగలదు.

"శ్రీమంతుండు సమస్తలోకజనన స్థేయోపసంహార లీ
లామాన్యుండు శ్రితావనాదర గుణాలంకారుఁ డామ్నాయ చూ
డాముఖ్యాశయ వేద్యుఁ డవ్యయుఁ డఖండజ్ఞాంతి సర్వేశ్వరుం
డామోదంబునఁ బ్రోచు నెల్లపుడు దాసామాత్యా చూడామణిన్."

ఈ పద్యములో వర్ణింపబడిన సర్వేశ్వరుడు సర్వులకు కీర్తింపదగినవాడే. దీని తరువాతి పద్యములో ఏసుక్రీస్తు యొక్కయు మేరీ యొక్కయు ప్రత్యక్ష సంస్మరణమున్నది.

"అనుపమితార్చ్య శిష్ట *మరియాంబ* కు నందనుఁడై త్రిలోక పా
వనులు మహానుభావు లనవద్యచరిత్రులు సన్మనస్కులన్
దనుఁ గొలువన్ నిజాశ్రిత వితానముఁ బ్రోచిన *యేసునాథుఁ డిం*
పున నొసగున్ నిరంతర విభూతి ధణీకుల దానమంత్రికిన్."

కృతిభర్త కూడ క్రైస్తవ మతప్రవిష్టుడే గనుక, ఆతడును 'ఏసు' గాథలే ఎల్లపుడును వినవెంచునని కవి వర్ణించెను.

"*ఏసుకథాసుధాలహరియే* వినఁగోరు నిజాశ్రితావనో
ల్లాస మనస్కుఁ డూర్జిత కలానిధి శారదచంద్ర చంద్రికా
భాసుర కీర్తిశాలి పరిపాలిత బంధు సుహృజ్జనాళినా
వాసి వహించె *దాన సచివ ప్రభుఁ*డౌర మహీతలంబునన్."

ఆనందకవి, కృతిభర్తను 'నిబంధనగ్రంథము' లోని వీరులతో పోల్చి వ్రాసిన ఈ క్రింది పద్యము విశిష్టమును, రమణీయమును.

"శ్రీమహా సర్వేశ చింతాసదాచార
గరిమ *నబ్రాముని* సరికివచ్చు (Abraham)

పరిపంథి హృద్భయంకర భుజాదండ వి
క్రమలీల దావీదు ఘనునిఁబోలు (David)
భువనైక కీర్తి ప్రభుత్వ ప్రసిద్ధిచే
నల సలోమని సాటి పలుకఁజెల్లు (Solomon)
సుజనానురూపభాసుర ధర్మకార్య సు
స్థిర బుద్ధి తోభ్యతో నొరయఁజూచు (Tobias)
నితఁడని కవీంద్రులు నుతింప నింపెసంగె
విశ్రుత వితీర్ణశాలి సద్విభవశాలి
పాలితబుధాళి బాంధవ పద్మహేళి
మహితగుణపాళి దాసయామాత్యమౌళి."

దాసయామాత్యునకు వసిష్ఠ గోత్రజుడైన ధవళపు శ్రీనివాసుడు మంత్రి. ఆతనిని కవి ఇట్లు సంప్రదాయసిద్ధ పద్ధతిని ప్రౌఢరీతియందు హృద్యముగ వర్ణించెను.

"శ్రీమద్ధవళపు వంశామృతోదధి చంద్రుఁ
డాశ్రిత జనవాంఛితార్థదుండు
సత్యసంధాచార్య చరణాబ్జ భజనుండు
గురువసిష్ఠమునీంద్ర గోత్రజుండు
జగతీసురాశీర్వచః ప్రాప్తవిభవుండు
కమనీయ సత్క్రియా కర్మఠుండు
శరదభ్రహీర పాండురకీర్తిధారేయుఁ
డభిరమ్య రూప సూనాంబకుండు
శ్రీనివాసాఖ్య మంత్రి సదా నిజైక
కార్యరచనా చమత్క్రియావార్యుఁడగుచు
బరగఁ బెంపొందె సకల సంపత్సమృద్ధి
మహిత నయశాలి దాసయామాత్య మౌళి."

ఈ కథ — మల్లరసాఖ్యునకు జ్ఞానబోధ మునీంద్రుఁడు చెప్పి, ఆతనిచేత జ్ఞానస్నానముచేయించి సర్వేశ్వరమంత్రము నుపదేశించినట్లుగ- పర్వతాఖ్యుఁడు, జ్ఞానభూసురునకు చెప్పినట్లు రచింపబడినది. గ్రంథము యొక్క కథాప్రారంభ మున "......నిజశిష్య సంతానంబున కంతరాయంబులేని మోక్షం బొసంగ మనుష్యావతారంబెత్తి యేసునాథుండనబరగిన యమ్మహాత్ముండుచేసిన కార్యం

బులు పెక్కులుగల వవి యెల్ల వివరించెద" అని కలదు. మిగిలిన కథ అంతయు ఈ కార్యముల వివరణయే.

కథాప్రారంభమునకు ముందు, కృతిభర్తను ప్రశంసించుచు కవివ్రాసిన షష్ఠ్యంత పద్యములు రమణీయముగనున్నవి.

"ఏతాదృశగుణమణి కధు
నాతన విద్వన్మనోవనజ దినమణికిన్
చాతుర్యసువాగధరీ
భూతాదిమఫణికి మదరిపుద్విప సృణికిన్."

"సర్వేశమంత్ర భజనా
ఖర్వోత్సహానునకు వనధి గాంభీర్యునకున్
బర్వేందు పాండుర యశో
నిర్వహునకు నిత్యధర్మ నిరతాత్మునకున్."

ఆశ్వాసప్రారంభమునందలి సంబోధన పద్యమును ప్రబంధ ఫక్కిలోనే నడచెను.

"శ్రీనిడుమామిళ్లకులాం
భోనిధిహిమధామ క్రీస్తు పూజాకలన
ధ్యానస్థేమ సుధీస
న్మానిత గుణధామ దానమంత్రిలలామా."

క్రైస్తవులలో సంప్రదాయముగ నున్న జ్ఞానసంస్నపనము (**Baptism**) నిట్లు కవి కీర్తించినాడు.

"సలిలావగాహనము మైఁ
గల పంకముఁబోలె నాత్మఁగప్పిన దృప్య
త్కలుషమెడలు నరునకు భూ
స్థలి భూసురవర్య జ్ఞానసంస్నపనమునన్."

ఏసుక్రీస్తును కవి గ్రంథప్రారంభమున నిట్లు స్తుతించెను.

"మేరలేని కరుణ మితిలేని నీతియు
మట్టులేని కాంతి మహిమదవిలి
మొదలు దుదియు నామమును రూపమునులేక
వెలుగు నెవ్వ డతఁడ వేల్పుజగతి."

ఈ క్రింది పద్యములో, భగవంతునిచే సృష్టింపబడిన ప్రకృతిలోని వస్తువులను గూడ పూజించు దేశీయాచారము విమర్శితమైనది.

"జగదుపకారకారకవిశాల సమస్తపదార్థ కల్పకుం
డగు నతనిం బరాత్పరు మహామహు సర్వశుభ స్వభావు బ్రొ
క్కఁగఁ దఁగుగాక *యాతఁడిలఁ గల్గఁగఁ జేసిన వానిపూజ స*
*ల్పఁగ దురితంబు* లంటునని పల్కుట యొప్పు నసంశయంబుగన్."

నానావిధములైన వర్ణనలలో ఈ ప్రబంధము సాటి ప్రబంధములను పోలియే యుండును.

"చని సెలయేటి మొత్తములఁ జందనశైల మరుద్విలోల కాం
చన కురువింద చందన రసాలముఖద్రు సమీప గోస్తనీ
ఘనతర కాయమానములఁ గ్రప్పుఁ దిన్నియలన్ లతానికే
తనముల సంచరింపుచు నతండు పరాత్పర చింతనంబునన్."

ఈ క్రింది పద్యములో 'సిలువ' (Cross) యొక్క ప్రస్తావన కలదు.

"వార లవార్యకౌతుక నివాస మనోంబుజులై జగజ్జనా
ధారు నయప్రచారు సముదారుని న *మ్మరియాకుమారునిన్*
భారపు స్లీవమ్రానున విపద్దశలం బొరయించినట్టి ని
ష్కారణ వైరులన్ సరకుగాఁగొన కించుక యెల్లదిక్కులన్."

కృతిభర్త యైన దాసయామాత్యుడు "అధునాతన విద్వన్మనోవనజ దినమణి" అయినను, "క్రీస్తుపూజా" తత్పరుడయినను; ఆతని భావములు, కోరికలు దేశీయసంప్రదాయము ననుసరించియే ప్రవర్తిల్లినవిగాని, విప్లవాత్మకముగ విలసిల్లినట్లులేవు. తనకంకితముగా గ్రంథమును వ్రాయుమని కవిని ప్రార్థించునప్పుడు, సంప్రదాయ సిద్ధముగా అందరు కృతిభర్తలు కోరినట్లే ఈతడును కవిని కావ్యమర్థించెను.

"తరుముఖ సప్తసంతతు లుదారత నెచ్చట నిల్ప నచ్చటన్
బరఁగు సమస్తదిక్కులకుఁ బ్రాఁకగు భావరసానుకూల వా
గ్గరిమఁ దనర్చు సత్కృతిముఖంబున వానికిఁ దారకేందు భా
స్కరులు గలంత కాల మనిశంబుఁ గరంబుఁ బ్రసిద్ధి చెల్వగున్."

'వేదాంతరసాయనము' ముగింపునందు కృతిపతిని కవియిట్లు మధుర గంభీరముగ వర్ణించెను.

"భాషా విశేష దూషిత
శేష భుజంగమ జగత్ప్రసిద్ధ చిరశ్రీ

పోషిత విద్వజ్జన ని
ర్దోషమతి గభీరతా విదూరిత శరధీ !"

"పరాత్పర స్తవాభిరామ బంధురక్షణైకత
త్పరా ధరాధరోపమాన ధైర్య ధర్మ కార్య సు
స్థిరా ధరామరేప్సితార్థ సిద్ధికృన్మహాదరా
సురాధిరాజయోగ్య భాగ్యశోభితాత్మ మందిరా !"

ఈపద్యములోని, 'ధరామరేప్సితార్థసిద్ధికృన్మహాదరా' మొదలైన సంబోధనలు కృతిభర్తయొక్క సంప్రదాయప్రీతిని దెలుపుచునే ఉన్నవిగదా !

ఇంత విపులముగా ఈరెండు గ్రంథములను (సర్వేశ్వర మాహాత్మ్యము, వేదాంత రసాయనము) పరిశీలించిన తరువాత ముఖ్యముగా పొడగట్టునది — క్రైస్తవమతప్రవిష్టులైనవారియందుగూడ భావములుగాని, భాషగాని, ఆచార వ్యవహారములుగాని; దేశీయ సంప్రదాయోల్లంఘనమంతగా చేయలేదనునది. నాటికింకను జనబాహుళ్యముపై పాశ్చాత్య నాగరకతా సంస్కృతుల ప్రభావము గాఢముగా పడకుండుటయే దీనికి ముఖ్యకారణము. ఇవి పడునంతగా మనవారికి పాశ్చాత్యులతో సన్నిహితత్వముగాని, తమంత తాము వీనినర్థము చేసికొనుటకు వీలునిచ్చు పాశ్చాత్య పద్ధతిలో విద్యాభ్యాసముగాని నాడు లేదు. కనుక ప్రజలలో గాఢముగ నున్న విశ్వాసములుకూడ అంతగా సడలలేదు. కాని, ఆదర్శజీవితములు గడుపుచున్న మిషనరీల ప్రభావముక్రిందకు వ్యక్తులు రాకపోవుటలేదను విషయము; ఈ రెండు గ్రంథములను వ్రాసినవారియొక్క కృతిపొందినవారియొక్క స్థితిని పరిశీలించిన తెలియకపోదు.

పాశ్చాత్య భాషలలోనుండి మొట్టమొదట ఎక్కువగా అనువదింపబడిన గ్రంథములు, క్రైస్తవమతమునకు సంబంధించినవి. పైని వివరించిన తోభ్యా చరిత్ర, వేదాంత రసాయనముల తరువాత, క్రైస్తవమతమునకు సంబంధించిన రచనలివియే. ప్రబంధశైలిలో రచింపబడిన పై గ్రంథములు రెండును సాహిత్య గౌరవమునకు అర్హములైయున్నవి. కాని, క్రైస్తవమతగ్రంథములకు ప్రారంభ కాలమున బయలుదేరిన అనువాదము లెవ్వియు వీని సాహిత్యస్థానము నందదగినవిగా లేవు. ఇందులకుగల ముఖ్యకారణము - తెలుగు మాతృభాషకాని పాశ్చాత్యులీ యనువాదములను చేయుటయే. ఇందువలన, వీరి రచనలోని కారకము తెలుగు నుడికారమునకు విలక్షణముగనుండి, క్రొత్తగా కన్పట్టును.

భాషలోను, భావములోను గల ఈ 'క్రొత్తదనము' తెలుగులోనికి మొట్టమొదట క్రైస్తవ మతగ్రంథముల ద్వారమున మనకు వచ్చినది. పదునెనిమిదవ శతాబ్ది లోనే కొన్ని క్రైస్తవమతగ్రంథములు తెలుగులోనికి వచ్చినను, పందొమ్మిదవ శతాబ్ది పూర్వార్ధములోనే అవి బహుళవ్యాప్తిని పొందినవి. ఆంధ్రదేశములో క్రైస్తవమతాభివృద్ధియు ఆకాలములోనే జరిగినది.

ఈ గ్రంథములలోని విలక్షణమయిన కారకము, వర్ణనాపద్ధతి; మొట్ట మొదటిసారిగా తెలుగువారికి పందొమ్మిదవ శతాబ్ది పూర్వభాగమున బాగుగ పరిచితమయ్యెను. ఈ తెలుగునకు దేశములో విశేషప్రచారము రాకున్నను, క్రైస్తవులైన తెలుగు వారిలోమాత్రము పలుకుబడిని పొందెను. కాలక్రమ మున, తెలుగు మాతృభాషగా కలవారి సాయముతో సిద్ధముచేయబడిన అనువాదములు బయలుదేరి, భాషాసౌష్ఠవ మేర్పడుచు వచ్చినది. ఈ గ్రంథముల లోని వచన రచనాపద్ధతి ప్రారంభదశలో ఎట్లున్నదో ఎడనెడ నుదాహరణము లిచ్చుచు రూపించుచున్నాను.

1720 ప్రాంతమున రోమను కేథలిక్కు మిషనరీలు చేసిన అనువాదము 'క్రిష్టియన్ వేదగ్రంథము' అను పేరున కలదు. (క్రిష్టియన్ వేదగ్రంథము— No. 14-4-3; మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము) ఈ గ్రంథముపై బ్రౌనుదొరగా రిట్లు వ్రాసిరి : "It happens to have been translated by the Roman Catholic Missionaries about the year A. D. 1720. This is the 1st Vol. and goes as far as Samuel VIII." చెన్నపురి ప్రాచ్య లిఖితపుస్తక భాండాగారములో నున్న దీనినుండి యథాతథముగ కొన్ని వాక్యముల నుదాహరణముగ నిచ్చుచున్నాను.

"జేసునాధుడు పాస్కపండుగ పొడువునా యెన్మిదిదివసాల పరియంత్తం జెరుసలేమున వుండి చాలా అద్భుతాలను చేసినందువల్ల అనేకులు అతని వశైరి. అయినాగాని అతడు వార్ల చెపలబుద్ధి నిమిత్తం వార్లను నమ్మరు. ఇదిగో వకరు తెలపకనే అనంత జ్ఞానోదయులైనవారు మానవులయొక్క అంతర్భావ ఇంగిత ములను లెస్స యెరిగివుందురు."

"పరలోక భూలోకం శ్రిష్టికర్తలైన వారు నిర్మించిన విధం యిజురేల్ అనేటషువంటివారుల వేదమందు రాశివున్నది. సంక్షేపమూ మొదటిభాండం శ్రిష్టింపు—ప్రధమవిశేషము."

ఇది కేవలానువాదము కాక కొంత క్షిప్తముగ వ్రాయబడినది. పైని వ్రాసిన వాక్యములలోని కథాభాగము ; మత్తయి (St. Matthew) సువార్త యందు 26 వ అధ్యాయములోను; మార్కు (St. Mark) సువార్తలో 14 వ అధ్యాయములోను; లూకా (St. Luke) సువార్తలో 22 వ అధ్యాయము లోను ; యోహాను (St. John) సువార్తయందు 13 వ అధ్యాయములోను వచ్చును.

దీని తరువాత బెంజమిన్ షూల్ట్జ్ (Benjamin Schultze) చేసిన అనువాదమును గ్రహింపవచ్చును. ఇది 1746-1747 సంవత్సరములలో ప్రష్యా దేశమున మ్యాగ్డిబర్గునకు చేరిన 'హ్యాలే' (Halle) పట్టణములో అచ్చయ్యెను. తెలుగులో అచ్చయిన మొదటిపుస్తక మిది కావచ్చును. ఇది శ్రీరామపురము (Serampore, Bengal) లో గల క్రైస్తవ కళాశాలా భాండాగారమున కలదట ! దీనిలోని ఒక పుట 'ఫోటో' తీయబడి 'ఆంధ్రవిజ్ఞానసర్వస్వము'న ముద్రింపబడినది.[13] దానిలోని ఈ క్రింది వాక్యము 'షూల్ట్జ్' తెలుగునకు నిదర్శనము. "నాకు గల్గిన నిజమయిన రక్షించ్చెవాడా ఆకాశానికి తగిన దుఖశాంత్తి నా ఆత్మకు..."

1818 లో ఎడ్వర్డు ప్రిచెట్ (Edward Pritchett) గారు చేసిన అనువాదములోని కొంతభాగము నాటి రచనాపద్ధతి తెలియజేయుటకై క్రింద నీయబడినది.

"యిశు క్రీస్తునియొక్క పుట్టడము యీలాగునాయెను. ఆతనియొక్క తల్లి మారియా యుసపునికొరకు వాక్యదత్త ఐందొకుంచున్న వారియొక్క కలుసుకోవడము కంట్టె ముందుగా ధమ్మాత్మునిచేత కడుపుతో ఉన్నషువంటి దాయెను ! దానియొక్క పెనిమిటి యుసపుడు యాథార్థికుడైన వాడవుకుంచున్న ప్రకాశంగాను కళంకం కలదాన్నిగాను చెయించేటందుకొరకు ఇచ్చ ఇంచక దాన్ని గుప్తరూపముచెత విడిచిపెట్టెటందు కొరకు తలిచెను. మరియె మంటె వాడు ఈ ప్రకారంగా చింతచేస్తూ ఉండగా చూడు ఈశ్వరుని దూత స్వప్నమందు వానికొఱకు దర్శనమును ఇచ్చెను."

పై వాక్యములు 'మత్తాయి సువార్త' ననుసరించి రచింపబడినవి. ఆంగ్ల గ్రంథమునుండి ఈ భాగమునే పోల్చి చూచుటకై ఉదాహరించుచున్నాను.

---

13. మాదిరిపుట కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారి 'ఆంధ్రవిజ్ఞాన సర్వస్వము'లో (1916-Vol. II) 584 సంఖ్యగలది.

"Now the birth of Jesus Christ was on this wise: when as his mother Mary was espoused to Joseph, before they came together, she was found with child of the Holy Ghost."

"Then Joseph her husband, being a just man, and not willing to make her a publick example, was minded to put her away privily."

"But while he thought on these things, behold, the angel of the Lord appeared unto him in a dream......"

పైనుదహరింపబడిన ఆంధ్రాంగ్ల భాగములను పోల్చి చూచినప్పుడు, అనువాదములోని భాషావైలక్షణ్యము ప్రస్ఫుటమగును. నాటి అనువాదముల లోని విలక్షణత చూపుటకై ఇంకను కొన్ని ఉదాహరణల నిచ్చుచున్నాను.

ఆంగ్లము—"In the sweat of thy face shalt thou eat bread."
(Genesis–Chapter 3; 19)

తెలుగు—"నీ ముఖము యొక్క చెమటవల్ల ఆహారమును తిందువు."
(Translation–Gordon and Pritchett. 1868)

ఆంగ్లము—"He cried with a great and exceeding bitter cry..."
(Genesis–Chapter 27; 34)

తెలుగు—"ఏశావు తన తండ్రిమాటలను వినినప్పుడు, బహు ఘోరమైన విషపు రోదనముచేత........."
(Translation. Ibidem)

ఆంగ్లము—"Our Cattle also shall go with us; there shall not an hoof he left behind..."
(Exodus–Chapter 10; 26)

తెలుగు—"వొక డెక్కైనా విడవబడకుండా మా పశువులున్ను మాతోకూడా రావలెను......"
(Ibidem)

ఆంగ్లము—"A Land that floweth with milk and honey."
(Denteronomy–Chapter 26; 16)

తెలుగు—"పాలతోనున్ను, తేనెతోనున్ను ప్రవహించే దేశము." (Ibidem)

ఆంగ్లము—"Our bones are scattered at the grave's mouth, as when one cutteth and cleaveth wood upon the earth."
(Psalms - 141; 7)

తెలుగు—"వొకడు భూమిమీద కట్టెలను నరికి చీల్చేటట్టు మా యెముకలు సమాధి నోటియొద్ద చెదరబడి యున్నవి." (Ibidem)

ఆంగ్లము—"He also exalteth the horn of his People." (Psalms–148 ; 14)

తెలుగు—"ఆయన (యెహోవా) తన జనులయొక్క శృంగమును హెచ్చించి యున్నాడు." (Ibidem)

ఈ విధముగా 'ప్రాత నిబంధన' గ్రంథమునుండి ఎన్నియో ఉదాహరణములను చూపవచ్చును. ఇట్టివి 'క్రొత్త నిబంధన' గ్రంథమునందును చాలగలవు.

ఆంగ్లము—"You are the salt of the earth..."(St. Matthew-5; 13)

తెలుగు—"మీరు భూమికి ఉప్పైయున్నారు." (Ibidem)

ఆంగ్లము—"Behold the fowls of the air: for they sow not." (St. Matthew–6 ; 26)

తెలుగు—"ఆకాశపక్షులను చూడండి. అవి విత్తవు." (Ibidem)

ఆంగ్లము—"And why beholdest thou the mote that is in thy brother's eye, but perceivest not the beam that is in thine own eye?" (St. Luke. 6 ; 41)

తెలుగు—"మరిన్ని నీవు నీకంటిలోవున్న దూలము యెంచక నీ సహోదరుని కంటిలోవున్న నలుసును చూచుట యెందుకు?" (Ibidem)

బైబిలును తెలుగులోనికి అనువాదము చేయుటయందుగల కష్టములను గూర్చి సి. పి. బ్రౌను దొర ఇట్లువ్రాసెను.

"The wranglings among those who fancy they can translate arise from want of learning; having little they squabble about it. Had they the patience to study for ten years they would be wiser. They talk about translating into Hindu tongues, and pass judgement on translations, while they are mere beginners."[14]

బైబిలును భారతీయ భాషలలోని కనువాదము చేయుటలోగల ముఖ్య కష్టము ఆయా భాషలలో తగిన పదజాలము లేకుండుటయేయనియు కేవల

4. Some Account of the Literary life of C. P. Brown .

వచనానువాదము చేయుటవలన మూలములోని సొగసు చెడుననియు బ్రౌను దొర తనయభిప్రాయము నిచ్చెను.

"Many passages which in English seem easy, are hard to translate correctly. In fact to translate the Bible into any one of the Indian Peninsular languages is a task resembling that of making bricks without straw. The words required in some important passages do not exist in Telugu. If the New Testament, written in prose orginally, suffers in a literal version, how much greater is the sacrifice of elegance when the poetry of Isaiah or David has its carved work beaten to pieces with the hammers' of a prose translation."[15]

బహుభాషాకోవిదులు కానివారు తెలుగులోనికి బైబిలును పరివర్తనము చేయుట మిక్కిలి కష్టమని బ్రౌనుదొర వాక్యమువలన రుజువైనది. ఆతడాంధ్రములోనికి బైబిలును పరివర్తించుటకు పూర్వమును తరువాతయును వివిధ భాషలలోగల బైబిలు పరివర్తనములను పూర్ణముగా పరిశీలించి చూచిగాని తృప్తిపడినవాడు కాడని ఈ క్రిందివాక్యములు తెలియఁజేయుచున్నవి.

"In preparing a Telugu version of the Scriptures, I continually used the translations printed in Sanskrit, Bengali, Tamil, Marata and Kannadi; in revision I compared the work with the orginal Hebrew and Greek. In rendering words I have chiefly adhered to D'oyly and Mants' Commentary, and that by Dr. Adam Clarke."[16]

బైబిలును తెలుగులోని కనువదించు నప్పుడు తగిన పదములు లభింప నప్పుడు మూలములోని పదములను యథాతథముగ నుంచుటయే తగినపని యని బ్రౌనుదొర నిర్ణయించెను. ఈ నిర్ణయమునుగూర్చి యాతడు తన 'ఆంగ్లాంధ్ర నిఘంటువు'లో నిట్లువ్రాసెను.

"In preparing a new Telugu Version of the Holy Bible (a task which I commenced twenty years ago) I have hesitated a few words untranslated, for instance, wine: which is derived through Greek and Latin from Hebrew. All the versions say draxarasm (grape juice) but this is not correct. We might as well use wool for shawl or silk instead of balloon............ some words, as "baptism" should be preserved untranslated."[17]

---

15. Ibidem.
16. Ibidem.
17. English-Telugu Dictionary—C. P. Brown. Preface. Page—5.

సి. పి. బ్రౌనుదొర బైబిలును తెలుగులోని కనువదించుటకు ప్రారంభింపగానే ఇంకొక చిక్కుగూడ వచ్చినది. అనువాదకులను నిర్ణయించు నధికారముగల కమిటీవారు తెలుగుభాషలో నిష్ణాతులు కాకుండుటచే బైబిలును పరివర్తనము చేయుట కర్హమైన వారెవరో వారు గుర్తింపలేకుండిరి. దీనికితోడు అనువాదకులు ఏ 'గ్రీకు' (Greek) మూలము ననుసరింపవలెనను విషయమున గూడ కమిటీవారికి ఏకవాక్యత కుదరకుండెనట! ఈ పరిస్థితులనన్నింటిని బ్రౌనుదొర చక్కగా నిట్లు తెలిపెను.

''Meanwhile the Telugu translation of the Bible was carried on, though slowly. The Bible Society Committee rejected the first specimens which I prepared, for the members knew nothing of Telugu. In a letter addressed to me by the Rev. T. Brotherton, a zealous missionary, a member of the Committee, I find these words. 'The Committee have not decided which edition of the Greek text they will use. The controversy will probably terminate when they have decided that no part of the text is genuine. This will show you that there is no hope of getting a Telugu version of the Old Testament Scriptures. The disputes about the Hebrew text will be endless. You must therefore yourself lay the foundation of the Church in the Telugu country, or it will never be founded at all'.''[18]

భారతీయభాషలలోనికి బైబిలు పరివర్తనమగునపుడు మూలానుసరణమునకై నూతన పదజాలము సృష్టించుట అనువాదములకు తప్పనిదయ్యెను. ఇట్లు సృష్టింపబడిన పదములు భారతీయభాషలలో చేరి వానికొక క్రొత్తదనమును కొంతవరకు తెచ్చెను. ఈ నవ్యసృష్టి ఆయా భాషలకు నూతన పదజాలమిచ్చినదయ్యెను. ఈ భాషాసృష్టినిగూర్చి బ్రౌనుదొర యిట్లు వ్రాసెను.

"In Tamil and Telugu, as well as in Greek and Latin, Christianity will gradually produce a somewhat new dialect : in Tamil it is already perceptible."[19]

క్రైస్తవులు కాని విద్యావంతులయిన తెలుగువారిపై బైబిలు ప్రభావము పరోక్షముగ పడినది. క్రైస్తవమిషనరీలు దేశములో చాల విద్యాసంస్థలు నడపుచుండుటచేతను, అందు బైబిలు పఠనము ప్రోత్సహింపబడుటచేతను;

18. Some Account of the Literary life of C. P. Brown.
19. English-Telugu Dictionary—C. P. Brown. Page-5.

నవీన విద్యాపద్ధతి పాశ్చాత్య సంస్కారయుతమగుట చేతను; క్రైస్తవేతరులపై గూడ బైబిలు తన ప్రభావమును చూపినది. ఈవిషయమే, ఇట్లు సూటిగా చెప్పబడినది.

"Christian influence, which has been at work in India since Brtish rule began, has been direct, through the agency of Christian Missions, and indirect, through contact of the Indian peoples with the administration, aims, and methods, the education, literature, and mode of life of a civilization which owes much to Christian thought and principles."[20]

క్రమముగా, దేశమున నైతిక పురోభివృద్ధి కాంక్షించిన విద్యావంతులందరును - మతముతో నిమిత్తము లేకుండ - క్రైస్తవ నీతి సిద్ధాంతములపై గౌరవాభిమానములు చూపి, బైబిలును పఠింప జొచ్చిరి. పాశ్చాత్య నాగరకత ఆంగ్లసంస్కారము మూలమున, మనకు తెలియబడుటవలనను; ఆంగ్లేయులు క్రైస్తవులగుట వలనను, మనవారికి పాశ్చాత్య సభ్యతలోని మంచిఅంతయు క్రైస్తవ సిద్ధాంతాచరణమువలననే వచ్చినట్లు తట్టినది. కనుక, పాశ్చాత్య నాగరకతాభిమానులందరును క్రైస్తవ నీతిసిద్ధాంతములను గౌరవింపజొచ్చిరి.

"The non-christain world is concerned solely with the ethical principles of Christianity and the pratical out come of these principles."[21]

సంఘములోని లోపములను సంస్కరింపవలెనని బద్ధకంకణులైన వారందరకు క్రైస్తవ సిద్ధాంతములలోని సాంఘికమైన విలువ ఆదరపాత్రమయినది. అందువలన వారు ఆ సిద్ధాంతములను మనసులో నుంచుకొని సంఘసేవ చేయజొచ్చిరి. సంస్కరణాభిలాషులై అద్దానికి పనికివచ్చు సాహిత్యమును సృష్టింపజొచ్చిరి. ఈ సిద్ధాంతములను బోలిన సిద్ధాంతములను-సనాతనములైనవానిని- వెదకి పైకి తెచ్చిరి.

"Christianity has given us Christ and taught us noble moral and spiritual lessons, which we have rediscovered in our own Scriptures,

20. From 'the Christian Ethic and India'—by A. I. Mayhew, C. M. G. C. I. E. in "Modern India and the West"—Oxford. 1941. Page-305.

21. Ibidem. Page-307.

and thereby satisfied our own self-love and made them our very own."[22]

క్రైస్తవ గ్రంథములలో అనువాదములు మాత్రమేగాక, ఆంధ్ర క్రైస్తవులు రచించిన కీర్తన గ్రంథములును గలవు. ఈ గ్రంథములందును విలక్షణమైన తెలుగు కారకము కన్పట్టును. ఆంగ్లమాతృకల ననుసరించి వ్రాసినవానియందును, స్వకపోల కల్పితములైన వానియందును గూడ ఈ వైలక్షణ్యము కలదు. బైబిలు, క్రైస్తవమతము, ప్రజల భావనా ప్రపంచమున నెంతటి ప్రభావమును జూపెనో, కీర్తనలయందలి విలక్షణత మనకు తెలుపును. ఈ కీర్తనలను వ్రాసినవారిలో ముఖ్యులు 'పురుషోత్తమచౌదరి, పులిపాక జగన్నాథము' గారలు.[23] వీరల కీర్తనలలో క్రీస్తు సంప్రదాయానుసారము తెలుగుపదములు చక్కగా సృష్టింపబడినవి. వానిలో కొన్నింటిని చూపుచున్నాను.

'సువిశేష మధురవచనము' అను పురుషోత్తమచౌదరిగారి కీర్తనలో "వరుసతో నటుమీదను పిత పుత్ర పరిశుద్ధాత్మల (Father, Son, and the Holy Ghost) పేరను పరమానందముతోడ, బాప్తిస్మమొక్కటి గురుతుగ..." అని కలదు. ఇది 1845 లో వ్రాయబడిన కీర్తన.[24] 1874 లో వ్రాసిన "చిత్ర మాప్రభుని చెన్నునడతలు" అనుకీర్తనలో "సర్వోన్నత శాశ్వతగృహములు తనజనులకు దయనొసగు" (My Father has many Mansions) అని కలదు.[25] "యెహోవా నామొఱ లాలించెను" అను కీర్తనలో[26] (1845) "అనీతివస్త్రు మెడలించెను" అని 'అనీతి'ని వస్త్రముతో పోల్చి వ్రాసిరి. కొన్ని కొన్ని కీర్తనలలో సనాతన సంప్రదాయమును జ్ఞప్తికితెచ్చు పదగుంఫనలతో, క్రైస్తవాభిప్రాయములను చక్కగ మేళవించుటయు కలదు. పురుషోత్తమ

---

22. R. S. Wilson తన పుస్తకమైన "The Indirect Effects of Christian Missions in India" (1928) లో ఒక బ్రాహ్మణుడు పైవాక్య మన్నట్లు Page-40 లో వ్రాసెను.

23. పురుషోత్తమ చౌదరిగారు 1833 అక్టోబరు 6 వ తేదీని; పులిపాక జగన్నాధముగారు 1847 ఏప్రిల్ 29వ తేదీని; 'బాప్తిస్మము'ను పొందిరి. (,They were men sent from God')

24. క్రైస్తవ కీర్తనలు. 1927. నంబరు-199.

25. Ibidem. నంబరు - 205.

26. Ibidem. నంబరు - 276.

చౌదరిగారి "యెహోవా మాతండ్రి......"అనుకీర్తన[27] ఇట్టిది. ఇందు భిన్న సంప్రదాయములు చక్కగా మిళితమైయున్నవి.

"మోక్షనగరి మాపుట్టిల్లు - ముఖ్య దూతల్ మాస్నేహితులు ।
సాక్షాత్కారమై యున్నపుడు - లక్ష్యపెట్ట మిహాబాధలకు ॥
అబ్రహాము దావీదు మొదలై - నట్టి వరభక్తాగ్రేసరులు ।
శుభ్రముగ మాచుట్టాలైన- సుఖము లిక మాకేమి కొదువ ॥
పేతురాది సకలపోస్తుల్ - పేర్మికల మా నిజ కూటస్థుల్ ।
ఆది సభలో మేమున్నపుడు - మోదములు మాకేమి వెలితి[28] ॥"

ఇటుల మేళవింపబడిన రచనలతోబాటు, కేవలము విలక్షణమైన నుడికారముగల రచనలును గలవు.[29] కీర్తనలను రచించినవారు భక్తులగుటవలన చాలచోట్ల భావతీవ్రత, భాషావైలక్షణ్యమును కనబడనీయదు.

భగవంతునిగూర్చి ఆంధ్రక్రైస్తవులు రచించిన కీర్తనలలో కొన్ని విలక్షణములైన కవిసమయములు కన్పట్టును. 'తత్త్వము'లలో 'ఆత్మ' నుద్దేశించి 'చిలుకా' అని పలికినట్లు, ఇందు 'పరిశుద్ధాత్మ'ను 'పావుర' మనిరి.

"ఓ పరిశుద్ధయాత్మమా - సుపావురమా రా।
నీ పావనాగ్నిచే మమున్ - దీవింపజేయుమా॥" (కీర్తన - 61.)

"పరిశుద్ధాత్మ నిత్యాత్మ - పరమపావురమా
దురితేచ్ఛలను దూర - పరచు సత్యాత్మ"॥ (కీర్తన-५३. రచన-బిళ్ల జాన్)

ఈ విధముగనే ప్రజలను గొఱ్ఱెలుగా వర్ణించుటయు సామాన్యము. ఇవి మాత్రమేగాక, 'ప్రాత నిబంధన గ్రంథము'లోని వర్ణనలు, కవిసమయములు చాల విలక్షణమైనవి. 'సొలొమోనుపాట' (Solomon's Song) లోని ఉపమానములు చమత్కారములును, గూఢార్థమయములును. ఈ 'పాట' నుండి కొన్ని రమణీయోదాహరణముల నిచ్చుచున్నాను.

---

27. Ibidem. నంబరు - 285.

28. అబ్రహాము — Abraham } పేతరు — St. Peter
దావీదు — David } అపోస్తులు — Apostles

29. "నాకై చీల్చబడ్డ ఓ - నా అనంతనగమా - నిన్ను దాగియందున
చెన్నుమీరబారెడు - రక్తజలధారలా - సక్తిగ్రోలనియ్యుమా" (Psalm—242)
"చవిలేనినరక జిహ్వలకును...... ......." (Psalm—197)

"నీ తలవెంట్రుకలు గిలాదుపర్వతమందు పచ్చికను మేసే నల్లటి మేకల మందవలె వున్నవి." (Solomon's Song, అధ్యాయము 4; వాక్యము-1)

"నీ రెండు స్తనములు లీలియా పుష్పములయందు మేసే అడవిజింక యొక్క రెండు ఆడుపిల్లలకు సమానముగా వున్నవి."

(పరిశుద్ధ గ్రంథము - 4 అధ్యా; 5.)

"నీ వెంట్రుకల నడుమ నీ బుగ్గలు దానిమ్మపండు అందమువంటివి" (4-3.)

"నీ నడుము వెలితిలేని గుండ్రటిపాత్రవలె వున్నది." (7-2.)

"నీ మెడ దంతపుదుర్గములవలె వున్నది." (7-3.)

"జండాలుతో వచ్చే సైన్యమువలె భయంకరముగానున్న వున్న యీబిడె యెవతె చెప్పుమా" (6-10.)

ఇందలి రచనావిధానము, వర్ణనాపద్ధతి నవ్యముగనుండి, ఆంధ్రభాషా సాహిత్యములలో 'క్రొత్తదనము'ను ప్రవేశపెట్టెను.

ఇంతవరకు; క్రైస్తవమతము, తన్మతగ్రంథములు, ఆంధ్రభాషా సాహిత్యములను విలక్షణ పదజాలముతో విశిష్ట భావసంపదతో ఎట్లు ప్రభావితముచేసెనో సోదాహరణముగా చూపబడినది. క్రైస్తవమతములోని ఉదాత్తనైతికాశయములు పరోక్షముగా ఆంధ్ర విద్యావంతులపై - వారు క్రైస్తవులయినను కాకున్నను[30] - తమ ప్రభావముచూపి, వారిచే క్రైస్తవేతివృత్తములపై ఉత్తమ రచనలు చేయించెను.

★

30. ఇట్టివారిలో శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారు (1848-1919), శ్రీ మంత్రిప్రెగడ భుజంగరావుగారు (1876-1940) మొదలైనవా రెందరో కలరు.

బ్రౌన్యాయుగము

[క్రీ॥శ॥ 19 వ శతాబ్ది పూర్వార్ధము]

## పాశ్చాత్త్యుల భాషాసేవ - దాని ప్రభావము

భారతీయ భాషలను నేర్చిన పాశ్చాత్త్యులను స్థూలముగా మూడు తెగలుగ విభజింపవచ్చును. క్రైస్తవ మత వ్యాప్తికై భారతీయభాషలు నేర్చుకొని కృషి చేసినవారు, మొదటి తెగవారు. వీరు చాలవరకు మిషనరీలు. ఉద్యోగ ధర్మమువలనభాషలనునేర్చుకొని, వానియందు విశేషకృషి చేయక వ్యావహారిక జ్ఞానముతోడనే తృప్తిపడినవారు రెండవ తెగవారు. ఉద్యోగధర్మము ననుసరించి భాషలను నేర్చుకొని, అంతటితో తృప్తిపడక, భాషాభిమానముచే తాము నేర్చిన భాషల అభివృద్ధికి యావచ్ఛక్తిని వినియోగించి కృషిచేసిన భాషా సేవకులు మూడవ తెగవారు. వీరుగాక వాణిజ్యాదికమును సక్రమముగ నిర్వర్తించుకొనుటకు దేశభాషలను నేర్చుకొన్నవారు కొందరున్నను, భాషాభిమానము విషయమున వీరు రెండవ తెగకే చెందినవారగుటచే, అందే వీరి ప్రసక్తియు గతార్థమగుచున్నది. వీరిలో మిషనరీలకంటె కూడ, భాషాభిమానులైన లౌకికోద్యోగులవలననే భాషాసేవ విశేషముగ జరుగుట కవకాశమున్నది. మిషనరీలలో చాలమంది తాము భాషలలో చేసిన కృషికి ఆశించిన ముఖ్యఫలితము, ప్రజల భాషలో చక్కగా మత ప్రచారము చేయగలుగుట కాని, ఉత్తమభాషా సేవకులగుట కాదు. వారికి భాషాపఠనము మతవ్యాప్తికి పనికి వచ్చు పనిముట్టు. లౌకికోద్యోగులలో భాషాభిమానుల దృష్టి అట్టిది కాదు. వీరి అంతిమాదర్శము భాషాసేవయే గాని మతవ్యాప్తి కాదు. కొన్నికొన్ని చోట్ల, వారి దేశభాషాప్రాగల్భ్యము ఉద్యోగధర్మమును చక్కగా నిర్వర్తించుటకు కూడ పనికివచ్చియుండును. కాని వారికి ప్రధాన విషయము భాషాసేవ. కనుక ఇట్టివార వలననే భారతభాషలకు మంచి సేవ లభించినది. కాని, పాశ్చాత్త్యులు భారతదేశమునకు వచ్చిన మొదటి దినములలో; విద్యావంతులైన పాశ్చాత్త్యులకంటె, నిరక్షరాస్యులను పోలిన సాహసోపేతులే అధికసంఖ్యలో నుండుటచే, ప్రతిభావంతులైన భాషాభిమానులు ఉద్యోగులగుట కొంత అరుదుగనే యుండెను. కాలక్రమమున ఈస్థితి మారుచువచ్చినను మొత్తముమీద నాటి ఉద్యోగులలో ప్రతిభావంతులైన భాషాభిమానులసంఖ్య స్వల్పమే. వారికి

పాలనాధికారమును నిర్వహించుటలో గల నేర్పు, ఉత్సాహము, ఇతర విషయములలో లేదు.

తెలుగుభాషకు మిషనరీల యొక్కయు, భాషాభిమానులైన ఉద్యోగుల యొక్కయు సేవ విశేషముగ లభించినది. మిగిలినవారి సేవ అత్యల్పము. మిషనరీలకంటె భాషాభిమానులైన లౌకికోద్యోగుల సేవయే తెలుగున కెక్కువ లాభదాయక మయ్యెను. తెలుగుభాషాసాహిత్యముల నుద్ధరించిన పాశ్చాత్యుల లోని ప్రముఖు లందరును — కల్నల్ కాలిన్ మెకంజీ, కాంబెల్, సి. పి. బ్రౌన్ మొదలయినవారు లౌకికోద్యోగులే. మిషనరీలలో ష్లూట్జ్ (Schultze) కృషి ప్రశంసింపదగినది. తరువాత గార్డెన్ (Gordon), ప్రిషెట్ (Prichett) మొదలయినవారి కృషి గమనింప తగినది. బైబిలు తెలుగులోనికి తెచ్చిన వారికి, సి. పి. బ్రౌన్ మొదలయినవారి సాయముకూడ నున్నను ఈ లౌకికో ద్యోగులకు భాషాసేవయే పరమావధి గాని మతప్రచారము కాదు గనుక, వీరిని మిషనరీల తెగలో చేర్చరాదు.

తెలుగునాయకరాజులు దక్షిణదేశమును పరిపాలించుచున్న దినములలో క్రైస్తవమత వ్యాప్తికై కృషిచేసిన వారిలో 1606 లో 'మధుర మిషను'ను స్థాపించిన ఇటలీ దేశస్థుడు ఫాదరు రాబర్ట్ డి నొబిలి (Robert de Nobili) పేర్కొనదగినవాడు. ఇతడు హిందూసన్యాసులవలెనే వేషధారణముచేసి, జగద్గురు బిరుదమును ధరించి క్రైస్తవమత ప్రచారమునకు పూనెను. ఇతడు తమిళము, తెలుగు, సంస్కృతము, బాగుగా అభ్యసించి మతప్రచార మాభాష లలో చేసెడివాడు. ఇతడు 1656 లో చనిపోవుటచే ఈతని కృషియు—మత భాషావిషయక మయినది—ఆగిపోయెను. ఈతని తరువాత ఫాదరు బెషి (Father Beschi) కృషి పేర్కొనదగినది. ఈతడు బ్రాహ్మణ పురోహితుని వేషమును వేసికొని 'విరామ ముని' అను పేరును కూడ పెట్టుకొని తిరిగెడి వాడట ! ఈతడు నాయకరాజుల రాజభాషయైన తెలుగు నేర్చుకొని దానిలో గ్రంథములను, వ్యాకరణమును రచించినట్లు, ఈతని జీవితచరిత్ర వ్రాసిన ఫాదరు బెస్సి (Father Besse) చెప్పుచున్నాడు కాని, బెషి తమిళములోనే ఎక్కువ కృషి చేసినట్లు కన్పట్టుచున్నది.[1]

---

1. "Father Beschi is rightly called the father of Tamil prose: he was the pioneer in the field of Tamil fiction; he was also the pioneer Tamil Lexicographer, compiling the first Tamil Dictionary,........"

తెలుగుభాషలో లోతైన పరిశ్రమ చేసిన ప్రథమ పాశ్చాత్యుడు 'బెంజమిన్ ష్లూట్జ్' అనవచ్చును. బైబిలును మొట్టమొదట తెలుగు చేయుటకు కృషిచేసి, 1746-1747 సంవత్సరములలో క్రైస్తవ మతమునకు సంబంధించిన గ్రంథముల నచ్చొత్తించెను. "నిజమైన క్రైస్తవుడు జీవితము గడుప వలసిన నూరు విధులు" అను నటిలు పుస్తకము ప్రష్యాదేశమున 'మ్యాగ్డిబర్గ్' నకు చేరిన 'హ్యాలే' (Halle) అనుచోట ముద్రింపబడెను.[2] ఈతని తరువాత 'సువార్త'లను 'బైబిలు'ను తెలుగులోనికి తెచ్చినవారిలో గార్డన్ (Gordon), ప్రిచెట్ (Prichett) అనువారలు ముఖ్యులు. వీరు 1815-40 సంవత్సరముల నడుమ కృషిచేసి అనువాదములను సిద్ధము చేసిరట. అది 1857-60 సంవత్సరముల నడుమ కాలములో మద్రాసునుండి ముద్రితమై వెలువడినది. దీనిలోని కొంతభాగము తన యింటనే సిద్ధమయినదని సి. పి. బ్రౌను వ్రాసెను.[3] బ్రౌనుదొర స్వయముగా 1832 లో 'లూకా సువార్త' తెనిగించెనట.[4] ఇది 1854 లో ఒక జంగముకవిచే పద్యములుగ చేయబడినది. వీరేగాక బైబిలును విలియమ్ కెరే (William Carey), డెస్ గ్రాంజెస్ అను వారలును తెనిగించిరి. వీరిలో డెస్ గ్రాంజెస్, తననుగూర్చి "క్రైస్తవ బ్రాహ్మణుడను" అని చెప్పుకొనెను. ఈ అనువాదములు ఆంధ్రభాషలో

---

(Modern India and the West. Chapter on 'Literature and Drama' IV Tamil by S. S. Bharati; Page—510)

2. ఈ విషయము కీ. శే. కొమర్రాజు లక్ష్మణరావుగారి 'విజ్ఞానసర్వస్వము' Vol. 2. 1916; లో 'అచ్చు' అను విషయముపై శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు వ్రాసిన వ్యాసమునుండి గ్రహింపబడెను. పుట - 584. 1746-1747 లో అచ్చయిన పుస్తకము యొక్క 'మాదిరి పుట' 'విజ్ఞానసర్వస్వము'న ముద్రితము. తెలుగులో అచ్చయిన ప్రథమ గ్రంథ మిదియేయని చాలమంది యూహ.

3. "The title page states that it is the translation prepared by Messrs. Gordon and Prichett in the years 1815-1840, but the phraseology shews thas many pages are printed from the version prepared in my house......In 1859 thit was reprinted as 'Wardlaw and Hays' version' but in fact there are only a few alterations; and these are not improvements." (From 'Some Account of the Literary life of C. P. Brown')

4. ఈ విషయము ఈ క్రింది ఆధారములను బట్టి తెలియుచున్నది.

(1) 36th Report of the British and Foreign Bible Society, Page—51.

(2) The Bible in Every Land 1860. Page—141.

"Then began a revisal of the whole translation of the Bible. The correct rendering of each word had been settled while I prepared the English-Telugu Dictionary." ('Some Account of the Literary life of C. P. Brown')

విలక్షణమైన పదజాలమును ప్రవేశపెట్టెను. క్రైస్తవమత సంబంధమయిన విషయములు ఈ అనువాదములవలన తెలుగువారికి తెలిసెను.

ఇక లౌకికోద్యోగుల కృషిఫలితముగా తెనుగునకు జరిగిన ఉపకారమును గూర్చి కొంత గ్రహింపవలసి యున్నది. వారి పరిశోధన పద్ధతుల ప్రభావము తెనుగుపై ఎట్లు ప్రసరించినదియో పరిశీలింపవలసి యున్నది.

ఆ దినములలో పనిపాటలు లేకుండ విశ్రాంతి ననుభవించుచు, తమ కాలమునంతయు భాషాపరిశోధనలతో వినియోగించుటకు పాశ్చాత్యులకు అవకాశములులేవు. ఉద్యోగులందరికిని చేతినిండుగ పనియుండెను. ఇంతపనిలో కూడ తీరికచేసికొని భాషాసేవ చేసినారన్నచో వారి కార్యదీక్ష తెలియగలదు[5]. వీరుచేసిన కృషి దేశభాషలు నేర్చుకొనగోరు పాశ్చాత్యులకు, పాశ్చాత్యభాషలు నేర్చుకొనగోరు దేశీయులకుకూడ నుపయోగకరముగ నుండెను.

దక్షిణదేశ భాషాసాహిత్యములపై నేగాక, దేశచరిత్రపైగూడ అద్భుత ప్రభావముచూపినట్టి-కృషిచేసిన పాశ్చాత్యుడు కల్నల్ కాలిన్ మెకంజీ(Colonel Colin Mackenzie. 1753-1821). ఈతడు కేవలము తెలుగుకొరకే కృషిచేయకున్నను, అతని కృషిలో చాలభాగము తెలుగువారికి పనికివచ్చినది. ఈతడు భారతదేశమునకు సర్వేయరు-జనరలుగ పనిచేసెను. ఈతని అభిమాన విషయము గణితశాస్త్రమయినను, భారతీయుల మత సాంఘిక సాహిత్యాది విషయములను గూర్చి తెలిసికొన నిచ్ఛగించెను. ఈ కోరిక, 1796 లో అతనికి ఏలూరు నివాసియైన కావలి వెంకటబొర్రయ్యతోనయిన స్నేహమువలన నెరవేరినది. బొర్రయ్య (1776-1803) సాయమువనే తాను భారతీయ విజ్ఞానసౌధములో నడుగుపెట్టగలిగితినని మెకంజీవ్రాసెను.[6] మెకంజీ తన సొంతధనమును వెచ్చించి,

5. "A mere man of letters, retired from the world and allotting his whole time to philosophical or literary pursuits, is a character unknown among European residents in India. Here every individual is a man of business; in the civil or military state he is constantly occupied in the affairs of Government, in the administration of justice, in some department of revenue, or commerce, or in one of the liberal professions; very few hours in the day or night can be reserved for study." (Introduction to the Asiatic Researches - Sir William Jones.)

6. "The connection then formed with one person, a native, and a bramin (the lamented V. C. Borriah, then almost a youth of the quickest genius and disposition, possessing that conciliatory turn of mind, that soon reconciled all sects and all tribes to the course of enquiry followed in his surveys) was the first step of my introduction into the Portal of Indian Knowledge.." (Sir Alexander Johnstone నకు మెకంజీ వ్రాసిన లేఖలోని భాగము.)

బొర్రయ్యను గ్రామగ్రామమున త్రిప్పి వందలకొలది గ్రంథములను, శాసనము లను సేకరించి; బొర్రయ్య సాయముతో వానిని శోధించి, ఆ పరిశోధనా ఫలితములను—ఏషియాటిక్ రిసెర్చెస్, రాయల్ ఏషియాటిక్ సొసైటీ జర్నల్, ఓరియంటల్ మాన్యుయల్ రిజిస్టర్, మొదలయిన వానిలో ప్రకటించెను. మెకంజీ సర్వే ఉద్యోగి కనుక ఆతడు హైదరాబాద్, మైసూరు మొదలైన 'రాజ్యముల'లోని మారుమూల ప్రాంతములన్నియు చూచుట, చరిత్రకు కావలసిన సామగ్రిని సేకరించుట జరిగినది. శ్రీరంగపట్టణము ఇంగ్లీషువారి వశమగునప్పుడు జరిగిన యుద్ధమున, మెకంజీ తన మిత్రుడగు బొర్రయ్యతో నుండెను. అక్కడ లభించిన శాసనములను పదిలపర్చెను. బొర్రయ్య మృతి (1803) తరువాత నాతని సోదరుల సాయమును మెకంజీ పొందెను. 1821 లో మెకంజీ చనిపోవునాటికి - తెలుగు, సంస్కృతము, కన్నడము, తమిళము, మలయాళము, ఓఢ్రము, మహారాష్ట్రము, హిందీ, ఫార్సీ, అరబ్బీ, బర్మా భాషలకు సంబంధించిన గ్రంథములు 1568 యును; స్థానిక వృత్తాంత పత్రికలు 2,070 యును; శాసనములు 8,076 ను; నాణెములు 6,218 యును; పురాతన భవనములనిర్మాణ ప్రతిరూపములు 79 యును; శిల్పముల చిత్రములు 2,630 యును; విగ్రహములు 106 ను; పురాతన శిథిలావశేషములు 40 యును; కలవు.[7] ఆతని మృతితరువాత పదివేల పౌనులిచ్చి ఆతని భార్యయొద్దనుండి ప్రభుత్వము ఈ 'సామగ్రి'ని కొనెను. దక్షిణదేశమునకు సంబంధించినంతవరకు ఇందుగల లిఖితప్రతులను, శాసనములను 1828 లో మద్రాసు కాలేజీ లైబ్రరీలో నుంచిరి. తరువాత 1836 లో అవన్నియు రివరెండ్ విలియమ్ టెయిలర్ అను పండిత పరిశోధకుడు పరీక్షించి 570 పేజీల కేటలాగు సిద్ధము చేసెను.

మెకంజీ సేకరించిన 'పత్రములు' శిలమగుచుండగా, సి.పి. బ్రౌనుదొర వానిని మంచి కాగితములపై తిరిగి వ్రాయించెను. ఇవియే 'స్థానిక చరిత్రలు'. ఇవి 62 సంపుటములు. ఈ సంపుటములలో మూడువంతులు తెలుగువారికి సంబంధించినవి. ఆధునిక పరిశోధనకు పునాదులువేసిన పాశ్చాత్యుడు మెకంజీ. ఆతనికి సాహాయ్యముచేసిన ప్రథమ భారతీయుడు బొర్రయ్య, ఆంధ్రుడు. వీరి తరువాత కృషిచేసినవారి కందరికి వీరే మార్గదర్శకులు.

---

7. A Descriptive Catalogue of Mackenzie Collections, with Life, 2nd Edition - Madras 1882.

శ్రీరామపురము మిషనునకుచెందిన డా. విలియమ్ కెరే (Dr. William Carey) ఒక ముద్రణాలయమును స్థాపించి, ఇంచుమించుగా భారత భాషల కన్నింటికి అక్షరములు పోతపోయించి, దేశభాషా వ్యాకరణములను నిఘంటువులను ముద్రించెను. ఈతడు స్వయముగా మహారాష్ట్రి (1805), సంస్కృతము (1806), పంజాబి (1812), తెలుగు (1814) మొదలయిన భాషలకు వ్యాకరణములను రచించి అచ్చొత్తించెను. దక్షిణదేశభాషలు సంస్కృత భాషాజన్యములే అయినను, వానియందు విలక్షణమగు పదజాలము కొంత కలదనియు, ఆ పదముల మూలప్రకృతిని గ్రహించుట కష్టమనియు ఈతడు వ్రాసెను.[8] ఈ మాటలు తరువాతి పరిశోధకులలో ద్రావిడభాషల తులనాత్మక పరిశీలనమున వాదోపవాదములను రేపినవి. బహుభాషలలో పండితుడైన ఈతని వాక్యములను తరువాతి పాశ్చాత్య పండితులందరును విమర్శించిరి.

నాడు బహుళ ప్రచారమును పొందిన తెలుగు నిఘంటువును,[9] తెలుగు వ్యాకరణమును నిర్మించిన కాంబెల్ దొర (A. D. Campbell) తెలుగుభాష సంస్కృతజన్యము కాదని తనపరిశోధనలవలన తేలినట్లు తన వ్యాకరణమున వ్రాసెను. తన అభిప్రాయము డా॥ విలియమ్ కెరే మొదలయిన విద్వాంసుల అభిప్రాయములకు విరుద్ధముగ నున్నను. తన భావము సమంజసమైనదనియు, తెలుగు తమిళాదిభాషలకు సన్నిహితమైనదనియు[10] ఈతడు నిరూపించెను.

---

8. "The languages of the South of India i. e. the Telinga, Karnata, Tamil, Malayala and Cingalese, while they have the same origin with those of the North (Viz. the Sanscrit) differ greatly from them in other respects: and especially in having a large proportion of words, the origin of which is unascertained" (Preface-Grammar of the Telinga Language - 1814. Serampore.)

9. "తెలుఁగులో మొట్టమొదట నిట్టి యక్షరక్రమ నిఘంటువు కూర్చిన యాతఁడు ఏ. డి. కాంబెలు (Mr. A. D. Campbell) అను నాంగ్లపండితుఁడు. ఈయన రాజకీయోద్యోగము (Indian Civil Service) నందుండియు నాంధ్రభాష శ్రద్ధతో నభ్యసించి కొంత పాండిత్యము సంపాదించుకొనెను, ఆయన రచించిన నిఘంటువులోఁ దెనుఁగు పదములను వానికి సరియైన యాంగ్లార్థములను జూపబడినవి."

—జయంతి రామయ్యపంతులుగారు

(శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటువు; పీఠిక. పేజీ- '2'; పీఠికాపురము. 24-3-'36).

కాంబెల్ నిఘంటువు (1821) కంటె ముందే విలియమ్ బ్రౌన్ నిఘంటువు (1817) ప్రచురింపబడెను. ఈ విషయమును పంతులుగారిట ఏలకో స్మరింపలేదు.

10. "It has been generally asserted, and indeed believed, that the Teloogoo has its origin in the language of the Vedums, and many of the most minent oriental scholars have given their authority in support of this opinion.

'ద్రావిడ భాషావ్యాకరణము' (1855-56) వ్రాసినట్టి డా. కాల్డ్వెల్ దొర, ద్రవిడభాషలు సంస్కృతభాషాజన్యములుకావని నిరూపించి వ్రాయుటకుపూర్వమే, కాంబెల్ దొర తన వ్యాకరణమందా విషయమును ఉటంకించె[11] నన్నచో కాంబెల్ దొర పరిశోధనావిజ్ఞానము మనకు తెలియును. తెలుగు మొదలైన దాక్షిణాత్య భాషలకు సంస్కృతముతో గల సంబంధమునుగూర్చి దేశీయ విద్వాంసులలోను, కొందరు పాశ్చాత్యులలోను గల భావమునకు భిన్నమయిన అభిప్రాయమును వెలిబుచ్చి కాంబెల్ దొర భాషాశాస్త్ర పరిశోధనను నవ్యపథమున తీర్చెను.

తన తెలుగువ్యాకరణముయొక్క ఉపోద్ఘాతములో, తెలుగు సంస్కృత భాషాజన్యము కాదని నిరూపించుటకై, ఆయా భాషలకు గల భేదములను గూర్చి ఇట్లు వ్రాసెను.

"In the course of this work, it will be obvious to the Sanscrit scholar that the declension of the noun, by particles or words added to it - the use of a plural pronoun (మనము) applicable to the first and second persons conjointly - the conjugation of the affirmative verb- the existence of a negatlve aorist, a negative imperative and other negative forms in the verb - the union of the neuter and feminine genders in the singular, and of the masculine and feminine genders in the plural, of the pronouns and verbs - and whole body of the syntax, are entiely unconnected with the Sanscrit; while the Tamil and Karnataca scholar will at once recognize their radical connexion with each of these languages. The reader will find all words denoting the different parts of the human frame, the various sorts of food or utensils in common use among the natives, the several parts of their dress, the compartments of their dwellings, the degrees of affinity and consanguinity peculiar to them, in short all terms expressive of primitive ideas or of things necessarily named in the earlier stages of society, to belong to the pure Teloogoo or language of the land...the

---

It is not without much deference, therefore, that I venture publicly to state my inquiries to have led me to contrary conclusion..." (A Grammar of the Teloogoo Language by A. D. Campbell. Third Edition. 1849. Madras. Introduction—Page—XV)

11. "......the supposition of the derivation of the Dravidian languages from Sanscrit, though entertained in the past generation by a Colebrooke, a Carey, and a Wilkins, is now known to be entirely destitute of foundation." (Dravidian Comparative Grammar - R. Caldwell., 1875 - Second Edition - Introduction—Page 45)

great body of Sanscrit words admitted into the language consists of abstract terms, and of words connected with science, religion, or law as in the case, in a great degree, with the Greek and Latin words incorporated with our own tongue: but even such Sanscrit words as are thus introduced into Teloogoo are not allowed to retain their original forms, they undergo changes, and assume terminations and inflections unknown to the Sanscrit, and except as foreign quotations, are never admitted into Teloogoo until they appear in the dress peculiar to the language of the land......"

"......I am inclined, however to believe that the Teloogoo will be found to have its origin in a source different rrom the Sanscrit, a source common perhaps to the Teloogoo, with the superior dialects of the Tamil and Karnataca."[12]

కాంబెల్ దొరయొక్క అభిప్రాయము తెలుగుభాషాపరిశోధనలో, నవ్యమార్గమునకు దారితీసినది. ఈతనికి గల అభిప్రాయముతో ఏకీభవించి, తన పాండిత్యమునుకూడ ఈఅభిప్రాయ స్థాపనవిషయమున తోడిచ్చినవాడు ఫ్రాన్సిస్ డబ్లియు. ఎల్లిస్ (Francis W. Ellis)

ఫోర్టు సెయింటు. జార్జి కళాశాలయొక్క నిర్వహణ సంఘాధ్యక్షుడైన 'ఎల్లిస్‌దొర' (Mr. Francis W. Ellis, Head of the Board of Superintendence for the College of Fort St. George) బహుభాషావేత్త. ఈతడు కాంబెల్‌దొర వ్రాసిన తెలుగువ్యాకరణముయొక్క ఉపోద్ఘాతమునకు ఒక చిన్నశీర్షిక (Note) వ్రాసెను. ఇదియు ఆ వ్యాకరణముతోబాటే అచ్చయినది. అందు తెలుగుసంస్కృత భాషాజన్యము కాదనియు; తమిళము, కన్నడము మొదలైన భాషల తెగకే చెందినదనియు వ్రాసెను. ఇందీతడు డాక్టరు కెరే అభిప్రాయమును సోపపత్తికముగ ఖండించెను. ఈ ఖండనశీర్షికను కాంబెల్ దొర కోరికపై 'ఎల్లిస్' వ్రాసెనట.[13]

---

12. A Grammar of the Teloogoo Language - A. D. Campbell - Third Edition. 1849 - Madras - Introduction - XIX, XX.

13. "In support of what I have ventured to advance, in the preceding introduction, on the subject of the structure and derivation of the Teloogoo language, it is peculiarly gratifying to me to be allowed to quote the high authority of my friend Mr. Francis W. Ellis, at the head of the Board of Superintendence for the College of Fort St. George, as contained in the following observations with which he has favoured me. The knowledge which this gentleman possesses of the various spoken dialects of the Peninsula, added to his

కాంబెల్ దొర సూచనప్రాయముగ చెప్పినదానిని. 'ఎల్లిస్' విపులీకరించి వ్రాసి, తెలుగు సంస్కృతభాషనుండి పుట్టినది కాదనియు, తమిళము మొదలైన భాషలతోనే దానికెక్కువ సంబంధము, పోలిక కలదనియు నిరూపించెను. అంతియెగాక, సంస్కృత విద్వాంసులైన 'కోల్‌బ్రూక్' (Colebrooke) మొదలైనవారు, తెలుగును ప్రాకృతముల జాబితాలో చేర్చుట తప్పనియు వ్రాసెను. ఈ భావమునే వివరించుచు; తెలుగు తమిళము మొదలగునవి సంస్కృత భాషాజన్యములు కావనియు, ఆయా భాషల సౌందర్యమునకు సంస్కృతము సాయపడవచ్చునేమోకాని, ఆ భాషల ఉనికికి సంస్కృత మనావశ్యకమనియు వ్రాసెను. ఈ అభిప్రాయమును స్థిరీకరించుటకై సోపపత్తికమైన శీర్షికను 'కాంబెల్ దొర' వ్యాకరణమునకు తాను వ్రాసినట్లు 'ఎల్లిస్' చెప్పెను.[14]

ఈ శీర్షికలో 'ఎల్లిస్' తెలుగు ధాతువులకు సంస్కృత ధాతువులకు ఏవిధమైన పోలికయులేదని చూపుటకై కళాశాలాపండితులైన పట్టాభిరామశాస్త్రిగారి 'తెలుగు ధాతుమాల' నుండి 'అ, క, ప, వ' అను అక్షరములతో ప్రారంభించు వానినిఅక్షరమునకు పదిచొప్పున-మొత్తము నలుబది ధాతువులను-గ్రహించి; ఆ అక్షరములతోనే ప్రారంభించు సంస్కృత ధాతువులతోపోల్చి, ఈ రెంటికి పోలికలేదని చూపెను. అటులనే, నలుబది ధాతువులను తమిళ, కన్నడభాషలలో నుండి గ్రహించి వానికి తెలుగుధాతువులతో గల పోలికలను నిరూపించెను. తరువాత, అధర్వణుడు, అప్పకవి మొదలగువారు దేశ్యములని అంగీకరించిన వానిని, ఆంధ్రదీపిక వ్రాసిన మామిడి వెంకయ్య గ్రహింపగా; ఆ పదజాలము నుండి కొన్ని మాటలను 'ఎల్లిస్' గ్రహించి, వానిని తమిళ కన్నడములతో పోల్చి, ఆయా భాషలకు గల సన్నిహితత్వమును నిరూపించెను.[15] ఇంతటితో తృప్తి పొందక కారకమునందును, వాక్యరచనావిధానమునందును, తెలుగు

acquirements as a Sanscrit scholar, peculiarly qualify him to pronounce a judgement on the subject." (By A. D. Campbell at the head of the 'Note to the Introduction' of F. W. Ellis- A Teloogoo Grammar, page 1)

14. "It is the intent of the following observations to shew......that neither the Tamil, the Telugu, nor any of their cognate dialects are derivations from the Sanscrit; that the latter, however it may contribute to their polish, is not necessary for their existence; and that they form a distinct family of languages, with which the sanscrit has, in later times especially, intermixed, but with which it has no radical connexion." (Ibidem. 'Note to the Inroduction'-page 2)

15. "This pure native language of the land, allowing for dialectic differences and variations of termination, is, with the Telugu, common to the Tamil,

సంస్కృతముకంటె ఎట్లు భిన్నమో; తమిళ కన్నడములతో ఈ విషయమున ఎట్లు సన్నిహితమో; రుజువుచేసెను.[16] ఇందులకై యాతడు డాక్టరు విల్కిన్స్ (Dr. Wilkins) యొక్క సంస్కృత వ్యాకరణములోని కారక పరిచ్ఛేదములో నుండి ఉదాహరణ వాక్యములను గ్రహించి; వానిని తెలుగు, తమిళము, కన్నడములలోని కనువదించి చూపెను. ఈ విధముగా తెలుగునకు సంస్కృతమునకు గల సంబంధమును తెలుపుటలో క్రొత్త దారి త్రొక్కి, తరువాత బయలుదేరి యభివృద్ధిపొందిన, ద్రావిడభాషాపరిశోధనలకు వీ రిరువురు (కాంబెల్, ఎల్లిస్) మార్గదర్శకులైరి. భాషాపరిశోధనారంగములో వీరి యభిప్రాయముల ప్రభావ మనంతము.

1817 లో విలియమ్ బ్రౌన్ 'జెంటు భాషావ్యాకరణము'ను రచించెను. ఈ వ్యాకరణము కాంబెల్ వ్యాకరణమంత పర్యాప్తమైనది కాదు. ఈతడు తన వ్యాకరణమునకు పీఠిక (Preface) వ్రాయుచు, సంస్కృతమునకును తెలుగునకు గల సంబంధమునుగూర్చి కొన్ని వాక్యములు వ్రాసెను. కాంబెల్ దొర వ్యాకరణములో నున్నంత స్ఫుటముగ నీతని వాక్యములు; తెలుగునకు, సంస్కృతమునకు, జన్యజనక సంబంధము లేదని చెప్పుచున్నను, ఈతని భావమునందును నట్లే యున్నట్లు తలంపవచ్చును. వాక్యరచనావిధానములో పై రెండు భాషలకుగల తారతమ్యమును గూర్చి ఈతడిట్లు వ్రాసెను—

"Should we, for example, place the words of any sentence in the Gentoo and in the Sanscrit together, the contrast between the two will appear so very great, that it would only tend to involve the question in still greater perplexity; but it can scarcely fail to argue the want of an original and natural connection between them."[17]

---

Cannadi and the other dialects of Southern India: this may by dem onstrated by comparing the Desyam terms contained in the list taken by Venkaya from the Appacaviyam, with the terms expressive of the same ideas in Tamil and Cannadi. It has already been shewn that the radicals of these languages, mutatis mutandis, are the same, and this comparison will shew that the native terms in general use in each, also, correspond." (Ididem, Note to the Introduction' - page 18)

16. "..in collocation of words, in syntaxical government, in phrase, and, indeed, in all that is comprehended under the term idiom, they are, not similar only but the same." (Ibidem-page 22)

17. A Grammar of the Gentoo Language by William Brown. 1817. Preface - Page V.

ఈతడు తన వ్యాకరణ పీఠికలో డాక్టరు కెరే యొక్క అభిప్రాయమును (తెలుగు సంస్కృత జన్యమనుటను) లఘువుగ విమర్శించెను. సంస్కృతము; తెలుగు, తమిళము మొదలైన భాషలకు తల్లియని 'కెరే' వ్రాసినందుల కీతడు ఆశ్చర్యమును వెలిబుచ్చెను.[18]

పై విధముగా నీతడును, తెలుగు సంస్కృత జన్యము కాక ప్రత్యేక భాషా కుటుంబమునకు చెందినదను భావమునే వ్యక్తము చేసెను.

తెలుగుభాషాసాహిత్యములకై, తన జీవితకాల మంతను కృషిచేసిన సి. పి. బ్రౌనుదొర (1798-1884) వలన కలిగినంత లాభము, తెలుగునకు మరి యే పాశ్చాత్యునివలనను కలుగలేదనుట సత్యదూరము కాదు. ప్రబంధముల పాఠములను నిర్ణయించుట మొదలు. అచ్చునకు వీలగునట్లు తెలుగు లిపిని సంస్కరించునంతవరకు ఆతని ప్రభావము తెలుగుపై కలదు. ఆతడు తెనుగు సాహిత్యరంగమున కృషికి ప్రారంభించునాటికి తెలుగువెలుగు సన్నగిల్లుచుండెను. సాహిత్యదీపము కునుకుచుండెను. ("When I began these tasks, Telugu literature was dying out, the flame was just glimmering in the socket"[19]) తెలుగు పండితులు తేజోవిహీనులై, మదరాసులోని కళాశాలాధికారులచే 'పింఛనీదారులు'గ పరిగణింపబడుచు; క్రుగ్గుచుండిరి. ("...The pandits expressed to me their grief, that the ruling powers regared them as useless pensioners"[20]) అంతకు పూర్వము తెలుగుభాషలో 'కాంబెల్, విలియమ్ బ్రౌన్' మొదలైనవారుకృషి చేసినను, సి. పి. బ్రౌను తెలుగుభాషాసాహిత్యములయందు తనకున్న మక్కువయందు వారిని మించెను. ఈతనికి, భారతీయుల కుపయోగపడుటయే కావలసినది. ("To benefit the Hindus was always my primary object"[21]) ఇట్టి సదభిప్రాయములతో జీవితాంతము కృషిచేసి, 'ఇంక తెలుగునకు భయము

18. "When the compiler of that small tract (Telugu Grammar by Dr. Carey - 1814) on another occasion asserts, that the Sanscrit 'is the immediate parent of the Mahratta, the Orissa, the Telenga, the Carnatic, the Gujurat, and the Malabar and Tamil languages; and that the knowledge of the Sanscrit places all those in our power, as it will generally furnish four words out of five of them all'; We cannot help smiling at the gross mistakes exhibited in a Grammar of the Gentoo, compiled as it has been by one who is so professedly competent in the Sanscrit Language." (Ibidem. Preface - XII)

19. 'Some Account of the Literary life of C. P. Brown'— (Printed in the II Edition - 1895 - of Brown's English-Telugu Dictionary and written by Brown at the instance of his friends on the eve of his leaving India-1855)

20. Ibidem. 21. Ibidem.

లేదు' అని అనుకొని తృప్తిపడిన మహానుభావుడు. తన కృషివలన తెలుగు, ఆంధ్రేతరులకు సులభసాధ్యమై, గౌరవాస్పదమై ప్రకాశించుచున్నదని సంతోషించిన సహృదయుడు బ్రౌనుదొర. (" I think Telugu will no longer be considered the most difficult language in India"[22]) ఆంధ్రదేశ చరిత్రయందును సాహిత్య చరిత్రయందును మిక్కిలి క్లిష్టసమయమున బ్రౌను దొర సాహాయ్యము తెలుగునకు లభించినది గనుకనే, అది పునరుజ్జీవితమును పొంది విజృంభించెను. ఆతడు తెలుగులో కృషిచేసి అలంకరించిన ప్రతి రంగముననుఆతని ప్రభావము పడెను. కొన్ని కొన్ని రంగములలో ఆ ప్రభావచ్ఛాయలు నేటికిని కన్పట్టుచున్నవన్న దాని ప్రత్యేకత తెలియ గలదు. ఇతని రచనలు తెలుగున కుపకారము లగుటయేగాక; ఆంగ్లము నేర్చుకొనగోరు తెలుగువారికి నుపయోగపడి, పరోక్షముగ ఆంధ్రదేశములో ఆంగ్లసాహిత్య పఠనాదికము నినుమడింపజేసినవి. ఇట్లుభయతారకమైన కృషి చేసిన పాశ్చాత్యులలో బ్రౌనుదొర విశిష్టుడు.

తెలుగు నేర్చుకొనగోరువారు-వారు విదేశీయులైనను స్వదేశీయులైనను తగిన పాఠ్యగ్రంథములు లేక బ్రౌనుదొరకాలమునాడు మిక్కిలి బాధపడు చుండిరి. ఈ బాధ విదేశీయులకు మిక్కుటముగ నుండెను. స్వదేశీయులకును, ప్రాతపద్ధతిలోనే చదువు సాగుచుండెను. బ్రౌనుదొర ఇట్లు బాధలుపడి తెలుగు నేర్చుకొని, తనతరువాత నెవరు నిట్లు బాధపడరాదని, చక్కని వాచకములను, నిఘంటువులను, వ్యాకరణమును రచించెను. ఈ విధముగా పాఠ్యగ్రంథములను రచించి నాటి రచనపై తన ప్రభావము చూపెను.

పండితులపై నాతని కెంతగౌరవమున్నను[23] వారి పద్ధతిని చదువుటయం దాతని కిష్టములేదు. ఆ పద్ధతిని నిరసించి, పాశ్చాత్యపద్ధతినే తాను చదువునం దవలంబించినట్లు ఆతడు తెలిపెను. "...Were we to submit entirely to their guidance we should learn little that is profitable. They exhort us to learn by rote long Vocabularies framed in metre; but I rejected these, preferring the European method of study[24]."

---

22. Ibidem.
23. "I discoverd some excellent scholars, poets, grammarians and critics, half of whose learning I never attained.."(Ibidem)
24. Ibidem.

ఈ పద్ధతి నాతడు తన చదువునం దుపయోగించుటయే గాక, తెలుగు కావ్యముల శుద్ధప్రతులను సిద్ధముచేయుటయందును నుపయోగించెను. ఈవిధముగ: పాశ్చాత్య విమర్శన, పరిశోధన పద్ధతులకు బ్రౌనుదొర తెలుగునాట పునాదులు వేసెను. వివిధ పాఠభేదములు కల ప్రతులను తెప్పించి, వానిలో వానికి తైపారువేసిచూచి, ఇష్టపాఠమును పరిగ్రహించి, అనిష్టరూపమును నిగ్రహించి, చక్కని వ్రాతప్రతులను ముద్రణమునకు బ్రౌనుదొర సిద్ధము చేయించెను. పండితులను, వ్రాయసకాండ్రను సొంతడబ్బు వెచ్చించి నియమించి, ఈ కృషిచేసిన బ్రౌనుదొరకు; పాశ్చాత్య విద్వాంసులు లాటిన్, గ్రీకు మొదలైన భాషలకై చేసిన కృషివిధానము, దారిచూపెను. ఈ సందర్భమున తాను చేసినకృషి నిట్లు వివరించెను, "Before studying a poem I had it copied in a clear hand, on English paper, numbering the verses to facilitate reference. The manuscripts were full of errors. My learned assistants adjusted them by guess as they went along; but having read of the processes used by Lambinus, Erasmus, Heinsius, Casaubon, Kennicott and other restorers of learning, I followed their example so as to elicit an authentic text[25]"

ఏదో దొరికిన ప్రతినిబట్టి గ్రంథము నచ్చువేయక, వివిధ ప్రాంతములలో నుండి. వ్యయప్రయాసలకు లోనై లిఖితప్రతులను తెప్పించి పాశ్చాత్యవిద్వాంసుల పద్ధతి నవలంబించి, శుద్ధ ప్రతులను సిద్ధము చేయించి, తెలుగువారికి గ్రంథమును ముద్రణమునకు సిద్ధముచేయు పద్ధతిని బ్రౌనుదొర నేర్పెను. అంతకుపూర్వ మీ పద్ధతిలేదు. ఇది యాతని పాశ్చాత్య సంస్కార ప్రభావము. వేమనపద్యములను ఆంగ్లానువాదముతో నచ్చువేయునపు డాతడు వివిధ ప్రాంతములనుండి ప్రతులను తెప్పించుటయే గాక; పాఠభేదములను పరిశోధించి, ఆ పద్యములను విషయమునుబట్టి ఐదు భాగములుగ విభజించి; అచ్చువేసెను.[26] ఇంగ్లీషులో 'మిల్టన్ మహాకవి' యొక్క గ్రంథమైన 'పేరడైజ్ లాస్ట్' మొదలగు కావ్యములు విభాగింపబడినట్లు; వేమనపద్యములను బ్రౌను

25. Ibidem.

26. "After collecting such copies as were to be found at Masulipatam where I was then stationed, I gradually procured others from Vizagapatam, Nellore, Guntur, Cuddapah, and Madras....I at length formed the whole into five tolerably consistent divisions religious, moral, satirical, mystic and miscellaneuos." (The Verses of Vemana, 1829. Preface)

దొర, మొదటి పుస్తకము (Book one), రెండవ పుస్తకము (Book two) అను విధమున విభజించెను.

అచ్చు వచ్చుటకు పూర్వము గ్రీకు, లాటిన్ గ్రంథము లెట్టి హీనస్థితిలో నుండెనో అట్టి హీనస్థితియందున్న తెలుగు కావ్యములను[27] ఉద్ధరించుటకై బద్ధ కంకణుడై, బ్రౌనుదొర పాశ్చాత్యపద్ధతి ప్రకారము వానికి శుద్ధప్రతుల నిట్లు సిద్ధము చేసెను.

"I first had a copy made from any manuscript of tolerable accuracy, the alternate pages being left blank, and the verses duly numbered : then the volume was bound. I collected twelve or fifteen other manuscripts (few of them complete), lent me by various natives. A clerk sat with the newly written copy ready; and before him were two, each having charge of five or six manuscripts. the oldest I could discover. Three professors sat by masters of Grammar and Prosody, both Sanscrit and Telugu; but the other knew only their mother-tongue. Each assistant in turn read a stanza, which thus was recited ten or twelve times; the scribe recorded every deviation, the pandits formed their judgements on each line, and then one of them taking the blotted copy, selected the pure text, and dictated it to a reader"[28]

ఈ విధముగా సరియైన పాఠములుగల ప్రతిని సిద్ధముచేయించుటతో తృప్తిపడక, కావ్యములలోని పద్యములకు వ్యాఖ్యానములు వ్రాయించెను.[29] ఈ వ్యాఖ్యానములు వ్రాయునప్పుడు వచ్చిన చిక్కులను సరిచేసికొనుటకు తన నిఘంటువు నుపయోగింపించి, దానినికూడ వృద్ధిపొందించెను.[30] ఈవిధముగ ఇరువదిసంవత్సరములు జరిగెను. దాని ఫలితముగ, ఇంచుమించుగ తెలుగు కావ్యముల కన్నింటికి చక్కని వ్యాఖ్యానములు బయలుదేరినవి.[31] ఈ వ్యాఖ్యాన

27. "The ancient Telugu Classics were in a diplorable state; like that of Greek and Latin authors before the invention of printing." (Some Account of the Literary life af C. P. Brown)

28. Ibidem.

29. "When any doubt arose about the meaning of a word or verse I directed that the result of the consultations should be at once recorded in Telugu; thus opening the way to the preparation of a verbal commentary." (Ibidem)

30. "Some of the favourite poems have passages which are intricate. To illustrate them I caused Telugu commentaries to be framed, and desired that no difficult passage should be settled without referring to the statements and quotations in my dictionary; which gradually grew to a large size." (Ibidem)

31. "......in twenty years notes were appended to all the leading Telugu poems...The new commentaries thus framed have been greeted with much applause, as illustrating and perpetuating Telugu Literature." (Ibidem)

ములనుచూచి సాహిత్యాభిమానులు చాల సంతోషించిరట. ఈతని వ్యాఖ్యాన పద్ధతియే, తరువాత కూడ ననుసరింపబడినది. వ్యాఖ్యానము వ్రాయుట విమర్శకుని తెలివితేటలను ప్రదర్శించుటకు కాదనియు, చదువుకొనువారి యుపయోగమునకనియు బ్రౌనుదొర చెప్పి, అంతకుపూర్వము రెండు కావ్యముల కున్న వ్యాఖ్యానములు విమర్శకుని మేధాసంపత్తికి నిదర్శనములే గాని, ప్రారంభకునకు సాయపడునవి కావని వ్రాసెను. ("They were written more to glorify the acumen of the critic and less to aid the learner."[32])

పాశ్చాత్య పద్ధతిప్రకారము గ్రంథములను ముద్రణమునకు సిద్ధము చేయుట బ్రౌనుదొరయే ప్రారంభించెను. అంతకుపూర్వము ఈ పద్ధతిని ఎరిగి యుండకుండుటచే 'కాలేజి బోర్డు' వారు ముద్రించిన పుస్తకములలో తప్పులు కుప్పలుగ నున్నవని బ్రౌనుదొర ఇట్లు వ్రాసెను :

"The members were not aware of the methods whereby the learned in Italy and Germany had elicited a pure Greek text out of defective manuscripts ; just as a judge frames a decree out of conflicting evidence"[33].

పాశ్చాత్యుల సంపర్కమువలన 'అచ్చు' మనకు వచ్చినది. ఇది వచ్చి చాలవరకు గురుముఖమున విద్య చదువుకొనుటను తగ్గించినది. తాను వ్రాయించిన వ్యాఖ్యానములుకూడ ఈ విద్యాపద్ధతిని (oral tradition) అనావశ్యకము చేయుటకేయని బ్రౌనుదొర వ్రాసెను. వసుచరిత్రకు పీఠిక వ్రాయుచు బ్రౌనుదొర "...the present notes have a very different object: being intended to explain the text, word by word, in the clearest manner, so as to do away the necessity of oral instruction"[34] అని వ్రాసెను. ఈ వ్యాఖ్యలు వ్రాసిన పండితుడు జూలూరి అప్పయ్యగారు.

జీర్ణావస్థలోనున్న ఉద్గ్రంథముల నుద్ధరించుటయందే కాక, వాని ముద్రణమునందును బ్రౌనుదొర శ్రద్ధవహించెను. అత డచ్చువేయించినన్ని గ్రంథముల నచ్చువేయించిన విదేశీయుడు, తెలుగువిషయమున లేడు.[35] ఈతని

32. Ibidem.
33. Ibidem.
34. Notice to the వసుచరిత్ర. 1844, Madras.
35. బ్రౌనుదొర అచ్చువేయించిన గ్రంథముల నామములు కొన్ని, అతని తెలుగు - ఇంగ్లీషు నిఘంటువునకు ముందు 'On the Names of Books quoted in this Dictionary' అను శీర్షిక క్రింద కలవు (1852; Page VI)

కృషివలననే, ఇంచుమించుగా అన్ని తెలుగు కావ్యములకు తప్పులులేని శుద్ధ ప్రతులు సిద్ధమయినవి.[36] నా డాతడట్లు శ్రమపడి వ్రాత ప్రతులు సిద్ధపర్చకున్నచో నేడు మనకు తెలుగు కావ్యము లిన్ని యుండెడివికావు. అచ్చయినవి అచ్చుకాగా, అచ్చుకాకుండ 'అసూర్యంపశ్యలు'గ నున్న వ్రాత ప్రతులెన్నో—బ్రౌను ధర్మమున బ్రతికియున్నవి—చెన్నపురి ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమున నున్న విషయము, పరిశోధకుల కందరకు తెలిసినదేగదా !

ముద్రణము బ్రౌను దొరకు పూర్వమే తెలుగున కున్నను, దాని నభివృద్ధికి తెచ్చుటకై శేయింబవళ్లు బ్రౌనుదొర కృషిచేసెను. ఈ సందర్భమున నాతడు పలికిన పల్కులు ; " I have done what I could to awaken the Telugus to the advantages of printing and after more than twenty years exhortation they are following my leading"[37]; గమనింప తగినది. ఆ దినములలో గ్రంథములయం దాదరమున్నవారును, వానిని ముద్రించుటయన్న, మహాపాపముగ పరిగణించెడివారట ![38] ఇట్టి వారిని ముద్రణము వైపునకు త్రిప్పిన బ్రౌనుదొర ప్రభావము సామాన్యమా ! బ్రౌనుదొర స్వయముగ 1832 లో మచిలీపట్టణములో నొక ముద్రణాలయమును స్థాపింపనెంచియు, ఆపని కాతనిచే నియమింపబడిన ఇంగ్లీషువాని అయోగ్యత వలన, కృత్యకృత్యుడు కాలేదు.[39]

తెలుగువారికి ముద్రణముపై కుతూహల మధికముచేయుటకై, కృషి చేయుటయే గాక, ముద్రణమున కనుకూల మగునట్లు తెలుగులిపి యందును బ్రౌనుదొర కొన్ని సంస్కరణలు తెచ్చెను. ఆ మార్పులను గూర్చి యాతడిట్లు వ్రాసెను.[40]

"On some Telugu Types".

---

"A list of these is given in the Introduction to my Dictionary" (Some account of the Literary life of C. P. Brown)

36. "......a revision made in my house, grounded on a collection of manuscripts, has successfully reproduced the leading Telugu poems in a pure and complete state." (Ibidem)

37. Ibidem.

38. "The Hindus read their national poems with delight; yet the printing of their authors was regarded as a profanation." (Ibidem)

39. "......baffled by the dishonesty of the Englishman I employed......" Ibidem)

40. Telugu - English Dictionary (1852); Page - XV.

"The letter R as in క్ర ప్ర వ్ర cra pra vra was formerly a semicircle placed under another lerter. Thus క్ర, ప్ర. The compositors complained that this gave continual trouble and delayed the work. I therefore substituted the forms ్ర and ృ as క్ర ప్ర వ్ర or కృ etc. This improvement was copied from the shape seen in some ancient inscriptions. It has removed the difficulty, and Telugu can now be printed as rapidly as English. The type ్ర is now called the బ్రౌను రకారము".

"As the letter ప Pa may easily be mistaken for వ Va and as స Sa resembles న Na, I have substituted the Karnataca types ಪ Pa and ಸ Sa.

"This improvement removes doubts in many places."

పై విధములుగా ముద్రణకళ వ్యాప్తికి కృషి చేయుట, అచ్చునకు వీలగుపద్ధతిని ఆంధ్రలిపిని సంస్కరించుటయేగాక, బ్రౌనుదొర పండితపరిశోధకులకు తగిన సాహసముతో, ఆంధ్రాక్షరములైన అర్ధబిందు శకట రేఫలను అనావశ్యకములని విసర్జించుచు ఈ విషయమును గూర్చి ఇట్లు వ్రాసెను [41]

"Two letters found in the ancient Telugu alphabet are now obsolete. One is [ ఁ ] అర్ధ బిందువు the ardha binduvu or Semicircle; also called అర్ధానుస్వారము the 'half N'. In some words, as అతడు, తమ్ముడు (atadu, tammudu) the [ఁ] semicircle being inserted అతఁడు, తమ్ముఁడు (atandu, tammundu) is the spelling used in older ages. This was sounded as the n in the French words facon, son, ton, sans. But this letter, or nasal accent has for atleast four hundred years been disused. Occasionally the circle is used, as అతండు, తమ్ముండు, or else a mere dot, as అత డు, తమ్ము.డు. But the semicircle [ ఁ ] has long since disappeared in writing; though the nasal sound is still used in speaking"

"The other obsolete letter is ఱ R, called బండి రేఫ or శకటరేఫ "The car or chariot." "The words వెరవు, మరచి, ఎరుగు, గుర్రము, కర్ర and a few others were written వెఱవు, మఱచి, ఎఱుగు, గుఱ్ఱము, కఱ్ఱ, veravu, marachi, erugu, gurramu, carra.

41. Ibidem. Pages XV and XVI.

This character is still used in Cannadi : but we cannot often find it even in ancient Telugu manuscripts or inscriptions upon marble."

పై విధముగా ఈ యక్షరము లనావశ్యకము లని వ్రాసి, ఈ సందర్భమున నాటి విద్వాంసుల యభిప్రాయమును కొంత విమర్శించెను. నాడును, నేటివరకునే ఈ యక్షరముల విషయమున విద్యావంతులలో ఏక వాక్యత ఉండియుండలేదు. కొందరు వీనిని పాటించుట, కొందరు పాటింపకుండుట సామాన్యమై యుండినట్లున్నది. బ్రౌనుదొర ఈ వివాదాంశమున తన యభిప్రాయము నిట్లు వివరించెను.

"Some grammarians who wrote about the year A. D. 1500 attempted to bring these two characters again into use: and in modern days some natives are again striving to revive these obsolete forms: which are absurdly used in Telugu news papers : and some teachers carefully instruct their pupils in these idle elegancies."

"But the nation having for five centuries laid aside these antiquated characters, the attempt to revive them will be of no avail. These refinements are disregarded by sound scholars among brahmans: who have been my guides And I mention these matters beacuse some pretenders to learning have disapproved the national method, which I follow."[42]

అర్ధానుస్వార శకటరేఫల విషయమున తన మతము ననుసరించి బ్రౌనుదొర నిలిచినను తరువాతి దేశీయపండితులు ప్రాత మార్గమునే పట్టిరి కాని ఆధునిక కాలములో వ్యావహారిక భాషావాదులు బ్రౌనుదొరను వారి వాదమునకు బలముగ గ్రహించుచున్నారు నాటి పండితులు చాలమంది వ్యావహారిక భాష నాదరించి ఈ భేదములను పాటింపకుండుట, నేటి వ్యావహారిక భాషావాదులకు బలము చేకూర్చినది.[43]

వ్యావహారిక భాషకు తన నిఘంటువులలో స్థానమిచ్చి బ్రౌనుదొర విప్లవాత్మకమైన కార్యము చేసెను. ఆతని నిఘంటువులను పోలిన నిఘంటువులు నేటికిని తెలుగులో లేవన్న అతిశయోక్తి కాదు. కనుకనే, నైఘంటికునిగ ఆతనికి వచ్చినంత పేరు మరి దేనివలనను రాలేదు. అకారాదిగా తెలుగునకు

42. Ibidem. Page XVI.

43. గిడుగు రామమూర్తిపంతులుగారి 'గద్య చింతామణి' - 1933. వ్యావహారిక భాషలో జరిగిన మహాపండితుల రచనలిం దుదాహృతములైనవి.

నిఘంటువును కూర్చినవారిలో ఆతడే మొదటివాడు కాకున్నను, అటుల కూర్చ బడిననాటి నిఘంటువులన్నింటిలోను ఆతని నిఘంటువులే అగ్రగణ్యములు. అతని నిఘంటువులు ప్రత్యక్షముగను పరోక్షముగను ఆంధ్రనిఘంటువులపై అమోఘ మైన ప్రభావమును జూపెను. ఉత్తమ నిఘంటువులను కూర్చుటయే జీవితాదర్శ ముగ పెట్టుకొని బ్రౌనుదొర కృషిచేయుటచే ఆతనినిఘంటువులు విశిష్టస్థానమును సంపాదించెను. బ్రౌనుదొరకు ముందును, ఆతని తరువాతను బయలుదేరిన నిఘం టువులు ఆయా నైఘంటికులు వేసికొనిన ప్రణాళికలను బట్టి పరిమిత ప్రయో జనముకలవి కాగా, బ్రౌనుదొర నిఘంటువులు సర్వార్థసాధకములైనవి. ఇందు లకు బ్రౌనుదొరయొక్క దృష్టివైశాల్యమే కారణము. నైఘంటికుని పని ప్రజలు వాడు, వాడకున్నను భాషలోగల, పదములను యథాతథముగ గ్రహించుటేగాని, పదములను తనకుతోచిన ప్రమాణముతో ఎంచి, నిఘం టువులోని కెక్కించుట కాదను ప్రాథమిక సూత్రము నాతడు గ్రహించెను. కనుకనే మామిడి వెంకయ్య 1816 లో రచింపగా 1848 లో అచ్చయిన ఆంధ్రదీపికను గూర్చి వ్రాయుచు నందు కావ్యభాషకు గాని వ్యావహారిక భాషకు స్థానములేదని వ్రాసెను.[44] తన నిఘంటువులలో, సాధ్యమైనంతవరకు, కావ్యభాష వ్యావహారిక భాష యను భేదము లేకుండ పదములను చేర్చెను. ఇది అసామాన్యమైనది.

నిఘంటువులో వివిధశాస్త్రములకు సంబంధించిన పదము లుండవలెనని, ఆ యా శాస్త్రగ్రంథములను శోధించి ఆయా పదములను తన నిఘంటువు[45] లలో చేర్చుకొనెను. ఈ పదములలో కొన్ని నాటి పండితులకే తెలియవట! నిఘంటువు సాధ్యమైనంతవరకు సంపూర్ణముగ నుండవలెనని యాతని పట్టుదల. నిఘంటు నిర్మాణములో ఆత డనుసరించిన ఈ మార్గములనే తరువాతివా రనుసరింప జూచిరి. వారలపై ఆతని ప్రభావమది.

---

44. "The Dipica ఆంధ్ర దీపిక. A dictionary of Telugu explained in Teluge written by మామిడి వెంకయ్య at Masulipatam. It was completed in the year 1816.* A duodecimo edition of this book was printed at Madras in 1848: but is far from faithful. The Dipica gives a mere selection of the words used in Telugu poetry. The ordinary Telugu of common life is but slightly noticed.'' (C. P. Brown's Telugu-English Dictionary, 1852. Page VIII)

45. "Some Telugu words which I have copied from the glossaries marked ABA(ఆంధ్రభాషార్ణవము) or Kark: (కర్కంబాడి) or Q (క్వాథశాస్త్రం) are unknown to learned natives." (Ibidem - Page-XIII)

తనకు పూర్వము దేశీయులును విదేశీయులును కూర్చిన నిఘంటుల నన్నింటిని పరిశోధించి తనకు గావలసిన సామగ్రిని బ్రౌనుదొర కూర్చుకొనెను. స్వయముగ చదివిన గ్రంథములనుండి మాటలను గ్రహించెను.[46] నిఘంటువు లలో సందిగ్ధమైనది, ఋజువు కానిది ఏదయును నుండకూడదను దృష్టితో మాటల యుపయోగమునకు దా నిచ్చు ప్రయోగముల నన్నింటిని మూల గ్రంథములతో సరిచూచి, వానిని నిర్ణీత స్థానములలో నుంచెను.[47] ఈ పద్ధతి తరువాతి నైఘంటికుల కందరికిని శిరోధార్యమయ్యెను.

తన నిఘంటువులు పండిత పామర రంజకములుగ నుండవలెనను దృష్టితో అతడు ప్రజల భాషను, కావ్యభాషను గూడ తన నిఘంటువులో (తెలుగు - ఇంగ్లీషు నిఘంటువు) సమముగ నాదరించుటయే గాక తనకు సమకాలికులైన శిష్టుల రచనలలోనుండి-పదముల కర్థవివరణము చేయునపుడు-ఉదాహరణలను గ్రహించి, శిష్టజన వ్యావహారికము పరిగ్రహింప నగునని నవీనులకు దారి చూపెను. దీని కుదాహరణముగ, తమ మిత్రులైన ఏనుగుల వీరాస్వామయ్యగారి 'కాశీయాత్ర చరిత్ర' నుండి బ్రౌనుదొర యుదాహరణలను గ్రహించుటను చూపవచ్చును[48].

"ఇంద్రాణి—Name of the wife of Indra; A sort of bracelet, Orangallu glossary; 'Dowager' a Bramin widow, Enugula 28th July 1830."

"పలవర—The name of a certain tree much cultivated in the neighbourhood of Hyderabad for its fruit. పలవర ఆకులు its leaves, are used to manure land. See description in the Kasiyatra, date 7th September 1830."

జీవద్భాషకు మార్పులేని శాశ్వతమైన నిఘంటువును వ్యాకరణమును ఉండవని గ్రహించినవా డగుటచే, తాను భారతదేశమును విడిచి వెడలిపోయిన

46. "There are from ten to twenty quotations from Telugu authors, in each page. This part of the work was executed by my own pen; my learned and laborious assistants transcribed them for the press, but seldom supplied one from their own reading." (Some account of the Literary life of C. P. Brown)

47. "More than one hundred Telugu authors were quoted, every quotation was to be verified, transcribed and inserted." (Ibidem)

48. Telugu - English Dictionary. (Pages 80, 564)

(1855) తరువాతను ; నిఘంటువులోను, వ్యాకరణములోను మార్పులు చేయుచునే యుండెను[49]

అతడు తెలుగు - ఇంగ్లీషు నిఘంటువులో పదములను ; అకారాదిగ అచ్చులను కూర్చినను, హల్లుల విషయములో ఒక క్రొత్తమార్గమును త్రొక్కెను, సాధారణముగా అకారాది నిఘంటువులలో, హల్లులతో ప్రారంభించు పదములును అచ్చుల క్రమము ననుసరించుచు, వరుసగానుండుట మనకు తెలిసినదే (క, కా, కి, కీ.) ఈ విధముగా ఒక వర్గము తరువాత ఇంకొక వర్గము వచ్చుట పరిపాటి. ఈ పద్ధతిని విసర్జించి; ఒక వర్గములోని వివిధాక్షరములతో-అనునాసికాక్షరములను విడిచి ప్రారంభించు పదజాలమునంతయు, అకారాదిగ ఒకచోటనే ఇచ్చు క్రొత్తపద్ధతిని బ్రౌనుదొర ప్రారంభించెను[50]. య, ర, ల, వ లు వేరుగనే కలవు. మరల శ, ష, స లను కలిపినాడు ఇందువలన కోత, గోత్రము, ఘోణి మొదలగు పదములు ఒకదానితరువాత నొకటి ఒకే శీర్షిక క్రింద-కో, గో, ఘో-వచ్చినవి[51] అటులనే - జిగి, చిగురు, జిఘాంసువు మొదలగునవియు ; శాతము, షాడబము, సాతాని మొదలగు పదములును వచ్చినవి.[52] ఈ యుదాహరణలవలెనే మిగిలినవియు గ్రహింపవచ్చును[53]. బ్రౌనుదొరకు ముందుగాని వెనుకగాని ఈ పద్ధతి లేదు. సామాన్య నిఘంటువులలో 'క' వర్ణముతోగూడిన అన్ని యచ్చులు ప్రారంభముగ గల మాటలు ముగిసినగాని, 'గ' వర్ణము రాదు. ఇందట్లుగాదు. ఈ మార్పువలన నిఘంటువు నుపయోగించుకొనుట సులువగు ననియు, నాటి పండితులలో చాలమంది తన పనిని మెచ్చిరనియు బ్రౌనుదొర వ్రాసెను[54].

49. "I daily made additions in the Dictionaries, and the Grammar which are now more than doubled." ('Some account of the Literary life of C. P. Brown')

50. క ఖ గ ఘ, కా ఖా గా ఘా, కి ఖి గి ఘి, కీ ఖీ గీ ఘీ మొదలగునవి.

51. Telugu - English Dictionary 1852 ; Page - 287.

52. Ibidem Page - 330.

53. Ibidem Page - 1050

54. "I have made an improved arrangement of the consecutive initial consonants : Uniting such as in Telugu are commutable. Few Sanscrit words are affected by this principle... Words beginning with D might at pleasure begin with T 'Dov a' and 'Tova' equally mean a road..... From this uncertainity the learned seldom relieved me : on being asked, they often reply that either spelling may be used. At last I removed the uncertainity by transcribing the Dictionary, when nearly half complete, and mingling those initials which are changeable... Every man who makes real progress in Telugu will I think see the value of the

ఈ మార్పును తరువాతి నైఘంటికులు హర్షింపక విమర్శించి, విసర్జించినను బ్రౌనుదొర నిఘంటువునుమాత్రము, తాము నిఘంటువులు కూర్చునపుడు వినియోగించుకొనిరి. శంకరనారాయణుని[55] నిఘంటువులు, బహుజనపల్లి సీతారామాచార్యుల 'శబ్దరత్నాకరము' బ్రౌణ్యనిఘంటువులపై చాల నాధారపడినవి. శబ్దరత్నాకరము 1885 లో మొట్టమొదట ముద్రింపబడినది. దీనికి బ్రౌణ్య నిఘంటువులు చాల సాయము చేసెను ఈ విషయమును గూర్చి బహుజనపల్లివా రిట్లు వ్రాసిరి. "తెనుఁగున వాడుకలోనికి వచ్చిన యన్యదేశీయ శబ్దములు కొన్ని యీ క్రొత్త కూర్పునందుఁ జేర్పఁబడినవి. బ్రౌణ్య నిఘంటువులోనుండి యిట్టి శబ్దములు కొన్ని చేర్పఁబడినవి."[56]

క్రొత్త కూర్పునకే గాక, అసలు నిఘంటు నిర్మాణమునకే బ్రౌణ్య నిఘంటువులు తోడ్పడినవని ; శ్రీ గిడుగు వేంకటరామమూర్తి పంతులుగారు కంఠోక్తిగ, "శబ్దరత్నాకరమునకు బ్రౌణ్య నిఘంటువే ఆధారము"అని చెప్పిరి.[57] శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటు నిర్మాతలును బ్రౌణ్య నిఘంటువును ప్రమాణముగ స్వీకరించి, అంగీకరించిరి.[58]

---

present arrangement... In composing this work I have had the approbation of my learned assistants." (Ibidem - Preface IV, V)

55. శంకరనారాయణ తన ఇంగ్లీషు-తెలుగు నిఘంటువులో, 'On the contrasts between English and the Indian vernaculars and a Common alphabet for the different languages of India' అను శీర్షికక్రింద వ్రాయుచు బ్రౌనుదొర వ్యావహారికభాష నంగీకరించుటను, నవ్య వర్ణక్రమపద్ధతిని నిఘంటువులో ప్రవేశపెట్టుటను విమర్శించెను.

కాని క్రొత్త భాష నేర్చుకొనువానిని ముఖ్యముగా మనస్సులోనుంచుకొని బ్రౌనుదొర తన నిఘంటువును కూర్చినాడనునది గ్రహించినచో ఈవిమర్శ అనావశ్యకము. బ్రౌనుదొరయే, 'Should any future editor prefer separating the commutable letters, this can easily be done; but it will inconvenience the learner." అని వ్రాసెను.

(Telugu - English Dictionary — Preface-Page-IV.)

56. శబ్దరత్నాకరము. 1937. నియమ విధానక్రమము. XX.

57. శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటువు - విమర్శనము (12-7-1939) కళాప్రపూర్ణ శ్రీ గిడుగు వేంకటరామమూర్తిపంతులుగారు.

ఈ వ్యాసము శ్రీవారి స్మారకసంచికగ వెలువడిన 'ప్రతిభ', సంపుటి 4లో పునర్ముద్రితము. అందీ వాక్యము 41 పేజీలో గలదు.

58. "ఈ నిఘంటు (శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు) నిర్మాతలు బ్రౌణ్యనిఘంటువు ప్రమాణముగ స్వీకరించినారు. అందుకు నేను చాలా సంతోషిస్తున్నాను"(Ibidem; Page-20.)

బ్రౌనుదొర కూర్చిన ఇంగ్లీషు-తెలుగు నిఘంటువు, అతని తెలుగు-ఇంగ్లీషు నిఘంటువునకు తోబుట్టువు. ఈ నిఘంటువును కూర్చుటలో ఆతని ముఖ్యోద్దేశము, ఆంగ్లసాహిత్యమును హిందువులకు సులువగునట్లు చేయుట. ఈ విషయమై అత డిట్లు వ్రాసెను. "This work may render English Literature accessible to all the Hindus who fill the Indian Peninsula."[59] ఆంగ్లభాషను భారతీయులు, భారతీయ భాషలను ఆంగ్లేయులు నేర్చుకొననిసాడు పరస్పరము కలిసి పనిచేయుట పొసగదని ఆతని విశ్వాసము. ఆనాడెందరో తెలుగువారు దీని సాహాయ్యమున ఆంగ్లభాష నభ్యసించి యుందురనుటలో సందేహములేదు.

ఇంగ్లీషు-తెలుగు నిఘంటువులో పదముల కర్థవివరణము చేయునప్పుడు, ఆంగ్లపదముల పూర్ణార్థము తెలుగువారికి పూర్తిగ స్ఫురించుటకై, తెలుగు సాహిత్యములోనుండి యుదాహరణ లిచ్చి చూపెను. ఇంత వివరణ మాంగ్లేయుల కక్కరలేకున్నను 'హిందువుల' కై తాను చేసినట్లు బ్రౌనుదొర యిట్లు వ్రాసెను. "Writing particularly to assist Hindus, I have given some minute explanations which Englishmen may deem superfluous. But to the Hindu they are advantageous. Elsewhere (as under the word Humour) I have alluded to such Tulugu authors and phrases as seemed useful"[60] ఇంత దూర దృష్టితో కృషి చేసెను గనుకనే బ్రౌనుదొర కృషిఫలితము ఆంధ్రసాహిత్యములో అంతర్లీనమైయున్నది.

ఆంధ్రభాషలో, పాశ్చాత్యుల సంపర్కమువలన, వచ్చి చేరిన అన్యదేశ్యములను గుర్తించి, తన నిఘంటువులో వానికి స్థానమిచ్చి, అన్యదేశ్యములకు తెలుగు పదజాలములో గల స్థానమును గూర్చి ఇట్లు వ్రాసెను.

---

59. 'Some account of the Literary life of C. P. Brown'.
60. English-Telugu Dictionary, 1852 (Preface-Page 5)

"Humour—(Ibidem;page-583); Humorous adj. కుచోద్యమైన, కుత్సితమైన, చపలమైన, వింతైన, విపరీతమైన, సరసమైన, హాస్యమైన, Tennala Ramalinga was a humorous poet. తెన్నాల రామలింగడు కుచోద్యమైనకవి. Many verses in Vemana are humorous. వేమనలో కొన్ని యెగతాళి పద్యములు వున్నవి. అనగా లోకవిరుద్ధములు.

Humour n. s. moisture. తడి, తేమ, ద్రవము ...... Calidasa was a man of elegant humour సరసుడు. Narada was an ill-natured man though very good-

"Under the Musalman rule; Telugu, Kannadi and Tamil were filled with Arabic words. At present these are retained and many English expressions are added...At present the Telugu used in conversation and business is becoming more and more thickly sprinkled with English words."[61]

మన వైయాకరణులును అన్యదేశ్యములను గుర్తించినను, ఆంగ్ల శబ్దములను గుర్తించు విషయమై వెనుకంజ వేయుచుండగా; ఆంగ్ల పదములును, ఫార్సీ, అరబ్బీ, హిందూస్థానీపదములవంటివేయని చూపి, తన 'మాటబలము'ను తోడిచ్చి, తన నిఘంటువులలో చేర్చి, తరువాతివారికి బ్రౌనుదొర మార్గదర్శకుడయ్యెను. ఆంగ్లపదములకు ఆంధ్రభాషలో స్థానముగలదని గుర్తించిన బ్రౌనుదొరయే, ఆ పదములు దేశీయుల అనుమతి పొందినపుడే తెలుగు భాషలో కలిసిపోవుననియు, క్రొత్తపదములను సృష్టించు నధికారము దేశీయ కవులకే గాని, విదేశీయులకు లేదనియు స్పష్టముగ వ్రాసి, భాషాభివృద్ధి యొక్క మార్గమునకు సంబంధించిన ప్రాథమికసూత్రమును, తనతోటిపాశ్చాత్యులకు తెల్పెను.[62]

ఇంగ్లీషు - తెలుగు; తెలుగు - ఇంగ్లీషు నిఘంటువుల తరువాత చెప్పుకొనదగిన బ్రౌన్య నిఘంటువు 'మిశ్రభాషానిఘంటువు' (A Dictionary of the Mixed Dialects and foreign words used in Telugu-1854) ఈ నిఘంటువు మిగిలిన నిఘంటువులకంటె విశిష్టమైనది. ఈ నిఘంటువును కూర్చుటకు యత్నించుటలోనే అతని ప్రత్యేకతయు, ప్రతిభయు కనబడును. ఇట్టి నిఘంటువున కావశ్యకత కలదని యూహించుట సామాన్య విషయము కాదు. ఈ నిఘంటువు తన తెలుగు ఇంగ్లీషు నిఘంటువునకు పరిశిష్టమువంటిదనియు, సాధారణముగ తెలుగుప్రజలు వాడుచున్న అన్యదేశ్యము లిందు

---

humoured. నారదుడు సరసుడైనప్పటికిన్ని దుస్స్వభావము గలవాడు. Bhojaraja was good-humoured and good-natured భోజరాజు శాంతుడున్ను వుపకారియున్ను.. ....."

61. Ibidem. Page 5. Preface.

62. ".. But I have avoided all fabricated words and meanings : I have never admitted a new Telugu phrase without duly warning the reader. To coin a new phrase is easy : but no foreigner has the power to give it currency. I am not one of those who fancy that we can alter or improve the languages used in India." (Ibidem. Page 5. Preface)

కలవనియు బ్రౌనుదొర వ్రాసెను[63] తరువాతి నైఘంటికులు దీనినుండి మాటలను గ్రహించి, తమ నిఘంటువులలో చేర్చుకొనిరి.[64]

న్యాయస్థానములలోను, వాణిజ్య కేంద్రములందును మిశ్రభాష విశేష ముగ వాడబడుచున్నది గనుక దానికి భాషలో నొకస్థానము గలదని వ్రాయుచు ఆ భాషకొక యుదాహరణ మిచ్చెను. "*ఈ నంబరులో డెఫెండంటు సమ్మను చూచి సైను (or దస్ఖత్) చేసి వాయిదా చొప్పున కోర్టులో హాజరు అయి ఆన్సరు యియ్యక పోయినందున యిందులో యెక్సపార్టి దర్యాప్తు చేయవలెనని ప్లేంటిఫ్ ప్లీడరు మోశను చేసినాడు గనుక ఆ మోశను రికార్డులో దాఖలు (or ఫయిలు) చేసి అందులో దర్ఖాస్తు చేసిన చొప్పున నడిపించే లాగున ప్రోసీడింగసులో ఆర్డరు యెంటరు చేయడం అయినది*"[65]

పై విధములుగా భాషాభ్యాసమునకు—దేశీయులకైనను, విదేశీయులకైనను— ప్రాణములైన నిఘంటువులను సర్వతోముఖ ప్రతిభతో కూర్చి, ఆంధ్రభాషా సాహిత్య రంగములపై తన ప్రభావము బ్రౌనుదొర చూపెను.

ఆంధ్రభాష నేర్చుకొనగోరువారికిని ఆంగ్లము నేర్చుకొనగోరువారికిని సమముగనే ఉపయోగించు నాతని నిఘంటువులను పేర్కొనిన తరువాత ; ఆతని వ్యాకరణమును, వాచకములను పేర్కొననగును. ఆతని వ్యాకరణము 1840లో తొలికూర్పుపడెను. (మలికూర్పు 1857లో.) వ్యాకరణరచనలోను బ్రౌనుదొర క్రొత్తమార్గము త్రొక్కెను. ఆతని తరువాత తెలుగు వ్యాకరణములు 'ఇంగ్లీషు గ్రామరు' పద్ధతిని వ్రాసిన వారందరును, ఇంచుమించుగా బ్రౌనుదొర తెలుగు వ్యాకరణ పద్ధతి ననుసరించి రనుటలో విప్రతిపత్తి లేదు. తెలుగుభాషను చదువు తెలుగువారికై వ్రాయబడిన ప్రాథమిక వ్యాకరణ గ్రంథములు నేడు పాశ్చాత్య పద్ధతినే అనుసరించుచున్నవన్నచో పాశ్చాత్యుల కృషిప్రభావము మనపై ఎంతగలదో తెలియును.

---

63. ". ... forms a requisite supplement to a Dictionary of the Telugu Language : and it contains only those phrases which are current among the natives."

(Dictionary of Mixed Telugu, 1854. Preface ; Page III)

64. శబ్దరత్నాకరము మొదలగునవి.

65. Dictionary of Mixed Telugu, 1854. Preface; Page-III. (ఈ వాక్యములు మచిలీపట్టణము 'పోర్టు జర్నలు' నుండి గ్రహింపబడెను )

నాటి పండితులు ముందు పద్య కావ్యములతో —దేశీయ విదేశీయు లలో— ఎవరికైనను విద్య ప్రారంభించెడివారు. నిఘంటువులను కంఠస్థము చేయుమనెడివారు. వ్యావహారిక భాషనుగూర్చి చెప్పెడివారుకారు. ఇందువలన ప్రారంభకునకు లాభము తక్కువనియు, కనుకనే తాను, వారు (పండితులు) ముందు ప్రారంభించు విషయములను తుదను చేర్చితిననియు తన వ్యాకరణ విషయమై బ్రౌనుదొర వ్రాసెను.[66]

తెలుగు చదువుకొనుటకు ప్రారంభించిన తరువాత కొద్ది కాలమునాటికే, పండితులు ప్రారంభకుల కనావశ్యకములయిన విషయములను చెప్పుటకు ప్రారంభించినచో, 'తెలుగు మున్షీ'లచే ఈ వాక్యములు పాశ్చాత్య విద్యార్థులు చదివింపవలెనని బ్రౌనుదొర తన తెలుగు వ్యాకరణములో నిట్లు వ్రాసెను.[67]

"ఇంగిలీషువారు ఆంధ్రము చదవ నారంభించేటప్పుడు కేవలంసంస్కార దూరులై వున్నారు గనుక శబ్ద పరిచ్ఛేదం, క్రియాపరిచ్ఛేదం. మాత్రము తొలుత నేర్చుకోవలసినదే గాని కళ - ద్రుతం - సంధి - సరళా దేశం-తద్భవం -తత్సమం - దేశ్యం యిత్యాది ప్రమేయములను గురించి ప్రస్తుతం తలపెట్టపనే లేదు.— యీ హేతువు వల్లనే యీ ప్రమేయములు యీ వ్యాకరణములో ఆదిభాగములలో వ్రాయక అంత్యభాగములో వ్రాయడమైనది పైగా ఆరంభ ములో పద్యాలు చదవడము అన్నివిధాలా నిష్ఫలము గనుక తొలుత అర్జీలు -జాబులు - వాజ్మూలములు - గాక మరి యేదిన్ని చదవ నగత్యములేదు "

పైవిధముగ తెలుగు నభ్యసించుటలో సౌలభ్యముగలదు గనుక, తెలుగు వారికై తెలుగువారు వ్రాసిన ప్రాథమిక తెలుగు వ్యాకరణములును ఈ మార్గ మునే త్రొక్కి, ఆంగ్ల వ్యాకరణ పద్ధతిని తెలుగునకు తెచ్చెను. కొన్ని తెలుగు వ్యాకరణములు పూర్తిగ నీపద్ధతి నవలంబింపకున్నను, కొన్ని పద్ధతులను

---

66. "......they counsel us to learn, as they do, long Vocabularies by rote..........." (A Grammar of the Telugu Language. Page-V)

"Native tutors urge us first to learn the very subjects which I have placed at the end of the work." (Ibid, Page-IV)

"Hitherto every path was overgrown with gay weeds of pedantry which I have cleared away" (Ibidem, Page-VI)

67. "The ordinary teachers are apt to speak to students on some learned subjects which are ill suited to beginners. The tutor should on such occasions be desired to read the following caution." (Ibidem, Book First; Page-32)

ఈ వాక్యముల క్రింద "ఇంగిలీషువారు ఆంధ్రము చదవ నారంభించేటప్పుడు........" అను వాక్యములు కలవు.

మాత్రము స్వాయత్తముగ చేసికొనెను. పాశ్చాత్యులు వ్రాసిన వ్యాకరణములు, తెలుగు వ్యాకరణగ్రంథములపై ఈ ప్రభావము చూపెను.

కావ్యభాషకేగాక వ్యావహారిక భాషకును వ్యాకరణమున తావు కలదని వాదించి, నేటి వ్యావహారిక భాషావాదులకు పాశ్చాత్యులు-[68] ముఖ్యముగా బ్రౌను దొర- దారి చూపిరి. వీ రూహింపలేనంతగా, వారికి ఋణపడి యుండిరి.

బ్రౌనుదొర తనగ్రంథములను రెండుద్దేశములను మనస్సులో నుంచుకొని వ్రాసెను. తనగ్రంథములు - తెలుగువారికి ఆంగ్లమును, పాశ్చాత్యులకు తెలుగును, నేర్చుకొనుటకు వీలుగనుండవలె ననునవియే ఆ యుద్దేశములు. కనుక నిఘంటువులు మొదలైనవానిలో, పాశ్చాత్యులు పునరుక్తియనిగాని, అనావశ్యకమనిగాని తలంచు వానిని తెలుగువారి సాయమునకై యుంచెను. అంతియెగాక, వానిలో ఆంగ్లము నేర్చుకొనగోరు తెలుగువారికి మాత్రమే వలసిన విషయమును గూడ, గ్రంథారంభమున ముద్రించెను. ఈ విషయము నాతడే యిట్లు తెల్పెను.

"At the request of some Telugu friends I have reprinted a system of English pronunciation: which they believe greatly enhances the utility of the Dictionary."

"....In writing the English-Telugu Dictionary, one object has been, to provide the Telugus with a means of understanding some English book which cannot be satisfactorily translated into Telugu."[69]

బ్రౌనుదొర రచించిన వాచకములు, మార్గదర్శినులు తెలుగు నేర్చుకొన గోరు పాశ్చాత్యులకువలెనే, ఆంగ్లభాష నభ్యసింపగోరు తెలుగువారికిని పనికి

---

68. "...at all events, as this work is intended as much to enable the student to understand the rules which regulate the classical composition of the Natives, as to teach him to speak or write the common Teloogoo.....I have not neglected its more useful branches in the inferior dialect, which as being vulgar, Native authors have considered beneath the notice of the learned" (A Grammar of the Teloogoo Language by A. D. Campbell. Introduction. Page XIV)

"Hindu Grammarians, like those of China, neglect the colloquial dialect, which they suppose is already known to the student, and teach only the poetical peculiarities." (A Grammar of the Telugu Language by C. P. Brown. Preface. Page-11)

69. English-Telugu Dictionary - Preface, Page 5.

వచ్చినవి. ఆతని కృషిలోని విశిష్టత యిదియే. వాచకము మొదటిభాగములో కథలు, ఉత్తరములు, నేరముల విచారణలు, ప్రజలభాషలో ప్రజలను గురించి కలవు. రెండవ భాగములో ఆంగ్లానువాదము, మూడవభాగములో వ్యాకరణాంశములు చిన్ననిఘంటువు కలవు. ఇది 1852 లో ముద్రింపబడెను. దీని తరువాత నితడు 'వాక్యావళి' మొదలైన పుస్తకములను ప్రచురించెను. ఇందు ఇంగ్లీషు వ్యాకరణమునకు సంబంధించిన విషయములు, అభ్యాసములు కలవు. ఇవిగాక ఆతడు—'A Catalogue of Irregular Verbs in the English Language, with their Inflections' ('రూపభేదములతో వుండేటువంటి ఇంగ్లీషు భిన్నరూపక్రియల యొక్క మాలిక'); 'English Translations of the Exercises and Documents printed in the Telugu Reader'; 'Analysis of the words in the first chapter of the Telugu Reader'; 'A little Lexicon'; 'Dialogues in Telugu and English with a Grammatical Analysis' మొదలగునవి అచ్చువేసి, ఉభయతారకముగా చేసెను. ఇవన్నియు ఎన్ని శ్రమలనో ఓర్చి బ్రౌనుదొర సంసిద్ధముచేసినవే. సంపూర్ణతయందును, నిరంతర కృషియందును ఆతనికి మక్కువ ఎక్కువ. అత డెప్పుడును శ్రమకు జంకలేదు. క్లిష్టప్రశ్న నెదుర్కొనుటకు జంకలేదు[70]. ఇంత శ్రమపడి కృషిచేసెను గనుకనే, ఆత డింగ్లండు వెడలిపోయిన తరువాతకూడ (1855) ఆతని పుస్తకములే పాఠ్యగ్రంథములుగ నిర్ణయింపబడెను[71].

భాషావిషయకమైన కృషియేగాక, చారిత్రక విషయమైన కృషినిగూడ చేసి, బ్రౌనుదొర ఆ రంగమునను తన ముద్రను గిలుకొల్పెను. కల్నల్ మెకంజీ సేకరించిన లిఖితపుస్తకములసాయముతో ఐదేండ్లు శ్రమపడి మహారణ్యమువలె చీకాకై పడియున్న వానిలోనుండి చరిత్రసత్యములను వెలికితీసి, తొమ్మిదివందల సంవత్సరముల తెలుగుదేశ చరిత్ర కాలక్రమానుసారముగ తీర్చెను[72].

---

70. "Throughout these tasks I think it will be allowed that I never spared my labour, or avoided a difficult question."

(Some Account of the Literary Life of C. P. Brown.)

71. "Since I returned to England my publications have become the sole text-books used by the Government examiners." (Ibidem)

72. "At the end of five years, reading whenever I had leisure I was in possession of a complete clue through nine centuries." (Ibidem)

ఇటులనే, కేవలము పరిశోధనయందే ముఖ్యవగల బ్రౌనుదొర మిక్కిలి శ్రమపడి హిందూ మహమ్మదీయ చరిత్రలకు సంబంధించిన 'కాలక్రమపట్టిక'ను నిర్మించి అచ్చువేయించెను. ఈ పట్టికను సిద్ధముచేయుటకు, తెలుగు, సంస్కృతము, కన్నడములలోగల నలుబదివాల్యూముల రికార్డు సాతముపరిశీలించెను.[73]

ఈ విధముగా పరిశోధనను సాగించి, తెలుగు దేశములో పరిశోధనలకు పునాదులు వేసినవాడు మెకంజీ తరువాత బ్రౌనుదొరయే. వీరిరువురి కృషియే లేకున్న తెలుగుదేశమున పరిశోధనయే లేదన్నచో, తరువాతివారి కృషిపై వీరి ప్రభావ మెంత గాఢమో స్పష్టమగుచు.

ఇంతియేగాక, బ్రౌనుదొర, లిఖితగ్రంథములను వేలమీద సంపాదించి వానిని మద్రాసులోని 'లిటరరీ సొసైటీ' (Literary Society) కిచ్చివేసెను. ఈ లిఖిత గ్రంథములలో 'ఈస్టిండియా హౌస్' లో గలవికూడ కలవు. ఆతడిచ్చిన 'దానము' నకు ముదితులై సొసైటీవారతనికి కృతజ్ఞతను తెలిపిరి.[74] 'ఈస్టిండియా హౌస్' లోని ప్రతులకు, తన ప్రతులకు బ్రౌనుదొరయే చక్కని 'కేటలాగ్' తయారుచేసి పరిశోధకులు వాని నుపయోగించు కొనుటకు వీలుగ చేసెను. 'ఈస్టిండియా హౌస్' లోని గ్రంథములను 'లెయ్‌డెన్' (Mr. Leyden) దొర సేకరించెను. వీని సంఖ్య 2,106. వీనిలో సంస్కృతభాషవి 1,304 ఇతర భాషలు 802 బ్రౌనుదొర సంపాదించినవి 2,440. వీనిలో సగము సంస్కృతమునకును, మిగిలినవి తెలుగునకును సంబంధించినవి.[75] ఈ గ్రంథ సంచయమే చెన్నపురి ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమునకు పునాదియై, పరిశోధనకు సాయపడుచున్నదన్న బ్రౌను దొర కృషి ప్రభావము సువిదితమగును.

---

73. "Next to the Telugu Grammar, this is the most intricate task I ever undertook. The book will have few readers, but it will solve many a doubt." (Ibidem)

74. Journal of the Madras Literary Society. 1847. Page-202.

75. "Mr. Brown's Collection has been catalogued by that eminent scholar himself on the same plan as was adopted by him with the "East India House" Collection. On the authority of the entry in the Madras Literary Journal.........it comprises 2,440 Mss...... .." (A Catalogue Raisonnie of Oriental Manuscripts in the Library of that (Late) College, Fort Saint George. 1857. Preface—D. F. Carmichael, Secretary, March 23rd. 1858.)

ఇవిగాక, తెలుగు సాహిత్యముపై 'మద్రాసు లిటరరీ సొసైటీ' వారి పత్రికలో అతడు వ్రాసిన వ్యాసములు, అతని తరువాత ఆ రంగములో కృషి చేసిన వారికి శిరోధార్యములైనవి.

నాటి విద్యావంతులకు బ్రౌనుదొరకంటె సన్నిహితుడైన పాశ్చాత్యుడు లేడు. అతని పండితు లాతనికి వ్రాసిన లేఖలే యీ విషయమును రుజువు చేయును. అతని పరిశోధన పద్ధతులు, సత్యనిష్ఠ, సాహిత్య పిపాస, పాండిత్యము చాలమందిని ముగ్ధులను చేసియుండును. ఆ ప్రభావమే పందొమ్మిదవ శతాబ్ది-పూర్వార్ధమున ముఖ్యముగ ఆంధ్ర పండితలోకముపై పడినది. అతని గృహమే విద్యాకేంద్రమై ఎట్లుండెడిదో ఈ క్రింది వాక్యములవలన తెలియును.

"Whenever I had finished printing any book I at once began to revise and enlarge it for re-publication. While I was engaged in printing the Dictionaries, and translating the Bible, my pandits steadily proceeded in the task of editing the native authors, preparing Telugu Commentaries and indexes. Thus there were three separate sets of Brahmáns engaged under my roof, which people called "Brown's College."[76]

ముప్పది సంవత్సరములకుపైగా తెలుగువారి నడుమ, వారి భాషా సాహిత్యములకై కృషిచేసిన బ్రౌనుదొర, తన ప్రభావమును అన్ని రంగములపై ప్రసరింపజేసెను. ముఖ్యముగా నాతని కృషి - నిఘంటువుల రచనపై, వ్యాకరణ రచనపై, తెలుగు కావ్యముల శుద్ధ ప్రతులను సిద్ధము చేయుంచుటపై, ముద్రణము నాంధ్రదేశములో ప్రచారమునకు తెచ్చుటపై, కేంద్రీకరింపబడినది.

ముద్రణము విషయములో నాతని కృషి ఫలితముననే, ముద్రణ కళకు నిజమైన ప్రచారమును, గౌరవమును వచ్చినవి. క్రమక్రమముగ ఆ కళ యభివృద్ధికి వచ్చి తెలుగుదేశములో పాతుకొనెను. దాని యభివృద్ధికై కృషిచేసిన బ్రౌనుదొర సంతోషముతో ఈ సందర్భమున నిట్లు వ్రాసెను.

".........Numerals of pages, running titles, printer's stops, divisions of chapters, and (in a slight degree) spaces between words; all these and other innovations are coming more into vogue; as I perceive in the Telugu Volumes printed in 1860, and 1870."

---

"The collection, it will have been observed, is almost entirely in the Telugu Character; one half of the Mss. being in the Sanscrit language, and the remainder in Telugu." (Ibid)

76. "Some Account of the Literary Life of C. P. Brown."

"I knew that this literature would never flourish until the booksellers took it up as a profitable business. I now see my advice is followed, and in 1865 the Telugu printing trade is as fairly established as the Bengali was eighty years before, and the Tamil earlier still."[77]

తెలుగు సాహిత్యము పాశ్చాత్యులును, ఇంగ్లీషు సాహిత్యము తెలుగు వారును చదివినగాని పరస్పరము అర్థముచేసికొనుట పొసగదని గ్రహించిన విజ్ఞుడు గనుకనే బ్రౌనుదొర ఆ మార్గమున చాల కృషి చేసెను[78]

అత్యుత్తమమైన పరిశోధన పద్ధతులను ప్రవేశపెట్టి కృషిచేసినాడు గనుకనే అతని ప్రభావము అద్వితీయమై నాటి సాహిత్య ప్రపంచముపై ప్రసరించినది. వ్యక్తిగా అతనికిగల సుగుణములను గూర్చిగాని, అతడుచేసిన ఉద్యోగములను గూర్చిగాని ఈ సందర్భమున ప్రస్తుతించుట అప్రస్తుతమగును గనుక, ఆతనిపై నాటి పాశ్చాత్యుల కెట్టి యభిప్రాయములు గలవో తెలియజేయు వాక్యముల నుదాహరించుచు బ్రౌనుదొర ప్రభావముగూర్చి ముచ్చటించుట పరిసమాప్తము చేయుదును. కార్మికేల్ దొర, బ్రౌనుదొర సంగ్రహించిన ప్రాచ్యలిఖిత గ్రంథములను గూర్చి వ్రాయుచు ఆతని నిట్లు కీర్తించెను.

"Distinguished by his attainments in nearly every other language of India, whether vernacular or classical, Mr. Brown particularly attached himself to the study of Telugu. The best years of his official life were passed in those districts where that dialect is current. He was the first who applied himself to a thorough examination of its literature, and if others shall hereafter be enabled to follow his example, it will be only by the light of those aids which he has left for their guidance."[79]

తక్కినవారికంటె, తెలుగున కెక్కువ సేవచేసి, తన ప్రభావమును సర్వత్ర ప్రసరింపజేసిన బ్రౌనుదొరనుగూర్చి వ్రాసిన తరువాత, తెలుగులో కృషిచేసిన ఇంక కొందరు పాశ్చాత్యులనుగూర్చి చెప్పవలసియున్నది. వీరిలో

77. Ibidem.

78. "Unless we read their books, and have daily communications with the Hindus, what insight can we obtain into the minds of the people?"

"In like manner the prejudices of Hindus regarding ourselves, can only be removed by a course of English reading."

(A Grammar of the Telugu Language: C. P. Brown; Page-VII)

79. "A Catalogue Raisonnie of Oriental Manuscripts in the Library of the (Late) College, Fort Saint George, 1857. Preface—D. F. Carmichael, Secretary; 23rd March 1858.

కొందరు బ్రౌనుదొరకు సమకాలికులును, కొందరు కొంచెము తరువాతి వారును, పందొమ్మిదవ శతాబ్ది పూర్వార్ధములో రెండవ దశనుండి కంపెనీ ఉద్యోగులును, అధికారులును దేశభాషలయందు కృషి చేయుట అధికమయ్యెను. ఈ కుతూహలము వారు తెలుగు విషయమునందును జూపిరి. వీరిలో మారిస్ (Morris) సోదరులు, బాల్జియల్ (Balziell), బోయిల్ (Boile), మెకెరెల్ (Mckerrell) విజ్లర్ (Whistler) ప్రభృతులును, వీరితరువాత కొంత కాలమునకు ఆర్డెన్ (A. H. Arden) దొరయు ముఖ్యులు

వీరిలో మారిస్ సోదరుల కృషి మిక్కిలి గణనీయమైనది. బ్రౌనుదొర నిఘంటువులకుముందే జె సి మారిస్ (J. C. Morris) ఒక నిఘంటువును కూర్చెను. అది 1835–1839 సంవత్సరముల నడుమ కాలేజీ బోర్డువారిచే ప్రచురింపబడెను. తనకు నిఘంటునిర్మాణమున తోడ్పడిన నిఘంటువుల జాబితాలో ఈ నిఘంటువు నెందుచేతనో బ్రౌనుదొర పేర్కొనలేదు. అతనికి బాగుగ తోడ్పడిన నిఘంటువులు. (1) కాంబెల్ దొర నిఘంటువు (తెలుగు); (2) విల్సన్ దొర నిఘంటువు (సంస్కృతము) అను రెండును.

జె.సి. మారిస్ సోదరుడైన హెచ్. మారిస్ తెలుగునకు వ్యాకరణమును, గోదావరిజిల్లాచరిత్రను వ్రాసెను. ఈతని తెలుగు వ్యాకరణము 1890లోను జిల్లా చరిత్ర 1878 లోను ప్రచురింపబడెను. ఈతనికిని తెలుగుభాషయన్న మిక్కిలి అభిమానము. తెలుగుభాష యొక్క మాధుర్యాది గుణములను గూర్చి తన వ్యాకరణమునందు బాగుగ వ్రాసెను.[80]

బాల్జియల్ ఒక నిఘంటువును కూర్చి, మాదిరి పుటలు కళాశాలాధికారులకు చూపగా వారా నిఘంటువును కొని అచ్చొత్తించుటకు నిరాకరించిరి.

---

80. "I shall be amply rewarded if this little volume should prove of some service to beginners in acquiring the knowledge of one of the sweetest languages of the East."

(Simplified Telugu Grammar By Henry Morris, M. R. A. S; F. R. G. S; Madras Civil Service, 1890 London. Preface, Page-VI; October 1890.)

"Telugu is singularly melodious. It is the sweetest and most musical of all the Dravidian tongues, and it sounds harmonious even on the lips of the most illitererate. It has justly been called the Italian of the East; and though Tamil may, perhaps be a richer language, and more wealthy in classical literature, Telugu confessedly bears the palm for its exquisite melody and grace."

(Ibidem. Introduction; Page—1-2.)

ఆనాడు కాలేజి బోర్డువారు పుస్తకములను కొని అచ్చువేయించెడివారు.[81] బోయిల్ కూడ ఒక తెలుగు నిఘంటువును కూర్చదలచి, ఒక పండితుని తనకు సాయముగాతీసికొనుటకై కాలేజీ బోర్డువారిని ధనసాహాయ్యము కోరెనట! కాని, అది లభించినట్లు లేదు.

బ్రౌనుదొర వ్యాకరణము తరువాత పేరు సంపాదించిన తెలుగు వ్యాకరణమును రచించినవాడు ఆర్డెన్ దొర. ఈతని తెలుగువ్యాకరణము (A Progressive Grammar of the Telugu Language) 1873లో అచ్చయినది. ఇందీతడు బ్రౌనుదొరయొక్క కృషిని శ్లాఘించెను.[82] విశాఖపట్టణమునకు చెందిన రివరెండు ఎ. రిక్కజ్ (Rev. Riccaz) ఒక సంక్షిప్త తెలుగు వ్యాకరణమును రచించి 1869 లో ప్రచురించెను ఈ విధముగా తెలుగు చదివిన పాశ్చాత్యు లెందరో తెలుగులో కృషిచేసి వ్యాకరణాదులు రచించి, తెలుగుపై విదేశీయుల కభిమానమును, దేశీయులకు ఆత్మవిశ్వాసమును సంపాదించి పెట్టిరి.

ఆంధ్రదేశములో 1700 ప్రాంతమున క్రైస్తవ మతవ్యాప్తికై కృషి చేసిన పరాసుమతగురువులు, తెలుగుభాషను చక్కగా చదివి వ్యాకరణములను, నిఘంటువులను కూర్చిరట! అట్టి వ్యాకరణ మొకదానిని గూర్చి విలియమ్ బ్రౌన్ తన 'జెంటు భాషావ్యాకరణము'నను, అట్టి నిఘంటువు నొకదానిని గూర్చి సి. పి. బ్రౌనుదొరయు చెప్పిరి. వ్యాకరణమును గూర్చి చెప్పిన విలియమ్ బ్రౌన్; అది అంత బాగుగా లేదనియు, దానిని చూచిన తరువాత, తన వ్యాకరణమును తొందరగా ముగింపవలెనను కుతూహలము కలిగెననియు

---

81. మచిలీపట్టణమునకు చెందిన మామిడి వెంకయ్య వ్రాసిన 'ఆంధ్రదీపిక' ను వేయి పూలవరహాలకు (Star Pagodas) కాలేజీబోర్డువారు కొనిరి.

కాంబెల్ దొరయొక్క 'తెలుగు వ్యాకరణము'ను కూడ వీరు కొని ముద్రించినారు.

"The manuscript (A Grammar of the Teloogoo Language) thus prepared, was submitted to the Government of Fort St. George, whose approbation it having been so fortunate as to obtain, the copyright was purchased on the public account, and the Right Honourable the Governor in Council was pleased to direct that the work should be printed at the College Press, whence it now issues to the Public." (A Grammar of the Teloogoo Language by A. D. Campbell, 1816. Advertisement)

82. "The student of Telugu must ever feel specially grateful to Mr. C. P. Brown by whose efforts so much has been done to bring the language into its present position, and to render it accessible to Europeans." (A Progressive Grammar of the Telugu Language by A. H. Arden, 1873. Preface. Page - III)

వ్రాసెను.[83] ఈతని వ్యాకరణము 1817 లో ముద్రితమైనది కనుక, ఆ ఫ్రెంచి వారి తెలుగు వ్యాకరణ మంతకంటె ముందు రచింపబడినట్లు ఊహింపవచ్చును.

సి. పి. బ్రౌనుదొర, ఫ్రెంచివారు కూర్చిన నిఘంటువునుగూర్చి అనుకూలముగా నిట్లు చెప్పెను.

"The French Missionaries who laboured about A. D. 1700 wrote a French Tamil Dictionary and another lexicon Telugu and French, (of which the title is Dictionnaire Telongou ow Badaga) filling a folio manuscript volume. It was finely written in a minute French hand but not always easy, to decipher. The authors have not given their names ; I observe that they were indefatigable in recording the colloquial dialect alone. I never saw this work until I returned to England in 1855. It supplied more than a thousand phrases."[84]

కేవలము తెలుగులోనే కృషిచేయకున్నను, దక్షిణదేశములోని భాషాశాస్త్రపరిశోధనపై నత్యంత ప్రభావము చూపిన 'ద్రావిడభాషా వ్యాకరణము'ను వ్రాసిన కాల్డ్వెల్ పండితు డిట స్మరణీయుడు. ఈ కృషి ఫలితముగా ద్రావిడ భాషాపరిశోధనమున నూతనశక మేర్పడెను. దాక్షిణాత్య భాషల విషయమున ప్రాచీన పండితులు ప్రకటించిన భావములకు వ్యతిరేకమైన భావములను ప్రకటించి, సోపపత్తికముగ వానిని రుజువుచేయుటకు యత్నించు నుద్గ్రంథము నువ్రాసినవాడు కాల్డ్వెల్ దొర. ఈ గ్రంథము బయలుదేరుటకు పూర్వము తులనాత్మకమగు భాషా పరిశోధనము, దాక్షిణాత్య భాషల విషయమున— సమగ్రముగ జరుగలేదనుట నిర్వివాదాంశము. కాంబెల్, ఎల్లిస్ మొదలయినవా రంతకు పూర్వము సూచించుట మాత్రమే ఈ విషయమున జరిగినది.

కాల్డ్వెల్ పండితుని 'ద్రావిడ భాషా వ్యాకరణము' తొలికూర్పు 1855 లోను, మలికూర్పు 1875 లోను జరిగెను. ఈతడు తమిళ భాషలో

---

83. "A reference in the first instance was made to a Gentoo Grammar, published a series of years ago by a Frenchman, of which an imperfect copy was procured from a Missionary then residing at Guntoor—But, though ample in the materials, it was found to be superfluously minute and perplexing in the detail; and so extremely incorrect in doctrine as well as matter, that little other use was derived from it, except that of prompting the formation of the present Grammar with the greater alacrity; if for no other reason than that of rescuing the proper Gentoo from the perversion and misconstructions, with which this French production is amply teemed." (A Grammar of the Gentoo Language by W. Brown. 1817. Page XII. Preface )

84. "Some Account of the Literary Life of C. P. Brown."

గొప్ప పండితుడు.[85] తెలుగు మొదలుగాగల ఇతర ద్రావిడ భాషలను తన పనికి కావలసినంత వరకు తెలిసినవాడు. కనుకనే తులనాత్మక మగు వ్యాకరణ రచనకు పూనుకొనెను మిగిలిన భాషలలో ప్రత్యేకముగ కృషి చేసినవారు కూడ ఈ కార్యమునకు పూనుకొనినచో, సమగ్రమైన తులనాత్మకమగు వ్యాకరణము రచింపబడునని కూడ ఆత డాశించెను.[86]

ఈ సందర్భమున నాతడు ద్రావిడ భాషల విషయమున తనవాదము నిట్లు నిరూపించెను.

"My own theory is that the Dravidian languages occupy a position of their own between the languages of the Indo-European family and those of the Iranian or Scythian group - not quite a midway position, but one considerably nearer the latter than the former. The particulars in which they seem to me to accord with the Indo-European languages are numerous and remarkable, and some of them it will be seen, are of such a nature that it is impossible, I think, to suppose that they have been accidental; but the relationship to which they testify—in so far as they do testify to any real relationship—appears to me to be very indefinite, as well as very remote. On the other hand the particulars in which they seem to me to accord with most of the so called Scythian Languages are not only so numerous, but are so distinctive and of so essential a nature, that they appear to me to amount to what is called a family likeness, and therefore naturally to suggest the idea of common descent. The evidence is cumulative..............The relationship seems to me to be not merely morphological, but—in some shape or another, and however it may be accounted for—genealogical."[87]

ఈ గ్రంథరచనలో తన ముఖ్యోద్దేశము, శాస్త్రీయముగ ద్రావిడ భాషలను పరిశోధించుటయేగాని, "అవి ఈ కుటుంబమునకుచెందినవి, ఆ

85. "It is now more than thirty-seven years since I commenced the study of Tamil............................"

(Dravidian Comparative Grammar by Caldwell, 1875. Preface Page VI).

86. "I trust it will be found that I have not left much undone that seemed to be necessary for the elucidation of Tamil; but I hope this branch of work will now be taken up by persons who have made Telugu, Canarese, Malayalam, or Tulu their special study, so that the whole range of the Dravidian languages and dialects may be fully elucidated." (Ibidem)

87. Ibidem. Preface—Pages VII, VIII.

కుటుంబమునకు చెందినవికావు" అని రుజువుచేయుటయే కాదని కాల్డ్వెల్ పండితుడు వ్రాసెను.[88]

ద్రావిడ భాషలు చక్కగా అభివృద్ధిపొందిన భాషలేయైనను, ఆ భాషా భాషీయులకు మాతృభాషాభిమాన మధికమైనను; ఆ భాషల తులనాత్మక పరిశీలనము విషయమున దేశీయులు శ్రమింపలేదనియు, కనుక ఈ పరిశోధన శాఖయే వారికి క్రొత్తయనియు, తన కృషివలన వారిలో ఈ పరిశోధన విషయకమైన కుతూహలమును రేకెత్తించినచో తన కృషి కృతార్థతచెందినట్లు తా నెంచుకొందుననియు కాల్డ్వెల్ పండితుడు వ్రాసెను.[89]

తులనాత్మక పరిశోధనఫలన ద్రావిడ భాషాభాషీయులకు చాల లాభములు కలవనియు, అప్పుడు వారు - పాశ్చాత్య దేశములలోవలెనే - భాషా చరిత్రయొక్క ప్రాముఖ్యమును గుర్తింపగలరనియు కాల్డ్వెల్ వ్రాసెను.[90] ఈతని కృషివలననే తెలుగుదేశములో కూడ ద్రావిడ భాషలపై చక్కని పరిశోధనలు జరుగుటకు ప్రోత్సాహము కలిగెను. ఈతని తరువాత భాషాశాస్త్ర పరిశోధన కావించినవా రందరు ఈతనికి ఋణపడియుండిరి..

దేశీయ విద్వాంసులలో ప్రతిభయొక్క లోపములేదని ఆతడు చెప్పుచు పాశ్చాత్య విమర్శపద్ధతిని వా రలవర్చుకొనగలరని ఇట్లు వ్రాసెను.

"Native Pandits have never been surpassed in patient labour or in an accurate knowledge of details. They require in addition that

---

88. "It has been my chief object throughout this work to promote a more systematic and scientific study of the Dravidian languages themselves—for their own sake irrespective of theories respecting their relationship to other anguages—by means of a careful inter-comparison of their grammars" (Ibidem Page-VI)

89. "It has been my earnest and constant desire to stimulate the natives of the districts in which the Dravidian languages are spoken to take an intelligent interest in the comparative study of their own languages; and I trust it will be found that this object has in some measure been helped forward... .....They have never attempted to compare their own languages with others—not even with other languages of the same family." (Ibidem—Pages IX, X.)

90. "If the natives of Southern India began to take interest in the comparative study of their own languages and in comparative philology in general, they would find it in a variety of ways much more useful to them than the study of the grammar of their own language alone ever has been." (Ibidem—Page X)

zeal for historic truth and that power of discrimination, as well as o generalisation, which have hitherto been supposed to be special characteristics of the European mind."[91]

పాశ్చాత్యులు, తమ భాషాభివృద్ధికై ఇంత కృషి చేయుచున్నారని గుర్తించినచో దేశీయులుకూడ ప్రోత్సాహముగ కృషిచేయగలరని కాల్డ్వెల్ పండితుడు వ్రాయుచు నిట్లు పలికెను.

"I trust the interest taken in their language, literature, and antiquities by foreigners will not be without its effect in kindling amongst the natives of Southern India a little wholesome, friendly rivalry."[92]

నాటి పాశ్చాత్యోద్యోగులు కొందరు గ్రంథరచనమందేగాక, గ్రంథ ముద్రణమునను సాయపడుచువచ్చిరి. గవర్నరులు మొదలైనవారు గ్రంథములను అంకితముగ తీసికొని వాని ప్రచురణమునకు సాయపడెడివారు. మద్రాసు కోటలోని కాలేజి, గ్రంథ ముద్రణమున చాల కృషిచేసెను. ఈ విషయములను గూర్చి కాంబెల్ దొర తన వ్యాకరణమున నిట్లు వ్రాసెను.

"For the establishment of the College of Fort. St. George, and for the encouragement afforded in many other respects to the advancement of the literature of Southern India, the Public are in a great degree indebted to Sir George Barlow: and the following is one of the several works which owe their rise to this source."[93]

కేవలము తెలుగులో కృషిచేయకున్నను, తక్కిన ద్రావిడ భాషలలో కృషిచేసిన డా. గుండర్ట్ (Dr. Gundert) మొదలగువారి కృషి ప్రభావమును, మన విద్యావంతులపైబడి వారిని నూతన కార్యాచరణమునకు- పందొమ్మిదవ శతాబ్ది యుత్తరార్ధమునను, ఇరువదవ శతాబ్దిని- పురికొల్పెను. అనేక విషయములలో, ముఖ్యముగా పరిశోధనపద్ధతులందు, పాశ్చాత్యులు మనకు మార్గదర్శకులయిరి చరిత్ర విషయములో డా బర్నెల్ (Dr. Burnell) ప్రచురించిన 'సౌత్ ఇండియన్ పేలియోగ్రఫీ' (South Indian Palaeography) చక్కని మార్గమును చూపెను.

91. Ibidem—Page XI.

92. Ibidem—Page X.

93. A grammar of the Teloogoo Language by A. D. Campbell. (Advertisement)

18, 19 శతాబ్దులలో దక్షిణదేశ భాషల వికాసమునకై పాటుపడిన పాశ్చాత్యుల కందరకును ద్రావిడభాష లన్నింటితోడను కొలదిగనో గొప్పగనో పరిచయముండెను. వారు ప్రత్యేక భాషలకై శ్రమించినను, అన్ని భాషలను గూర్చి కొంత తెలిసికొని యుండెడివారు. తమిళము, తెలుగు, కన్నడము, మలయాళము భాషలలో, ప్రత్యేక భాషలలో కృషిచేసినవారున్నను; వారి కందరకును మిగిలిన భాషలనుగూర్చి కూడ బాగుగ తెలియును. ఇది వీరి ప్రత్యేకత. ఇందువలన వీ రేభాషనుగూర్చి వ్రాసినను తులనాత్మక పరిశీలనము చేయగల్గెడివారు. ఈ సంప్రదాయమే, ఇరువదవ శతాబ్దిలో ద్రావిడభాషా పరిశోధనము కావించిన పాశ్చాత్యులయందును కన్పట్టును.

పాశ్చాత్యుల దాక్షిణాత్య భాషా కృషిలో మూడు ప్రధాన భాగములు కలవు. ఇవి పరస్పర ప్రవేశార్హములైనవేగాని, వేరువేరుగా నిలిచినవి కావు. మొట్టమొదట పాశ్చాత్యోద్యోగుల భాషాకృషి. తరువాత మిషనరీల కృషి. ఈ రెండింటినిగూర్చి కొంత వ్రాయుట అయినది. ఇంక మూడవది పాశ్చాత్య దేశములలో—ముఖ్యముగా బ్రిటనులో—గల విశ్వవిద్యాలయము లందు దక్షిణదేశ భాషాపరనమును కొంత పరిశీలింపవలసి యున్నది

మొట్టమొదటి నుండియు పాశ్చాత్యులలో చాలమంది తమిళ భాషలో విశేషముగ కృషిచేయుచు వచ్చిరి. దాక్షిణాత్య భాషలలో మిక్కిలి ప్రాచీన కాలమునుండి సాహిత్యముకలది, విలక్షణమయినది కూడ తమిళమే గనుక, విదేశీయుల నా భాష మిక్కిలి ఆకర్షించియుండును. ఈ భాషలలో కృషిచేసిన వారికి, ఒక భాష బాగుగవచ్చుటయు మిగిలిన భాషలను గూర్చి తమ పనికి వలసినంతవరకు తెలియుటయు సామాన్యమైన విషయము. తమిళములో కృషిచేసిన వారందరికి కొంత తెలుగు కూడ వచ్చియుండెను. మిగిలినభాషల విషయమునను అటులనే. కనుక వారిలో చాలమంది తమిళ విద్వాంసులుగ పేరుపొందినను, తెలుగునకూడ వారు కొంత కృషిచేయకపోలేదు. బ్రిటను లోని విశ్వవిద్యాలయములలో దాక్షిణాత్య భాషల విషయకమైన కృషియు, ఒక భాషలో విద్వాంసులై మిగిలిన భాషలతో తమ పనికి కావలసినంత మాత్రమే పరిచయ మున్నవారి చేతులలోనే ఉండెను. వీరిలో చాలమంది తమిళ భాషలోనే నిశితమైన పాండిత్యము గలిగియుండి, తెలుగు మొదలయిన ఇతర దాక్షిణాత్యభాషలతో కొంత పరిచయముకలవారుమాత్ర మయియుండిరి.

ఇట్టివారిలో రెవరెండు జి. యు. పోప్. (Rev. G. U. Pope) ముఖ్యుడు. తమిళమునకు ఈతడు చేసినంత సేవ ఏ ఆంగ్లేయుడును చేయలేదు. ఇంతేగాక, తమిళమును బ్రిటనులోని విశ్వవిద్యాలయములో మొట్టమొదట ప్రవేశపెట్టినవాడును ఇతడే. ("Rev. G. U. Pope made the greatest single contribution to Tamil scholarship of any Englishman, and was the first to introduce Tamil into a University in Britain"—John Marr of 'The Oriental and African Studies', London.) రెవరెండు పోప్ 1820 లో నోవాస్కోషియా (Nova Scotia) లో పుట్టెను. 1839 లో మదరాసునకు మిషనరీగా వచ్చినప్పుడు తమిళము నభ్యసించెను. 1859 లో ఈతడు 'ఉదకమండలము'నందు ఒక పాఠశాల నెలకొల్పెను. ఆ సంవత్సరమే అతనిని మదరాసు విశ్వవిద్యాలయమున 'ఫెలో' (Fellow of the Madras University) గా చేసిరి. 1880 లో ఈతడు భారత దేశమును విడిచి స్వదేశమునకు వెడలిపోయెను. 1884 లో ఈతనిని ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయము (Oxford University) నందు తమిళమునకు తెలుగునకు అధ్యాపకునిగ నియమించిరి. ఇట్లీతడు భాషాసేవ చేసెను

బ్రిటనులోని చాల విశ్వవిద్యాలయములలో సంస్కృతభాషాధ్యయనము జరిగినంతగా దాక్షిణాత్యభాషల పఠనము జరుగలేదు. దీనికి లండనులోని 'స్కూల్ ఆఫ్ ఓరియంటల్ అండ్ ఆఫ్రికన్ స్టడీస్' (School of Oriental and African Studies) అపవాదము, దీనిలో తమిళము మొదలయిన దాక్షిణాత్యభాషల పఠనపాఠనాదు లున్నవి. సి. పి. బ్రౌన్ లండను విశ్వవిద్యాలయములో కొంతకాలము తెలుగునకు ఆచార్యునిగ నున్నట్లు మనకు తెలియుచున్నది.[94] అప్పుడు, తెలుగునకు ఒక 'ట్యూటర్' కూడ ఉన్నట్లును, సివిల్ సర్వీస్ ఉద్యోగులలో ఎవరును ప్రాథమికావస్థను దాటి తెలుగు చదువకపోవుటచేత, తనకు పని తక్కువయని సి. పి. బ్రౌన్ వ్రాసెను.[95] బ్రౌనుదొర భారత

---

94. "I was invited to become professor of Telugu in the London University, and this I accepted......"

(Some Account of the Literery Life of C. P. Brown)

95. "......my friend the present tutor, born in India, is fully competent to the duty. All the work indeed rested with him as no candidate would remain long enough to go through a higher education......" (Ibidem)

దేశమును విడిచి ఏప్రియల్ 1855 లో స్వదేశమునకు పోవుటచేత,[96] లండను విశ్వవిద్యాలయములోని అతని ఉద్యోగము, ఈ సంవత్సరము తరువాత నేయని గ్రహింపవచ్చును. తరువాత, ఐ. సి. ఎస్. పరీక్షలో తెలుగునకు పరీక్షాధికారిగ సి. పి. బ్రౌన్‌దొరయే నియమింపబడినట్లును, 1869 వరకు అతడావనికి పూనుకొననట్లును, ఆ పరీక్షకు పఠనీయ గ్రంథములు అతని గ్రంథములేయనియు కూడ అతని వ్రాతలవలన మనకు తెలియుచున్నది.[97]

సి. పి. బ్రౌన్ తరువాత, తెలుగుభాషలో అంత కృషిచేసిన పాశ్చాత్యులు లేరు కనుక కాబోలు, లండను విశ్వవిద్యాలయములో తమిళమునకు తెలుగు కంటె ప్రాముఖ్యము హెచ్చెను. కాలక్రమమున తమిళమందే విద్వాంసులయిన వారిని, తెలుగులో పరిచయమున్నంత మాత్రముననే, రెండు భాషలకు అధ్యాపకులుగ నియమింపజొచ్చిరి. పైని పేర్కొనబడిన రివరెండు జి యు. పోప్ (Rev. G. U. Pope) అట్టివాడు.

పాశ్చాత్యులుచేసిన భాషాసేవయంతయు, ఇంచుమించుగా, పందొమ్మిదవ శతాబ్ది పూర్వార్ధముననే జరిగిన దనవచ్చును. ఈ శతాబ్ది ఉత్తరార్ధములో కొంతకాలము కృషిచేసినవా రున్నను వారి కృషిలోని ప్రధానభాగ మంతయు శతాబ్దిపూర్వార్ధములోనే జరిగియుండుటచేతను, వారి కృషి విషయము ఈ యుగమునకు సంబంధించినదే యగుటవలనను, వారును ఇందే చేర్చబడిరి ఇట్లు పాశ్చాత్య విద్వాంసుల కృషి విరాజిల్లి, మన పండిత పరిశోధకుల హృదయములలోను, పరిశోధనా విధానములలోను చాల మార్పులు తెచ్చెను. నాటి విద్యావంతుల భాషాకృషిని పరిశీలించినపుడు, వారెట్లు పాశ్చాత్యవిద్వాంసుల కృషివలన ప్రభావితులైరో తేటతెల్లమగును.

★

---

96. సి. పి. బ్రౌన్‌పై గల ఈ క్రిందిచాటువు, నాటి పండితలోకమున అతని స్థానమును తెలియజేయును.

> "నూర్లార్లు లెక్కసేయక
> పేర్లందిన విబుధవరులఁ బిలిపించుచు, వే
> మా ర్లర్థమిచ్చు వితరణి
> ఛార్లెసు ఫీలిప్పు బ్రౌను సాహెబు కరుణన్."

97. "When the competitive examinations for the Civil service commenced I was asked to examine in Telugu : but I did not undertake this until 1869. The books used are my own publications alone."
(Some Account of the Literary Life of C. P. Brown.)

# నాటి విద్యావంతులు - పాశ్చాత్య విజ్ఞాన సంస్కృతులు

పందొమ్మిదవ శతాబ్ది పూర్వార్ధ మాంధ్రదేశ చరిత్రలోనేమి భారత దేశచరిత్రలోనేమి మిక్కిలి ప్రాముఖ్యమైనది. 1800 నాటికి భారతదేశమంతయు కంపెనీవారికి కైవసము కాకున్నను, ఈ దేశములో వారి సామ్రాజ్యము సుస్థిరమను విషయము ఆంగ్లేయులకును, భారతీయులకును, మిగిలిన పాశ్చాత్య ప్రభుత్వములకును స్పష్టమైనది. ఇక ఆంధ్రదేశమన్ననో 1800 నాటికి, ఇంచు మించుగా, ఆంగ్లేయులకు హస్తగతమైనది ఉత్తర సర్కారులు 1766 నాటికి, ఇంగ్లీషు వారి వశమయ్యెను. తెలంగాణము నైజాము చేతులలోనున్నను, అక్కడకూడ పలుకుబడియంతయు ఇంగ్లీషువారిదే. 1769 నుండి స్వయముగ కంపెనీవారే సర్కారులను పాలింపజొచ్చిరి 1794 లో ఈ ప్రాంతమున 'కలక్టరేటు'లను స్థాపించిరి. 1799 లో జరిగిన శ్రీరంగపట్టణ యుద్ధములో టిప్పుసుల్తాను చనిపోగానే—కడప, కర్నూలు, అనంతపురం, బళ్ళారి ప్రాంతము లన్నియు నైజామునకు సంక్రమింపగా నాతడు వానిని 1800 లో ఆంగ్లేయులకు 'దత్తమండలము'లను పేర కట్టబెట్టెను. ఈ విధముగా పందొమ్మిదవ శతాబ్ది ప్రారంభమునాటికి, ఆంధ్రదేశములో ఇంగ్లీషువారి పాలనము సుస్థిరమైనది.

ఈ చరిత్రను పృష్ఠభాగముగ (Background) నిడుకొని నాటి సాంస్కృతిక విషయములను పరిశీలింపవలసి యున్నది. ఇంతకు పూర్వమే, పందొమ్మిదవ శతాబ్ది పూర్వార్ధములో పాశ్చాత్యులు తెలుగునాటచేసిన విజ్ఞానాత్మక కృషినిగూర్చి తెలిసికొంటిమి. ఇక, నాటి కాలములోని దేశీయ విద్యావంతుల విద్యావిషయకమైన కృషినిగూర్చియు, వారిపై నెటులపాశ్చాత్య సంస్కారము తన ప్రభావము చూపినదియో పరిశీలింపవలెను.

పదునెనిమిదవ శతాబ్దియొక్క ఉత్తరార్ధములోని తుది రెండు దశలలోను; సహజముగ విద్యాభిమానులైన వారును, క్రొత్తగ రాజ్య పాలనమునకు గడంగుచున్న ఆంగ్లేయుల ప్రాపు కోరిన వారును, ఆంగ్ల భాష నెటులనో అభ్యసింప మొదలిడిరి. వీరు 'దుబాసీ'ల కంటె భిన్నమైనవారు. దుబాసీలు దేశములో మొట్టమొదటినుండియు కలరు. భారతదేశమునందు వాణిజ్యకేంద్రములు స్థాపించిన పాశ్చాత్య వాణిజ్యసంఘముల కన్నింటికి

దుబాసీలుండెడి వారు. ఫ్రెంచివారి దుబాసీలలో 'ఆనందరంగం పిళ్ళ' మిక్కిలి ప్రఖ్యాతి పొందినవాడు. కస్తూరిరంగకవి, ఈతనిని కృతి భర్తచేసి 'ఆనందరంగ రాట్ఛందము'ను రచించెను. అతడీతనిని కవి యిట్లు వర్ణించెను.

"సీమలోనుండి ఫ్రాన్సు రాశ్చేఖరుండు
పసిఁడిబెత్తంబు భూషణాంబరములనిచ్చి
కుంఫిని దుబాసితనమీయ సొంపుమీఱి
రహిచెలఁగ మీఱె యానందరంగ శౌరి "[1]

డచ్చివారికి 'ప్రళయకావేరి' (Pulicat) యందు కృష్ణమంత్రియును[2], ఇంగ్లీషువారికి 'రమణప్ప'యును దుబాసీలుగ నుండిరి. ఈ రమణప్ప; 1794 లో కంపెనీ వారికిని చిన విజయరామ గజపతిరాజుగారికిని పద్మనాభము నొద్ద యుద్ధము జరిగినప్పుడు, కంపెనీవారి కొలువులో నుండెను. ఈ యుద్ధమున ఆంగ్లేయుల సేనకు 'కల్నల్ ప్రెండరుగాస్ట్' (Col. Prendergast) సేనాని యుద్ధమునకు ముందు, చిన విజయరాము గజపతిరాజుగారి సేనాబలముగూర్చి తనకు తెలుపుమని ఆంగ్లసేనాని రమణప్ప నడిగినట్లు 'పద్మనాభయుద్ధ' మను ప్రబంధమున నిట్లు కలదు.

"అని రమణప్ప నాయకుని నప్పుడు రమ్మని జేరబిల్చి య
జ్జనపతి చెంతకుంజనిన సంగతులేమి యతండు మాకు లొం
గునొ మము గెల్చునో మరియు కుంపిణివారని వెన్కతగ్గునో
తనబలయుక్తుడై కడగి దార్కొని పోరున కేగుదెంచునో."[3]

ఇంగ్లీషువారి దుబాసీలలో మిక్కిలి ప్రఖ్యాతికి వచ్చుటయేగాక, కంపెనీ యుద్యోగములపై కూడ నధికారము చేసినవాడు 'లంగరు పాపయ్య'[4] అను

---

1. 'ఆనందరంగరాట్ఛందము' పీఠిక. పద్యము-76 ; వావిళ్ళవారి ముద్రణము. (1922)

2. "కృతిపతియైన కృష్ణమంత్రి గత శతాబ్దాంతమునందు నెల్లూరి మండలములోని ప్రళయ కావేరి పట్టణమునం దొలాందావారి ద్విభాషిగా నుండెను."

(వీరేశలింగం పంతులు, ఆంధ్రకవుల చరిత్ర, తృతీయభాగము — 'దశావతార చరిత్ర' వ్రాసిన ధరణిదేవుల రామయమంత్రినిగూర్చి వ్రాయుచు.)

3. పద్మనాభయుద్ధము, తృతీయ ముద్రణము 1932, పుట - 28 ; పద్యము - 107.

4. History of Madras by Prof. C. S. Srinivasa chari–1825. Pages 197-198; 210-212 'Trial of Avadhanam Papaiah.'

నాతడు. వీరి ఇంటిపేరు 'అవధానం' వారు. ఓడలపై సరకు రాకపోకలను పరీక్షించుట మొదలైన పనులను వీరు చేయుచుండిరి. అందుచే వీరి ఇంటి పేరు 'లంగరు' గా మారినది. ఈతడు చెన్నపట్టణము గవర్నరు కౌన్సిలు సభ్యులైన 'హాలండ్' సోదరుల (John Holland, Edward Holland) అంతరంగికుడు. సర్ ఆర్చిబాల్డ్ కాంబెల్ దొరగారు 1789 ఫిబ్రవరి 7 వ తేదీని, మద్రాసు గవర్నరుపనికి రాజీనామా ఇచ్చి ఇంగ్లండునకు పోగా, ఈ సోదరులు ఒకరి తరువాత నొకరు గవర్నరుగా కొద్దికాలము పనిచేసిరి. వీరికి అనేక విషయములలో 'పాపయ్య' సాయము చేసెను. పీరు లంచగొండులని 'కేసు' వచ్చినది. అందు 'పాపయ్య' గారు శిక్షింపబడిరి. హాలండ్ సోదరుల పలుకుబడి సన్నగిల్లినది ఈ కేసు సందర్భములో; ప్రఖ్యాతాంగ్ల నవల రచయిత అయిన సర్ వాల్టర్ స్కాట్ యొక్క పితామహికి బంధువైన, 'హాలిబర్టన్' దొరకూడ అపవాదుల పాలయ్యెను. దీనికంతకు పాపయ్య — భారతీయ డగుటచే కాబోలు—కుతంత్రమే మూలమని దొరలు నిర్ణయించి, యాతనిని శిక్షించిరి. ఈ కేసుపై ఇంగ్లండులో నొక కరపత్రము ప్రకటింపబడెను. 'స్కాట్' దానిని చదివి యుండుటచే, తన 'సర్జన్స్ డాటర్' (Surgeon's Daughter) అను నవలలో పాపయ్య నొక పాత్రగచేసి యాతని నొక పరమ దురాత్మునిగ చిత్రించెను. ఆ నవలలో పాపయ్య ఇట్లు వర్ణింపబడెను

"A tap at a small postern gate was answered by a black slave, who admitted Middlemas to that necessary appurtenance of every government, a back stair, which in its turn conducted him into the office of the Brahmin Paupiah, the Dubash, or steward, of the great man, and by whose means he communicated with the native courts, and carried on many mysterious intrigues which he did not communicate to his brethren at the Council board.............."

But the thin, dusky form which stood before him, wrapped in robes of muslin embroidered with gold, was that of Paupiah, known as a master-counsellor of dark projects, an Oriental Machiavel, whose premature wrinkles were the result of many an intrigue in which the existence of the poor, the happiness of the rich, the honour of men, and the chastity of women had been sacrificed without scruple to attain some private or political advantage"[5]

---

5. 'The Surgeon's Daughter' — Sir Walter Scott.

కాని, అవధానం పాపయ్యగారు పండితుడనియు, భాషా సేవచేసినవాడనియు, సి. పి. బ్రౌనుదొరకు ఏనుగుల వీరాస్వామయ్యగారు వ్రాసినలేఖ (15-12-1931) వలన తెలియుచున్నది.[6]

ఈ దుబాసీలు పదవులకై ఆయాభాషలను నేర్చుకొని వ్యవహరించుచుండిరి. వీరిలో లంగరు పాపయ్యగారిని బోలిన పండితులుకూడ నున్నను. విదేశీయుల భాషలను నేర్చుకొనుటలో దుబాసీల ముఖ్యోద్దేశము; ఆయా కుంఫినీలప్రాపు సంపాదించుటయేగాని, ఆయా పాశ్చాత్యభాషా సాహిత్యములనుపఠించుట కాకుండుటచే, వీరివలన ఆంధ్రసాహిత్యమునకు మేలుగాని. వివిధ సాహిత్యముల తులనాత్మక పరిశీలనముగాని జరుగలేదు.

వీరివలెగాక, క్రొత్తభాషలను నేర్చుకొనవలెననియు, క్రొత్త సంస్కారములను గ్రహింపవలెననియు ప్రయత్నించి కృషిచేసిన విద్యావంతులే పాశ్చాత్య విజ్ఞాన సంస్కృతులను చక్కగా నాకళింపునకు తెచ్చికొని, తెలుగుదేశములో నవ్యదృక్పథమును ప్రవేశపెట్టిరి. పాశ్చాత్యభాషలను నేర్చుకొనుటవలన వీరికి ఉద్యోగాదులలోకొన్ని లాభములు వచ్చినను, వీరి దృష్టిలో నవి అప్రధానములు. పాశ్చాత్యులలోని కొందరి ప్రాచ్య భాషాకృషివలెనే, వీరిదియును నిష్కామ కర్మ యనవచ్చును.

ఇట్టి కృషిచేసినవారిలో కావలి సోదరులు (వేంకటబొర్రయ్య, వేంకటలక్ష్మయ్య, వేంకటరామస్వామి) ప్రాతఃస్మరణీయులు. వీరిలో వేంకటబొర్రయ్య (1776-1803) 27 సంవత్సరములు మాత్రమే జీవించినను, తన కృషికి - ఆంధ్రవిద్వల్లోకమేగాక, యావద్భారత పండితలోకమును ఋణపడి యుండునట్లు చేసిన మహానుభావుడు. పదునాల్గు సంవత్సరముల వయస్సునాటికే -

---

6. "నేను చెన్నపట్టణం చేరిన తరువాత కీ. శే లంగిరు పాపయ్యగారి భార్యను కొమాళ్ళను కలుసుకొని వారి దగ్గరనున్న స్కాంద్దం అనే గ్రంథంయొక్క వివరాల నడిగి తెలుసుకొన్నాను. ఈ స్కాంద్దంలో 6 సంగుంహితలు, 50 కాండ్లలు ఒక లక్షగ్రంథం ఉన్నది ... ఈ యారు సంహితలలో పాపయ్యగారు అయిదవదైన శంకరసంహిత నిర్దుష్టమైన చక్కని తెలుగు పద్యములలోని కనువదింపజేశారు. దానిని నేను తెచ్చినాను. తమరు పంపమంటే ఆ ఆరు సంహితలను బంగీలో పంపుతాను. లేదా శంకరసంహిత తెలుగు తర్జుమా మాత్రమే పంపుతాను. ఏ సంగతిన్నీ తెలుపకోరుతాను......... "

(సి. పి. బ్రౌనుదొరగారికి ఏనుగుల వీరాస్వామయ్యగారు 15-12-1831 నాడు వ్రాసిన లేఖలోని భాగము. ఇది కాశీయాత్ర చరిత్ర — తృతీయ ముద్రణము (1941) న. 9 వ పేజీలో కలదు.)

ఫార్సీ, హిందుస్థానీ, సంస్కృతము, ఇంగ్లీషు మొదలైన భాషలలో పండితుడై స్వగ్రామమైన ఏలూరులో దేశీయసైన్యమున కధికారియైన కల్నల్ పియర్స్ ప్రాపు సంపాదించెను. అచ్చటనుండి అనేకుల మెప్పుపొంది పదునెనిమిదవ యేట కల్నల్ కాలిన్ మెకంజీ కంటబడెను. భారతదేశ భాషలను, చరిత్రను గ్రహింపనెంచి శ్రమపడుచున్న మెకంజీకొరకు 'పేదకు పెన్నిధి' వలె బొర్రయ్య లభించెను. ఈ స్నేహ ముభయతారకమై, ఇరువురిచేతను అత్యద్భుతమైన భాషా చరిత్రల సేవ చేయించెను. బొర్రయ్య మృతి తరువాత, పరితాపముతో అతని వలన తనకు గల్గినలాభమును గూర్చి, మెకంజీ తన మిత్రునకు వ్రాసిన లేఖలోని ఈ క్రిందిభాగము పరిశీలింపదగినది.

"The connection then formed with one person, a native, and a bramin (the lamented V. C. Boriah, then almost a youth of the quickest genius and disposition, possessing that concilatory turn of mind, that soon reconciled all sects and all tribes to the course of enquiry followed in his surveys) was the first step of my introduction into the portal of Indian knowledge: devoid of any knowledge of the languages myself, I owe to the happy genius of this individual the encouragement, and the means of obtaining what I had so long sought. On the reduction of Seringapatam, not one of our people could translate from the Canarese alone; at present we have translations made not only from the modern characters, but the more obscure, I had almost said obsolete characters of the Sassanums (or inscriptions) in Canarese and Tamul; besides what have been made from the Sanscrit, of which in my first years in India, I could scarcely obtain any information. From the moment the talents of the lamented Boriah were applied, a new avenue to Hindu knowledge was opened; and though I was deprived of him at an early age, his example and instructions were so happily followed up by his brethren and disciples that an establishment was gradually formed, by which the whole of our provinces might be analysed on the method thus fortuitously began, and successfully followed[7]."

'నల్ల'వా రజ్ఞానులని 'తెల్ల'వారు విశ్వసించుచున్న ఆదినములలో, మెకంజీని బోలిన పాశ్చాత్యోద్యోగిచే నిట్టులకీర్తింపబడిన బొర్రయ్య మేధాసంపత్తియు:

---

7. Life of 'Cavelly Venkata Boriah' — From 'Biographical sketches of Dekkan Poets' by Cavelly Venkata Ramaswami, Calcutta 1829.

'మెకంజీ' లేఖ, పై 'జీవిత చరిత్ర' లో నుదాహరింపబడినది.

జాతిమత భేదములను గడింపక, బోర్రయ్యలోని ప్రతిభను గుర్తించి కీర్తించిన మెకంజీయొక్క ఉదారతయు, కొనియాడ దగినవి.

బోర్రయ్య మెకంజీ యొద్ద పండితునిగ, దుబాసీగ నుండెను ప్రాచ్య ప్రతిభాసంపత్తి రూపొందటనట్లున్న ఈతనికి, మెకంజీ పరిచయ లాభమున, పాశ్చాత్య విజ్ఞాన సౌధమున ప్రవేశము కలిగెను. పరిశోధనాశక్తి బోర్రయ్య రక్తములో కలదు. ఇది గుర్తించిన మెకంజీ, చరిత్రకు పనికివచ్చు శాసనాదికములను సంపాదించు పనిలో నీతనిని పెట్టి, దేశమంతయు త్రిప్పెను.

"Boraiah was deputed by his master (Mackenzie) to collect information useful for the office, and the sagacity and diligence he displayed to collect materials, and in making researches, obtained the unqualified approbation of his employer, and the result of his labours was such as materially to promote the interest of the Honorable Company. The service was very arduous for Boriah had to traverse dreary woods, and lofty mountains about Srisale."[8]

బోర్రయ్య ప్రతిభ అనన్య సామాన్య మగుటచే, తాను గ్రహించిన పాశ్చాత్య విజ్ఞానము ననుసరించి, యంత్రములను నిర్మించుట మొదలయినవి చేసి అతడు ఏలూరు ప్రజల మెప్పుపొందెను. మెకంజీదొర 'మనిల్లా' (Manilla) యుద్ధమునకు పోయినప్పుడు బోర్రయ్య ఏలూరులో కాలము గడుపుచు, ఇట్టి కృషి చేసినాడు.

"While at Ellore, he displayed his skill in mechanism, and knowledge in arts and sciences, and obtained the admiration of his towns folks who highly esteemed him on account of his sweet temper and unimpeachable character."[9]

మెకంజీ 'మనిల్లా' నుండి తిరిగి వచ్చిన తరువాత, ఆతనితో కలిసి మరల 'సర్వే' పనిలో నిమగ్నుడయ్యెను. 1798 లో టిప్పుసుల్తానుపై ఇంగ్లీషువారు దండెత్తిపోయినప్పుడు, మెకంజీతో కలిసి యితడు నక్కడకుపోయెను. 1799 లో శ్రీరంగపట్టణము పడిపోయినప్పుడు, ఇంగ్లీషువారి సేనలోనున్న మెకంజీతో గూడ నితడుండెను. ఈ విధముగా తన్నంటిపెట్టుకొని నీడవలెనున్న ఈతనిచేత మెకంజీ, చరిత్రసామగ్రిని, చాల సేకరింపజేసెను. ఈ సేకరణవలన దక్షిణదేశచరిత్రకు కావలసిన సామగ్రి చాల లభించెను. పాశ్చాత్యుల చరిత్ర

8. Life of 'Cavelly Venkata Boriah' — From 'Biographical sketches of Dekkan Poets' by Cavelly Venkata Ramaswami, Calcutta 1829.

9. Ibidem.

రచనపద్ధతిననుసరించి, భారతదేశచరిత్ర రచింపవీలగునట్లు, ఈ సామగ్రి సరిసిద్ధ బడెను. బొఱ్ఱయ్య కృషి ఫలితముగా చాల నూతన విషయములు పైకి వచ్చెను.

"He was eminently useful in making arrangements to procure useful information connected with the Service, so as to promote considerably the interest of the Hon'ble Company, and procure for his employer an extensive body of literary materials to elucidate the history of the Southern Peninsula."[10]

'సర్వే' ఉద్యోగియైన మెకంజీ గణితశాస్త్రములో నిష్ణాతుడగుటచే, ఆతనియొద్దనుండి పాశ్చాత్య గణితశాస్త్రమును, భూగోళశాస్త్రమును బొఱ్ఱయ్య నేర్చెను. ఇవిగాక మిగిలిన పాశ్చాత్య విజ్ఞానశాస్త్రములను గూడ కొన్ని నేర్చెను. ఆతని మేధాసంపత్తి అసామాన్యమైనదగుటచే, ప్రాచ్య పాశ్చాత్య శాస్త్రములకు సమన్వయము కుదిర్చెను. బహుభాషలను నేర్చి, భాషల తులనాత్మక పరిశీలనముకూడ చేయుచుండెను. 'సర్వే' పనిలో గల మెలకువలనన్నింటిని స్వల్పకాలములోనే నేర్చి, అందులకు కావలసిన రేఖా చిత్రములను – తన యజమానుడు మెచ్చుకొనునంత చక్కగా – గీయగలిగి యుండెను. "By the directions of his master, Boriah acquired perfect knowledge of mathematics, geometry, astronomy, geography and other sciences, both according to the European and Hindu methods, and his memory was so tenacious that he soon acquired a proficiency in different native languages. He could draw very neatly, and constructed maps that were excessively admired by his master."[11]

ఈత డెన్నియో నాణెములను, శాసనములను సేకరించెను. హాళకన్నడ లిపిగల శాసన మొకదాని నీతడు చదువగా, మెకంజీ సంతోషించి, ఆశాసనము గల మ్యూజియములో, దానిప్రక్క నాతనిపేరు వ్రాయించెను.

"He discovered various ancient coins; and made facsimiles of inscriptions in different obsolete characters. When he decyphered the Hala kannada characters, inscribed on a Tablet found at Dodare which is now deposited in the museum of the Asiatic society, his master was highly gratified, and put his name on it."[12]

కల్నల్ మెకంజీ 1801 లో మద్రాసునకు ఉద్యోగముపై రాగా, బొఱ్ఱయ్య కూడ నాతనితో మద్రాసువచ్చి రెండుసంవత్సరము లట నుండెను. ఈకాలములో

10. Ibidem.
11. Ibidem.
12. Ibidem.

నాతడు, వివిధ భాషలలోగల గ్రంథములను ఆంధ్రాంగ్లములలోనికి అనువదించుట, లిఖిత ప్రతులను సరిచూచుట, చేసెను కాని దురదృష్టవశమున నాతడు 1803 లో (జనవరి 7 వ తేదీ) అకాలమృత్యువు వాతపడెను. ఈతని మృతి, దేశమున పరిశోధనకు గొడ్డలి పెట్టయ్యెను.

ఈతడు శాసనాదికమును సేకరించుటయేగాక, సంస్కృతాంధ్రములందు చక్కని కవిత్వము చెప్పెను. శ్రీరంగపట్టణము పడిపోయినప్పుడు కొన్ని రసవంతములైన పద్యములను చెప్పెను (1799). సర్ ఆర్థర్ వెలస్లీ 1800 లో ధుండే యను మహారాష్ట్రనాయకుని యుద్ధములో సిర్జింపగా, నావిషయమును చర్చించుచు నొక కావ్యమును వ్రాసెను ఇదిగాక 'సత్పురుష వర్ణనము' (నూరు శ్లోకములు), శ్రీరంగ చరిత్రము, శ్రీరంగపట్టణ రాజవంశావళి, యాదవరాజవంశావళి, కాంచీపురమాహాత్మ్యమును రచించెను.

ఈతని ప్రతిభను, సత్ప్రవర్తనమునుగూర్చి నాటి ఇంగ్లీషువారు వేయి విధములుగా కొనియాడుచు పలికిరి. "When the army broke up from before Seringapatam he marched about with detachments through different parts of the ceded districts and Mysore dominions, and was highly noticed by General Campbell, Colonel Munro, and other officers of distinction as well as by the Mysore Dewan."[13]

కావలి వెంకట బొర్రయ్యకు ఆంధ్ర సంస్కృతి చరిత్రలో నొక విశిష్ట స్థానమున్నది. ఇతడు నిజముగా "కొత్త పాతల మేలు కలయిక." ఆతనిలో ప్రాచ్యసంస్కృతి, పాశ్చాత్య విజ్ఞానముతో వియ్యమందినది. పాశ్చాత్యుల సంపర్కమువలన ఆంధ్ర మేధావంతులలో కలిగిన మార్పున కాతడు నాందీమూర్తి. ఈతని జీవితములో 24 సంవత్సరములు పదునెనిమిదవ శతాబ్దితుదను, 2, 3 సంవత్సరములు పందొమ్మిదవ శతాబ్ది ప్రారంభమునను గడచెను. కాని యీతనికి ప్రాతలక్షణములకంటె నవీన లక్షణములే విశేషముగ పట్టినవి. ఈ మహాపురుషుడు ఒక యుగ సంధ్యలో నిలిచి, తనకృషిచేత నూతన భావప్రసారమునకును, పరిశోధనామార్గమునకును "తొలికోడి" అయ్యెను.

'స్థానికచరిత్ర'లను పేర నేడు పరిశోధకులకు పరిచయమైన వాని విషయ సేకరణమునకు మూలపురుషుడు వెంకట బొర్రయ్యయే. ఈ సంపుటములలోని సామగ్రిని సేకరించుటకు ధనసాహాయ్యమును, ప్రోత్సాహమును మెకంజీదొర యిచ్చినను, విషయమును ప్రయాసలకులోనై సేకరించినవాడు, వెంకట

13. Ibidem.

బొర్రయ్య. ఇవి సంపుటరూపమును పొందక 'మెకంజీ సంగ్రహము' అను పేర నుండగా, కంపెనీవారు, ఆ సంగ్రహమును మెకంజీ భార్యయొద్దనుండి కొనిరి. అటుల కొన్న గ్రంథజాలము జీర్ణమగుచుండగా సి. పి. బ్రౌనుదొర వాని నుద్ధరించెను.

"The Local Records (transcribed under my orders, and at my expense) fill sixty-two volumes : which (with the Telugu letters) I bestowed on the Library of the Madras College : wherein are also lodged the original records, collected by Mackenzie. Many of his volumes are perishing : being written with English ink (which soon fades) on country paper which the worms rapidly destroy. But the copies made under my directions, and at my cost, are written on English paper with country ink : which being made with lamp black does not fade."[14]

మెకంజీ సొంతధనమును వెచ్చించి, వివిధ గ్రంథములను సంపాదించుటకు తోడ్పడుటచే, ఆ 'సంగ్రహము'నకు అతనిపేరు వచ్చినను; మెకంజీయొక్క అభిమానమును చూరగొన్నవాడును, అనేక విషయములలో నాతనికి గురుతుల్యుడును నయిన బొర్రయ్యను మాత్రము మనము విస్మరింపరాదు. ఒక విధముగ చూచినచో చరిత్రపరిశోధనకును, వాఙ్మయచరిత్ర సామగ్రిని సేకరించు విధానమునకును, దక్షిణదేశమున ఈతడే మార్గదర్శకుడు. ఈ విషయమునుగూర్చి శ్రీ కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారిట్లు వ్రాసిరి. "దక్షిణ హిందూదేశమందు పుట్టిన మొదటి ఎపిగ్రఫిస్టు అని యీతనిఁ జెప్పవలెను...ఉత్తరదేశమునందలి శాసనములు చదువుటకుఁ బ్రథమమునఁ బ్రయత్నించినందులకు ప్రిన్సెప్ అను దొర కెట్టి గౌరవమును, ఖ్యాతియుఁ గలదో అట్టి గౌరవమును ఖ్యాతియు నీ యాంధ్రదేశపు పండితునకు నుండవలసినది."[15]

ఇందు పేర్కొనబడిన 'ప్రిన్సెప్' (J. T. Prinsep, Bengal Civil Service) శాసనములను చదువుట నేర్చుకొనుటకు పూర్వమే, కావలి వెంకట బొర్రయ్య చాల శాసనములను వెలుగులోనికి తెచ్చెను. భారతదేశములోని పురావస్తువులపై ప్రిన్సెప్ దొర వ్యాసములు (Essays on Indian Antiquities) 1858లో గాని గ్రంథరూపమున వెలువడలేదు. ఈ శాఖలో దక్షిణ

14. బ్రౌణ్యమిశ్రభాషానిఘంటువు. 1854 Preface, Page - IV.

15. శ్రీ ఆంధ్ర పరిశోధక మహామండలి - పంచమ వార్షికోత్సవసంచిక (1922) యందలి శ్రీ కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారి 'అధ్యక్షోపన్యాసము', పుట - 9

దేశమున కృషిచేసిన డాక్టరు బర్నెల్ (Dr. Burnell, M. C. S.) యొక్క 'సౌత్ ఇండియన్ పేలియోగ్రఫీ' (South Indian Palaeography) 1875 నాటికిగాని గ్రంథరూపమును బొందలేదు. దీనినిబట్టి బొర్రయ్య కృషి యొక్క ప్రత్యేకత, వైశిష్ట్యము మనకు తెలియగలదు. పాశ్చాత్య విమర్శన పద్ధతులను, చరిత్ర పరిశోధన పద్ధతులను, ఆకళింపునకు తెచ్చుకొని తన ప్రజ్ఞా ప్రభావముచే, బొర్రయ్య పరిశోధనారణ్యమున రాజమార్గము నేర్పఱ్చెను గనుకనే ఆతడు చనిపోయిన తరువాత, మెకంజీ దొర ఆతని స్మారకచిహ్నము నొకదానిని మద్రాసులో సముద్రతీరమున నెలకొల్పెను.

"His master ordered a monument to be erected to his memory, with a suitable inscription on the sea-shore *which is still standing.*"[16]

1829 నాటికి మద్రాసులో నున్న ఆ స్మారకచిహ్నము, 1922 నాటికి కనబడకుండ పోయినట్లు లక్ష్మణరావుగారి ఈ క్రింది వాక్యములవలన తెలియు చున్నది. "ఈతని (బొర్రయ్య) మరణమునకు మిక్కిలి దుఃఖించి, మెకంజీ యీతనిని దహనము చేసినచోట నొక చిన్న శాసనము వేయించెనట. అది యెచ్చట నున్నది కనుఁగొనవలయునని నేను చెన్నపట్టణము నందలి కొన్ని శ్మశానములఁ దిరిగితిని గాని నాకది కానిపించలేదు"[17]

ఈ స్మారకచిహ్నము లేకున్నను, బొర్రయ్య కృషి ప్రభావము, ఆంధ్ర సాహిత్య చరిత్రల పరిశోధనారంగమున, శాశ్వత స్మారకచిహ్నమునే నెలకొల్పి పోయినది. పాశ్చాత్య విజ్ఞాన సంస్కృతుల ప్రభావము బాగుగా సోకిన ప్రథమాంధ్ర ప్రతిభావంతు డితడనవచ్చును.

వేంకట బొర్రయ్య మరణించిన తరువాత, ఆతని సోదరుడు వేంకట లక్ష్మయ్య కల్నల్ కాలిన్ మెకంజీకి చాల సాయము చేసెను. ఈతడును సంస్కృతాంధ్రాంగ్లాది బహుభాషలలో పండితుడు. సోదరునివలెనే ఈతనికిని ఐతిహాసిక పరిశోధనయందు మక్కువ ఎక్కువ. మెకంజీదొర ప్రాపు, ఆ మక్కువకు తగిన దోహదము కల్పించి, ఆ యా రంగములలో ఆతడు కృషి చేయుటకు

16. 'Life of Cavelly Venkata Boriah' — From 'Biographical Sketches of Dekkan Poets' by Cavelly Venkata Ramaswami, Calcutta. 1829.

17. శ్రీ ఆంధ్ర పరిశోధక మహామండలి - పంచమ వార్షికోత్సవసంచిక (1922) యందలి కొమర్రాజు లక్ష్మణరావుగారి 'అధ్యక్షోపన్యాసము', పుట - 10.

అవకాశ మిచ్చెను. 1798 లో మెకంజీదొర కొలువులో కుదిరిన ఈతడు, 1803 లో దొరగారి గుమస్తాలకు పెద్దయై, 1821 లో మెకంజీదొర మరణించు వరకు; దొరగారికి పరిశోధనయందును, పరిశోధనా సామగ్రిని సమకూర్చి పెట్టుటయందును అనన్య సామాన్యమైన సేవచేసెను. ఈతనియందు మెకంజీ దొరకుగల సదభిప్రాయము, జాన్ రిడ్డెల్ దొరకు మెకంజీదొర వ్రాసిన జాబుల వలన తెలియుచున్నది. కుటుంబభారమువలన క్రుంగిపోవుచు వచ్చిన లక్ష్మయ్యకు మెకంజీదొర అత్యుదారముగ సాయపడిన ఘట్టము లెన్నియో కలవు. అప్పుల వలన కారాగారవాసశిక్ష ననుభవించుచున్న లక్ష్మయ్యకు సాయముచేసి, ఆతనిని తన కార్యాలయమున్న కలకత్తాకు రప్పించుకొన్న పండిత పక్షపాతి మెకంజీ దొర. తనవలన సంక్రమించిన భూవసతిని, తణఖాపెట్టుకొని బాధపడుచున్న లక్ష్మయ్య స్థితినిజూచి మెకంజీదొర వ్రాసిన వాక్యము ("To mortgage the village granted to him is very mortifying, but what is to be done else") కారాగారవాస మనుభవించుచున్న లక్ష్మయ్యనుగూర్చి వ్రాసిన వాక్యము ("I cannot help still being uneasy for the poor man, knowing the nice disgrace they attach to being put in gaol") మెకంజీదొరకు ఆతనిపై గల అభిమానమును తెలియజేయుచున్నవి. ఈ అభి మానమును లక్ష్మయ్య తన ప్రతిభ వలనను, పరిశ్రమ వలనను సంపాదించెను. ఐతిహాసిక పరిశోధనకు కావలసిన శాసనములను, లిఖిత ప్రతులను మెకంజీ దొరకు సంపాదించి పెట్టుటలో ఈతడు చాల శ్రమపడెను. మెకంజీదొర ఉత్తరువు ననుసరించి మదరాసునుండి కలకత్తాకు కూడ లక్ష్మయ్యపోయి అట 1823 వరకు ఉండి (మెకంజీ మృతి 1821) మెకంజీ సేకరించిన సామగ్రిని ఒక రూపమునకుతెచ్చి కేటలాగును సిద్ధముచేయుచున్న డాక్టరు విల్సనుదొరకు చాల తోడ్పడెను.

1823 లో కలకత్తాను విడిచి మదరాసువచ్చిన తరువాత కూడ ఐతిహాసిక పరిశోధనయందే తన కాలమును గడిపిన కార్యశూరుడు. చెన్నపట్టణములో సర్ అలెగ్జాండరు జాన్‌స్టన్‌దొరగారి ప్రోత్సాహమున సాహిత్య సమాజము నొకదానిని స్థాపించి, మెకంజీ సేకరించిన వ్రాతప్రతులకు ప్రచారము తెచ్చుటకై కృషి చేసెను. ఈతడు 'రాయల్ ఏషియాటిక్ సొసైటీ' (Royal Asiatic Society) సహాయ సభ్యుడుగ నుండి ప్రాచీన రాజవంశములనుగూర్చి పరిశోధ నలు చేసెను. కాని, మెకంజీ తరువాత అధికారమునకు వచ్చినవా రతనికి తగిన

ఆదరము చూపకుండుటచే, లక్ష్మయ్య ఇంకను విశేషముగ కృషి చేయుట కవకాశము చిక్కలేదు.

ఈతని తరువాత కాలమునుబట్టి పేర్కొనవలసినవాడు కావలి వేంకట రామస్వామి. ఈతడును మెకంజీ చనిపోవువరకు (1821) ఆతని కొలువున నుండెను. మెకంజీతో కలకత్తాకు పోయి, 'మెకంజీ సంగ్రహము' నకు ఒక రూపమిచ్చుటలో చాల శ్రమపడెను. ఆంగ్లములో నీతడు వ్రాసిన 'దక్కను కవుల చరిత్ర' (Biographical Sketches of Dekkan Poets) అను గ్రంథ మీతని పేరును శాశ్వతము చేసినది. ఈ పుస్తకము కలకత్తాలో 1829 లోను, మద్రాసులో 1888 లోను ముద్రింపబడెను. ఈ గ్రంథము యొక్క వైశిష్ట్యము, కేవలము విషయమునుబట్టియే మన మూహింపరాదు. 1829 నాటి కిట్టి గ్రంథమును వ్రాయవలెనను సంకల్పము రచయితకు కలుగుట యందును, కలిగిన తరువాత నట్టి గ్రంథము నాంగ్లములో వ్రాయుట యందును దీని ప్రత్యేకత కలదు.

ఈ పుస్తకము[18] నందు 108 కవుల జీవితచరిత్రలు కలవు. ఇందు మహారాష్ట్రి, కన్నడ, తమిళ, ఆంధ్ర, సంస్కృత, ఘూర్జరకవులు గలరు చాల వరకు నాయా కవులకు సంబంధించిన పుక్కిటి పురాణములే ఇందు చరిత్రగా

---

18. గ్రంథముయొక్క ముఖపత్రము :

Biographical Sketches
of
Dekkan Poets
Being
Memoirs of the Lives
of several
Eminent Bards
Both Ancient and Modern
Who have flourished
in
Different Provinces
of the
Indian Peninsula,
Compiled from Authentic Documents,
By
Cavelly Venkata Ramaswamie,
Late Head Translator And Pundit in The Literary
And Antiquarian Department.
Calcutta : 1829.
Madras : 1888.

చెప్పబడెను. శంకరాచార్యులవారి జీవిత చరిత్రతో ప్రారంభమైన ఈ పుస్తకము, రచయిత సోదరుడైన కావలి వెంకట బొర్రయ్య జీవిత చరిత్రతో నంతమగును. కల్నల్ మెకంజీతో రామస్వామి దేశాటనము చేసినప్పుడు సంపాదించిన సామగ్రితో, నాతడీ గ్రంథమును వ్రాసెను.

"The materials to compile the present biographical sketches were collected by me, while I followed in an official capacity through different provinces of the peninsula, my late lamented master Col. Colin Mackenzie, Surveyor-General of India........."[19]

ఈపుస్తక మచ్చగునాటికి మెకంజీ చనిపోయెను. ఇది నాడు గవర్నర్ జనరలు అయిన (1828-1835) 'లార్డ్ విలియమ్ సి. బెంటింక్' నకు అంకితమైనది.

కావలి వెంకట రామస్వామియొక్క యీ గ్రంథము ఆతని కాంగ్ల భాషపైగల ప్రభుత్వము, పాశ్చాత్య సంస్కృతికి మూలకందమగు గ్రీకు భాషలోని రచయితలతో నాతనికిగల పరిచయమును మనకు తెలుపును. ఇది మన పరిశీలనమునకు మిక్కిలి యావశ్యకమైన విషయము. 1829 నాటి కింకను, దేశీయుల విద్యా విషయమున కంపెనీవారొక నిర్ణయమునకు రాలేదు. ఈ విషయమునుగూర్చి 1822 లో సర్ థామస్ మన్రో (Sri Thomas Munro) ఇటుల వ్రాసెను.

"We have made geographical and agricultural surveys of our provinces; we have investigated their resources; and endeavoured to ascertain their population; but little or nothing has been done to learn the state of education."[20]

లార్డ్ మెకాలేయొక్క యాదాస్తు (Minute of Dissent) ఫిబ్రవరి 2 వ తేదీ 1835 న గాని రాలేదు. దాని తరువాతకూడ, చిరకాలము వరకు, ఆంగ్లవిద్య సుస్థిరరూపమున ప్రచారమునకు రాలేదు. ఇట్టి పరిస్థితులున్న కాలమందు, చక్కని ఆంగ్లమున కవుల జీవిత చరిత్ర వ్రాసిన రామస్వామి అభినందనీయుడు. కాని, అతడు తన యాంగ్లభాషనుగూర్చి సవినయముగ నిట్లు చెప్పినాడు. "The manner in which I have executed the task I had undertaken, I leave an enlightened public to judge, well knowing they will

19. Biographical Sketches of Dekkan Poets.
20. 'Minute on Education' by Sir Thomas Munroe; 25 th June 1822.

not expect well-turned periods, or elegance of diction from the pen of a native."[21] ఇది, ఈ పండితుని వినయమునకు తార్కాణము.

1829 నాటికి ఆంగ్లములో నింత చక్కగా వ్రాసిన వారిలో దక్షిణ దేశమున దేశీయులెవ్వరును లేరనవచ్చును. వంగదేశములోమాత్ర ముండిరి. ఈ గ్రంథముయొక్క పీఠికనుబట్టియే ఈతని ప్రతిభ మన కవగతమగును. ఇందు రచయిత, భారతదేశములో కవికిగల స్థానమునుగూర్చియు, సంస్కృత కవులనుగూర్చియు, పాశ్చాత్యులు సంస్కృత సాహిత్యమునకు చేసిన సేవను గూర్చియు ముచ్చటించెను. "Several works in the learned language (Sanskrit) have been brought to light by the labors of learned Europeans, such as Sir William Jones, Mr. Colebrooke, Drs. Taylor and Wilson."[22]

ఈ పీఠిక ప్రారంభమున రచయిత ప్రాచ్య, పాశ్చాత్య సాహిత్య శాస్త్రముల దృష్టి ననుసరించి, కవిత్వమును గూర్చి యిట్లనెను.

"According to Aristotle all poetry consists in imitation, and if we allow the remarks of Hermogenes to be true, that whatever is delightful to the senses produces the beautiful, we could not pitch on a spot of the world more abundant in natural objects to excite poetic effusions, than the peninsula of India, where the face of nature is furnished with features that strike the imagination with scenes, the most sublime, imposing, and delightful, so as to raise all human powers of fancy to an elevation that exalts them to the very sublime, and beautiful: there have consequently been several very eminent bards, who have flourished at different periods in India. According to Hindu accounts, the ancient legislators Manu, Bhrugu, and other sages have ordained 'Sapta Anga' or seven appendages requisite in the courts of all legal Monarchs; namely, Doctors, Poets, Panegyrists, Singers, Jesters, Moralists, and Historians ......... The above seven officers will cause a sovereign to rule his country with justice and renown."

"The Hindus affirm, that poetry is innate and not to be acquired; and according to their astrologers, mankind obtain this art by a fortunate influence of the planets Jupiter and Venus."[23]

---

21. 'Dekkan Poets'—Preface. Page—XVI
22. Ibidem. Preface—Page—XII
23. Ibidem. Preface—Pages—VII, VIII

కవిత్వమును గూర్చి వ్రాయునప్పుడు 'ఆరిస్టోటలు' ను, సౌందర్యమును గూర్చి వ్రాయునప్పుడు 'హెర్మోజెనస్' ను ఉదాహరింప గలిగియుండుట, నాటికి సామాన్య విషయము కాదు. ఉదాత్తము (Sublime), సుందరము (Beautiful) అను విశేషణములను, కవిత్వపరముగా వాడగలిగినంత విజ్ఞానము కలవాడు రచయిత యన్నప్పు డాతనిపై పాశ్చాత్య విజ్ఞానసంస్కృతుల ప్రభావ మెంతకలదో తెలియును.

సంస్కృతభాషనుగూర్చి వ్రాయవలసినప్పుడీ రచయిత ఇట్లు వ్రాసినాడు. "Although the Sanscrit is a dead language, it was made use of by various poets at the court of kings, and to write down public records, and in deeds of gift, or grants of land to bramins."[24] సంస్కృతభాషను గూర్చి వ్రాయుచు, 'మృతభాష' యని రచయిత వాడినాడన్న, అతనిపై నాటి పాశ్చాత్యులు సంస్కృతభాష విషయమున వెలిబుచ్చిన యభిప్రాయముల ప్రభావ మెంతగా కలదో తెలియును. పాశ్చాత్య ప్రభావము సోకని ప్రాచీన పండితు డెవడు ఇట్లనుటకు సాహసింపడు. ఒకవేళ సంస్కృతమును గూర్చి చెప్పవలసివచ్చినచో, "నేడు బహుళముగా వ్యవహారములో లేని భాష" యని పలుకును గాని, 'మృతభాష' యని పిలువడు.

దక్షిణదేశములోని వివిధ భాషలలోని కవులను గూర్చి వ్రాయబడిన పుస్తకములలో నిది ప్రాచీనమైన దనవచ్చును. కనుకనే పుస్తకములోనివిషయ మెట్లున్నను, దీనికి మంచి ప్రచారము వచ్చినది ఈ విషయమే రెండవ కూర్పులో ప్రచురణకర్త లిట్లు వెల్లడించిరి.

"At the suggestion of several Oriental scholars and some Hindu friends, we reprint this little book from the Calcutta edition of 1829. That edition has been long out of print and the work itself is scarcely met with anywhere. *There being no more recent publication on this subject*, we deem it undesirable that the author's labors should be lost to the world........."[25]

ఆంగ్లాది పాశ్చాత్య సాహిత్యములతో మంచి పరిచయమున్న కావలి వేంకటరామస్వామి, ఆయా సాహిత్యములలోని కవుల చరిత్రలు చదువగా కలిగిన ఉత్సాహముతో ఈ గ్రంథమును వ్రాసియుండును.

---

24. Ibidem. Preface—Page - XII.
25. Ibidem. Publisher's Preface—1888 Edition. Madras.

కావలి సోదరు లిట్టి కృషియు, తనకు చాల సాయమును చేసిరి గనుకనే మెకంజీదొర సంతోషించి తన 'విల్లు' (Will) లో వారికి తన ఆస్తిలో భాగ మీయవలసినదిగా వ్రాయుచు, ఆ సందర్భమున తన సోదరులమిత్రుల నిట్లు హెచ్చరించెను.

"......to my servant Cavelly V. Lechmaiah, Boriah and his younger brother Ramaswamy,......in some compensation for the useful services of the said Lechmaiah and of his late brother C. Boriah, I desire that my brother, sister and friends, recollecting the value I had for these persons, will by no means attempt to lessen or defeat my intention in this respect, which I wish them to consider sacred and invoilable......"

విద్యావంతులైన నాటి దేశీయులు మేధాసంపత్తిలో పాశ్చాత్యులకు ఏ మాత్రము తీసిపోరనియు, వారికి భగవద్దత్తమైన ప్రతిభ కలదనియు, పాశ్చాత్య పండితులు నంగీకరించిరి. నాడములులో నున్న చదువువలన వచ్చు విజ్ఞానము కంటె స్వయంకృషివలన వారి కెక్కువ జ్ఞానసంపత్తి కలిగినదని పాశ్చాత్యు లందరు నొప్పుకొనిరి. తనకు వ్యాకరణ రచనమున దేశీయ విద్వాంసులు సాయపడిరని చెప్పు సందర్భమున విలియమ్ బ్రౌన్ వ్రాసిన ఈ క్రింది వాక్యములు గమనార్హములు.

"It may be necessary to premise, that in the selection of the materials from which the Grammar and Vocabulary are formed, it was found necessary to consult respectable and well informed Natives. Some of these men were fraught with intelligent minds; who, by application and perseverance, *had acquired a proficiency in the Shanscrit, the Persian, and the English languages,* far beyond the usual scope of a native Education."[26]

ఆకాలములో పాశ్చాత్యులకు బాగుగా పనికివచ్చిన పుస్తకములు, మచిలీపట్టణమునకుచెందిన మామిడి వెంకయ్య పుస్తకములు. ఆతని నిఘంటువు, తెలుగు వ్యాకరణము విదేశీయుల మెప్పు పొందెను. ఆతని సాయమును తన నిఘంటు వ్యాకరణ నిర్మాణములలో పొందినట్లు 'విలియమ్ బ్రౌన్' వ్రాసెను. "There lived till within these few months past, a Banian in the Town of Masulipatam, where the present work was originally constructed, whose name was 'Maamedy Venkiah'......The assistance of this man

26. A Grammar of the Gentoo Language By William Brown. 1817 Preface—Page - XII.

in the compilation of both Grammar and Vocabulary, has been of the greatest advantage."[27]

ఈ మామిడి వెంకయ్యనుగూర్చి, నాటి పాశ్చాత్య విద్వాంసులందరు పొగడ్తలే వ్రాసిరి. కాంబెల్ దొర ఈతనినిగూర్చి యిట్లు వ్రాసెను.

"See the Preface of *Maumidi Vencayah, a learned native inhabitant of Masulipatam*, to his Teloogoo Dictionary, the copy right of which has been purchased by the Madras Government... ....."[28]

కాంబెల్ దొర 'తెలుగు వ్యాకరణము' యొక్క ఉపోద్ఘాతమునకు 'సూచిక' వ్రాయుచు 'ఎల్లిస్ దొర', మామిడి వెంకయ్య యొక్క నిఘంటువు నిట్లు కొనియాడెను. "*Mamidi Vencaya, the author of the Andhra Dipaca, an excellent Dictionary of the Telugu*, has, in the preface to this work, introduced a concise analysis of the language."[29]

విలియమ్ బ్రౌన్‌నకు వ్యాకరణ నిర్మాణమున మిక్కిలి సాయముచేసిన ఇంకొకరు 'గుండుమళ్ళ పురుషోత్తము'. ఈతడు మచిలీపట్టణములోని కోర్టులో గవర్నమెంటు ప్లీడరు. ఈతని సాయమునుగూర్చి విలియమ్ బ్రౌను ఇట్లు వ్రాసెను.

"A Bramin, by name Goondmulla Poorshottum, now no more (1817), who was Government Pleader of the Provincial Court at Masulipatam, also afforded very able aid."[30]

కాంబెల్ దొరకు తెనుగు చెప్పిన మున్షీ 'ఉదయగిరి వెంకటనారాయణయ్య'. ఈతని మేధాశక్తిని, ఆంగ్లభాషలోగల ప్రవేశమును కాంబెల్ దొర తన తెలుగు వ్యాకరణ పీఠికలో నిట్లు వర్ణించెను.

"In examining the principles inculcated by the best native grammarians, I was assisted by my Teloogoo instructor Woodiagherry Venkatanarrain Ayah, a young bramin of superior intelligence and remarkable acquirements, who, by his own merits alone, subsequently rose to the situation of Head English master at the College of Fort St. George, and lately to the more honorable office of Interpreter to the Supreme Court of judicature at the Presidency. He

27. Ibidem. Page - XIII

28. A Grammar of the Teloogoo Language by A. D. Campbell. Page II; Foot-note.

29. Ibidem. Note to the Introduction by Francis W. Ellis. Page 11.

30. A Grammar of the Gentoo Language - William Brown. 1817 Page - XIII.

generally sat by me while I wrote the notes from which this Grammar has been compiled, and I may therefore be said to have availed myself of his aid and advice throughout the work."[31]

అప్పుడు కాలేజిలోని ప్రధాన సంస్కృత పండితులైన, పట్టాభిరామ శాస్త్రిగారు (తెలుగు ధాతుమాల రచయిత) సంస్కృతాంధ్ర వ్యాకరణములలో కాంబెల్ దొరకు కలిగిన సంశయములను తీర్చెడివారట. ఈ మహా విద్వాంసుడు 1820 లో మృతినొందెను.

ఈ విధముగా, పందొమ్మిదివ శతాబ్దియొక్క మొదటి పాతిక సంవత్సరములలోను దేశీయ విద్వాంసులందరు పాశ్చాత్య పరిశోధకులకు సన్నిహితులైరి. ఈ విద్యావంతులలో కొందరు సంస్కృతాంధ్రాంగ్లములలో పండితులు. వీరు రచించిన గ్రంథములపై పాశ్చాత్యసంస్కార ప్రభావము విశేషముగా కలదని వీరి నుదాహరింపలేదు! వీరికి పాశ్చాత్యసంస్కారమువలన హృదయ వైశాల్యము, పరిశోధనయందు మక్కువ ఎట్లు కలిగెనో, దేశమున తగిన వాతావరణ మెట్లు సృష్టింపబడెనో, తెలుపుటకై వీరి నుదాహరించితిని.

సి. పి. బ్రౌను దొర భారతదేశమునకువచ్చి, ఆంధ్రదేశములో నున్నంత కాలము (సుమారు నలుబది సంవత్సరములు) ఆతడు పండితులకు కల్పవృక్షమయ్యెను. ఆతనిపై చాటు పద్యములుకూడ బయలుదేరినవన్న, ఆతనిపై పండితులకు గల గౌరవాభిమానములు తేటతెల్ల మగును. ఈ క్రింది చాటువు వలన బ్రౌను దొరయొక్క వితరణముకూడ మనకు తెలియగలదు.

"నూర్లార్లు లెక్కసేయక
పేర్లెక్కిన విబుధవరులఁ బిలిపించుచు వే
మార్లర్థమిచ్చు వితరణి
ఛార్లెసు ఫీలిప్పు బ్రౌను సాహెబు కరుణన్."

ఈతడు పండితులను పోషించి, వారిచే ఆంధ్రసాహిత్య పునరుద్ధరణ కార్యమును చేయించి ధన్యుడయ్యెను. ఈ కృషివలన నాటి పండితులలో చాలమంది కీతనితో ప్రత్యక్ష సంబంధము కలిగినది. ఈ సన్నిహితత్వము వలన నాటి విద్వాంసులకు పాశ్చాత్య పరిశోధన పద్ధతు లవగతమయ్యెను. తన గృహమునే 'కళాశాల' యని ప్రజలు పిలుచుచుండిరని, యాతడిట్లు వ్రాసెను.

31. A Grammar of the Teloogoo Language--A. D. Campbell. Introduction. Page - XXI.

"While I was engaged in printing the Dictionaries and translating the Bible, my pandits steadily proceeded in the task of editing the native authors, preparing Telugu commentaries and indexes. Thus there were three separate sets of Brahmans engaged under *my roof, which people called "Brown's College."*[32]

బ్రౌనుదొర పండితులలో ముఖ్యులు—జూలూరి అప్పయ్య, రావిపాటి గురుమూర్తిశాస్త్రి (1770-1836) గారలు. అప్పయ్య పండితులు, బ్రౌనుదొర ప్రోత్సాహమువలన చాల తెలుగు కావ్యములకు వ్యాఖ్యానములు రచించిరి. ఈ శ్రమకు, ధనరూపమైన ప్రతిఫలమును, బ్రౌనుదొర తన సొంత డబ్బునుండి ఇచ్చెడివాడని అప్పయ్యగారి ఈ క్రింది వాక్యములవలన మనకు తెలియవచ్చు చున్నది. "ఈ టీక చెప్పినది జూలూరు అప్పయ్యశాస్త్రి. మచిలీబందరు జిల్లా జడ్జీదొరగారైన చార్లీసు ఫిలిపు బ్రౌన్‌దొరగారు యిందున గురించి జీతము యిచ్చి యీ పని ౧౮౩౭ సంవత్సరములో జరిగించినారు."[33]

"ఖరనామ సంవత్సర మార్గశిర బ. ౧౧ గురువారం ఆన ౧౮౩౧ సంవత్సరం డిశంబరు నెల ౨౯ తేదీవరకు మహారాజ శ్రీ చార్లీసు ఫిలిపు బ్రౌన్ దొరగారి సెలవుప్రకారం జూలూరి అప్పయ్య యీ స్వారోచిషమనుసంభవ మునకు అనగా మనుచరిత్రకు టీక చెయ్యడమైనది."[34]

పై విధముగా, బ్రౌనుదొర ప్రోత్సాహమున వ్యాఖ్యానములు రచింప బడిన గ్రంథములందెల్ల వ్రాయబడి యుండెను.

జూలూరి అప్పయ్యగారి తరువాత, రావిపాటి గురుమూర్తిశాస్త్రిగారిని పేర్కొనవలెను. వీరు 1816 లో కోటలోని కళాశాలలో పండితులుగ నియమింపబడిరి. 1820 లో కళాశాలాప్రధానోపాధ్యాయులైరి. వీరి 'విక్రమార్కుని కథలు' 1819 లోను, 'పంచతంత్రము కథలు' 1834 లోను, 'తెలుగు వ్యాకరణము' 1836 లోను ముద్రింపబడెను. వీరి తెలుగు వ్యాకరణము 'కాంబెల్ దొర' కంకిత మీయబడినది. దీనినిబట్టి వీరికి నాటి దొరలతో విశేష పరిచయమును, వారికి వీరియందు విశేషగౌరవము నున్నట్లు తెలియుచున్నది. తన వ్యాకరణ మంకితమిచ్చు సందర్భమున వీరిట్లు వ్రాసిరి.

---

32. Some Account of the Literary Life of C. P. Brown.

33. స్వారోచిషమను చరిత్ర. మద్రాసు, 1851. పైని, ఉదాహృతములైన వాక్యములు ప్రతి అశ్వాసాంతమునను గలవు.

34. Ibidem. ఈ వాక్యములు, ఆరవ అశ్వాసాంతముననే గలవు.

"తెలుఁగుభాషఁ జదువుకొను విద్యార్థులకు లక్షణ యుక్తమైన జ్ఞానము శీఘ్రముగాఁ గలుగుటకు నుపయుక్తమైన యీ తెలుఁగువ్యాకరణమును— తెలుఁగుభాషఁ జదువుకొను దొరలకు నుపయుక్తముగా నింగిలీషుభాషయందు తెలుఁగు వ్యాకరణంబును, తెలుఁగు డిక్ష్నేరియుం జేసి తెలుఁగుభాషయందుఁ బూర్ణప్రజ్ఞ గలిగి సకల దేశములందును ప్రసిద్ధి కెక్కియున్న— మహారాజ రాజశ్రీ యే-డి-కేమిల్ దొరగారి పేర నంకితముగా వారి యుత్తరువుమీద చెన్నపట్టణపాఠశాలలో నాంధ్రభాషకు మొదటి యుపాధ్యాయుఁడైన రావిపాటి గురుమూర్తిశాస్త్రిచేత - నన్నయభట్టీయంబును - బాలసరస్వతీయంబును - అహోబల పండితీయంబును - పట్టాభిరామీయంబును - అప్పకవీయంబును - వీరభూపాలీయంబును మొదలైన యాంధ్రవ్యాకరణములను జూచి— బాలురకు సులభముగాఁ దెలియునట్టు వచనరూపముగాఁ జేయఁబడ్డది."[35]

సి. పి. బ్రౌనుదొరకు కూడ గురుమూర్తిశాస్త్రిగారిపై విశేషమైన గౌరవము. మద్రాసులోని పత్రికలో, తెనుగు సాహిత్యముపై తాను వ్రాసిన వ్యాసములో, బ్రౌనుదొర వారినిట్లు పేర్కొనెను.

"That distinguished scholar, the late Head Telugu Examiner of the College, Gurumurty Sastry, who died about three years ago fully concurred in the opinions given in the present essay. I mention his name because, his talents, learning and good sense always entitled his judgement and respect."[36]

పై నుదాహరింపబడిన వానినిబట్టి, నాటి పండితులకు పాశ్చాత్యులతో గల సన్నిహితత్వము తెలియగలదు. ఈ సన్నిహితత్వము, దేశములో నూతన వాతావరణము సృష్టించి పాశ్చాత్యవిద్యాపద్ధతులయందును, విజ్ఞానసంస్కృతుల యందును దేశీయులకు కుతూహలమును బుట్టించెను. ఈ కుతూహలము పాశ్చాత్యభాషాసాహిత్యముల పఠనమునకు దారితీసి, తద్ద్వారమున, ఆంధ్ర సాహిత్య సంస్కృతులపై ప్రభావమును నెరపెను.

బ్రౌనుదొర స్నేహితులలో నొకరును, మద్రాసులోని నేటి హైకోర్టునకు పూర్వముండిన సుప్రీముకోర్టులో తెలుగు, తమిళము, ఇంగ్లీషు భాషలలో

35. 'తెలుగు వ్యాకరణము'—రావిపాటి గురుమూర్తిశాస్త్రి. ప్రథమ ముద్రణము. 1836. పీఠిక.

36. Essay on Telugu Literature—C. P. Brown. Journal of Literature and Science, July 1839. Madras.

తర్జుమాలు చేయు పనియందు 1819 లో చేరి, హెడ్ ఇంటర్ప్రెటర్ పదవిని బొందె. ప్రఖ్యాతి బొందినవారును నగు శ్రీ ఏనుగుల వీరాస్వామయ్య గారు (1780-1836) పందొమ్మిదవ శతాబ్ది పూర్వార్ధములో పాశ్చాత్య విజ్ఞాన సంస్కృతులను తరచి చూచిన ఆంధ్రులలో నొకరు. వీరికి ప్రాచ్యపాశ్చాత్య విజ్ఞానమంతయు కరతలామలకము. వీరి రచనలలో ప్రఖ్యాతి పొందినది, వీరి సమ్యగ్విజ్ఞానమునకు లక్ష్యభూతమైనది, వీరి దినచర్య రూపమైన 'కాశీయాత్ర చరిత్ర'. వీరు 18-5-1830 లో కాశీయాత్రకై మద్రాసులో బయలుదేరి, దేశమంతయు తిరిగి, కాశీయాత్ర చేసి, 3-9-1831 నాటికి మరల మద్రాసు చేరిరి. తాము యాత్రలో చూచిన విషయములను, విన్నసంగతులను ప్రస్తావన వశమున తమకు తట్టినవానిని, వీరాస్వామయ్యగారు తమ మిత్రులైన కోమలేశ్వరపురం శ్రీనివాసపిళ్ళగారికి వ్రాయగా, దానిని శ్రీ పిళ్ళగారు 'కాశీయాత్ర చరిత్ర' అను పేరుతో 1838 లో, వీరాస్వామయ్యగారు మృతి పొందిన తరువాత ప్రకటించినారు.

ఈ పుస్తకము నేటివరకు మూడుసార్లచ్చయినది. మొదటిసారి, 1838లో "పుదూరి నారాయణశాస్త్రిచేత లేఖక తప్పులు దిద్దబడి", "కోమలేశ్వరపురం శ్రీనివాస పిళ్ళగారి వుత్తరువు ప్రకారం" అచ్చయినది.

రెండవసారి 1869 లో "గవర్నమెంటువారి వుత్తరువు ప్రకారము, వర్తమాన తరంగిణీ ముద్రాక్షరశాలయందు పువ్వాడ వేంకటరావుగారి వలన" అచ్చయినది.

మూడవసారి 1941 లో శ్రీ దిగవల్లి వేంకటశివరావుగారు దీనిని బెజవాడలో నచ్చువేసిరి.

నాటి భారతీయుల సాంఘికాచారాదులను గూర్చి గ్రహించుటకును, కంపెనీవారి పరిపాలనా పద్ధతినిగూర్చి తెలిసికొనుటకును, పాశ్చాత్య సంస్కార మును బొందిన ఒక ప్రాచ్య మేధానిధి, భారతదేశము నెట్లు నవ్యరీతుల వీక్షించెనో తెలియుటకును ఈ కాశీయాత్ర చరిత్ర మిక్కిలి యుపకరించును.

వీరాస్వామయ్యగారిని వారి మిత్రులైన శ్రీనివాస పిళ్ళగారు— యాత్రలోని విశేషములనుగూర్చి వ్రాసి పంపుడని, కోరినట్లీ క్రింది వాక్యముల వలన మనకు తెలియవచ్చుచున్నది, "ఇందువల్ల అతి వినయముతో తెలియ పరచుటయేమంటే యేనుగుల వీరాస్వామి అయ్యవాలఁగారు కాశీయాత్ర బోవునప్పుడు—యాత్ర సంగతులున్ను ఆయా ప్రదేశముల వినోద సంగతు

లున్ను వ్రాయించి పంపించవలెనని యడిగినందున వారు ఆలాగే అప్పుడప్పుడు వ్రాయించి పంపగా ఆ సంగతులను పుస్తకముగా చేర్చినాను...అనేక గొప్ప ప్రభువులు తెనుగు భాషతో నావద్దనున్న యీ పుస్తకము ప్రచురము చేయ బడితే బహుజనోపయుక్తముగా నుండునని కోరినందున పైని చెప్పిన పుస్తకము కాశీయాత్ర చరిత్రయనే పేరుతో అచ్చుమూలకముగా ప్రచుర పరచడ మైనది." [37]

పై విధముగా, తాము కన్నవి విన్నవి వ్రాసి వీరాస్వామయ్యగారు పంపుటవలన పందొమ్మిదవ శతాబ్దియొక్క మూడవ దశకమున భారతదేశ మెట్లున్నదో తెలియుటయేగాక, నాడు విద్యావంతులైన తెలుగువారి మనః స్థితి, అభిప్రాయములు, విజ్ఞానముయొక్కలోతు కూడ తెలియుచున్నవి.

వీరాస్వామయ్యగారి కాశీయాత్రకు కొన్ని సంవత్సరములకుముందు (1824-1826) బిషప్ హెబర్ (Bishop Heber) భారతదేశములో తిరిగి, తాను చూచిన సంగతులనన్నింటిని లేఖల మూలమున భార్యకును, స్నేహితులకును తెలియజేసెను. ఈ జాబులు మూడు భాగములుగ ప్రచురింపబడెను. వీరాస్వామయ్యగారి 'కాశీయాత్ర చరిత్ర' వాని కేవిధముగను తీసిపోదు. యాత్రలోవచ్చు మజిలీలనుగూర్చి, లేఖల మూలమున తెలియజేయుట పాశ్చాత్యుల కలవాటు. ఆ సంప్రదాయమునే వీరాస్వామయ్యగారు పరిపాలించి నట్లున్నది.

లేఖల మూలమున తాము వ్రాసిన వివిధ విషయములను, వీరాస్వామయ్యగారు 'జర్నల్' అనుపేర పిలిచిరి. 15-12-1831 నాడు, వారి మిత్రులైన సి. పి. బ్రౌనుదొరగారికి వీరాస్వామయ్యగారు వ్రాసిన ఆంగ్లలేఖలో, తన రచనను వారే 'జర్నల్' అని పిలిచిరి. ఈ సందర్భమునకు కావలసిన వాక్యముల నందుండి ఇందుదాహరించుచున్నాను.

"During my last travel to Benares, I took my route in going thro' Cuddapah, Hyderabad, Nagpore, Jabalpore, Mirjapore, and Allahabad. In return I came by Gazpore, (Chaprah), Patna, Gyah, Calcutta, Pooree, Ganjam, and all the Northern districts, and kept a correct *journal* of the same. I beg also to inform you that in that journal, I have been giving a correct brief histories of all the Hindoo holy places, rivers, etc; and made several observations upon Hindoo-

37. 'కాశీయాత్ర చరిత్ర', 1838. పీఠిక - కర్త: కోమలేశ్వరపురం శ్రీనివాసపిళ్ల.

ism, Mahamadism, and Christianity, also upon Hindoo Mitheology and Astronomy. I have also commented shortly upon customs, manners, castes, laws and late Governments of the several places." [38]

మనకు తెలిసినంతవరకు. యాత్రకు సంబంధించిన 'జర్నల్'ను వ్రాసిన ప్రఖ్యాత పురుషులలో వీరు రెండవవారు. మొదటివారు కావలి వెంకట బొర్రయ్యగారు. వీరు, తాము ప్రయాణము చేయుచుండినప్పుడెల్ల వివిధ విషయములను 'జర్నల్'గ వ్రాయుచు వచ్చెడివారని వారి జీవిత చరిత్రను బట్టి తెలియుచున్నది.

"While on his survey, Colonel Mackenzie was appointed Engineer to expedition against Manilla, and Boriah was obliged to return to his home; while on the way from Hyderabad to Madras, he kept a correct *Journal*."

"In the year 1798, Boriah accompanied his master in the campaign against Tippo Sultan, and kept a poetical *Journal* of the route till he reached Gadewa, a petty Zemindary in the Nizam's dominions."[39]

ఏనుగుల వీరాస్వామయ్యగారి 'జర్నల్' కంటె ముందే, బొర్రయ్యగారి 'జర్నల్' బయలుదేరినను; మొదటి దానికంటె రెండవది విస్తృతము. వీరాస్వామయ్యగారి 'జర్నలు' ఆనాటి 'భారతీయ సంఘ చరిత్ర' యన్నమాట. బొర్రయ్యగారి రచన దానిలో ఏకదేశము మాత్రమే. ఈ రచనలు బయలుదేరుటకు వారివారి పాశ్చాత్య యజమానులు ప్రత్యక్షప్రేరకులు కాకున్నను, వారితో గల సన్నిహితత్వమువలననే యిట్టివి వ్రాయవలెనను కుతూహలము వీరికి కలుగుటచే వారిని పరోక్షప్రోత్సాహకులుగ గ్రహింపవచ్చును.

పాశ్చాత్యులను చూచి మనవారు ముఖ్యముగా నేర్చుకొన్నది, నూతన విద్యావిధానము. ఆంగ్లవిద్య నభ్యసించుట మూలమునవచ్చు లాభములను గ్రహించి, ప్రతిభావంతులైన దేశీయులా విద్యాపద్ధతి నవలంబించి, చదువులు సాగించిరి. అట్టి చదువులను ప్రోత్సహించిరి. వీరికి విదేశీయులుకూడ సాయపడిరి. ఇట్టి కృషి మద్రాసులో జరుగుటకు ప్రోత్సాహ మిచ్చిన మూలపురుషులలో వీరాస్వామయ్యగా రొకరు.

---

38. ఈ జాబు చెన్నపట్టణ ప్రాచ్య లిఖితపుస్తక భాండాగారములో గల 'కాశీయాత్ర చరిత్ర' లిఖితప్రతి (No. 1407) తుదను అతికించబడియున్నది.

39. Deccan Poets, 1829. Life of Cavelly Venkata Boriah. Page - 153.

ఇంగ్లీషు విద్యయొక్క ఆవశ్యకతనుగూర్చి ప్రజలకు చెప్పునదియు, వారి హక్కులను కాపాడునదియు నగు సంఘము నొకదానిని స్థాపింపవలెనని యెంచి వీరాస్వామయ్యగారు జార్జి నార్టన్ దొరగారి నాయకత్వముక్రింద, తమ మిత్రులైన కోమలేశ్వరపురం శ్రీనివాస పిళ్ల, వెంబాకం రాఘవాచార్యులుగారలతో 'హిందూలిటరరీ సొసైటీ'ని స్థాపించిరి. ఈ సభ యాజమాన్యముక్రింద, జార్జి నార్టన్‌గారు 1833-'34 సం॥ లో—దేశచరిత్రను గూర్చియు, పరిపాలననుగూర్చియు, ఆంగ్లవిద్యనుగూర్చియు-మహోపన్యాసము లిచ్చిరి.[40] ఈ జార్జి నార్టన్ దొరగారు 1827 మొదలు 1853 వరకు మద్రాసు సుప్రీము కోర్టులో అడ్వకేటు జనరలుగ నుండిరి. వీ రాంగ్లవిద్యాభివృద్ధికై మదరాసురాష్ట్రములో చాల పాటుబడిరి.

పై వారు చేసిన కృషినిగూర్చి, 1868 మార్చి నెలలో పచ్చియప్ప కళాశాలభవనమున తనకు జరిగిన సమ్మాన సభయందు జార్జి నార్టన్‌గారి తరువాత నా యుద్యోగమును నిర్వహించిన 'జాన్ బ్రూస్ నార్టన్'గా రీ విధముగ పలికిరి. ఆపలుకుల యనువాదమిట నిచ్చుచున్నాను.

"కడచిన తరములో ప్రతిభావంతులని చెప్పదగిన దేశీయులును, జార్జి నార్టన్‌గారితోబాటుగ చిరస్మరణీయులుగ చిత్రపటములో చిత్రింపబడినవారు నయిన వి. రాఘవాచార్యులు, ఏనుగుల వీరాస్వామయ్య, శ్రీనివాస పిళ్ళ గారలను జార్జి నార్టన్‌గారు చేరదీసి ప్రోత్సహించిరి. ఇంగ్లీషురాజ్యాంగవిధానము గూర్చియు, భారతదేశమున వారి పరిపాలనను గూర్చియు ఆత డిచ్చిన అమూల్యమైన యుపన్యాసములను మీకు నేను జ్ఞప్తికి తెచ్చుచున్నాను."[41]

వంగదేశమున రాజా రామమోహనరాయలు మొదలైనవారు ఆంగ్లవిద్యాభివృద్ధికై కృషిచేసినట్లే, దక్షిణదేశమున పైని పేర్కొనబడిన పెద్దలు కృషిచేసిరి. దేశీయుల కృషికి విశాలహృదయము గల పాశ్చాత్యులు దోహద మొసగిరి.

ఏనుగుల వీరాస్వామయ్యగారి ప్రతిభ సర్వతోముఖమైనది. అది వారి 'కాశీయాత్రచరిత్ర'లో సర్వత్ర కన్పట్టుచున్నది. ఇది శిష్ట వ్యావహారికభాషలో వ్రాయబడినది. 1830 ప్రాంతమున తెలుగు ప్రజల వ్యావహారిక భాషను గ్రహింపవలెనన్నను, ఆనాడెట్టి భావములు, పదములు, పాశ్చాత్య విజ్ఞాన

40. 'Rudimentals' by George Norton (1841).
41. The Madras Journal of Education, 1868.

సంపర్కమువలన తెలుగుణోనికి వచ్చి చేరినవో గ్రహింపవలెనన్నను, వీరాస్వామయ్యగారి కాశీయాత్ర చరిత్రయే మనకు ముఖ్యాధారము.

కాశీయాత్ర చరిత్రలో క్రైస్తవ మతమునుగూర్చిన చర్చలు కలవు. వివిధ మతముల తులనాత్మక పరిశీలన మిందు కన్పట్టును. వీరు క్రైస్తవమత సిద్ధాంతముల నర్థము చేసికొనుటయేగాక, నాటి పాశ్చాత్యులకు హిందూమత విషయమున గలిగిన సంశయములను, క్రైస్తవమతముతో దానినిపోల్చి, నివారింప గలిగిన సమర్థులు. క్రైస్తవమత సిద్ధాంతములను, దానిలోగల వివిధ శాఖలను, వానిలో వానికిగల భేదములను, వీరాస్వామయ్యగారు చక్కగా నెరుంగుదురు. క్రైస్తవమతమున గల వివిధ శాఖలనుగూర్చి చర్చించుచు, వారు కాశీయాత్ర చరిత్రలో నొకచోట నిట్లు వ్రాసిరి.

"క్రీస్తు మతస్థులలో ప్రోటెస్టాంట్సు అనే జాతులవారు విశిష్టాద్వైత మతానుసారముగా సృష్టికర్త అయిన యీశ్వరుడు చేతనాచేతనాత్మకమయిన అనేక జీవులను సృష్టించినాడు; కర్మాలు తదంగమయిన ఆరాధనల వల్ల యీశ్వరదృష్టి అల్పపదార్థాల మీద కలిగితే ప్రమాదాన్ని యిస్తున్నవి గనుక, కర్మాలున్ను తజ్జనితమయిన ఆరాధన లున్ను యేమి వద్దు, మనసా యీశ్వరభజన చేస్తూవుండవలసినదని చెప్పుతారు......రోమన్ క్యాథేలిక్సు అయిన క్రీస్తుమతస్థులు తురకలవలెనే సంక్షేమమయిన కర్మాలతో, ఆరాధనలతోనున్ను యీశ్వర భజన చేస్తున్నారు."[42]

క్రైస్తవమతమునకు సంబంధించిన విజ్ఞానమంతయు వీరాస్వామయ్యగారికి కలదని తెలియజేయుటకు కొన్ని ఉదాహరణల నిచ్చుచున్నాను. కాశీయాత్ర చరిత్రలో నిట్టివి చాల గలవు గాని, వానిలో ముఖ్యమైనవి కొన్ని మాత్రమే ఇందుదాహరించుట అయినది.

"అయితే ఈ బ్రహ్మాండములలో మానుషసృష్టి, పయిన వ్రాసిన చతురశ్రమమైన కర్మభూమి మొదలుగా ఆరంభింపబడినది. అందుకు ఆకర మేమంటే యింగిలీషువారి బైబిలులో యేడం (Adam) అనే కూటస్థుడున్ను, అవి (Eve) యనే కూటస్థురాలున్ను యీ ప్రదేశములో పుట్టినట్టు చెప్పియున్నది గనుకనున్ను మన పురాణాలు అందుకు ఏకవాక్యత పడుతున్నవి గనుకనున్ను

42. ఏనుగుల వీరాస్వామయ్యగారి 'కాశీయాత్ర చరిత్ర'.
తృతీయముద్రణము, 1941 - పుట 148.

మానుషసృష్టికి ఆరంభము మొట్టమొదట హిందూదేశములో నుంచేనని నిశ్చయించవలసినది"[43]

"చెన్నపట్టణములో నేను వుండగా కొందరు ఫరంగివాండ్లతో మతానుసారములయిన మాటలు మాట్లాడుచు నుండగా యిదేరీతిగానే డిష్టయిని (Destiny) అనే విధి బలమయినప్పుడు ఈశ్వర కటాక్షమేమి పనికివస్తున్నదని ప్రస్తాపము వచ్చెను. అప్పుడు నాకు తోచిన బుద్ధిప్రకారము నేను సమర్థించినవయిన మేమంటే డిష్టయిని అనే విధిని మదరాసు సూప్రీంకోర్టుగా భావించవలసినదనిన్ని యీశ్వరుని సీమరాజుగా భావించవలసినదనిన్ని; యెట్లా సీమరాజుయొక్క ఆజ్ఞవల్ల లోకులు చేసేతప్పుకు సూప్రీంకోర్టువారు తూకు (ఉరి) తీయగలరో తద్వత్తుగా డిష్టయిని అనే విధి కర్మ ఫలానుభవము నిచ్చినా సీమరాజుతో రూపురూపుగా చెన్నపట్టణములోనుంచి యెవరికయినా జాబులు నడుస్తూవుండేపాటి విహితముండి తనకు తూకునతీసేటట్టు సుప్రీం కోర్టువల్ల కలిగిన ఆజ్ఞకు సీమరాజు మన్నన నిమిత్తమై వ్రాసి పంపించి తెప్పించుకోగలిగితే యెట్లా సుప్రీం కోర్టుయొక్క దండన తప్పిపోవచ్చునో, అట్లా డిష్టయిని అనే విధి యీశ్వరకటాక్షము ముందర నిలువనేరదని చెప్పి సమాధానపెట్టినాను."[44]

"యింతేకాకుండా మహామ్మదు యింగిలీషు శాస్త్రీల ప్రకారమున్ను మన శాస్త్రీల ప్రకారమున్ను యీ ప్రకృతులకంతా వొక్క కాలములోనే వుపసంహారమనిన్ని తోచబడుచున్నది. ఆ కాలమును జాతులవాండ్లు 'డే ఆఫ్ జడ్జిమెంటు' అంటారు. మనవారు 'బ్రహ్మణాసహముక్తి' అంటారు. మహామ్మదు మతస్థులు 'కయామత్ కా దిన్' అని చెప్పుచున్నారు."[45]

"మేస్తర్ నీపన్ (Mr. Nepean) దొర నాతో మత సంబంధమయిన ప్రసంగము వచ్చినపుడు యీ నదులను యీ గుళ్ళను యీశ్వరుడని నమ్ముతావా అని ప్రశ్నచేసెను. చెన్నపట్టణము చూడని మీకు, హిందూస్థాన్ ప్లాన్ యెత్తి యిదిగో చెన్నపట్టణమని చూపిస్తే అది చెన్నపట్టణ మౌనా? చెన్నపట్టణము ఫలాని తావున వున్నదని బోధచేయవలసిన వారికి చెన్నపట్టణానికి పిలుచుకొనిపోయి ప్రత్యక్షముగా చూపించను వల్లలేస పక్షమందు, ప్లానుగుండానయినా చూపించవలసినది అగత్యము గనుక, యెట్లా ప్లాను వ్రాసి మీరు యెరగని

43. Ibidem. Page - 169.
44. Ibidem. Pages - 112, 113.
45. Ibidem. Page - 254.

దేశాలను ప్రకటనము చేయుచున్నారో తద్వత్తుగా జ్ఞానముచేత యీశ్వరుని యెడల భక్తి కుదిరేటందుకు వీలులేనివారికి ఈ కర్మస్థలముల మూలముగా యీశ్వరుని యెడల భక్తి కుదిరేటందుకు యిటువంటి స్వరూపాల యెడల యీశ్వర జ్ఞానము ఆరోపితముచేసి ఆరాధనోపాయములు మా పెద్దలు చేసినారు, అని ప్రత్యుత్తర్వు యిస్తిని. అయితే నీవు క్రీస్తు మతస్థుడవేకదా! అని చెప్పి సమ్మతిపడినాడు."[46]

"గయలో నేను వుండగా డాక్టరు జాన్ డేవిడ్ సెన్ దొర, నీవు యెన్ని దేవుండ్లను ఆరాధనచెయ్యడము ? అని ఆశ్చర్యముగా ప్రశ్న వేసెను. దేవుడు ఒకడేగాని ఒకనికన్నా ఎక్కువైన పదార్థము యే బ్రహ్మాండానికైనా కద్దా అని పునః ప్రశ్నచేసినంతలో, మీరు ముప్పైమూడు కోట్ల దేవతలను కొల్వడములేదా, ఒకడే జగదాధారమయిన దేవుడని మావలెనే యెట్లా చెప్పుతావు ? అందువల్ల నీవు హిందువు కాదని తోచుచున్నదని చెప్పెను. మీరు అనేకమయిన సేయింట్సు అనే దేవసమానులయిన పురుషులను నమ్మి ఆరాధనచేసినట్టు మాకు ముప్పై మూడుకోట్ల దేవతలు కద్దు; దేవతలనగా మీ సేయింట్సువంటి దివ్యపురుషులు గాని, జగదీశ్వరులు కాదు; జగదీశ్వరుడు ఒకడేను. ఆ జగదీశ్వరుని 'గాడ్' అని తర్జుమా చేయవలసినది; కడమ శివుడు, విష్ణువు, గణేశుడు మొదలయినవారి నంతా సేయింట్సు అనే తర్జుమా చేయవలసినది. అటుచేయక దేవత అనే వాచకము వచ్చినప్పుడల్లా 'గాడ్' అని భ్రమప్రమాదముచేత తర్జుమా చేసుటవల్ల ముప్పైమూడుకోట్ల జగదీశ్వరులు గలరని నమ్మి ఆరాధన చేసేటట్టు మీకు బోధపడ్డది. మా హిందూతత్వ ప్రకారము సర్వాంతర్యామిగా వుండేవాడు మీరు అనుకున్నట్టే మాకు ఒకడేకాని "ఏకమేవాద్వితీయ్యంబ్రహ్మ" అనే వాక్యప్రకారము రెండో వస్తువు లేదని బోధచేశేటప్పటికి శాస్త్రప్రయాస అయినది."[47]

పై నుదాహరించిన రీతిగా వీరాస్వామయ్యగారు పాశ్చాత్యులతో మత విషయములను చర్చించినారు. పాశ్చాత్య విజ్ఞానము, ప్రాచ్య సంస్కృతి, మూర్తీభవించిన వ్యక్తి గనుకనే అట్టి వాదములు చేయగల్గెను.

వీరికి క్రైస్తవమతమునకు సంబంధించిన విషయములే గాక, పాశ్చాత్య ఖగోళ శాస్త్రాదులతో గూడ పరిచయముకలదని చెప్పుటకు చాలినన్ని నిదర్శన

46. Ibidem. Page - 141.
47. Ibidem. Page - 233.

ములు 'కాశీయాత్ర చరిత్ర' లో కలవు. ప్రసక్తి వచ్చినపుడెల్ల వీరు చర్చలు కావించి తమకు గల ప్రాచ్యపాశ్చాత్య విజ్ఞానసంపదను వెల్లడిచేసిరి. ఖగోళ శాస్త్రాదులతో వీరికి గల పరిచయమును దెల్పు వాక్యభాగములను కొన్నింటి నిందు చూపుచున్నాను.

"...యీ బ్రహ్మాండము కోడిగుడ్డు ఆకారముగా వున్నదని మన శాస్త్ర మున్ను మతాంతరస్థుల భూగోళశాస్త్రములున్ను యేకవాక్యత పడివున్నవి. మన గణితశాస్త్రప్రకారముగానున్ను యితర మతాంతరస్థుల గణితశాస్త్రాల సమ్మతిగానున్ను యీ బ్రహ్మాండానికి ౧౮౦ భాగలుగాచేసి అందులో మధ్య ప్రదేశాన్ని మనవారు నిరక్షదేశమనిన్ని, జాతులవాండ్లు 'లయన్' అనిన్ని పేరు పెట్టివున్నారు.........."[48]

"యీ బ్రహ్మాండము యొక్క రెండు చివరలలో రెండు ధృవనక్షత్రము లుండేటట్టు మన శాస్త్ర నిశ్చయము. ఆ ధృవనక్షత్రాలను జాతులవాండ్లు నార్తుపోల్, సవుత్ పోల్ అనుచున్నారు...... యీ బ్రహ్మాండము యొక్క గాత్రానకు మన శాస్త్రజ్ఞులున్ను, జాతులవారున్ను వొక సుమారుగా భాగలు కట్టినారు గాని లంబమనే నిడుపు నిరక్షప్రదేశ ద్వారా ౧౮౦ భాగలు ప్రమాణ మని నిష్కర్షఅయినట్టు లంజమనే గాత్రభాగ సంఖ్య యెవరికిన్ని నిశ్చయముగ తోచినది కాదు. మనము లంబము లంజమని చెప్పే యీ బ్రహ్మాండము యొక్క నిడుపుగాత్రముల యొక్క సంజ్ఞలను జాతులవాండ్లు ల్యాటిట్యూడు అనిన్ని లాంజిట్యూడు అనిన్ని అంటారు."[49]

"ఇట్లు సృజింపబడిన యనేక బ్రహ్మాండములలో మనము వసించే బ్రహ్మాం డమునొక్కటి. యిందులో యీ భూమి యొక్క కొలత యింగిలీషువారి యొక్క వూహ ప్రకారమున్ను మన గోళశాస్త్ర ప్రకారమున్ను చచ్చౌకము సుమారు యిరువై కోట్ల మయిలులున్నవి. వీటిలో ఉదకమయముగా నుండే భూమి ౧౬ కోట్ల మయిళ్లు పోగా మనుష్యవాసముగా నుండే భూమి నాలుగు కోట్ల మయిళ్ళు."[50]

"......జలరాశి సమూహానకు సమష్టిపేరు సముద్రము కనుకనున్ను సముద్రము వొకటే గాని అనేక సముద్రములు వుండనేరవు. అయితే సముద్ర

48. Ibidem - Page 246.
49. Ibidem - Page 247.
50. Ibidem - Page 196.

సంచారులుగా నుండే జాతులవాండ్లు సముద్రములో నుండే ప్రదేశాంతరములు గుఱుతు తెలిసేకొరకు బ్లాకిసి, రెడ్డుసీ అని పేళ్ళు పెట్టినట్టు మన పూర్వపు పౌరాణికులు......ఈ బ్రహ్మాండములో ఫలాని తావులు అని గుఱుతు తెలిసే కొరకు వొక జలరాశిలోనే యిది లవణసముద్రము, యిది యిక్షుసముద్రమని యేర్పఱచినట్టున్ను.........తోచబడుచున్నది."

(కాశీయాత్ర చరిత్ర. 1941. పుటలు - 248, 249)

"..........అటువంటి సూర్యబింబములున్ను, వాటితోచేరిన బ్రహ్మాండ ములున్ను రాత్రిళ్ళు మనకు నక్షత్రరూపములుగా దర్శనము యిచ్చుచున్నవి. యిందుకు యింగిలీషువారి గ్రహలాఘవశాస్త్రమైన యెస్ట్రానోమి యనే గ్రంథ మున్ను, మన సూర్యసిద్ధాంతమున్ను యేకవాక్యత పడుచున్నవి......ఆయా సూర్యబింబకాంతులు వ్యాపించియున్న వాటిచుట్టు ప్రదేశములను మన పురా ణాదులలో శింశుమారచక్రమని చెప్పుతారు. వాట్లను యింగిలీషువారు జోడ యాకు అనుచున్నారు......."

(కాశీయాత్రచరిత్ర. 1941. పుట-259)

"...యీ బ్రంహ్మాండమునకు చలనశక్తికలిగి వుండడానికిన్ని, యీ బ్రంహ్మాండమును సూర్యబింబానికి ప్రదక్షిణముచేయుచూ వుండడానికిన్ని యీ అహఃప్రమాణభేదము వొక్కటే దృష్టాంతముగా వున్నది. యిదిన్నిగాక యింగిలీషుదేశపు సముద్రసంచారులలో వొకడు యీ పరీక్షనిమిత్తము వొక ప్రదేశములోనుంచి కావలసిన రస్తు కొన్ని సంవత్సరములకు వాడలో వుంచు కొని తూర్పుగాపోతూవుండేటట్టు వాడను సాగిస్తూ వచ్చినాడు. తూర్పుదిక్కు ఫలానిదనే జ్ఞానము సూర్యోదయమువల్లనే పుట్టుచున్నది. గనుక ప్రత్యహము సూర్యోదయమునుబట్టి తూర్పు తెలిసిపోతూవుండేకొద్ది, సుమారు కొన్ని సంవత్సరములలో బయలువెళ్ళిన స్థలమే చేరినాడు...యీ భూగోళమునకు వుండే ఆకర్షణమహిమచేత గోళముమీదనుండే సృష్టికోటి తలక్రిందుగా పడవల సిన నిమిత్తము యెంతమాత్రమున్ను లేదు."

(కాశీయాత్ర చరిత్ర. 1941. పుటలు-261,262)

పైని, విపులముగా నుదాహరింపబడిన యుదాహరణములవలన, వీరా స్వామయ్యగారికి ప్రాచ్య పాశ్చాత్య విజ్ఞానశాస్త్రములలో గల మెలకువ లన్నియు కరతలామలకములని తేలినదిగదా! ఇట్టివారు నాడెందరో మహాను భావులు కలరు. వీరాస్వామయ్యగారిపే రట్టివారికి ఉపలక్షణము. పాశ్చాత్య

విజ్ఞానశాస్త్రపరిచయము 1830 నాటికి ప్రతిభావంతులయిన దేశీయవిద్వాంసుల కింతగా కలదన్నమాట.

శ్రీ వీరాస్వామయ్యగారు కోర్టులో ఇంటర్‌ప్రెటర్‌గా నుండుటచే వారికి 'లా' (Law) బాగుగా తెలియును. ప్రస్తావన వచ్చినప్పుడెల్ల 'ఇంగ్లీషు లా' ను గూర్చి వారు వ్రాయుచునేవచ్చిరి.

"యింగిలీషువారి న్యాయమేమంటే, పది మంది దొంగలు శిక్షలేక తప్పి పోవడము మంచిదిగాని, సందేహాముమీద ఒక గృహస్థుడు దండనకు లోబడడము యుక్తముకాదని లలితముగా న్యాయవిచారణ చేస్తారు. యీ దేశములో చూస్తే వొక దుష్టుణ్ణి రక్షిస్తే వెయ్యి మంది శిష్టులను శిక్షించినట్లు అనే మాట ప్రత్యక్షముగా ఉన్నది." (కాశీయాత్ర. చరిత్ర, 1941 - పుట 326)

ఆంగ్లేయుల పరిపాలనవలన, దేశీయ సిద్ధాంతములలో ముఖ్యముగా మార్పులను పొందిన శాఖలు రెండు—ఒకటి విద్యాశాఖ; రెండు న్యాయశాఖ. ఈ రెండును తమ ప్రభావమును జూపి భారతీయుల దృక్పథమునే పూర్తిగా మార్చివేసినవని విజ్ఞులందరు నంగీకరించుచున్నారు. 'ఇంగ్లీషు లా' భారతీయులలో తీసికొనివచ్చిన మార్పులను, ఈ క్రింది వాక్యములు బాగుగా సూచింపగలిగియున్నవి.

"The moral effects of the rule of law are among its intangible and imponderable, but invaluable, fruits, the people having become familiarized with the principle that the law should be the same for all, that it should secure to each man the rights to which he is entitled, and that it should be administered without fear or favour, and without distinction of rank, position, or caste." (Modern India and the West; London, 1941 General survey. 'The rule of Law' by L. S. S. O'Malley, C. I. E. - Page—631.)

శ్రీ వీరాస్వామయ్యగారి రచననుబట్టి 1830 నాటికి, విద్యావంతులైన దేశీయులలో పాశ్చాత్య విజ్ఞానవాసన ఎంతవరకు వ్యాపించియున్నదో పూర్ణముగా తెలియుచున్నది. పాశ్చాత్య శాస్త్రవిజ్ఞానమును, ఆంగ్ల భాషను; నిర్ణీతమైన ప్రణాళిక ననుసరించి బోధించు పాఠశాలలు, కళాశాలలు వ్యాప్తిలో లేకున్నను; ప్రతిభావంతులైన దేశీయులు, స్వయంకృషివలననే చాల విషయములను సాధించిరి. ఈ కాలముయొక్క వైశిష్ట్య మిందున్నదనవచ్చును.

ఈ సాధన పదునెనిమిదవ శతాబ్దియొక్క చివరి పాతిక సంవత్సరముల నుండి క్రమక్రమముగా నభివృద్ధికి వచ్చుచుండెను. కంపెనీవారికి, ఉత్తర

సర్కారులు పూర్తిగా కైవసమయిన నాటినుండి, ఈ మార్పు ప్రస్ఫుటమయిన దనవచ్చును. కాలక్రమమున, సూచీముఖన్యాయమున, పాశ్చాత్యవిజ్ఞానవాసనా వాసితులయిన విద్యావంతులసంఖ్య యధికమగుచు వచ్చెను. ఈ ఆధిక్యము సంఖ్యయందేగాక, వారు నేర్చుకొనిన విషయ బాహుళ్యమునందును కలదు. ఇంత మాత్రముచేత నాటి విద్యావంతులందరును ప్రాచ్యసంస్కృతిని తిరస్కరించిరనిగాని, విమర్శలేకుండ పాశ్చాత్య సంస్కృతిని యథాతథముగ గ్రహించిరనిగాని, తలంపరాదు. పాశ్చాత్యవిజ్ఞానముతో వారికి గలిగిన సంపర్కము వలన వారు ప్రాచ్యపాశ్చాత్య సాహిత్య సంస్కృతులను, విజ్ఞానశాస్త్రములను, తులనాత్మకమగుపరిశీలనకు లోనుచేయుటను గ్రహించిరి. ఈ విమర్శ దృష్టి నాడు కలిగిన మేళ్ళలో ముఖ్యమైనది. నాటికింకను ప్రాచ్యసంస్కృతి యంతయు 'సాధువు' అని గాని; పాశ్చాత్యసంస్కృతిలేనిదే 'తరణోపాయము' లేదనిగాని; గాఢముగా నమ్మి వాదించు, తీవ్రాభినివేశములుగలవా రుదయింపలేదు. మతవిషయమున నిట్టి యభినివేశములు కొన్నిచోట్ల కన్పట్టినను, విజ్ఞానవిషయమున నట్లు లేదనవచ్చును.

నాటి కింకను, ఆంగ్లసాహిత్యములోని వివిధశాఖల ననుసరించి తెలుగులో సాహిత్యసృష్టి చేయుట బయలుదేరలేదు. కావలి వెంకటబొర్రయ్య, ఏనుగుల వీరాస్వామయ్యగారలు తమ యాత్రలకు సంబంధించిన చరిత్రలను - ఆంగ్లములో 'జర్నల్' అని పిలువబడు రచనవంటిదానిని - వ్రాసినను, వానిని 'జర్నల్' అని వ్యవహరించినను, వారెక్కడను తమ రచనలో, తామాంగ్ల రచయితలపద్ధతిని, గ్రంథములను రచించినట్లు చెప్పలేదు. ఇంక, వారి రచనలలో కనవచ్చునవి పాశ్చాత్య విజ్ఞానమునుగూర్చిన ప్రసంగములు, ఆ ప్రసంగములలో వా రుపయోగించిన ఆంగ్లభాషాపదములు మొదలగునట్టివి. వీనిని పరిశీలించినచో, వారిపై పాశ్చాత్య సాహిత్యసంస్కృతుల ప్రభావము బాగుగనే పడిన దని మనకు సువ్యక్తమగును. వీరు కేవలానుకరణము చేయకున్నను, పాశ్చాత్య సాహిత్యమునందలి వైవిధ్యమును గుర్తించినవారే. నాటి కంపెనీ యుద్యోగులలో విద్వాంసులు తక్కువమంది యగుటచే, జనబాహుళ్యమునకు, పాశ్చాత్యుల ఆచార వ్యవహారములను గూర్చి తెలిసినంత బాగుగా వారి సాహిత్యములను గూర్చి తెలియుట కవకాశములేకుండెను. కాని, వారి భాష నిత్యవ్యవహారమున తప్పకుండుటచే, దానితో పరిచయ మధికమయ్యెను.

ఏనుగుల వీరాస్వామయ్యగారు తమ 'కాశీయాత్ర చరిత్ర' లో కావించిన ప్రసంగములనుగూర్చి ముందే వ్రాసితిని. ఇవి వారి పాశ్చాత్య విజ్ఞానమును గూర్చి తెలుపునట్టివి. ఇవిగాక వారెన్నియో—తమ రచనలో— ఆంగ్లభాషా పదములను వాడిరి. నాడు విద్యావంతులైనవారి భాషలో ఆంగ్ల పదజాలము విరివిగా నుండెడిదని పాశ్చాత్య విద్యావేత్తలే యంగీకరించిరి. ఈ విషయమును గూర్చి సి. పి. బ్రౌన్ దొర తన ఇంగ్లీషు—తెలుగునిఘంటువులో నిట్లు వ్రాసెను:

"At present the Telugu used in conversation and business is becoming more and more thickly sprinkled with English words".

(English - Telugu Dictionary 1852 ; Preface - Page - 5)

'కాశీయాత్ర చరిత్ర'లో కానవచ్చుచున్న ఆంగ్లపదములను– (1) ప్రభుత్వ వ్యవహారమునకు సంబంధించినవి. (2) పాశ్చాత్యవిజ్ఞాన సంస్కృతులకు సంబంధించినవి. (3) నిత్య వ్యవహారమునకు సంబంధించినవి - అను మూడు భాగములుగ విభజింపవచ్చును. ఇం దుపయోగింపబడిన పదములు, ఉత్తరోత్తరము నల్పసంఖ్యాకములుగ నున్నవి. ఇం దాంగ్ల పదములు తెలుగులిపిలో వ్రాయబడుటచే నాడా శబ్దములను మనవారెట్లు ఉచ్చరించెడివారోకూడ తెలియగలదు. (బ్రాకెట్టులో, 1941 ముద్రణ ప్రతి యొక్క పేజీ సంఖ్య కలదు.)

### ప్రభుత్వ వ్యవహారమునకు సంబంధించినవి :

రిజిమెంటు (8) : "ఊరివద్ద నొక *రిజిమెంటు* ఉన్నది".

సూప్రీం కోరటు (1) : "జగదీశ్వరుండు నాచేత కొంత దేశాటనముచేయింపదలచి నన్ను నేలుచున్న *సూప్రీం కోరటు* దొరల గుండా సెలవిప్పించినాడు."

కుంఫిణీ (2) : "అక్కడ *కుంఫిణీ* వారు దొరలకు ముసాఫరుఖానా కట్టియున్నారు."

పోష్టాఫీసు (6) : "*పోష్టాఫీసు* వున్నది. యథోచితముగా వస్తువులు దొరుకును. ముసాఫరుఖానా యున్నది."

కలకటరు (6) : "కడప *కలకటరు* అడవికొట్టి బాట వెడల్పుచేసి, అక్కడక్కడ ఠాణాలుంచియున్నాడు."

సీవిలు (8) : "మరియొకపక్క *సీవిలు* దొరలు కాపురమున్నారు."

యిస్కూలు చీలలు (30) : "దూరప్రయాణము బోను మేనాసవారీలు తీసుకొని వచ్చేవారు సవారీలకు దండెను ఆసరాచేసి కిందను మీదను ౪ ఇనప కమ్ములు బిగియించి *యిస్కూలు చీలలు* కొట్టకమునుపు బలమయిన

మూలతగుళ్ళు కొట్టించి ఆ తగుళ్ళలో ద్వారములుచేసి వాటిలో యినుప్కాలు చీలలు బిగియించవలెను"

యింగిలీషు (33): "శికందరాబాదు అనే పేరుగలిగిన *యింగిలీషు* వారి దండు ఉండే బస్తీకి సమీపముగానున్న కాకాగూడమనే బొమ్మదేవరు నాగన్న తోట చావిడిలోనుంటిని."

యింగిలీషు రిసై డెంటు (33): "ఆ బేగంబజారుకు చేరినట్టు *యింగిలీషు రిసైడెంటు* ......హావేలీ కట్టించుకొని......కాపురమున్నాడు."

కమ్మిస్సేరైయాటు అసిస్టాంటు (35): "న్యాయవిచారణ కూడా కొత్తవాల్ చావడిలో *కమ్మిస్సేరైయాటు అసిస్టాంటు* గుండా జరుగుచున్నది."

రయిటరు (40): "హాయిదరాబాదు రిసైడెంటువద్ద నుండే పోస్టాఫీసు *రయిటరు* మేస్తరు బ్యాసు అనే పరంగివాని మంచితనము చేసుకొని ఒక *రన్నర్సు* అనే టప్పాలమనిషిని కూడా పిలుచుకొని......నాతో కూడా వచ్చి దారిచూపేటట్టు దిట్టముచేసుకొన్నాను.

రన్నర్సు (40): డిటో

కాలేజి (57): "*కాలేజి* సిద్ధాంతి వ్రాసినట్టు యింతకుమునుపే సింహారాశిగతుడైనట్టు వ్రాయలేదు."

కమ్మిస్సెరియాట్ మ్యానేజరు (60): "హాయిదరాబాదులో *కమ్మిస్సెరియాట్ మ్యానేజరు* రామస్వామి మొదలారిని విహితపరచుకొన్నట్టే విహితము చేసుకొని అతనిగుండా మోతీబాగు అనే బహువసతి అయిన తోటలో బంగళాలో దిగినాను."

ఆర్సనలు (63): "*ఆర్సనలు* అనే ఆయుధశాల... మొదలయినవి కట్టియున్నవి."

బ్యారకుసులు (64): "అట్లాగే బంగాళి దండున్ను బహుదినములు ఇక్కడ వసించి *బ్యారకుసులు*, వారధులు మొదయిన *పబ్లికు బులుడింగుసు* అనే గృహశాలలు శానా కట్టించినారు."

పబ్లికు బులుడింగుసు (64): డిటో

గవునరుమెంటు (64): "ఇటువంటి పనులకు చెన్నపట్టణపు *గవునరుమెంటు* వారి *శాంకిసన*నే అనుజ్ఞదుర్లభముకాని, బంగాళా *గౌనరుమెంటు* వారు ధారాళముగా అనుమోదింపుచున్నారు."

శాంకిసను (64): డిటో

**కంటోనుమెంటు (68)** : "కామిటి అనే *కంటోనుమెంటు* దండువుండే ప్రదేశ ములలోనున్న పార్శివారు ఇంగిలీషు పాపులుకూడ వుంచియున్నారు."

**డబ్బల్ టాపు (71)** : "నాగపూరు పట్టణములో ఒంటికంభం *డబ్బల్ టాపు* కనాతులు కల డేరా ఒకటిన్ని, వంటభోజనాలకు కంబళిడేరా ఒకటిన్ని, సంపాదించుకొనుటకు.... ౨౦ వ తేదివరకు నిలిచినాను."

**ప్రయివేటుటెంటును (71)** : "హాయిదరాబాదులో నుంచి తెచ్చిన *ప్రయివేటు టెంటును* అనే శిఘాయి డేరాలను ఇక్కడవదిలి...రావకమైనది"

**గవనర్ జనరలు (78)** : "ఈ రాజ్యము కుంఫిణీవారికి స్వాధీనమైన వెనుక *గవనర్ జనరలు* వారు జబ్బలపురిలో ఒక *ఏజంటును* సాగరులో ఒక *ఏజంటునున్ను* ఉంచి వారిక్రింద కొందరిని *ప్రిన్ సైపాల్ అసిస్టాంట్సు* అని యేడుగురు దొరలను ఏపఱచినారు."

**ఏజంటు (78)** : డిటో

**ప్రిన్ సైపాల్ అసిస్టాంట్సు (78)** : డిటో

**అప్పీల్ (94)** : "వారి తీర్పులమీద యేజెంటుకు అప్పీలు చేయవచ్చును."

**ఆఫీసు మ్యానేజరు (99)** : "జబ్బలపూరులో వుండే తపాలు ఆఫీసు మ్యానేజరు కుషుచందురు దత్తుబాబు అనేవాణ్ని మంచితనము చేసుకొని......... తపాలు మనిషి వచ్చేటట్టు జాగ్రత్తచేసుకొన్నాను."

**క్యారకటరు (107)** : "ఆ రాజు సకలవిధాలను నాకు ఉపచరించి వెనక నావద్దనున్న *క్యారకటరు* పుచ్చుకొన్నాడు."

**పోలీసు (128)** : "జబ్బల్ పూరు మొదలుగా రాజ్యము కుంఫిణీవారిది గనుక ప్రతి వూరిలో నున్ను వుండే *పోలీసు* జవానులను పిలిపించి నలుగురేసి చౌకీదారులనే కావలివాండ్లను రప్పించుకొని పారా కటాయించి ఉదయాన బయలుదేరేటప్పుడు మనిషికి రెండేసిఅణాల వంతున యిస్తూ వస్తాను."

**పెరిమిట్టు (128)** : "మిరిజాపురము మొదలు ప్రతిగ్రామములోనున్న పెరిమిట్టు జవానులని ఒక జత బంట్రోతులు తాణా వుంటారు."

**ప్యాసుపోరటు (128)** : "గంగ వొడ్డుకు వచ్చి అక్కడ సుంకపు బంట్రౌతులు నావద్ద వుండే *ప్యాసుపోరటు* అనే రహదారీని అగౌరవపరచి మూట ముల్లెలు సోదాయివ్వవలెనని నిబంధపెట్టినందున......యిద్దరు మను ష్యులను వుంచి గంగదాటి ౧౦ ఘంటలకు ప్రయాగ ప్రవేశించినాను."

రివిన్యూ కల్కటరు (135): "యీ అలహాబాదులో ఒక రివిన్యూ కల్కటరు, ఒక కష్టం కల్కటరు, ఒక మేజస్ట్రేటు, ఒక జడిజీ యున్ను వుండి వున్నారు."

కష్టం కల్కటరు (135): డిటో

మేజస్ట్రేటు (135): డిటో

జడిజీ (135): డిటో

కమిస్సనరు (135): "వీరి కందరికి అధికారిగా ఒక కమిస్సనరు ను యేర్పరచి పెట్టినారు."

పినాంన్సు కమిటీ (140): "బంగాళా గౌరన్‌మెంటువారు పినాంన్సు కమిటీ అనే సెలవులు తగ్గించే వారి తాత్పర్యముమీద అక్కడక్కడ ఉండే కష్టం హౌసు అనే సాయరు చావిళ్లు యెత్తివేసి చెన్నపట్టణమువలెనే కష్టం అనే సుంకమును యిజారాకు యివ్వవలెనని యత్నముచేసినారు."

కష్టం హవుసులు (140): డిటో

మొనాపొలీ (140): "యీ రాజ్యములో వుప్పుకు తీరువగాని చెన్నపట్టణము వలె మొనాపొలీ చేసి సుంకము యిజారాకు యివ్వడములేదు."

శీకష్టం కలకటరు (141): "నాకు తోచినమట్టుకు తెలిశేటట్టు ఒక యాదాస్తు శీకష్టం కలకటరు మేస్తరు సీఎన్ దొర కోరినమీదట వ్రాసి యిచ్చినాను."

జనరల్ (162): "వీరుగాక రెండు నూరు పటాలాలు ఇక్కడ వునికిగా ఉంచున్నవి గనుక వాటితో చేరిన దొరలు ఒక జనరల్ సహితముగా వసింపుచున్నారు."

క్రిమినాలు (183): "పట్నా షహరులో కలకటరు జడిజీ మేజిస్ట్రేటు ఉండడము మాత్రమే గాక ఒక అప్పీలు కోరటు, రివిన్యూ క్రిమినాలు సంగతులు విచారింపడానకు ఒక కమిసనరు వున్నాడు."

బ్యాంకి నోట్లు (201): "తప్పు బ్యాంకి నోట్లు మంచి బ్యాంకి నోట్లు సాహిత్యాన్ని చెరచినట్టు మూల పురాణాదుల గౌరవాన్ని చెరచివేయసాగినది."

అక్టింగు గౌనరు (205): "కాశీ నుంచి వచ్చేదారిలో చప్రా అనే షహరులో లోగడ చన్నపట్టణములో అక్టింగు గౌనరు గా వున్న గ్రీం దొరగారు.... ...... నన్ను కొన్ని దినాలు చప్రాలో నిలువుమని చెప్పినందున ధను గణయ త్వరగా ఆరంభించడానకు కొంత ఆలస్యపడ్డది"

టాక్సు కలకటరు (205) : "యాత్రదారుల వద్ద మహసూల్సులు వసూలు చేయడానికి ఒక *టాక్సు కలకటరు* జిల్లా కలకటరుకు అంతర్భూతముగా వున్నారు."

పోలైసు సూప్రింటెండాంటు (281) : "నాతో కూడా వుండే మనుష్యులకు కావలసిన ఆయుధాలు పట్టుకొనివుండేటట్టు పరవానా యిచ్చినారు గనుక వాటి బలము మీద కలకత్తా *పోలైసు సూప్రింటెండాంటు* వక పరవానా యిచ్చినారు."

చీపు శక్రటేరి (281) : "యిక్కడ *చీపు శక్రటేరి* గారున్ను, కాశీలో కలిగిన పరవానా మీదనే తానున్ను దస్కతుచేసి గౌరన్‌మెంటు మొహరు చేయించి యిచ్చినాడు."

చీపు జష్టీసు (281) : "సరు చాలీసు గ్రే దొరగారు మహోన్నతపదవి అయిన *చీపు జష్టీసు* పనిలో కలకత్తాలో వుండి అసాధ్యమైన గౌనరుమెంటు ఫరవానా కూడా నాకు కలగేటట్టు సహాయముచేసినందున నేను యీ పరదేశమందు యీ పదవిని పొందినాను."

పింఛన్ (310) : "జగన్నాథ రాజు కుంఫిణీ వారికి రాజ్యము వొప్పగించి *పింఛన్‌*తో జీవనము చేసుకుంటూ గుడి విచారణ ద్వారా గుళ్లో తన ప్రతిష్ఠను పరిపాలన చేసుకుంటూ వుంటాడు."

సరుకోటు (326) : "యిక్కడి జమీన్‌దారుడు కొన్ని బందిపోట్లకు ఆధారభూతుడైనందున *సరుకోటు* (Circuit) విచారణకు పెట్టినారట."

హేడ్డా పోలియసు (335) : "యిక్కడ *హేడ్డా పోలియసు* వాసముచేయుచున్నాడు."

ప్రోవిన్‌శయాల్ కోరటు (347) : "పూర్వకాలము మొదలుగా యీ బస్తీ (బందరు) సర్వాధికారుల నివాసముగా వుంటూరావడముచేత నున్ను, యిప్పట్లోనున్ను వుత్తరఖండం *ప్రోవిన్‌శయాల్ కోరటు* లో జిల్లా కోరటు కలకటరు కచ్చేరి కమ్మిస్సెర్యాటు ఆఫీసు సహితముగా కొంత దండు వసించివుంటూరావడంచేతనున్ను......బస్తీ చాలాగా శోభించి వున్నది."

ప్లీడరు (351) : "యీ కొత్తపాళెము చిన్నవూరు అయినప్పటికిన్ని వెచ్చా గోపాలకృష్ణమ్మ యనే కోమటి యిప్పట్లో బందరు *ప్రోవిన్‌శయాల్*

కోటులో ప్లీడరు గా వుండి అతడు వొక సత్రము కట్టించినందున మాగస్థులకు బహువుపకృతిగా వున్నది."

లాండు కష్టం హవుసు (372) : "గట్టున వచ్చేబొయ్యే సరుకులకు తీరువ తియ్యడానకు పడమటిపక్క లాండు కష్టం హవుసు అని వొక కచ్చేరి కట్టివున్నది."

యెక్కిసు చెంజి (372) : "కోటలోపల వుండే యిండ్లలో వాడలకు తెలిసే నిమిత్తము రాత్రిళ్ళు దీపముపెట్టే యెక్కిసు చెంజి యిల్లు పెద్దది."

ప్రభుత్వ వ్యవహారమునకు సంబంధించిన పై పదముల తరువాత పేర్కొనదగినవి పాశ్చాత్య విజ్ఞానసంస్కృతులకు సంబంధించిన పారిభాషిక పదములు. ఇవిగాక, క్రైస్తవమతమునకు సంబంధించిన పదములు గూడ నిందు చేర్చబడినవి. భూగోళశాస్త్రమునకు, ఖగోళశాస్త్రమునకు సంబంధించిన కొన్ని పదములు కూడ నిందుగలవు. పదార్థ విజ్ఞానశాస్త్రమునకు, రసాయనిక శాస్త్రమునకు సంబంధించిన పదము లిందు తక్కువగా నున్నవి.

: పాశ్చాత్య విజ్ఞానసంస్కృతులకు సంబంధించినవి :

క్రీస్తు (69) : "......విలాయతీ క్రీస్తు మతస్థులు ఈశ్వర స్వరూపము సర్వ భూతాత్మకమని ఆదిలోనే బోధచేయతలచుటచేత మూఢులున్ను, బాలులున్ను ఈశ్వరుడు కలడనే జ్ఞానమేలేక మునిగిపోతారనిన్ని...చెడు కలియని మంచిపని ప్రపంచములో లేదనిన్ని నిశ్చయించితిమి."

బ్యారుక్ (73) : "చలిజ్వరాలకు లింగకట్టు బ్యారుక్ ఇచ్చుచు వచ్చుచున్నాను."

లయిను (101) : "మనవారు నిరక్షదేశ మని చెప్పుతారు. యింగిలీషువారు దానినే లయను అని చెప్పుతారు."

నాతు పోల్ (101) "ఆ వుత్తరధ్రువుణ్ణి యింగ్లీషువారు నాతు పోల్ అనుచున్నారు."

డిష్టయిని (112): *డిష్టయిని* (**Destiny**) అనే విధి బలమయినప్పుడు ఈశ్వర కటాక్ష మేమి పనికివస్తున్నదని ప్రస్తాపము వచ్చెను.

ప్లాన్ (141) : "చెన్నపట్టణము చూడని మీకు, హిందూస్తాన్ ప్లాన్ యెత్తి యిదుగో చెన్నపట్టణము చూడని, మీకుచూపిస్తే అదిచెన్నపట్టణమౌనా?"

ప్రొటెస్టాంట్సు (147) : "క్రీస్తు మతస్థులలో ప్రొటెస్టాంట్సు అనే జాతులవారు విశిష్టాద్వైత మతానుసారముగా సృష్టికర్త అయిన యీశ్వరుడు చేతనా

చేతనాత్మకమయిన అనేక జీవులను సృష్టించినాడు, కర్మాలు తదంగమయిన ఆరాధనలవల్ల యీశ్వరదృష్టి అల్పపదార్థాలమీద కలిగితే ప్రమాదాన్ని యిస్తున్నవి గనుక, కర్మాలున్ను తజ్జనితమయిన ఆరాధనలున్ను యేవి వద్దు, మనసా యీశ్వర భజన చేస్తూవుండవలసినదని చెప్పుతారు."

రోమను క్యాథెలిక్కు (148) : "రోమన్ క్యాథెలిక్కు అయిన క్రీస్తు మతస్థులు తురకలవలెనే సంక్షేపమయిన కర్మాలతో ఆరాధనలతోనున్ను యీశ్వరభజన చేస్తున్నారు."

ఫ్లానులు (173) : "నేను ఫ్లానుల (ఫ్లానల్) తో అన్ని వస్తువులున్ను వారివలెనే కుట్టించుకొని ధరించినాను."

బైబిలు (196) : "యింగిలీషు వారి బైబిలులో యేడం (Adam) అనే కూటస్థుడున్ను అవి (Eve) యనే కూటస్థురాలున్ను యీ ప్రదేశములో పుట్టినట్టు చెప్పియున్నది."

యేడం (196) : డిటో

అవి (196) : డిటో

సేయింట్సు (233) : "మీరు అనేకమయిన సేయింట్సు అనే దేవసమానులైన పురుషులను నమ్మి ఆరాధన చేసినట్టు మాకు ముప్పైమూడు కోట్ల దేవతలు కద్దు."

గాడ్ (233) : "జగదీశ్వరుడు ఒకడేను. ఆ జగదీశ్వరుని 'గాడ్' అని తర్జుమా చేయవలసినది."

సల్ఫ్యూరిక్ యేసిడ్ (235) : "సల్ఫ్యూరిక్ యేసిడ్ అనే గంధక ద్రావకము వుదకములో కలిపి తీసుకుంటే పుల్లగా వుంచున్నది."

అయిస్సు (247) : "...వుత్తరపుపక్క నీళ్ళు రాయివలె ఘట్టి అయ్యే అయిస్సు అనే శీతమును కల్పించి ఆ ప్రాంతముల మానుష సంచారములేకుండా చేసినాడు."

సవుత్ పోల్ (247) : "...ఆ ధ్రువ నక్షత్రాలను జాతులవాండ్లు నార్తుపోల్, సవుత్ పోల్ అనుచున్నారు."

ల్యాటిట్యూడు (247) : "మనము లంబము లంజమని చెప్పే యీ బ్రహ్మాండము యొక్క నిడుపు గాత్రములయొక్క సంజ్ఞలను జాతులవాండ్లు ల్యాటిట్యూడు అనిన్ని లాంజిట్యూడు అనిన్ని అంటారు."

లాంజై ట్యూడు (247) : "మనము లంబములంజ మనిచెప్పే యీ బ్రహ్మాండము యొక్క నిడుపు గాత్రముల యొక్క సంజ్ఞలను జాతులవాండ్లు ల్యాటై ట్యూడు అనిన్ని లాంజై ట్యూడు అనిన్ని అంటారు."

జ్లాకిసి (249) : "సముద్రసంచారులుగా నుండే జాతులవాండ్లు సముద్రములో నుండే ప్రదేశాంతరములు గుతుణ తెలిసేకొరకు జ్లాకిసి, రెడ్డుసీ అని పేళ్ళు పెట్టినట్టు..........."

రెడ్డుసీ (249) : డిటో

డే ఆఫ్ జడ్జిమెంటు (254) : "యింగిలీషు శాస్త్రిల ప్రకారమున్ను మన శాస్త్రిల ప్రకారమున్ను యీ ప్రకృతుల కంతా వొక్క కాలములోనే పునస్సంహారమనిన్ని తోచబడుచున్నది. ఆ కాలమును జాతులవాండ్లు *డే ఆఫ్ జడ్జిమెంటు* అంటారు."

యెస్ట్రినోమి (259) : "యిందుకు యింగిలీషువారి గ్రహలాఘవ శాస్త్రమైన *యెస్ట్రినోమి* యనే గ్రంథమును మన సూర్యసిద్ధాంతమున్ను యేక వాక్యత పడుచున్నవి."

జోడయాకు (259) : "... మన పురాణములలో శింశుమార చక్రమని చెప్పుతారు. వాట్లను యింగిలీషువారు *జోడయాకు* అనుచున్నారు."

బే ఆపు బంగాళ (274) : భూమి ధనురాకారముగా ఏర్పడి మధ్య సముద్రము కలిగివుండే *బే ఆపు బంగాళ* అనే ప్రదేశములో డచ్చివారు, ఫ్రాంసువారు ప్రవేశించి వర్తకము చేసుకుంటూవున్నారు."

బోటానికాలు గారుడన్ (279) : "అందులో గంగకు అవతలి పక్క వుండే కుంఫిణీవారి "*బోటానికాలు గారుడన్*" అనే వనౌషధముల తోట బహు గొప్పది."

బిట్టరు (285) : "యింగిలీషులో *బిట్టరు* అనిన్నీ చెప్పే మూలిక వేశి కషాయము పెట్టి *యిలిక్కిసి యావిత్రిల్* అనే ద్రావకము వొక *క్వాటర్ బాటిల్* కషాయానకు రెండు తేగరిబెలు పోశి......"

యిలిక్కిసి యావిత్రిల్ (284) : డిటో

క్వాటర్ బాటిల్ (285) : డిటో

పై పదములవలె, విజ్ఞానసంస్కృతులకు సంబంధింపని, సామాన్యముగా నిత్యజీవితములో నుపయోగింపబడునవి అయిన ఆంగ్లపదములను కొన్నింటిని, కొన్ని యింగిలీషు సామెతలను యథాలాభముగా వీరాస్వామయ్యగారు

కాశీయాత్ర చరిత్రలో వాడిరి. వీనినిబట్టి 1830 నాటికి, తెనుగులో స్థిరపడిన కొన్ని యింగిలీషు మాటలను గుర్తింపవచ్చును.

: నిత్యవ్యవహారమునకు సంబంధించినవి :

వాడుక (80) : "కేపన్ వాడుక లో దొరవద్ద ముఖ్యుడుగానుండే బంగాళీ."

నెంబరు (80) : (యాత్రలో ముఖ్యఘట్టములకు నడుమవచ్చు గ్రామములకు, ఇన్ని సంఖ్య గలవి యను అర్థమున, నెంబరు వాడబడెను.) "నడిమి వూళ్ళు నెంబరు ౫."

డాక్టర్ (93) : "ఒక పటాలం దండున్ను అందుతో చేరిన *డాక్టర్* మొదలయిన దొరలున్ను మరియొకపక్క తోటలో బ్యారకసులు కట్టుకొని కాపురమున్నారు."

ఆసుపత్రి (117) : "ఆసుపత్రి లో డాక్టరులు వరుసగా చికిత్సచేస్తూవచ్చేటట్టు నా డేరాలవద్ద వీరికందరికిన్ని చికిత్సజరుగుచువచ్చినది."

మయిలు (127) : "దారి నిన్నటివలెనే సడక్కువేసి మయిలు రాళ్ళూ వేసి వున్నవి."

షాపు (151) : "సీమ సామానులు అమ్మే *యింగిలీషు షాపు* కూడా ఒక బంగాళీ వేసుకొనిఉన్నాడు."

పిన్నిసు (179) : "అది రెండు కంభాలు కలది. నిడుపు ఎక్కువ. మొనను చుక్కాణి. యిల్లు మధ్యే వుంచున్నది. పొడుగు కొనా మొదలున్ను సమము, పిన్నిసు నావ."

కటరు (179) : "అది పిన్నిసు జాడ; గాలిని చాపలచేతవైపు చేసుకోవచ్చును."

బాలిబోటు (179) : "అది చెయిపడవ."

పొటేటసు (182) : "యిరువై యేండ్లకు మునుపు జాతులవాండ్లు పొటేటసు అనే గడ్డలు (బంగాళాదుంపలు) యీ దేశానికి తెచ్చి పైరుపెట్టే క్రమమును యీ దేశపు జనులకు నేర్పించినారు."

అప్పీల్సు (184) : "శీమ అప్పీల్సు (Apples) యీ దేశములో అవుతున్నవి"

యిండియా (245) : "మనలో పేరు గలిగిన యాభై ఆరు దేశాలు వాటి ఛెప్పన్న భాషలున్ను యీ బ్రహ్మాండములో యే పక్క వున్నవని విచారించగా నేను చేసిన దేశాటనముచేత నాకు కలిగివుండే స్వానుభవముచేతనున్ను, నావినికిడివల్లనున్ను, నేను నిశ్చయము చేసినది యేమంటే ఆ దేశా

లంతా కర్మద్వారా బ్రహ్మానుసంధానముచేసే 'యిండియా' అని నామధే యము కలిగిన కన్యాకుమారి మొదలు కాశ్మీరము లోపలనే వున్నవి."

యింగిలీషు చారయాట్ (277): "కరాచీలు అనే బండ్లు యింగిలీషు చారయాట్ బండ్లకు నకలుగాచేసి...బాడిగెకు పెట్టుకొని వున్నారు."

పిచ్చున్సు (278): "యీ కలకత్తాలో యింగిలీషువారు వారి శీమలోని పిచ్చున్సు అనే పండ్లు, లిచ్చున్సు అనే పండ్లున్ను రెండుదినుసులు పయిరు చేశినారు."

లిచ్చున్సు (278): డిటో

ఫిడీలు (280): "వాద్యవిశేషములలో ఫిడేలు అనే యింగిలీషు వీణలు యీ ప్రాంతముల బహుప్రచురముగా వున్నవి."

లస్తలు (280): "యిక్కడ లస్తలు గ్లాసులు కరిగిపోశి చేయుచున్నారు."

గ్లాసులు (280): డిటో

యూజ్ రికిన్సయిల్సు వుయిత్ ఎవ్వరిథింజ్ (339): "యిందుకు శిష్టవాక్యము యింగిలీషు వారిలో *యూజ్ రికిన్సయిల్సు వుయిత్ ఎవ్వరిథింజ్* అని వున్నది.

ఈ విధముగా 'కాశీయాత్రచరిత్ర' లో కానవచ్చు మూడు తెగలకు సంబంధించిన ఆంగ్లపదములను గూర్చియు, వీరాస్వామయ్యగారికి పాశ్చాత్య విజ్ఞాన సంస్కృతులతో గల సంబంధమును గూర్చియు వ్రాసిన తరువాత, వారికి దొరలతోగల మైత్రిని గూర్చి తెలుపవలెను. నాడు చాలమంది దేశీయపండితులు దొరల ప్రాపువలననే ఉన్నతి పొందిరి గనుక ఈ విషయము ముఖ్యమైనది. కాశీయాత్ర చరిత్రలో పేర్కొనబడిన దొరల పేరులను, నాడు వారు నిర్వహించుచున్న హోదాలను క్రింద నిచ్చుచున్నాను.

మేస్తర్ గ్రీన్ (68): "నాగపూరు రిసైడెంటు". ఇతనితో వీరాస్వామయ్య గారు పుణ్యపాపములనుగూర్చి చర్చించిరి.

డాక్టరు వొయిలు (72): నాగపూరులో డాక్టరు. (Dr. Wylie)

ఏజంటు స్మిత్ (94): జబల్‌పూరు యింగిలీషు ఏజంటు. వీరాస్వామయ్యగారికి 'ఫరవానా' ఇచ్చెను.

కేపన్ నిక్కొల్సన్ (114): జబల్‌పూరు దారి విచారణకర్త.

కేపన్ డ్రమ్మన్ (114): మిరిజాపూరి దారి విచారణకర్త.

సర్ జాన్ న్యూబోటు (140): ఈతడు 1815 నుండి 1820 వరకు మద్రాసు సుప్రీముకోర్టు ప్రధాన న్యాయమూర్తి. వీరాస్వామయ్యగారికి యోగ్యతా పత్రము నిచ్చెను.

సర్ చార్లీసు గ్రే (140): ఈ న్యాయమూర్తియు, యోగ్యతాపత్రమిచ్చెను.

మేస్తరు నీపన్ (141); "శీకష్టం కలకటరు". ఈతనితో వీరాస్వామయ్యగారు మత సంబంధమైన ప్రసంగములు చేసిరి.

జాన్ దేవిడ్సన్ (195): గయలో నివసించెడి డాక్టరు. ఈతనితో వీరాస్వామయ్యగారు వర్ణభేదమునుగూర్చి చర్చించిరి.

జార్జి ఐ. మారీసు (197): గయలో జడ్జి. వీరాస్వామయ్యగారీతనితో సహగమనమునుగూర్చి చర్చించిరి

గ్రీన్ దొర (205): చెన్నపట్టణములో "ఆక్టింగు గౌనరు."

మేస్తర్ మించ్చెన్ (215): కలకత్తాలో ఉన్నవాడు. వీరాస్వామయ్యగారికి విహితుడు.

మేజస్ట్రీటు జాక్సన్ (219): రామసాగర తీర్థములో పిండప్రదానమున కనుజ్ఞ ఇచ్చెను.

సర్ చార్లీస్ డాలిబ్యార్డు (230): పట్నాలో అభినిమంమను ప్రభుత్వమునకై కొనెడివాడు.

లార్డు వుల్లియం బెంటిక్కు (232): "వుష్ణకాలానికి భయపడి, నేపాళదేశములో వుండే సముద్రోదకానికి పైన 27000 అడుగుల పొడుగునా ఈబ్రహ్మాండానికంతా వున్నత పర్వతమైన హిమాలయ పర్వతానకు యెండకాలపు కాలక్షేపము కొరకు వెళ్ళినారు."

డాక్టర్ కార్బిన్ (269): గంగాతీరమున నుండెను. శిశుచికిత్సపై గ్రంథము వ్రాసెను.

కలకటరు, మేజిస్ట్రీటు రిక్కెట్టు (288): ఉత్కళ దేశములో 'సూరంగు' వద్ద కలడు.

పేయిన్ (311): పూరీలో యాత్రికులవద్ద మహసూలు వసూలు చేయును.

డే (369): మద్రాసులో 1644 లో కోటకట్టిన ఆంగ్లేయుడు.

వీరాస్వామయ్యగారి కాశీయాత్ర చరిత్రలో, నాటి కింకను భారతదేశమందు స్వల్పముగ వాణిజ్యము చేయుచున్న ఇతర పాశ్చాత్య సంఘములను గూర్చి యిట్లు ప్రస్తావన కలదు. "యీపూరికి యెదురుగా నదికి అవతల పక్కను

శ్రీరాంపూరు అనే వూరు వొలంజా వారి కసుబాబస్తీ గ్రామము అనేకమయిన గొప్ప మిద్దెలు కలిగివున్నది. అందులో కొన్ని బస్తీలు ఫ్రాంసు వారివిగానున్న డెన్ మ్యారుకు వారివిగానున్ను. కొన్ని డచ్చి వారివిగానున్ను అద్యాపి ఆయా జాతివాండ్ల యేలుపాటులో వున్నవి" (పుట-268)

పందొమ్మిదవ శతాబ్ది మొదటి మూడు దశలలోను, "కుంఫిణీ" యేలుబడిలో భారతదేశము, భారతీయులు ఎట్లుండిరో దీనివలన తెలియును. నాటి విద్యావంతుల విజ్ఞానము, భావనిర్భరత, దృక్పథము, పాశ్చాత్యులతో సంపర్కము వలన నెట్టిరూపమున నుండెనో దీనివలన తెలియును. విద్యా సంస్థలు సక్రమ పద్ధతిలో పాశ్చాత్య విద్య గరపుటను ప్రారంభించుటకు పూర్వమే, పాశ్చాత్యుల సాంగత్యము వలన ప్రతిభావంతులైన దేశీయులెట్లుండెడివారో వారిపై పాశ్చాత్య విజ్ఞాన మెట్లు ఎంతవరకు పడెనో తెలుపుటకు, కాశీయాత్రను మించిన గ్రంథములేదు.

శ్రీ వీరాస్వామయ్యగారి తరువాత; పాశ్చాత్య సంస్కృతిని, విజ్ఞానమును ఆకళింపునకు తెచ్చుకొనినవారిలో, వారి సమకాలికులైన శ్రీ కోమలేశ్వరపురం శ్రీనివాసపిళ్ళగారు ఒకరు. పాశ్చాత్యవిజ్ఞానమును, ఆంగ్లవిద్యయు దేశీయులలో వ్యాప్తిని పొందుచుటకై ఈయన మంచి కృషిచేసెను. సంఘ సంస్కారమన్న వీరికి ప్రీతి హెచ్చు. బాలికల విద్యాభివృద్ధికై మిక్కిలి కృషి చేసిరి. చెన్నపట్టణములో, యూనివర్సిటీబోర్డు, 1839 లో మద్రాసు గవర్నరయిన ఎలిఫిన్‌స్టన్‌దొర స్థాపించినప్పుడు. శ్రీనివాసపిళ్లగా రందొకసభ్యునిగ నియమింపబడిరన్న వారియోగ్యత మనకు తెలియగలదు. దానికి జార్జినార్టనుగారధ్యక్షులు. ఇంగ్లీషు విద్యావిధానము దేశములో వ్యాప్తిని పొందుటకై స్థాపింపబడిన సంస్థలన్నిటియందును వీరు పనిచేసిరి. 1841 ఏప్రిల్ నెలలో మద్రాసులో ఇంగ్లీషు ఉన్నతపాఠశాల స్థాపింపబడగా, దాని కార్యవర్గములో కూడ వీరు సభ్యులుగా పనిచేసిరి. వీరు 1852 లో చనిపోయిరి.

శ్రీ వీరాస్వామయ్యగారికి వీరాప్తమిత్రులు. కాశీయాత్ర చరిత్రను లేఖలరూపమున వీరాస్వామయ్యగారు వీరి కోరికపై వీరికి వ్రాసిపంపిరి. వీరాస్వామయ్యగారు చనిపోయిన తరువాత (3-10-1836 మృతి.) శ్రీపిళ్ళగారు కాశీయాత్ర చరిత్రను 1838 లో మొదటిసారి అచ్చువేయించి మహోపకారము చేసిరి ఈ ప్రథమ ప్రచురణములో, వీరాస్వామయ్యగారి జీవితచరిత్ర, శ్రీ పిళ్లగారు రచించి ప్రకటించిరి. ఇదిలేనిచో వీరాస్వామయ్యగారినిగూర్చి మనకు

బాగుగా తెలియకుండెడిది. ఇంతియెగాక ఈ 'జీవితచరిత్ర' వలన, శ్రీనివాస పిళ్లగారి రచనకూడ మనకు లభ్యమయినది. విద్యావంతులైననాటి దేశీయులు వాడుకలోనున్న ఆంగ్లపదములను విసర్జింపక ఎట్లు నిస్సందేహముగ ప్రయోగించెడవారో మనకు తెలియుచున్నది. వాడుకలోనున్న ఆంగ్లపదములను తెనిగింపక యథాతథముగ వారు ప్రయోగించెడివారు. శ్రీ పిళ్లగారు రచించిన 'జీవితచరిత్ర'లో కనవచ్చుచున్న ఆంగ్లపదములను క్రింద నుదాహరించుచున్నాను. 1838 నాటికి విద్యావంతుల వాడుకలో ఆంగ్లభాష ఎంతవరకు వ్యాపించినదో దీనివలన కొంత తెలియును.

నాడు 'ఇంగిలీషు' అనుశబ్దమే విరివిగా వాడబడుచుండెనుగాని, 'ఆంగ్ల' శబ్దము వాడుకలోలేదు. ఆంగ్లపదములన్నియు తెలుగులిపిలో నాటి వాని యుచ్చారణ ననుసరించి వ్రాసెడివారు దొరలకు దేశీయులతో సన్నిహితత్వ మధికముగ నుండియుండుటచే, వారిపేరులు తరచుగ కన్పట్టుచుండును. నాటికింకను ఆంగ్ల సాహిత్యప్రభావము, భావవినిమయము తెచ్చునంతగా సోకకుండుటచే; వ్యవహారమునకు సంబంధించిన ఆంగ్లపదములేగాని, సాహిత్యమునకు సంబంధించిన పదములు వాడుకలోనికి విశేషముగ రాలేదు. శ్రీ కోమలేశ్వరపురం శ్రీనివాసపిళ్లగారి రచనలో ఈక్రింది ఆంగ్లపదములు కలవు.

(పుట-౧) యింగిలీషు; వాలంటీరు; బోడుఁ ఆపు ట్రేడు; ఆఫీసు; యగ్జామినరులు ; రీడరు ; కలక్టరు ; యింజేరు ప్రీటరు; ట్రాన్సులేటరు ; యింగిలీషు హావుసులు.

(పుట-౨) యేజన్సీలు; వోయర్ హావుసు; బోక్కీపరు; హేడు కౌంటాంటు సుప్రీంకోర్టు ; బోర్డు శక్రిటేరి ; సుప్రీంకోర్టుజడ్జి ;

(పుట-౩) గవరన్ మెంటు ; రివిన్యూబోర్డు.

(పుట-౪) సర్ రాల్ఫు ఫాల్మరు. మద్రాసులో ప్రధాన న్యాయమూర్తి (1825-1835 వరకు); టెస్టిమోనియాల్ ; కోటుఁ; ఛేంబరు ;

(పుట-౬) రిసైడెంటు.

(పుట-౮) హిందూ లిటరైరి సొసయిటి; సర్ రాబర్ట్ కమిన్, మద్రాసులో ప్రధానన్యాయమూర్తి (1835-1842 వరకు); అడ్వొకేటు జనరల్ జార్జి నార్టన్ ;

---

51. ఆంగ్లపదములకు ప్రక్క, బ్రాకెట్లలోనున్న సంఖ్య, కాశీయాత్ర చరిత్రలోని పత్ర సంఖ్యను తెలుపునది. కాశీయాత్రచరిత్ర. తృతీయముద్రణము. 1941

ఈపదములన్నియు——ఇంచుమించుగా——వ్యవహారమునకు సంబంధించి నవే గాని, సాహిత్యపరమైనవిగావని వెంటనే తెలియుచున్నదిగదా !

శ్రీనివాసపిళ్ళగారి తరువాత, ఈ సందర్భమున స్మరింపదగినవారు *వెంబాకం రాఘవాచార్యులుగారు.* వీరు 1842 లో మృతిపొందు వరకు, మద్రాసు లోని ధర్మసంస్థల పరిపాలనలో వీరికి స్థానముండెను. "కుంఫిణీ" క్రింద పోలీసు ఉద్యోగిగను, మేజస్ట్రీటుగను పనిచేసిరి. 1839 లో ఏర్పడిన మద్రాసు యూనివర్సిటీ బోర్డులో సభ్యులు. మద్రాసులోని ఉన్నతపాఠశాల పరిపాలన వర్గమునందును సభ్యులు. పచ్చయప్ప ధర్మనిధిని పరిపాలించుటకై ఏర్పరుప బడిన 'బోర్డు'లో అధ్యక్షులుగనుండిరి. ఆంగ్లవిద్యాభిమానియైన వీరు పచ్చయప్ప కళాశాల స్థాపనకు మూలకారకులైన వారిలో నొకరైరి. హిందూలిటరరీ సొసైటీయందు వీరొక సభ్యులు. ఈ సంస్థ; స్వదేశీయులలో విజ్ఞానమును, చైతన్యమును అభివృద్ధిచేయుటకై స్థాపింపబడినది. జార్జినార్టనుగారు దీనికి నాయకులు. ఇందు వీరాస్వామయ్య, శ్రీనివాసపిళ్ళ, రాఘవాచార్యులు గారలు సభ్యులై మిక్కిలి కృషిచేసిరి. ఆనాడు చెన్నపట్టణములో పాశ్చాత్య విజ్ఞానసంస్కృతుల ప్రభావము క్రింద సోత్సాహముగా పనిచేసిన వారీ ముగ్వురు.

వీరాస్వామయ్య ప్రభృతుల తరువాత, దేశాభివృద్ధికి కృషిచేసిన మహా వ్యక్తి *శ్రీ గాజుల లక్ష్మీనర్సు సెట్టిగారు* (1806-1868). పాశ్చాత్య విజ్ఞానము లోని గొప్పతనమును గుర్తించినవీరు, కుంఫిణీ పరిపాలనలోని లోపములను చూపుటకు వెనుదీయలేదు. 'చెన్నపట్టణ స్వదేశ సంఘము' అను దానిని స్థాపించి; రాజకీయముగను, వైజ్ఞానికముగను ప్రజలలో చైతన్యమును తెచ్చు టకై కృషిచేసిరి. అప్పటికి మద్రాసులో శ్రీనారాయణస్వామినాయుడను నాతని యాజమాన్యమున 'సర్క్యులేటర్' అను ఇంగ్లీషు పత్రికకలదు. శ్రీ సెట్టి గారు దానినికొని, పేరును 'క్రెసెంట్'గా మార్చి 'హార్లే' అను దొరను సంపాదకునిగజేసి పత్రికను నడిపిరి. దీని మొదటి సంచిక అక్టోబరు 2 వ తేదీ 1844 లో వచ్చెను. "హిందూదేశస్థులను సమున్నత స్థితికిఁదెచ్చుటయే" దాని ఆశయమని అందు వెల్లడింపబడినది. నాడు దక్షిణహిందూదేశములో రాజకీయ చైతన్యమును కలిగించుటకు కృషిచేసిన వారిలో వీరు ప్రముఖులు. ఈ కృషి ఫలితముగా నాటి ప్రభుత్వమువారిచే, వీరెన్నియో కడగండ్లకులోను చేయ బడిరి. సొంతడబ్బును-తాము నిర్ధనులగునంతవరకు-వెచ్చించి ప్రజాభ్యుదయ కార్యములలో పాల్గొనిరి. తుట్టతుదకు వీరి సత్యసంధతను, కార్యకుశలతను

మెచ్చుకొని పరప్రభుత్వమే; వీరికి సి. ఎస్. ఐ (C. S. I.) అను బిరుదమును, గవర్నరు శాసననిర్మాణ సభలో సభ్యత్వమును (1863), ఇచ్చి గౌరవింపవలసి వచ్చినది. వీరు ప్రత్యేకముగ సాహిత్యరంగమున కృషిచేయకున్నను, రాజకీయ సాంస్కృతిక రంగములలో వీరికృషి, జనులలో నూతనోత్తేజమును కలిగించినది క్రొత్తపోకడలకు దారి చూపినది. జనుల నూతనోత్తేజమే రచయితలను నవ్య మార్గముల నడిపించునది గదా!

వీరాస్వామయ్యగారి బంధువులును, ఒంగోలు వాసియునగు వెన్నెల *కంటి సుబ్బారావుపంతులుగారు* ఒకరు నాడాంగ్ల విద్యాభివృద్ధికై మిక్కిలి పాటు బడిరి. వీరు 1816 మొదలు 1829 వరకు చెన్నపట్టణములోని సదర్ అదాలతు కోర్టులో ఇంటర్ప్రెటరుగనుండిరి. వీరు 1820 లో క్రొత్తగా స్థాపింపబడిన మదరాసుస్కూలు బుక్కు సొసైటీకి; దేశీయ పాఠశాలలను సవరించి అందు ఇంగ్లీషు నేర్పవలెనని చెప్పుచు నొక లేఖ ఆంగ్లమున వ్రాసిరి. నవంబరు 22 వ తేదీని వ్రాయబడిన ఆ లేఖలో (ఆంధ్రానువాదము) వారిట్లు వ్రాసిరి.

"రాజధాని నగరములోను జిల్లాలలోను ప్రస్తుతము అమలులోనున్న యింగ్లీషు నేర్పువిధానము నిజమైన విద్యాభివృద్ధికి తోడ్పడునట్టిది కాదు. ఇప్పుడు (1820) మదరాసులో నున్న యింగ్లీషు ఉపాధ్యాయులలో చాల మందికి వ్యాకరణము తెలియదనియే నా యభిప్రాయము......యింగ్లీషు పాఠశాలల కొరకు ఇంగ్లీషు వ్యాకరణమును ఆయాభాషలందు బోధించుటయు, ప్రపంచ చరిత్ర ఆయాభాషలలోనికి అనువదించుటయు సామాన్య ఇంగ్లీషు సంభాషణలను తర్జుమా చేయించుటయు ఇంగ్లీషు భాషలోను తక్కినభాషల లోను వకబ్యులరీలను నిర్మించుటయు మంచి భాషాంతరీకరణములతో చక్కని కథలను ప్రచురించుటయు అవసరము "[52]

మదరాసు స్కూలుబుక్కు సొసైటీవారి నివేదిక 1823 లో ప్రకటిత మైనది. అందీవిషయము ఉల్లేఖింపబడినది. ఈ విధముగా శ్రీ సుబ్బారావు పంతులుగారు తమశక్తివంచన లేక ఇంగ్లీషువిద్యను మనదేశమున సక్రమ మార్గమున నడపించుటకు కృషి చేసిరి.

పైని పేర్కొనబడినవారందరును ఆ కాలములో ఆంగ్లవిద్య నభ్యసించి 'కుంఫిణీ' ప్రభుత్వముక్రింద ఉద్యోగములకు కుదురుకొన్నవారే. ఈ ఉద్యోగము

---

52. 'ఇంగ్లీషు చదువుల చరిత్ర' - శ్రీ దిగవల్లి వేంకటశివరావుగారు. కృష్ణాపత్రిక - 15—3—1941. (లేఖను శ్రీ శివరావుగారు తెనిగించిరి.)

లను సంపాదించుటకై వారు, ఇంగ్లీషును వయోవస్థాభేదములు లేక నేర్చుకొనుచుండిరి. వారి పద్ధతినిగూర్చి పై నుదాహరింపబడిన లేఖలోనే శ్రీ సుబ్బారావు పంతులుగారిట్లు వ్రాసిరి.

"ఇక నీ దేశపు నేటీవులకు ఇంగ్లీషుభాషను బోధించు విధానమును వర్ణించెదను. తన స్వభాష నేర్చుకొనుట ప్రారంభించిన పిదప ఇంకొకభాషను ఫలాని వయస్సులో నేర్చుకొనవలెనను నియమములేదు. ఈ దేశములో అరువదేండ్లవాండ్రు కూడ ఇంగ్లీషును నేర్చుకొనుటను ప్రారంభించుట నేను స్వయముగా నెరగుదును. హిందూదేశీయుడు ఇంగ్లీషు పాఠశాలలో జేరగనే, ముందుగా ఇంగ్లీషు అక్షరములు నేర్చుకొనును. సాధారణముగా ప్రతిదినము ఉదయము ఉపాధ్యాయు డొక స్పెల్లింగు బుక్కునుండి యొక పాఠమును వకబ్యులరిలో నొక పాఠమును ఇచ్చును. డయలాగు అను పరస్పర సంభాషణలు పూర్వకాలపు ఉపాధ్యాయులు తమ పిల్లలకొరకు తయారుచేసిన వాని నుండి ఒక పాఠమును ఇచ్చుచుండును. ఒక విద్యార్థి నూరుమాటలు నేర్చుకొని కొంచెము దస్తూరి బాగుగా వ్రాయగలిగినంతనే ఏదో యొక కచ్చేరిలో ముందుగా (ఉమేదువారీ) వాలంటీరుగా ప్రవేశించును. క్రమముగా ఆతడు తన బంధువుల ప్రాపకమువల్ల ఒక చిన్న జీతముగల ఉద్యోగము సంపాదించును"[53]

ఆ రోజులలో ఇంచుమించుగా నందరు నట్లే ఇంగ్లీషు నేర్చుకొని, వాలంటీరుగా 'కుంఫిణీ' ఉద్యోగములో చేరుచుండిరి. నాటి దొరలచేత మిక్కిలి మన్నింపబడిన శ్రీ వీరాస్వామయ్యగారు కూడ నిట్లే జీవితమును ప్రారంభించిరని, శ్రీ కోమలేశ్వరపురం శ్రీనివాసపిళ్ళగారు వీరాస్వామయ్యగారి జీవిత చరిత్రలో వ్రాసిన క్రింది వాక్యముల వలన తెలియుచున్నది. "వీరాస్వామయ్యగారు పండ్రెండవయేట యింగిలీషు బహువేగముగా చదువ శక్తి గలిగి యుండినందున అప్పుడు ఆయన వాలంటీరుగా వుండిన బోర్డు ఆఫు ట్రేడు అనే ఆఫీసులోనుండే యగ్జామినరులు యిద్దరున్ను ఆయనను రీడరుగా వుంచుకోవలెనని వివాదపడుచు వచ్చిరి"[54]

---

53. Ibidem.

54. 'ఏనుగుల వీరాస్వామయ్యగారి జీవితచరిత్ర' రచయిత : శ్రీ కోమలేశ్వర పురం శ్రీనివాస పిళ్ళగారు. కాశీ యాత్రచరిత్ర - 1941 - తృతీయ ముద్రణము. పేజీ ౧.

శ్రీనివాస పిళ్ళగారి వాక్యములనుబట్టి, వెన్నెలకంటి సుబ్బారావు పంతులుగారి వాక్యముల సత్యము నిరూపింపబడినది. ఇట్టుల దొరలతో సన్నిహితత్వమును కల్పించుకొని నాటి విద్యావంతులు మసలుటచే వారి దృక్పథమును విజ్ఞాన సంస్కృతులును క్రమక్రమముగ మారుచువచ్చి దేశమున నవీన భావ ప్రసరణమునకు నాంది యయ్యెను.

శ్రీ వీరాస్వామయ్యగారి 'కాశీయాత్ర చరిత్ర' తరువాత చెప్పదగినది శ్రీ కోలా శేషాచలకవి ప్రణీతమైన *నీలగిరియాత్ర*. ఇది నీలగిరి యాత్రకు సంబంధించినది. కాశీయాత్రవలె నిది ధార్మిక దృష్టితో చేయబడినదికాదు. కుంఫిణీ పరిపాలనా కాలములో మదరాసు ప్రభుత్వము ఏటేట వేసవిలో సపరివారముగ నీలగిరికి పోవుట ఆచారము. ఆపరివార వర్గములోనివాడైన శేషాచలకవి తన 'యాత్ర' ను మనోహరముగ గ్రాంథిక భాషలో వర్ణించెను. ఇతడు, మద్రాసు గవర్నరయిన 'ట్వీడెల్' దొరగారి యొక్క కార్య నిర్వాహక వర్గములోని వాడగు 'తామస్ సిమ్సన్' దొరగారి ఆఫీసులో ప్రధానోద్యోగియగు మాంగాడు శ్రీనివాస మొదలారియొక్క స్నేహితుడును, ఆఫీసులో గుమాస్తాయునై యుండెను. ఈతడు 1846 మేనెల 12 వ తేదీని చెన్నపురినుండి బయలుదేరి నీలగిరిలో కొన్ని నెలలుండి; తిరిగి 1847 జనవరి నెల 13 వ తేదీనాటికి మదరాసునకు వచ్చెను. ఈ యాత్రానుభవములన్నియు శేషాచలకవి చక్కగ వర్ణించెను. ఈ గ్రంథము విశాఖపట్టణములో జమీందారయిన శ్రీ గోడే వెంకట జగ్గారాయ నృపాలున కంకితము చేయబడినది. ఈ గ్రంథము మూడు ప్రకరణములు గలది. మొదటి ప్రకరణమున నీలగిరి చేరుట, రెండవ ప్రకరణమున నీలగిరిలోని విశేషములు, మూడవ ప్రకరణమున తిరుగు ప్రయాణము వర్ణితములు.

ఈ గ్రంథమును[55] మదరాసు ప్రభుత్వమువారు 1953 లో అచ్చువేసి పరిశోధకులకు మహోపకారము చేసిరి. ఇంతవరకు ముద్రణము లేకుండుటచే, కాశీయాత్ర చరిత్రకు వచ్చినట్లు దీనికి ప్రచారమురాలేదు. చిన్నయసూరి నీతి చంద్రిక (1853) కంటె ముందే ఈగ్రంథము (1846) నిర్దుష్టముగ గ్రాంథికభాషలో రచింపబడినదన్న, రచయిత ప్రతిభ తెలియును. ఈకవి రచన యందు; నాటివిద్యావంతుల పాండిత్య సంపత్తి, విజ్ఞానపటిమ చక్కగ

55. నీలగిరియాత్ర—కోలా శేషాచలకవి ప్రణీతము, మద్రాసు, 1953.

వ్యక్తము చేయబడినవి. పాశ్చాత్య విజ్ఞానవాసనావాసితుడైన రచయిత, తన రచనలో, ఆయా విషయములను చక్కగ నభివర్ణించెను.

'కాశీయాత్ర చరిత్ర' (1830) తరువాత పదునారు సంవత్సరములకు (1846) బయలుదేరిన 'నీలగిరి యాత్ర'యు నామార్గమునే త్రొక్కెను. నాడు విశేషముగ వాడుకలోనున్న ఆంగ్ల పదములు గ్రంథమున తెలుగు లిపిలో వ్రాయబడినవి. అంతియెగాక ఆశబ్దములప్రక్క తత్సమశబ్ద బహుళమైన యనువాదములును నీయబడినవి ఇది దీనివిశేషము. ఇందు ప్రస్తావింపబడిన విషయములనుబట్టి కోలా శేషాచలకవి పాశ్చాత్య శాస్త్రవిజ్ఞానమును–ముఖ్యముగ గణితమును—ఆకళింపునకు తెచ్చుకొనినవాడని తెలియగలదు. ఈగ్రంథములోగల ఆంగ్ల శబ్దముల నీక్రింద నిచ్చుచున్నాను.

(పేజీ-3) గవర్నర్ అండ్ కమాండెర్ యిన్ ఛీఫ్; హిస్ ఎక్సలెన్సీ లెఫ్టెన్ జనరలు - దీ మోష్టునోబిల్ జార్జిమార్క్వెస్ - అఫ్ - ట్వీడేల్ కే. టి. అండ్ సీ. బీ. క్వాటన్ స్ డిప్టీ ఆజీటణ - జనరల్; లెఫ్టణ కర్నల్ తామస్ సిమ్సణ పాట్, సి. బి.; ఆఫీసు; హెడ్ క్లార్కు "అనంబడు లేఖక ప్రముఖుండు": క్లార్కు "అనంబడు లేఖకుండు;" క్రైస్టు "శకము"; కాలేజి "యనం బ్రసిద్ధంబగు నధికారుల పాఠశాల"; మాగ్నెటిక్ అబ్జర్వేటొరీ "యనంబడు నయస్కాంత పరీక్షాశాల"; అస్సిస్టాంట్.

(పేజీ-4) ఎంగిలీషు ("ఎంగిలీషువారి వర్ణాచారంబున మగలకుంబోలె మగువలకుం బ్రభుత్వంబు వహించుట గలిగియుండుటంజేసి విక్టోరియా యను నామంబుగల రాజకుమారిక ... పైతృకంబగు రాజ్యంబు దాన పరిపాలనంబుచేసెడు.")

సోల్జరులు "సైనికులు"; ఆఫీసరులు "పడవాళ్ళు"; కమాండింగ్ ఆఫీసరు "అనంబడు దళనాయకుడు"; సర్జన్ "అను వెజ్జు"; చాప్లెయిన్ "అను ఒజ్జ;" బారక్స్ "అను సైనిక గృహవాటిక"; హాస్పటల్ "అను చికిత్సాశాల"; పెన్షన్ "అను అనుజీవిక"; కోర్టు.

(పేజీ-5) షెరీఫ్ ఆఫీసుమానేజరు.

(పేజీ-9) కంపెని ("ఎంగిలీషువారి దేశంబయిన యిలావృతద్వీపంబునకు యూరోప్ అనియు దానికి నీజంబూద్వీపంబు తూరుపుగా నుండుటంజేసి యీష్టిండియ యనియు నెంగిలీషు భాష వ్యవహారింపఁబడు చుండు. అట్టి యీ తూరుపు జంబుద్వీపంబు నెంగిలీషు దేశాధికారిణియగు రాణి

యొద్ద గుత్తకొని యేలుచుండువారి యుమ్మడిసభ ఈష్టిండియ కంపెనీ యని చెప్పంబడుచుండు. అట్టి ఈష్టిండియ కంపెనివారు కంపెనివా రనియుం బర్యాయంబుగ వ్యవహరింపంబడియున్నారు.")

(పేజీ-13) మయిలు ("మయిలనఁగా నెంగిలీషుగడియ; ఒక మయిలునకు (౧౭౬౦) వేయి నేడు నూటయరువది గజంబులు. గజమొక్కటికి మూఁడు అడుగులు. అడుగొకటికిఁ బదిరెండంగుళములు".

(పేజీ-14) కలెక్టరు.

(పేజీ-16) పోలీసు; సెషన్‌కోర్టు.

(పేజీ-17) కాఫీ (Coffee) "ఆశిలోచ్చయంబుపై నెంగిలీషు భాషఁ గాఫీ యని పేర్కొనంబడు బీజవిశేషంబులు మెండుగఁ బండుచుండు." మిస్టర్ ఫిషర్ - వాణిజ్యము చేయు దొర; ఏజంటు "అను కార్యకర్త."

(పేజీ-18) మేగ్డనాల్డ్ సత్రము.

(పేజీ-29) హోటల్ "అనంబడు పూటకూళ్ళ చావడి", లార్డ్ ఎలిఫినిష్టోన్;

(పేజీ-30) జార్జి జేమ్సు కాస్ మేజర్.

(పేజీ-31) నీలగిరి హిల్స్; నీలగిరిస్; బ్లూమవుంటెయిన్; జాయింట్ మేజిస్ట్రేట్

(పేజీ-32) షాపు; క్లబ్‌హవుస్ "అనంబడు పూటకూళ్ళు వెట్టించువారి సభా సదనము".

(పేజీ-34) ఎంగిలీష్ రెడిష్: బీట్‌రూట్; నోల్‌కోల్; టర్నిప్స్; కాట్రాట్; స్పినేజ్, కాబ్బేజ్, కాలీఫ్లవర్, విజిటబిల్‌మారో, రాస్‌బెటీ; మెల్‌బెటీ: స్ట్రాబెటీ-వియట్లుస్ట్రాబెటీ; బ్లాక్‌బెటీ; హిల్‌గూస్‌బెటీ; పీచ్చెస్; పియర్: ఆప్పిల్.

'ఎంగిలీషు రెడిష్' మొదలుగాఁగల ఈ ఆంగ్లనామములుగల శాకములను ఆంధ్రములో రచయిత వ్యాఖ్యానించెను నీలగిరిలోఁగల వివిధ జాతులనుగూర్చి వ్రాసి, కొందరు పార్వతేయులు, ఇంగిలీషు ప్రభువులకు బట్లర్, క్లోత్‌కీపర్ అను పనులు చేయుచుందురనియు వ్రాసెను. (పేజీ-39)

నీలగిరిలో 'షాపు'లలో దొరకెడు వివిధ వస్తువులను గూర్చియు, ఆ ఊరిలోఁగల వివిధ పాశ్చాత్య సంస్థలనుగూర్చియుకూడ నిందు రచయిత వ్రాసెను.

(పేజీ-44) బాంక్ ("ప్రాన్సెస్ లాస్పెలస్ అను దొర కుమారుడు...క్రొత్తగా బాంక్ యనంబడు నొక కొఠీని ప్రతిష్ఠించెను.")

(పేజీ-45) బ్రాండి; జిన్; రమ్; సివిల్, మిలిటరీ; వయిన్; స్టాకింగ్సు "అనం బడు కాలి తొడుగులు;" గ్లోవ్సు "అనంబడు చేతొడుగులు."

నీలగిరిలో చలి యధికమగుటచే పైవి ధరింప వలసి వచ్చెనని కవి వ్రాసిన ఘట్టమిది. నీలగిరిలో రచయిత కొన్ని నెలలు నివసించుటచే; ఇచ్చటి దేశీయుల, విదేశీయుల, జీవిత విధానమునుగూర్చి చక్కగ వ్రాయగలిగెను. మంచు గురియు ప్రదేశములను వర్ణించుచు నింత చక్కగ వ్రాయబడిన గ్రంథ మింకొకటి తెలుగులో లేదనుట అతిశయోక్తి కాదు. చలివలన దేహము యొక్క అనావృతాంగములు చిటులునని వ్రాయుచు, దొరలుపయోగించు 'నవనీత కృతౌషధంబు'ను గూర్చి ఇట్లు వ్రాసెను.

(పేజీ-49) కోల్డుక్రీమ్ (Cold Cream) "మంచు గురియు గడియలలో నున్ని తొడుగు లెన్ని యేసిం దొడిగికొని బాహిరంబుగానక గర్భాగారంబుల నున్నవారలకేని వదనంబులును రదన చ్ఛదనంబులుం జిటులుచుండు. దానిని మానుపవేడి యింగిలీషువారు కోల్డుక్రీమ్ అని పేర్కొనంబడిన నవనీత కృతౌషధంబు ప్రాతస్సాయంబుల స్నానానాధరంబునకుఁ బూసి కొనియెదరు."

"నీలగిరియాత్ర" చరిత్రను రచించిన కోలా శేషాచలకవి పాశ్చాత్య గణిత, ఖగోళశాస్త్రములలో పరిశ్రమ చేసినవాడు. ఈతడు పదార్థ విజ్ఞాన శాస్త్రమునను గణితశాస్త్రమునను నిష్ణాతుడు.[56] పాత్రలలోనున్న నీరిగురుటకును పాత్రల మూతుల వ్యాసమునకుగల సంబంధమును గూర్చి వ్రాయుచు, "విరివి వ్యాసంబునకు వర్గువుగావునఁ బాత్ర ముఖంబు విరివికొలఁదియ జలం బెగసి పోవుచుండు"[57] నని వ్రాసి తన శాస్త్ర పరిజ్ఞానమును తెలిపెను.

శేషాచలకవి ఈ గ్రంథమున; భూగోళ ఖగోళ శాస్త్రాదులకు సంబంధించిన విషయములనేగాక, వివిధ జాతుల ప్రజలనుగూర్చియు, జంతువులను గూర్చియు కూడ వ్రాసెను. వాతావరణమునకు సంబంధించిన విషయముల నెన్నింటినో తెలిపెను ఈ విధముగా ఈ రచన ఆతని ప్రతిభా సంపత్తిని, నాటి విద్యావంతులపై పాశ్చాత్య విజ్ఞాన ప్రభావముయొక్క ప్రమాణమును తెలుపుటకు నుపయోగించునది.

---

56. "....మాంగాడు శ్రీనివాస మొదలికి గణితశాస్త్ర శిక్షితుఁడు...." (నీలగిరి యాత్ర. 1953. పుట-78)

57. నీలగిరియాత్ర; 1953. Foot Note- పుట-51.

శేషాచలకవికి ఇంగ్లీషుభాష బాగుగా తెలియును. వారి తిరుగుప్రయాణములో, తమ మిత్రుడగు మాంగాడు శ్రీనివాసమొదలితో కలిసి వచ్చుచు, నొక ధర్మశాలలో బసచేయ నిశ్చయించి, శేషాచలకవి యందు ప్రవేశింప నెంచగా అచ్చటి ఉద్యోగులు కొందరు వీరినాటంకపరచిరి. అయ్యనుచితకార్యమును గర్హించుచు, శేషాచలకవి మిత్రునితో గలిసి, కలెక్టరున కొక లేఖ ఆంగ్లములో వ్రాసెను. 'నీలగిరి యాత్ర'లో నా విషయము నిట్లు ప్రస్తావించెను.

"దాని (ధర్మసత్రము) నెన్నఁడేని నధ్వనీనుల కుపయోగింపనీక న్యాయంబులేక యచ్చటి తాలూకు కచ్చేరి యుద్యోగస్థు లాక్రమించుకొని యున్నారు. కాన నేను నా నెచ్చెలికాఁడు నన్ననుగమించిన మఱియొక యాఫీసు లేఖకుండును జేరి యయ్యనుచితకార్యం *బింగిలీషుభాష* లిఖయించి ఈ జిల్లా *కలెక్టరగు మేష్టర్ లాక్ హార్ట్* గారికి నంచెలలోఁబంపితిమి."[58]

ఈకవి చెన్నపట్టణమును గూర్చి చెప్పినప్పుడు, దానియునికిని భౌగోళికముగ నిట్లు తెల్పెను.

"సకల చరాచర సమితి కాధారమై యమరు నీభూమండలమున నెల్ల
కాలంబునఁ బవళ్ళు రేలు సమానంబులై యొప్పు నెయ్యెడ నయ్యదియెని
రక్ష ప్రదేశంబుననియు విష్కంభ రేఖయునని విఖ్యాతి గనియెనాని
రక్ష ప్రదేశంబుయాదిగ సరి యుత్తరాశఁ బ్రయోదశాక్షాంశములును
నలు కళలష్టవికళల దూరమునఁగల్గెడు పూర్వ పశ్చిమలేఖయందు
వినుఁడు గంగామహాద్వీపవతీతట ప్రాంచిత కాళికా పట్టణమున
నంబుజ బంధుఁ డుచ్చంబునయందుఁ గానంబడు వేళకనంతరమున
నిరువదియును నేడునరయును బరక విఘటిక కుచ్చమున నెచ్చటనుగాన
బడదు నచ్చటఁ గడుపొడవగు రాజధ్వజము గలదై .........
......చెన్నపురంబు......"[59] కలదని కవి వర్ణించెను.

ఈ గ్రంథమునకు కృతిభర్త విశాఖపట్టణ వాస్తవ్యుడైన, శ్రీ గోడే వేంకట జగ్గరాయనృపాలుడు. ఆరోజులలో విద్యావంతులైన జమీందారులలో నితడొకడు. ఈత డాంగ్లభాషను చెన్నపురియం దభ్యసించుటయేగాక, పాశ్చాత్య విజ్ఞాన శాస్త్రములయందు కూలంకషముగ కృషిచేసినవాడు. ఈతనినిగూర్చి కవి యిట్లు వ్రాసెను.

---

58. నీలగిరియాత్ర; 1953. పుట-68.
59. నీలగిరియాత్ర; 1953; పుట-71.

"ఆ విశాఖ పురంబునం గాపురంబుం డు కోటీశ్వరుండగు గోడే సూర్య నారాయణ రాయేశ్వరుని యగ్రతనూభవుండు శ్రీ వేంకట జగ్గారాయవిభుండు బుధవిధు నిభ విభవుండు నిజ జనకాదేశంబున నీ దేశంబున నెంగిలీషు భాషా భ్యాసనం బభిమతంబుగ నిరువది వత్సరంబులకు మున్నువచ్చి యిచ్చెన్నపట్ట ణంబు వత్సరాష్టకం బధిష్ఠించి యనంతరంబ నిజపురంబధిగమించి యచ్చట నిచ్చలుఁ బెచ్చు పెరుగు నిఖిల సుఖంబు లనుభవించుచుండెడు."[60]

శ్రీ గోడే వేంకట జగ్గారాయవిభుని పాండిత్యమునుగూర్చి కవి యిట్లు వర్ణించెను.

"సరవి సామాన్య బీజక్షేత్రఘాతక
ఛ్ఛియాగణితనామ శాస్త్రవిదుఁడు
దృక్సిద్ధ శాస్త్ర సమిద్ధ బలాబల
తావిద్యమాన సిద్ధాంతవిభవ
శాలి జ్యోతిశ్శాస్త్ర చతురుఁడు భూవియ
ద్గోళపరజ్ఞాన కుశలధీని
ధియు వస్తుతత్త్వ నిర్ణయశాస్త్ర దక్షుఁడు
తర్కశాస్త్రమునఁ దద్దయు నిపుణుఁడు
వెండి వివిధ మత గ్రంథవేత్త బహుక
ళావిదగ్ధుఁడు సంగీత కోవిదుండు
మహితమతి బంగరయ్యమాంబామనఃప్రి
యుండు వేంకట జగ్గరాయోత్తరుండు."[61]

శేషాచలకవి కాలములో విద్యావంతులైన ఆంధ్రుల విజ్ఞాన వైశాల్య మును చక్కగా గ్రహించుటకీ నీలగిరియాత్ర ఉత్తమ తార్కాణము.

---

60. నీలగిరియాత్ర. 1953. పుట-75.

కవి విశాఖపట్టణము యొక్క ఉనికి నిట్లు భౌగోళికముగ తెల్పెను.

"ఇమ్మహీమండలి నెసఁగు విరక్షస్థలంబాదిగా నుత్తరంబు నందుఁ బదియునునేడక్ష భాగముల్నలు వది రెండు కళల యెడనుండు ప్రాక్ప్రతీచిరేఖయు దిగ్మదీధితి చెన్నపురమున నుచ్చస్థితి నమరుకాల మునకన్న మున్నుగా ముప్పదొక్కటియు ముక్కాలు మువ్విసముంగాణీవిఘటిఁ కకు నినుండుచ్చ సంగతిగాంచునట్టి, దక్షిణోత్తరరేఖయు దగులుచోటఁ గోటయమరినదై శుభకోటి కాటపట్టయితనర్చును విశాఖపట్టణంబు."

(నీలగిరియాత్ర 1953. పుట-74)

61. నీలగిరి యాత్ర. 1953 పుట-75.

విషయ విస్తృతినిబట్టియు, రచనా పాటవమును బట్టియు వీరాస్వామయ్యగారి కాశీయాత్ర (వీరు 1830 మే నెల 18 వ తేదీని చెన్నపట్టణము నుండి బయలుదేరిరి.) చరిత్ర (ప్రథమ ముద్రణము 1838) తరువాత, శ్రీ కోలా శేషాచలకవి 'నీలగిరియాత్ర' (వీరు 1846 మే నెల 12 వ తేదీని చెన్నపట్టణము నుండి బయలుదేరిరి.) ప్రస్తుతింపబడినను (ముద్రణము 1953); దీనికంటె ముందే శ్రీ బేతపూడి సుందరరాయనిగారి నీలగిరియాత్ర జరుగుటయు (వీరు 1846 జనవరి నెల 10 వ తేదీని చెన్నపట్టణమునుండి బయలుదేరిరి.) యాత్రా విశేషములను వారు 'నీలగిరి చరిత్ర' అనుపేర పుస్తకముగ ముద్రించుటయు (1864) జరిగెనని గ్రహింపవలసి యున్నది.[62] వీరు మదరాసు కాలేజి

---

62. 'నీలగిరి చరిత్ర' ముఖపత్ర మిట్లున్నది.

తెనుఁగుభాషఁ జదువదొరకొను విద్యార్థుల
గు యూరోపు ఇండ్యాదేశస్థులకు లోక వ్యవహారా
నుసారముగ నా భాషయందు విశేష జ్ఞానము గలుగు
టకు నుపయుక్తమైన యీ నీలగిరి చరిత్రమనెడి గ్రం
థమును సాధారణమగు మాటలతో సులభమైన సం
ధితోఁజేసి దీనితోడను వ్యవహారిక విషయమైన కొన్ని
అర్జీలను జేర్చి ఆంధ్రద్రవిడ భాషల నభ్యసించి
వ్యవహరించు చుండెడి - కలకత్తా - బొంబై - చెన్న
పట్టణము - మొదలైన రాజధానులయందు స్వప్ర
వీణతవలన ఘనతఁబొంది ప్రసిద్ధికెక్కిన మహారా
జ రాజశ్రీ ఆనరేబిల్ - ఆర్ - యెన్ - ఎల్లీసు - సి - బి -
దొరగారిపేర నంకితమొనర్చి వారి యుత్తరువుమీఁ
దఁ జెన్నపట్టణపు లేట్ కాలీజ్ సర్టిఫికేట్ తెలుఁ
గు మునిషియైన బేతపూఁడి సుందరరాయనిచేత
వాక్యరూపంబుగ రచియింపంబడి -
చెన్నపట్టణము - శాలవీధి - డోరు నె ౬౩ గల గృహమందు
శంకర॥ వెంకట్రావు -
అబ్బరాజు॥ వెంకట్రాయలగార్ల -
స్వకీయ్యంబగు
వివేక విద్యానిలయ ముద్రాక్షరశాలయందు
ముద్రింపించి ప్రచురింపబడియె -
౧౮౬౪ సం॥ అగుటోబరు నెల -
దీనివెల అణాలు (౧౨).

"ఆ విశాఖ పురంబునం గాపురంబుండు కోటీశ్వరుండగు గోడే సూర్య నారాయణ రాయేశ్వరుని యగ్రతనూభవుండు శ్రీ వేంకట జగ్గారాయవిభుండు బుధవిధు నిభ విభవుండు నిజ జనకాదేశంబున నీ దేశంబున నెంగిలీషు భాషా భ్యసనం బభిమతంబుగ నిరువది వత్సరంబులకు మున్నువచ్చి యిచ్చెన్నపట్ట ణంబు వత్సరాష్టకం బధిష్ఠించి యనంతరంబ నిజపురంబధిగమించి యచ్చట నిచ్చలుఁ బెచ్చు పెరుగు నిఖిల సుఖంబు లనుభవించుచుండెడు."[60]

శ్రీ గోడే వేంకట జగ్గారాయవిభుని పాండిత్యమునుగూర్చి కవి యిట్లు వర్ణించెను.

"సరవి సామాన్య బీజక్షేత్రఘాతక
 చ్ఛియాగణితనామ శాస్త్రవిదుఁడు
దృక్సిద్ధ శాస్త్ర సమిద్ధ బలాబల
 తావిద్యమాన సిద్ధాంతవిభవ
శాలి జ్యోతిశ్శాస్త్ర చతురుఁడు భూవియ
 ద్గోళపరజ్ఞాన కుశలధీని
ధియు వస్తుతత్వ నిర్ణయశాస్త్ర దక్షుఁడు
 తర్కశాస్త్రమునఁ దద్దయు నిపుణుఁడు
వెండి వివిధ మత గ్రంధవేత్త బహుక
శావిదగ్ధుఁడు సంగీత కోవిదుండు
మహితమతి బంగరయ్యామాంబామనఃప్రి
యుండు వేంకట జగ్గరాయోత్తరుండు."[61]

శేషాచలకవి కాలములో విద్యావంతులైన ఆంధ్రుల విజ్ఞాన వైశాల్య మును చక్కగా గ్రహించుటకీ నీలగిరియాత్ర ఉత్తమ తార్కాణము.

---

60. నీలగిరియాత్ర. 1953. పుట-75.

కవి విశాఖపట్టణము యొక్క ఉనికి నిట్లు భౌగోళకముగ తెల్పెను.

"ఇమ్మహీమండలి నెసఁగు విరక్షస్థలంబాదిగా నుత్తరంబు నందుఁ
బదియునునేడక్ష భాగముల్నలు వది రెండు కళల యెడనుండు ప్రాక్ప్రి
తీచిరేఖయు దిగ్మదీధితి చెన్నపురమున నుచ్చస్థితి నమరుకాల
మునకన్న మున్నుగా ముప్పదొక్కటియు ముక్కాలు ముప్వీసముంగాణివిఘటిఁ.
కకు నినుండుచ్చ సంగతిగాంచునట్టి, దక్షిణోత్తరరేఖయు దగులుచోటఁ
గోటయమరినదై శుభకోటి కాటపట్టయితనర్చును విశాఖపట్టణంబు."

(నీలగిరియాత్ర 1953. పుట-74)

61. నీలగిరి యాత్ర. 1953 పుట-75.

నీలగిరిచరిత్రతో ప్రత్యక్షసంబంధముకలవి కావు. పుస్తకము అచ్చు వేయునపుడు రచయిత చేర్చియుండును.

ఈ రచయిత వీరాస్వామయ్యగారి కాశీయాత్ర చరిత్ర (మొదటి ముద్రణము 1838) చూచినాడనుటకు తార్కాణముగా; కాశీయాత్ర చరిత్ర మొదటి వాక్యమునకు నీలగిరిచరిత్ర ప్రథమ వాక్యమునకుగల పోలికను, గ్రహింపవచ్చును.

*కాశీయాత్ర చరిత్ర :* "జగదీశ్వరుండు నాచేత కొంత దేశాటనము జేయింప దలచి......దొరలగుండా సెలవిప్పించినాడు గనుక నేను కాశీయాత్ర బోవలెనని......చెన్నపట్టణము విడిచి మాధవరము చేరినాను"

*నీలగిరి చరిత్ర :* "పరమేశ్వరుండు నాకు కొంతదేశము చూపించుటకై...... దొరగారలతోను మొదటి పరియాయం నీలగిరికి పోవడమునకు నాజ్ఞాపించినాడు - గనక నేను అక్కడికి పోవలెనని......చెన్నపట్టణము విడిచి పూనుమల్లి దోవలోవుండే మురగప్ప మొదల్యారి సత్రములో ప్రవేశించినాను."

సుందరరాయుడుగారు, తన మిత్రుల కోరికపై ఈ నీలగిరి చరిత్రను వ్రాసినట్లు గ్రంథారంభమున మార్గ పద్ధతిలో నిట్లు వ్రాసిరి. "నాకు ముఖ్యముగా వున్న విహితులలో కొందరు ప్రార్థన పూర్వకముగా సెలవిచ్చినది యేమనిన యిప్పుడు మీరు నీలగిరికి పొయ్యే మార్గాంబుననున్న బస్తిగ్రామ చరియలున్ను ఆ కొండమీద జరిగెడి చరియలున్ను వచన పూర్వకముగా సంధి నియమము లేక నూతనముగా విద్యను అభ్యసించే వారలకు సులభముగా అర్థమయ్యేటట్లు ఒక సమాచార పత్రిక వ్రాశి అంపిస్తె అదిచూచి చదువుకొని ఆనందిస్తూ వున్నామని చెప్పినారు..." (పుట-౧)

ఈ రచనకు 'సమాచార పత్రిక' అని వాడుట, వీరాస్వామయ్యగారు తన రచనను 'జర్నల్' అనుట చూడ, నాడీమాట, ఇట్టి రచనలకు సామాన్యముగా వాడబడుచున్నట్లు తోచుచున్నది.

ఈ గ్రంథములో 'కాలేజి వృత్తాంతము' అను శీర్షికక్రింద రచయిత, తన్నుగురించియు, నాటి ప్రాచ్య పాశ్చాత్య విద్యావంసులను గూర్చియు వ్రాసినది; నాటి పరిస్థితులను చక్కగా తెలుపునది గనుక, దానిని విపులముగా నుదాహరించుచున్నాను.

"నేను మచిలీపట్టణమునుంచి వచ్చి చెన్నపట్టణపు కాలేజీయను పాఠశాల యందు ప్రవేశించి సంస్కృతము - తెలుగు - ఇంగిలీషు - యీ మూడు భాషలు అభ్యసించుటకై సర్కారువారివల్ల - నెల ౧ కి - రూపా ౧౫- జీతము గల కల్కటరే టీచర్ పనిలో యేడు సంవత్సరములు వుంటిని - తరువాత గౌరన్మెంటు రిడక్షన్ లో ౧౮౩౭ సంవత్సరములో ఆపని నిల్చినది - వెంటనే- ఏ-డీ-క్యాంబిల్ దొరగారి ప్రాపకమువల్ల కేపటన్ హాల్మాండ్ సన్ దొర శక్ర జేరిగా వుండేటప్పుడు తిరిగి కాలేజీలో ప్రవేశించి మునిషి పనులవల్ల జీవనము జరుపుకొంటూ - దొరలవద్గర యోగ్యతా పత్రికలను పొందుతూ బహుకాలము జరిపినాను - ఇదిన్నిగాక యీ చెన్నపట్టణపు రాజధానికి వచ్చే దొరలు సదరహి కాలేజ లోనే కొందరు మునిషీలవల్ల ఆయా దేశభాషలు చదివి - ఆదినుంచి తెలుగు పరిజ్ఞాధికారులగు దొరలలో మహారాజ శ్రీ-జాన్-మక్కెరల్-ఏ-డీ-కెంబెల్ - జె-సి-మారిసు- సి-పి-బ్రౌన్- జే-డీ-సిం-కేష్టన్- జే- సి- మగ్డానల్ అనే దొరలవల్ల - వారి దగ్గిర హిందువులలో పరంపరగా సన్నిధానవర్తులున్ను ఇంగిలీషు సంస్కృతాంధ్ర భాషలయందు పూర్ణపండితులున్నగు - శ్రీ- సైదా పేట- మీనాక్షయ్య - రావిపాటి - గురుమూర్తిశాస్త్రి - అడక్కి - సుబ్బ రావు - శ్రీ పెరుంబుభూఘూరు - కృష్ణమాచార్యులు - రావిపాటి - గురు వయ్య వీరి ద్వారా పరిక్షింపబడి యోగ్యతా పత్రికలు వహించి వారివారి హోదాల ప్రకారము - దొరలు - ఆయా జిల్లాలకు - సర్వాధికారులుగా గవరన్మెంటువారి వలన నియమింపబడి వ్యవహరిస్తూ వుందురు - మరిన్ని - హైయిస్కూలనే - హిందూ పాఠశాలయందు - ఇంగిలీషులో సకల విద్యా పారంగతులయిన - ఇ-బి-పవల్ - అనే ఇంగిలీషు దొరగారు పైన చెప్పిన రాజధానిలో ప్రవేశించుటవలన - సమస్తమైన హిందువులకు ఇంగిలీషు పాండి త్యము కలగజేసి - ఆ భాషయందు వుండే సకలశాస్త్రముల యందున్ను యోగ్యతల కలగచేసినారు - అందువల్లనే హిందూదేశస్థులందరున్ను ఆ దొర గారి పేరు చెప్పుకొని కష్టపడి చదివి యోగ్యతా పత్రికలను పొంది పైన జెప్పిన రాజధానిలో చేరిన ఆయా జిల్లాలలో గొప్ప హోదాలను కలగచేసు కొని సౌఖ్యములను జెందుతున్నారు." (నీలగిరి చరిత్ర ; పుటలు - ౨౫, ౨౬)

నాటి గ్రంథము లన్నింటియందును వలె - గ్రాంథికములో నున్నను, వ్యావహారికములోనున్నను- నీలగిరి చరిత్రయందును, వాడుకలోనున్న ఇంగ్లీషు మాటలన్నియు యథాతథముగ ప్రయోగింపబడెను. వానిలో ముఖ్యమయినవి-

కాలేజిబోర్డు, హేడ్డశిష్టాంటు, కుంపిణి, ఇంగిలీషు, కల్కటరు, కోటుఁ, కాఫీ, సారట్లు, యెంగిలాండు, గౌరన్మెంటు, పాదరి, కాళిప్ల (Cauliflower), కారటు, లఁడఁ, కామ్మేజరు, డాసఁహోటల్, క్లబ్బు మొదలగునవి.

ఇందు ఈ క్రింది ఆంగ్లేయోద్యోగులు పేర్కొనబడిరి : అ. ఓగిల్వి ; ఆర్. యస్. యెల్లీసు (వీరిరువురకు తెలుగు చెప్పుటకే బేతపూడి సుందర రాయడుగారు నీలగిరికి పోయిరి.)

జె. డబ్బిల్‌యు. బి. డైక్సు (ధర్మపురికి హేడ్డశిష్టాంటు. ఈ దొరను గూర్చి రచయిత, "అదివరకు నాకు కాలీజి విహితుడైన మహారాజశ్రీ-జె-డబ్బిల్‌యు-బి-డైక్సు దొరగారు హెడ్డశిష్టాంటు హోదాలో అక్కడ కచేరి చేశియున్నారు," అని వ్రాసెను. ఈదొర, నీలగిరివరకు రహదారి జవానును సుందరరాయుడుగారికి తోడిచ్చి, సాయపడెను.)

పిషర్‌దొర (సేలంజిల్లాలో మంచి వర్తకుడు. "ఆజిల్లాలో - పిషర్‌దొర గారి వర్తఁకము యిప్పటికిన్ని గలదు".)

జాఁ క్లఁటఁ ఉమ్ (నీలగిరిని, ఆంగ్లేయులకు వాసయోగ్యమైనదని గ్రహించిన ప్రథమ పాశ్చాత్యుడు) ఛల్వాన్ (అప్పుడు కోయంబుత్తూరు కలెక్టరు, ఈతడు నీలగిరికి మార్గనులు వేయించి, ఇండ్లు కట్టించి, వాసయోగ్యమగునదిగ చేసెను. ఆతనికృషిని మెచ్చుకొని, "లన్‌డన్-అనే పట్టణములోవున్న సభ" వారు, "ఆఛల్వాను దొరగారికి - చెన్నపట్టణపు రాజధానికి - రెండవ అధికారము నిచ్చిరి.")

మంట్రోల్‌దొర (సర్‌థామస్ మన్రో - నాడు మదరాసు గవర్నరు. ఛల్వాన్‌కృషికి మంచి ప్రోత్సాహమిచ్చెను.)

సుందరరాయుడుగారు నీలగిరిపోవునాటికి (1846) రైలుమార్గము లేదు. కనుకనే ఆయన శ్రమపడి కొండలెక్కుచు దిగుచు పోవలసి వచ్చెను. పుస్తక మచ్చుగునాటికి (1864) రైలుమార్గము పడియుండెను. కనుకనే ఆయన 'కాలేజి వృత్తాంతము'లో చివర, "చెన్నపట్టణమునుంచి సదరు పొగబండిమీద యెక్కి పొయ్యేవారికి నీలగిరి మార్గఁము బహుసులభము. రెండు దినములలో ఆ కొండమీదికి పోవచ్చును. యిప్పట్లో పొగబండి యేర్పఁడుటవల్ల వర్తఁక విషయమైన సరుకులు త్వరగా రావడమే కాకుండా - యాత్రాపరులకుకూడా మార్గాఁయాసముచెందక బహుసులభముగా రాకడపోకడ్లు కలిగివుందురు;" అని వ్రాసిరి.

అవి రైలుబండ్లువచ్చిన క్రొత్తరోజులు. తంతివార్తలు ప్రారంభమయిన తొలినాళ్లు.[63] ఈపాశ్చాత్య విజ్ఞానమునకు విద్యావంతులందరు సమ్మోహితులై, ఇంగ్లీషువారిని 'చోద్యము'గా చూచుచున్న దినములవి. ఈవిషయము, సుందర రాయడుగారి 'కాలేజి వృత్తాంతము' లోని ఈ క్రింది వాక్యముల వలన తెలియును.

"మరెన్ని - యీ ఇంగిలీషు ప్రభుత్వములో యింకొక చోద్యము కద్దు- అది యెల్లంటేను - లోకమందున - వాయువేగ - మనోవేగంబులను రెండు వేగములు గలవు - వాయువేగమునకు సమానమైన పొగబండి ఇంగిలీషువారు యేర్పరచి దానిమీద - నర - పశు - పక్షి - మృగాదు లయిన జీవరాసుల నున్ను రాళ్ళు - కర్రలు - ఆహారమున కుపయుక్తమయ్యే సమస్తమైన నిర్జీవ వస్తువులనున్ను - యెక్కించి వుదకాగ్నుల సహాయముగల వారయి - భూమి యాధారము చేసుకొని తూర్పు సముద్రమునుంచి పడమటి సముద్రము వరకు నీటిమీద పొయ్యే ఓడవలెనే పైన జెప్పిన పొగబండి నడిపిస్తూ వుందురు- మనోవేగమునకు సమానమయిన ఒక రాగితంతిని నిర్మించి దానిగుండా సమాచారములు తెప్పించుకొనే విద్యను గ్రహించి యెక్కడెక్కడనుంచి వర్తమానములు తెచ్చేలాగున సదరు తంతిని యేర్పాటు చేశినారు - పైన జెప్పిన యీ రెండు యుక్తులు గ్రహించిన యింగిలీషువారి ప్రజ్ఞను చెప్ప డానకు మానవుల కలవిగాదు."

(నీలగిరి చరిత్ర; కాలేజి వృత్తాంతము; పుట - ౧౬)

నాటి విద్యావంతులపై గల పాశ్చాత్య విజ్ఞాన సంస్కృతుల ప్రభావమును గుర్తించునప్పుడు మనము జ్ఞప్తియందుంచుకొనవలసిన దొకటి కలదు. ఆనాటి కింకను ఆంగ్లభాషా సాహిత్యపఠన పాఠనములు—సార్వజనీన విద్యావిధాన మములులోనికి రాకుండుటచే—దేశవ్యాప్తము కాలేదు. కనుక, దొరలతో సన్నిహిత సంబంధముండి ప్రభుత్వోద్యోగములను నిర్వహించుచున్న వీరా స్వామయ్యగారు మొదలైన వారిపై పడిన ప్రభావమునకును, దేశీయపండితులైన జూలూరు అప్పయ్య శాస్త్రిగారు మొదలైన వారిపై పడిన ప్రభావమునకును ఈషద్భేదము కలదు. రెండవవారిపై, ఆంగ్లభాషా పదజాలము యథా

63. "In 1853 the first railway began running; in 1854 the first telegraph line was opened and the modern postal system was installed." (Mechanism and Transport, a chapter by L. S. S. O' Malley, C. I. E.; in the book Modern India and the West, edited by him in 1941; Oxford University Press. Page-225.)

వ్యవహారముగ నుపయోగించు నేర్పు కల్గువరకే, ఆ ప్రభావము పడినదన వచ్చును. మొదటివారిపై ఈ ప్రభావము హృదయదఘ్నముగ పడినది. నాటి విద్యావంతులపై పడిన పాశ్చాత్య విజ్ఞాన సంస్కృతుల ప్రభావమును, లోతుగా పరిశీలించునప్పుడు, ఈ సత్యమును మరువరాదు.

పందొమ్మిదవ శతాబ్ది పూర్వార్ధమున సుప్రసిద్ధ కవులైన పిండిప్రోలి లక్ష్మణకవి, శిష్టు కృష్ణమూర్తికవి అనువారు, తమ ప్రౌఢ రచనలలో ఇంగ్లీషు మాటలను ప్రయోగింపకున్నను, చాటుధారలలో వానిని యథేచ్ఛముగా గించిరి. ఇది నాటి శిష్టాచారమునకు చక్కని తార్కాణము.

'రావణదమ్మీయము' అను నామాంతరముగల 'లంకా విజయము'ను రచించిన పిండిప్రోలి లక్ష్మణకవికి, నాడు వ్యవహారములో నున్న ఇంగ్లీషు మాటలు తెలియుననుటకు తార్కాణముగా; సి. పి. బ్రౌనుదొర యొద్దకుపోయి, తన కనుకూలముగా వ్యాజ్యమునకు తీర్పు నిండని ప్రార్థించు సందర్భమున ఆతడు చెప్పిన పద్యములను చూపవచ్చును. లంకావిజయము పదునెనిమిదవ శతాబ్ది తుదిని[64] రచింపబడినదయినను, కవి పందొమ్మిదవ శతాబ్ది పూర్వార్థములో చాలవరకు జీవించి యుండెననుట కీ పద్యములే నిదర్శనము.

లక్ష్మణకవికి మంగన్నయను మేనల్లుడొకడు కలడు. మంగన్నకు జ్ఞాతులతో, దత్తత విషయమై వ్యాజ్యమువచ్చెను. ఆ వ్యాజ్యమున, శంకరమంచి అనంతపంతులను న్యాయాధికారి లంచము పుచ్చుకొని, మంగన్నకు వ్యతిరేకముగ తీర్పిచ్చెనట! దీనిని గర్హించిన లక్ష్మణకవి—

"మహనీయ శంకరమంచి గోత్రమునఁ బ్ర
పాతకుండన ధరిత్రీతలమునఁ
బండితుండువలెఁ గన్పడుదు స్థాణుత్వ మే
ర్పడ నొక సాధులపలుకు వినవు
పుక్కిట విషమె యెప్పుడు నీకు నుండును
మది వీడవెపుడుఁ దామసగుణంబు

---

64. "....అని యిష్టదేవతావందనంబును, కుయ్యేరుపుర వర్ణనంబును....గావించి యే నొక్క ప్రబంధంబు నవరస భావార్థ లక్షణానుబంధంబుగా నూహించి కల్యబ్దములు 4898.... ఇంగ్లీషు సంవత్సరంబులు 1797........అగు పింగల సంవత్సర శ్రావణమాసములో రచియింప నుద్యోగించియున్న సమయంబున...."

(లంకావిజయము - అవతారిక; 1877 ముద్రణము - కాకినాడ.)

భీముఁ డుగ్రుఁడు నను పేరుగాంచినట్టి
వంటికాపతివి బ్రహ్మాద్యుఁడవు న
నంతనాముండ వరయంగ నష్టమూర్తి
వగుచుఁ బితృవనమందు భస్మాంగుఁడవయి
భూతములును పిశాచముల్ బ్రోదిగూడు
కొనఁగ నుండుదు వండ్రు నిన్ జనములెల్ల"[65]

మొదలయిన పద్యములతో, న్యాయాధికారిని దూషించి, తరువాత మంగన్నచే, తీర్పునకు అపీలుచేయించి; రాజమహేంద్రవరమున మండల న్యాయాధిపతిగ నున్న బ్రౌనుదొరను దర్శించి, పద్యములో దొరపేరు కూర్చి, ఇట్లు చదివెనట!

"మధువైరికిన్ వనమాలికిఁ గౌస్తుభ
హారునకును సంశ్రితావనునకు
రాధికాప్రియునకు రామసోదరునకు
జగదీశునకు దయాసాగరునకు
శ్రీనాథునకును రక్షితదేవసమితికిఁ
బ్రౌఢభావునకు నారాయణునకు
సురగేంద్రతల్పున కరిశంఖధరునకుఁ
బొగలరాయని గేరు మొగము దొరకు
రణ నిహత దుష్టరాక్షస రమణునకును
గాన మోహిత వల్లవీకాంతునకును
రిపు విదారికి హరికి శ్రీకృష్ణునకును
కిల్బిషారికి నే నమస్కృతి యొనర్తు"[66]

పండిత పక్షపాతియగు బ్రౌనుదొరపద్యమును విని సంతోషించి, వచ్చిన కారణ మడుగగా, మేనమామ ప్రోత్సాహమున మంగన్న ఇట్లు చెప్పెనట!

"చింతలూరికి మిరాసీదారుఁడగు జగ్గ
రాజుకుఁ బుత్త్రి లౌరసులు లేమిఁ
దనకును బిన్నయౌ తండ్రినందనునకు
బాపిరాట్సుతు దత్తభావుఁ జేసి

65. చాటు పద్యరత్నాకరము; ప్రథమతరంగము; పుట—36.
66. Ibidem; పుట—38.

కొనుటచే నిదివఱకును తద్గ్రహాక్షేత్ర
కర్తనై యుండుట కలకటరు క
చేరిల లెక్కలఁ జిత్తగించినఁ జాలు
నేదినే నెఱుఁగని యిట్టిపనికి
బాపిరాట్పుతుఁడని నేను బల్కినట్లు
వాది పన్నిన కపటభావమె నిజమని
పట్టి దత్తుఁడు గాఁడంచుఁ బండితుండు
చేసెఁ దీరుపుభయభ్రష్టుఁ జేసె నన్ను"

"అత్తినధర్మశాస్త్ర విధి కడ్డని చూడక కల్కటర్ల సం
సత్తుల లెక్కలారయ విచారముసేయక రాజ్యమేలు భూ
భృత్తు సభాస్థపత్రలిపిరీతిఁ దలంపక విత్తవాంఛచే
దత్తు నదత్తుఁ డంచను నధార్మిక పండితుఁడుంట యొప్పునే ?"[67]

ఈ సందర్భమునకు సంబంధించిన క్రింద పద్యము; శ్రీ కందుకూరి వీరేశలింగంపంతులుగారి ఆంధ్రకవుల చరిత్రలో, పిండిప్రోలి లక్ష్మణకవినిగూర్చి చెప్పునప్పు డీయబడినది.

"పస్పసచేసె నా బ్రతుకు పండితుఁ డింకెటు నిల్తునంచు నే
నిస్పృహావృత్తి నుండఁగను నిన్నటి రేఁ గలలోనఁ గోర్టు వా
రిస్పిసియాలు పట్టిరిఁక నేర్పడ న్యాయము తీర్తుమంచు ధై
ర్యాస్పదసూక్తిఁ బల్కినటులైన మిముం బొడగాన వచ్చితిన్"[68]

పై పద్యములలో, కవులు నాడు వాడుకలో నున్న ఇంగ్లీషు మాటలను నిస్సంకోచముగ ప్రయోగించుట కన్పట్టును.

లక్ష్మణకవికి సమకాలికుడును, సంగీతసాహిత్యములు రెండింటియందును, మహాప్రతిభావంతుడు నగు శిష్టు కృష్ణమూర్తికవి, తనకు పోషకులయిన కాకర్లపూడివారిపై చెప్పిన చాటువులలో, ఒక ఉత్పలమాలికయందు పదులకొలది ముస్లిము భాషాపదముల నడుమ ఇంగ్లీషుమాటను ప్రయోగించెను. ఏమాట భావ వ్యక్తీకరణమున సమర్థమో, దానినే ప్రయోగించుట విద్వత్కవులకు సహజముగదా ! ఉత్పలమాలిక ప్రారంభ మిది-

---

67. Ibidem; పుట–39.

68. ఆంధ్రకవుల చరిత్ర; మూడవభాగము; పుట–581.

"వీరు తెలుంగుసాము లరసి తరబేయతు తొప్పు గొప్ప స
ర్కారువలే జమీలు దరఖాస్తుగ నేలిన రాజమాన్య హం
పీరులు ధక్కణీలు తజిపీజు కులాహికులున్న మేటి మం
జారు జొహారు యాఖీదు మషూరు ఖరారు మదారు బారు బ
ర్దారు మితార్గురాల సరదారులతోడు కడానితేరులం
బారు మిరాదు నౌబతు సుమారు పుకారును బారుకు డ్డిసీ
దారు గుడారు పైకము బిడారుబజారు కొటారులందు నే
దారు పరాణిబారు దళదారు సవారు షికారులందు ఓ
ల్యూకరు సతారసవారు పిలగోలతుపాకుల ఫైరులందు లే
ఖ్యారుగ( జెక్కుమారులు తయారుగ వీరి హుజారులందు వె
య్యారులు పెద్దపేరుల జొహారులు చూచి......"[69]

ఇట, ఫైరు అని ప్రయోగింపకుండ, ఇంకేమాట వాడినను పేలవముగా నుండు నని చెప్పనక్కరలేదుగదా !

తమ రచనలలో, ఈ కవులు యథోచితములైన ఇంగ్లీషుమాటలను వాడి నాటి 'వాతావరణము'ను చక్కగా ప్రతిఫలింపజేసినారు. ఇట్లే ఇంకను చాల మంది కవులు తమతమ చాటుధారలలో, ఆంగ్లపదములను వాడిరి. ఇందుదాహరణ ప్రాయముగ నీ కవులు మాత్రము పేర్కొనబడిరి.

చిన్నయసూరి (1806-1862) ని బోలిన పండితప్రకాండులకును పాశ్చాత్యులతో సన్నిహిత సంబంధముండి యుండుటవలన వారి కృషి మిక్కిలి దీపించినది. సూరి ఆంగ్లములో వ్రాసినది ఏమియు లేకున్నను, ఆతని కాంగ్ల భాషా సంస్కృతులను గూర్చి తెలియునని చెప్పుటకు తగిన నిదర్శనము; గోపాల కృష్ణమసెట్టిగారి సాయముతో సూరిగారనువదించిన 'లా' (Law) గ్రంథములు. వీరి నీతిచంద్రిక ఏ. జె. ఆర్బత్ నాట్[70] (A. J. Arbuthnot, Esq.)

---

69 చాటుపద్య రత్నాకరము; ప్రథమ తరంగము: పుట-40,41.

70. అంకిత మిట్లున్నది :

"To

A. J. Arbuthnot, Esq.
Secretary to the Madras University
and College of Fort Saint George.
This work is respectfully dedicated, as a mark of respect.
By
His most obedient and Humble Servant,
P. Chinniah Sooree
Telugu Head Master in the Madras University."

దొరగారికి అంకితమైనది. నాటి, ఆచారమును బట్టి 'ముఖపత్రము' (Title Page) ఆంగ్లమునను కలదు. అట; నీతి చంద్రిక ఆర్ మోరల్ స్టోరీస్("Neeti Chandrica or Moral Stories") అనియున్నది. మొదటి భాగము ("Vol I") మద్రాసులోని వాణీదర్పణము ("Vanee darpunum") ముద్రాక్షరశాలలో 1853 లో అచ్చయినది. ఈతనికి నాటి పాశ్చాత్య విద్యావేత్తలందరితోడను స్నేహము కలదు. శబ్దరత్నాకరమునకు (1885) పూర్వమే, సూరి అకారాదిగా నొక ఆంధ్ర నిఘంటువును కూర్చుటకు సామగ్రిని కూర్చుకొని, కొంత పనినిగూడచేసెను.[71] కాని అది పూర్తి కాలేదు. సి. పి. బ్రౌను దొరనుబోలిన పాశ్చాత్యపండితుల కృషి ఈ విషయమున నాతనికి మార్గదర్శకమైనదని మన మూహింపవచ్చును.

నాడు, న్యాయాధికారులుగ నున్న దొరలకొరకు పండితులు ధర్మశాస్త్ర గ్రంథములను సంస్కృతములోనుండి తెలుగులోనికి తెచ్చుట కలదు. ఇట్లు వివిధ గ్రంథసారమును (Digest) తేట తెలుగులో వ్రాయుటకు పండితులను దొరలు ప్రోత్సహించెడివారు. కొన్నికొన్నిచోట్ల, ఆ అనువాదముల పర్యవేక్షకులుగకూడ దొరలుండుటయు, అట్లు సంసిద్ధమయిన గ్రంథముల నంకితముగ గొనుటయుకూడ కలదు. ఈ దొరలతోడి సన్నిహితత్వమువలన, మన పండితులు ధర్మశాస్త్రగ్రంథముల ననువదించునప్పుడుకూడ, పాశ్చాత్యపద్ధతిని విషయ విభాగముచేయుట, సూచిక లిచ్చుట మొదలగునవి చేసెడివారు. అట్లు వివిధ గ్రంథములను శోధించి, క్రోడీకరించి, వాని సారమును ఒక గ్రంథముగా నాడు సిద్ధము చేసినవారిలో వఠ్యం వాసుదేవపరబ్రహ్మశాస్త్రిలుగారు సుప్రసిద్ధులు. అట్టి గ్రంథము 'వ్యవహారదర్పణము'.[72] ఇది వ్యావహారికభాషలో నుండుట విశేషము. శ్రీ శాస్త్రిగారు దీని పీఠికలో; "ఘనమును వహించి

---

71. ఈ విషయమై శ్రీ బహుజనపల్లి సీతారామాచార్యులుగారు (1827-1891) తమ 'శబ్దరత్నాకరము' పీఠికలో నిట్లు వ్రాసిరి. "...కొంత కాలంబునకు ముందు సంస్కృతాంధ్రములయందు విశేష పాండిత్యంబు గలిగి యాసేతు హిమాచలము చాలఁ బ్రసిద్ధి వహించి యుండిన పరవస్తు చిన్నయసూరిగారు జీవితులై యుండిన కాలంబున దీర్ఘసూత్రతతో ననేక గ్రంధ పరిశోధనంబు గావించి మిగుల విరివిగాఁ బ్రయోగ సహితంబుగ అకారాది తెనుఁగు నిఘంటు వొకటి వ్రాయం బ్రారంభించి నడపుచుండిరి...."

72. శ్రీ గిడుగు వేంకటరామమూర్తి పంతులుగారి 'గద్యచింతామణి'(1933) శాస్త్రములు; పుట - 293.

యుండే యింగిలీషువారి దొరతనముకు లోబడ్డ హిందూరాజ్యములో ఉండే ఆంధ్రులు, ద్రావిళ్ళు మొదలయినవారు విభాగము మొదలయిన సకల వ్యవహారములనూ విజ్ఞానేశ్వరీయం - స్మృతిచంద్రిక - సరస్వతీ విలాసం - మాధవీయం - భగవద్భాస్కరం - నందపండితీయం, దత్తక చంద్రిక - మొదలయిన ధర్మశాస్త్రగ్రంథములలో చెప్పి ఉండే ప్రకారం ఆచరిస్తున్నారు. అయితే ఆ గ్రంథములు యావత్తూ సంపూర్ణంగా చూస్తేనేగాని అన్ని వ్యవహారముల యొక్క రీతిన్ని తెలియదు. మరిన్ని యిప్పుడు వాడుకలో లేకుండా ఉండే సంగతులుకూడా ఆ గ్రంథములలో చాలాగా చెప్పబడియున్నవి. ఆ రెండు హేతువులచేతనూ ప్రసక్తమయిన వ్యవహారముయొక్క స్వరూపాన్ని తెలుసుకోవటము వ్యవహారస్తులకేమి ప్రజలకేమి సులభసాధ్యమై ఉండలేదు. కాబట్టి ఆ గ్రంథములను అనుసరించి యిప్పటి వ్యవహారములకు మాత్రమే మిక్కిలి ఉపయుక్తంగా ఉండే యావదంశములనూ సంగ్రహించి..." వ్యవహారదర్పణమును తాము రచించినట్లు చెప్పిరి.

ఈ గ్రంథము 1851 లో అచ్చయి, తూర్పిండియా కంపెనీలో ఉన్నతోద్యోగి యగు "ది ఆనరేబిల్ జాన్ ఫ్రైయర్టామసు" (The Hon'ble John Fryer Thomas) దొరగారికి అంకిత మీయబడినది. దీనికి, "జాన్ ఫ్రైయర్టామసు స్భూపాలీయము" అని నామాంతరము కూడ కలదు.

ఇందులోని ఈ క్రింది పద్యము—దొరలకును, దేశీయ విద్వాంసులకును గల సన్నిహితత్వమును ; దొరలను వర్ణించునప్పుడును పండితులు సంప్రదాయబద్ధములైన వర్ణనలనే చేసెడివా రనియు, చూపును.

"శ్రీ జాన్ ఫ్రైయర్టామ
స్భూజాని పురందరుఁడు ప్రభూతయశముచే
భోజ నల విక్రమాది
త్యాజిసుతులబోలు ననియె నార్యతతి గడున్."

కోర్టు వ్యవహారములకు సంబంధించిన సమస్తము లయిన చట్టములును ఈ కాలముననే తెలుగులోనికి అనువదింపబడుచు వచ్చెను. ఈ రచనలలో చాల వానికి సాహిత్య గౌరవము లేకున్నను, సులభశైలిలో నూతన విషయములను తెలుగు వచనమున రచించుట కివి మార్గము చూపెను. అంతియెగాక, వచనము సర్వవ్యవహారములకును, సాహిత్య రచనకును గూడ పనికివచ్చునదియే యని, ఇవి చూపినవి.

ముస్లిముల పరిపాలనాకాలమున ఉర్దూ, ఫార్సి, అరబ్బీ పదములు తెలుగులో చేరి, బహుళముగ వాడుకలోనికి వచ్చుటయు, కొన్ని గ్రంథస్థమగుటయు జరిగి భాష సంపన్నమైనట్లే; విషయ ప్రాధాన్యము గల పై రచనలలో గూడ ఇంగ్లీషుమాటలు విశేషముగ వచ్చిచేరి, జన బాహుళ్యములో ప్రచారమును బొంది, ఆంధ్రభాషయొక్క పదజాలమును పెంపొందించెను నాటి విద్యావంతులపై పడిన పాశ్చాత్య విజ్ఞాన సంస్కృతుల ప్రభావమే ఈ నూతన పదజాలము[73], నవ్యభావములు[74], వ్యాప్తిలోనికి వచ్చుటకు కారణము.



73. "Under the Musalman rule; Telugu, Kannadi and Tamil were filled with Arabic words. At present these are retained and many English expressions are added... At present the Telugu used in conversation and business is becoming more and more thickly sprinkled with English words."

(C. P. Brown's English-Telugu Dictionary-1852; Preface; Page - 5.)

74. "........We must at present do our best to form a class of persons, Indian in blood and colour, but English in taste, in opinion, in morals, and in intellect." (Lord Macaulay's Minute of Dissent (2-2-1835) నుండి.

నాటి విద్యావంతులందరు, అన్నివిధముల, ఈ వాక్యమునకు లక్ష్యభూతులు కాకున్నను; వారి మనః ప్రవృత్తులలో మాత్రము అసాధారణమైన మార్పు వచ్చినదనుట సత్యదూరము కాదు.

# నాటి తెలుగు

పందొమ్మిదవ శతాబ్ది పూర్వార్ధములో, పాశ్చాత్యులతో గల సన్నిహితత్వమువలన; ఆంధ్ర రచయితలు కొలదిగనో, గొప్పగనో, పాశ్చాత్య భాషా సంస్కృతులను గూర్చి తెలిసినవారైరి. ఈ సన్నిహితత్వము, పాశ్చాత్య విజ్ఞాన పరిచయము; పందొమ్మిదవ శతాబ్దిలోని నాలుగైదు దశలలో; తెలుగులో బయలుదేరిన, పాశ్చాత్య సంస్కార వాసనావాసితములైన గ్రంథములవలన ఇనుమడించినది. ఈ గ్రంథోదయమునకు ప్రోత్సాహ మిచ్చినది 'ఉపయుక్త గ్రంథకరణ సభ' (The Madras School Text Book and Vernacular Society). ఇది 1820 లో నేర్పడినను, 1848 లో చిన్నయసూరి దీని కధ్యక్షుడగువరకు, తగినంత కృషి దీనివలన జరుగలేదు. పాఠ్యగ్రంథములను - నవీన విద్యాపద్ధతి ననుసరించి - సిద్ధముచేసి, దేశీయుల మనః ప్రవృత్తిలో మార్పు వచ్చునట్లు చేసిన దీ సభయే.

పందొమ్మిదవ శతాబ్ది పూర్వార్ధములో క్రమక్రమముగ ప్రచారమునకు వచ్చిన 'పాఠ్యగ్రంథములు' విద్యార్థులలో - వయోభేదము లేకుండ - నవీన దృక్పథమును ప్రవేశపెట్టెను. మొట్టమొదటిసారిగా దేశీయులందరు; విదేశముల చరిత్రను, విదేశస్థుల భౌగోళిక సిద్ధాంతములను, విజ్ఞానశాస్త్ర విషయములను; గ్రహించిరి. అప్పుడప్పుడే ఆరోగ్యశాస్త్రమునకు సంబంధించిన గ్రంథములును, ఆంగ్లమూలము ననుసరించి. తెలుగులోనికి పరివర్తితము లైనవి. ప్రకృతిశక్తులను పాశ్చాత్యుల విజ్ఞానము ననుసరించి యర్థము చేసికొన నెంచుటయు వచ్చెను. ఈ విధముగా విద్యావంతులైన దేశీయుల మానసికపరిధి వైశాల్యమును పొందజొచ్చెను. ఈ పరివర్తనమువలన, విద్యావంతుల మానసిక జీవితమునందు విప్లవము వచ్చెను. ఈ విప్లవము సాహిత్యమునందును పొడగట్టెను.

ఆంగ్లభాషయొక్క ప్రభావము ఆంధ్రభాషపై మొట్టమొదట పడి. నూతన పదజాలమును కల్పించెను. [క్రమక్రమముగా ఆంగ్ల సాహిత్య ప్రభావ మాంధ్ర సాహిత్యముపై పడినది. ఇది పరిణామరూపమున వచ్చినదేగాని హఠాత్సంభవ మైనదిగాదు. ఆంగ్లేయులతో—వాణిజ్య రంగమున, ప్రభుత్వ రంగమున, కలిగిన సంపర్క ఫలితముగా, ఆయా రంగములకు చెందిన ఆంగ్ల

పదములన్నియు ఆంధ్రములోనికిరాగా; ఆంగ్లేయులు స్థాపించిన పాఠశాలల వలన, ఆ పాఠశాలలను బోలిన వానిని దేశీయులు స్థాపించుటవలన, ఆంగ్ల విద్యా సంస్కారములు క్రమక్రమముగ తెలుగుదేశములో పాదుకొనెను. ఆంగ్లభాషలోని పదములు తెలుగులోనికి బాగుగ వచ్చిన తరువాత, ఆంగ్ల సాహిత్య ప్రభావము తెలుగు సాహిత్యముపై బాగుగ పడుటకుముందు; పాశ్చాత్య విజ్ఞానముచే దేశీయులు సమ్మోహితు లగుటయను నవస్థ యొకటి యుండెను. ఈ యవస్థనుండి తేరుకొని, ఆంగ్ల సాహిత్య పఠన పాఠనముల వైపు, తెలుగు దేశములోని విద్యావంతులు మ్రొగ్గుట యనునది, పందొమ్మిదవ శతాబ్ది యుత్తరార్ధ ప్రారంభమునుండి బాగుగ జరిగినది. మొదటి రెండవస్థలకు భరత వాక్యము, మూడవ యవస్థకు నాంది వాక్యము చెప్పినది 1854 లో వచ్చిన *ఎడ్యుకేషనల్ డిస్పాచ్* (Educational Dispatch) దీని యొక్క ఆదర్శమిది—

"…. ….the Anglo - vernacular Period, began with the issue of Sir Charles Wood's educational dispatch in 1854. The objective was the same as before, viz. the diffusion of Western, and not Eastern knowledge and learning, and it was now explicitly laid down that active measures were to be taken to extend them to all classes of the people— by means of their own languages to the masses and by the use of English, 'by far the most perfect medium,' in higher education."[1]

ఈవిధముగా, ఆంగ్లము ఉన్నత విద్యావిధానములో నిర్బంధముగనున్న గాని, ఉత్తమశ్రేణికి చెందిన విద్య భారతీయులకు లభింపదు ("A knowledge of English will always be essential to those natives of India who aspire to a high order of education"—Dispatch) అను మాట స్థిరమగునాటికి; ఆంధ్రభాషలో వచ్చిచేరిన ఆంగ్లశబ్దములనుగూర్చి కొంత ముచ్చటింతును.

ఆంగ్లేయులతో నధికమగుచు వచ్చిన సంపర్కమువలన ఆంధ్రభాషలోనికి వచ్చిచేరిన పదములనుగూర్చి వ్రాసిన '*విలియమ్ బ్రౌన్*' అనుపాశ్చాత్యుడు, తన వ్యాకరణము ('*A Grammar of the Gentoo Language*') యొక్క పీఠిక (Preface) లో ఆంధ్రభాషలోగల అన్యదేశ్యములను గూర్చి యిట్లు వ్రాసెను.

---

1. Modern India and the West. 1941 Oxford 'Varsity Press. London 'General Survey' By L. S. S. O' Malley, C. I. E. Page-650

"The official terms adopted altogether from the practice of our courts of Law in England, ought without a doubt to be preserved in the same names in the native character, in the use made of them in our Provincial Courts of Law in India. Why are we compelled, if this be not practicable, still to retain the use of such a vast number of Persian words? some of them, of current use in matters of revenue, that have no substitute whatever in the native Gentoo. The general adoption and use of them has, at the same time, rendered it absolutely necessary to insert them very profusely in the vocabulary." [2]

ఇట్లు కోర్టునకు సంబంధించిన పదజాలమే విశేషముగా ఆంధ్రభాషలో నాడు చేరుచువచ్చెను. కనుకనే విలియమ్ బ్రౌన్ తన 'వ్యాకరణము'లో 'ఫార్సీ' మొదలైన భాషలలోనుండి వచ్చిన మాటల కిచ్చిన ప్రాముఖ్యము, ఆంగ్లభాషలోనుండి వచ్చిన పదజాలమునకీయక, తత్కారణము నిట్లు చెప్పెను.

"If it be asked why the same attention has not been paid to the preservation of English words in the native character, it may be answered; that they are at present so few in number and are altogether so palpable, as to render a particular designation of them superfluous." [3]

అనగా నాటికింకను, ఆంగ్లపదములు ఎక్కువగా తెలుగులోనికివచ్చి చేరలేదన్నమాట. చేరినమాటలు చాలవరకు ప్రభుత్వ వ్యవహారములకు సంబంధించినవే. సాహిత్యవిషయకములైనవి చాలతక్కువ.

ఈ సందర్భముననే, ఆంగ్లములోగల సాంకేతిక పదములకు తెలుగులో గల స్థానమునుగూర్చి వ్రాయుచు; వానినట్లే యథాతథముగ గ్రహించుటయే మంచిదనియు, అనువాదమును చేయనెంచుట హాస్యాస్పదమగుననియుచెప్పుచు, విలియమ్‌బ్రౌను ఇట్లు వ్రాసెను.

"Attempts are frequently made to render technical terms of one language, into corresponding terms of another. When the Idiom and the just import of particular words is known to differ so materially in all Languages, a literal translation can seldom be made appropriate. All words of this description have therefore been omitted in the Vocabulary. Such are the terms of a local and technical nature for which the Gentoo Language, generally speaking,

2. 'A Grammar of the Gentoo Language' 1817.—William Brown; Preface Page.—XVII.

3. Ibidem.

possesses no congenial expression, and which were much better preserved in the same names in the Gentoo character."

" Many mistakes more or less material, perhaps more or less ridiculous and absurd, would be obviated by an observance of this simple, but essential rule. Such, for example, as the ludicrous translation of our common term of 'Bar', at which the prisoner appears in a Court of Law, into the Gentoo word 'Bonoo'; which literally signifies a Rat Trap— In this way, it is said, of a certain Dutch Translator of Caesar's Commentaries, that he rendered the word 'Consul' into 'Burgo - master'; and in this happy manner, dignified all the other officers and Magistrates of Rome, with titles most familiar to him and his own country."[4]

పై విధముగా— ఆంధ్రభాషలో వచ్చిచేరిన, పర్యాయ పదములుసృష్టింపబడిన, ఆంగ్ల శబ్దములనుగూర్చి విలియమ్ బ్రౌను వ్రాసెను.

పందొమ్మిదవ శతాబ్ది పూర్వార్థములో తెలుగు వ్యాకరణములు నిఘంటువులు వ్రాసిన పాశ్చాత్త్యులందరు, నాడు తెలుగులోనికి వచ్చి చేరుచున్న అన్యదేశ్యములయిన అంగ్లపదములను గూర్చి వ్రాసిరి. ఈ ఆంగ్లపదములు తెలుగులోనికివచ్చి చేరుటకును, అంతకుమున్ను ముస్లిముల పరిపాలనాకాలమునందు ముస్లిములభాషలలోని పదములుచేరుటకును భేదమేమియు లేదనియు, ఈ పరిణామము సహజమేయనియు వ్రాసిరి. ఈ సందర్భముననే కాంబెల్ దొర (A. D. Campbell) తన తెలుగు వ్యాకరణములో నిట్లు వ్రాసెను.

"The great facility with which the Teloogoo adopts and naturalizes foreign terms, must already have attracted the notice of the student. The intercourse of the people of Telingana with the neighbouring provinces, has led to the introduction of a few terms from the Orissa, the Mahratta, the Guzerat, the Canarese or Carnataca, and the Dravida or Tamil : but except from the Tamil and Canarese, with which the Teloogoo is radically connected, it has not borrowed extensively from any of these languages. Since the Mahommedan conquest of the Deccan, numerous technical revenue terms, and words connected with official business derived from the Arabic, Persian, or Hindee, have been introduced into Teloogoo, through the medium of Hindustanee ; *but the use of many such words begins now to be superseded by that of corresponding English terms.*"[5]

4. Ibidem—Pages XVI, XVII.

5. A grammar of the Teloogoo Language By A. D. Campbell. Third Edition. 1849. Pages—73, 74. First Edition, 1816.

అనగా 1816 నాటికి (కాంబెల్ దొర తెలుగు వ్యాకరణము మొదటి ముద్రణము—1816) క్రమక్రమముగ తెలుగులోనికి - ఆంగ్లేయుల పరిపాలనము వలన - ప్రభుత్వ వ్యవహారమునకు సంబంధించిన మాటలువచ్చి చేరుచుండుటయే గాక; అంతకు పూర్వము ప్రభుత్వముచేసిన ముస్లిముల భాషలలోనుండి తెలుగు లోనికి వచ్చి చేరిన మాటలను త్రోసివేయుచుండె నన్నమాట.

కాంబెల్ దొర ఆంగ్లములోనుండి తెలుగులోనికి వచ్చి చేరిన మాటల కుదాహరణ ప్రాయముగ కొన్ని ఆంగ్ల శబ్దముల నిట్లు పేర్కొనెను.

| | | | | |
|---|---|---|---|---|
| "నెంబరు | ... | ... | ... | a number |
| ఇంక్ | .. | ... | ... | ink |
| పేనా | ... | ... | ... | a pen |
| పేన్సలు | ... | ... | ... | a pencil |
| డిక్రీ | ... | ... | ... | a decree |
| సమ్మను | ... | ... | ... | a summons &c"[6] |

ఈ శబ్దములనుబట్టి ప్రభుత్వ వ్యవహారమునకు సంబంధించిన ఆంగ్ల పదములే విరివిగా తెలుగులోనికి వచ్చి చేరుచున్నట్లూహింప వచ్చును.

ఆంధ్ర భాషలో వచ్చి చేరుచున్న ఆంగ్లశబ్దములనుగూర్చి 1816,'17 సంవత్సరములలో కాంబెల్ విలియమ్ బ్రౌను, దొరలు చెప్పిన మాటల తరువాత, 1830 లో పరిస్థితు లెట్లున్నవో ఏనుగుల వీరాస్వామయ్యగారి కాశీ యాత్ర చరిత్రలోని ఈ క్రింది వాక్యములవలన తెలియును.

"*యిప్పట్లో దాక్షిణాత్యులైన హిందువులు స్వభాషతో యింగిలేషు మాటలు కలిపి మాట్లాడుతూ వచ్చేటట్టు* యిక్కడ (గంగాయమునల మధ్య వుండే భూమి) దొరతనము చేసేవారి తురకమాటలు సంస్కృతభాషతో యీ దేశస్థులు కలిపి మాట్లాడుతూ తురకలవలెనే వస్త్రవాహనాద్యాలంకారాలను అంగీకరించి ప్రవర్తిస్తూ వచ్చేటట్టు తెలిసినది."[7]

ముస్లిములు పరిపాలించుచున్న కాలములో వారి భాషాపదములును, ఆంగ్లేయులు పరిపాలించుచున్నప్పుడు వారి భాషా పదములును తెలుగులోనికి వచ్చుచున్నట్లు మనకు తెలిసిన విషయమే. ఈయభిప్రాయమునే వీరాస్వామయ్య

6. Ibidem. Page—74.

7. ఏనుగుల వీరాస్వామయ్యగారి 'కాశీయాత్ర చరిత్ర' తృతీయ ముద్రణము. 1941. పుట-189.

గారు పై వాక్యములలో తెలిపిరి. వీరి కాశీయాత్ర చరిత్ర; 1830-1831 సంవత్సరముల నడుమ జరుగగా వ్రాసినది. అప్పటికప్పుడే ఆంగ్లభాషాపదములు దాక్షిణాత్య భాషలలోనికి వచ్చి చేరుటయేగాక, స్వభాషలతో కలిపి వారు దానిని ప్రయోగించునంతగ, సహజములైన వన్నమాట. ఈ విధముగా ఆంగ్లభాషాపదములు మిక్కిలి వేగముగ తెలుగులోనికి ప్రవేశించి, దేశ్యపదములతోపాటు ప్రజలచే నాదరింపబడుచుండి, తెలుగు పదజాలముయొక్క స్వరూప స్వభావములను కొంత మార్చెను.

ఆ రోజులలో, సంస్కృతాంధ్రములలో మహావిద్వాంసులని పేరు పొందిన వారికిని; పాశ్చాత్యుల సంపర్కమువలన వారి సంస్కారము కొంత అంటినది. ఆంగ్లాది భాషలలో దేశీయ పండితులకు ప్రవేశ మంతగా లేకున్నను, దొరల యొద్ద చేరి వారికి దేశభాషలను నేర్పుచుండి నందువలన, ఆ భాషా సంస్కారములు వీరిమీదను పడెను. నిత్యవ్యవహారములో వీరును చాల ఇంగ్లీషు పదములను వాడుచుండిరి. మాటలలోనేగాక, వ్రాతలలోను-ముఖ్యముగా జాబులలో- ఆంగ్లపదములను వాడుచుండిరి. ఈ విషయమును రుజువుచేయుటకు బ్రౌను దొర సేకరించిన లేఖల సంపుటములు మన కాధారము. అందుండి యొకలేఖ నుదాహరించుచున్నాను.

ఈ లేఖ సి. పి. బ్రౌను దొర కాశ్రితుడైన వఠ్యేం అద్వైత బ్రహ్మశాస్త్రులుగారు వ్రాసినది. నాడు అద్వైత బ్రహ్మశాస్త్రిలుగారికి మహాపండితులని విశేషగౌరవముండెను. ఆయన వ్రాసిన లేఖలో, వ్యవహారమునకు సంబంధించిన మాటలన్నియు ఆంగ్లశబ్దములుగనే యుండెను.

"మహారాజశ్రీ మేష్టరు బ్రౌన్ దొరవారి సముఖమునకు—

తమ పండితుడు వఠ్యేం అద్వైత బ్రహ్మశాస్త్రిలు అనేక సలాములు చేసి వ్రాసుకొన్న విన్నపము. నిన్నటిదినము తమకు చిత్తూరుజిల్లా జడ్జీహోదాకు పయింటి అయినదని సమాచార పత్రికవల్ల నాకు తెలిసినది; గనుక తమరు గొప్పహోదాలో ప్రవేశించినందుకు అపారమైన సంతోషాన్ని పొందినాను. గాని దూరదేశానికి తమరు విజయము చెయ్యడముచేత అప్పటప్పటికి తమ దర్శనలాభము దొరకదుగదా అని నా మనస్సుకు సంకోచముగా నున్నది. అయితే శ్రీ పరమేశ్వరీ కటాక్షమువల్ల తాము త్వరగా కలక్టరు హోదాలో నైనా జడ్జీ హోదాలోనయినా ప్రవేశించి ఈ దేశానికే రావాలని సదా కోరుతూవున్నాను. పదకొండు సంవత్సరములనుంచి తమయొక్క అపార

మయిన దయ నిండా నేను సంపాదించుకొన్నాను. తమ విషయమై నేను ప్రవర్తించిన ప్రవర్తన తమ చిత్తానికే విశదమై యున్నది. ఈ భూచక్రములో తమకన్న నాకు ముఖ్యప్రాపకులు లేరని నమ్మివున్నాను. యింత కాలములో మావంటివారిని అనేకమందిని పోషించే గొప్ప హోదాలలో తమరు ప్రవేశించి అనేకమందిని బాగుచేసినారు గాని నాయొక్క దుర్గ్రహచారముచేత మావాండ్లకు యెవరికీ పనులు దయచేయించినారు కారు. చిరంజీవులగు, మా రామలింగశాస్త్రిలకు తమరు న్యాయంమువుంచిన అనుగ్రహమువల్ల జుజ్జూరు మునసబుపని ఖాయంగా దయచేస్తారనే నమ్మకముచేత పూర్వమందు అతనికిఉండిన పోలయిసు పనికికూడా రిసైన్ దాఖలు చేయించినాను. అతనికి పోలయిసు ఉద్యోగ భ్రంశంకూడా సంభవించినది. సంవత్సరముపైన రెండు మాసములనుంచి ఉద్యోగములేక శ్రమపడుతున్నాను. యిది అంతా నాయొక్క గ్రహచారముగాని మరివొకటికాదు. యీలాటి నాగ్రహచారమును తమవంటివారు తీసివెయ్యకపోతే మరియెవరు తీసివేస్తారు ? గనుక తమ మనుష్యులమని సర్వత్రా ఖ్యాతినిపొందిన మమ్మును సంరక్షించవలెనని తాము చిత్తమందు దయవుంచి బాపూడి అమరయ్యగారికి హేడ్డు మునిషీ హోదా దయచేసి కూరపాటితాణా అమీనుపని చిరంజీవులను రామలింగశాస్త్రిలకు దయచేయించవలెనని మిక్కిలి వినయ పూర్వకముగా కోరుతున్నాను. తమ్మున ఆశ్రయించినవారు అందరూ బాగుపడ్డారు, గనుకనున్ను యిప్పుడు తమరు దూరదేశము విజయము చేస్తారు గనుక నున్ను మాయందు సంపూర్ణానుగ్రహమువుంచి ఆప్రకారము కూరపాటి తాణా అమీనుపని చిరంజీవి రామలింగశాస్త్రిలకు దయచేయించి కుటుంబపోషణ చెయ్యవలెనని మిక్కిలి వినయపూర్వకముగా తమయొక్క ఘనాన్ని ప్రార్థిస్తున్నాను. మొదటినుంచి తమ్మున నేను కోరినపని యిదేగనుక యింతగా మనవి వ్రాసుకొన్నాను. కాబట్టి తాము దయచేసి నామనోరథ పూర్తిచెయ్యవలెను. రామలింగశాస్త్రిలను సముఖములోకి అంపించుమని తాము శలవువ్రాస్తే అంపిస్తున్నాను, దివ్యచిత్తానకు తేవలెను. యిదే అనేకసలాములు.[8]

ఇందు వ్యవహారమునకు సంబంధించిన పదములన్నియు - మేష్టరు, జడ్జీ, పయింటి, కలక్టరు, పోలయిసు, రిసైన్, హేడ్డు - అనునవి ఆంగ్లపదముల భ్రష్టరూపములే. దేశీయ పండితుల పదజాలములో కూడనివి ఇట్లు పాదుకొనెను.

8. గిడుగు వెంకటరామమూర్తి పంతులుగారి 'గద్యచింతామణి'-1933; జాబులు; పుట-279.

ఇట్లు విద్యావంతులయిన దేశీయులు వ్రాసికొనిన జాబులలో చాల ఇంగ్లీషు మాట లుండుటయే గాక, నాడు కోర్టు వ్యవహారములకు సంబంధించిన సమస్త పత్రములందును ఈ 'మిశ్రభాష' (సి. పి. బ్రౌనుదొర ఈ శబ్దమును ప్రయోగించెను.) విరివిగా వాడుకలో నుండెను. ఈ విషయమును సోదాహరణముగా నిరూపించుటకై శ్రీ బేతపూడి సుందరరాయడుగారు సేకరించిన 'అర్జీ' ల నుండి (నీలగిరి చరిత్ర - 1864) కొన్ని వాక్యముల నిచ్చుచున్నాను.

1. "...*గవరన్మెంటు ఆరడర్* ప్రకారము యెవరి చేలో వుండే చెట్లు వారే హక్కుదారులుగా వుండి దాన వచ్చే ఫలాదాయనులు స॥ చేని అసామే అనుభవించేటట్టు *సరిక్యూలర్ ఆరడర్* అయివున్నది...." ("మహారాజశ్రీ కల్కుటర్ - దొరగారి సముఖానకు తహశ్శీలుదారుడు వ్రాసుకొన్న మనవి అర్జీ" లోని భాగము. పుట - ౪౧.)

2. "...తపా జాబులు యిప్పుడు పెట్టిన పద్ధతి ప్రకారం *స్టాంపు* బిళ్లలు అంటించినవి... కొన్ని చేరుతూన్నవి, కొన్ని చేరడములేదు— *రిజిష్టరీ* చేశిన జాబులు మాత్రము చేరుతూన్నవి...గనుక...పూర్వపు మామూలు ప్రకారం వేశిన జాబుకు రశీదు యిచ్చేటట్టు మహారాజశ్రీ *జనల్ పోస్టు* వారికి శిఫారసు చెయ్యవలెనని మిక్కిలి ప్రార్థిస్తూన్నాము." ("మహారాజశ్రీ గుంటూరి కల్కుటరు దొరగారి సముఖానకు— వర్తకులు వ్రాసుకొన్న అర్జీ విన్నపము" లోని భాగము. పుటలు - ౨౦, ౨౧.)

3 "౨౩ డో *రిజమెంటు* న్ను ౧౪ *రిజమెంటు* న్ను యీ రెండు చెన్నపట్టణం నుంచి హైదరాబాద్ పోగలందులకై నిశ్చయించుకొని మార్గ సహాయమును గురించి కొంత సరంజాం చేయగలందులకై మహారాజశ్రీ *కమాండింగ్ చీఫు* వారు వ్రాశివున్నారుగనుక - స॥ రెండు *రిజమెంట్ల*కు కావలశిన సరంజాం... తయారుగా వుంచేటట్టున్ను అందుల సరంజాం తక్కువఅయి ఫిర్యాదువచ్చిన పక్షమందు జవాబుదారికి మీరే అవుతారనిన్ని - స॥ *రిజమెంట్ల*కు తక్కువకాకుండా సరంజాం చేయించి ఆ పటాలపు దొరలదగ్గిర క్యారక్టర్లు పొందినవారికి గొప్ప హోదాలకు శిఫారసు చెయ్యడమవుతూన్నది అని వారికి తెలియచేశి ఆసంగతి మాకు వ్రాయవలశినది", ("గౌరన్మెంటువారు జిల్లా కల్కుటరుకు వ్రాసే ప్రకరణము" పుటలు-౨౨, ౨౩.)

4. "నీయిలాకా సరిహద్దు గ్రామాదులలో...కొట్టు తిట్లను గురించిన్ని *పబ్లీకురోడ్ల* లో పెంటకుప్పలుపోసి.........నందున గురించి - స॥పోలైసు వారు

నీకుయిచ్చిన ఆరడర్ ప్రకారానికి లోబడ్డ వ్యాజ్యములను తీపుగా చెయ్యావలసి నది..." ("పోలైసువారు యినిస్పెక్టర్‌కు వ్రాసే ప్రకరణము." పుట—౹౩.)

5. "మచిలీపట్నం జిల్లా అదాల్తు కోటుగావారికి."

"౧౮౩౨ సం॥ నెం ౪౫గా రు కు అప్పిల్లెంటు అయిన వంగల పెద వీర రాఘవాచార్యులు వ్రాసుకొన్న మొహాజు".

"సదరహీ నెంబరు కు రిస్పాండెంట్లు అయిన ౧ వంగల శీతమ్మ ౨ అమర వాది జగన్నాధం ౩ వంగల రంగాచార్యులు వీలగాపయిని నేను చేశిన అప్పీలు కంప్లైంటును గురించి మనవి వ్రాసుకొనేది యేమంటే..."

"...ముగ్గురు గ్రామకరిణీకపు యిలాకాలో బలంకలవారయి మరుగు పరిచి దస్తావేజులు రిజిష్టరీ చేయించినారు..."

"...పెనుగొండ డిస్త్రిక్టు మునసపు కోర్టులో ౧౮౩౧ సం॥ నెం ౧౦౮ రున ...ఫిరియాదు చేశినాడు..."

"...యీ దావాకు నీవు వాదివి ప్రతివాదివికావు గనుక రిగ్యులెరు గా ఫిరియాదు చేసుకొమ్మని అన్నందున..."

"...అనంతరం యీ వివాద ఆస్తికి...కల్పించుకొన్న ఫోజగారీ దస్తావేజుల ప్రకారం..."

"...స్వల్పపు ఆక్షేపణలున్ను ఆక్షేపించి నా వ్యాజ్యం నస్పాటు చెయ్యడంవల్ల..."

"...అందువల్ల వచ్చిన సొమ్ము శమ కోటుగా లో డిపోశెట్టుగా వుంచ గలందులకు నాజరుగారిపేర హుకుము వ్రాయించి.."

"...యీ వ్యాజ్యం తమరు అయినా తమరు సదరమీనువారికి రిఫరు చేశి అయినా త్వరగా తీర్పుచేయించి..." (పుటలు—౬౦, ౬౧, ౬౨, ౬౩, ౬౪.)

6. "మహారాజశ్రీ నెల్లూరు-సి-యింజనీరు దొరగారి సముఖానకు—ఇసుకపల్లి బంగళా కట్టించే గుమాస్తా - మల్లవరపు సుబ్బయ్య వ్రాసుకొన్న మనవి అర్జీ యేమంటె-"

"స॥ బంగళా కట్టించగలందులకై సాల్గుజస్తాలో ఆ॥ ఇంజనీరుగారు యిక్కడికి వచ్చి ప్లానులు వేసి బంగళాకు కావలసిన యిష్టిమెంటు మొత్తము ......" (పుట - ౭౦.)

7. "మహారాజశ్రీ గణపతన్నగారికి - ఫలానా రిజమెంటు - ఫలానా కంపేని వారు శిపాయి బొడ్డు బాపయ్య దణ్ణములు"

"...కాబట్టి అటువంటివారిమీదికి పోయి లడాయి చెయ్యడము దుస్తరమె అయినా మన యింగిలీషు వారి శేనకు - లోకువేయని తోస్తూ వున్నది - యెందువల్లనంటె - యీ మందుగుండు అనే అగ్నిపొంతలో - వారి శేన అనె మిడతపడి జెయించునా కాబట్టి తెలియగలందులకు - మనవి వ్రాసుకొన్నాను -" (పుటలు - ౮౦, ౮౧.)

8. "మహారాజశ్రీ సుబేదారుగారి సముఖానకు"

"౧౫ నో పటాలంతాలూకు ౭ కంపేని బారు శిపాయి శేఖుహులేైను సలాములు చేసి వ్రాసుకొన్న మనవి యేమంటె-"

"...యీ జాబు చూచిన తక్షణం మహారాజశ్రీ కమ్యాండింగు దొరగారితో ఆలోచనచేశి ౫-౬-కంపెనీల బారు పంపిస్తే - స॥ జగ్గయ్యపేట దోపిడి పోక బందోబస్తుగా సాహుకారులు మొదలయినవారు బాగావుందురు..." (పుట - ౮౧.)

పైని ఉదాహరింపబడిన వాక్యములలోని ఇంగ్లీషు మాటలనుబట్టి, అవి జనుల వ్యవహారములోని కెట్లు చొచ్చుకొనిపోయినవో, తెలియును.

పందొమ్మిదవశతాబ్ది పూర్వార్ధమునందే, పందలకొలది ఇంగ్లీషుమాటలు తెనుగులోనికి వచ్చిచేరి, మన భాషయొక్క పదజాలమును పెంపొందించి దాని స్వరూప స్వభావములను కొంతమార్చెను. ఈ మాటలలో, సాహిత్యమునకు సంబంధించినవి చాల తక్కువ. పరిపాలనమునకును, విజ్ఞాన విషయములకును సంబంధించిన మాటలే చాలఎక్కువ.

ఇట్లు తెలుగులోనికి వచ్చిచేరిన అన్యదేశ్యములసంఖ్య అధికముగ నుండుటచే, వానిని (ఇంగ్లీషు మొదలయిన పాశ్చాత్య భాషలలోని మాటలను) పూర్వమునుండియు తెలుగులో చేరియున్న ముస్లిముల భాషలలోని పదములను, ఒకచోటచేర్చి నిఘంటువుగ కూర్చవలెనను భావము సి. పి. బ్రౌనుదొరకు కలిగినది. దాని ఫలితమే 1854 లో వెలువడిన ఆతని *మిశ్రభాషా నిఘంటువు*. ఇట్టి నిఘంటువుయొక్క అవశ్యకతను గుర్తించుట యందును, గుర్తించి దానిని నిర్విఘ్నముగ కొనసాగించుటయందును బ్రౌనుదొరయొక్క విశిష్టత కలదు.

1854 లో వెలువడిన ఈ నిఘంటువు వలన, పందొమ్మిదవ శతాబ్ది ఉత్తరార్ధ ప్రారంభమునాటికి తెలుగులోనికి వచ్చిచేరిన అన్యదేశ్య పదములేవియో (ముఖ్యముగా పాశ్చాత్య భాషాపదములు) తెలియును. ఇట్లు చేరిన పదములను గూర్చి బ్రౌనుదొర యిట్లు వ్రాసెను :

"The long continued dominion of the Musulmans introduced many foreign words into the various Hindu languages. Thus the modern Telugu contains a variety of Persian and Arabic expressions. In later years, some English words have crept into use. The present vocabulary of the Mixed dialects therefore forms a requisite supplement to a Dictionary of the Telugu language : and it contains only those phrases which are current among the natives." [9]

ఈ సందర్భములో ఈ 'మిశ్రభాష'ను కోర్టు వ్యవహారములలో విశేషముగ వాడుదురని చెప్పుచు బ్రౌనుదొర ఈ క్రింది యుదాహరణ మిచ్చెను.

"యీ నంబరులో డిఫెండంటు సమ్మను చూచి సైను (or దస్తత్) చేసి వాయిదా రోజున కోర్టులో హాజరు-అయి ఆన్సరు యియ్యకపోయినందున యిందులో యెక్సుపార్టి దర్యాప్తు చేయవలెనని ప్లెంటిఫ్ ప్లీడరు మోషను చేసినాడు గనుక ఆ మోషను రికార్డులో దాఖలు (or ఫయిలు) చేశి అందులో దర్ఖాస్తు చేసిన రోజున నడిపించేలాగున ప్రొసీడింగుసులో ఆర్డరు యెంటరు చేయడం అయినది." [10]

ఈ విధమైన "మిశ్రభాష" కోర్టు సంబంధముగలవారికందరకు తెలియునని బ్రౌనుదొర వ్రాసెను. ("...clearly intelligible to any native who is acquainted with business.") ఇంతకుపూర్వము ఉదాహరింపబడిన 'అర్జీ' లలోని భాషయు ఇట్టిదే. ఈ భాష బ్రౌనుదొర నాటికి దేశములో వ్యవహారమున స్థిరపడినది గనుకనే దానిని గూర్చి ఆత డిట్లు వ్రాసెను :

"The diary of any court of justice in the Telugu country will furnish specimens of this useful though inelegant dialect. The instance now given is copied from the Journal of the court at Masulipatam."[11]

కోర్టు వ్యవహారములలోనే గాక, సామాన్యముగా నిత్యకృత్యములందును ఇట్టి భాష వాడుకొనుట కలదనియు బ్రౌనుదొర వ్రాసెను. ("The language used in familiar intercourse is often of the same description.")

---

9. A Dictionary of the Mixed Dialects and foreign words used in Telugu'—C. P. Brown., 1854. Preface—Page-III.

10. Ibidem (ఈ వాక్యములు మచిలీపట్టణము 'పోర్టు జర్నలు' నుండి గ్రహింపబడెను.)

11. Ibidem.

ఆంగ్ల పదములు తెలుగులోనికి వచ్చునప్పుడు, తెలుగువారి ఉచ్చారణ పద్ధతి ననుసరించి కొన్ని మార్పులను పొందునని బ్రౌనుదొర యిట్లు వ్రాసెను:

"The Hindus are unable to enunciate several of the sounds which occur in the English and the Persian alphabets. Foreign words are therefore often erroneously spelt. "Collector" becomes కల్కటరు Kalcatar, "assistant" అశిష్టాంటు "ashistant"..."[12]

ఈ విధముగా తెలుగులోనికి అన్యదేశ్యములు వచ్చి చేరుటలో వింత లేదనియు, ఆంగ్లములో కూడ ఇట్లన్యదేశ్యములు చేరుట కలదనియు బ్రౌనుదొర ఈ క్రిందివిధముగ వ్రాసెను.

"Thus in the days of Dryden, Addison, and Pope, many English compositions admitted French or Dutch expressions."[13]

బ్రౌనుదొర 'మిశ్రభాషా నిఘంటువు'లో-ఉర్దూ, ఫార్సీ, అరబ్బీ భాషలలో నుండి తెలుగు లోనికి వచ్చిచేరిన మాటలతో బాటు, పాశ్చాత్యుల భాషలలోనుండి తెలుగులోనికి వచ్చిచేరి, నాటికి వ్యవహారమున గల మాటలును-అల్మారు, ఏవిరేజి, కాలీజు, కోర్టు, టరణి (An Attorney), టాచిమెంటు (Attachment), టాపు (Top), టేపు (Tape), నంబరు, పటాలం (Battalion), పైంటు (Appoint), బుక్కు, మానేజరు, మైనరు (Minor), మౌంటు (Amount), రౌను (Round), లాందరు (A Lantern), లాటు (A Lot), లీష్టు (A List), లైను (A Line), శారటు (A Chariot), సిలైను (A Slice), సైడు (A side), సైను (Sign), ష్టాంపు (Stamp), హాస్పత్రి-మొదలయినవి చాల గలవు.

కాని, బ్రౌనుదొరమాత్రము తెలుగువారు క్రమక్రమముగ మిశ్రభాషను తొలగింపవలెనని, ఇట్లు వ్రాసెను.

"To each word in this vocabulary I have appended a Telugu synonyme. This will aid those who wish to get rid of these foreign words...But in talking and writing Telugu we ought to avoid the mixed dialect."[14]

సి. పి. బ్రౌనుదొరయొక్క మిశ్రభాషా నిఘంటువునుండి ఉదాహరణముగ చూపబడిన పై పాశ్చాత్య భాషాపదములేకాక, ఇంకను చాల పదములు

12. Ibidem. Preface; page - IV
13. Ibidem.
14. Ibidem

తెలుగులోనికి నాడు వచ్చియుండెను. పైని చూపబడిన పదములు, తెలుగు లోనికి ఎట్టి అన్య దేశ్యములు వచ్చి చేరినవో దిఙ్మాత్రముగ చూపుటకు పనికి వచ్చును. ఆ పదములనన్నింటిని పరిశీలించి చూచినచో, నిత్యవ్యవహారమున వచ్చు పదములే నూటికి తొంబదిపాళ్ళు వానియందున్నట్లు మనకు తెలియును. ఈ 'పదములు' పరిపాలనకు సంబంధించినవియు, పాశ్చాత్య నాగరకతను వ్యక్తము చేయుచున్నవియునై యున్నవి. సాహిత్య సంస్కృతులను వ్యక్తము చేయు పదజాలము తక్కువ. ఇట్టి పదజాలము క్రమక్రమముగాని విద్యా వంతులలో - కొందరియందు పాశ్చాత్య సాహిత్య సంస్కృతుల ప్రభావము నాటికే సువ్యక్తమగుచు వచ్చినను - వ్యాపింపలేదు. నాటికి, ఆంగ్ల భాషకు ఆంధ్రదేశమున గల వ్యాప్తిని తెలియజేయుట కీ ఉదాహరణలు చాలును.

1855 లో స్వదేశమునకు పోవుటకు ముందు బ్రౌనుదొర వ్రాసిన ఆతని 'సాహిత్యజీవితకథ'యందు, తనకాలమునాటి ఆంధ్రులకు ఇంగ్లీషు సాహిత్యము నందును, పాశ్చాత్య విజ్ఞానము నందును, నచ్చిన విషయములను గూర్చి ఇట్లు వ్రాసెను.

"Many Brahmans have applied to me for instruction in English, and *they have found Bunyan's Pilgrim's Progress*, (In "The Booke of the Pilgrimage of Man" published in London by Pickering in 1858, there is mention of an Arabic version of the Pilgrim's Progress: which is very popular in Syria.), *Robinson Crusoe, and the Holy Bible, the easiest and most attractive books.* They have read others with me, but nothing has equalled these three. Hall's voyage to Loo Choo also suits them well. The ordinary routine of English History, Geography, and so forth, is less beneficial."[15]

బ్రౌనుదొర వ్రాసిన ఈ వాక్యములవలన, నాటి తెలుగు విద్యావంతుల మనస్సెట్లు పనిచేయుచుండెనో మనకు కొంత తెలియగలదు. వారి కింకను చిత్రకథలయందును, మత కథలయందును మక్కువ వదలలేదనియు, విజ్ఞా నాత్మకమైన పాశ్చాత్యశాస్త్రములవైపు మనస్సింకను బాగుగ మ్రొగ్గలేదనియు తెలియును. కాని, మార్పు క్రమక్రమముగ విద్యాభివృద్ధియయిన తరువాత వచ్చెను. దీని ఫలితము పందొమ్మిదవ శతాబ్దియొక్క ఉత్తరార్ధములో బాగుగా కన్పట్టును. అంతవరకు నాటి విద్యావంతులు పాశ్చాత్య పద్ధతులను, సంస్థలను,

15. Some Account of the Literary Life of C. P. Brown.

పూర్తిగా హృదయపూర్వకముగ స్వీకరించినట్లులేదు. బ్రౌనుదొరవంటి విశిష్ట వ్యక్తుల ప్రభావముక్రిందకు వచ్చినవారిలో ఈ హృదయపరివర్తనము కొంత జరిగి యుండవచ్చును. కాని వారును, పాశ్చాత్య పద్ధతులను అతర్కితముగ నంగీకరింపలేదని బ్రౌనుదొర యొక్క ఈ క్రింది వాక్యములవలన తెలియును.

"Every branch of English education shocks Hindoo prejudices. Sensible natives declare that if English secular instruction is continued Hinduism will perish."[16]

కొందరు పైవిధముగ ననుకొన్నను, విద్యావంతులలో నధిక సంఖ్యాకులు ఆంగ్లభాషను నేర్చుకొనిరి గనుకనే; ఇంగ్లీషువారికంటె భాషలను నేర్చుకొనుటలో భారతీయులే ముందంజ వేయుచున్నారని బ్రౌనుదొర వ్రాసెను.

"I do not undervalue the scholarship of the Hindus: with their limited means they have done excellently. Few of us have a moderate acquaintance with their tongues, while *thousands of them have a respectable acquaintance with English.* If we possessed their patience and determination in acquiring knowledge, we should think less lightly of their proficiency."[17]

పందొమ్మిదవ శతాబ్దిలో పూర్వార్ధాంతమున, పాశ్చాత్య సాహిత్య సంస్కృతుల విషయమున, ఆంధ్ర విద్యావంతుల విశిష్టస్థాన మియ్యది.

ఈ వాక్యములను బట్టి; 'బ్రౌన్యయుగము' ముగియునాటికి మనదేశములో ఇంగ్లీషుభాషతో పరిచయమున్నవారి సంఖ్య, వేలమీద ఉన్నట్లు తెలియుచున్నది అప్పటికింకను 'ఇంగ్లీషు చదువులు', నిర్ణీతప్రణాళికల ననుసరించి దేశవ్యాప్తముగ లేకున్నను; మేధావులలో సంచలనము తెచ్చుటకు తగిన వ్యాప్తిని పొందియేయుండెను. ఈ సంచలన ప్రభావము పందొమ్మిదవ శతాబ్ది పూర్వార్ధమందలి తెలుగు రచనలలో స్ఫుటముగ నుండుట మనము చూచితిమి. కాని, ఇది భాషాసంబంధి అయినంతగా భావసంబంధి కాదు. విజ్ఞానసంబంధి అయినంతగా సాహిత్యసంబంధి కాదు.

భావసంబంధియైన విప్లవమును, ప్రక్రియావైవిధ్యము గల సాహిత్యమును; పందొమ్మిదవ శతాబ్ది ఉత్తరార్ధము - వీరేశలింగయుగము - న గాని విజృంభింపలేదు.



---

16. Ibidem.
17. C. P. Brown's Telugu-English Dictionary; 1852; Preface; Page-IV.

[క్రీ॥ శ॥ 19 వ శతాబ్ది ఉత్తరార్ధము]

## ఇంగ్లీషు చదువులు - భావవిప్లవము

పందొమ్మిదవశతాబ్ది ఉత్తరార్ధము భారతదేశ చరిత్రలో చాల ప్రధానమైనది. దేశమున, రాజకీయ సాంస్కృతిక రంగములలో గొప్పమార్పులు వచ్చినకాలమిది. భారతదేశములో—మద్రాసు, కలకత్తా, బొంబాయినగరములలో, మూడు విశ్వవిద్యాలయములు స్థాపింపబడి (1857), నిర్ణీత ప్రణాళికల ననుసరించి 'ఇంగ్లీషు చదువులు'—తద్ద్వారమున పాశ్చాత్య సాహిత్య సంస్కృతులు—దేశమున వ్యాప్తినిపొందిన కాలమును ఇదియే. దేశము 'కంపెనీ' పరిపాలనమునుండి, ఇంగ్లీషు పార్లమెంటుయొక్క ప్రత్యక్షపాలనము క్రిందికి వచ్చిన (1858) కాలమును ఇదియే. మేధావులైన భారతీయ రచయితలందరు, పాశ్చాత్య సాహిత్య సంస్కృతులకుగల వైవిధ్యమునకు ముగ్ధులై. తమ భావనా ప్రపంచమును, రచనా క్రమమును తీర్చి దిద్దుకొనుచు వచ్చిన కాలమును ఇదియే. ఈవిధముగా ఈకాల మొక సంధియుగము.

పందొమ్మిదవ శతాబ్దియొక్క ఉత్తరార్ధమునను, ఇరువదవశతాబ్ది తొలి యుషస్సులలోను, ఆంధ్ర సాహిత్యరంగము నుజ్జ్వాత లూగించిన ప్రతిభావంతులందరు ఈకాలమున ప్రభవించినవారే. వారికి, పరిసరములందు నవ్యమార్గములలో నభివృద్ధికి వచ్చుచున్న 'ఇంగ్లీషు చదువులు', పరిపాలనాపద్ధతులు. క్రొత్తప్రాతల కలయిక, సంఘర్షణ, ఉద్దీపకములయ్యెను అట్లు కలగుండువడిన కాలములో వారిబుద్ధి వికసించుట జరిగినది. ఈనాటి రచయితలందరును—కొంచెము హెచ్చుతగ్గులున్నను— కాలానుగుణమైన ప్రభావములకు లోగినవారే. వ్యక్తిగతముగ ఈప్రభావ మెట్లు పనిచేసినదో వివరించుటకు పూర్వము నాటి ఆంధ్రదేశస్థితిని, విద్యావిధానములను కొంత పరిశీలింపవలసి యున్నది.

1855 వ సంవత్సరము, ఆంధ్ర సాహిత్య సంస్కృతుల చరిత్రలో ఒక అధ్యాయమునకు సమాప్తి. ఈ సంవత్సరముననే ఆంధ్రభాషా సాహిత్యములపై తనప్రభావమును, ఇంచుమించుగా, నలుబది సంవత్సరములు నెరపిన సి. పి. బ్రౌనుదొర తన ఉద్యోగమును ముగించుకొని, ఆంధ్రదేశమును విడిచి స్వదేశమునకు వెడలిపోయెను. తరువాతకూడనాతడు తన మృతివరకు (1884)

ఆంధ్రభాషా సాహిత్యముల యభివృద్ధికై కృషిచేసినను, ఆతని ప్రత్యక్షప్రభావము ఆంధ్రదేశమున తొలగిపోయెను. ఆతని ప్రభావ మాతని పుస్తకముల రూపమున మాత్రము తెలుగునేలపై నిలచినది. ఈ విధముగ 1855వ సంవత్సరమును పాశ్చాత్త్యుల ప్రత్యక్షకృషి ప్రభావము ఆంధ్రభాషా సాహిత్యములపై ముగిసిన సంవత్సరముగ గ్రహింపవచ్చును.

ఇకమీద తెలుగుగడ్డపై నవీనమార్గమున కృషిచేసిన దేశీయులందరును, ఇంచుమించుగా, ఆంగ్లభాషా సాహిత్యములను బడులలో చదివి, తత్ప్రభావమునకు లోనై రచనలు సాగించినవారే. తమ వ్యక్తిగతమైన కృషివలన దారి చూపవలసిన ఆవశ్యకత పాశ్చాత్త్యులకు గాని, స్వయంకృషి చేయలేకపోవుట దేశీయులకు గాని లేదు. ఇదిగాక, 'కంపెనీ' పరిపాలనము అంతమై, ఇంగ్లీషు పార్లమెంటునకు ప్రతినిధులుగ మన దేశమున పరిపాలనము నాగించుచు వచ్చిన ఇంగ్లీషు ఉద్యోగులు, మొట్టమొదటిలో—1857 వ సంవత్సరమందలి విప్లవము వలన గాబోలు— మనయందు, మన సాహిత్య సంస్కృతులయందు, 'కంపెనీ' ఉద్యోగులంత సానుభూతిగ కూడ లేరైరి. వీని నన్నింటినిబట్టి చూడగా, పందొమ్మిదవ శతాబ్ది ఉత్తరార్థములోని భావవిప్లవమునకు, 'ఇంగ్లీషుచదువుల' ప్రాచుర్యమే కారణముగా కన్పట్టుచున్నది.

ఇట్లు సర్వవిధముల 'మార్పు' పనిచేయుచున్న ఆకాలములో, ఈ 'మార్పు'నకు 'తల్లి' అయిన 'ఇంగ్లీషు చదువు'లను గూర్చి కొంత తెలిసికొనవలసి యున్నది. ఈ 'మార్పు' యావద్భారతమునకును సంబంధించినదే కనుక, ముందు కొంత విశాలముగ నిది పరీక్షింపబడి, తరువాత ఆంధ్రదేశమునకు సమన్వితము చేయబడును.

పాశ్చాత్త్యులతో - ముఖ్యముగా ఇంగ్లీషువారితో - సన్నిహితత్వము కలిగిన తరువాత కొంతకాలమువరకు, భారతీయు లే విధముగ, పాశ్చాత్త్య సాహిత్య సంస్కృతులను చూచిరో తెలిసికొనుటకు 'సురేంద్రనాథ్ బెనర్జీ' (Sir Surendranath Banerjea) వ్రాసిన ఈ క్రింది వాక్యములు బాగుగ నుపకరించును.

"Our fathers, the first fruits of English education were violently pro-British. They could see no flaw in the civilization or the culture of the West. They were charmed by its novelty and its strangeness. The enfranchisement of the individual, the substitution of the right of private judgement in place of traditional authority, the

exaltation of duty over custom, all came with the force and suddenness of a revelation to an Oriental people who knew no more binding obligation than the mandate of immemorial usage and venerable tradition. Everything English was good— even the drinking of brandy was a virtue ; everything not English was to be viewed with suspicion''[1]

పై వాక్యములు వ్రాయునాటికి 'బెనర్జీ'కి డెబ్బదియైదు సంవత్సరముల వయస్సు. 1850 ప్రాంతమున పుట్టిన ఈయన తన బాల్యదశను, తన కాలము నాటి పెద్దల యభిప్రాయములను, తెలియజేయుట కిట్లు వ్రాసెను. ఆంగ్ల విద్యకై అలమటించిన ఆకాలమున విద్యావంతుల మనస్సు లిట్లే యుండెను. కలకత్తాలో సంస్కృత పాఠశాలను స్థాపించుట యనావశ్యకమని ఆనాటి గవర్నరు-జనరలునకు, రాజా రామ మోహనరాయలు వ్రాసిన లేఖ (11-12-1823) లోని ఈ క్రింది భాగము పరిశీలించినచో, సురేంద్రనాథ్ బెనర్జీ పైని వ్రాసిన వాక్యముల సత్యము నిరూపితమగును

"This seminary (similar in character to those which existed in Europe before the time of Lord Bacon) can only be expected to load the minds of youth with grammatical niceties and metaphysical distinctions of little or no pratical use to the possessor or to society. The pupils will there acquire what was known 2,000 years ago, with the addition of vain and empty subtleties since produced by speculative men............ I beg your Lordship will be pleased to compare the state of science and literature in Europe before the time of Lord Bacon with the progress of knowledge since he wrote. If it had been intended to keep the British nation in ignorance of real knowledge, the Baconian philosophy would not have been allowed to displace the system of the schoolmen.................... In the same way the Sanskrit system of education would be the best calculated to keep this country in darkness, if such had been the policy of the British legislature.''[2]

ఈ వాక్యములను బట్టి నాటివారికి ఆంగ్లవిద్యయందు గల మక్కువ తెలియును.

---

1. 'A Nation in Making' by Sir Surendranath Banerjea; 1925; Page - 308.

2. English works of Rajah Rammohan Roy (Panini Edition) Rammohan Roy's Letter to Lord Amherst, Governor-General, December 11th, 1823. (Selections from Educational Records; page-100.)

భారత దేశములో ఆంగ్లేయుల పరిపాలన స్వదేశీయుల రాజకీయార్థిక నైతిక జీవితములందు మార్పులు తెచ్చెను. ఆసియా ఖండములోనున్న భారత దేశ మొక్కసారిగా, యూరపు దేశమున నున్నట్లయ్యెను. ఈమార్పు జన సామాన్యము వరకు గాఢముగ వ్యాపింపకున్నను, విద్యావంతులలోమాత్రము నిశితముగ ప్రవర్తిల్లెను. ఈమార్పు, భారతదేశములో వంగదేశమున మొట్ట మొదట గాఢముగ వచ్చుటచే నచ్చటి మేధావంతుల రచనల యందును, వారి మాటలయందు నిది ప్రస్ఫుట రూపమున వ్యక్తమయ్యెను. కేశవ చంద్ర సేను 'భారతదేశములో ఉపన్యాసములు' (Keshab Chandra Sen's Lectures in India) అను గ్రంథమున నిట్లు వ్రాసెను.

"Politically and intellectually England is our master. We have been brought up in the school of English thought and have been inoculated with Western ideas and sentiments."

వంగదేశములో సాహిత్య సంప్రదాయమునందు విప్లవము తెచ్చిన మహాకవి మైకేల్ మధుసూదనదత్తు పాశ్చాత్య సాహిత్య సంస్కృతులకు సమ్మోహితుడై రచనలు సాగించెను. కలకత్తాలో 1859 లో ప్రదర్శింపబడిన అతని 'శర్మిష్ఠ' అను నాటకమునుగూర్చి అతడు వ్రాసిన వాక్యములు యావద్భారతములోను ఆంగ్లేయసాహిత్యవాసనావాసితులైన మేధావంతుల మాటలకు ప్రతినిధులు. తన మిత్రునకు వ్రాసిన ఒక లేఖయందతడు పాశ్చాత్య సాహిత్య సంస్కృతుల ప్రభావమునుగూర్చి యిట్లనెను :

"What care you if there be a foreign air about the thing (Sarmistha)? Do you dislike Moore's Poetry because it is full of Orientalism? Byron's Poetry for its Asiatic air, Carlyle's prose for its Germanism? Besides, remember that I am writing for that portion of my countrymen who think as I think, whose minds have been more or less imbued with Western ideas and modes of thinking; and that it is my intention to throw off the fetters forged for us by a servile admiration of everything Sanskrit."[3]

విద్యావంతులైనవారిలో చాలమంది భావములు పైని పేర్కొన్న విధముగా నుండెను. విద్యావిధానములో వచ్చిన మార్పులతోబాటు సాంకేతిక విజ్ఞానము, దేశములో వినియోగమునకు వచ్చుటవలనకూడ చాలమార్పులు వచ్చెను.

3. Life of Madhusudan Dutt by Yogindra Nath Basu. Calcutta. 1905; Page - 231.

"The early years of the second half of the nineteenth century were a formative period of even greater importance, in which the tide of westernization set strongly on the shores of India. A mere recital of dates is sufficient to show the rapid succession of changes. In 1853 the first railway began running; in 1854 the first telegraph line was opened and the modern postal system was installed. In 1857 the first universities were established and the Mutiny broke out. Next year the Government of India was transferred from the East India Company to the Crown. In 1861 the seeds of popular represen tation were sown by the institution of Legislative Councils."[4]

పాశ్చాత్య పద్ధతిలో నేర్పబడుచుండిన విద్యావిధానము అమలులోనికి వచ్చిన వెంటనే, 'క్రొత్తనీటికి చేప లెగబడినట్లు' విద్యార్థులు విశ్వవిద్యాలయములలోనికి చేరవచ్చిరి. ఈ విషయమునుగూర్చి 1866 లో కలకత్తా విశ్వవిద్యాలయమునకు వైస్-ఛాన్సలర్ అయిన 'సర్ హెన్రీ మెయిన్' (Sir Henry Maine) ఇట్లు వ్రాసెను.

"I do not think anything of the kind has been seen by any European University since the Middle Ages."[5]

ఇట్లు జరిగిన విద్యావ్యాప్తివలన, భారతీయుల దృక్పథమున తీవ్రమైన మార్పువచ్చినది. ఈమార్పే పందొమ్మిదవశతాబ్ది ఉత్తరార్ధము యొక్క విశిష్ట ధర్మము. ఇది యావద్భారతమున పొడగట్టినట్లే ఆంధ్రదేశమునను విజృంభించినది.

పాశ్చాత్య సాహిత్య సంస్కృతుల ప్రభావమునను, విద్యావిధానము నందువచ్చిన మార్పుల వలనను; మనవారి 'చదువు' పద్ధతి చాలమారెను. ఈ మార్పునకు ముద్రణకళకూడ దోహదమిచ్చినది. ఇవన్నియు కలిసి. భారతీయ సంప్రదాయమైన 'గురుముఖాధ్యయన పద్ధతి'కి (Oral Tradition) స్వస్తిచెప్పి, వచన రచనాభివృద్ధికి దోహదము చేసినవని విజ్ఞుల యభిప్రాయము. ఇది తెలుగు విషయముననేగాక మిగిలిన భారతీయభాషల విషయమునను సత్యమే. ఈ సందర్భమునుగూర్చి చెప్పుచు నొకమేధావి, వంగభాష విషయమున నిట్లు వ్రాసెను. ఇది మిగిలిన భాషలకును అన్వయించును.

---

4. 'General Survey' in 'Modern India and the West'. Chapter by L.S.S O'Malley, C. I. E. 1941. page - 576.

5. 'Village Communities in the East and West' (1876). By H. S. Maine. Pages - 277, 279; as quoted by L. S. S. O'Malley in his 'General Survey', a chapter in the book 'Modern India and the West—1941.

"The disappearance of the oral tradition as the result of the introduction of printing had the most salutary effect on the form of Bengali poetry, just as the contact with English enriched its subject - matter. Poems were no longer meant to be chanted or sung, but to be read and recited."[6]

ఈ రచయితయే, ఆంగ్లసాహిత్య ప్రభావమున వంగసాహిత్య మెట్లు సంపన్నమయినదో, ఈ విధముగా తెలిపెను.

"A comparison with its (Bengali's) present state will show how the contact with English has given it substance, variety, intellectuality, and modernity. It has developed a wide range of interests and has become a fit medium for adult and civilized consciousness. More important than anything else, it has become humanized……… The English language has given the Indian vernaculars access not only to English literature but, through translations, to the literature of Europe"[7]

ఈ వాక్యములు నవ్య వంగసాహిత్యమునకు విశేషముగ నన్వయించినను, పందొమ్మిదవ శతాబ్దిలోని వంగ సాహిత్యమునకు కూడ నన్వయించును. తెలుగువిషయమున గూడ ఈ వాక్యములు సత్యములే. ఆంగ్లసాహిత్యమును చదివి ముగ్ధులైన ఆంధ్రులును పై విధముగనే యూహించిరి. పందొమ్మిదవ శతాబ్ది పూర్వార్థము గడచునాటికి; దేశములో సాహిత్యమున గాని సంఘమున గాని విప్లవము రావలెనన్న పాశ్చాత్యుల భావానుసరణమే కర్తవ్యమను భావము మనవారి హృదయములలో స్థిరముగ నాటియుండెను.

విద్యావంతులు దేశభాషలలోని గ్రంథములనుకొనుట తగ్గించి, 1834-1835 నాటికే, ఆంగ్లగ్రందములను విశేషముగ కొనుచుండుటయు దీనినేతెలుపును.[8]

పాశ్చాత్య సంపర్కము వలన కలిగిన నవీన భావ ప్రసరణమునకు భాషా పత్రికలుకూడ చాల తోడ్పడెను. అనేకములైన ఉద్యమములలో ముందడుగు వేసినట్లే ఈ యుద్యమమునను వంగదేశమే ముందడుగు వేసెను. ఇందులకు ముఖ్య కారణము పాశ్చాత్యులతోడి సంపర్కము గాఢముగా వంగదేశమునకు

6. 'Literature and Drama - Bengali.' by J. C. Ghosh, M A, Ph. D. (Modern India and the West, Oxford., 1941—Page - 487)

7. Ibidem, page - 487.

8. "The statistics of the sale of books in 1834 and 1835 are an index of the trend of popular taste. Nearly 32,000 English books were sold, but under 13,000 books written in Hindustani, Hindi and Bengali, and only 15,00 written in Persian, written Arabic and Sanskrit." (Ibidem; page-575; Foot-note.)

సోకుటయే. ఈ కృషిలో ముందంజ వేసినవారు శ్రీరామపురపు మిషనరీలు. 'మార్షమేన్' అను మిషనరీ (Marshman, the Missionary) ఫిబ్రవరి 1816 లో 'దిగ్దర్శన్' అను మాసపత్రిక నొకదానిని వంగభాషలో ప్రారంభించెను తరువాత నాతడే 'సమాచార్ దర్పణ్' అను వారపత్రికను మే 23 వ తేదీ 1816 లో ప్రారంభించెను. ఇంచుమించుగా భారతీయ భాషలలో వెలువడిన మొదటి పత్రిక ఇదియే అనవచ్చును.[9] బొంబాయిలోని మొట్టమొదటి పత్రిక 'బొంబాయి సమాచార్' ఇది 1822 లో ప్రారంభింపబడినది.

"Bombay's first Indian paper was the 'Bombay Samachar', a weekly that made its bow on 1 July 1822 and found in the Bombay Government a subscriber for fifty copies."[10]

కలకత్తాలో 'పత్రిక'ను నెలకొల్పి తన ప్రతిభచేత, ఆ సంస్థ మిక్కిలి యభివృద్ధికి వచ్చునట్లు చేసిన మహనీయుడు రామమోహనరాయలు. ఈతడు, 1821 డిసెంబరులో 'సంబాద్ కౌముది' అను పత్రికను స్థాపించి, నవ్యభావ ప్రచారమున కుపక్రమించెను. భారతీయులు స్వయముగా నడుపుట ప్రారంభించిన మొట్టమొదటి దేశభాషా పత్రిక ఇదియే యనవచ్చును. ఇది వార పత్రిక.

"The 'Sambad Kaumudi' was practically the first Bengali paper edited and conducted by Bengalis, the first of all, the 'Bengal Gazette' of 1816, was apparently a small one-man paper that died too soon to be remembered as a pioneer."[11]

ఇందు ప్రజలకు మంచిని చేకూర్చు సమస్త విషయములు ప్రచురింపబడి, చర్చింపబడెడివి. ఈపత్రిక వైశిష్ట్య మిట్టిది.

భారతదేశములోని భాషా పత్రికల 'పరిణామ వికాసములచర్చ' విషయము కాదుగనుక, ఆరంభమున మార్గముచూపిన వానిని కొన్నింటినిగూర్చి మాత్రమే వ్రాసితిని. ఈ 'ప్రథమ పత్రికలు' ప్రజలలో భావవిప్లవమును తెచ్చుటకు మిక్కిలి తోడ్పడినవి. దేశభాషా పత్రికలేగాక, ఆంగ్ల భాషలో కొన్ని పత్రికలు బయలుదేరినను వాని నిట పేర్కొనలేదు. ఇందులకు ముఖ్యకారణము;

---

9. "In general the 'Samachar' is thought of as the first Bengali (and Indian) newspaper, though mention can be found of a 'Bengal Gazette' published in 1816 that was feeble from birth and died in less than a year."

'The Press' by W.C. Wordsworth. (Modern India and the West; Oxford; 1941 ; Page - 200.)

10. Ibidem ; Page - 200.

11. Ibidem ; Page - 202.

ప్రజలపై వానిప్రభావము పడునంతగా, ఆంగ్లపత్రికలను చదువగలిగిన ప్రజా సమూహము లేకుండుటయే.

మద్రాసు రాష్ట్రములోగూడ నిట్టిపత్రికలు బయలుదేరెను. వానిలో తెలుగువారు నడపినవి కొన్నిగలవు. ఇట్టిపత్రికలలో, ఇంచుమించుగా ప్రప్రథమమైనపత్రిక శ్రీ గాజుల లక్ష్మీనర్సు సెట్టిగారు మద్రాసునుండి నడిపిన "క్రెసెంట్" అను ఆంగ్లపత్రిక.[12] నాడు మద్రాసులో జాతీయతను పెంపొందించుటయందును, కుంఫిణీ పరిపాలనలోని అన్యాయములను విప్పిచెప్పుటయందును దీనివలె కృషి చేసిన పత్రిక ఇంకొకటిలేదు గనుక, ఆంగ్లపత్రిక అయినను దీనిని పేర్కొనుట అయినది.

ఈ సంధియుగములో తెలుగుపత్రిక లెన్నియో బయలుదేరెను. పండితులైనవారందరు, ఎప్పుడో ఒకప్పుడు ఏదో ఒక పత్రికను నడపినట్టివారే యనుటలో నతిశయోక్తి లేదు. చిన్నయసూరి 'సుజనరంజని' అను పత్రికను నడపెను. ఈపత్రిక 1867 వరకు నడచి ఆగిపోయెను. ఆ కాలమునాడే తత్త్వబోధిని యను పత్రిక (1864-1869) యొకటి వెలువడుచుండెను విశాఖపట్టణము నుండి, మహామహోపాధ్యాయ పరవస్తు వేంకటరంగాచార్యులుగారి 'సకల విద్యాభివృద్ధిని' యనుపత్రిక 1872 నాటికే వచ్చెడిది. మహామహోపాధ్యాయ కొక్కొండ వెంకటరత్నం పంతులుగారి 'ఆంధ్రభాషా సంజీవని', 1871 లో స్థాపింపబడెను. శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారి 'వివేకవర్ధని' 1874లో స్థాపింపబడెను. ఇంకను ఎందరో పండితులు, పత్రికలను నడపెడివారు. ఇందు కొన్నిమాత్రమే పేర్కొనబడెను. ఈవిధముగా, పందొమ్మిదవశతాబ్ది ఉత్తరార్థమున భావ విప్లవమునకు పత్రికలుకూడ చాల దోహదముచేసెను. ఈపత్రికలలో కొన్ని కేవలము పాండిత్య స్ఫోరకములైన శాబ్దికచర్చలు ప్రకటించుచుండగా కొన్ని పత్రికలు పాశ్చాత్య సంపర్కము వలన వచ్చిన విజ్ఞానము నంతను తమ ముఖముల ప్రజలకు ప్రకటించుచుండెను.

ఇట్టి పత్రికలలో, మచిలీ పట్టణమునుండి వచ్చుచుండెడి 'శ్రీ దైవ సమాజిని' అను 'పురుషార్థ ప్రదాయిని' ఒక్కటి. దీనికి సంపాదకులు శ్రీ ఉమా రంగ నాయకులు నాయుడుగారు ఈ పత్రిక జనవరి 1872 లో ప్రారంభింప బడినది. దీని ఆదర్శము లిట్లు చెప్పబడెను.

"...Chiefly intended to be a Concise Telugu Record of Science, Art, Antiquities, Agri-Horti-Flori culture, Folklore, Literature,

12. 'క్రెసెంట్' మొదటి సంచిక, అక్టోబరు 2 వ తేదీ 1844 లో వచ్చెను. దీనికి 'హార్లే' అను దొర సంపాదకుడు,

Religion, Natural Theology, Medicine, Morality, Mythology, Merchandise, Manufactures, Handicrafts, Natural History, Biography, Law, History, Curiosities, Rarities, Recreations, etc.........."[13]

పైని పేర్కొనబడిన ఆదర్శములనుబట్టి, పాశ్చాత్య విజ్ఞానవ్యాప్తిని స్వదేశస్థులలో కలిగించి, భావ విప్లవమును తెచ్చుటకై, పందొమ్మిదవ శతాబ్ది మధ్య కాలమున ఎంత కృషి జరిగినదో తెలియుచున్నది ఈ కృషి ఫలితమే శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారిని బోలిన పూర్ణపురుషుల విజృంభణము.

ఈ యుగసంధిలో, భావ విప్లవము వచ్చుటకు ముఖ్యముగా తోడ్పడినది పాశ్చాత్య పద్ధతుల ననుసరించి నేర్పబడిన విద్య. భారత దేశములోని జనులందరిని తమ సంస్కృతి ప్రభావములోనికి తెచ్చుకొన గలిగినంత మంది పాశ్చాత్య దేశస్థులెప్పుడు నిక్కడ లేరు. పాఠశాలలలో ఆంగ్లభాషా సాహిత్యముల పఠనమే ఈ భావ విప్లవమును తెచ్చెను.[14] కనుక, 'ఇంగ్లీషు చదువులు' మన రాష్ట్రమున (మద్రాసు, తత్పరిసరములకు; ఆంధ్ర ప్రాంతమునకు సంబంధించినంతవరకు) ఎట్లు క్రమపరిణామమును పొందెనో దిఙ్మాత్రముగ పరిశీలింతము.

'ఇంగ్లీషు తూర్పిండియా కంపెనీ' వారు, మన దేశములోని వారి ప్రథమదశలో, తమ లాభనష్టములను గుణించుకొనుటయందు చూపిన శ్రద్ధ, ఇంక దేనియందును చూపలేదు. నాటి వారి ప్రధానాశయము; తమ వాణిజ్యమును, దాని రక్షణకు ఆవశ్యకములయిన హక్కులను కాపాడుకొనుటయే. మిషనరీలు మాత్రము; తమ మతప్రచారమునకు అంగముగా, విద్యాసంస్థలను స్థాపించుటను చేసికొనుటచే; వారు చిన్నచిన్న బడులను వివిధ ప్రాంతములలో నెలకొల్పి, బాలురకు చదువుచెప్పుచుండిరి. క్రమక్రమముగా; తమ వాణిజ్య స్థావరములందును, తమ కోటలయందును గల ప్రాచ్య పాశ్చాత్య ఉద్యోగుల సంతానమునకు విద్య నేర్పింపవలసిన ఆవశ్యకత వచ్చుటతోడనే, కంపెనీ

---

13. 'పురుషార్థప్రదాయిని' నం. 1. జనవరి 1872 నుండి గ్రహింపబడినది.

14. "Language and the literature in which thought finds expression lie at the root of mental culture, and knowledge of the English language and the study of English literature have done more to spread western culture than personal contacts with Europeans in general and the British in particular."

('General Survey' by L. S. S. O'Malley, in 'Modern India and the West' Oxford; 1941. page - 579.)

వారును, ఈ విషయమై కొంత ఆలోచింప మొదలిడిరి. మొట్టమొదటిసారిగా ఇట్టి చర్చను 1670 లో కంపెనీ డైరెక్టరులు చేసిరట! దీని ఫలితమే 1673 లో మద్రాసుకోటలో స్థాపింపబడిన పాఠశాల దీనియందు 'ప్రిన్గిల్' (Pringle) అను స్కాట్లండు దేశీయుని, సాలునకు ఏబది పౌనుల జీతముపై, కంపెనీవారు నియమించి; "పోర్చుగీసు, బ్రిటిషు యురేషియను పిల్లలకు, కంపెనీ ఉద్యోగులగు భారతీయుల పిల్లలకు" చదువు చెప్పించుచు వచ్చిరి. ఇట, బోధనాభాష; నాడు పాశ్చాత్య స్థావరములలో విశేషప్రచారమున నున్న, పోర్చుగీసు భాషయొక్క భ్రష్టరూపమైన భాష (Portuguese Patoes).[15]

'ప్రిన్గిల్' తరువాత, ఈ పాఠశాలలో 'రాల్ఫ ఆర్డ్' (Ralph Ord) అను నాతడు ఉపాధ్యాయునిగ పనిచేసెను (1678) ఈతని తరువాత, ఆరు పెగోడాల జీతముపై 'జాన్ బార్కర్' (John Barker) అను నాతడు పనిచేసెను (1682). ఇట్లు స్థాపింపబడి పనిచేయుచున్న పాఠశాలను పరీక్షించు బాధ్యతను, కంపెనీ డైరెక్టరులు, కోటలోని 'ఛాప్లైన్' (మతోద్యోగి)పై నుంచిరి. వారికి తమిళము, పోర్చుగీసు భాషలు గావలెనని నిర్దేశించిరి (1692). అప్పుడు 'లూయిస్' (Lewis) అను నాతడు 'ఛాప్లెన్'గా ఉండెను (1691–1714). ఈతని పర్యవేక్షణమున ఈ పాఠశాల నడచుచుండెను.

కాని, కంపెనీవారు భారతదేశములో విద్యావిషయకముగ చేయుచున్న కృషి తక్కువయని ఇంగ్లండులోని వారు భావించుచు, కంపెనీ వారిని విమర్శించుటయు కలదు. ఈ సందర్భమున, 'డీన్ ఆఫ్ నార్విచ్' (Dr. Prindeaux, Dean of Norwich) ఇట్లు వ్రాసెను.

"The Dutch had lately erected a college or university in Ceylon............The English East India Company are in this matter negligent."[16]

1673 లో కంపెనీవారు మద్రాసు కోటలో పాఠశాలను స్థాపించుటకు పూర్వమే, 1614 లో 'కెప్టెన్ బెస్ట్' (Captain Best) అను నాతడు; క్రైస్తవ మతవ్యాప్తికై మిషనరీలను సిద్ధముచేయుటకు, భారతీయులలో నుండి ప్రజలను గ్రహింపవలెనను నుద్దేశముతో; ఒక భారతీయ బాలుని తనతో ఇంగ్లండునకు తీసికొనిపోయి, రాజయిన 'మొదటి జేమ్సు' (James I) నకు చూపెనట! ఆ రాజా బాలునకు 'పీటర్' (Peter) అని పేరుపెట్టగా, కంపెనీ

15. Rev. Frank Penny's 'Church in Madras' Vol. I; page - 122.
16. Ibidem; page - 122.

వారు తమ ధనముతో, ఆ బాలుని చదివించిరట![17] కాని, తరువాతి విషయ మేమియు తెలియవచ్చుటలేదు. కంపెనీవారు, భారతీయులయందు విద్యను వ్యాపింపజేయుటకై చేసిన మొదటి ప్రయత్న మిదియని చెప్పవచ్చును.

ఈ సందర్భముననే, విద్యావ్యాప్తికి పరోక్షముగ సాయపడు గ్రంథాలయ స్థాపనమునుగూర్చి కొంత చెప్పవలసి యున్నది. 1661 - 1662 లో మద్రాసు కోటలో, 'వైట్‌ఫీల్డ్' (Whitefield) అను పాదరీ ప్రోత్సాహము వలన ఒక గ్రంథాలయము స్థాపింపబడెను. కొందరు వర్తకులు, తమ 'కేలికో' (Calico) అమ్మగా వచ్చిన దానిలోనుండి, గ్రంథాలయమునకై కొంత డబ్బు విరాళముగకూడ నిచ్చిరట ! 1663 లో ఇంగ్లీషుకంపెనీ డైరెక్టరులు, ఇరువదిపౌనుల విలువగల పుస్తకములను ఇంగ్లండులోకొని, మద్రాసు కోటలోని గ్రంథాలయములో నుంచుటకు పంపిరి. 1671 నాటికి, మచిలీపట్టణములో ఒక గ్రంథాలయమున్నట్లును, ఆ సంవత్సరములోనే అచ్చటి 'ఛాప్లైన్' అయిన 'హుక్' (Mr. Hook, the Chaplain) చనిపోగా, ఆతని పుస్తకములను గ్రంథాలయమునకు ఇచ్చివేసినట్లును, తెలియు చున్నది.[18]

మదరాసు కోటలోని గ్రంథాలయమును గూర్చిన వివరములన్నియు తమకు పంపవలెనని, 1714 లో ఇంగ్లండులోని కంపెనీ డైరెక్టరులు కోరగా, దాని ననుసరించి ఇచ్చటివారు 1716 లో గ్రంథాలయములోని పుస్తకముల పట్టిక నొకదానిని—విషయము ననుసరించి విభజించి సిద్ధము చేసినదానిని—ఇంగ్లండునకు పంపిరి. కాని, ఈపట్టిక వారికంత తృప్తిని కలిగించినట్లులేదు. కనుక, 1720 లో 'థామస్ వెండే' (Thomas Wendey, the Chaplain) అనునాతడు, కోటలోని పుస్తకములకు సరియైన పట్టికను తయారుచేసి, అధికారుల మెప్పును పొందెను. ఇందులకు సంతోషించి గవర్నరు అతనికి 'పల్లకి ఎలవెన్సు'కూడ ఇచ్చెనట! డైరెక్టరులు తాము కోటలోని గ్రంథాలయమునకు పుస్తకములను పంపుటయేగాక, ఇతరులు తమతో తెచ్చుకొను పుస్తకములకు కూడ 'ఓడసుంకము' లేకుండచేసి, చాల పాశ్చాత్య గ్రంథములు మనదేశములోనికి వచ్చుటకు సాయపడిరి. ఇది మిషనరీలకు చాల సదుపాయముగ నుండెను.[19]

---

17. Ibidem; page - 69.
18. Ibidem; page - 69.
19. Ibidem; pages - 187,190.

పదునేడవ శతాబ్ది తుదినాళ్ళలో, ఇంగ్లీషు ప్రభుత్వముకూడ; భారత దేశములోని ఇంగ్లీషు స్థావరములలో విద్యావిషయకముగ కంపెనీకిగల బాధ్యతను గుర్తించి, 1698లో కంపెనీవారికి 'పట్టా' (Charter) తిరిగి ఇచ్చు సందర్భమున వారి విధుల నిట్లు పేర్కొనెను.

"...........We further will and direct that the Company shall provide school masters in all the said garrisons and superior factories where they shall be found necessary."[20]

దీని ననుసరించి 1715 డిసెంబరులో మద్రాసు కోటలో, సెయింట్ మేరీస్ ఛారిటీ స్కూల్ (St. Mary's Charity School) స్థాపించి, కంపెనీ వారు తమ విధిని కొంత నిర్వర్తించుకొనిరి. ఇక్కడ బాల బాలికలకు చదువు, భోజనము ఉచితము. వీరిని ఐదవఏట బడిలోనికి తీసికొని, పండ్రెండవఏట పనులకై విడిచివేసెడివారు. ఈ పాఠశాల స్థాపనమున 'స్టీవెన్‌సన్' (Mr. Stevenson) అను నాతడు చాల కృషిచేసెనట!

ఇంగ్లీషువారేగాక, మిగిలిన పాశ్చాత్యులును మదరాసులో పాఠశాలలను తెరచుటకు ఇంగ్లీషువారి అనుజ్ఞ పొందుటయు; అట్టి అనుజ్ఞల నిచ్చుటయు, నాడు జరుగుచుండెను. జె. ఇ. గ్రుండ్లర్ (J. E Grundler) అను నాతడు; తనకు మద్రాసులోగాని దేవన పట్టణములోగాని, పాఠశాలను తెరచుటకు అనుజ్ఞ ఈయవలసినదిగా; మద్రాసు గవర్నరునకు వ్రాసికొనగా: ఆ అనుమతి ఇచ్చినట్లును; ఆతడు మద్రాసునందు రెండు పాఠశాలలను స్థాపించి నట్లును తెలియుచున్నది.[21] ఈ పాఠశాలలు 'గ్రుండ్లర్' చనిపోవువరకు (1720) బాగానడచెను. తరువాత మరల నివి, 'షూల్ట్జ' (Schultze) చే, పునరుద్ధరింపబడినవి (1726). ఇందులకు మద్రాసు గవర్నరు చాల సాయపడెనట! ఈ పునరుద్ధరణమునకు పూనుకొనిన 'షూల్ట్జ' తెలుగులో కూడ పండితుడు.

క్రైస్తవ మతమును స్వీకరించిన భారతీయుల బాలబాలికలకై, 1732 లో క్రైస్తవ విజ్ఞాన ప్రచార సమితివారు, మదరాసులో ఒక పాఠశాలను స్థాపించిరి. ఈ సమితి ('The Society for Promoting Christian Know-

20. Kaye's 'Administration of the East India Company'; 1853; page - 626.

21. "We have at Mr. Grundler's coming since to Madras, permitted him to erect a Portuguese school in the White Town and a Malabar school in the Black." (Rev. Frank Penny's 'Church in Madras'; Vol I; pages-190,191.)

ledge') మొట్టమొదట 1698 లో స్థాపింపబడినది. ఈ సమితికి చెందిన 'ష్వార్ట్జ్' (Schwartz) అనునాతడు, తిరుచునాపల్లిలో 'మందుగిడ్డంగి' పైని, చనిపోయిన యుద్ధభటుల సంతానమునకై, ఒక పాఠశాలను స్థాపించెను. ఇట్లు మిషనరీలు 'కంపెనీ' వారి అనుమతితో పాఠశాలలను స్థాపించుచు వచ్చి 'ఇంగ్లీషు చదువులు' దేశమున వ్యాప్తిని పొందుటకు చాల సాయముచేసిరి.

ఇట్లు నాటి మద్రాసు రాష్ట్రమున - ముఖ్యముగ మద్రాసు తత్పరిసర ప్రాంతములందు - ఇంగ్లీషు చదువులు, క్రమక్రమముగ వ్యాప్తిని పొందు చుండగా; యావద్భారత దేశమునకు, ప్రాచ్య విజ్ఞాన సంస్కృతుల ప్రచారము మూలమున, సేవచేసిన 'ఏషియాటిక్ సొసైటీ ఆవ్ బెంగాల్' (Asiatic Society of Bengal) 'సర్ విలియమ్ జోన్స్' (Sir William Jones; 1746-1794) యొక్క కృషి ఫలితముగా 1784 లో జనవరి 15 వ తేదీని స్థాపింపబడెను[22] 'ఏషియాటిక్ రిసెర్చెస్' అను పత్రికకూడ ప్రారంభింపబడినది. ఈ సంస్థ, పాశ్చాత్య పరిశోధనా పద్ధతులను ప్రాచ్య విషయముల పరిశీలనకు వినియోగించి, దేశములో సృజనాత్మక పరిశోధనలకు మూలకందమయ్యెను.

పాశ్చాత్యులతో వచ్చిన సన్నిహితత్వము యొక్క ప్రాముఖ్యమును గుర్తించిన, దేశీయ ప్రభువులును 'ఇంగ్లీషు చదువులు' వ్యాప్తికి వచ్చుటకు తగిన అవకాశములను కల్పించుచు వచ్చిరి. హైదరాలీ విరాళమిచ్చి, 1774 నాటికే 'ష్వార్ట్జ్' (Schwartz) చే 'తంజావూరు ఇంగ్లీషు ఛారిటీ స్కూల్' స్థాపింప జేసెను. 1785 లో, శివగంగ, రామనాడు పట్టణములలో ఆయా జమీందారుల సహకారముతో ఇంగ్లీషు బోధనాభాషగాగల పాఠశాలలు ఏర్పడెను. మద్రాసు గవర్నరయిన 'లార్డు మెకార్ట్నె' (Lord Macartney) ఇందుల కంగీకరించెను. 1787 లో మద్రాసులో 'ఫీమేల్ అర్ఫన్ ఎసైలమ్' (Female Orphan Asylum) అను పేరుపొందిన పాఠశాల, ఆర్కాటు నవాబు ఇచ్చిన భవనములో స్థాపింపబడెను. ప్రారంభించునాటికి ఇందు నూట ఎనమండుగురు బాలికలు కలరు, ఆ సంవత్సరమే జూన్ 1 వ తేదీనాడు 'మేల్ అర్ఫన్ ఎసైలమ్' (Male Orphan Asylum) అను పాఠశాల 'డాక్టర్ బెల్'

---

22. 'ఏషియాటిక్ సొసైటీ ఆఫ్ బెంగాల్' యొక్క స్థాపనకు 'వారన్ హేస్టింగ్స్' (Warren Hastings) కూడ చాల సాయము చేసెను. దీని ఆశయముగా, "................ enquiry into the history and antiquities, arts, science and literature of Asia", అని చెప్పబడెను.

(Dr. Bell) అను నాతని పర్యవేక్షణమున స్థాపింపబడెను. ఇందు లెక్కలు. వ్రాత, చదువుట, క్రైస్తవమత సిద్ధాంతములను బోధించెడివారు.

ఇట్లు మెల్ల మెల్లగా పదునెనిమిదవ శతాబ్ది అంతమై, పందొమ్మిదవ శతాబ్ది వచ్చినది. ఇంగ్లీషు కంపెనీ, భారత దేశములో తన ఉనికి స్థిరమైనదని గ్రహించినది. 1813 వ సంవత్సరము వచ్చునప్పటికి, కంపెనీవారు దేశీయులలో విద్యావ్యాప్తిని కలిగించు విషయమున, ప్రత్యేకశ్రద్ధ చూపుటకు మొదలిడిరి. దీని కనువగునట్లు మద్రాసునకు 'సర్ థామస్ మన్రో' (Sir Thomas Munro) గవర్నరయ్యెను. ఈతడు 1822 లో జూన్ 25 వ తేదీని, జిల్లా కలెక్టరులకు తమతమ జిల్లాలలోని విద్యా విధానములనుగూర్చి సమగ్రముగ తెలిసికొని 'రిపోర్టులు' పంపుడని ఆదేశించెను. 'మదరాసు ప్రెసిడెన్సీ'లో, 'ఇంగ్లీషు చదువులు' వ్యాప్తికి వచ్చుటకు పూర్వరంగమున జరిగిన ప్రయత్నములలో, 'మన్రో' ఆదేశమును, దానికి కలక్టరులు పంపిన 'రిపోర్టులు'ను ముఖ్యమైనవి. ఇవి, దేశములోని నాటి 'విద్యాస్థితి'ని తెలుపు 'రికార్డులు'.

1824 లో, 'మన్రో' దొరకు కలక్టరులు పంపిన రిపోర్టులనుబట్టి మద్రాసు రాష్ట్రములో 12,498 పాఠశాలలును; 1,88,650 మంది చదువుకొనువారును కలరని తేలినది. ఇందు 1,84,110 మంది బాలురు, 4,540 మంది బాలికలు. 740 పాఠశాలలు కాలేజీలుగా పేర్కొనబడెను. ఈ రిపోర్టులలో బళ్ళారి కలక్టరయిన ఎ. డి. కాంబెల్ (A. D. Campbell) దొర పంపిన రిపోర్టు చాల ముఖ్యమైనది. తెలుగులో మంచి పండితుడైన ఈతడు, నాటి ప్రాచ్య విద్యా విధానమునుగూర్చి చక్కగా తెలిసికొని వ్రాసి పంపగలిగెను.

ఈ రిపోర్టుల ననుసరించి 'మన్రో' ఒక ప్రణాళికను సిద్ధముచేసి, కంపెనీ డైరెక్టరులకు అనుమతికై పంపెను. దీని ననుసరించి (1826 మార్చి 10 వ తేదీ) ఉపాధ్యాయులను సుశిక్షితులను చేయుటకై మద్రాసులో ఒక 'బోధనాభ్యసన పాఠశాల'యు, కలక్టరేటులలో రెండేసి పాఠశాలలును, తహసీల్దారీలలో ఒక్కొక్క పాఠశాలయు నిర్మించుట ఉచితమని నిర్ణయమైనది. 'కమిటీ ఆఫ్ పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్' (Committee of Public Instruction) అనునది ఏర్పాటు చేయబడెను. కలక్టరేటు స్కూళ్ళలో హిందువుల పాఠశాలలో ప్రాంతీయ భాషలోను, ముస్లిముల పాఠశాలలో హిందూస్థానీ, అరబ్బీభాషలలోను విద్య నేర్పబడుచుండెను. ఇంగ్లీషు అందరును నేర్చుకొనవలసినభాష. ఈ ప్రణాళిక ననుసరించి మొత్తముమీద నూరు స్కూళ్ళు ఏర్పడినవి.

ఇట్లు దేశములో ఇంగ్లీషు చదువులకు చక్కని వాతావరణము ఏర్పడి యున్న సమయమునందే 'లార్డ్ మెకాలే' (Lord Macauly) యొక్క 'యాద్దాస్తు' (Minute of Dissent) 1835 లో ఫిబ్రవరి 2 వ తేదీని, వ్యక్తపరుపబడెను. ప్రాచ్య పాశ్చాత్యములైన విద్యా విధానములలో దేనిని భారతీయులలో ప్రచారమునకు తేవలయును అను విషయమున ఏకవాక్యత కుదురక 'కమిటీ'వారు (General Committee of Public Instruction) సతమత మగుచుండిరి. వారు, 'సంప్రదాయవాదులు' Orientalists) 'సంస్కరణాభిలాషులు' (Anglicists) అను రెండు తెగలుగా చీలిపోయిరి. మెకాలే 'యాద్దాస్తు', గవర్నరు జెనరలు అయిన 'లార్డ్ విలియమ్ బెంటింక్' (Lord William Bentinck) నకు మంచిబలము కలిగించెను. సంస్కరణాభిలాషులు జయించిరి. 'లార్డ్ విలియమ్ బెంటింక్' యొక్క తీర్పు, ఇంగ్లీషు చదువులను మనదేశములో సుస్థిరము చేసెను. 1835 మార్చి 7 వ తేదీని, 'లార్డ్ విలియమ్ బెంటింక్,' ఈ క్రిందితీర్మానమును తన 'కౌన్సిలు' సభ్యులచే అంగీకరింపజేసెను.

"His Lordship in Council is of opinion that the great object of the British Government ought to be the promotion of European Literature and Science among the natives of India, and that all the funds appropriated for the purposes of education would be best employed *on English education alone.*"

ఈ తీర్మానము అంగీకరింపబడుట తోడనే, విద్యా విషయమున 'సంస్కరణాభిలాషులు' మంచి ఉత్సాహముతో పనిచేయ జొచ్చిరి. 1839 లో 'లార్డ్ ఎల్ఫిన్‌స్టన్' (Lord Elphinstone) యొక్క ప్రణాళిక ననుసరించి, మద్రాసు ప్రెసిడెన్సీలోని జిల్లా కేంద్రములలో, ఇంగ్లీషు బోధనా మధ్యస్థము (Medium of Instruction) గా గల పాఠశాలలు నిర్మింపబడవలెనని నిర్ణయమయినది. దీని ననుసరించి, ప్రెసిడెన్సీలోని నాలుగుచోటులందు (ముఖ్యభాషల ననుసరించి)—తిరుచునాపల్లి (తమిళప్రాంతము), మచిలీపట్టణము

---

23. దేశములో ఇంగ్లీషు చదువువైపు మ్రొగ్గు ఉన్నట్లు రాజా రామమోహనరాయలు, నాటి గవర్నరు జెనరలునకు వ్రాసిన లేఖ (11-12-1823) లోని "......In the same way the Sanskrit system of education would be the best calculated to keep this Country in darkness" అను వాక్యమును; మెకాలే యొక్క యాద్దాస్తులోని; "...I think it clear...that English is better worth knowing than Sanskrit or Arabic that the natives are desirous to be taught English, and are not desirous to be taught Sanskrit or Arabic..." అను వాక్యమును, తెలియజేయుచున్నవి.

(తెలుగు ప్రాంతము), బళ్ళారి (కన్నడ ప్రాంతము), కేలికట్టు (మలయాళ ప్రాంతము)—ఇట్టి పాఠశాలలు స్థాపింపబడెను. తరువాత ఒక 'యూనివెర్సిటీ బోర్డు' (University Board) ను స్థాపించుటకు ప్రభుత్వ మంగీకరించి, ఆ బోర్డునకు నాటి అడ్వకేటు జెనరలు (Advocate-General) అయిన 'జార్జి నార్టన్' (George Norton) దొరను అధ్యక్షుని చేసిరి.

1841 ఏప్రిల్ 14 వ తేదీని, 'మద్రాసు యూనివెర్సిటీ'[24] అను పేర నొక విద్యాసంస్థ, మద్రాసులో స్థాపింపబడెను. యూనివెర్సిటీబోర్డు కృషిఫలిత మిది. ఈ సంస్థను ప్రారంభించునప్పుడు చేసిన సభలో కర్ణాటక నవాబు మొదలయిన దేశీయులలోని పెద్దలందరు నుండిరి. నాటి విద్యావంతులలో సుప్రసిద్ధులయిన ఆంధ్ర ప్రముఖులకు యూనివెర్సిటీ బోర్డునందును, దీని ప్రణాళిక ననుసరించి స్థాపింపబడిన విద్యా సంస్థయొక్క కార్య నిర్వాహక వర్గము నందును స్థానముండెను. ఇట్టివారిలో కోమలేశ్వరపురం శ్రీనివాసపిళ్ళ, వెంబాకం రాఘవాచార్యులుగారలు ముఖ్యులు. విద్యాసంస్థను ప్రారంభించుచు చేసిన సభలో, జార్జి నార్టన్గా రిట్లు సంస్థ ప్రధానాశయమును తెలిపిరి. "...... It is directed to the supply of a thorough measure of education in the higher and most useful departments of Science and Literature." ఈ సందర్భమున స్థాపింపబడిన పాఠశాలకు 'ఇ. బి. పావెల్' (Eyre Burton Powell) అను నాతడు 'హెడ్ మాస్టరు' (Head Master) గా నియమింపబడెను. ఈ పాఠశాల, మద్రాసులో ఇంగ్లీషు చదువులకు మూలకందమై పని చేయజొచ్చెను.

భారత దేశములోని ప్రెసిడెన్సీ ముఖ్యపట్టణములలో మూడు విశ్వవిద్యాలయములును (మద్రాసు, కలకత్తా, బొంబాయి) స్థాపింప బడుటకు పూర్వమే; ఆంధ్రదేశములో స్థాపింపబడి, నేటివరకును - ఇంచుమించు - అవిచ్ఛిన్నముగా పనిచేయుచు వచ్చిన కొన్ని ప్రముఖ విద్యాసంస్థల నిట పేర్కొనవలసి యున్నది. 1842 లో, 'ఆంగ్లో వర్నాక్యులర్ స్కూల్' (Anglo Vernacular School) గా, 'యునైటెడ్ లూథరెన్ చర్చిమిషను' (United Lutheran Church Mission) వారిచే ప్రారంభింపబడిన గుంటూరులోని

---

24. ఈ విద్యాసంస్థయే తరువాత 'ప్రెసిడెన్సీ కాలేజి' (Presidency College) గా మార్చబడినది (1855). ఇప్పుడున్న 'మద్రాసు యూనివెర్సిటీ', 1857 లో కలకత్తా, బొంబాయి విశ్వవిద్యాలయములతోబాటు స్థాపింపబడెను.

నేటి ఆంధ్రక్రైస్తవ కళాశాల; 1846 లో, లండను మిషనునకుచెందిన 'వార్డ్లా' (Rev. R. S Wardla, D. D.) చే ప్రారంభింపబడి తరువాత 'వార్డ్లాకాలేజి' అని పేరుపొందిన బళ్ళారిలోని విద్యాసంస్థ; 1852 లో నాటి గోదావరి జిల్లా కలక్టరయిన 'పెండర్‌గాస్ట్' (Pendergast) కృషివలన 'మిడిల్‌స్కూలు'గా ప్రారంభమైన కాకినాడలోని నేటి పిఠాపురంరాజావారి ప్రభుత్వ కళాశాల; 1853 లో 'జిల్లాస్కూలుగా' ప్రారంభమైన రాజమహేంద్రవరములోని నేటి గవర్నమెంటు ఆర్ట్సు కాలేజి; 1853 లోనే రాజమహేంద్రవరము సబ్‌కలక్టరయిన 'జి. ఎన్. టెయిలర్' (G. N. Taylor) చే స్థాపింపబడిన నరసాపురములోని నేటి 'టెయిలర్ హైస్కూలు'; 1856 లో శ్రీ ఎ. శేషయ్యశాస్త్రిగారిచే 'ఆంగ్లో వర్నాక్యులర్ స్కూలు'గా ప్రారంభింపబడిన మచిలీపట్టణములోని నేటి హిందూ కాలేజి; 1857 లో శ్రీ విజయరామగజపతి మహారాజుగారిచే 'మిడిల్ స్కూలు'గా ప్రారంభింపబడిన నేటి విజయనగరము మహారాజావారి కాలేజి; అనునవి, అహమహమికతో ఇంగ్లీషు చదువులను ఆంధ్రదేశములో వ్యాప్తికితెచ్చి, మేధావులలో భావవిప్లవము వచ్చుటకు తోడ్పడినవే 1857 లో మద్రాసునందు విశ్వవిద్యాలయము స్థాపింపబడుటతోడనే, ఈ విద్యా సంస్థలన్నియు ద్విగుణీకృతోత్సాహముతో పరీక్షలకు విద్యార్థులను సిద్ధముచేయుచు వచ్చినవి.

మదరాసులోను, ఇతర ముఖ్యపట్టణములలోను విద్యాసంస్థలు స్థాపింపబడుటతోడనే, ఇంగ్లీషు చదువులు ప్రచారమునకు వచ్చుటయే గాక; పాశ్చాత్య విజ్ఞానశాస్త్రము నభ్యసింపవలెనను కుతూహలము కూడ ప్రజలలో మిన్నుముట్టెను. మేధావులు 'ఇంజనీరింగు' మొదలైన చదువులను గూర్చి ఆలోచింప మొదలిడిరి. 1843, అక్టోబరు 18 వ తేదీని, ఒక 'డిస్పాచ్' (Despatch) లో కంపెనీ డైరెక్టరులు, 'ఇంజనీరింగు' మొదలయిన చదువులను గూర్చి ఆలోచించుట కింకను తగిన కాలము రాలేదని వ్రాసిన దానినిబట్టి చూడగా, నాటి ప్రజల ఉత్సాహము తెలియగలదు. ఒకవంక కంపెనీవారు ఇంగ్లీషు చదువుల వ్యాప్తికై సాయపడుచున్నను, మత విషయమున మాత్రము పైకి తాటస్థ్యమును వహించుచునే యుండిరి. 1846 ఆగస్టు 24 వ తేదీని 'మార్క్విస్ ఆఫ్ ట్వీడేల్' (Marquis of Tweeddale) బైబిలును ప్రభుత్వ పాఠశాలలలో బోధింపవలెనని ప్రతిపాదింపగా, కంపెనీ డైరెక్టరులు అంగీకరింపలేదనుట దీనికి తార్కాణము.

విద్యా విషయకమైన కృషి అభివృద్ధి పొందుచురాగానే, మద్రాసులోని 'కాలేజిబోర్డు'ను పునర్నిర్మాణము చేయవలసిన ఆవశ్యకత కలిగెను. 1852 జూలై 2 వ తేదీని, 'సర్ హెన్రీ పాటింగర్' (Sir Henry Pottinger) ప్రభావమున 'క్రొత్త కాలేజిబోర్డు' స్థాపింపబడి, పనిచేయజొచ్చెను. ప్రజలలో బహుముఖముగ విద్యావ్యాప్తి కలిగింపవలెనను ఉత్సాహము కంపెనీ ఉద్యోగులలోకూడ ప్రబలముగ నుండెననుటకు తార్కాణముగ; 1850 లో 'డాక్టర్ హంటర్' (Dr. Hunter) కృషివలన 'మద్రాసు స్కూల్ ఆఫ్ ఆర్ట్స్' (Madras School of Arts) స్థాపింపబడుటను చూపవచ్చును. క్రమక్రమముగ, విజ్ఞాన విషయములకు సంబంధించిన ఉన్నతవిద్యను ప్రజలలో ప్రచారమునకు తేవలయునను నూహ కంపెనీవారికి కలిగి; 1835 లో ఏర్పాటు చేయబడిన 'మెడికల్ స్కూలు'ను, 1851 లో కాలేజిగ చేసిరి. ఇట్లు, పాశ్చాత్య విద్యావిధానము దేశములో మెల్లిమెల్లిగ నభివృద్ధికివచ్చి, పాశ్చాత్య విజ్ఞాన సంస్కృతులకు ప్రజల నున్ముఖులనుగ చేయుచువచ్చినది.

ఇట్లు, ఇంగ్లీషు చదువులకు కాలమనుకూలముగా నుండగా, 1854 లో కంపెనీవారి 'ఎడ్యుకేషనల్ డిస్పాచ్' (Company's Despatch on Educational matters) వచ్చెను. దీనిని, భారతదేశములో ఇంగ్లీషు చదువులకు 'మేగ్నా కార్టా' వంటిదని అందురు ('Magna Charta of English Education in India'). ఇది, మనదేశములో పాశ్చాత్య విద్యాపద్ధతిని గట్టి పునాదులపై స్థాపించుటకు వలసిన ఏర్పాటులను సూచించుటయేగాక, 1857లో ఏర్పడనున్న విశ్వవిద్యాలయములకు అంకురార్పణము కూడ చేసెను. దీని ఆశయము లివి[25].

"(1) The constitution of a separate department of the administration of education,

(2) The institution of Universities at the presidency towns,

(3) The establishment of institutions for training teachers for all classes of schools,

(4) The maintenance of the existing Colleges and High Schools, and the increase of their number when necessary,

(5) The establishment of new Middle Schools,

25. As quoted by Prof. S. Satthianadhan in his book 'History of Education in the Madras Presidency' (1894); Pages-41, 42.

(6) Increased attention to Vernacular Schools, indigenous or otherwise, for elementary education,

(7) and the introduction of a system of Grants-in-Aid"

ఇట్లు, ఈ 'డిస్పాచ్' దేశములో విద్యావిషయమున విప్లవాత్మకమగు మార్పులకు పునాదులు వేయుటయేగాక, దేశవ్యాప్తముగ ప్రజలలో - మున్నెన్నడును జరుగనట్లు - విద్యావ్యాప్తిని కలిగించుటకు ప్రభుత్వము పూనుకొనినట్లు ప్రకటించెను. ఈ సందర్భమున 'డిస్పాచ్'లోని ఈక్రింది వాక్యములు గమనింపదగినవి.[26]

"........We must emphatically declare that the education which we desire to see extended in India is that which has for its object the diffusion of the improved arts, science, philosophy, and literature of Europe; in short, of European knowledge."

"........the vernacular literatures of India will be gradually enriched by translations of European books, or by the original compositions of men whose minds have been imbued with the spirit of European advancement, so that European knowledge may gradually be placed in this manner within the reach of all classes of the people. We look, therefore, to the English language and to the vernacular languages of India together, as the media for the diffusion of European knowledge, and it is our desire to see them cultivated together in all schools in India of a sufficiently high class to maintain a schoolmaster possessing the requisite qualifications."

ఈ 'డిస్పాచ్' వచ్చిన తరువాత, మద్రాసులో విద్యావిషయకమైన కృషి ఒక నిర్ణీతమార్గము ననుసరించినది. 1855 లో కంపెనీవారు; అంతకు పూర్వము 'మద్రాసు యూనివెర్సిటీ' అను పేరుగల విద్యాసంస్థను (ఇది 1841 లో స్థాపితము) 'ప్రెసిడెన్సీ కాలేజి' గా మార్చి, 'లా' (Law) కు, ఒక ప్రొఫెసరును నియమించిరి. ఈ సంవత్సరమే ఆగస్టునెలలో, విద్యాసంస్థలకు ప్రభుత్వము చేయు ధనసాహాయ్యమును, నిర్ణీతపద్ధతిపై నుంచుట కనువైన 'శాసనము' ప్రభుత్వము చేసెను ('Grant- in- Aid Rules for Madras'). తరువాత, 1855-1856 లో మద్రాసు ప్రభుత్వమువారు, 1854 లోని 'డిస్పాచ్' ననుసరించి, ఈ విధమైన విద్యావిషయక కృషి గావించిరి.[27]

26. Ibidem.

27. Ibidem; pages - 46,47.

"(1) The reorganization of the principal Presidency Institution under the designation of a Presidency College.

(2) The establishment of a Government Normal School.

(3) The Provincial Schools.

(4) The Commencement of a system of Anglo-Vernacular Zillah Schools.

(5) The Commencement of a system of Vernacular Taluk Schools.

(6) The extension of the measures for the promotion of education in the district of Rajahmundry.

(7) The progress of the schools established for the instruction of the Khonds and other uncivilized tribes in Ganjam.

(8) The introduction of the Grant-in-Aid system.

(9) The annual examination for Government Rewards.

(10) The provision of Vernacular School Books."

ఇట్లు ప్రభుత్వము విద్యవిషయమున శ్రద్ధ చూపించుటతోడనే దక్షిణ దేశములోని విద్యాభివృద్ధికి మద్రాసు కేంద్రమయినది. మొట్టమొదట, మద్రాసు విశ్వవిద్యాలయమనుపేర, ఏప్రిల్ 14వ తేదిని 1841 లో స్థాపింపబడిన, విద్యాసంస్థ 1855 లో 'ప్రెసిడెన్సీ కళాశాల' అను పేరునకు మార్చబడెను. తరువాత, సెప్టెంబరు 5వ తేదీని 1857 లో; కలకత్తా, బొంబాయి విశ్వవిద్యాలయములతోబాటు, నేటి 'మద్రాసు విశ్వవిద్యాలయము' స్థాపింపబడినది. దీని స్థాపనకు ముఖ్యకారణముగా, 'చట్టము' నందిట్లు చెప్పబడినది.

"........for the purpose of ascertaining, by means of examination, the persons who have acquired proficiency in the different branches of literature, science and art, and of rewarding them by academical degrees as evidence of their respective attainments."[28]

ఈ విశ్వవిద్యాలయములో మొట్టమొదటి ప్రవేశపరీక్ష సెప్టెంబరు 1857 లో జరిగినది. అప్పుడు పరీక్షకు వచ్చిన నలుబదియొక్కరిలోను, ముప్పదియార్గురు పరీక్షలో నుత్తీర్ణులైరట! బి. ఏ. పరీక్ష మొట్టమొదట, ఫిబ్రవరి 1858 లో జరిగెను. జాఫ్నాలోనున్న అమెరికా మిషను పాఠశాలలోని వారిరువురు పరీక్షకు వచ్చిరట! ఆ ఇరువురు నుత్తీర్ణులైరి.[29]

---

28. Ibidem; page - 57.
29. Ibidem; page - 58.

మద్రాసు విశ్వవిద్యాలయమునకు, రాష్ట్రములోనున్న జిల్లా పాఠశాలల నుండి, మిషను పాఠశాలలనుండి, ప్రత్యేకవ్యక్తులు స్థాపించిన పాఠశాలలనుండి, పదులకొలది విద్యార్థులు పరీక్షలకు వచ్చుచుండిరి. వీరందరును ఆంగ్లభాషలో నిష్ణాతులగుటయేగాక, పాశ్చాత్య శాస్త్రవిజ్ఞానమునందును ఆరితేరి యుండిరి. ఆదిలో స్వల్పముగనున్న వీరిసంఖ్య క్రమక్రమముగ పెరుగజొచ్చినది. వివిధ తరగతులలో ఈ పెరుగుదలను (1857 మొదలు 1871 వరకు) సూచించుపట్టిక[30] నీ దిగువ నిచ్చుచున్నాను. ఇది ఉత్తీర్ణులైనవారిసంఖ్య.

| Years | Matriculation | First Examination in Arts | Bachelor of Arts | Master of Arts |
|---|---|---|---|---|
| 5 years ending in 1861 | 155 | | 21 | ... |
| 5 years ending in 1866 | 780 | 149 | 41 | ... |
| 5 years ending in 1871 | 1,793 | 703 | 135 | 6 |
| Total | 2,728 | 852 | 197 | 6 |

మెట్రిక్యులేషను పరీక్షకు, బి. ఏ. పరీక్షకు నడుమ ఎఫ్. ఏ. పరీక్షను 1862-1864 లో ప్రవేశపెట్టిరి. మద్రాసు విశ్వవిద్యాలయములోని పరీక్షలు చాల కఠినములనియు, ఇచ్చట బి. ఏ. లో ఉత్తీర్ణులగుట ఆక్స్‌ఫర్డులోకంటె కష్టమనియు 1859-60 లో పరీక్షాధికారులిట్లు వ్రాసిరి.

"A pass at Oxford and Cambridge is attainable with very moderate exertions by persons of very moderate abilities. In the present case, the standard is relatively higher, the range of subjects wider and the requisite exertion is greater. The B. A. degree of the Madras University may, therefore, be looked on essentially as an honorable distinction."[31] ఇంత శ్రమపడి, పరీక్షలలో నుత్తీర్ణులగుటకై చదువుటచే, దేశీయులలో పాశ్చాత్య సాహిత్య సంస్కృతులపై అభిమానము దృఢమయ్యెను.

30. Ibidem; page - 79.
31. Ibidem; pages - 80; 81.

1872-1881 నడుమ మెట్రిక్యులేషను పరీక్షలో 8,053 మంది; బి.ఏ. లో 726 మంది; ఉత్తీర్ణులైరి. ఈ బి.ఏ. లలో 1880-1881 లో పదునేడుగురు ఎమ్. ఏ. డిగ్రీని తీసికొనిరి. ఈవిధముగా సర్వత్ర ఆంగ్లభాషా సాహిత్యముల వ్యాసంగమే జరిగి, పందొమ్మిదవశతాబ్ది మధ్యభాగమున, భారతదేశములోని మేధావంతుల దృక్పథమే మారిపోయినది. ఈ మార్పు ఆంధ్ర సాహిత్యము నందును గోచరించెను. నాటి విద్యార్థుల ఆంధ్రప్రశ్నపత్రములుకూడ ఆంగ్లము లోనే యుండెడివి. ఈవిషయము, 1868 డిసెంబరు మెట్రిక్యులేషను తెలుగు ప్రశ్నపత్రమును చూచిన తెలియగలదు. ఆప్రశ్న పత్రము[32] నుండి కొన్ని మాదిరి ప్రశ్నల నుదాహరించుచున్నాను.

### Matriculation December 1868

III (b) 1. Analyze the word నెమ్మొగము.

2. Give the roots of మొగము, అచ్చను, and వెట్టి; also the other forms of మొగము.

3. What is the meaning of the word త్రిదశులు ; why were they so called.

(d) Parse fully the following words from the above.

1. నెమ్మొగంబు; కోయుచున్న; వెట్టి; పలుచున్.

2. Explain the 'Sandhis' in మహీతాత్మదేవిఁదెచ్చెదనని చూచెదేఁ జెడుగుచేఁతలకుంజొర.

IV In what fictitious form did Mareecha appear to Seeta ? Describe the scene fully in plain and easy Telugu; also quote the passage or passages if you can. What followed immediately after this ?

1868 ప్రశ్న పత్రమునుండి విలక్షణమైన ప్రశ్నలనేరి పైని ప్రదర్శించితిని. దీనినిబట్టి నాటి విద్యావిధాన మనుసరించుచు వచ్చిన మార్గము మనకు తెలియగలదు. ఈమార్గమున మాతృభాషను నేర్చిన విద్యార్థులు, పౌరులైన తరువాత ఆంగ్ల సంప్రదాయ ప్రవిష్టులైనారన్నచో నాశ్చర్యమేమి !

పాఠశాలలలో, పాశ్చాత్య విద్యాపద్ధతులు ప్రవేశపెట్టబడిన తరువాత, ఆ విద్యావ్యాప్తి కనువైన పాఠ్యగ్రంథములను రచింపించు నావశ్యకత,

32. ఇది, మద్రాసు విశ్వకళాపరిషద్గ్రంథాలయమునుండి గ్రహింపబడినది.

ప్రభుత్వమునకు కలిగెను. ఈ యుద్దేశముతో 1820 నాటికే 'ఉపయుక్త గ్రంథ కరణసభ' ఏర్పాటు చేయబడినదని ముందే వ్రాసితిని. ఈసభయొక్క రెండు ఉద్దేశములలో మొదటిది పాఠ్యగ్రంథ ప్రకటనము, రెండవది దేశీయ సాహిత్యాభివృద్ధికి ప్రోత్సాహమిచ్చుట. ఈ రెండింటిలో మొదటిదానియందు కొంత కృతకృత్యత సభకు కలిగినదిగాని రెండవదానియందంత జయము కలుగలేదు. దేశభాషలలో విజ్ఞానాత్మకమైన గ్రంథరచనకీసభ ఎక్కువ ప్రోత్సాహమిచ్చెను.

ఆంగ్లములోనుండి దేశభాషలలోనికి గ్రంథముల ననువాదముచేయించి, ఆంగ్లము రాని దేశీయులలో పాశ్చాత్యుల ఆశయములను, భావములను ప్రవేశ పెట్టుట వాంఛనీయమని 'కంపెనీ డైరెక్టరు' లే వ్రాసిరి.

".. ......communicate to the native literature and to the minds of the native community that improved spirit which it is to be hoped they will themselves have imbibed from the influence of European ideas and sentiments"[33]

కాని ఈ ఆశయము నాటంతగా నెరవేరలేదు. ఆంగ్లాంధ్ర భాషలలో సమానమైన పాండిత్యము గలవారు లేకుండుటచే, ఆంగ్లములోనుండి ఆంధ్రములోనికి వచ్చిన మంచి అనువాదములకు బహుమానములు ప్రకటింపబడినను, ప్రయోజనము లేకుండెనని ఇట్లు చెప్పబడినది.

"This object, however, was not realized, though a considerable portion of time assigned to the vernacular studies was devoted to translation from and into English, and a prize was awarded each year for the vernacular exposition of a portion of a standard English author"[34]

ఇందులకు ముఖ్యకారణము, ఆంగ్లము నేర్చిన చాలమందికి దేశీయ భాషలలో పాండిత్యము లేకుండుటయే. దేశీయ భాషాభిమానమున్నను, ఆంగ్ల గ్రంథములను దేశభాషలలోనికి తెచ్చుటయందు కుతూహలముకూడ చాల తక్కువమందికుండెను. ఈ విషయములన్నియు — 31 జూలై (1868) నాడు మద్రాసుప్రభుత్వము, నాటి విద్యాశాఖాధికారి (Director of Public Instruction) యభిప్రాయమునకై పంపిన కాగితముల కాత డిచ్చిన ఈ సమాధానమువలన తెలియుచున్నది. ప్రభుత్వమువారడిగినది, "....a brief

33. As quoted in the book 'History of Education in the Madras Presidency' by S. Satthianadhan. Madras. 1894. Page - 37.

34. Ibidem page - 37.

report as to what has been, and is being done in the presidency for the formation of a sound vernacular literature."[35] అప్పుడు విద్యాశాఖాధికారి (Director of Public Instruction) గా నున్న ఇ. బి. పావెల్ (E. B. Powell) దానికి సమాధానమిట్లు వ్రాసెను.

"It will be seen that the formation of a sound vernacular literature is now the main object of the body formerly termed the Madras School Book Society. It cannot be doubted that the creation of such a literature is of the highest importance ; but this is a work which can only be accomplished gradually, as an improved elementary education becomes diffused throughout the Native Community. The few Hindus who have received a fair education draw upon works in the English language for their literary pleasures, and for such further information as they wish to acquire while engaged in the business of life ; and it must be stated with regret, that, as a general rule they do little or nothing towards the improvement of their vernacular literature. As yet the masses have been scarcely touched by our, educational operations; and, even if elementary instruction of a sound description were diffused to a much greater extent than it is, the substitution of new literary books for those now possessed by the Hindus, which have their roots in the past history of the people, could only be effected very slowly."[36]

1868 లో ఆ విద్యాశాఖాధికారి వ్రాసిన వాక్యములనుబట్టి ఆంగ్లభాషా సాహిత్యముల పఠనము విరివిగా జనబాహుళ్యమున వ్యాప్తికి రాలేదనియు, తగినన్ని గ్రంథములైనను ఇంగ్లీషునుండి తెలుగులోనికి రాలేదనియు, ప్రజలభాష లోనికి వాడుకలోని ఆంగ్లపదములు మాత్రమే వచ్చినవనియు తెలియుచున్నది.

పైనివ్రాసిన వాక్యములకు అపవాదము లేకపోలేదు. పాశ్చాత్య విజ్ఞానమును బోధించు నుద్దేశముతో పాఠ్యగ్రంథములు చాల రచింపబడినవి. బాలురకై నరసాపుర పాఠశాలోపాధ్యాయులు 1840 లో భూగోళమును రచింపగా దానిని, ఉపయుక్త గ్రంథకరణ సభవారు, 1852 లోను 1856 లోను ప్రచురించిరి[37] బాలురకు విదేశచరిత్రలను గూర్చియు, విదేశమహా పురుషులను గూర్చియు తెలియజేయుటకై కొన్ని పుస్తకములు ప్రచురింప

35. Ibidem page - 76.
36. Ibidem ; Page - 76.
37. 'గద్య చింతామణి' - 1933, గిడుగు వేంకటరామమూర్తి పంతులుగారు, పుటలు—246, 247.

బడెను. ఇందు 'మహమ్మదుచరిత్ర' (1856);[38] 'జాన్‌బనియన్ చరిత్ర' (1856);[39] 'ఇంగ్లండుదేశచరిత్ర' (1855);[40] 'అమెరికాను కనిపెట్టిన చరిత్ర' (1857) మొదలగునవి ముఖ్యమైనవి.

విజ్ఞాన శాస్త్రములకు సంబంధించిన గ్రంథములును కొన్ని ముద్రింపబడెను. వీనిలో ముఖ్యమైనది 1856 లో ముద్రింపబడిన 'ఇనుపకమ్మిత్రోవ - మెరుపుటప్పా' (Railways - Electric Telegraph) లను గూర్చి తెలుపుగ్రంథము.[41] ఈ గ్రంథములో నుపయోగింపబడిన పారిభాషిక పదములు: కొన్ని ఆంగ్లములో నున్నట్లును, కొన్ని తెలుగున ననువాదము పొందియు, కలవు. ఉదాహరణకు—'రెగ్యులేటర్' (Regulator): 'సేఫ్టివాల్వ్' (Safty valve) అనగా 'రక్షకమైనమూత.' ఈ విధముగా నందలిరచన సాగినది.

కంపెనీవారిట్లు చిత్తశుద్ధితో విద్యావిషయకమైనకృషి ప్రారంభించినంతనే, ప్రజలును ఇంగ్లీషు చదువులఎడల అమితోత్సాహమును చూపింపజొచ్చిరి. ఈ చదువులకు మద్రాసు కేంద్రమైనను; మిగిలిన పెద్దపట్టణములలో కూడ పాశ్చాత్య విద్యావిధానము నవలంబించిన పాఠశాలలుండుటచే; దేశవ్యాప్తముగ పాశ్చాత్య సభ్యతా సంస్కృతుల ప్రభావము ప్రాకినది. ఈ ప్రభావము, ఆంధ్ర విద్యావంతుల భావాంబరమును కిమ్మీర మొనర్చెను. ప్రాచ్య పాశ్చాత్యభావముల, సాహిత్యముల, సంఘర్షణలో; పాశ్చాత్యములైన వానికిగల వైవిధ్యము, మనవారలను దిగ్భ్రాంతులనుగాజేసి, వారి మనోరాజ్యము నేలజొచ్చెను. సాంఘికరంగమున సంస్కరణాభిలాష, సాహిత్యరంగమున నవ్యసృష్టి, భావనారంగమున విశృంఖలవిహారము, సంప్రదాయరంగమున వ్యవస్థిత వస్తుధిక్కారము అనునవి ఈ సంధియుగమున ధర్మపంచకము. ఇవన్నియు నాటి రచయితలందరి రచనలో లేకున్నను, ఈ యుగమునకు ప్రతినిధులయిన వారిరచనలలో మాత్రము సాధారణముగా పొడగట్టును.

*

38. Ibidem. పుట - 242.
39. Ibidem. పుట - 122.
40. Ibidem. పుట - 261.
41. Ibidem. పుటలు - 248, 251.

# యుగసంధి - సాహిత్యపరిణామము

పందొమ్మిదవ శతాబ్ది ఉత్తరార్ధములో, ప్రప్రథమమున, మన సాహిత్యము పరిణామదశలో నుండెను అంతకుపూర్వము, సాహిత్యమున ప్రక్రియా వైవిధ్యము కొంత కొరవడి యుండుటచే, పాశ్చాత్య సాహిత్యముల లోని—ముఖ్యముగా ఆంగ్ల సాహిత్యములోని—వివిధ ప్రక్రియలు మన రచయితల నాకర్షించెను. వివిధ రచయితలు, వివిధ ప్రక్రియలను చేబట్టి, ప్రయోగాత్మకములైన రచనలు సాగించుచు వచ్చిరి. కాని, ఇంచుమించుగా, అన్ని సాహిత్య ప్రక్రియలను తెలుగులోనికి ప్రతిభావంతముగ తెచ్చిన రచయిత నాటికి లేకుండుటచే; అట్టి ప్రతిభావంతులైన శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారు (1848-1919) రంగమునఅడుగు పెట్టినంతనే; మన సాహిత్యము పరిణామదశనుండి ఒక్కసారి, వికాసదశకు వచ్చెను.

శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారి సాహిత్యకృషి, పందొమ్మిదవ శతాబ్దికి ఇరువదవ శతాబ్దికి చక్కని వారధి. ఆంధ్ర సాహిత్య ఘంటాపథమున ఒక మైలురాయి. వీరి రచనలలో—నవ్యమార్గమును, తరువాత ప్రఖ్యాతికి వచ్చిన మార్గమును అయిన—'నవల' ను (తద్రచనాకాలమును) ప్రధానముట్ట ముగ గ్రహించి, దానికంటె ముందు బయలుదేరిన, సాహిత్య ప్రక్రియలలోని గ్రంథములపై, ఇంగ్లీషు సాహిత్యప్రభావ మెంతవరకు గలదో పరిశీలింతును. పంతులుగారి 'రాజశేఖర చరిత్ర' అను నవల 1878 లో భాగములుగ 'వివేక వర్ధని' యందు ప్రచురింపబడి, 1880 లో గ్రంథరూపమును బొంది, విశేష ప్రచారమునకు వచ్చినది. నాటికి పంతులుగారికి ముప్పది, ముప్పదిరెండేండ్ల వయస్సు. అంతకుపూర్వమున్న పంతులు వేరు. తరువాతిపంతులు వేరు. కనుక, 1880 వ సంవత్సరము మన సాహిత్యచరిత్రలో విశిష్టమయినది. ఈ పరిశీల నమున, 1880 ని ప్రధానతిథిగ గ్రహించి; దాని కవ్యవహిత పూర్వమున వెలువడి, ప్రక్రియా వైవిధ్యముగల గ్రంథములను గూర్చి వ్రాయుదును.

1880 లో గ్రంథరూపమును బొందిన 'రాజశేఖర చరిత్ర' కవ్యవహిత పూర్వముననే; ఆంగ్ల సాహిత్య సంస్కృతుల ప్రభావము సోకిన కథలు, వ్యాసములు, పద్యములు, నవలలు, నాటకములు, కొన్ని కలవు. ఈ రచన లన్నియు, 1850-1880 నడుమ వచ్చినవే. తాను జేసిన చైతన్యయుతమైన కృషివలనను, ఆంగ్ల సాహిత్యమునగల శాఖల నన్నింటిని— ఇంచుమించుగా—

తెలుగులోనికి తెచ్చుటకు కృషిచేసి, కృతకృత్యుడయిన మహాపురుషుడగుట వలనను, వీరేశలింగం పంతులుగారి కృషిని, ప్రాతక్రొత్తలకు వారధిగ గ్రహించితిని. ఈ లక్షణము లన్నియుగల రచయిత, ఆయనకు అవ్యవహిత పూర్వమున లేకుండుటచే, శ్రీ పంతులుగారిని గ్రహించి వ్రాయుట యయినది. పైని పేర్కొనబడిన రచనల కన్నింటికి పంతులుగారికంటె ముందే ఒరవడులు గలవు గాని, వానినన్నింటిని చక్కగా నిర్వహించిన ఒక్కరచయిత మాత్రము లేడు. ఈ విభజనమువలన పంతులుగారి విశిష్టతకుగాని, వారి కవ్యవహిత పూర్వమున రచనలు చేసినవారి మార్గదర్శకత్వమునకు గాని, లోటు రాలేదు.

1850 తరువాత విశేషముగ, తొలుదొల్త అనువాదరూపమున వచ్చిన బైబిలు కథల నిట స్పృశింపలేదు. ఆంగ్ల సాహిత్య ప్రభావము ; ఆంగ్లభాషా పదము లుండుటవలనగాని, ఆ సాహిత్యములోని భావములను పోలిన భావము లుండుటవలనగాని, మనకు స్పష్టముగ గోచరించుచు, వ్యాప్తిలోనికి విశేషముగ వచ్చిన రచనలనే, ఇట పరిశీలనకు గ్రహించితిని. ఇందువలన చిన్నయ సూరిగారి (1806-1862) 'నీతిచంద్రిక' (1853) ను గూర్చి గాని, కొక్కొండ వెంకటరత్నం పంతులుగారి (1842-1915) 'విగ్రహము' (1872) గూర్చిగాని ఇట ప్రస్తావింపలేదు. సి. పి. బ్రౌనుదొర 1855 లో ప్రకటించిన 'తాతాచార్యుల కథలు' అను గ్రంథమునకు ప్రచారమున్నను, సాహిత్య గౌరవము కొంత కొరవడియున్న చిన్నచిన్న కథలసంపుటి యగుటచేతను, దానిపై ఆంగ్ల సాహిత్య ప్రభావము విస్పష్టముగ లేకుండుటచే దానినిట పరిశీలింపలేదు. ఇట్లే, ఇంకను కొన్ని రచనలు ఇందు విమర్శింపబడక విడువబడినవి. ఇందులకు కారణము పై నియమమే.

కథ :

1880 వ సంవత్సరమునకు పూర్వము బయలుదేరిన కథల పుస్తకములలో, ఆంగ్ల భాషాపదములు విశేషముగ కలది 'చార్ దర్వేషు' అను 'నలుగురు ఫకీరుల చారిత్రము'. ఇది 'ఉడుదు-యింగిలీషు అనే రెండు భాషలలో నుంచి,' ఎట్టుమిల్లి మల్లికార్జునుడను నాతడు ఆయన తర్జుమా చేసినాడు. ఇది మదరాసులో 1856 లో అచ్చయినది[1] ఈ గ్రంథముయొక్క పీఠికలో ఇట్లు

1. ఈ గ్రంథముయొక్క ముఖపత్రమిది—

శ్రీరస్తు
చార్ దర్వెషు
అనగా
నలుగురు ఫకీరుల చారిత్రము.

★

కలదు. "......భగవదనుగ్రహముచేత హిందుస్థాన్ ఖండము యొక్క ప్రజా పరిపాలనము వర్తమానమునందు ఇంగ్లీషువారు జరిగించుచున్నారు. పూర్వ యుగములయందు ఋషులయొక్క తపస్సుచేత సాధించబడిన దూరదృష్టి, దూరశ్రవణము, వాయువేగము, మనోవేగము, కాలపరిమాణ నిరూపణము మొదలయినవి వీరికి లోహాది యంత్రములచేత సమకూడినవి...."

"......ఈ యధికారముకింద నున్న గొప్ప పట్టణములలో నొకటియైన విశాఖపట్టణమను పట్టణమందు నివసించియున్న మహారాజా శ్రీ గోడే నారాయణ గజపతి రాయనింగారు విద్యావ్యాసంగము నిమిత్తము అనేక గ్రంథములను చూచుచుండగా, వొకరోజున చార్ దర్విషు అనే నలుగురు ఫకీరుల చరిత్రమును చిత్తగించగా, చిత్రవిచిత్రములైన మనోల్లాసము కల్పించినదేకాక, యీ గ్రంథము లోగడ అమీరు ఖుసురూయను ఒక మహమ్మదీయుని వల్ల ఫారసీభాషలో జాకమయి యున్నట్లున్ను, అది ౧౮౦౧ సం॥ లో ఢిల్లీ కాపురస్తుడయిన మీరు అమ్మన్ అనే యొక తురకవల్ల ఉరుదూభాషలో నున్ను, ౧౮౧౧ సం॥ లో మేస్టర్ ఎల్ ఎస్ స్మిత్ అను యూరోపియన్‌వల్ల ఇంగ్లీషుభాషలోను తర్జుమ అయినట్లున్ను కనబడుతున్నందున, దీన్ని లోకోపకారముగా తెనుగుభాషలో యెవరైనా చేస్తే బాగావుండునని చెప్పినందున అపుడు యెట్టమిల్లి మల్లికార్జునులనే యొక బ్రాహ్మణుడు ఆమోదించి ఈ గ్రంథమును తెనుగించదలచున కుపక్రమించెను. తెలుగుదేశములో రాజ్యాంగములు బదలాయించటను చేతను యితరదేశస్తు లనేకులు ఒక్కొక్క

ఇవి
ఉరుదు - యింగిలీషు అనే
రెండు భాషలలోనుంచి
ఎట్టమిల్లి - మల్లికార్జునునిచే
తెనుగు భాషలో తర్జుమా
చేయబడి -
చెన్నపట్టణం
పా॥ కుమారయ్యగారి
కళానిధి ముద్రాక్షరశాలయం దచ్చు వేయబడ్డది.

శాలీవాహన శకాబ్దా - ౧౭౭౭ }
రాక్షస సం॥ పుష్య శుద్ధత్రయోదశి } ౧౮౫౬ సం॥
స్థిరవారము - తైనెల - ౮ తేది } జనవరి నెల ౧౯ తేది.

స్థలమందు తరుచుగా కలిగియుండడముచేతను అనేక భాషలయొక్క శబ్దములు మిళితమయి, స్వభాషవలె వాడికై యున్నందున, వాటిని భేదించి తెనుగు మాటలతో వ్యాకరణపద్ధతిగా గ్రంథము చేసేయెడల, సర్వజనసాధారణము కాకపోవడమే కాక దేశీయ భాషా చమత్కారము బోధపడక, విరసమౌనని తోచి స్త్రీ పురుషులు ఒకరితో నొకరు మాటలాడునట్లు సులభముగా అర్థమయ్యే లాగున సంక్షేపముగా జాతీయరసముతో (భాషాంతరులకు పూర్వోత్తరములు తెలియడమునకు ముఖ్యమయిన రిమార్కులతో) యీ గ్రంథముసేయ నిశ్చయించడమయినది గనుక ఇందుకు సమస్తమయినవారు హర్షించవలసినది."

పీఠికలోని పై వాక్యములనుబట్టి గ్రంథరచనాపద్ధతి, రచనోద్దేశము వ్యక్తమగుచునే యున్నదిగదా! ఇంక నీ గ్రంథమునగల పాశ్చాత్య — ముఖ్యముగా ఇంగ్లీషు — భాషాపదములను, అవి కల వాక్యములను క్రింద నిచ్చుచున్నాను. ఈ పదములేగాక, గ్రంథకర్త వ్రాసిన 'రిమార్కు'లను బట్టి కూడ, రచయితకు విదేశ విజ్ఞాన మెంతకలదో తెలియును.

పుట (౧౦): Foot Note (8) "జాతులవారిలో వలెనే తురకలలోనున్ను అంత్య విమర్శ దైవ సాంనిధ్యమందు మనుష్యుల విషయమై వక్క పర్యాయమే జరుగుతుందని సిద్ధాంతమైయున్నది."

'Judgement Day' అని కలదని రచయితకు తెలియునన్నమాట.

పుట (౩౧): "అయిన తరువాత ఆయన లోపలికి వెళ్ళి విలువైన మరియొక డ్రెస్సు తొడుగుకొని పైకి వచ్చినందున నేనుచూచి భగవంతులను తలచి మీకు దృష్టిదోష ప(రి)హార మవుగాక అని అన్నాను."

పుట (౩౪): అన్ని హాలలోనున్ను బంగారపు సెమ్మ్యాలతో కపూరపు దీపము లుంచబడియుండెను. మరిన్ని రత్నస్థగితమైన షేడ్లు ఆయాస్థలములలో యుక్తముగా నుంచబడి యుండెను."

పుట (౬౪): "మరిన్ని వాలుషేడ్లు టేబిల్ షేడ్లు, మద్దిల షేడ్లు, గ్లోబులు, లస్థరు, తిరుగుడు దీపములు బుట్టలు మొదలైన తరహా తరహా కలిగినటువంటి దీపారాధనయొక్క సొగసు......"

పుట (౭౬): Footnote (౧) "ఒకటో ఫకీరుకథలో రెండో రిమార్కు చూడవలెను. ౭ సైడ్లులో వున్నవి."

పుట (౮౨): "ఒక వి త్తనము వేస్తే అందువల్లపండె దినుస్సువలె పరమందు విస్తారముగా అనుభవిస్తాడనిన్ని ఆలోచించి సిగ్గుపడి పెద్ద మేస్త్రీని పిలి

పించి ఊరుబయట నలభై ద్వారములు కలిగినటువంటిన్ని మిక్కిలి ఉన్నతమున్ను విశాలమున్ను అయినటువంటిన్ని ఒకగొప్ప లోగిలి కట్టించవలసినదని ఆజ్ఞాపించినాను."

("మేస్తరి or మేస్త్రి n. s. Maistre. (French or Portuguese) A head workman. పనివాండ్ల పెద్ద." బ్రౌణ్యామిశ్రభాషా నిఘంటువు పుట - 98.)

పుట (౯౬): "అక్కడి ప్రజలుఅంతా ఫాదుషాతో ఊరు బయటికివచ్చి లయను దీచిన మైదానముమీద నిలువబడియుండిరి"

పుట (౧౧౦): "ముందుగా దాని ప్లాను ఒక కాగితముమీద క్రమముగా వ్రాయించి తీసుకొని రావలసినదని......"

పుట (౧౩౦): "ఒకరోజున బీర్వాలో ఒక పుస్తకపుసంచిక కనపడ్డందున తీసి చూస్తే సముద్రము యావత్తు ఒకకూజాలో నింపినట్టుగా ఇహాపర సాధనమైన సమస్త శాస్త్రములు అందులో సమకూర్చి వ్రాసిఉన్నవి."

పుట (౧౬౦): "నాపైని అబద్ధపు ఖూనీ చార్జీ చేసినారు."

పుట (౧౮౯): కప్తానును జడిసి తమయొద్దనుండే చక్కనిదాసీలు మొదలైన వాళ్లను పెట్టెలలోపెట్టి తాళములు వేసి......"

("రేవు కప్తాను అనగా ఓడలరేవు మీదనుండే అధికారి".)

పుట (౨౦౧): "దూబీనుతో చూస్తే వింతగా కనబడ్డారు." (దూరదర్శిని యంత్రమునకు 'దూబీను' శబ్దము వాడబడినది).

పుట (౨౧౯): "రాజునొద్ద సెలవు పుచ్చుకొని రేవు కప్తా నుద్యోగము నా అసిష్టాంటుకు ఒప్పగింత చేసినాను."

పుట (౨౨౦): "ఈ చిన్నవాణ్ని దత్తత చేసుకొని ఉయిలు ద్వారా తనఆస్తి యితనికి వఖలు పరిచినయెడల తనపేరు ఉంటున్నదనిన్ని......"

పుట (౨౩౦): ఒక మోతుబరైన పెద్ద బొక్లేరు గుఱ్ఱపు సవారియై......"

పుట (౨౪౦): "టోపి వేసుకొని జోడు పిస్తోళ్లు మొలలో దోపుకొని........"

(పైని పేర్కొనిన మాటలే చాలసార్లు వచ్చినవి. ఒక్కొక్కమాట నొక్కొక్కసారియే యుదాహరించినాను. తెలుగు లిపిలోగల ఆంగ్లపదము లకు మూలపదములు సులభ గ్రాహ్యాము లగుటచే వానిని వ్రాయలేదు.)

ఈకథల పుస్తకములో ఆంగ్ల పదములేగాని, భావ ప్రభావమును చూప జాలిన వాక్యములు తక్కువ.

వీరేశలింగం పంతులుగారి కవ్యవహిత పూర్వమున బయలుదేరిన ఈ గ్రంథము కథల పుస్తకములలో విలక్షణమైనది. ఈ పుస్తకము 1863 లో మొట్టమొదటిసారి అచ్చయినదని శ్రీ గురజాడ అప్పారావుగారు 'The Telugu Composition Controversy' (1914) లో ఇట్లు వ్రాసిరి.

"Another book which deserves mention is Chardarvish by Yerramilli Mallikarjuna kavi.........It was first published in 1863" (Page—108)

ఆంధ్ర వాఙ్మయసూచిక (1926) లో ఇటులకలదు. "చార్ దర్వీషు కథలు—ఇ. మల్లికార్జునుడు—కథ—వచనము—1876" (Page - 64)

శ్రీ నిడుదవోలు వేంకటరావుగారి 'ఆంధ్రవచన వాఙ్మయము' (1954) లో, 'చారు దర్వీషుకథలు' 1881 లో అచ్చయినట్లు కలదు. (Page - 110).

కాని, ఈ గ్రంథము మొట్టమొదట 1856లో అచ్చయినదనుట సత్యము.

'ఉర్దూ—ఇంగ్లీషు' భాషలలోనుండి యనువదింపబడిన 'చార్ దర్వీషు' గ్రంథమువలెనే, ఆంగ్లభాషలోనుండి తెలుగులోని కనువదింపబడి 1879 లో ప్రచురింపబడిన గ్రంథము, శ్రీ గురజాడ శ్రీరామమూర్తిగారి 'చిత్ర రత్నాకరము.' అరేబియన్ నైట్స్ కథలని ప్రఖ్యాతి పొందినవానిలో "The Sleeper Awakened" అనుదానికిది స్వేచ్ఛానువాదము. ఆంగ్లభాషనుండియే, రచయిత దీనిని తెనిగించెనని, ఈ క్రిందిపద్యము తెలుపును.

"ఆంగ్లేయ భాషయందలరుచు నున్నట్టి
యవనరాత్రుల వింతలనెడు కథల
బహు చమత్కార సంపదతోఁ బరఁగునట్టి
దానిని నిద్రించు వాని బోధ
మను కథ నిత్తఱిఁగొని దానిఁ దెనుఁగున
మెఱయుంచి యొక కొన్ని మేలి నీతు
లను దెల్పి చరితకు ననువగు వర్ణనం
బులఁ జేర్చి జాతీయముల నమర్చి
యాంధ్రదేశజసాంప్రదాయముల వారి
మతములోనుండు నాచార వితతిఁజూపి

చిత్ర రత్నాకరంబని చెన్ను మిగులు
నామమిచ్చితి దీనికిఁ గామజనక."[2]

ఈ గ్రంథము కేవలానువాదము కాదు. కథలోని పేరులు, వర్ణనలు మొదలగునవి దేశీయములగునట్లు మార్చి, మూలములోని సన్నివేశములను యథాతథముగ ననుసరించి శ్రీ గురజాడ శ్రీరామమూర్తిగారు (1851-1899) దీనిని రచించిరి. దీని విశిష్టత యిది. ఇది ఇంగ్లీషునుండి తెనిగింపబడినను, ఇందాంగ్లశబ్దములు లేవు. మూలములోని భావములు చక్కగ తెనిగింపబడినవి. మూలములోని భారతేతర సంప్రదాయమునకు చెందిన వర్ణనలు, ఇందు భారతీయములైన వర్ణనలకు చోటిచ్చినవి. ఈ విధముగ నిది క్రొత్తమార్గము త్రొక్కెను.

మూలకథలోని 'Caliph Haroun Alraschid' చిత్రరత్నాకరములో 'విష్వక్సేనుడై'నాడు. మూలములోని' బాగ్దాదు' నగరము 'వికుంఠ సుతపుర' మయినది. కథానాయకునకు మూలములో Abou Hassan అను పేరుండగా తెలుగులోనిది 'దామోదరు'నిగ మారినది. ఈవిధముగా తెలుగులో పేరులు మారుటయేగాక, కొన్నికొన్ని సట్టులందు వర్ణనలు మారినవి. ఆంగ్లమూలము లోని వర్ణనలును కొన్ని యథాతథముగ నుంచబడినవి. పేరులు మారినందున; దేవుని స్మరించు ఘట్టములందును, ఆచార వ్యవహారములనుగూర్చి ప్రస్తావించునప్పుడును, భారతీయపద్ధతులే యవలంబింపబడినవి. ఇందులకు కొన్ని యుదాహరణముల నిచ్చుచున్నాను.

---

2. 'చిత్ర రత్నాకరము'—గురుజాడ శ్రీరామమూర్తిగారు.
Madras: Printed at the Sreenilayam Press
1879.
(ఇష్టదేవతా ప్రార్థనాదికములోని 8 వ పద్యము)

ముఖపత్రము

శ్రీ

చిత్ర రత్నాకరము

★

గురుజాడ - శ్రీరామమూర్తిగారిచే

రచియింపఁబడినది.

Madras:
Printed at the Sreenilayam Press.
1879

Copy - right

పైతృకమైన ధనమును వెచ్చించి సిర్ధనుడైన 'దామోదరుడు' తల్లిని జేరి మాటాడు సందర్భమున మూలములో నిట్లున్నది :

"Oh, my dear mother, I know from woeful experience how insupportable poverty is. Yes I feel very sensibly that as the setting of the Sun deprives us of the splendour of that luminary, so poverty deprives us of every sort of enjoyment." (The Arabian Nights–The Sleeper Awakened).

ఈ సందర్భమున 'చిత్ర రత్నాకరము'లో నిట్లున్నది :

"దామోదరుండు తల్లిం జూచి యిట్లనియె : హా! అమ్మా మర్భరంబగు దారిద్ర్యం బెంత దుఃఖకరంబో దానిని స్వానుభవంబున వివరించెద వినుము. అస్తమిత సూర్యుండు కాంతిఁబోనడుచునటులు, దారిద్ర్యంబు సంతసంబు నపహరించు". [3]

మూలములో నొకటి రెండు వాక్యములలో ముగింపబడిన వర్ణనలు ; చిత్ర రత్నాకరములో దీర్ఘములును, సమాస బంధురములును అగుట కలదు. ఇవి ఆంధ్ర గ్రంథ రచయితకు గల వర్ణనాభిలాషను, నాటి తెలుగు రచయితల సంప్రదాయాభినివేశమును తెలుపజాలినవి.

మిత్రులందరును తన్ను పరిత్యజించిన తరువాత దామోదరుడు ధనము యొక్క కల రూపు తెలిసికొనినవాడై, దినమున కొక్క అతిథిని మాత్రము సత్కరించుచు, గుట్టుగా జీవించుచున్న కథా సంధర్భమున ఆతడు మారు వేషములో నున్న 'ఖలీఫ్ ఆల్ రషీదు' (Caliph Alraschid) ను కలిసికొనుట జరిగినది. అది యొక సాయంకాలము. ఆ వర్ణన మూలమున నిట్లు కలదు :

"But one day, *a little before sunset*, as he was seated in his usual manner at the end of the bridge, the Caliph Haroun Alraschid appeared; but so completely disguised that none of his subjects could know him."

ఈ సందర్భమున 'చిత్రరత్నాకరము' లోని వాక్యము లిట్లున్నవి :

"అంత నొకనాఁడినుండు కాలచోదితుండై భీకర శత్రురాజకర విదళిత తీవ్ర ప్రతాపుండై ఆశలు దిగనాడి పశ్చాన్ముఖుండై యంబుధియ శరణంబని చన దామోదరుండు తత్పట్టణ పురోభాగంబున నెప్పటియట్ల వ్రతంబు కతంబున వేచియుండె." [4]

---

3. Ibidem పుట - 5
4. Ibidem పుట - 8.

ఆలంకారికమైన ఈ రచనకు కథాకథనమే ముఖ్యముగా గల మూల రచనకు గల భేదము గుర్తించినచో, అనువాద విషయమునను నాటి తెలుగు రచయితలకు గల వర్ణనాభిలాష తెలియును.

మూలములోని భోజన సామగ్రి మాంసాదులతో గూడియుండగా, తెలుగులో నది శాకాహారమయినది.

"Abou Hassan's mother, who was an adept in the culinary art, sent in three dishes. One was a fine capon, garnished with four fat pullets; the other two dishes were a fat goose and a ragout of pigeons."

ఈ సందర్భమున చిత్ర రత్నాకరము లో ఈ విధముగ నున్నది :

"అందు పిరువురును సుచితాసనంబులనుండియుండ దామోదరునితల్లి శాల్యోదనంబును సూపసహిత బహువిధ శాకంబులును పచ్చళ్ళును రసోదంచితం బుగఁ జేసితెచ్చి సమీపంబున నుంచిన......"[5]

మూలకథ ముస్లిములకు సంబంధించినది గనుక, అందలి వర్ణనలు, మత మునకు సంబంధించిన వాక్యములు తన్మతానుగుణముగను, తత్సంప్ర దాయానుగుణముగను కలవు. తెలుగుకథ హిందుమతానుసారముగ నున్నది.

మారువేషములోనున్న 'ఖలీఫ్' దామోదరుని గాఢవాంఛను తెలుపు మనగా, నాతడిట్లనినట్లు మూలమున గలదు.

"I will say, nevertheless that one thing gives me some concern. You know the city of *Bagdad* has several divisions, and that in every division there is a *mosque*. Each mosque has an *Iman*, who assembles all the people of the division at the accustomed hours to join with him in prayer. The Iman of this division is a very old man, of an austere countenance; he is a complete hypocrite, if even there was one in the world. He assembles in council four other dotards, my neighbours, very much of the same character with himself, and they meet regularly everyday at his house. When they get together there is no sort of slander, calumny and mischief which they do not raise and propagate against me; and against the whole quarter; they distrub our quiet, and stir up dissensions among us."

దీనికి చిత్ర రత్నాకరమున నిట్లనువాదము కలదు. "అయిన మనశ్శల్యం బై యున్నదాని నొకదానిమాత్రము వివరించెద. ఈ వికుంఠసుతపురంబు పలు దెఱఁగులైన రాజమార్గంబులుగను గ్రంతలుగను విభక్తంబై యున్నట్లును

5. Ibidem పుట - 9.

వీథివీథికి దేవళంబు లున్నట్లును వానిలో విస్తృతంబుగ నర్చారాధనలు జరుప నర్చకు లున్నట్లును మీ రెఱుంగుదురుగద - మా వీథి దేవాలయంబునకుఁ గరాళ వక్త్రుండును మాయావియు నతిదుర్మార్గుండు నగు నొక ముసలి వైఖానసుండున్నవాఁడు, అతఁడును జుట్టుపట్టున్న నిద్దఱు వాండ్రును నలువురు నొక స్థలంబునం జేరి యచ్చటఁ దాము ముచ్చటించుచో నన్నును నాపొరుగువారి ననేకులను పేరు పేరు వరుసఁబెట్టుచు విచ్చలవిడిఁ దెచ్చుపెరిగి యున్నారు."[6]

పై విధముగా, చిత్రరత్నాకరములో; మూలమునందలి మతసంబంధమైన భాగములు మార్చబడినవి. దేశపరిస్థితుల ననుసరించి కొన్నిమార్పులు చేయబడినవి. ముదుసలి అర్చకులు శిక్షింపబడిన విధానమును వర్ణించుపట్టున మూలములో; "Thereupon you shall cause all the five to be clothed in rags and mounted each on a camel, with their faces turned towards the tail;" అని కలదు. మనదేశములో 'గాడిద' నెక్కించుట యవమానమునకు చిహ్నముగనుక 'చిత్రరత్నాకరము'లో నిట్లున్నది. "అనంతర మావంచక పంచకంబు నైదు రాసభంబులపై నెక్కించి విరూపులంజేసి పట్టణంబు నలుగెలంకులఁ ద్రిప్పుచు......"[7]

తెలుగురచనలో ప్రార్థనాదికమును గూర్చి ప్రాయునప్పుడును, వైదిక పద్ధతులనుగూర్చి చెప్పబడెను. "ఓభూధవేంద్ర దేవరతో సంధ్యాది వైదిక క్రియలు నిర్వర్తించు ముఖ్యకాలం బతిక్రమించినదనియు మున్నెన్నఁడింత తడవు నిద్రించి యుండరనియు విజ్ఞాపన సేయుచున్నాను."[8] అను దానికి మూలములో "Commander of the Faithful, your majesty will permit me to represent that you have not been accustomed to rise so late, nor have you ever suffered the hour of morning prayer to pass unregarded;" అని కలదు.

పైని పేర్కొనిన విధములుగా 'చిత్రరత్నాకరము' మూలభిన్నముగ నున్నది. సన్నివేశములలో గాని, భావ పరిణామములో గాని మార్పులేదు. శ్రీ గురుజాడ శ్రీరామమూర్తిగారు కథలోని స్త్రీపాత్రలకు పేరులు పెట్టినపుడు మూలభావము చెడకుండ రమణీయముగ కల్పించిరి.

6. Ibidem పుట - 13.
7. Ibidem పుట - 22.
8. Ibidem పుట - 18.

దామోదరుడు 'ఖలీఫ్' యొక్క అంతఃపురమున నున్నప్పుడు, అచ్చటి దాసీజనంబును జూచి వారిపేర్లడిగెను. ఈ సందర్భమున మూలములో గల ఈ క్రింది వాక్యములను చిత్రరత్నాకరములో రచయిత రమణీయముగ ననువదించెను :

**"He desired to know their names, and each in turn replied to his questions."**

**"Their names were Neck-of-Alabaster, Lip-of-Coral, Fair-as-Moonlight, Bright-as-Sunshine, Eye's-Desire, Heart's-Delight. He put the same question to the seventh, and she answered that her name was Sugar-Cane."**

"ఇట్లుండి దామోదరుండు వారలఁ జూచి మీ నామంబు లేమని యడిగిన వారుఁ గ్రమంబుగఁ గంబుకంఠియు, విద్రుమోష్ఠియు, చంద్రముఖియు, అరుణకిరణయు, మనోహారిణియు, మీనాక్షియునని తెల్పి వీవన విసరుదాని పేరిక్షుఖండం బనిరి." [9]

ఈ విధముగా చిత్రరత్నాకరము యొక్క రచన సాగినది. మూలములోని ఆచారములు ముస్లిముల ఆచారములు. ఇందలివి హిందువులవి. ఇంతకు మించి మార్పులు లేకుండ ఈ యనువాదము నడచినది.

"చార్ దర్విషు" లోని రచన వ్యావహారికము కాగా, 'చిత్రరత్నాకర' మందలి రచన గ్రాంథికము. ఆంగ్లానువాద పద్ధతిలో ఇది క్రొత్తమార్గము త్రొక్కెను.

మూలకథలోని సన్నివేశములను మాత్రమే గ్రహించియు, కథాగమన పద్ధతిని మార్చకయు, చిత్రరత్నాకరమును రచయిత తెలుగులో రచించెను. ఇదివరకే వ్యక్తముచేయబడినట్లు వర్ణనలు వచ్చిన సందర్భమునను, హిందూ సంప్రదాయములను గూర్చి వ్రాయునప్పుడును ఆంధ్ర రచయిత మిక్కిలి స్వాతంత్ర్యము ననువాదమున జూపెను.

విష్వక్సేన (Caliph) చక్రవర్తికి మిత్రుడైన దామోదరుని (Abou Hassan) వివాహమును గూర్చి వ్రాయునపుడు మూలములోని మూడు వాక్యముల కిందు ముప్పది వాక్యములు వ్రాయబడినవి.

**"The marriage presently took place. The nuptials were celebrated in the palace with great demonstrations of joy."**

---

9. Ibidem పుట - 26.

ఈ సందర్భమున 'చిత్ర రత్నాకరము' లో నిట్లు కలదు : "అపుడు వారా యిర్వురకు నుద్వాహంబు సేయ నిశ్చయించి, చంద్రతారాబల సమన్వితం బగు నొక వివాహ మూహూర్తంబు విచారించి పట్టణంబలంకరింపఁ బరిచారకుల నియమించి, పరిణయ సన్నాహంబును జేయించుచుండిరి......అపుడు ముదు సలులగు భూసురులు సుమూహూర్తంబు సమీపించెనని సార్వభౌమున కెఱిం గించిన నా రాజేంద్రుండు, నాతని పట్టమహిషియు సుస్నాతులై యేతెంచి పెండ్లి మంటపంబునం గూర్చుండి, మంగళఘోషంబులు చెలంగ దామోదరునకు మధుపర్కం బొసంగి, రాధికం దెచ్చి పాణిగ్రహణంబు సేయించిరి. అపుడు భూసురోత్తము లా వధూవరుల చేతికిఁ గంకణంబులు గట్టి లగ్నాష్టకంబులు పఠించిరి. విప్రాంగనలు గౌరీ కల్యాణంబులు పాడిరి. అపుడు దామోదరుం డాగమోక్తంబుగ విధ్యుక్తకాలంబున భూసురాశీర్వాదంబులు చెలంగ రాధిక కంఠంబున మంగళసూత్రంబు గీలించె........"[10]

ఈ విధముగా ఆంగ్లమూలము ; భారతీయ - విశేషించి, ఆంధ్ర - సంప్ర దాయానుసార మాంధ్రీకరింపబడినది. ఇది దీని యొక్క వైశిష్ట్యము.

వ్యాసము :

ఆంగ్ల సాహిత్య ప్రభావమువలన భారతదేశ భాషలలో వచన రచన బాగుగ నభివృద్ధి పొందినదనుమాట ప్రాతమాటయే. తెలుగునను వచన రచ నాభివృద్ధికి చక్కని దోహదముచేసినది తెలుగువారు కావించిన ఆంగ్ల సాహిత్య పఠనము, ఏదియో ఒక విధమైన వచనము, తెలుగులో మొదటి నుండియు నున్నను, నవీన వచనమును బోలిన వచనము, ఆంగ్ల సంపర్కము తరువాతనే తెలుగులో వెలసినదనునది నిర్వివాదాంశము. ఈ వచనరచన, కథారూపమునేగాక, వ్యాసరూపమునుగూడ పొంది వికసించెను. 'గద్యతిక్కన' యను బిరుదమును పొందిన శ్రీ వీరేశలింగం పంతులునకుముందే చక్కని వ్యాసరచనకూడ తెలుగున జరిగినది, కాని బహుముఖ ప్రజ్ఞగల పంతులుగారి రచనా వైవిధ్యముముందు వారి కవ్యవహిత పూర్వమున బయలుదేరిన రచన లన్నియు 'సూర్యునిముందు దివిటీలైనవి'. కాని, సూర్యోదయమునకు పూర్వము వెలుగు నిచ్చునవి దివిటీలేగదా ! ఇట్టి వానిలో ముఖ్యమైనది, విశిష్టమయినది 'హితసూచని' అను వ్యాస సంపుటి.

10. Ibidem పుట - 59.

'హితసూచని'ని[11] రచించినవారు శ్రీ స్వామినీన ముద్దు నారసింహ నాయనివారు. వీరాంగ్లభాషా కోవిదులని వీరు నిర్వహించిన ఉద్యోగమును హితసూచనిలోని రచనా చమత్కృతియు వ్యక్తముచేయును. హితసూచనిని బట్టి రచయిత పాశ్చాత్య విజ్ఞానమును ఆంగ్లభాష ద్వారమున గ్రహించినట్లు మనకు తెలియును. ఆంగ్లభాషా సంస్కృతుల ప్రభావము విద్యావంతుడైన ఆంధ్రునిపై బడినప్పుడు బయలుదేరిన వచన రచనకు, 'హితసూచని'ని చక్కని యుదాహరణముగ గ్రహింపవచ్చును. ఈ గ్రంథరచనకు ఆయనను పురిగొల్పినది, ఆంధ్రలోకములో వ్యాపించియున్న దురాచారములను ఖండింపవలెనను

---

11. హితసూచని ముఖపత్రము—

శ్రీరస్తు

శ్రీమతే జగన్నాథాయ నమః
ఈ లోకమునందు సకలశ్రేయస్కరంబులకు సాధకంబులగు
సుగుణ వివేక సంపత్తులకు వలసిన చర్చవిషయము లనేకము లుండినను
వానిలోని కొన్నివిషయములు
ప్రజలకు సుబోధయగునట్లు ముద్రాక్షరాంకితముగ జేయకుండెడి
లోపమును వారింపవలయునని

మహోపకారులగు
రాజమహేంద్రవరపుజిల్లా షష్టుక్లాసు డిస్ట్రిక్టుమునసఫుగా నుండిన
స్వామినీన ముద్దు నారసింహనాయనివారు
యోచించి ముఖ్యావశ్యకములగు కొన్నివిషయములను
వచనరూపముగ రచించి

హిత సూచని
అను నామమిడిన గ్రంథమును వారి సుపుత్రులగు
రాజమహేంద్రవరపుజిల్లా ఆక్టిన్ గవరన్మెంటు వక్కీలు
స్వామినీన రంగప్రసాదు నాయనివారివలన
జ్యోతిష్కానిధి ముద్రాక్షరశాలయందు
అచ్చువేయించి ప్రచురింపబడినది.

దుందుభి సంవత్సర శ్రావణమాసము
౧౮౬౨ సం॥ జూలై నెల

తీవ్రవాంఛ. ఈ సందర్భమున వీరు పీఠికలో "నాకు కలుగుచున్న అభిప్రాయములను తగుమాత్రముగా సూచించుటకు అనుకూలముగా నుండునని తోచుచున్న యెనిమిది ప్రమేయములనగా విద్యాప్రమేయము - వైద్యప్రమేయము - సువర్ణ ప్రమేయము - మనుష్యేతర జంతుసంజ్ఞా ప్రమేయము - రక్షః ప్రభృతి ప్రమేయము - మంత్రప్రమేయము - పరోక్షాదిజ్ఞాన ప్రమేయము - వివాహ ప్రమేయమున్ను - ఈ పుస్తకమునందు వివరింపబడుచున్నవి"[12] అని వ్రాసిరి.

'హితసూచని'ని నిష్పక్షపాత బుద్ధితో ఆమూలాగ్రము చదివినచో, మన దేశములో క్రమముగా పాతుకొనిన ఆంగ్ల విజ్ఞాన సంస్కృతులు, నాటి కాలమందొక మేధావిపై నెట్టి ప్రభావము చూపెనో వ్యక్తమగును. ఈ వ్యాస సంపుటిపై ఆంగ్ల విజ్ఞానసంస్కృతుల ప్రభావము పడినంతగా, ఆంగ్లభాషా సాహిత్యముల ప్రభావము పడలేదనవచ్చును. ఆంగ్లభాషలోని పదముల కొన్నింటి ప్రయోగముతో భాషా ప్రభావము ముగిసినది. సాహిత్య ప్రభావము ప్రత్యేకముగ పడిన భాగములని చెప్పదగినవి చాల తక్కువ. కాని పాశ్చాత్య ప్రభావము లేనిచో ఇట్టి గ్రంథము 1862 లో ఎన్నడును బయలుదేరెడిది కాదు. ఈ వ్యాస సంపుటిలో - వ్యాస మనుటకు బదులుగా ప్రకరణములను 'ప్రమేయము' లను పేర గ్రంథకర్త విభజించెను.—విద్యాప్రమేయములో రచయిత తననాటి విద్యావిషయకమైన భావముల నన్నింటిని విశదీకరించెను. ఈ భావ

---

12. హితసూచని, పీఠిక - 3 వ పుట.

హితసూచనియొక్క ఆంగ్ల ముఖపత్రము

The
Hitha Soochanee
or
Moral Instructor
In Prose
Prepared By
Swamyneena Muthoonarasimmah Naidoo
Late First Class District Moonsiff
Rajahmundry
And
Published by his son
Swamyneena Rungaprasawd Naidoo
Ag. Government Vakeel in the District
of Rajahmundry.
Madras:
Printed At The Jotheshkalanithee Press.
July 1862.

వ్యక్తీకరణములో - గ్రంథములు సులభముగా నర్థమగునట్లు వ్రాయవలె ననుటయు; ఛందోరూపమునందు గాక, వ్యావహారిక విషయములనుగూర్చి ప్రస్తావించు పుస్తకములన్నియు వచనములో నుండవలెననుటయు; సామాన్య విజ్ఞానమును గ్రంథరూపమున అచ్చువేయింపవలె ననుటయు; స్త్రీలకును విద్య చెప్పింపవలెననుటయు; ఇంగ్లీషులోనుండి సమర్థులైనవారు తగినగ్రంథము లను తర్జుమా చేయవలె ననుటయు - ముఖ్యమైనవి.

విద్యాప్రమేయము కాక మిగిలిన ప్రమేయము లన్నియును, సంఘ సంస్కరణ దృష్టితో రచయిత వ్రాసినవే. నాడు హిందూసంఘమున ప్రబలి యున్న దురాచారములను, మూఢ విశ్వాసములను తీవ్రముగ రచయిత ఇందు విమర్శించెను. ఇట్టి విమర్శ చేయుటకు తగిన మానసిక దార్ఢ్యము నాడు రచయిత కిచ్చినది ఆంగ్లవిద్యాభ్యాసమే అనుటలో నతిశయోక్తి లేదు. ఈ పుస్త కములోని ఎనిమిది ప్రమేయములు, సంఘములోని సమస్త విషయములను గూర్చి - రాజకీయ విషయములు తక్క - ప్రసంగించినవి.

ఈ వ్యాసములన్నియు నేడు మన మను 'వ్యావహారిక భాష' లో వ్రాయ బడినవి. ఈ విషయమును గూర్చి గ్రంథకర్త 'పీఠిక' లో విపులముగ చర్చించి, చర్చ నిట్లు ముగించెను. "గనుక సాధారణమయిన భాషయందు వాడికలో నున్న గ్రామ్యపదములు చాలామట్టుకు సరసమయిన వాక్యరచనలో నంగీక రించ తగినవిగా నేను ఎంచుకుంటున్నాను."[13]

ఆంగ్లభాషలోని పదములు కొన్ని మాత్రమే యిందు ప్రయోగింప బడినవి. గ్రంథము వాడుకభాషలో నున్నను, అనావశ్యకము లయిన ఆంగ్ల పదములు ప్రయోగింపబడలేదు. ప్రయోగింపబడిన ఆంగ్లపదము లీ క్రిందివి.

పేరా : ప్రయోగింపబడిన అన్యదేశ్యములలో నిది యొకటి. ఉదాహరణగా

"ప్రథమ ప్రమేయము తాలూక్ మూడవ పేరా చూడవలసినది"

(పీఠిక-పుట-౧)

ప్రింటు : "శాస్త్రముల యొక్క గ్రంథములున్ను ఇతరాంశములను గురించిన గ్రంథములున్ను సులభముగా బోధపడేలాగు దేశభాషలలో వాక్య గ్రంథములుగా వ్రాయించి, ప్రింటు వేయించి అవే బాలురకు చెప్పించే పక్షమందు......" (పుట-౬)

---

13. హితసూచని, పీఠిక - ౩ వ పుట (ఇందలి పుటల సంఖ్య 1862 లో వెలువడిన 'హితసూచని' ప్రతి ననుసరించి ఈయబడెను).

'ఇంగిలీషు' శాస్త్రగ్రంథములు : "సంస్కృతము వగైరా భాషలయందు శారీర శాస్త్రము మొదలయినవి రచింపబడి యున్నవి కాని ఆ గ్రంథములు బహు ప్రాచీనములైనవిన్ని దరిమిలాను పరిశీలనవల్ల తెలియవచ్చిన సంగతులచేత అభివృద్ధిని పొందించబడనివిన్ని ఐయున్నందున వాటిని పట్టి యేయే దేశభాషలను సంగ్రహములు చెయ్యడముకంటే యింగిలీషున యిప్పట్లో వాడికలో నుండే *జి అగ్రఫీ, జి ఆమిత్రి, ఎరిథ్మెటిక్ ఎస్ట్రానొమి, ఫిలాసొఫి, ఎనాటొమి,* అనే గ్రంథములయొక్క సంగ్రహములు ఏయే దేశభాషలను వ్రాయించి విద్యార్థులకు చెప్పించడము జరూరై యున్నవి." (పుట—౯)

ఇంగిలీషు సర్జరి : "సాధ్యమైనంత మట్టుకు భాషాంతరములయందుండే వైద్య గ్రంథములున్ను *ఇంగిలీషు సర్జరిన్ని* దేశభాషను తర్జుమాలు ఐయుండడము జురూరై యున్నది." (పుట—౧౯)

హాలు : "కొన్ని సమయములలో దాన్ని పంజరములోనుంచి వెలపలికి తీసి హాల్లో ఎగురుతూ వుండగలందులకు ఆమె వదలిపెడుతూ వచ్చినట్టున్ను." (పుట—౯౧)

దసుకుపెట్టి : "తత్క్షణమే ఆ కుక్క ఆ దుకాణము ముందర ఉన్న దసుకు పెట్టి మీదకి దుమికినందున అతను ఆనాణ్యములను దానిముందర వేసి..." (పుట—౧౧౭.)

విద్యా ప్రమేయములో రచయిత వెలిబుచ్చిన భావములు నవీనములు. ఆంగ్ల విద్యాభ్యాసమును పొందిన మేధావి వ్రాయు వాక్యములవి. ఆంగ్ల భాషాపదములను గలిగి యుండుటకంటె, నిట్టి భావములను వెలిబుచ్చుట యందును, ఆభావములను శిష్టజన వ్యవహారమునగల భాషలో 'వాక్య గ్రంథము'గ వెలువరించుటలోను, రచయిత విశిష్టత కన్పట్టుచున్నది.

పాశ్చాత్యులతో సంపర్కములేకపూర్వము, తెలుగులోగల రచనలలో, నూటికి తొంబది తొమ్మిదిపాళ్లు—శాస్త్రగ్రంథములయినను, విజ్ఞానాత్మక రచనలయినను—ఛందోబద్ధములైనవే. ముద్రణకళ అభివృద్ధికి వచ్చుటతోడనే వచన రచనకు మంచి ప్రోత్సాహమువచ్చినది. విద్యార్థులు చదువుకొనుటకు పాఠ్యగ్రంథములు కావలసి వచ్చుటతో, వచన రచనకు విలువయు, ప్రాముఖ్యమును హెచ్చెను. పాశ్చాత్య విజ్ఞానశాస్త్రములు తెలుగులోనికి వచ్చుటకు వచనమే యాధారమయ్యెను. ఈవిధముగా పాశ్చాత్యులతోడి సంపర్కము

వలన, మన రచనాపద్ధతులందును, విద్యావిధానమునందును మార్పులు బాగుగా వచ్చుచున్న కాలములో వ్రాయబడిన వాక్యగ్రంథము గనుక, 'హిత సూచని'యందు రచయిత ఆయామార్పుల కనుగుణముగ వ్రాసెను. విద్యా ప్రమేయములో, విద్యకు సంబంధించిన వివిధ విషయములు చర్చింపబడెను. రచయిత తన యభిప్రాయములను వ్యక్తము చేసెను. వానిలో, ఆంగ్ల విజ్ఞాన ప్రభావమువలన రచయిత వ్యక్తముచేసిన భావములుగల వాక్యముల నుదాహ రించుచున్నాను.

"హిందువులలో గానమున కావశ్యకములైన గ్రంథములుతప్ప వతి మ్మోపి సులభముగా తెలియతగినట్టు వాక్య గ్రంథములుగా దేశభాషలలో నుండడము యుక్తమని నాకు తోస్తున్నది." (విద్యాప్రమేయము; పుట - ౫)

"శాస్త్రములయొక్క గ్రంథములున్ను ఇతరాంశములను గురించిన గ్రంథములున్ను సులభముగా బోధపడేలాగు దేశభాషలలో వాక్య గ్రంథములుగా వ్రాయించి ప్రింటువేయించి అవే బాలురకు చెప్పించే పక్షమందు బాల్యకాలములోనే శాస్త్రములయొక్క ఇతరములైన అంశములయొక్క జ్ఞానము వారికి త్వరగా కలుగడమునకు సందేహ మేమియుం లేదు."

(విద్యాప్రమేయము; పుట - ౬)

"..........భూగోళ శాస్త్రముయొక్క గణితశాస్త్రము శాలాక్ క్షేత్రముయొక్క లెక్కయొక్క సిద్ధాంత భాగముయొక్క మరిన్ని న్యాయ శాస్త్రముయొక్క శారీర శాస్త్రముయొక్క వాక్యరూపములైన సంగ్రహములను ఏయే దేశభాషలచేత సంగ్రహించి అచ్చువేయించి చిన్నవాండ్లకు చెప్పించవలసినది. ఐతే, సంస్కృతము వగైరా భాషలయందు శారీరశాస్త్రము మొదలయినవి రచించబడి యున్నవిగాని ఆగ్రంథములు బహు ప్రాచీనములైనవిన్ని దరమిలాను పరిశీలనవల్ల తెలియవచ్చిన సంగతులచేత అభివృద్ధిని పొందించబడనివిన్ని ఐయున్నందున వాటినిపెట్టి యేయే దేశభాషలను సంగ్రహములు చెయ్యడమునకంటే యింగిలీషున ఇప్పట్లో వాడికెలో నుండే జియాగ్రఫి, జియామెట్రి ఎరిథ్మెటిక్, ఎస్ట్రానామి, ఫిలాసాఫి, ఎనాటొామి అనే గ్రంథముల యొక్క సంగ్రహములు ఏయే దేశభాషలను వ్రాయించి, విద్యార్థులకు చెప్పించడము జరూరై యున్నది."

(విద్యా ప్రమేయము ; పుట-౭)

"......యింకా చాలా శాస్త్రముల యొక్క వ్యవహారాద్యంశముల యొక్క గ్రంథములు ఇంగిలీషు భాషను విశేషముగా దిద్దుబాటౌతూ వృద్ధిని పొందుచున్నవి. గనుక వాటిలో జరూరైన ప్రమేయములు ఇంగిలీషు గ్రంథములలో నుంచి దేశభాషలను తర్జుమా చేయించి, యేయే విద్యార్థి యొక్క ఇచ్ఛకున్ను, శక్తికిన్ని అనుగుణములైన గ్రంథములు చెప్పించడను యుక్తముగా తోచుచున్నది." (విద్యాప్రమేయము ; పుట-౧౦)

"...ఇంగిలీషు బాగా తెలిసి అసలు గ్రంథముల యొక్క ముఖ్యాభిప్రాయములు సులభముగా బోధపడతగినట్టు దేశభాషను సంగ్రహములు చెయ్యడమునకు లాయకైన సామర్థ్యముగలిగినవారు పూనుకున్న పక్షమందు......శాస్త్ర సంబంధములైన సంగ్రహములలో నొకటొకటి తగిన కాలములో నేర్పాటు కావచ్చును, మరిన్ని విద్యార్థులు చూచుకునే నిమిత్తము శాస్త్రముల యొక్క యింకా జరూరైన అంశముల యొక్క ప్రమేయములు చాలాగా ఇంగిలీషు భాషయందుండే గ్రంథములను పట్టి తర్జుమా చేయ ప్రవేశించుచుంటున్నది." (విద్యాప్రమేయము ; పుట-౧౩)

విద్యాప్రమేయములో పై అభిప్రాయములను ప్రకటించినట్టి 'ముద్దు నరసింహ నాయనిగారు', మిగిలిన ప్రమేయములలో మిక్కిలి నవీనములైన అభిప్రాయములను ప్రకటించిరి. ఆ యభిప్రాయములను మనము పరికించినచో వీరికి గల విజ్ఞానము మనకు వ్యక్తమగును. ఇట్టి విజ్ఞానమును వీరికి కలిగించినది వారభ్యసించిన పాశ్చాత్య విద్యయే యనుటలో సందేహము లేదు. నాటి పండిత పామరులందరు నమ్మిన భావములను, నాటికి గల మూఢవిశ్వాసములను వీరు నిరాకరించగలిగిరి. ఇందులకు వీరభ్యసించిన ఆంగ్లవిద్యయు, దాని సాహచర్యమున వారు నేర్చిన విజ్ఞానమును కారణములు.

సువర్ణ ప్రమేయములో నీచలోహములు బంగారముగ మారుట జరుగునది కాదని చెప్పు సందర్భమున వీరు వ్రాసిన ఈ క్రింది వాక్యములను బట్టి ; లోహములను గూర్చి నాటి పాశ్చాత్య విజ్ఞానులకు గల భావములు వీరికి తెలిసినవై యున్నవని వ్యక్తమగుచున్నది.

"బుద్ధిమంతులైనవారు బాగా యోచిస్తే మరియొక లోహమును బంగారము చెయ్యడము అసాధ్యమని తెలియతగియున్నది...... రాగి కరిగి అందులో ఒకాకొక వస్తువు వేస్తే బంగారమౌతుందని కొందరు వాదిక చేస్తున్నారు. బంగారము వెండి రాగి మొదలైన లోహములు మృచ్ఛిలాదుల

యందు సహజముగా ఉత్పన్నములౌచున్నవి గనుక అవి అసలు లోహములని చెప్పతగియున్నవి." (పుట - ౩౨)

"......అసలు లోహములలో కొన్నిటిని తగినపాళ్లను కలిపి కరుగడము చేత మిశ్రలోహములు (అనగా ఇత్తడి-కంచు మొదలైనవి) ఏర్పాటౌచున్నవి గాని అసలు లోహములలో నొకదాన్ని మరియొకటిగా చేయడ మెవరికిన్ని సాధ్యమైన పనికాదు......" (పుట - ౩౩)

"రాగి కరిగియున్నప్పుడు (ఒకానొక వస్తువు) అనగా లోహ సంబంధము గలిగియున్న పాదరస భస్మము మొదలైన వాటిలో నొకటి—అందులో నుంచిన పక్షమందు రాగికి నిజకాంతి కంటే భిన్నకాంతి రావచ్చునుగాని అది సువర్ణము కానేరదు. దానియొక్క సూక్ష్మభాగములకు సువర్ణము తాలూక్ సూక్ష్మ భాగముల యొక్క సత్వమును, కాంతియున్ను కలుగనేరవు" (పుట - ౩౪)

ఒక లోహముయొక్క సూక్ష్మ భాగములు ఇంకొక లోహము యొక్క సూక్ష్మభాగములుగ మార్చుటకు వలనుకాదను నాటి శాస్త్ర విజ్ఞానమును గ్రహించినవాడు గనుకనే రచయిత 'బంగారమును చేయుట'ను అవహేళనముచేసి, అట్టి ప్రయత్నమును ఖండించి, "బంగారముచేసే విద్యను సాధిస్తామనే వారిలో బుద్ధిమంతులున్ను ఉందురుగాని గ్రహచార సామాన్యము చేత వారి బుద్ధులు పొరబాటును పొందడమువల్ల ఇటువంటి యత్నములను వారు పూనుకుంటున్నారని తోస్తున్నది." అని వ్రాసెను.

ఈ 'హితసూచని' యందుగల '*మనుష్యేతర జంతు సంజ్ఞా ప్రమేయము*' నందు జంతువులు మాటాడగలవని నమ్మటను రచయిత ఖండించెను. '*రక్షః ప్రభృతి ప్రమేయము*' లో దయ్యములు కలవని నమ్మట కాధారములు లేవని అభావమును ఖండించెను. '*మంత్ర ప్రమేయము*' లో పరకాయ ప్రవేశాది విద్యలు కలవని నమ్మట మూఢత్వమని నిరసించి, మంత్రములకు శక్తిలేదని వ్రాసెను. '*పరోక్షాది జ్ఞాన ప్రమేయము*' లో మనుష్యులకు దివ్యదృష్టి కలదను కొనుట పొరపాటనియు, జాతకములను నమ్మరాదనియు వ్రాసెను. '*వివాహ ప్రమేయము*' లో 'చిన్నది రజస్వలయైన తరువాత కన్యయొక్క చిన్నవాని యొక్క పరస్పరేచ్ఛ కనిపెట్టి వివాహము చెయ్యడము యుక్తకార్యము, అని వ్రాసెను. '*వైద్య ప్రమేయము*' లో గృహవైద్యమునుగూర్చి వ్రాసెను.

ఈ విధముగా 'హితసూచని' పందొమ్మిదవ శతాబ్ది నడుమ భాగములో బయలుదేరి, నాటి మేధావుల మనస్సులలోగల భావములకు, వ్యాసరూపమున

ప్రకాశము నిచ్చినది. ఈ మేధావుల మనస్సులను తీర్చిదిద్దినది ఆంగ్లవిద్య. 'హితసూచని' తరువాత బయలుదేరిన గ్రంథములపై, వ్యక్తులపై, దాని ప్రభావము పడినదని, శ్రీ వీరేశలింగం పంతులుగారిని బోలిన వారి రచనలను జూచిన తెలియును.[14]

పద్యకావ్యము :

పందొమ్మిదవ శతాబ్దియొక్క మధ్యకాలమున, ఆంగ్ల నాగరకతకు పుట్టినిల్లై వరలిన చెన్నపట్టణమును వర్ణించు ప్రౌఢ కావ్యము శ్రీ మతుకుమల్లి నృసింహశాస్త్రిగారు రచించిన 'చెన్నపురీ విలాసము'.[15] శ్రీ వీరేశలింగం పంతులు గారి రచనల కవ్యవహిత పూర్వమున బయలుదేరిన ప్రౌఢ కావ్యములలో ఆంగ్లభాషా పదములు విశేషముగగల కావ్యము, పాశ్చాత్య నాగరకతను వర్ణించు కావ్యము, ఇదియొక్కటియేయనుట అతిశయోక్తికాదు. ఆంగ్లేయుల పాలనాదికమునుగూర్చియు, వారి విజ్ఞాన ప్రభావమును గూర్చియు, యథాతథముగ వర్ణించు పద్యకావ్యమిది. పద్యకావ్యములలో 'చట్రాతి లక్ష్మీనరస కవి' రచించిన 'పద్మనాభ యుద్ధము' కావ్యము తరువాత 'చెన్నపురీ విలాసము' లోనే విశేషముగ ఆంగ్లపదములు కలవు. 'పద్మనాభ యుద్ధము' రచింపబడునాటికి ఆంగ్లేయుల ప్రభుత్వ మింకను విజృంభింపలేదు గనుక అందు ఆంగ్ల పరిపాలనాదికమునకు సంబంధించిన వర్ణనలు, మాటలును తక్కువ. 'చెన్నపురీ విలాసము' ఆ గ్రంథము బయలుదేరిన తరువాత అరువది సంవత్సరములకు బయలుదేరినది గనుకను, ఆంగ్ల నాగరకత కాటపట్టైన 'చెన్నపురి'ని వర్ణించుటయే ప్రధాన లక్ష్యముగా కలది గనుకను, ఇందు (చెన్నపురీ విలాసము'నందు) ఆంగ్లేయుల జీవిత విధానము, ప్రభుత్వ పద్ధతి, వారి విజ్ఞాన విశేషములు:

---

**14. వీరేశలింగం పంతులుగారి రచనలలో వ్యాసమునుగూర్చి వ్రాసినపుడు ఈ విషయము విపులముగా చర్చింపబడెను.**

15. చెన్నపురీ విలాసము - శ్రీ మతుకుమల్లి నృసింహకవి కృతము.

**"ఈ ప్రబంధమును మొట్టమొదట (1863) ఎనుబది సంవత్సరముల క్రితము వచ్చిన దుందుభి సం. శ్రావణమాసమున శ్రీ వావిళ్ళ రామస్వామిశాస్త్రులవారు స్వకీయ ముద్రాక్షరశాలలో ముద్రించి ప్రకటించిరి". (1941 ముద్రణ పీఠికలో శ్రీ శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు.)**

**ఇట్టి కావ్యమును మరల ముద్రించి (1941), వావిళ్ళవారు పరిశోధకులకు మహోపకారమును జేసిరి.**

విపులముగా రమణీయముగా, యథాతథముగ, ఆంగ్లశబ్ద ప్రయోగములతో వర్ణింపబడెను. ఈ ప్రౌఢకావ్యము యొక్క వైశిష్ట్య మియ్యదియే.

శ్రీ మతుకుమల్లి నృసింహకవి (1816-1873) వివిధ శాస్త్రములలో విద్వాంసుడు. సంస్కృతాంధ్రములలో కవనము చెప్పగలిగినవాడు. 'అజ చరిత్రము' (ఆంధ్ర ప్రబంధము. 1912 లో ముద్రితమైనది) మొదలుగాగల ప్రౌఢ ప్రబంధముల నిర్మాత. ఈతని కృతులలో చారిత్రక ప్రాముఖ్యము గలది 'చెన్నపురీ విలాసము'. ఇది వల్లూరి ప్రభువులగు శ్రీ రాజా బొమ్మదేవర నాగన్న నాయడు జమీందారుగారి ఆజ్ఞచే నృసింహకవి రచించినది. దీనికి వారే కృతినాయకులు.

కృతినాయకులైన శ్రీ బొమ్మదేవర నాగభూపాలుడుగారు సీమరాణి చేత సత్కారములను బొందినవారు. ఈ సత్కారములు రాణిగారి తరఫున; "కలకత్త, మదరాసు గౌర్నరుల్ చెలిమి వాటిల్లగా సెలవుసేయ, బందరు పురము లోపలం గలెక్టరు, జడ్జి, కర్నలు మొదలుగాం గలుగు దొరలు...సభం జేసి...శాలివాహనమహాశక వత్సరంబులు, గుణవారణ మునీందు గణన గల్గు (క్రీ. శ. 1861) రౌద్రినామ వత్సరమున నాశ్వయుజీయ బహుళ పంచమి మందవాసరమున", జేసిరి. అనేకులైన "హూణవల్లభులు క్యారక్టర్లు" వీరి కిచ్చిరి. వీరు 1861 లోనే "(మాఘ బహుళపక్ష తృతీయా జ్ఞవాసరమున)" బయలుదేరి చెన్నపురి చేరి, అచ్చట 'చాకలిపేట' లో పెద్ద యింటిలో సపరివార ముగ దిగిరి. పిమ్మట నాగభూపాలుడుగారు "కమిస్సెరీదొరల గౌర్నరుగార్లను సెక్రిటేరులన్ గనిగం గమిస్సెరీ జెనరలుగారు శిఫారసు సేయ...గౌర్నమెంటు వారు" వారి రాజ్యమును వారి కిచ్చిరి. తరువాత నాగభూపాలుడుగారు శ్రీనృసింహకవిని రావించి, గౌరవించి, "చెన్నపురి పూర్ణవిలాసము వర్ణనీయ వైఖరి యగుంగాన" 'చెన్నపురీ విలాసము' ను రచింపుడని కోరిరి. అంత నృసింహకవి, "హూణేశాధిష్ఠిత రాజధాని మదరాసు" ను వర్ణింపుచు ఈ కావ్యమును రచించెను.

పందొమ్మిదవ శతాబ్ది మధ్యభాగమున చెన్నపురి ఎట్లుండెనో తెలిసికొనగోరువారికి దీనిని మించి తెలుపగలిగిన తెలుగుకావ్యము లేదు. ఇందు ప్రభుత్వ సంబంధమైన విషయములు, వైజ్ఞానిక విషయములు, వివిధ దృశ్యములు చక్కగా వర్ణింపబడెను. "వస్తు విశేషములను దెలుపునపుడు సుబోధమగుటకై

వాడుకలోనికి వచ్చిన ఆంగ్లేయ పదములను వాడుచు వస్తువయమును వర్ణించెను."[16]

ఈ కావ్యము - స్వరూపపద్ధతి, పూర్వపద్ధతి, దక్షిణపద్ధతి, ఉత్తరపద్ధతి, అంతరాళ పద్ధతి అను ఆరు భాగములుగ నున్నది. ప్రతి భాగమునకు ప్రకరణములు కలవు. ఇందు వర్ణింపబడిన విషయములను "ఇంగ్లీషు ప్రభావము" ననుసరించి మూడు భాగములుగ విభజింపవచ్చును. ఆంగ్లప్రభుత్వమునకు, అధికారులకు సంబంధించిన ఇంగ్లీషుమాటలు కలది మొదటిభాగము. పాశ్చాత్య విజ్ఞాన విషయములను వర్ణించునది (ఇంగ్లీషు మాటలతో) రెండవ భాగము. చెన్నపురిలోని దృశ్యములను వర్ణించునది (సముచితమైన ఆంగ్లపదములతో) మూడవభాగము. వాడుకలోనున్న ఇంగ్లీషుమాటలను యథాతథముగ ప్రయోగించుటలోనే ఈ విద్వత్కవి నవీనత, విశిష్టత కలదు. కాని విజ్ఞానవిషయములకు సంబంధింపని కవితాసామగ్రి మాత్రము పురాణమే!

ప్రభుత్వ వ్యవహారమునకు సంబంధించిన వర్ణనలు - ఆంగ్లపదములు :

శ్రీ నృసింహకవిచే - "ఉపవన ప్రకరణము" లో, "...గౌర్నరులుం గర్నలు సెక్రిటేరులు కమాన్డర్గింక జడ్జీల్కలక్టరులుం బాదరులుం గమీష్నరులు మేస్టర్లింజనీర్లాదిగా దొరలుండంవగు..." బంగళాలును; "సభాప్రకరణము" న ఆంగ్లేయులు స్థాపించిన "...సూప్రీమ్కోర్టు నాఁజిన్ని కోర్టును సీకష్టమునాఁ గమిస్సరియు నారూపింప నాఫీసు..." లును; "సర్గ ప్రకరణము" లో కోటయు (Fort St. George) దానిలోని "గౌర్నరుమెంటు ట్రెజరు", "మిల్టెరీ రచ్చ", "కౌంటూంటు", "స్టోర్లు", "సోజర్లవి బారకీసులు" ను; "రైటరులు గౌల్వఁగ గౌర్నరు గౌల్వు నేయు" టయును; "ధర్మస్థాన ప్రకరణము"లో "...ఇన్కంటాక్సనిస్మెంటుటాక్సు సదర్కోర్టును పోడ్డు పోలీసును నా సౌంపారు నాఫీసులు"ను; "వైద్యశాలా ప్రకరణము"లో "సకలలోక హితార్థ మాజాతి దొరలు" నిలిపిన "ఆస్పిటలు"ను; "పుస్తకసౌధ ప్రకరణము"న "కాలేజీ" యును వర్ణింపబడెను.

ఇవిగాక "వీరభట ప్రకరణము"లో కవి, "...తుపాకుల......ఫైర్ల ఫెళఫెళ ధ్వనుల"ను, "...వీర రౌద్ర సంపదల నెసంగు పోలీసుల బంటుల"ను వర్ణించెను.

---

16. 'చెన్నపురీ విలాసము' పీఠికలో శ్రీ శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు.

ఇట్లు మొదటిభాగము; ఆంగ్ల ప్రభుత్వమునకు, అధికారులకు సంబంధించిన ఇంగ్లీషు మాటలను కలిగియుండెను. పై నుదహరింపబడిన మాటలనుబట్టి కవి ఛందస్సునకు వీలగునట్లు ఇంగ్లీషు మాటలను, ఉచ్చారణను మలచుకొనినట్లు తెల్లమగుచున్నది.

## వైజ్ఞానిక విషయములకు సంబంధించిన వర్ణనలు - ఆంగ్లపదములు :

'చెన్నపురీ విలాసము'లో నాటి విద్యా పద్ధతులను గూర్చియు, ఆంగ్లేయులతోడి సంపర్కము వలన మనకు సంక్రమించిన విజ్ఞానమును గూర్చియు నాగరకతలో పాశ్చాత్యులు తీసికొనివచ్చిన మార్పులను గూర్చియు నృసింహకవి సుదీర్ఘముగా వ్రాసెను. ఇట్లు వ్రాయునపుడు, ప్రకరణౌచిత్యమునకు వలయు ఆంగ్లపదములను, స్వేచ్ఛగా నిస్సంకోచముగా వాడెను.

పాశ్చాత్యుల రాకవలన యాంత్రిక రంగమున మనదేశములో వచ్చిన మార్పులలో రాకపోకలకు రైలుబండ్లు, వార్తా ప్రసరణమునకు తంత్రీ మార్గములు, గ్రంథ ప్రచారమునకు ముద్రణకళ—ముఖ్యమైనవి. నేడు మనకివి చిరకాల పరిచయము వలన క్రొత్తగ, వింతగ కన్పట్టక పోవచ్చును కాని నాడవి ప్రజలను సమ్మోహనము చేసినవి. ఆశ్చర్యచకితులను జేసినవి. భయ సంభ్రమములు కల్పించినవి. ఏవిధములయిన యంత్రములనుచూచి ఎఱుగని ప్రజలు; పాశ్చాత్యులు ముద్రణ యంత్రమును మొట్టమొదట తెచ్చినపుడు, దానినిచూచి అది 'ఇంగ్లీషువారి దేవత'యని తలంచినారట![17] ఇది పందొమ్మిదవశతాబ్ది మొదటి దినములలోని మాట. ముద్రణాలయములను క్రొత్తగ నెలకొల్పుచున్న దినములవి. అందులకంత ఆశ్చర్యము. రైలు మార్గములు, వార్తా ప్రసరణమునకు తంత్రీమార్గములు; 'చెన్నపురీవిలాసము' రచింపబడు

17. "In 1798, taking advantage of the opportunity afforded by a wooden printing - press in Calcutta being offered for sale, he (Dr. Carey the Baptist Missionary) bought it for £40, and took it away to Madnabati in the Malda district, where he was living. So unfamiliar were the villagers with any form of machinery that when it was set up there, *they believed it to be an English idol.*" (Mechanism and Transport, a chapter by L. S. S. O'Malley, C. I. E. in the book 'Modern India and the West' edited by him in 1941. Oxford University Press. Page - 225).

నాటికి కొలది సంవత్సరములకు పూర్వము మాత్రమే[18] వచ్చినవగుటచే, వీని విషయమున, కవి ప్రత్యేకశ్రద్ధ చూపి వ్రాయుటకు కారణమయినది.

'తంత్రీ వార్తాప్రకరణము'లో నృసింహాకవి, 'టెలిగ్రాఫ్' యంత్రాదిక మును రమణీయముగ, అతిశయోక్తులతో నిట్లు వర్ణించెను.

"అమరు లెన్నాను ముం దపోగరిమ నుద్యద్దూరవార్తాగ్రహో
ద మహత్త్వంబును గాంచి రబ్రముగ నూరోపీనులా ప్రోల నో
లి మహాచిత్రముగా ఘటించి రది టెల్లీగ్రాపు నా దాన ని
క్కముగా దూరపు దీవి వార్తల నెఱుంగన్వచ్చు నేకత్రుటిన్."

ఈయంత్రము "ద్రావక లబ్ధశక్తికిని దావలమై... ... ..."పని చేయు చున్నదని కవి వర్ణించెను.

'ధూమశకట ప్రకరణము'లో నృసింహాకవి 'రైలురోడ్డు'లను, 'రైలు బండ్ల'ను 'రైలు యంత్రము'లను విపులముగా వర్ణించెను. ఆవర్ణనలను జూచి నచో కవికే అవి ఎంత ఆశ్చర్యమును గొల్పినవో తెలియగలదు. రైలుబండ్లు పోవుటను, కవి ఇట్లు వర్ణించెను.

"అమరులు మున్ను దివ్యమహిమాతిశయంబునఁ గన్న దేవయా
నములు దివి న్మనోరయమునంజనుఁ గామచరంబులంచు విం
టిమి యిపు *డింగిలీషులు* పటిష్ఠతఁజేసిన రైలుబండ్లు నే
గు మహి మనోజవంబును జిగుర్కొనఁగాఁ బురినద్భుతంబుగాన్."

'రైలు'లోని యంత్రములను, అది నడచు విధానమును, అందుపయో గించు 'బొగ్గు' మొదలగువానిని నృసింహాకవి మిక్కిలి రమణీయముగా వర్ణించెను. నాటికిని నేటికిని ఈవిషయము నింత ప్రౌఢశైలిలో నింత చమ త్కారముగా వర్ణించిన సాహిత్యభాగము లేదనుట యతిశయోక్తి కానేరదు.

---

18. "The early years of the second half of the nineteenth century were a formative period of even greater importance, in which the tide of westernization set strongly on the shores of India. A mere recital of dates is sufficient to show the rapid succession of changes. In 1853 the first railway began running; in 1854 the first telegraph line was opened and the modern postal system was installed."

(Ibidem. Page - 576)

'చెన్నపురీ విలాసము' 1861 ప్రాంతమున వ్రాయబడి 1863 లో మొట్టమొదట వావిళ్ళ వారిచే ముద్రింపబడెను.

"ఫోటోగ్రాఫీ ప్రకరణము"లో నృసింహాకవి ఆ కళనుగూర్చి ప్రాత క్రొత్తలను కలిపి, ఇట్లు వర్ణించెను.

"ఛాయాగ్రాహిణి యాంజనేయుని తనుచ్ఛాయ న్వడిన్నిల్పి తా
డాయం దీసెననంగ వింటి మదిచూడ న్యంత్రపేటిన్ ఘన
ప్రాయాదర్శములందు నీడలఁ *ఫొటోగ్రాఫీ* క్రియ న్నిల్పఁగా
జేయం జాలిరి *యింగిలీషులు* పురిం జిత్రాతిచిత్రంబుగన్."

"ఇలెక్ట్రో గేల్వానిక్మిషన్ ప్రకరణము"లో నృసింహాకవి, ద్రావకముల సాయముతో విద్యుత్తును కల్పించు విధానమును, దాని యుపయోగములను, చిత్రముగా వర్ణించెను. ఇవన్నియు నాఁడు, పాశ్చాత్య విద్యావిధానమువలన జనులు మెల్లమెల్లగా గ్రహించుచు వచ్చిన విజ్ఞానవిశేషములే! ఈ ప్రకరణములో, కవి భావనాశక్తి మనోహరముగ నున్నది. ఈ ప్రకరణ మందలి విషయ వర్ణనము నిరుపమానము. "వాయువ్యాధ ల్శమియింపగ" దొరలు దానిని సృష్టించినారని వ్రాయుచు నిట్లనెను.

"మఱియు నాయిలెక్ట్రోగేల్వానిక్మిషనను వైద్యవిద్యకు విద్యోతకంబగు నొక్క యంత్రపేటియు నందు ద్రావక ప్రపూర్ణంబులగు కాచపాత్రములు రెండును వానిలో న్యస్తంబై యంత్రకీలితంబగు తంత్రీద్వితయంబును గలిగి యుండు నా తంత్రీప్రకారంబు"

"ద్రావకన్యస్త తంత్రులఁ గ్రమముతోడ
జరుగు నాకృష్టి శక్తి యుత్సర్గశక్తి
యొకటిఁ బట్టిన రభస మించుకయులేదు
*నుభయము గ్రహింపఁ బరఁగు నత్యుల్బణముగ*"

అని వ్రాసి, తరువాత "భారపుతంత్రిని ముట్టశక్యము" కాదని, పిదప తేట తెనుగు మాటలతో "ఎలక్ట్రిక్ షాక్"ను ఇట్లు వర్ణించెను.

"కందురీఁగెల యొకకోటి గఱచినట్లు
కూడి వెయి మండ్రగబ్బలు కుట్టినట్లు
దాక మ్రోచేతికిని దెబ్బదాఁకి నట్లు
తల్లడిలు ప్రాణములు తంత్రిఁ దాఁకినంత"

ఈ వర్ణన కవికి స్వానుభవము వలన జన్మించిన జ్ఞానమునకు పరిణామ మనియే తోచుచున్నది!

"ముద్రాక్షరశాల ప్రకరణము"లో నృసింహకవి, నాడు మద్రాసులో ప్రముఖ ముద్రాక్షరశాలలైన—విద్యానిలయము, ఆది విద్యానిలయము, కళానిధి, జ్యోతిష్కళానిధి, శారదానిలయము, జ్ఞాన సూర్యోదయము, సూర్యాలోకము, సరస్వతీ నిలయము, ఆది సరస్వతీ నిలయము, వివేకరత్నాకరము, వివేకాదర్శము, వర్తమాన తరంగిణి అను వానిని పేర్కొనెను. ప్రత్యేకముగా, శ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రిగారి 'ఆది సరస్వతీ నిలయము' (తండియార్పేట)ను ఒక పద్యమున వర్ణించెను. 'చెన్నపురీవిలాసము' కృతి నాయకులైన శ్రీ బొమ్మదేవర నాగభూపాలుడు, "తన సాహాయ్యంబు వాటించుచు", ఆది సరస్వతీనిలయ ముద్రాక్షరశాల కధ్యక్షులైన "రామస్వామి మనీషిచే నిఖిల సద్గ్రంథాళి" ముద్రింపించినట్లు కవి వ్రాసెను. ఈ కావ్యమును కూడ, మొట్టమొదటిసారి శ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రిగారు తమ ముద్రాక్షరశాలలోనే ముద్రించి ప్రకటించిరి (1863).

పైని పేర్కొనబడిన; "హిందూప్రపక్షప్త ముద్రాక్షరాలయములే" కాక "ఇంగిలీషు నృపన్యస్తము"లైన, "దినవర్తమానియును బోర్ట్సుం ట్జార్జిగేజెట్టి గింటన మిష్నేరియు నాగ మెచ్చనగు నచ్చాఫీసు"లును నృసింహకవిచే పేర్కొనబడెను.

నాడు ప్రాచ్య పాశ్చాత్య విజ్ఞాన సంస్కృతులను ఈ ముద్రాక్షర శాలలే, ముద్రింపబడిన గ్రంథముల ద్వారమున ప్రచారము చేసెను.

నాడు చెన్నపురిలో పాశ్చాత్యపద్ధతిని విద్యనేర్పెడి పాఠశాలలను "పాఠశాలా ప్రకరణము"న కవి యిట్లు వర్ణించెను. ఈ పాఠశాలలే నాడు ఆంగ్లవిద్యను దేశమందు నెలకొల్పి దేశీయుల మనస్సులను తీర్చిదిద్దినవి.

"మేలొప్పన్దగు నప్పురంబునను నార్మెన్ స్కూలు నయ్యాంగ్లవన్
స్కూలుం బోల్పగు పచ్చయప్పవిభు నాస్కూలు న్విచారింప హై
స్కూలు న్లోనగు స్కూలు లప్పురి సిరుల్గుల్కం బఠద్బాలకో
న్మీల త్కంఠ ఘళంఘళ ధ్వేలయ వాణీ నాట్యరంగాకృతిన్."

శ్రీ మతుకుమల్లి నృసింహకవి పైవిధముల - నాటి వైజ్ఞానిక విషయములను గూర్చియు, నట్టి విజ్ఞానవ్యాప్తికి తోడ్పడు గ్రంథములను ముద్రించు ముద్రాక్షర శాలలనుగూర్చియు, నట్టి విజ్ఞాన విషయములను బోధించు పాఠశాలలను గూర్చియు, నాడు వాడుకలోనున్న ఇంగ్లీషు మాటలను ప్రయోగించి మనోహరముగ వ్రాసెను.

చెన్నపురిలోని దృశ్యముల వర్ణన - ఆంగ్లపదములు :

'చెన్నపురీ విలాసము'లో నాలుగింట మూడుపాళ్ళు దృశ్యముల వర్ణనలే. ఈవర్ణనలు కవియొక్క పరిశీలనశక్తిని మనకు తెలియజేయును. ఈవర్ణనలు చేయునప్పుడు నృసింహాకవి, ఔచిత్యము చెడకుండుటకై ఆంగ్లపదములనే వాడి, వర్ణనలసొగసు నినుమడింప జేసెను. దేశీయులయొక్కయు విదేశీయుల యొక్కయు జీవిత విధానములను. మత విషయములను, సాంఘికాచారములను వర్ణించుటయేగాక; నాటి చెన్నపురిలోగల వీథులను, దేవాలయములను, వస్తు విక్రయశాలలనుగూడ వర్ణించెను. ఒకవిధముగా చూచినచో చెన్నపురీ విలాసమంతయును వర్ణనాత్మకమే. ఆంగ్లపదములుగల వర్ణనలను, పాశ్చాత్యులను గూర్చిన ప్రస్తావనగల భాగములను, మాత్రమే యిట నుదాహరించుచున్నాను.

"శకట ప్రకరణము"లో నృసింహాకవి

"చతురశ్వద్విహయాన్వితంబులు చతుశ్చక్రాభిరామంబు లం
చితచిత్రాంబర సద్వితానకములై చెల్వారు సారట్లను"

ఎక్కి, పాశ్చాత్యులిట్లు విహారములు చేయుదురని అతిశయోక్తిగ వర్ణించెను.

"లలితాకార విచిత్రవేష రుచిరాలంకార శృంగార మూ
ర్తులు యూరోప్దొరసానులున్ దొరలు దోడ్తో సారటుల్మెట్టి ద్యో
స్థలి నారూఢ విమానులై తిరుగు గంధర్వాప్సరః కిన్నరు
ల్బలెఁ గ్రీడింతురు వీట వార్ధికడ లీలారథ్యలన్ సంధ్యలన్."

ఆంగ్లేయులను వర్ణించునప్పుడెల్ల కవి అతిశయోక్తులను విరివిగా వాడినాడు.

చెన్నపురిలోని కొన్ని వీథులనుగూర్చి వ్రాయుచు నృసింహాకవి; "దక్షిణ శాఖానగర ప్రకరణము"న,"......హూణేశ్వర సౌధసందోహ భాస్వరంబై పేటలకునెల్ల హెడ్డగు ఎవొంక్రోడ్డు"ను; "ముత్యాలపేట వీథీప్రకరణము;"లో "......హూణజన సందోహమందిర సుందరంబగు నైనియప్పని వీథియుఁ దాదృశంబులగు శంభుదాసుశౌరి ముత్తుమలయప్ప యప్పుమేస్త్రి డైమిన్సు జైమిన్సుల వీథులును సమస్త ప్రశస్తనిస్తులాస్తోక వస్తువిస్తార శ్వేతకాయ వార్ధుషికనికాయ వాణిజ్య సౌధమంటప విశాలంబగు పాపమ్సు వీథియు...."వర్ణించెను.

చెన్నపురిలోఁగల పాశ్చాత్యుల శిలా విగ్రహములను వర్ణించు సందర్భమున కవి; కోటలోని "మేడీసు"ను, "తిరువల్లిక్కేణి ప్రెవ్రోడ్డున"నున్న "మంద్రోలు" (Sir Thomas Munro)ను పేర్కొనెను. గుఱ్ఱముపైనున్న "మంద్రోలు"ను కవి ఇట్లు సంప్రదాయసిద్ధమైన పద్ధతిలోనే వర్ణించినాఁడు.

"రవి రథ్యంబులఁ బోరఁజూచు క్రియ దర్పశ్రీ విజృంభించు మే
ల్జవనంబైన హయంబునెక్కి నిఖిలాశాభర్తల గ్గెల్వఁగా
దివికిన్ బోవఁగఁ దట్టి వాజినెగయన్ దీకొల్పుచున్నట్టుగా
నవు మంద్రోలుఁ గనంగ నిప్పటికిఁ బశ్యద్విస్మయాపాదియై."

"టంకశాలా ప్రకరణము" లో కవి "వీరపువ్వులఁ బోలు దీనార సమితి"ని, "రెక్కరేవ్కోలు రౌప్యముద్రికలగముల"ను రమణీయముగవర్ణించెను.

"వాణిజ్యశాలా ప్రకరణము"లో కవి నాఁడు ప్రసిద్ధికెక్కియున్న "హిందువులు నిల్పు షాపుల"ను, "పాశ్చాత్యుల, ఆర్బత్నెటుహౌసు," "బెన్నిహౌసు," "లయన్హౌసు"లను వర్ణించెను.

పైని పేర్కొన్న మూఁడు విధములుగా—ప్రభుత్వ, వైజ్ఞానిక, వర్ణనాత్మకములైన రీతుల—'చెన్నపురీ విలాసము'లో ఆంగ్లపదములు వాడబడినను, ఆంగ్లసాహిత్యముయొక్క ప్రభావము ననుసరించి వచ్చినవని చెప్పజాలిన భావములు తక్కువే. అనగా నాటి కింకను ఇంగ్లీషు ప్రభావమునకు లోతు తక్కువ అన్నమాట.

**నవల :**

1878 లో భాగములుగ ప్రచురింపబడి, 1880 లో పుస్తక రూపమును పొందిన, వీరేశలింగం పంతులుగారి 'రాజశేఖర చరిత్ర' కంటె ముందే, 1872 లో 'శ్రీరంగరాజు చరిత్ర' అను పేర నవల యొకటి ప్రకటింపబడెను. దీనిని శ్రీ గోపాలకృష్ణమసెట్టి వ్రాసెను. పంతులుగారి నవల కవ్యవహిత పూర్వమున వెలువడిన నవల ఇయ్యదియే. ఈ నవలను శ్రీ వీరేశలింగం పంతులుగారు చూచియుందురనుటకు నిదర్శనములున్నను[19] వారు దీని నెచ్చటను పేర్కొనినట్లు లేదు.

ఈ నవలను వ్రాసిన గోపాలకృష్ణమసెట్టిగారిని గూర్చిన విషయము లెక్కువగా తెలియుటలేదు. వీరి ఇంటిపేరు 'నరహరి'వారు. 'కర్నూలు జిల్లా చరిత్ర'ను ప్రభుత్వమువారి ఆదేశమున ఆంగ్లములో వ్రాసినదియు, శ్రీ చిన్నయ

19. 'రాజశేఖర చరిత్ర'ను గూర్చి వ్రాసినచోట దీని విషయమైన చర్చకలదు.

సూరిగారితో కలిసి 'హిందూధర్మశాస్త్రము'ను ఇంగ్లీషులోనుండి తెలుగులోనికి తెచ్చినదియు, వీరే కావచ్చును.

1872 వ సంవత్సరములో 'జూలై, ఆగస్టు, సెప్టెంబరు' అను మూడవ భాగములో (3rd Quarter) అచ్చయిన పుస్తకములను గూర్చి తెలుపు, ఫోర్టు సెయింటు జార్జి గెజెట్ యొక్క సప్లిమెంటులో (Fort St. George Gazette, Supplement) ఈ పుస్తకమునుగూర్చి ఇట్లు కలదు. దానిని యథాతథముగ క్రింద నిచ్చుచున్నాను—

1. Registration No.... 11.
2. Number in each class... 25
3. Title of book or Contents of title page... *Stri Rungah Raju Charitra.*[20]
4. Language... Telugu.
5. Name of Translator or Editor... *A. Gopalakistnama Chetty.*[21]
6. Subject... History of Sonabhayi, *A Novel.*
7. Place of Printing and Publication... Viyvaaharatha Kunjini Press, No. 8., Venkier's Street, Madras.
8. Name of the Printer and Publisher... V. K. Ragavacharri.
9. Date of Issue from the Press... 14th June 1872.
10. Number of sheets, Leaves, or Pages... 101.
11. Size... 8vo. Demy.
12. Number of the Edition... 1st.
13. Number of Copies of the Edition... 1,000.
14. Printed or Lithographed... Printed.
15. Price per Copy... 0-8-0.
16. Name and Residence of the Proprietor of the Copyright... —
17. Remarks... This is apparently *the first attempt ever made in this part of India at novel writing in Telugu Prose*: The aim and purpose of the story is to delineate the manners and customs of the Telugu people in their own language The diction and manner of telling the story are favourably spoken of, excepting perhaps the incident of the capture of the heroine by force by a party of Lambadies, which is not considered to be a good feature of a healthy specimen of novels for Native females. (Copyright)

---

20. 'శ్రీరంగరాజు చరిత్ర'—'గెజిట్'లో 'శ్రీ' కి బదులుగా 'స్త్రీ' అని పడినది. మద్రాసులో 'Office of the Registrar of Books'లో, నేను దీనిని చూచితిని.

21. పుస్తకముపై 'నరహరి గోపాలకృష్ణమసెట్టి' అని కలదు.

ఇంచుమించుగా గ్రంథమునకు సంబంధించిన విషయము లన్నియు, ఈ పట్టికలో గలవు.

ఈ నవలను రచయిత అప్పటి రాజప్రతినిధియైన 'లార్డుమేయో' (Lord Mayo) దొర కంకితము చేసెను. ఈ నవల పుట్టుటకు గల కారణమును గ్రంథోపోద్ఘాతములో రచయితయే యిట్లు చెప్పెను. "పది నెలలనాఁడు లార్డుమేయోగారు బంగాళుల యాచారంబులు తెలుపు ప్రబంధంబు గావించు వానికి బహుమానంబు చేయబడునని ప్రచురము చేసిరి. అది నేను చదివి నప్పుడు తెలుఁగుదేశమువారి యాచారంబులు తెలుపునట్టి ప్రబంధం బొకటి రచియించుట తెలుఁగువారి కుపయుక్తంబగునని తలంచి నా నేర్పుకొలఁదిని ప్రబంధంబు చెప్పబూనితిని" (శ్రీ రంగరాజు చరిత్ర-ఉపోద్ఘాతము)

ఈ గ్రంథమునుగూర్చి ఆంగ్లములో 'నవల' యను పదము వాడబడినను, రచయిత 'నవీన ప్రబంధము' అని వాడెను. రచయిత దృష్టిలో నిది "హిందువుల యాచారము తెలుపునట్టి నవీన ప్రబంధము." ఇట్టి వచన ప్రబంధము చేయుటకు రచయితను ప్రత్యక్షముగ ప్రోత్సహించినది 'లార్డుమేయో'గారి ప్రచురణమైనను; ఆతని కాంగ్లభాషతో గల పరిచయము వలననే ఇట్టి రచన చేయగలిగెను. తాను రచించిన వచన ప్రబంధమునుగూర్చి శ్రీ గోపాలకృష్ణమ సెట్టి యిట్లు వ్రాసెను.

"ఇది కేవలము కల్పితంబు. కథానాయకుఁడు మహాకులీనుఁడై యుండ వలెనను నాదేశంబున మున్ను దొరతనము చేసిన విద్యానగర రాజవంశము వారిలో శ్రీరంగరాజను పేరను నొకొంటిఁ గాని యిందు చెప్పిన చరితము యథార్థముగా జరిగిన కథయని యెంచఁగూడదు. ఇందుఁ జెప్పిన యాచారములు మాత్రము యథార్థముగా నాచరింపఁబడునవి. ఈ కథ ౪౦౦ సంవత్సరములనాఁడు జరిగినట్లుగా చెప్పఁబడియె గాని యప్పటి యాచారములకు నిప్పటి యాచారములకును లేశంబు గాని భేదంబు లేమింజేసి యిందుదాహరింపబడిన యాచారంబు లన్ని యిపుడాచరింపబడుచున్నవని యెఱుంగునది— కేవల గద్యాత్మకములయిన తెనుఁగు ప్రబంధములు-విశేషము లేమింజేసి యిది తెనుఁగు విద్యార్థులకు నయిత ముపయోగించునని తలంచెద." (ఉపోద్ఘాతము)

ఈ 'వచనప్రబంధము'లోని కథ సామాన్యమయినదే. ఈ గ్రంథము 'ఐదు ఉల్లాసములు'గ విభజింపంబడినది. కథలో వైశిష్ట్యము తక్కువ. ఇందలి నాయకుడు శ్రీరంగరాజు. నాయిక పేరు రంగనాయిక. ఆమె కథలో కొంత

వరకు 'సోనాబాయి' అను పేర వ్యవహరింపబడును. కథలలో సహజమయిన, కొన్ని కష్టముల నెదుర్కొనిన తరువాత వారికి వివాహమగును. శ్రీరంగ రాజు విద్యానగరము నేలిన ఒక రాజు కుమారుడు. ఆ రాజున కొక వేశ్య 'శారద' యనునది కలదు. ఆమె కుమారుడు కృష్ణుడు. శారద, రాణులచేత పరాభవింపబడుచుండును. ఆమె కుమారుడైన శ్రీకృష్ణునకు తనతో సమాన మయిన గౌరవము లభించుచుండుట శ్రీరంగరాజునకు సరిపడక, ఈ విషయ మున తన తండ్రి మౌనము వహించుటవలన, శ్రీరంగరాజు కినిసి రామయ్య యను స్నేహితునితో కలిసి దేశము విడిచిపోవును.

దారిలో అనేక కష్టములుపడి వీరు శ్రీశైలము సమీపమునందున్న చంద్రగుప్తిని చేరెదరు. అచ్చట శ్రీరంగరాజు 'సోనాబాయి'యను పేరుగల లంబాడీ కన్నెను ప్రేమించును, ఆమెను భీమానాయకుడనువాడు వివాహమాడ యత్నించుచుండును. 'సోనాబాయి'యు ఆమె తల్లియును అందుల కిష్టపడ కుండుటచే భీమానాయకుడు 'సోనాబాయి' నపహరించి ఆమెను కొండవీటి రాజున కప్పగించును. ఈ విషయము తెలిసి శ్రీరంగరాజు ఆమెను తప్పించు టకై కొండవీడు చేరును. అక్కడ కొండవీటి రాజుతల్లి, సోనాబాయిని కోట వెలుపలకు పంపి వేయును. అందరు కలిసి విద్యానగరము చేరెదరు. సోనాబాయి తల్లివలన; నాయిక ఆమె కూతురు కాదనియు 'రంగనాయిక'యను రాజకన్య యనియు, శ్రీరంగరాజునకు మేనత్త కూతురనియు, కొండవీటి రాజునకు, పినతండ్రి కూతురనియు తెలియును. శ్రీరంగరా జామెను వివాహమాడి సుఖముగా రాజ్యము చేయును.

కథాకల్పనలో చమత్కారము తక్కువ. పద్య ప్రబంధములలోవలెనే శైలి వర్ణనాత్మకమైనది. రచనయంతయు గ్రాంథిక భాషలో జరిగినది. ఇంత కంటె శైలి విషయములో చెప్పదగిన దేదియులేదు.

ఈ 'వచన ప్రబంధము' హిందువుల యాచార వ్యవహారముల నున్న వాని నున్నట్లు తెలుపుటకై వ్రాయబడినదగుటచే, ఆ విషయమునమాత్రమిది కృతకృత్యతను పొందెను. ఇంగ్లీషు భాషలో పదునెనిమిదవ శతాబ్ది చివరి భాగములోను, పందొమ్మిదవ శతాబ్ది మొదటి భాగమునను—చరిత్రాత్మకము లని చెప్పబడిన నవలలు—ఇట్టివి చాల గలవు. సంఘములోని ఆచార వ్యవ హారముల నిది చక్కగ వర్ణించును. వర్ణవిభజనను గూర్చియు, ప్రజలలో ప్రబలి యున్న మూఢ విశ్వాసములను గూర్చియు, వివాహాది కర్మలనుగూర్చియు,

పల్లెటూరి జీవితమునకును పట్టణవాసమునకును సంబంధించిన విషయములను గూర్చియు, దీనియందు చర్చలుగలవు.

ఈ గ్రంథమునుగూర్చి 'గెజిట్‌లో వ్రాసినవారు', "This is apparently the *first attempt* ever made in this part of India at novel writing in Telugu prose;" అని చెప్పిరి. ఈ వాక్యములనుబట్టి నాడు దీనికి చాల ప్రచారము వచ్చియుండును. కాని, దీనితరువాత మహా ప్రతిభావంతులైనవా రనేకులు బయలుదేరి 'వచన ప్రబంధముల'ను వ్రాయుటచే దీని ప్రచారము క్రమక్రమముగ తగ్గిపోయెను; నేటి తరమువారెవ్వరికిని దీనినిగూర్చి తెలియకుండ పోయెను. దీని శైలి తెలియుటకై కొన్ని వాక్యముల నుదాహరించుచున్నాను. "హా—యే పుణ్యాత్ముండు గల్పించెనో యీ వర్ణాశ్రమ ధర్మంబులు—ప్రాణంబులు పోవుచున్నను—వాని బంధంబులు పోకపోయె. అత్తరిని రాకోమ రుని చిత్తంబేమిగా తల్లడిల్లుచుండెనో యా పరమాత్మునికెగాని యొరుల కెఱుకయె? ఆ బంధంబులు తెంపవలెనని యుద్యుక్తుండయినంగాని—వానిం దెంచుట దుస్సాధ్యంబయ్యెంగా! వానిం గల్పించినవాని మహిమ యేమని చెప్పవచ్చు..." (పుట-23)

'శ్రీ రంగరాజు చరిత్ర'కంటె ముందే, మహామహోపాధ్యాయ శ్రీ కొక్కొండ వెంకటరత్నంపంతులుగారు 'మహాశ్వేత'యను నవలనురచించి (1867), కొంతభాగమును 'వైజయంతి' పత్రికలో ప్రకటించినారని (1895) తెలియుచున్నది. ఈ విషయమునుగూర్చి, శ్రీ నిడుదవోలు వెంకటరావుగారిట్లు వ్రాసిరి.

"పై వాని యన్నింటికన్న ముఖ్యమైనది మహాశ్వేత నవలారచన. పంతులుగారు క్రీ. శ. ౧౮౬౭ సంవత్సరమున రచించిరి—తెనుగున నవలా రచనకు పంతులుగారు ప్రథములు. ఈనవలలో కొంతభాగము ౧౮౯౫ సంవత్సరమున 'వైజయంతి' పత్రికయందు ప్రకటితమైనది—ఇది వీరేశలింగము పంతులుగారి రాజశేఖర చరిత్రకన్న యిరువది రెండేండ్లు ముందుగ వెలసినది.[22]

పై భావమునే; శ్రీ వెంకటరావుగారు, వారి 'ఆంధ్రవచన వాఙ్మయము' అను గ్రంథములోను, ఈ విధముగా తెలిపిరి.

22. భారతి. ఖర-చైత్రము. (ఏప్రిల్ 1951) సంచికలో శ్రీ నిడుదవోలు వెంకట రావుగారి 'కొక్కొండ వెంకటరత్నం పంతులు' అను వ్యాసము- పుట—౩౬౮.

"నవ్య వాఙ్మయశాఖలలో నాంగ్లేయభాషా సంస్కార ప్రభావము హెచ్చుగా గలిగినశాఖ నవలయేయని చెప్పనొప్పును—ఈ శాఖయందలి ప్రాథమిక రచనము లప్పటి భాషాపరిపాటినిఁబట్టి గ్రాంథికభాషలో రచితములు—వానిలో మొదటిది కొక్కొండ వేంకటరత్నము పంతులుగారి 'మహాశ్వేత' అనునది. ఇది మనభాషలో మొదటినవలయని కీర్తిశేషులు శివశంకర పాండ్యా గారు, వేంకటరత్నము పంతులుగారి జీవితచరిత్రలో నిట్లు వ్రాసియున్నారు.

"In 1867, he (Venkataratnam Pantulu) composed the first Telugu Novel by name Mahasweta founded on the pleasant story of Kadambari, the master piece of Bana Bhatta in Sanskrit."

("ఇందులో కొంతభాగము వైజయంతి పత్రికలో ప్రకటితమైనది.")[23]

పై వాక్యములనుబట్టి 'మహాశ్వేత' యను'నవల' 'శ్రీ రంగరాజుచరిత్ర' వలె, కల్పితగాథ కాదనియు, ఆంగ్లసాహిత్యసంస్కృతుల ప్రభావమున బయలుదేరినట్లు లేదనియు, తెలియుచున్నది.[24]

రూపకము :

1880 వ సంవత్సరమున కవ్యవహిత పూర్వముగ కొన్ని ఆంగ్ల నాటకములు తెలుగులోనికి కనువదింపబడినవి. ఇంతవరకు నట్లు బయలు దేరిన—కథ, వ్యాసము, పద్యము, నవల—యను సాహిత్య శాఖలపై ఆంగ్ల భాషా సాహిత్యముల ప్రభావమునుగూర్చి వ్రాయుట యయినది. ఇక నిట్టి నాటకములపై ఆ ప్రభావ మెట్లున్నదో పరిశీలింపవలెను. ఈ పరిశీలనలో: తెలుగులోనికి పరివర్తింపబడిన ఆంగ్ల నాటకములలోను, ఆంగ్ల ప్రభావము సోకిన స్వతంత్ర నాటకములలోను (ఇట్టి వేవైన అప్పటికున్నచో) ముఖ్యమైనవి మాత్రమే కలవు[25] 1880 వ సంవత్సరమునకు పూర్వ మట్టివి రెండే

---

23. 'ఆంధ్రవచన వాఙ్మయము'—శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు (1954) పుటలు—122-123.

24. ఈ నవలలకు సంబంధించిన 'యథోచిత చర్చ' రాజశేఖర చరిత్రనుగూర్చి వ్రాసినచోటకలదు.

25. సంస్కృతములోనుండి తెలుగులోని కనువదింపబడిన నాటకములు 1880 సం. నకు పూర్వమే కొన్నియున్నను; "......But, when, after what may be termed the Revival of Telugu Literature has set in, it has struck My Guru, Brahmasri Korada Ramachandra Sastri garu of Masulipatam, how sadly defective our native tongue was in dramatic works—not to speak of the consequent absence of facilities to elevate the moral tone of the masses, that great pandit translated Venisamhara of Bhattanarayana, whose Telugu version has, somehow, not yet passed through the press. Mr. Kokkonda Venkataratnam paatulu, residing in

కలవు.[26] ఇవి రెండును ఆంగ్లభాషలోని 'షేక్స్పియర్' మహాకవి నాటకముల కను వాదములే. అవి 'జూలియస్ సీజర్', 'మర్చెంట్ ఆఫ్ వెనిస్' అనునవి. వీనిలో మొదటి దానిని 'సీజర్ చరిత్ర' అను పేర వావిలాల వాసుదేవ శాస్త్రిగారును, రెండవదానిని 'వెనీసు వణిజ నాటకము' అను పేర గురుజాడ శ్రీరామ మూర్తిగారును, అనువదించిరి.

ఆంగ్లములోనుండి తెలుగులోనికి 'జూలియస్ సీజర్' నాటకము, 1875 లో శ్రీ వాసుదేవ శాస్త్రిగారు (1851-1897) తెచ్చిరి. వీరు ప్రైవేటుగా పరీక్షకుపోయి బి. ఏ. డిగ్రీ పొంది, 'మూక్డోనాల్డు' బంగారు పతకమును కూడ పొందిరన్నచో వీరి ప్రతిభ తెలియును. వీరు, చిరకాలము రాజమహేంద్ర వరములో ప్రభుత్వ కళాశాలయందు పనిచేసిరి. సంస్కృతాంధ్ర భాషలలో నిష్ణాతులైన వీరు తమ ఇరువదినాల్గవ యేటనే 'సీజరు చరిత్ర'ను రచించిరి. వీరింకను 'ఉత్తరరామ చరిత్ర' మొదలగు వానిని సంస్కృతమునుండి తెలుగులోనికి దెచ్చిరి. అవి సంస్కృతమున కాంధ్రీకరణము లగుటచే నిట నప్రసక్తములు.

'సీజరు చరిత్రము'నకు ఆంధ్రాంగ్లములలో రెండు పీఠికలు గలవు. పీఠికనుబట్టి (ఇంగ్లీషున జనవరిలోను, తెలుగున సెప్టెంబరులోను 1875 లో నివి వ్రాయబడెను) ఈ నాటకము 1874 లో రచియింపబడినట్లు తెలిసినను, ఇది 1876 లో మొదటిసారిగా ప్రకటితమైనది. నాటక ప్రారంభమునగల ఆంగ్ల పీఠిక (Preface) లో రచయిత ఇట్లు వ్రాసెను.

"*I believe this is the first attempt at translating an Erglish Drama into the corresponding Telugu Metre.*[27] Therefore, it is very

Madras, followed in the wake and published his version of the Narakasura Vijaya Vyayoga of Dharmasuri. Then Sriman Paravastu Venkata Ranga Acharyar Averghal of Vizagapatam, Commenced translating the well-known Sakuntala...... ..Afterwards, my friend, Mr. Kandukuri Veeresalingam .....has taken up the same play......" వావిలాల వాసుదేవశాస్త్రి గారి ఉత్తర రామ చరిత్ర. పీఠిక 9-11-1883) వాని కిట ప్రసక్తి లేదు గనుక అవి స్మరింపబడలేదు.

26. శ్రీ వీరేశలింగం పంతులుగారి రచనలనుగూర్చి ప్రత్యేకముగా అధ్యాయమున్నది. గనుక, ఇట వారి 'నాటకముల'ను పేర్కొనలేదు.

27. 'The Statesman' పత్రికలో, '75 Years Ago to-day' అను శీర్షిక క్రింద 17-4-1952 తేదీని, 'జూలియస్ సీజర్' నాటకమును గూర్చి ఇట్లు వ్రాయబడినది:

"The literary and scientific world may be interested to learn that Shakespeare's Julius Caesar has been translated into Telugu by Vavilala Vasudeva-

necessary that I should be careful in selecting Telugu words for the English proper Names. I have tried to change them as little as possible, and, at the same time to adapt them to the Telugu Tongue, subject throughout to the requirements of the Metre. *The Metre that is adopted is Theta Gita*, in which each line is independent, and consists of five ganas; thus, I say, *it corresponds to the English Iambus* where each line is composed of five feet: and in this Metre only that all the English Plays are written. As in almost all Telugu works, the different kinds of metres—fixed and variable—are found to be grouped together, *I must confess this to be an innovation brought into field of Telugu Literature:* but I may rest assured that this is no breach of Telugu Prosody. Moreover, this is the advice I received from many friends of mine. *I have done my best to introduce Hindu customs and manners where I could*; but, the advice of some to displace the Roman manners altogether, came to me after I had given the matter to press. If it be found practicable I shall try to do so in the second edition. I finished the translation in less than two months; and consequently, errors of different kinds may have crept in this volume; which excuse, I crave the indulgence of the critic. Any suggestions from learned hands as to the improvement of this will be thankfully received. I stand under great obligations to M. R. Ry. C. Soobbarayalloo Naidu garu for the trouble he has taken in correcting the proof sheets as they came out from the Press."

4th January 1875,<br>Rajahmundri,<br>Innespetah.

V. V. Sastri.

---

Sastry. The Curator of Books informs us that this is the first and a fair attempt at a metrical translation of Shakespeare into this Language."

శ్రీ వీరేశలింగం పంతులుగారి 'వివేక వర్ధని' పత్రికలో (జూలై 1876) ఈ నాటకమును గూర్చిన విమర్శలో పై విషయమే ఇట్లు చెప్పబడినది : "ఈ గ్రంథము ఇంగ్లీషు కవులలో నెల్ల మిగులఁ బ్రసిద్ధికెక్కిన షేక్స్పియరను కవిశ్రేష్ఠుని నాటకమునుండి బ్రహ్మశ్రీ మహారాజశ్రీ వావిలాల వాసుదేవశాస్త్రిగారిచేఁ దెనిఁగింపఁబడినది. ఇంగ్లీషునాటకములను దెనిఁగించుటలో వీరే మొదటివారు."

ఈ విషయమును గూర్చి శ్రీ శాస్త్రిగారు తమ 'ఉత్తరరామ చరిత్ర పీఠిక' లో నిట్లు వ్రాసినారు : "I was the first to translate English plays, and my Julius Caesar, I am glad, has been favourably noticed" (ఉత్తర రామ చరిత్ర పీఠిక 9-11-1883)

ఈ నాటకమునకు తెలుగులో పీఠిక, సెప్టెంబరు 21 వ తేదిని వ్రాయబడినది. ఈ రెండు పీఠికలును 1876 లోని మొదటి కూర్పున[28] గలవు. తెలుగు పీఠిక, ఆంగ్ల పీఠికకు ఇంచుమించుగా ననువాద ప్రాయము. ఈ క్రింది విషయములు మాత్రము తెలుగున నధికముగా కలవు.

"ఆదిని లాఁతి తెలుంగుఁ బొత్తంబులవలె దీని నానావిధ వృత్తములతోఁ బ్రబంధాకృతిని రచియింపం దలంపు గలిగె. కాని, యిప్పటివారికి నాటక రీతి యందే యభిరుచి యెక్కువ యని కొందఱు నా స్నేహితులు సలహా యిచ్చిన కతనఁ దొంటి యభిప్రాయము మాయించి నాటక వైఖరిని మొదటినుండి తుదివఱకుం దేటగీతినే వ్రాయుట తగునని యెంచి యాతీరున వ్రాసినాఁడ......
..................ఇందుఁ జాలభాగ మాంగ్లోభాషాగ్రథితమగు విల్లియము షేక్స్పియరు ప్రణీత గ్రంథము ననుసరించియే వ్రాయంబడియెను. గాని, *ప్రకరణానుకూలముగా నచ్చటచ్చటఁ గొంత చేర్పఁబడె.* ఆంగ్లేయ సంజ్ఞాపదంబులకుగా నిందు వాడంబడ్డ వివిధ రూపములతో నొక్క పట్టిక దీని చిట్టచివర

---

28. లోపలి పుట

శ్రీ

సీజరు చరిత్రము

ఇది

వావిలాల వాసుదేవ శాస్త్రిచేతఁ

దెలుఁగున ఛందోబద్ధముగాఁ గూర్పంబడినది.

---

మొదటికూర్పు

రాజమహేంద్రవరమున నిన్నిసుపేటలో నున్న

మ—రా—రా—శ్రీ

వా. సు. సోమయాజులు సమూహి వారిచేఁ

బ్రచురింపఁ బడినది.

---

చెన్నపురి

శ్రీధర ముద్రాక్షరశాల

43, ఇరిసప్ప మేస్త్రి వీధి.

1876

Copy—right

వెల—రూప ౧.

సమూహివారు అందు కొ.

ననుబంధింపఁబడెను. *దుర్జ్ఞేయాభిప్రాయముల పట్ల రివరెండు - జే - హంటరుగారి టిప్పణములు చూచినాఁడ*............సెప్టెంబరు నెల ౧౨ తేది, ఆన ౧౮౭౫సం.
—వావిలాల వాసుదేవశాస్త్రి

ఈ నాటకము[29] ననువదించుటలో తెలుగుకవి కొంత స్వతంత్రత చూపెనని పీఠికలనుబట్టి తెలియుచున్నది. ఆంగ్లభాషలోనుండి యనువదింపబడిన ప్రథమ నాటకమగుటచే కవికి కొన్ని చిక్కులు వచ్చినవి. ఆచిక్కులను చక్కగనే ఎదుర్కొనినాడు కవి. వానిని కథకు సంబంధించినవి, భాషకు సంబంధించినవి యని రెండుగ విభజింపవచ్చును. ఈ రెండింటియందును కవికొంత జయమును, కొంత పరాజయమును కూడ పొందెను. ఆంగ్లసాహిత్య ప్రభావమువలననే ఈ యనువాద ప్రయత్నము జరిగెను. కాని పాశ్చాత్య సంస్కృతితో పరిచయము అంతగాలేని దేశీయులకై యిది వ్రాయబడిన దగుటచే, కొన్ని మార్పులను కవి—ఉపమాదుల విషయమున—చేసెను. అవి అంతరమ్యముగలేవు. కొన్ని స్థలములందవి దేశకాల పాత్రములను బట్టి పరిహాసాస్పదము లగునట్లున్నవి.

మొట్టమొదట గ్రంథములోవచ్చు పాత్రల నామముల విషయము పరిశీలింపవచ్చును. ఈ విషయమునుగూర్చి కవి 'నామవివరణ పట్టిక'యం దిట్లు వ్రాసెను. "సాధారణముగా ఉకారాంతపదముల కన్నింటికి బిందుపూర్వక డు వర్ణము వైకల్పికముగా చేర్చుటయయ్యెనని యెఱుంగునది."[30] దీనినిబట్టి

---

29. సీజరు చరిత్రము— వావిలాల వాసుదేవశాస్త్రి
1876. మొదటికూర్పు. శ్రీధర ముద్రాక్షరశాల
43. ఇరిసప్ప మేస్త్రి వీధి
'ఆంగ్లాంధ్ర పీఠికలలోని వాక్యములు'

30. Ibidem; అనుబంధము; పుట—౧౪౩.

ఈ సందర్భమున, నాటకములోని భాషాదికమును గూర్చి 'వివేకవర్ధని' పత్రిక (జూలై 1876) వ్రాసిన ఈ క్రింది వాక్యములు గమనార్హములు. "కేవలము వ్యాకరణ యుక్తముగానే వ్రాయఁబడక యచ్చటచ్చట వాడికలోనున్న యందమైన గ్రామ్యపదములు నన్యభాషా పదములనుగూడఁ బ్రయోగింపఁబడి యున్నవి. అట్టివుండుట మన పండితులకుఁ గొందఱకు రుచియింపకపోయినను, సాధారణముగా నిప్పటివారి కందఱకు నాహ్లాదకరములు గానే యుండునని తలంచెదము. ఇంగ్లీషుపేర్లే ఈ గ్రంథమునందు వాడఁబడుటచే నా భాషా జ్ఞానములేని యాంధ్రుల కట్టివి శ్రుతి కటువులుగాఁ దోచవచ్చును. కాని భాషాంతరీకరణ మగుటచే నట్టి వనివార్యములు."

కవి— జూలియసుఁడు సీజరు. బ్రూటసుఁడు మొదలయిన రూపములను ప్రయోగించెను.

నాటకమంతయు తేటగీతులతో కవి రచించెను. ఇంగ్లీషులోని 'బ్లాంక్ వెర్స్' (Blank verse) నకు సన్నిహితముగ నుండునని యూహించి కవి దీనిని గ్రహించి[31] యుండవచ్చును. కాని, ఈవిధముగా నాటకమునంతను ఛందోబద్ధముగ-మీదు మిక్కిలి, ఒకేఛందమున-చేయుట మన సంప్రదాయము కాదు. సంస్కృతములోని కాళిదాసాది ప్రసిద్ధకవులైనను ఈ మార్గమును త్రొక్కలేదు. ఆంగ్లములోని 'ఛందస్సు'నకుగలసౌలభ్యము, తెలుగుఛందమునకు లేకుండుటచే, 'సీజరు చరిత్ర'యందు గణములను సరిపెట్టవలసి వచ్చినప్పుడును, యతులు పడవలసి వచ్చినప్పుడును, కవి వ్యర్థపదములను వేయవలసివచ్చెను. ఇట్టిచో కవి మూలము నతిక్రమింపవలసి వచ్చెను. ఆంగ్లనాటకములు నాడు రంగస్థలమున, ఆంధ్రానువాదములుగ, రక్తి కట్టకుండుటకు ఈ పద్యానువాదము కూడ కారణము కావచ్చును. పద్యపాద పూరణకై మూలములోలేని విపులీకరణమున కొకపాదము నుదాహరణముగ నిచ్చుచున్నాను.

తృతీయాంకములో ప్రథమరంగమున, సీజరుయొక్క హత్యకుముందు 'మెటిలస్ సింబర్' (Metellus Cimber) తనసోదరుని శిక్షను తప్పింపుడని సీజరును వేడునప్పుడు, బ్రూటసు (Brutus) ఇట్లనును.

> "I kiss thy hand, but not in flattery, Caesar;
> Desiring thee that Publius Cimber may
> Have an immediate freedom of repeal."

---

31. ఈ పద్ధతి నాటివారి కంత నచ్చినట్లులేదు. 'వివేకవర్ధని' పత్రికలోని విమర్శలో (జూలై 1876) ఈ విషయమునుగూర్చి యిట్లు కలదు. "....గ్రంథకర్తగారును మఱికొన్ని యింగ్లీషు నాటకములం దెనిగించి లోకోపకార పారీణులగుదురని యెన్నుచున్నాము. ఈసారి వ్రాయునపుడైనఁ బుస్తకము కడవఱకు నొకే పద్యమువలె వ్రాయక నాటకమున కనుకూలముగా వేఱువేఱు పద్యముల నుపయోగింతురని గ్రంథకర్తగారిని కోరుచున్నాము."

కాని శ్రీ శాస్త్రిగారు తమ 'నందక రాజ్యము' (1880) అను సాంఘిక నాటకములో (తెలుగులోని మొట్టమొదటి సాంఘిక నాటకమిదియేయని పరిశోధకుల యూహ) కూడ తేటగీతినే వాడిరి. ఈ నాటక పీఠిక (1-4-1880) లో వీరు ఈ విషయమై ఇట్లు వ్రాసిరి.

"ఒక్క తేఁటగీతిలోనే వ్రాయుటవల్లఁ జదువువారికి విసుగు పుట్టునని కొందఱన్నారని విన్నామగాని, నాకుమాత్రము సహజమగు వాక్ప్రవాహమునకు దీనిలోనున్నంత సమమార్గము తక్కినవానిలో లేదని స్పష్టముగాఁ దెలిసియున్నది."

వెంటనే సీజరు ఆశ్చర్యముతో "*What!* **Brutus**" అనును ఈవిషయము నిట్లు విపులీకరించి తెలుగుకవి వ్రాసెను.

"బ్రూట—సీజరా, పెట్టుమీ నీదు చేతిముద్దు;
కాని, యిద్ది ముఖప్రీతిగాదు సుమ్మి :
పబ్లియసు సింబరునకు సేర్పడ్డ యన్య
దేశ గమన దండనమును దీసివేయ
వెంటనే మిమ్ము మఱిమఱి వేఁడుచుంటి"
"సీజ—బ్రూటసా! యేమిటోయి? ప్రీ వాదమదోటు?"

(పుట—౬౦)[32]

పై ఉదాహరణములోని ఆంగ్లాంధ్రములను పోల్చిచూచిన తెలుగుకవి రచనా విధానము బాగుగా తెలియును. మూలములోలేని 'పబ్లియసు సింబరు'నకు సంబంధించిన పూర్వకథ కొంత చెప్పబడినది.

ఆంగ్లములోని కవి సమయములను, ఉపమానములను, కొన్నిచోట్ల యథాతథముగ తెలుగులోనికి కవి తెచ్చుటచే, ఆభాగములు వింతగా, తెలుగులో కన్పట్టుచున్నవి.

'సీజరు' కూడ మనుష్యమాత్రుడేయనియు, జ్వరము వచ్చినప్పుడు సామాన్యులవలెనే బాధపడెననియు, 'కాసియస్' (Cassius) 'బ్రూటస్'తో పలికినట్లు మూలములో (Act One, Scene Two) ఇట్లు కలదు.

" Cassius— He had a fever when he was in Spain,
And when the fit was on him, I did mark
How he did shake : 'tis true, this God did shake :
His *coward lips* did from their colour fly ; "

దీనికి తెలుగుసేత ఇట్లున్నది.

"స్పెయినులో నున్నయప్పుడు సీజరునకు
జ్వరము దగిలెను; నా తెఱ వచ్చినపుడు
కడఁగి చూచితి నాతఁడు వడఁకుటెల్ల;
వడఁకినాఁ డప్పు డిట్టి దేవుఁడును గూడ :
నతని పిఱికి పెదవులు డాలఱచుఁబఱచె"

(అం. 1; రం-2; పుట ౧౦)

32. పుటలసంఖ్య 'సీజరుచరిత్రము' మొదటికూర్పు (1876) ననుసరించి ఈయబడినది.

ఈ రంగములోనే 'బ్రూటసు' వెడలిపోయిన తరువాత 'కాసియసు' ఇట్లను కొనును.

మూలము—" Cas— Well, Brutus, thou art noble; Yet, I see,
Thy *honourable metal may be wrought*
From that it is disposed... ..."

తెలుగు—" కాసి—.........మంచిదో బ్రూటసా మహోధి
*కోన్నతంబగునట్టి నీ యుక్కు వెంద*
*ముసు దలంచిన గతిఁ బోఁతపోయవచ్చు*
ఎంచు నే నిర్ధారింగెద;........" (అం. 1; రం-2; పుట ౨౦)

ఇటులనే, ప్రథమాంకములోని తృతీయ రంగములో 'కాస్కా' (Casca) అను వాఁడు 'సిసిరో' (Cicero) తో పలికిన ఈ క్రిందిమాటలు తెలుగులోని కనువదింప బడినప్పుడు కొంత వింతగా నున్నవి.

మూలము—" Casca— ................ O Cicero,
I have seen tempests, when the scolding winds
*Have rived the knotty oaks*..........."

తెలుగు—" కాస్క—ఓయి సిసిరో, మహోభీమ వాయుగతులు
*చేవగల కప్పుటాకులఁ జీల్చివైవఁ, గంటి......"*

(పుట—౨౧.)

ఈవిధముగనే, రెండవ అంకము యొక్క ప్రారంభమునందు, 'బ్రూటసు' తనలో తాను 'సీజరును' గూర్చి యిట్లనుకొనును.

"Brutus—It is the bright day that brings forth the adder;
And that craves wary walking. Crown him?—that:—
And then, I grant, *we put a sting in him,*
*That at his will he may do danger with.*"

ఈ భాగము తెలుగులో నిట్లు ప్రవర్తింపబడెను.

"బ్రూట—ముసురు విరిసినఁగాదె, పాములు చెలంగి
కడలఁ బ్రాఁకుచుఁ, బరికించి నడువఁగోరు.
అతనికిఁ గిరీట మిత్తమా ?—యద్దియగును;
*తోనె యాతఁడు తన కిష్టమైనయట్లు*
కుట్టి చంపంగ-నిత్తము కొండి, నిజము."

(పుట—౩౦)

నాటకములో పాశ్చాత్య సంప్రదాయము ననుసరించి చేయబడిన సంబోధనలు, ప్రీతివాక్యములు, యథాతథముగ తెనుగులోనికి కవి తెచ్చుట చేత, అవి వింతగానున్నవి, వానికి కొన్ని ఉదాహరణ క్రింద నీయబడెను.

ప్రథమాంకము తుదిని, 'బ్రూటసు'ను తమప్రక్కకు త్రిప్పికొనుట మంచిదియని 'కాసియసు' తో 'సిన్న' ఇట్లు పల్కును.

మూలము—"Cinna—O cassius, if you could
But win the *noble Brutus* to our party—"

తెలుగు—"—కాస్యసా, వర్ణనీయ బ్రూటు
సునిని మనపక్షమునకుఁ దెచ్చుకొనితేని"

(పుట—౨౮.)

రెండవ అంకమున మొదటిరంగములో కక్షిదారులందరు వెడలి పోయిన తరువాత 'బ్రూటసు' సమస్త విషయములను పర్యాలోచించుచుండ అతని భార్యయగు 'పోర్ష్య'వచ్చి యాతనిని ప్రశ్నించు సందర్భమున మూల మందిట్లున్నది. "Portia—.........No, my Brutus;
You have some sick offence within your mind,
Which, by the right and virtue of my place,
I ought to know of................"

తెలుగు—"కాదు; మామక బ్రూటుసా మీదు మనము
నేదో వ్యథపెట్టుచున్నది, యింత నిజము.
అదియు మత్ప్రస్తుత పదంపు హక్కుచేత
గట్టిగా నేను వినఁదగినట్టిదౌను."

(పుట—४३)

మూడవ అంకముయొక్క మొదటి రంగములో, హత్యచేయబడిన 'సీజరు'ను చూచి 'అంతోని' (Antony) విలపించుపట్టున మూలమందిట్లున్నది.

"Ant—Pardon me, Julius! Here wast thou bay'd, *brave hart*;
Here didst thou fall, and here thy hunters stand,
Sign'd in thy spoil, and crimson'd in thy lethe."

దీని కిది తెలుగుసేత—"అరసి క్షమియింపుమీ జూలియసుఁడ నన్ను
*ధీరసారంగ* యిట నోరుఁ జేరనీక
పోరిపోరి తుదకు నిట్లు దొరికితీవు;
చేర్చికొని మీదు కొల్లలే చిహ్నముగను,

మీ మనెత్తుట నెఱవడ్డ మేనుకొప్ప
వేఁటరులు నిలుచున్నారు వీరె యిచట."

(పుట—౭౦)

ధీరత్వమునకు 'సారంగము'ను గ్రహించుట మన 'కవిసమయము' కాదు. ఇందుచేతనే కాబోలు తెలుగుకవి, 'ఆంతోని' మాటలలోని ఈ క్రిందివాక్యము లను మార్చి వ్రాసినాడు. వీరుడైన సీజరును 'పుండరీకము'తో తెలుగుకవి పోల్చెను. కాని, అనువాదము మూలమునకు విరుద్ధముగనున్నది.

మూలము—"How *like a deer,* strucken by many princes,
Dost thou here lie!"

తెలుగు—"భూధర ప్రాంత వినిహత *పుండరీక*
*భంగి* నీవిటఁగూలితి భంగమొంది" (పుట - 20)

మన కవితా సంప్రదాయమునకు విరుద్ధములైన 'సమయముల'ను తెలుగు కవి ప్రయోగించుటకు కారణము, నాటక మాంగ్లమునుండి యనువదింప బడినదగుటయే. ఇటులనే పాశ్చాత్య సంప్రదాయముకంటె విలక్షణమైన ప్రయోగము లనేకముచేసి, పీఠికలో తాను వ్రాసిన "I have done my best to introduce Hindu Customs and manners where I could" అనువాక్యమును కవి సమర్థించుకొనెను. అట్టి యుదాహరణములను కొన్నింటి నిచ్చుచున్నాను. ఈ 'మార్పులు' సొగసుగానుండునని కవితలంచెను గాబోలు.

(1) మూలము—"Marullus—What dost thou with thy *best apparel* on?" (Act One ; Scene - One)

తెలుగు—"పరుగు పరుగున *మడుఁగుదోవతులు* గట్టి" (పుట—౧)

(2) మూలము—"Marullus–Pray to *the Gods* to intermit the plague" (Act - One ; Scene - One)

తెలుగు—"వేఁడికొండయ్య *ముక్కోటిదేవతలను*" (పుట—౩)

(3) మూలము—"Casca — Do so : *Farewell,* both." (Act - One; Scene - Three)

తెలుగు—"......సరె; *శుభమస్తు* మనకు" (పుట—౧౯)

(4) మూలము—"Casca— *Your ear is good.* Cassius, what night is this!" (Act - One ; Scene - Three)

తెలుగు—"*పాముచెవులుగదా* నీవి వహావ యెట్టి
రాతిరో, కంటె, కాస్యసా..." (పుట—౨౩)

(5) మూలము—"Brutus–Look in the *Calender*, and bring me word"

(Act - Two ; Scene - One)

తెలుగు—"......*పంచాంగ* మరసి, చెప్పుమీ తప్పకదినాకు."

(పుట—౩౧)

(6) మూలము—"Cassius — I think we are too bold upon your rest :

"*Good morrow,* Brutus ; do we trouble you ?"

(Act - Two; scene - One)

తెలుగు—"కాని - నేము పెడఁగొట్టితిమిపోలు నీదునిదుర.

*ప్రొద్దునే నీకు శుభమస్తు*, బ్రూటసుండ." (పుట—౩౪)

(7) మూలము—"Caesar — .........I must prevent thee, Cimber.

*These couchings and these lowly courtesies......*"

(Act - Three ; Scene - One)

తెలుగు—"సింబరా, యద్ది నాకు నిష్టంబుగాదు.

*నక్కివంగి యొదుంగుటల్, నక్కవినయ*

*ములును*........................." (పుట—౬౦)

(8) మూలము—"Caesar—*I could be well moved,* if I were as you ;"

(Act - Three ; Scene - One)

తెలుగు—"నేను నినుఁబోటి నయ్యెద నేని, నపుడు

*నన్ను మెడవిర్వ గోటిలో నున్నదగును*" (పుట—౬౧)

(9) మూలము—"Caesar—......Hence ! *Wilt thou lift up Olympus?*"

Decius — *Great Caesar* —"

(Act - Three ; Scene - One)

తెలుగు—"సీజరు..............పోవోయవతల !

*మేరువుం బయికెత్తఁగాఁ గోరుకొందె ?*"

"డీసియసు - *సీజరేంద్ర* !" (పుట—౬౨)

(10) మూలము—"Antony — *O mighty Caesar*! dost thou lie so low?"

(Act - Three ; Scene - one)

తెలుగు—"*చెల్లబో ! సర్వశక్తిమత్సీజరేంద్ర !*

అయ్యయో ! యిట్లు నేలపాలైతివయ్య !"

(పుట—౬౩)

(11) మూలము—"Antony–Thy heart is big, get thee apart and weep

Passion, I see, is catching ; *for mine eyes,*

Seeing those beads of sorrow stand in thine,
*Began to water.........*"
(Act - Three ; Scene - One)

తెలుగు—"నీ కనుంగొలుకులనుండి శోకపూర
సతతపతదశ్రుధారాప్రసారమరసి,
*నీలకంఠాయ దరిసె నానేత్రములను.*" (పుట—౨౪)

(12) మూలము—"First Citizen—We'll *burn* the house of Brutus."
(Act - Three ; Scene - Two)

తెలుగు—"*బ్రూటసుని యిల్లు పరశురాముని కీడుడము*" (పుట—౮౮)

(13) మూలము—"First Citizen — *Take up the body.*"
(Act - Three ; Scene - Two)

తెలుగు—"*పట్టు పేయేడుకట్లనవారి నెత్త*" (పుట—౯౦)

(14) మూలము—"Antony — .........*Fortune is merry,*
And in this mood will give us anything"
(Act - Three ; Scene - Two)

తెలుగు—"అల యదృష్టము మూఁడు పూవులనె యూఱు
కాయలను *గాయనున్న*ది కానె పోలు ;
నిట్టియెడ మనకేమియేమి నీయఁగలదు." (పుట—౯౦)

(15) మూలము—"Second Citizen—That's as much as to say,
They are fools that marry: *you'll bear me
a bang for that, I fear.*" (Act - Three ; Scene - Three)

తెలుగు—"భళిర ! నీ భావమేమి ? వివాహమైన
యంద అరయమిగలరని యనుటెకాదె ?
పలువురం దీనిచేదూఱఁ బలికెదీవు;
*కడకు నీ పెండ్లియౌను, జాగ్రత్తసుమ్ము!*" (పుట—౯౨)

(16) మూలము—"Cassius - *Do not presume too much upon my love ;*
I may do that I shall be sorry for."
(Act - Four ; Scene - Three)

తెలుగు—"చెలిమి సరిహద్దుదాటి యీవలకు రాకు;
*ముందకాళ్ళకు బందాలు పెందనీకు;*" (పుట—౧౦౪)

పైని పేర్కొన్నవానిని బట్టి, తెలుగు కవి యనువాదములో చూపిన స్వేచ్ఛ తెలియగలదు. కొన్ని కొన్నిచోట్ల మూలములోని 'పురాణకథ' లకు

సంబంధించిన వాక్యముల ననువాదము చేయునపుడు, హిందూపురాణములలో వానితో సారూప్యముగల కథల నుపయోగించినాఁ డీ కవి. కొన్నిచోట్ల మూల కథలోని భావము వచ్చునట్లును రచించెను. దీనికి ముఖ్యమైన ఉదాహరణము లను రెంటి నిచ్చుచున్నాను.

మూలము:—"**Brutus — .........O Conspiracy,**
**Shamest thou to show thy dangerous brow by night,**
**..................**
**Hide it in smiles and affability:**
**For if thou path, thy native semblance on,**
**Not *Erebus* itself were dim enough**
**To hide thee from prevention."**

**(Act - Two; Scene - One)**

ఇట 'Erebus'[33] అనగా పెంజీకటి గల భూలోకనరకలోకమధ్య ప్రదేశము. గ్రీకు పురాణకథలలో దీని ప్రస్తావనయుండును. దీనిభావము వచ్చునట్లు తెలుగుకవి యిట్లు వ్రాసెను.

"............ఓసి మంత్రాంగశక్తి
చేర్చి దాఁచుము మోమును జిఱు నగవుల :
నీవు నిజరూప వైఖరిఁ బోవుదేని,
నీవిరోధు తెలియఁగకుండ నిన్నుగాయఁ
గోఁఱత వడకున్నె *చీఁకటి కొండ* యైన?" (పుట-౩౮)

తెలుగుకవి, 'సీజరు చరిత్ర' నాటకములో తనకు, "దుర్జ్ఞేయాభిప్రాయ ములపట్ల రివరెండు- జే- హాంటరు[34] గారి టిప్పణములు చూచినాఁడ," అని వ్రాసెను. ఆ టిప్పణములలోని నిర్వచనముల ననుసరించి, వానితో సారూప్య ములుగల ఉపమానములను భారతీయ పురాణములనుండి గ్రహించి వ్రాసెను.

---

33. "Erebus (e-), n (Gk myth) Place of darkness between earth & Hades"—Oxford English Dictionary.

34. శ్రీ వాసుదేవశాస్త్రిగారు చూచిన 'హంటరు' దొర టిప్పణిలో ఈ సందర్భమున నిట్లున్నది.

"Erebus, one of the divisions of hell (Greek Mythology)."
The word means darkness. Compare Merchant of Venice V. I. 87:
"The motions of his spirit are dull as night,
And his affections dark as Erebus."
(The Tragedy of Julius Caesar–Edited by Mark Hunter. 3rd Edition; 1925. Page-162).

ఇట్టిసందర్భములలో; భారతీయ పురాణములందలి యుపమానములు నాటకమున క్రొత్తగా, వింతగా, పొంసికలేకుండ ఉన్నవి. ఈ క్రింది యుదాహరణమట్టిదే!

సీజరును హత్య చేసిన తరువాత, ఆ శవమునొద్ద 'ఆంతోనీ'ని ఉండనిచ్చి కఠారులందరు వెడలిపోవుదురు. తరువాత సీజరు స్మృతికి వాపోవుచు, 'ఆంతోనీ' పల్కిన పల్కులలో నిట్లు కలదు.

మూలము—" Antony – And Caesar's spirit ranging for revenge,
With *Ate* [35] by his side came hot from *hell*,
Shall in these confines with a monarch's voice
Cry 'Havoc', and let slip the dogs of war ;"
(Act - Three ; Scene - Two)

తెలుగు—"సీజరుని యాత్మ పగనీఁగఁ జెట్టపట్టి
కాళికాదేవి తోడరాఁ గాలుపురము
నుండి వాహ్యాళి వెడలి, నిల్పుండ కెచట
నేల పొలిమేరలంజుట్టి, నేల దాల్పు
తిపి గొంతెత్తి ధ్వంస మ్రావ మొప్ప
నైక వారంబు లఱచి సమీకమునకుఁ
గుక్క కూటువువలె నుసిఁగొల్పఁ గలదు."  (పుట—23)

మూలములో 'Ate' అను దేవత గ్రీకు పురాణ కథలలోనిది. నాశనమునకును, విలయమునకును, మానవుల ప్రేరేపించునది యనియు; కొందరి సిద్ధాంతము ననుసరించి, యట్టి మానవులను శిక్షించునదియనియు కలదు. తెలుగుకవి 'కాళికాదేవి' నిట 'Ate' కు ప్రత్యామ్నాయముగ వాడెను. కాని 'ఆంతోని' మాటలాడుచు మాటలాడుచు నడుమ 'కాళికాదేవి' యని పలుకుట వింతగా నుండును! కాని "కాలుపురము" అనుచోట తెలుగుకవి "hot from hell" లోని సొగసును "కాలు"(యమ)శబ్దప్రయోగమున కొంతకుకొంత తేగలిగెను.

---

35. తనకు దుర్జ్ఞేయములైన విషయములను గ్రహించుటకై, శ్రీ వావిలాల వాసుదేవ శాస్త్రిగారు చూచిన 'హంటరు' దొరగారి టిప్పణిలో 'Ate' ను గురించి యిట్లున్నది.

"Ate. In Greek mythology Ate is the daugther of Zeus and Eris (Discord), and is, originally, the goddess who provokes men to rash and inconsiderate actions. In the Attic tragic poets she becomes rather the power which punishes such actions. Shakespeare imagines this later Ate (Nemesis) in the present passage........."

(The Tragedy of Julius Caesar–Edited by Mark Hunter; 3rd Edition, 1925. Page-227).

కొన్నికొన్ని పట్టులందు తెలుగుకవి, ఆంగ్లములోని శ్లేషను అనువాదము లోనికి తీసికొని రాలేకపోయెను. ప్రథమాంకములోని ప్రథమ రంగమందు 'నీపనేమి' యని యడిగిన 'మారల్లసు' (Marullus) మాటలకు రెండవ పౌరుడు మూలములో నిట్లనును.

"**Second Commoner — A trade, Sir, that, I hope, I may use with a safe conscience; which is, indeed, Sir, a mender of *bad soles*.**"
(Act-One ; Scene - One)

ఇట '**sole**' అను శబ్దము (కాలి జోడు మడమ), **Soul** (ఆత్మ) యను శబ్దము, ఆంగ్లములో సుమారు సమానోచ్చారణ కలవిగనుక, మాటాడు నపుడు శ్లేష వచ్చును. తెలుగులో నిది వచ్చుట కష్టము గనుక తెలుగుకవి ఇట్లు వ్రాసెను—

"ద్వితీయ పౌరుఁడు—నా పనండి, కరంబు మనస్కరించు;
బాగు పనిసుండి, యిదెయండి, బాబుదేవ;
చెడ్డవాఱులఁ[36] జక్కంగఁ జేయువాఁడ" (పుట—౨)

కాని, 'వాఱు' (చెప్పుటట్టు) అను శబ్దమును ప్రయోగించి, 'వారలు' అను శబ్దముయొక్క స్ఫూర్తిని కొంతగా తెచ్చెననక తీరదు.

షేక్స్పియరు మహాకవికి; అంకము తుదనుగాని, రంగాంతమునగాని, అంత్యప్రాస (**Rhyme**) గల రెండు పాదములను వ్రాయుట అలవాటు. తెలుగులో గూడ నీపద్ధతిని గవి పాటించెను.

మూలము—"**Cassius — And after this let Caesar seat him *sure* ;**
**For we will shake him, or worse days *endure*.**"
(Act - one ; Scene - Two)

తెలుగు—"మాకు నాతనిని దొలఁగింపగఁ *దగునొ ;*
చెడినఁ గార్యము, మమ్ముఁగాసింపఁ *దెగునొ*." (పుట—౨౦)

మూలము—"**Brutus— 'Tis three O'clock; and, Romans, yet ere *night***
**we shall try fortune in a second *fight*.**"
(Act - Five ; Scene - Three)

---

36. "వారు plu. వారులు or వార్లు n. s. A strap of leather.
"తాడువలె నిడుపుగా కోసిన చర్మపు చీలిక"
(బ్రౌన్యు తెలుగు నిఘంటు; 1852; పుట-920).
"వాఱు. దే. వి. సన్నగాఁ గోసిన తోలు"
(శబ్దరత్నాకరము).

తెలుగు—"మూఁడు గంటలు వ్రేసిరి; ప్రొద్దు గ్రుంక
కముదు, రోమనులార, సైన్యములు నడిపి
యింక నొకచేయి చూతము శంకలుడిపి" (పుట—౧౩౫)

పైని పేర్కొనిన వివిధ విధముల తెలుగుకవి, ఆంగ్ల మూలముయొక్క సొగసు తెలుగులోనికి తెచ్చుటకు ప్రయత్నించెను. ఆంగ్లములోనుండి తెలుగులోనికివచ్చిన ప్రథమ నాటకమిదియేగనుక, దీనియందు రచన 'పక్వదశ' నందలేదు. ఒకవంక, భిన్న సంప్రదాయమునకు చెందిన నాటకనుగుటచే అనువాదమునందు వచ్చుచిక్కులు; ఇంకొకవంక, భారతీయ సంప్రదాయానుసారము నాటకమును తీర్చిదిద్దవలెనను కోరిక—ఈ రెండింటి నడుమ పడి కవి నలిగి పోయెను. ఈసంఘర్షణ, సంస్కృత నాటకానువాదమునందు తెలుగుకవికి అంతగా రాదు. దీనిని పూర్ణముగ చూపుటకే, 'సీజరు చరిత్రము'[37] నాటకమునుండి, వివిధములైన ఉదాహరణములను, కొంత దీర్ఘముగ చూపినాను. వ్యావహారిక పరిభాషలో చెప్పవలెనన్న— 'మనసు-సిగ్గు' అను వానినడుమ, ఈ నాటకాను వాదములో కవి పడెననవలెను. భిన్న భాషాసంస్కృతులకు జెందినకావ్యమును తనభాషలో చెప్పనెంచు ప్రథమకవి కిది తప్పదుగదా!

ఇక పరీక్షింపబోవు నాటకము, శ్రీ గురుజాడ శ్రీరామమూర్తిగారు తెలుగుచేసిన 'మర్చెంట్ ఆఫ్ వెనీస్' (Merchant of Venice) అను 'షేక్స్పియరు' నాటకము. దీనిని తెలుగుకవి 'వెనీసు వణిజనాటకము' లేక 'సుహృత్ సుభాషితము' అను పేర నాంధ్రీకరించెను. ఇది 1880, జనవరినెలలో ప్రకటింపబడినది. ఈ నాటకాంధ్రీకరణమునకు పూర్వమే శ్రీరామమూర్తిగారు 'చిత్ర రత్నాకరము' అనుపేర 'The sleeper awakened' అను కథను తెలుగులో వ్రాసి అనువాదవిషయమున యనుభవము గడించియున్నారు.

---

37. 'సీజరు చరిత్రము' తరువాత, శ్రీ శాస్త్రిగారు 'నందకరాజ్యము' అను స్వతంత్ర సాంఘికనాటకమును వ్రాసి 1880 లో ముద్రించిరి. నాటి సంఘ దురాచారములను దీనియందు విమర్శించిరి. ఇది 5 అంకముల నాటకము. దీనిపై విశిష్టమయిన ఆంగ్ల సాహిత్యప్రభావము కన్పట్టకుండుటచే నిది ఇందు పరిశీలింపబడలేదు.

ఇదిగాక శ్రీ కోరాడ రామచంద్రశాస్త్రి (1816-1900) గారిచే 1860 ప్రాంతమున రచింపబడి 1908 లో ముద్రింపబడిన 'మంజరీమధుకరీయము' అను నాలుగంకముల స్వతంత్ర నాటిక యొకటి కలదు. దీనిపైగూడ విశిష్టమయిన ఆంగ్ల సాహిత్య ప్రభావము కాన రాకుండుటచే దీనిని కూడ నిందుపరిశీలింపలేదు.

'సీజరు చరిత్ర' నాటకమునకును, 'వెనీసు వణిజ నాటకము'నకును, అనువాద పద్ధతియందు కొంతభేదము కలదు. మొదటి నాటకమంతయు ఒకేఛందమున నడచినది. వచనములేదు. రెండవ నాటకములో గద్యపద్యములు రెండును కలవు. వివిధ వృత్తములు వాడబడినవి. ఇట్టిమార్పు చేయుటకు కారణము నీ రీతిని కవి తన నాటకపీఠికలో పేర్కొనెను.

"........షేక్స్పియరుమహాకవికృతనాటకంబుఁ దెనిగింప నుపక్రమించితి. ఇందులో నొకటి రెండునాటకము లీవఱకే దేశీయులచేత నే తెనిఁగింపఁబడియున్నవి. అవి నాటకులకుఁ బాఠకులకు వలయు వివిధ వృత్తంబులచే నొప్పకుంట యొక కొఱతగ నిశ్చయించి యిప్పు డేనాయిద్వారఁ దనియించుటకీ త్రోవం ద్రొక్కితిని."[38]

ఇట్లు వ్రాయుటవలన నాటకమునకు రంగస్థలముపై విశేషాదరమును, పాఠకలోకమున గౌరవమును లభించునని కవి యాశించెను. వివిధ వృత్తములను వాడుట మూలవిరుద్ధమయినను, ఆంధ్ర సహృదయ లోకమునకై ఈ మార్పును చేసితినని చెప్పిన కవి, నాటకములోని పాత్రల నామములను మార్చకుండుటకు కారణ మిట్లు చెప్పెను. "ఇందును జిత్రరత్నాకరంబులోవలె మన భాష కనువగు నామంబులుంచుటకును దాని వలనం బాఠకులం దృప్తులను జేయుటకును మహాకవికృతకృతియవుటచే వలనుపడదయ్యెను. ఇంతియెగాక శాకుంతలాది నాటకములం జదువుచో నేభాషనుండిన నందలి నామంబులు మార్పు నొందిన నా కథలయందలి గౌరవంబు నష్టే యగును. కావున నేనా పనికిం జాలనైతిని."[39]

'సీజరు చరిత్రము' నాటకములోలేని 'ఇష్టదేవతా ప్రార్థనాదికము'ను కవి ఈ 'వెనీసువణిజ నాటకము'నందు చేసి, సంస్కృత కవులకు నమస్కరించి; ప్రస్తుత నాటకమును గూర్చియు నిట్లు చెప్పెను.

"అపర కాళిదాసుఁడను ప్రసిద్ధినిగాంచి
యాంగిలేయ భాషయందుఁ బెక్కు
నాటకముల విరచనలఁ గృతార్థుండైన
షేక్స్పియరు సుకవి చెప్పినట్టి

38. వెనీసు వణిజనాటకము—శ్రీ గురుజాడ శ్రీరామమూర్తిగారు. 1880 జనవరి: పీఠిక. పుట-I.

39. Ibidem.

అల వెనీసువణిజుఁడను నామమున నొప్పు
నరుని నాటకమును గరముఁ బ్రీతి
తోడఁ దెనుఁగుఁ జేయ దొరఁకొంటి నిప్పుడు
గద్య పద్యగతులు గల్గుదాని."[40]

ఈ విధముగా తెలుగుకవి సంస్కృత నాటక ఫక్కి నవలంబించి, ప్రస్తావనను బోలిన భాగమును రచించి, తరువాత 'కథా ప్రారంభము' అని వ్రాసి మొదటిరంగము ననువాదము చేసెను.

మూల నాటక కర్త నామాదికమును జేర్చొను ప్రస్తావనను బోలిన భాగముననే, తెలుగుకవి తన యనువాదరీతినిగూర్చి యిట్లు వ్రాసెను.

"మత్త॥ తెనుఁగు దేశపు వారలెల్ల మ - దీయనాటక ఫక్కికిన్
మనమునందున సంతసింపఁగ - మాటిమాటికిఁ గోరుచున్
దనర మాతృకలోని భావ ము - దారరీతిని గొంచు నే
ర్పునను వర్ణనలందు భేదముఁ - బొంద మార్పునఁ జెప్పెదన్."

"క॥ నాటకులకుఁ బాఠకులకుఁ
బాటింపఁగ వలయు కృతులఁ - బ్రథమము గానన్
నాటక పాఠక సంమము
మాటికి మాటికిని దప్పు - మన్నింపఁ దగున్."[41]

కవి సూచించిన ఈ భేదము లేవో పరిశీలించినచో, ఆంగ్ల నాటకానువాద విషయమున వారికి గల భావములు మనకు తెలియును. ఇంతియె గాక వివిధ వృత్తములను వాడుట యను 'క్రొత్తమార్గము' యొక్క ఔచిత్యమును పరిశీలింపవలెను.

నాటక ప్రారంభమున 'ఆంటోనియో' (Antonio) వాక్యములు ద్విపదలోను; సలారినో (Slarino), సలానియో (Salanio) ల వాక్యములు వృత్తములలోను; తెలుగున కలవు. ఇందుచే మూలములోని సొగసుచెడి, రచన 'ఎగుడు దిగుడు'గ సాగినది.

మూలము——"Antonio — In sooth, I know not why I am so sad :
It wearies me ; you say it wearies you ;
But how I caught it, found it, or came by it,

40. Ibidem. ప్రథమాంకము. పుట-౨.
41. Ibidem.

What stuff'tis made of, whereof it is born,
I am to learn;
And such a want-wit sadness makes of me,
That I have much ado to know myself."
(Act - 1 ; Scene - 1)

తెలుగు—"ద్విపద॥ ఓ హితులార నా - యుల్లంబునందు
నే హేతువునొకో - యేమియుఁ దోఁచ
దిది నీకుఁ దెలియక - యీవును నీకు
మదిఁగలంచె నటంచుఁ - బల్కుదు విపుడు
నను వేతఁ గుందించు - నామది వంత
నినుఁ గలంచె నటంచు - నీవందు దీని
రాకయు, మూలంబు, - రమణ నూహింప
లేకయుంటిని బుద్ధి - లేవడి వచ్చి
నను నేమఱచి నాదు - నామంబుఁ దెలియు
పనిగల్గునట్లు నా - భావంబుఁ గలఁచె" (పుట—౩)

ఈ యనువాదమున మూలములోని సొగసుకాని, ధారాశుద్ధిగాని రాలేదని వేరుగా చెప్పనక్కరలేదుగదా! 'ఆంటోనియో' మాటలకు 'సలారినో' ఇట్లు సమాధానము చెప్పును.

మూలము—"Salarino - your mind is tossing on the ocean;
There, where your argosies with portly sail,
Like signiors and rich burghers on the flood,
Or, as it were, the pageants of the sea,
Do overpeer the petty traffickers,
That curt'sy to them, do them reverence,
As they fly by them with their woven wings."

తెలుగు—"సలారినో - మత్తేభము॥ వడిసామీప్యమునందియేగుతఱినా వంగాంచితోదానికై
జడుపుంజూపుచు దోనెలుండనటఁదాసమ్యక్ప్రసాదంబునన్
గడకంటం దయఁజూచి ప్రోచుగతితోఁ గన్పట్టు నౌకాళి కి
ప్పుడు నీయుల్లము తల్లడిల్లెడి వెసన్ మున్నీటి పెన్నీటిపై."
(పుట—౩)

తెలుగు పద్యమును మూలముతోఁ బోల్చి చూచిన వారికెల్ల, మూలములోని సౌందర్యమును, అనువాదములోని పేలవత్వమును గోచరించును. ఇటులనే మిగిలిన భాగములందును కలదు అడుగడుగునకును మూలవిరుద్ధముగ ఛందస్సు నిట్లు మార్చుటవలన, రసము చెడినది

ఈ నాటకమున పాత్రల వర్ణన యందును, కథాకాలమునాటి పాశ్చాత్యాచారములనుగూర్చి వ్రాయునపుడును; పాశ్చాత్య పురాణ కథల లోని విషయములను గ్రహించునపుడును; తెలుగుకవి స్వేచ్ఛ చూపెను. ఈ స్వేచ్ఛవలన, ఈ అనువాద నాటకము ప్రదేశమునకును పూర్ణముగ చెందినది కాకుండ బోయినది.

పాత్ర వర్ణనలలో తెలుగుకవి 'పోర్ష్య'ను వర్ణించు ఘట్టమునందు మూలమును యథాతథముగ ననుసరింపక స్వాతంత్ర్యమును జూపెను. ఈ సందర్భమున, మూలముతో ననువాదమును బోల్చి చూచిన ఈ విషయము స్వయంవ్యక్తమగును. 'బెసానియో' (Bassanio) తాను ప్రేమించిన 'పోర్ష్య' (Portia) గుణగణమును, మిత్రుడైన 'అంటోనియో' (Antonio) నకు చెప్పుచున్న సందర్భమున ఈ వర్ణన కలదు.

మూలము—" Bassanio — In Belmont is a lady richly left;
And she is fair, and, fairer than that word,
Of wondrous virtues: sometimes from her eyes
I did receive fair speechless messages:
Her name is Portia; nothing undervalued
To Cato's daughter, Brutus' Portia:
Nor is the wide world ignorant of her worth;
For the four winds blow in from every coast
Renowned suitors; and *her sunny locks*
*Hang on her temples like a golden fleece*;
Which makes her seat of Belmont Colchos' strand,
And many Jasons come in quest of her."
(Act - One; Scene - One)

ఈ వర్ణనకు ఆంధ్రానువాదము నీ విధముగా తెలుగుకవి చేసినాడు.

తెలుగు—"బెసానియో—ద్వి॥ వసుధ బెల్మాంటను - వరపట్టణమున
వసు సమృద్ధినిఁగాంచు - వనితయొకర్తు
సౌందర్యవతియుండు - చక్కఁదనంబు
సుందర శబ్దార్థ - శోభకు నెక్క

దగు సుగుణంబుల - కాటప ట్టరయఁ
దగ నొకానొక వేళఁ - దరుణిక్రీఁగంటి
చూపులలోనుండి - చోద్యంబు లగుచు
నే పల్కులును లేక - యొసఁగెడు నట్టి
యుత్తరంబులు వచ్చు - చుండు నే నట్టి
బిత్తరి పేరు సె - ప్పెద నాలకింపు
మాపెను పోర్షియా - యందు రెందులను
ఈ పృథ్విలోన నా - యిందీవరాక్షి
ధీ చమత్కృతులను - దెలియని వార
లేచోటఁ జూడలే - రేమని యనిన
నిల *సుగంధంబుతో* - *నెసఁగు మారుతము*
మెలఁగుచు ఖ్యాతిచే - మించిన యట్టి
రాజన్యుల స్వయంవ - రమునకు దాని
తేజంబు లెన్నగాఁ - దెల్పుచుఁ దెచ్చు
చున్నది *ముంగురు* - *లూహింప నళులు*
అన్నుల తలమిన్న - యా ముఖాంభోజ
మునకు *బెల్మొంటను* - *పుర సరోవరము*
*నను వెలింగెడునట్టి* - *నాళీకవదన*
*కై వల్లవాళిరా* - *గంబుదలిర్ప*
*నే పొద్దు చనుచుందురు..............."*

(పుట—౧౦.)

మూలములో 'పోర్షియ' ముంగురులు 'బంగారు వర్ణము' న నుండెనని యుండగా, తెలుగు కవి దానిని మార్చి "ముంగురు లూహింప నళులు" అని వ్రాసినాడు. నల్లని జుట్టు భారతీయ సంప్రదాయానుసారము సౌందర్య హేతువు. కురులను తుమ్మెదలతో పోల్చుట మన సంప్రదాయమేగదా! ఇట్లీమె వర్ణనను కవి మార్చెను. నాటకములోని నామములు, సన్నివేశములు, మార్పు లేకుండ నున్నప్పుడు, ఈ వర్ణనలను మార్చుటవలన కవి సాధించిన విశేషమేమియు లేదనవచ్చును.

ఇట్టివే గాక మూలములో పాశ్చాత్య పురాణ కథలకు సంబంధించిన నామములు వచ్చినపుడు, తెలుగు కవి ఆ భాగములను విడిచివేసెను. ఇందులకై

పై మూలమునే యుదాహరణముగా గ్రహింప వచ్చును. అందలి, "**Which makes her seat of Belmont Colchos' strand, and many Jasons come in quest of her**" అను పాదములకు తెలుగులో సజాతీయోపమలు నచ్చక గాబోలు, వాని ననువదింపక కవి విడిచినాడు. ఇట్లు తెలుగు కవి విడిచిన గాథ లెన్నియో కలవు. ఇట్లు విడుచుటలో నొక కారణము లేకపోలేదని నాటక పీఠికలో శ్రీగురుజాడ శ్రీరామమూర్తిగారు ఇట్లు వ్రాసిరి. "కొన్ని కొన్ని దేశములలోఁ గొందఱు ప్రసిద్ధపురుషులుందురు. వారొక్కొక్క గుణంబునకు నుపమానంబుగఁ గైకొనఁబడుదురు. అట్టి వారాదేశములవారికే విధమైన శ్రమములేక బోధ యగుచురు. కర్ణునకేమిగుణము ప్రసిద్ధమైనదో ధర్మరాజును హరిశ్చంద్రుడును నెందులకుఁ బ్రసిద్ధివడసిరో మనదేశస్థులందురు లెస్సగ నెఱుంగుదురు. వారిపేరు లుచ్చరింపబడినతోడనే దానమును, న్యాయమును, సత్యసంధతయును స్ఫురించు. ఇది మనదేశమునకుఁగాని యితరదేశములకుఁ గాదు. కావున వీరిం జెప్పుట యితరదేశములలో నిరుపయోగముగ నుండు. అటులనే యితరదేశములలో నున్న యట్టి గుణంబులుగల...నామంబులును.... కావున వానినివదలి, అచ్చటచ్చట తద్విశిష్టగుణములే గ్రహింపంబడెంగావున గుణగ్రాహకులందఱు దీని నంగీకరింతురని నమ్మియుండెదను."[42]

ఈ వాక్యములు సమంజసముగనే కన్పట్టుచున్నవి. కాని, కవి ఈ సిద్ధాంతమును సర్వత్ర పాటింపలేదు. ప్రథమాంకము, మూడవరంగమందు 'షైలాక్' (**Shylock**) ఆంటోనియో, బెసానియోలతో జేకబ్ కథ చెప్పునప్పుడు, ఆ కథనంతను తెలుగున కవి యుంచెను.

"తే॥ తొల్లి జాకబు పినతండ్రితోఁ బలికెను
మేఁకపిల్లల మేపుచు మేనఁ బలుదె
అంగు రంగులుగల పిల్లలుంగలిగిన
వేతనంబుగ వాని నీవిమ్మటంచు" (పుట—౧౯)

ఇదిగాక కవి, మూలములోని భావములను యథాతథముగ గ్రహించిన ఘట్టములందు, కొన్ని భావములు విజాతీయముగ నటులనే నిలిపినాడు.

మూలము— "**Antonio—The devil can cite scripture for his purpose**".
**(Act—One; Scene-Three).**

---

42. వెనీసువణిజనాటకము. పీఠిక-పుట-౨.

తెలుగు—"దయ్యాము కార్యనిర్వాహణ తత్పరతన్ శ్రుతిసూక్తులొక్కటై
నెయ్యాడఁ బల్కినన్న పలుకిచ్చుటఁ జూడఁగలెస్సయయ్యెఁగా"
(పుట—౨౦)

మూలము— "Launcelot—And they have conspired together,—
I will not say you shall see a masque; but if
you do, then it was not for nothing that *my*
*nose fell a-bleeding* on *Black-Monday* last
at six o'clock i' the morning, falling out
that year on *Ash-Wednesday* was four year
in the afternoon." (Act—Two; Scene—Five).

తెలుగు—"వారందఱును కుట్రలోఁ చేరియున్నారు. నీవచ్చుటి వేషాలను
చూడఁగూడదని నేఁ జెప్పను. అట్లైనఁ గడచిన సోమవారము
నాముక్కు బెదరుట యూరకకాదు ఆ సంవత్సరమందు వచ్చిన
బూడిదె బుధవారము నాల్గవ సంవత్సరము మధ్యాహ్నము
నందాయెను." (పుట— ౩౬)

ఈ వాక్యములు తెలుగువాని కెవనికిని అర్థము కావు. ఆకస్మికముగ ముక్కు బెదరి రక్తము వచ్చుట; రాబోవు శుభమునకుగాని, అశుభమునకునుగాని సూచనయని పాశ్చాత్యలోకమున సంప్రదాయమట ! ఈ విషయము తెలుగు వారికి తెలియదుగదా ![43] ఇంక "బూడిదె బుధవారము" (Ash-Wednesday) సంగతి చెప్పనేల !

మన ఆచార వ్యవహారములకు విరుద్ధములైన మూలభావములలో కొన్నింటిని తెలుగుకవి విడిచివేసెను. అందు ముఖ్యమైనవి 'బెసానియో'తో 'పోర్షియా' మాటాడిన ఈ క్రింది వాక్యములు—

మూలము— "Portia—.........you shall have gold
To pay the petty debt twenty times over:
When it is paid, bring your true friend along.
*My maid Nerissa and myself meantime*
*Will live as maids and widows*"
(Act—Three; Scene—Two).

43. "The unexpected bleeding of the nose was formerly considered an omen that either something wonderful would happen, or that some mischance would ensue..."

(The Merchant of Venice— Edited by A. W. Verity, 1926.
పై వాక్యము 'Halliwell' నుండి సంపాదకు డుదాహరించెను. Page-108)

తమ ప్రియులు (Gratiano and Bassanio) తిరిగి వచ్చువరకు తాము (Nerissa and Portia) కన్యలవలెను, విధవల వలెను—భోగముల నొల్లక యని యర్థము—ఉందుమని పోర్ష్య చెప్పెను. ఇందు కన్యలవలె పసులరాకను నిరీక్షింతుమనుట, మన సంప్రదాయము ననుసరించి రమణీయముగాని, 'విధవలవలె' అని కూడ చేర్చుట అశ్లీలము. కనుక దీనిని తెలుగుకవి పరిహరించెను.

ఈ విధముగా 'వెనీసు వణిజ నాటకము' అనువదింపబడినది. 'సీజరు' నాటకమును, ఇదియు ననువాద విషయమున రెండు మార్గములను త్రొక్కి చాల ఆంగ్ల నాటకానువాదములు తెలుగులో వెలయుటకు దారి చూపినవి. కాని ఇట్టి అనువాదములు రంగస్థలమున అంతగా రాణించినట్లునులేదు. ప్రజామోదమును పొందినట్లునులేదు. 1876 లో ప్రకటితమైన తమ సీజరు నాటకమునుగూర్చి, 1880 లో అచ్చయిన తమ 'నందకరాజ్యము' నాటకము పీఠికలో శ్రీ వాసుదేవ శాస్త్రిగారు వ్రాసిన, "నేను వెనుకఁ దెనిగించిన "సీజరు నాటకము"ను మనవారు చాలమంది చదివినట్లే కనఁబడదు" అను వాక్యమే ఇందులకు తార్కాణము.

ఇంతవరకు 'రాజశేఖర చరిత్ర' కవ్యవహితపూర్వమున ఆంగ్ల సాహిత్య ప్రభావమున బయలుదేరిన సాహిత్యప్రక్రియలలో విశిష్టముగనున్న గ్రంథములను పరిశీలించుట అయినది. ఇక, యుగప్రవక్తకులైన వీరేశలింగం పంతులుగారి రచనలపై గల ఆంగ్ల సాహిత్య ప్రభావమును పరీక్షింపవలసియున్నది.

★

# వీరేశలింగకవి రచనలు - ఆంగ్లసాహిత్యము

శ్రీ పంతులుగారి జయంతి (1848) యొక్క శతవార్షికోత్సవ (1948) సందర్భమున, డాక్టరు కట్టమంచి రామలింగారెడ్డిగారు, పంతులుగారి వైశిష్ట్యము నుగ్గడించుచు నిట్లు వ్రాసిరి.

"Taken all in all Viresalingam is the greatest Andhra of modern times. He sums up in his personal history the evolution of an epoch..............In literature he commenced by writing in the Pandit style and ended as the finest and grandest exponent of a clear, simple prose, instinct with beauty aad reason. He commenced by writing Prabandhas bristling with 'slesha, chitrakavita' and the entire gamut of ugly artificialities, and ended as the creator of the Telugu novel, the Telugu social satire, the Telugu drama, especially of the social type, and of science and scientific biography and autobiography in Telugu. His last moments were devoted to a revision of his monumental Lives of the Telugu Poets."

".........Most people live without illustrating the epoch in which they live. They neither give nor catch the light. The hero is he who both catches and generates the new spirit, that fecund principle of change and advancement, without which life were a stagnation and nuisance. Viresalingam reflected the new age because he was one of its potent makers. If he was its creator, it was partly because he was its creature, for they only create who allow themselves to be impregnated by the Time-Spirit........."

"........He is one of the greatest writers in Telugu, and the only man who ever made a living from the sale of his books. His works embrace a bewildering variety of literary forms and themes. He comes nearest to the universality of Voltaire with whom he also shared the provoking gift of sardonic humour without any trace of his cynicism.........".[1]

పై వాక్యములలో పంతులుగారి బహుముఖ ప్రజ్ఞను, ప్రతిభావంతులైన రెడ్డిగారు చక్కగా వ్యక్తముచేసిరి. ఈ వాక్యములను— 1878 లో 'హిందూ' (The Hindu) పత్రిక, రాజశేఖర చరిత్రనుగూర్చి వ్రాయు

---

1. Viresalingam by Dr. C. R. Reddy, (Vice-Chancellor, Andhra University) 'Swatantra'—April 17, 1948.

సందర్భమున, వీరేశలింగముగారిని ప్రశంసించుచు వ్రాసిన — ఈ క్రింది వాక్యము లతో పోల్చిచూచినచో; 'పూవుపుట్టగనే పరిమళము' అన్నట్లు ముప్పదిపండ్ల వయసునాటికే పంతులుగారి ఉజ్జ్వల భవిష్యమును, నాటి సహృదయు లెట్లు భావింప గలిగిరో తేటతెల్లమగును.

"We picture to ourselves a period in the history of Telugu Literature when the country will look back with pride to the man who in the midst of an ignorant multitude and indifferent public, and during times when the study of the English language was at premium and Vernaculars at discount, stood alone from the English learning propensities of his countrymen, laid the foundation stone of Modern Literature and led the way in developing the latent powers of the language into harmony and perfection."

ఇట్టి ప్రజ్ఞానిధి గనుకనే పంతులుగారు; పందొమ్మిదవ శతాబ్దికిని, ఇరువదవ శతాబ్దికిని వారధిగా నుండగల్గెను ఆంగ్ల సాహిత్యములోగల వైవిధ్యము తెలుగులోనికి తెచ్చుటకై చైతన్యయుతముగ కృషిచేసిన ఏకైక వ్యక్తి యయ్యెను. ఆంగ్ల సాహిత్యములోని వివిధ శాఖలకుచెందిన రచనలలో కొన్నింటిని, తెలుగులోనికి తెచ్చిన వారంతకుపూర్వమే యున్నను; అదియే లక్ష్యముగ నిడుకొని, కృషిచేసి తన నాటికి ఇంగ్లీషు సాహిత్యములోనున్న సమస్త శాఖలను (ఇంచుమించుగ) తెలుగులోనికి తెచ్చిన మార్గదర్శకుడు శ్రీ వీరేశలింగం పంతులు. "తన కావించిన సృష్టి" యొక్క విశిష్టతను గుర్తించిన విచక్షణుడు గనుకనే తన 'స్వీయ చరిత్ర'యం దిట్లు వ్రాయగలిగెను.

"...నే నారంభించిన కాలమందు తెలుఁగులో నిప్పటివలె వివిధములైన పుస్తకములులేవు. వివిధములేమి ? ఇంచుమించుగా నేవిధమైనవియు వచన రూపమున లేవనియే చెప్పవచ్చును. అప్పుడన్నియు నూతన సృష్టి చేయవలెను. అందుచేత నప్పటివారికి కష్టముతెక్కువ; సౌలభ్యములు తక్కువ. అయినను తెలుఁగులో మొదటి వచన ప్రబంధమును నేనే చేసితిని; మొదటి నాటకమును నేనే తెనిఁగించితిని; మొదటి ప్రకృతిశాస్త్రమును నేనే రచించితిని; మొదటి ప్రహసనమును నేనే వ్రాసితిని; మొదటి చరిత్రమును నేనే విరచించితిని; స్త్రీలకై మొదటివచన పుస్తకమును నేనే కావించితిని."[2]

2. స్వీయచరిత్రము. 1915; పుట-౨౩౨.

శ్రీ పంతులుగారిట్లు వ్రాసినను, వారి రచనలకు పూర్వమే వివిధ శాఖలలో కృషి జరిగినదని తెలుపజాలిన గ్రంథములు మనకు కలవు. వానిలో ముఖ్యమైనవానిని గూర్చి (కథ, వ్యాసము, పద్యకావ్యము, నవల, రూపకము) ముందే వ్రాసితిని. ఇక, వారి రచనలపై గల ఆంగ్ల సాహిత్య ప్రభావమును పరిశీలింపవలసి యున్నది.

నవల :

పంతులుగారి రాజశేఖరచరిత్ర, గ్రంథరూపమును పొందునాటికి (1880) 'నవల' యనుపేరు తెలుగులో విశేషముగ వాడుకలో నున్నట్లులేదు. 'రాజశేఖరచరిత్ర' కు పీఠికవ్రాయుచు, పంతులుగారా రచననుగూర్చి ఇట్లనిరి. "ఈవఱకు మన యాంధ్రభాషలో జనుల యాచారవ్యవహారములను దెలుపుచు నీతిబోధకములుగా నుండు వచన *ప్రబంధము* లేవియు లేకపోవుట యెల్లవారికిని విశదమయియే యున్నదిగదా ?"[3] కాని, వారే తమ స్వీయచరిత్రలో (1915); 'రాజశేఖరచరిత్ర' రచనవలన తమకు ధనసంబంధమైన లాభమేమియు రాలేదని వ్రాయుచు 'నవల'యను శబ్దమును వాడిరి. "రాజశేఖరచరిత్రము పత్రికాధిపతులచేతను తదితరులచేతను బహువిధముల పొగడఁబడెనుగాని సామాన్యజనులు దానిని గ్రహింపలేకపోయినందున దానివలన వట్టి పొగడ్తలేగాని రక్కి యేమియు నాకు గలుగలేదు. వేయిప్రతులుగల మొదటి కూర్పమ్ముడు పోవుటకే బహు సంవత్సరములు పట్టినది. అందుచేత *నిప్పుడు నవల లనఁబడు వచన ప్రబంధములను* వ్రాయు ప్రయత్నములను మానివేసితిని."[4] ఈవాక్యములనుబట్టి వచనప్రబంధమునకు 'నవల'యను పేరు క్రమక్రమముగ వచ్చినదని తెల్లమగుచున్నది. కాని, రాజశేఖర చరిత్రనుగూర్చి నా డాంగ్లమున వ్రాసినవారుగాని; అంతకుముందే ముద్రింపబడిన శ్రీ రంగరాజుచరిత్రను గూర్చి యాంగ్లమున పేర్కొనినవారుగాని, 'నావెల్' (Novel) అను పదమునే ఆయా సందర్భముల యందు ప్రయోగించుటగ్రహింపవలసిన విషయము. శ్రీ పంతులుగారిని, 'నవల' వ్రాయుడని ప్రోత్సహించిన శ్రీ సమర్థి రంగయ్యసెట్టిగారు తాము ఫిబ్రవరి 8వ తేదీని (1875) పంతులుగారికి వ్రాసిన లేఖలో ; "**Can you not undertake the writing of an original *novel* in Telugu ?**[5] అని ప్రశ్నించిరి. ఈ నవల

---

3. రాజశేఖరచరిత్ర. 1880 ; పీఠిక.
4. స్వీయచరిత్రము. 1915 ; రెండవభాగము. పుటలు-౧౪౩, ౧౪౪.
5. స్వీయచరిత్రము. రెండవభాగము. 1915 ; పుట-౧౪౦.

(రాజశేఖర చరిత్రము) బయలుదేరి తరువాత ; దీనిని దీని రచయితను అభినందించుచు 'హిందు' (The Hindu) పత్రిక ఇట్లు వ్రాసెను. (1878)

"We may well say that Rajasekhara marks an era in the annals of Telugu Literature. *It is the first Telugu novel that has yet appeared*, and as an attempt in a new direction, we must consider it a success."[6]

ఇటకూడ 'నవల' అను శబ్దమే ప్రయుక్తమయినది

'శ్రీ రంగరాజు చరిత్ర'నుగూర్చి కూడ 'నవల' యని చెప్పుచు 'గెజెట్'లో నిట్లు వ్రాసిరి (1872)

"This is apparently *the first attempt* ever made in this part of India at novel writing in Telugu Prose."[7]

ఈవిధముగా 'నవల' యను పేరు; తెలుగులోని వచన ప్రబంధములకు. ఆంగ్లములో వాడబడుచు వచ్చినను, తెలుగులో మాత్రము ఈ పేరు క్రమక్రమముగ వచ్చినట్లు తెలియుచున్నది.

ఈ నవలలను వ్రాయుటలో, ఎవరు ఎవరికి మార్గదర్శకులను ప్రశ్న యొకటి కలదు. అందరకును ఆంగ్ల నవలలే మార్గదర్శకములని ముందు గ్రహింపవలెను. తరువాత, కాలమునుబట్టి '(శ్రీ) రంగరాజుచరిత్ర', పంతులుగారి 'రాజశేఖరచరిత్రము' కంటె ముందే బయలుదేరినదని తెలిసినదికదా ! ఇంతే గాక, పంతులుగా రెక్కడను పేర్కొనకున్నను, ఆయన '(శ్రీ) రంగరాజు చరిత్ర'ను చూచెననుటకు; రాజశేఖర చరిత్రములోని కొన్ని భాగములకు (శ్రీ) రంగరాజు చరిత్రలోని కొన్ని భాగములకుగల పోలికలే, మనకు సాక్ష్య మిచ్చుచున్నవి. కాని, ఈ పోలికలు చాల లేవు. ఉన్న చోటులందుమాత్రము; ఈ రెంటిని తులనాత్మక పరిశీలనకు లోనుచేయువారికి, ఆశ్చర్యము కలిగించు నంత సన్నిహితముగనున్నవి. సామ్యముగల విషయములగుటచే నట్లుండెనేమో!

'రాజశేఖర చరిత్రము' నందలి రాజశేఖరుడు మొట్టమొదట సంపన్న గృహస్థుడు. సంప్రదాయ సిద్ధములైన ఆచార వ్యవహారములందు నమ్మకము కలవాడు. ఆతడు ధనవంతుడై యున్నపుడు బంధుమిత్రులనేకులు ఆతనిని జేరి ముఖస్తుతులుజేసి పొట్ట పోసికొనుచుండిరి. ఆతడు కాలక్రమమున నిర్ధనుడు

6. స్వీయచరిత్రము. రెండవభాగము. 1915; పుట-౧౪౫.

7. Fort St. George Gazette, Madras—A Catalogue of Books printed in the Madras Presidency in July, August and September, 1872.

ఈ పరిశోధన గ్రంథములో పుట - 286 కూడ చూడవలసినది.

కాగా, అందరు నాతనిని విసర్జించిరి. అప్పుడాతడు తన గ్రామమును విడిచి కుటుంబముతో నింకొక గ్రామమునకు బయలుదేరెను. మార్గమధ్యమున వారొక జనులగుంపును చూచిరి. ఈ సందర్భమున రాజశేఖర చరిత్రలో నిట్లున్నది.

"రాజశేఖరుడు—ఎవ్వరో మనుష్యు లక్కడ తొందరపడి పరుగెత్తు చున్నారు! వారిలో నెవ్వరికైన నొక యాపద వచ్చియుండఁబోలును! శీఘ్రముగా వెళ్ళుదము రండి."

"అని వేగముగ నడచి వారు మనుష్యుల కలకలములు వినఁబడుచున్న ప్రదేశమునకు సమీపముగాఁ బోఁగా మార్గమునకుఁ గొంచెము దూరములో దక్షిణపు దిక్కున మూగియున్న గుంపులోనుండి "శుద్ధిచేయుటకు మజ్జిగ"యని కేకలు వేయుచు కొందఱు పరుగెత్తుకొని వచ్చుచుండిరి. రాజశేఖరుఁడుగారు వాండ్రనుజూచి యాసందడి యేమని యడుగఁగా, వారిలో నొక గొల్లవాఁడు 'రాచకుమారుఁడొకఁడు వడగొట్టి యా రావిచెట్టుకింద పడిపోయినాఁ'డని చెప్పెను."

"రాజ—మీరాతని గొంతుకలోఁ గొంచెము నీళ్ళు పోయలేక పోయి నారా?"

"గొల్ల—మొట్టమొదట మేము నీళ్ళియ్యఁబోఁగా శూద్రులము కాఁబట్టి *మాచేతి నీళ్ళు త్రాగనని యారాజు పుచ్చుకొన్నాఁడుకాఁడు. తరువాత దాహమునకు తాళలేక మా చేతినీళ్లు త్రాగుట కొప్పుకొన్నాఁడు. కాని మావారిలో పెద్దవాఁడు వచ్చి, శూద్రుడు రాజునోటిలో నీళ్ళుపోసిన పాపము వచ్చునని చెప్పి, నీళ్ళు పద్ధిచేయుటకై మజ్జిగ నిమిత్తము మమ్ము బంపినాఁడు.* మాపల్లె యిక్కడికి పావు క్రోసు దూరమున నున్నది. మీరు బ్రాహ్మణులుగాఁ గనబడుచున్నారు. మీవద్ద నేమయిన మంచితీర్థమున్నయెడల వేగిరము పోయి యాతని గొంతుకలో నాలుగు చుక్కలుపోసి పుణ్యముకట్టుకొండి."

"ఆమాటలు విని రాజశేఖరుఁడుగారు రుక్మిణి చేతిలోనున్న మంచినీళ్ళ చెంబును పుచ్చుకొని, చెట్టుదగ్గరకు పరుగెత్తిపోయి గుంపులోనుండి త్రోవ చేసికొని ముందునకు నడచి గుంపునందుమను చెట్టు నీడను కటికినేలను పరుండి చేతితో నోరునుజూపి నీళ్ళ నిమిత్తము సైగచేయుచున్న యొక మనుష్యునిఁ జూచిరి. ఆ మూఁకలలో నొకఁడు నీళ్ళముంతను జేతిలోఁబట్టుకొని 'ఈరాజు నిష్కారణముగా జచ్చిపోవుచున్నాఁడు; పదోషమువచ్చినను సరే నీళ్ళుపోసి బ్రతికించెద' నని చేరువకుఁ బోవుచుండెను. అప్పుడొక్క *ముసలివాఁ డడ్డము*

*వచ్చి వానిచేయి పట్టుకొని నిలిపి. 'ఈపరమ పూర్వజన్మములో మన మెన్నియో పాపములను జేయుటచేతనే మన కిప్పుడీ శూద్ర జన్మము వచ్చినది. ఇప్పుడీ రాజును జాతిభ్రష్టుని జేసి యీ పాపము సహితము కట్టుకోవలెనా? నామాట విని నీళ్ళు పోయవల' దని నివారించుచుండెను.* ఇంతలో రాజు కన్నులు తేలగిల పైచి, చేయి నోటివద్ద కెత్తఁబోయి వడకించుచు క్రిందఁ బడవైచెను. అప్పుడు రాజశేఖరుఁడుగారు వెంటనేపోయి మంచినీళ్ళతో ముందుగా నెండుకొని పోవుచున్న పెదవులను తడిపి నోటిలోఁ గొంచెము నీళ్లు పోయఁగా గొంత సేపటి కాతఁడు మెల్లగా చప్పరింప నారంభించెను. అంతట రాజశేఖరుఁడు గారు తన చేతిలోని యుదకముతో మొగమును దడిపి మఱికొంచెము నీరు లోపలికిఁ బోయగా త్రాగి కన్నులు విప్పిచూచి రెండవప్రక్క కొత్తిగిలి మఱి కొంతసేపునకు సేదతీఱి, ఆ రాజు తన జీవములను నిలిపినందులకై రాజ శేఖరుఁడుగారికి కృతజ్ఞతతో బహు నమస్కారములు చేసి లేచి కూరుచుండెను. ఇంతలో పల్లెఁ బోయినవారు మజ్జిగయు, కొన్ని పండ్లను దీసికొనివచ్చి యిచ్చిరి. ఆ రాజు కొన్నిపండ్లను లోపలఁకిబుచ్చుకొని మజ్జిగత్రాగి స్వస్థబడెను"[8]

ఇట్టి సన్నివేశమే 'శ్రీ రంగరాజు చరిత్రము' నందొకటి వచ్చును. అందీ పట్ల మిట్లు వర్ణింపబడెను.

"...ఒకనాడు మంచియెండను మార్గాయాసముచే మిక్కిలి డస్సి, నీరు పట్టుచేఁ దపించుచు బాటను బండుకొనెను. అది చేలను గోఁత కోయుచున్న కొందఱు మాలలు చూచి యెవరో బడలికచేత నేలఁబడిరని యుఱికివచ్చి నీరిచ్చుటకుఁ దగినవారు కామిం జేసి మఱి యెవరినయినను దగు కులమువారిని బిలుచుకొని వత్తుమని చేతనున్న నీరియ్యకయె మరలిపోయిరి. *ఆజలముజూచి పుచ్చుకొందమాయని యాతని కానక్తియుండియు, పాడు వర్ణాచారపు బంధములం జేసి ముట్టఁజేతులాడక యతండు పొందిన మనోవేదనయేమని చెప్పుదు."*

"ఇట్లు పరితపించుచుండఁగాఁ గొందఱు కాఁపువారు తమ తెచ్చుకొన్న సంకటియు నీరును దీసికొని యుఱికివచ్చిరి గాని యతండు క్షత్రియుండగుట యెఱింగి నీరిచ్చుటకు వెనుకముందు చూచుచుండిరి. రాజు దప్పిచే వర్ణా చారంబులకు సయితము జంకక నీయ తెమ్మని సైగచేసె. పుచ్చుకొమ్మని యొకండు నీటిదుత్త యియ్యఁబోయె. రాకొమరుండు హస్తంబు సాచె

8. రాజశేఖరచరిత్రము. 1935 కూర్పు ; పుటలు-110, 111, 112.

నంతలో మఱియొకకాపు తటుకున దత్తను గుంజుకొని యెన్ని పాపములు చేసితిమో యీ పాడుకులంబున బుట్టితిమి. వీరు బ్రాహ్మణులో క్షత్రియులో వీరికేడ నయిన శూద్రులు నీరిత్తురే; వీరు తాపంబున కోర్వలేక నీరు త్రాగెదమని చెప్పె దరుగాని. మనము పిల్లలుగలవారము. మనకేల యీ పాపంబు. వేగబోయి చల్లఁ దెమ్మని యొకరిని గ్రామంబునకుం బంపె."

"హా యే పుణ్యాత్ముండు గల్పించెనో యీ వర్ణాశ్రమధర్మంబులు. ప్రాణంబులు పోవుచున్నను వాని బంధములు పోకపోయె. అత్తరిని రాకొమరుని చిత్తంబేమిగా తల్లడిల్లుచుండెనో యా పరమాత్మునకె కాని యొరుల కెఱుకయె? ఆ బంధంబులు తెంపవలెనని యుద్యుక్తుండయినఁగాని వానిఁ ద్రెంచుట దుస్సాధ్యంబయ్యెఁగా! వానిఁ గల్పించినవాని మహిమయేమని చెప్పవచ్చు."

"ఇట్లు నీరుపట్టురూపమున నున్న యమునితో జీవంబు పోరాడుచుండగా వెనుకఁజిక్కిన చెలికాఁడు వేగంబునవచ్చి తీర్థమిచ్చి ప్రాణంబులు దక్కించె..."[9]

ఈ రెండు ఘట్టములను జూచిన వారికి శ్రీ వీరేశలింగం పంతులుగారు 'శ్రీరంగరాజు చరిత్ర'ను చూచినారని వెంటనే తెలియును. కాని రెండు నవలలలోని కథావస్తువులకును పోలికలు తక్కువ. "శ్రీరంగరాజు చరిత్రము"లోని ఇతి వృత్తము 'రాజశేఖర చరిత్రము'లోని ఇతివృత్తముకన్న వేలవము. కల్పనా చమత్కృతియందును, రచనాపాటవమునందును 'రాజశేఖర చరిత్రము' మిన్న. ఈ ఘట్టమునకు 'రాజశేఖర చరిత్రము'నందు ప్రాముఖ్యము సార్థక్యము గలదు. ఇందే రామరాజు వెషమున నున్న కృష్ణజగపతి మహారాజునకు రాజశేఖరునకు మొట్టమొదటిసారిగా పరిచయ మేర్పడెను. అట్టి మహారాజుతో రాజశేఖరునకు పరిచయమగుట సాధారణముగా పొసగదు గనుక, ఆ మహారాజు మారు వేషములో నున్నట్లును, వడగొట్టి పడియుండగా రాజశేఖరుడాయనను సేదదీర్చినట్టును, పంతులుగారు వ్రాసిరి. రాజశేఖర చరిత్రకు మూలమువంటిదగు 'వికార్ ఆఫ్ వేక్ ఫీల్డు' (The Vicar of Wakefield) అను ఆంగ్ల నవలలో, నిర్ధనుఁడైన డాక్టరు ప్రిమ్‌రోజ్ (Dr. Primrose) భవిష్యములో తమ కుటుంబమునకు అండగనిలుచు 'బర్చెల్' (Mr. Burchell)ను ఒక పాంథశాలలో కలిసికొనును. 'బర్చెల్' తన యొద్దమున్న ధనమునంతను

9. శ్రీరంగరాజుచరిత్రము. 1872; పుటలు-22, 23.

దానము చేసివేసి, పాంథశాలయందలి వారితో విరోధము తెచ్చి పెట్టుకొనెను. ఆతడీయవలసిన డబ్బును 'ప్రిమ్‌రోజ్' తానిచ్చి ఆతనితో స్నేహము చేయును. (Chapter III) 'బర్చెల్' మారువేషమునందున్న 'సర్ విలియమ్‌థారన్ హిల్' (Sir William Thornhill) అని అప్పుడెవ్వరికిని తెలియదు. ఈ సన్నివేశమునే శ్రీపంతులుగారు తమ నవలలో స్వీకరించిరి. మనదేశ పరిస్థితుల ననుసరించి—రామరాజు వడగొట్టి పడిపోయినట్లును, రాజశేఖరుడు సాయము చేసినట్లును రచించిరి. ఇట్టికల్పన శ్రీరంగరాజు చరిత్రయందుండగా వారు దానిని స్వీకరించి యుందురు. మన మతములోని దురాచారముల నెత్తిచూపుట, ఇద్దరు రచయితల యొక్క ముఖ్యోద్దేశముగనుక ; సమాన సన్నివేశములందు భాషయు, భావము పోలికలు గలిగియుండెను. ఇట్టి పోలికలుండుట ఆశ్చర్యముగాదు.

శ్రీ గురుజాడ అప్పారావుగారు వ్రాసిన 'కన్యాశుల్కము' లోని కొన్ని భాగములకును, శ్రీ వీరేశలింగం పంతులుగారు వ్రాసిన 'బ్రాహ్మవివాహము' లోని కొన్ని భాగములకును పోలికలు గలవు. వీనిని గుర్తించి, శ్రీ అప్పారావుగారే తమ 'కన్యాశుల్కము' పీఠికలో నిట్లు వ్రాసిరి.

"Recently, I happened to read Brahma Vivaham by Rai Bahadur Viresalingam Pantulu garu and found that there were some parallel passages in our plays, a thing perfectly natural considering that his piece traversed the whole field of Brahmin marriages. But it will be seen that these plays have little else in common, our treatment being essentially different."[10]

ఈవిధముగనే, రాజశేఖరచరిత్రములోని వాక్యములు శ్రీరంగరాజు చరిత్రములోని వాక్యములను పోలియున్నవనవచ్చును. కాని, శ్రీ పంతులు గారు 'శ్రీరంగరాజు చరిత్రము'ను చూడలేదనలేము. చూచినను, ఆవిషయమును గూర్చి వ్రాయకుండుట—స్వీయచరిత్రములోనైనను— ఆశ్చర్యమే ! 'శ్రీరంగరాజు చరిత్రము' పై తమ కంత గౌరవము లేకున్నను, తామా గ్రంథమును చూచినట్లు పంతులుగారు వ్రాసియుండవలసినది.

మహామహోపాధ్యాయ కొక్కొండ వెంకటరత్నము పంతులుగారు; 'శ్రీరంగరాజు చరిత్రము' కన్న ముందే 'మహాశ్వేత'యను నవలను వ్రాసినట్లు శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు వ్రాసిరి.[11] అది కొంత, పత్రికలలో

10. కన్యాశుల్కము. ప్రథమ ప్రచురణము. 1897 ; Preface. చివరి వాక్యములు.

11. ఈ పరిశోధన గ్రంథములో పుటలు-289, 290 కూడ చూడవలసినది.

ముద్రింపబడినను; గ్రంథరూపమున రాకుండుటచేతను, కథావస్తువు కల్పితమైనది కాకుండుటచేతను, నవలగా ఎక్కువ పేరు వచ్చియుండకపోవచ్చును.

సంఘచైతన్యము, సాహిత్యప్రయోజనము, పాశ్చాత్యవిజ్ఞానప్రభ, గుర్తించిన శ్రీ పంతులుగారు ఆంగ్లసాహిత్యములోని ప్రక్రియా వైవిధ్యమును తెలుగులోనికి తెచ్చుటకు కృషిచేసి, కృతకృత్యులైనారన్న విషయ మందరెరింగినదే. పాశ్చాత్య సాహిత్యసంస్కృతుల ప్రభావమువలన, ప్రయోజనాత్మకమైన సాహిత్యమును సృష్టింపవలెనన్నదృష్టి పంతులుగారికి గలిగినది. దీనివలన వారి రచనలకు వైవిధ్య మేర్పడినది. వారి రచనలలో ఆంగ్లసాహిత్య ప్రభావమున ప్రభవించినవి, పాశ్చాత్యవిజ్ఞాన జిజ్ఞాసవలన పుట్టినవి; రెండు ముఖ్య విభాగములు కలవు. మొత్తముపై వారి రచనలన్నింటిమీదను, వారిపైని పాశ్చాత్య సంపర్క ప్రభావము ఛాయవలెపడినది. ఈ ఛాయ; కొన్నిచోటులందు దట్టముగను, కొన్ని పట్టులందు పలుచగను, మరికొన్ని తావులందు 'అస్తినాస్తి విచికిత్స'కు స్థానమిచ్చునట్లును; పడెను. ఆంగ్లసాహిత్య ప్రభావము లేనిచో వీరేశలింగంపంతులుగారట్లు వ్రాసియుండెడివారు కారు. వారే యట్లు వ్రాసియుండనిచో, ఆంధ్రసాహిత్యము నేడిట్లు బహుముఖముల వ్యాప్తి నందియుండెడిది కాదేమో!

'రాజశేఖర చరిత్రము' వ్రాయునప్పటికి పంతులుగారికి ముప్పది సంవత్సరముల వయస్సు. అంతకుపూర్వమున్న పంతులు వేరు. తరువాతి పంతులు వేరు. సిరోష్ఠ్య, నిర్వచన, శుద్ధాంధ్రగ్రంథములను వ్రాయుచున్న తెలుగుపండితుడు; సులభశైలిలో, సంఘసంస్కరణమునకుపనికివచ్చు, వాస్తవిక నవలకు రచయితయై, నవీనుడైనాడు. ఇది వారికి, ఆంధ్రసాహిత్యమునకు పునర్జన్మ. ఇట్టి ఈ నవలకు, ఆంగ్లసాహిత్యమునకు గల సంబంధమేమియో పరిశీలింపవలసియున్నది.

"తెనుగులో నొక వచనప్రబంధమును వ్రాయుటకు మీరు పూనుకొనవలెనని రంగయ్యసెట్టిగారు తమ ప్రథమలేఖలో వ్రాసినప్పుడే యీ పనికి పూనుకోవలెనని నాకుద్దేశము కలిగినది. మొట్టమొదట నొక చిన్న యింగ్లీషు ప్రబంధమును దేనినైనను తెలిఁగించి శైలి కుదురుపఱుచుకొని తరువాత స్వకపోలకల్పితమైన వచన ప్రబంధమును వ్రాయబూనుకోవలెనని తలఁచి గోల్డుస్మిత్తనెడి యింగ్లీషు కవిచేసిన "వైకర్ ఆఫ్ వేక్‌ఫీల్డు" అను కథను తెనిగింప నారంభించి రెండు మూడు ప్రకరణములు వ్రాసితిని.

విదేశకథయు దాని భాషాంతరమును మనవారి కింపుగా నుండవనితోచి చేసిన భాగము నా మనస్సునకే తృప్తికరముగా నుండనందున దానిని మానివేసి రాజశేఖరచరిత్రమును వ్రాయ నారంభించితిని. *ఇంగ్లీషు కథ కును దీనికిని విశేషసంబంధము లేదు.* అది యొక యుద్దేశముతో చేయఁ బడినది; ఇది వేఱొక యుద్దేశముతో చేయఁబడినది. మనలో గల మూఢ విశ్వాసములను పోగొట్టవలెనన్న ముఖ్యోద్దేశముతో నేను దీనిని వ్రాసితిని. *ఇది యించుమించుగా స్వకపోలకల్పితమనియే చెప్పవచ్చును.* దీనిని మొట్ట మొదట భాగభాగములుగా 1878-వ సంవత్సరమునందు వివేకవర్ధనిలోఁ బ్రచురించి తరువాత పుస్తకముగాఁ బ్రకటించి యప్పటి విద్యా విచారణాధి కారియగు కర్నల్ మెక్డానల్డు దొరగారి కంకితము చేసితిని."[12]

పై వాక్యములను పరిశీలించినచో, 'రాజశేఖర చరిత్రము. నకు 'వికార్ ఆఫ్ వేక్ ఫీల్డు' (The Vicar of Wakefield) నకు గల సంబంధమునుగూర్చి పంతులుగారికి గల యభిప్రాయము తెలియును. ఈ రెంటిని పరిశీలించి, మన యభిప్రాయమును మనము నిర్ణయించుకొనవలసియున్నది.

తన పుస్తకమునకు 'ఎడ్వర్టైజ్ మెంటు' (Advertisement) వ్రాయుచు 'గోల్డ్ స్మిత్' (Goldsmith) గ్రంథనాయకుని గూర్చి ఇట్లు వ్రాసెను.

**"The hero of this piece unites in himself the three greatest characters upon earth; he is a priest, a husbandman, and the father of a family. He is drawn as ready to teach and ready to obey; as simple in affluence and majestic in adversity."[13]**

పైవాక్యములన్నియు ఇంచుమించుగా 'రాజశేఖర చరిత్రము' లో నాయకుడైన రాజశేఖరునకు—ప్రాచ్య పాశ్చాత్య సంప్రదాయములలోని భిన్నత్వము వలన వచ్చిన మార్పులను గణింపకున్న - అన్వయించును. రాజ శేఖరుడు బ్రాహ్మణుడు (Priest) భూవసతి వలననే జీవనాధారము కలవాడు. (Husbandman); కుటుంబి (Father of a family). కష్టసుఖములు రెంటి యందును సమదృష్టి కలవాడు. ("...simple in affluence and majestic in adversity.")

కథానాయకుని విషయమున నుభయ గ్రంథములకు నింత పోలిక యుండుటయేగాక, ముఖ్య సన్నివేశములందును చాల పోలిక కలదు. కథా

---

12. స్వీయచరిత్రము. రెండవభాగము. 1915 ; పుట-౧౪౩.

13. The Vicar of Wakefield—Oliver Goldsmith (1728-1774). 'Advertisement'. (1766)

ఘటనలో రెండింటికి వైషమ్యముకంటె సామ్యమే అధికము. రెండింటికిని కొన్ని భేదములు లేకపోలేదు. కాని, అవి విభిన్న సంస్కృతులుగల రెండు దేశములలో పుట్టిన గ్రంథములకు తప్పనివేగాని ప్రత్యేకమైనవిగావు, ఇవి మనసులో నిడుకొని ఈ గ్రంథములను పరిశీలింపవలెను.

'వికార్ ఆఫ్ వేక్‌ఫీల్డ్' (The Vicar of wakefield) నవలలో 'డాక్టరు ప్రిమ్‌రోజ్' కథానాయకుడు. ఈతడొక చర్చి ఉద్యోగి. ఆ ఉద్యోగమువలన ఆతనికి సంవత్సరమునకు ముప్పదియైదు పౌనులు ఆదాయము. ఆతని వయస్సునకు, భావములకు తగిన భార్య 'డెబోరా' (Mrs. Deborah). వారికి అరుగురు పిల్లలు. పెద్దవాని పేరు 'జార్జి'. చక్కగా 'ఆక్స్‌ఫర్డ్' లో చదివినవాడు. ఆతని తరువాత 'ఒలీవియా' (Olivia) అను కూతురు. తరువాత 'సోఫియా' (Sophia) అను కూతురు. ఆమె తరువాత 'మోసెస్' (Moses) అను కొడుకు. ఆతని తరువాత ఇద్దరు చిన్న కొడుకులు. ఈ కుటుంబముతో 'ప్రిమ్‌రోజ్' సుఖముగా జీవయాత్ర చేయుచుండును ఆతని పెద్దకొడుకు జార్జి. 'మిస్ అరబెల్ విల్‌మాంట్' (Miss Arabella Wilmont) ను ప్రేమించెను. ఈ వివాహము జరుగబోవు నప్పటికి; 'ప్రిమ్‌రోజ్' ధనమును వడ్డీకి త్రిప్పుచున్న లండను వర్తకుని దివాలా వలన; 'ప్రిమ్‌రోజ్' నిర్ధనుడగును. వివాహ మాగిపోవును. ధనము లేకపోవుటవలన కుటుంబమునకు చిక్కులురాగా 'ప్రిమ్‌రోజ్' కుటుంబముతో ఇంకొక ప్రాంతమునకు బయలుదేరును.[1] అటుల బయలుదేరుటకు ముందు పెద్దకుమారుడైన 'జార్జి'కి బుద్ధులుచెప్పి, ఆతనిని తనపొట్టతాను పోసికొనుటకు 'ప్రిమ్‌రోజ్' పంపివేయును.[2] మిగిలిన కుటుంబమంతయు బయలుదేరి ఒకనాటిరాత్రికి ఒక పాంథశాలను జేరుదురు. అట, తనవద్దనున్న ధనమునంతను ఒక బీద సోల్జరునకు దానమిచ్చి, నిర్ధనుడై పాంథశాలకు అద్దె ఇచ్చుకొనలేని స్థితిలోనున్న 'బర్చెల్' (Mr. Burchell)తో 'ప్రిమ్‌రోజ్'నకు స్నేహమగును.[3] 'ప్రిమ్‌రోజ్' తనవద్దనున్న ధనముతో 'బర్చెల్'ను ఋణవిముక్తుని

---

ఆంగ్లాంధ్ర నవలలకు గల పోలికలు :

(1) రాజశేఖరుడుగారు నిర్ధనుడై స్వగ్రామమును విడిచిపోవును. ఆతని కుమారుని పేరు సుబ్రహ్మణ్యము. పెద్దకూతురు పేరు రుక్మిణి. రెండవ కూతురు పేరు సీత. భార్య పేరు మాణిక్యాంబ.

(2) రాజశేఖరుడుగారు తన పెద్దకుమారుడైన సుబ్రహ్మణ్యమునకు నీతు లుపదేశించి తనపొట్ట తాను పోసికొనవలెనని చెప్పి పంపివేయును.

(3) రాజశేఖరుడుగారికి రామరాజుతో స్నేహమగును.

చేయగా, 'బర్చెల్' కృతజ్ఞతతో వీరితోకలిసి పయనించును. మార్గమధ్యమున ఒక ప్రవాహమును దాటుచుండగా, 'సోఫియా' కొట్టుకొని పోవుచుండెను. 'బర్చెల్' ఆమెను రక్షించి, కుటుంబముయొక్క కృతజ్ఞతకు లోనగును. తరువాత నాతడు తనదారినితాను పోవును.

'ప్రిమ్‌రోజ్' తన క్రొత్త ఉద్యోగమును స్వీకరించును. ఇట, సంవత్సరమునకు పదునేను పౌనులు వేతనము. ఇది చాలమికనుక, ఇరువది ఎకరముల భూమిని తీసికొని వ్యవసాయముకూడ నారంభించెను. ఆ ప్రాంతమున కంతకు నధిపతి 'స్క్వైర్ థారన్‌హిల్' (Squire Thornhill) అను నాతడు. ఆతడొకసారి వేటయందుండగ, 'ప్రిమ్‌రోజ్' కుటుంబము కన్పట్టును. స్త్రీలోలుడైన 'థారన్‌హిల్' 'ఒలీవియా', 'సోఫియా'లను చూచి, వారిని సమీపించి 'ప్రిమ్‌రోజ్'తో పరిచయమేర్పర్చుకొనును. సహజముగా అలంకార ప్రియత్వము భోగలాలసతగల 'ఒలీవియా', 'థారన్‌హిల్' చేత ఆకర్షింపబడును. 'ప్రిమ్‌రోజ్' భార్య తన కూతుళ్ళలో నొకతె 'థారన్‌హిల్'ను వివాహమాడిన బాగుగా నుండుననుకొనును. 'థారన్‌హిల్' హృదయములో నట్టిభావము లేదు, ఆ బాలికల శీలమును చెడగొట్టు కోర్కెయే ఆతనికిగలదు. ఆదృష్టితో నతడు 'ప్రిమ్‌రోజ్' ఇంటికి రాకపోకలు సాగించును. 'బర్చెల్'కూడ అప్పుడప్పుడు వీరి ఇంటికి వచ్చుచుండును. 'సోఫియా' విషయమున 'బర్చెల్'నకు, ఆతని విషయమున నామెకు, సదభిప్రాయములు గలవని ఎల్లరకు వెల్లడియగును. 'బర్చెల్' నిర్ధనుడనుదృష్టితో, 'ప్రిమ్‌రోజ్' భార్య ఉదాసీనముగ నుండును.

'థారన్ హిల్' లండనునకు చెందిన ఇరువురు స్త్రీలను తీసికొనివచ్చి, వా రున్నతకుటుంబములకు చెందినవారని, 'ప్రిమ్‌రోజ్' కుటుంబమునకు వారిని పరిచయము చేసెను. అందరును కలిసి కొంతకాలము సుఖముగా గడపిరి. తరువాత, 'ప్రిమ్‌రోజ్' కుమార్తెలు లండను వచ్చినచో వారికి జీవితములో జయమును పొందుటకు చాల అవకాశములు లభింపగలవని, ఆ స్త్రీ లనిరి. ఇది అందరకు ఆశాజనకమయ్యెను. 'ప్రిమ్‌రోజ్' భార్య, తన కుమార్తెలు విహరించుటకు ఒకగుఱ్ఱ మున్నచో బాగుండునని తలంచి, భర్త అనుజ్ఞతీసికొని, తమ ముసలిగుఱ్ఱము నమ్మి డబ్బు తీసికొనిరమ్మని కొడుకైన 'మోసెస్'ను సంతకు పంపెను. అట నాతడు మోసగింపబడి, నిరుపయోగములగు 'సులోచన

ములను' తీసికొని ఇంటికి వచ్చును.[4] ఈ విధముగా కుటుంబ మింకను నష్టపోవును. కాని 'ప్రిమ్‌రోజ్' భార్య, తన కుమార్తెలు పట్టణముపోయి, నాగరకతను పొందవలెనను కోరికను విడువదు. 'బర్చెల్', వయస్సులోనున్న యువతులు సాయములేకుండ లండను పోవుట మంచిదికాదని చెప్పి అందరి కోపమునకు గురియగును. వెంటనే ఆతడును తనమాటను వారు విననందులకు కోపముతో వెడలిపోవును. 'థారన్ హిల్' పర్యవేక్షణమున 'ప్రిమ్‌రోజ్' కుమార్తెలు లండనుపోవుటకు సిద్ధముగ నుందురు. దీనికి కొంత డబ్బు కావలెను గనుక, ఇంక వారికి మిగిలియున్న గుఱ్ఱమును అమ్మటకు నిశ్చయింతురు. ఈ మాఱు గుఱ్ఱముతో 'ప్రిమ్‌రోజ్' బయలుదేరును. కాని, ఆతడును మోసగింపబడి; గుఱ్ఱములేకుండ, ధనములేకుండ ఇంటికి వచ్చును.[5] ఇంటికి వచ్చునప్పటికి 'ప్రిమ్‌రోజ్' భార్య, కుమార్తెలు విచారముగ నుందురు. వారి లండను ప్రయాణ మాగిపోయినట్లును, అందులకు కారణము, లండనులో వీరికి స్వాగతమీయనున్న వారికి వీరి శీలమువిషయమున సంశయము నెవరో కల్గించుటయే అని 'థారన్ హిల్' చెప్పినట్లును 'ప్రిమ్‌రోజ్' నకు తెలియును.

ఈ అపవాదు నెవరు సృష్టించిరా యని 'ప్రిమ్‌రోజ్' కుటుంబమంతయు కల్లోలపడుచుండగా, 'బర్చెల్' యొక్క చేతిపెట్టెలో వారికొక లేఖ కన్పట్టును. దానినిబట్టి 'బర్చెల్' ఈపని చేసినట్లు తెలిసి, అందరును కోపమున నుందురు. ఇంతలో 'బర్చెల్' అక్కడకు వచ్చి తానే లండనులోని స్త్రీలకు లేఖ వ్రాసినట్లంగీకరించును.[6] ఈ మాటలకు 'ప్రిమ్‌రోజ్' మండిపడి ఆతనిని మిక్కిలి తూలనాడి మొగము చూపక పొమ్మని శాసించును.[7] 'బర్చెల్' వెడలిపోవును. కాని 'థారన్‌హిల్' మాత్రము తరచుగా వచ్చుచునేయుండెను. ఒకనాడు తనకు 'ఒలీవియా' యందు మక్కువ యున్నట్లు 'థారన్ హిల్' సూచించును. అందుల కందరు సంతోషింతురు.

థారన్ హిల్' తాను 'ఒలీవియా'ను వివాహమాడుదునని వాగ్దానము చేయువరకు జాగరూకతతో నుండుట మంచిదని 'ప్రిమ్‌రోజ్' పలుకును.

(4) రుక్మిణియొక్క కాసులపేరు పోవును. కుటుంబమునకు ధన నష్టము.

(5) బైరాగి మోసముచేసి రాజశేఖరుడుగారి ధనము నపహరించును.

(6) రామరాజే, తమకు 'మైల' వచ్చినట్లు లేఖను వ్రాసి, సీతయొక్క పెండ్లి పాడు చేసెనని అందరు కోపము చెందుదురు.

(7) సీతయొక్క వివాహమును పడగొట్టినందులకు కోపించి రాజశేఖరుడు రామరాజును దూషించి పొమ్మనును.

ఇంతలో ఒకనాడు 'ఒలీవియా' బండిలో కొందరిచేత ఎత్తుకొనిపోబడును.[8] ఇది 'ప్రిమ్‌రోజ్' యొక్క సంసారమును చీల్చివేయును. 'ఒలీవియా' ఎవరితోనో లేచి పోయినదని అందరును నిర్ణయించుకొని దుఃఖింతురు.

'ఒలీవియా' యొక్క పరిస్థితులను కనుగొనుటకై 'ప్రిమ్‌రోజ్' ఆమె పోయిన మార్గమునుబట్టి పోవును. అచ్చట ఒకచోట మూడు సంవత్సరముల తరువాత 'ప్రిమ్‌రోజ్' తన కుమారుడైన 'జార్జి'ని ఒకనాటకరంగస్థలమున నటునిగా చూచును. తండ్రికుమారులు ఒకరినొకరు గుర్తించుకొందురు. 'జార్జి' తాను పడిన కష్టములన్నింటిని తండ్రికి నివేదించును. ఆతడు కొన్నాళ్ళు 'థారన్‌హిల్' వద్ద పనిచేసినవాడుకూడ. తరువాత 'థారన్‌హిల్' యొక్క పిన తండ్రియైన 'సర్ విలియమ్ థారన్‌హిల్'ను కలిసికొనునుగాని, ఆతడాదరింపడు. ఇన్ని కష్టములు పడిన తరువాత 'జార్జి' నటునిగా జీవింప నెంచెను. ఆ సందర్భమునసే తండ్రిని కలిసికొనును. కొన్నిరోజులు తరువాత 'జార్జి' తండ్రివద్ద సెలవు తీసికొని సైన్యములో చేరుటకు పోవును. 'ప్రిమ్‌రోజ్' ఇంటికి బయలు దేరును.

మార్గమధ్యమున ఒక పాంథశాలలో బసచేసిన 'ప్రిమ్‌రోజ్'నకు అదే స్థలమందు 'ఒలీవియా' ఏకాంతముగా ఒక గదిలో కన్పట్టును.[9] దుఃఖించుచు నామె తన కథను చెప్పును. తమను మోసముచేసినది. 'బర్చెల్' కాదనియు, 'థారన్‌హిల్' అనియు చెప్పును. అంతియేగాక, 'బర్చెల్' మొట్టమొదట, తామెవరమును మోసపోరాదని, ఆలేఖ వ్రాసెననియుచెప్పును.[10] 'థారన్‌హిల్' తన్ను వివాహమాడినట్లును, కాని ఆ వివాహముచేయించినవాడు, పౌరోహిత్యమునకు అర్హతలేనివాడనియు పల్కును. తరువాత 'థారన్‌హిల్' తనను ఒక గొప్పవానికి తార్చుటకు యత్నింపగా, తాను పారిపోయివచ్చినట్లు 'ఒలీవియా' తండ్రితో చెప్పును. 'ప్రిమ్‌రోజ్' ఆమెను తీసికొని ఇంటికి వచ్చును.

---

**(8) రుక్మిణి చనిపోయినదనుకొని (శవమును) విడిచివచ్చుటచే, రాజశేఖరునకు పెద్ద కుమార్తె లేకపోవుట జరిగినది.**

**(9) సుబ్బారాయడు వేషములోనున్న రుక్మిణి కథాంతమున మరల తల్లిదండ్రులను కలిసికొనును.**

**(10) సీతను వివాహమాడనెంచిన 'పద్మరాజు' భ్రష్టుడని తెలిసికొని, ఆ వివాహము నాపుటకై రామరాజే, తమకు మైలవచ్చినట్లు లేఖలో వ్రాసెనని తెలిసికొని, రాజశేఖరుడు రామరాజును తూలనాడినందులకు చింతించును.**

'ప్రిమ్‌రోజ్' వచ్చునప్పటికి ఇల్లు కాలిపోవుచుండును. ఇంటిలోనివా రందరు చేతికందిన సామగ్రితో వెలుపలకు వత్తురు. ఈవిధముగా 'ప్రిమ్‌రోజ్'న కున్న ఆస్తియావత్తు హరించుపోవును. 'ఒలీవియా' ను కుటుంబమంతయు స్వీకరింతురు. ఇంతలో వారికి 'థారన్‌హిల్' వివాహమాడనున్నట్లును, మొట్ట మొదట 'జార్జి' ప్రేమించిన 'మిస్ విల్‌మాంట్' వధువు అయినట్లును తెలి యును. ఈ వార్త 'ప్రిమ్‌రోజ్' కుటుంబములోని వారందరకు కోపకారణ మగును. ఇల్లు కాలిపోయిన ప్రిమ్‌రోజ్' ను ఇరుగు పొరుగువారు వచ్చి ఆదు కొందురు. కాని, 'థారన్‌హిల్' తో 'ప్రిమ్‌రాజ్' కలహించుటచే, ఆతనికి కోపమువచ్చి 'ప్రిమ్‌రోజ్' యొక్క ఆస్తిని తనకీయవలసిన పన్నునకై వేలము వేయించి, ఆతనిని జైలులో నుంచును.[11] ఆతనితోపాటు కుటుంబమంతయు బయలుదేరును. మార్గమధ్యమున, 'ప్రిమ్‌రోజ్' నందు భక్తివిశ్వాసములుగల బీదప్రజలు, రక్షకభటుల చేతులలోనుండి ఆతనిని విడిపింపనెంతురుగాని, ఆతడే వారిని వారించును. తరువాత, 'ప్రిమ్‌రోజ్' కుటుంబమంతయు జైలుగల ఊరిలో నొక పాంథశాలయందు విడియుదురు. ఆతనిని జైలులో నుంతురు.

జైలునందాతడు తనను మోసముచేసి గుఱ్ఱమును తీసికొని డబ్బియ్యని 'జెంకిన్‌సన్' (Ephraim Jenkinson) అనువానిని కలిసికొనును[12] ఆతడు తాను చేసిన చెడ్డపనికి పశ్చాత్తాపపడును. 'ప్రిమ్‌రోజ్' భార్య కుమార్తెలు జైలునకు సమీపమున నొక చిన్నగదిలో నుందురు. ఆతని కుమారులు జైలులో పడుకొనుటకు అధికారు లంగీకరింతురు. 'మోసెస్' పనిచేసి, కుటుంబమును పోషింపవలెనని 'ప్రిమ్‌రోజ్' కుమారునకు చెప్పును.

'డాక్టరు. ప్రిమ్‌రోజ్' జైలులోనున్న బంధితులను సన్మార్గములో పెట్ట వలెనని ప్రయత్నించును. వారికి మతవిషయములు చెప్పును. నైతికజీవనము యొక్క ఔత్కృష్ట్యమునుగూర్చి చెప్పును. 'జెంకిన్‌సన్' ఈ విషయములలో ఆతనికి సాయపడును. ఆతడే 'మోసెస్'ను దగాచేసినవాడనికూడ తెలియును. తరువాత నాతడు తన జీవితచరిత్రను చెప్పును. 'ప్రిమ్‌రోజ్' చేయుచు వచ్చిన

(11) సీత నయోగ్యునకు కట్టబెట్టనెంచిన శోభనాద్రిరాజును రాజశేఖరుడు దూషింపగా ఆ రాజు రాజశేఖరుని జైలులో నుంచును.

(12) జైలులో మంచిరాజు పాపయ్య యనువాడు కనబడును. ఆతడు రాజశేఖరునితో తాను శోభనాద్రిరాజు ప్రోత్సాహమున రాజశేఖరుని మార్గమధ్యమున దోచుకొనినట్లు చెప్పును.

మత ప్రచారమువలన బంధితులలో మనః పరివర్తనము క్రమక్రమముగా కలుగగా వారు సన్మార్గగాములగుదురు.

ఒకనాడు తండ్రిని చూచుటకు 'ఒలీవియా' జైలులోనికి వచ్చును. అప్పుడు సమస్తవిషయములు 'ప్రిమ్‌రోజ్' వలన విని ఇంకొక బంధితుడు, 'థారన్‌హిల్' యొక్క పెదతండ్రియైన 'సర్ విలియమ్'నకు ఒక లేఖ వ్రాయ వలసినదిగా ఆతనిని ప్రోత్సహించును.[13] 'ప్రిమ్‌రోజ్' అటులనే జాబువ్రాసి జవాబు నకై నిరీక్షించుచుండును. ఇంతలో 'ఒలీవియా' చనిపోయినదనుకొని 'ప్రిమ్‌రోజ్' విచారముతో నుండగా, ఆతనిభార్యవచ్చి 'సోఫియా'ను ఎవరో ఎత్తుకొనిపోయి రని చెప్పును.[14] ఈ కష్టముతో అందరు క్రుంగిపోవుదురు. ఇంతలో 'జార్జి' వద్దనుండి ఆతని క్షేమసమాచారములు తెలుపుచు జాబు వచ్చినదని 'మోసెస్' అనును. దుఃఖములో నున్న వారందరు కొంత తేరుకొందరు. కాని ఇంతలో; బంధింపబడిన 'జార్జి' గాయములతో జైలులోనికివచ్చును. అందరు నిశ్చేష్టు లగుదురు. అప్పుడు 'జార్జి', తనసోదరి యొక్క గౌరవమునకు భంగము కలిగించిన 'థారన్‌హిల్'ను ద్వంద్వయుద్ధమునకు తా నాహ్వానించినట్లును, ఆతడాతని సేవకులను నలుగురిని 'జార్జి'ని బంధించుటకు పంపినట్లును, అందుతానొకనిని గాయపఱచినట్లును, మిగిలినవారు తన్ను బంధించి, జైలునకు తెచ్చినట్లును, చెప్పును. అందరు నిరాశోపహతులగుదురు తరువాత 'ప్రిమ్‌రోజ్' జైలులోనున్న వారికందరకు హితోపదేశము చేయును. అందరును జరుగనున్నది జరుగగలదని తటస్థముగ నుందురు.

ఇంతలో 'మోసెస్' వచ్చి 'సోఫియా' యును, 'బర్చెల్'ను, వచ్చు చున్నారనిచెప్పును. వారు జైలులోనికి ప్రవేశింతురు. 'సోఫియా' తన తండ్రికి అన్నివిషయములు చెప్పును.[15] 'ప్రిమ్‌రోజ్' 'బర్చెలు' ను క్షమింపుమని వేడును. అంతియెగాక, ఆతనికి నచ్చినచో 'సోఫియా'ను వివాహ మాడవచ్చునని తన యనుమతి నిచ్చును. ఇంతలో 'బర్చెల్' అందరకు జైలులోనే విందు ఏర్పాటు చేయును. 'ప్రిమ్‌రోజ్' కోరికపైని ఆతని కుమారుడైన 'జార్జి'ని, జైలులో

(13) మంచిరాజు పాపయ్య, రాజశేఖరునిచే పెద్దాపురము రాజయిన కృష్ణజగపతికి లేఖను వ్రాయించును.

(14) సీతను పద్మరాజునకు సంబంధించినవా రెత్తుకొని పోవుదురు.

(15) సీత, రామరాజే తన్ను విడిపించినట్లు చెప్పును. రాజశేఖరుడు, రామరాజు విషయమున తా నపోహపడినందులకు చింతించును.

మిత్రుడైన 'జెన్‌కిన్‌సన్'ను కూడ విందునకు పిలుతురు. 'జార్జి' ఆతనిని చూచి 'బర్చెల్' 'సర్ విలియమ్ థారన్ హిల్' అని ఆనవాలు కట్టును. అందరును ఆశ్చర్య పడుదురు. 'సోఫియా'ను ఎత్తుకొనిపోయిన వానిని తానెరుంగుదునని 'జెన్‌కిన్‌సన్' చెప్పగానే,[16] వానిని పట్టుకొనుట కిద్దరి భటులతో 'జెన్‌కిన్‌సన్'ను 'సర్ విలియమ్' పంపును.

'సోఫియా'ను ఎత్తుకొనిపోయిన వానిని బంధించి, భటులు తీసికొని వత్తురు. ఆతడు 'జెన్‌కిన్‌సన్' కలిసి 'సర్ విలియమ్'నకు 'థారన్‌హిల్' యొక్క దుర్మార్గము నంతయు చెప్పుదురు. ఇంతలో, 'థారన్‌హిల్'ను కొద్దిదినములలో వివాహమాడనెంచిన 'మిస్ విల్మాంట్' అక్కడకువచ్చును. అన్ని విషయములు విన్న తరువాత, తన అదృష్టమును తాను మెచ్చుకొనును. ఆమె తన తప్పును మన్నింపుమని 'జార్జి'ని ప్రార్థించును. ఆత డామె నంగీకరించును.

'థారన్ హిల్' తనకు 'మిస్ విల్మాంట్' లభింపకున్నను, పెండ్లికి ముందు చేసికొనిన నిర్ణయముప్రకార మామె ఆస్తి తనకు వచ్చుననియు, అదియే తనకు చాలుననియు పలుకును. వెంటనే 'జెన్‌కిన్‌సన్' అడ్డుపడి, 'థారన్‌హిల్'నకు ఒక భార్యకలదనియు, ఆమె జీవించియుండగా 'మిస్ విల్మాంట్' ఆస్తి 'థారన్ హిల్'నకు రాదని చెప్పి, అందరును చనిపోయిన దనుకొనుచున్న 'ఒలీవియా'ను తీసికొని వచ్చును. 'ఒలీవియా' నిజముగా చనిపోలేదు. 'ప్రిమ్‌రోజ్' చేత 'థారన్ హిల్'నకు క్షమార్పణ లేఖ వ్రాయించుటకై తానట్లసత్యము చెప్పినట్లును, 'ప్రిమ్‌రోజ్' భార్యకూడ తనమాటవలన సత్యము చెప్పలేదనియు, 'ఒలీవియా'ను 'థారన్‌హిల్' నిజముగానే వివాహమాడెననియు 'జెన్‌కిన్‌సన్' చెప్పును.

'థారన్ హిల్' చేయునదిలేక తన తప్పు నంగీకరించును.[17] 'సర్ విలియమ్' 'సోఫియా'ను, 'జార్జి' 'మిస్ విల్మాంట్'ను వివాహమాడుదురు.[18] 'జెన్‌కిన్‌సన్' విడుదల చేయబడును. 'ప్రిమ్‌రోజ్' తన కుటుంబముతో సుఖముగా నుండును.[19]

---

(16) రామరాజే పెద్దాపురము రాజయిన కృష్ణజగపతియని తెలిసి అందరు ఆశ్చర్య పడుదురు.

(17) శోభనాద్రిరాజు తన తప్పు నంగీకరించును.

(18) నీలాద్రిరాజు తన జీవితచరిత్రను చెప్పును.

(19) రాజశేఖరుడు పెద్దాపురము రాజుగారి దయవలన సుఖజీవనము చేయును.

వీరేశలింగం పంతులుగారి 'రాజశేఖర చరిత్రము' కథా సన్నివేశము లలో నెంతవరకు 'వికార్ ఆఫ్ వేక్ ఫీల్డ్' ను అనుసరించినదో పరిశీలించుట కనువుగ, ఆంగ్లనవలలోని ముఖ్య సన్నివేశముల నన్నింటిని—కొంచెము దీర్ఘముగ—వివరించితిని. 'రాజశేఖర చరిత్రము' ను గూడ నిట్లే పరిశీలించిన రెండు నవలలకు గల సామ్యవైషమ్యములను నిర్ణయింపగలుగుదుము.

రాజశేఖరుడుగారిది, రాజమహేంద్రవరమునకు సమీపమున గల ధవళగిరి నివాసస్థలము. సంపన్న గృహస్థులు.[1] పూర్వాచార పరాయణులు. ధనవంతులైన వీరి ప్రాపు పొందుటకై, ఆ గ్రామములోని వారందరు వారిని ముఖస్తుతి చేయుచు కాలము గడుపుచుందురు. రాజశేఖరుడుగారి పెద్ద కుమార్తె రుక్మిణి. ఆమెకు పదునాల్గు సంవత్సరములు. వివాహమైనది గాని, భర్త ఎవరితోడను చెప్పక దేశాంతరము లేచిపోవును. రాజశేఖరుడుగారి రెండవ కుమార్తె పేరు సీత. ఆమెకేడు సంవత్సరములు. ఆయన భార్యపేరు మాణిక్యాంబ. రాజశేఖరుడుగారి జ్యేష్ఠపుత్రుడు సుబ్రహ్మణ్యము. అతనికి పదునారు వత్సరములు.

రాజశేఖరుడుగారి వలన బాగుపడిన వారిలో ఆయన బావమరది దామోదరయ్య ఒకడు. ఈతడు రాజశేఖరుడుగారి తోబుట్టువు భర్త. ఆమె యొక కుమారునిగని చనిపోవును. ఆ బాలుని పేరు శంకరయ్య. అతనికి పదునేను వత్సరముల వయస్సు. సీత నాతనికిచ్చి వివాహాము చేయవలెనని అందరి సంకల్పము. దామోదరయ్య భూతవైద్యునిగా చలామణీ అగుచు, ధనమును సంపాదించును. నారాయణమూర్తి అనువాడు రాజశేఖరుడుగారి వలన బాగుపడిన రెండవ యాతడు. ఈతడు రాజశేఖరుని సహపాఠి. ఈతని కాయన, వలసినప్పుడు ధనమిచ్చుచు కాపాడుచుండును. ఇటులుండగా, నారాయణమూర్తి కార్తికలిసి యాతడు ధనవంతుడగును. తనకు సహజమైన మంచితనముతో రాజశేఖరుడుగారు, వీరి యభ్యుదయమునకు సంతోషింతురు.

రుక్మిణికి ఎఱుకత ఒకతె, దూరదేశమున నున్న ఆమె భర్త తిరిగివచ్చునని యు, అన్నియు శుభపరంపరలే వచ్చుననియు సోదె చెప్పును.[2]

---

ఆంధ్రాంగ్లనవలలకు గల పోలికలు :

(1) డాక్టరు 'ప్రిమ్‌రోజ్' గౌరవముగ కాలక్షేపము చేయుచున్న మంచివాడు. ఆతని పెద్దకొడుకు 'జార్జి'. పెద్దకూతురు 'ఒలీవియా'. రెండవ కూతురు 'సోఫియా'. రెండవ కొడుకు 'మోసెస్'. వీరుగాక ఇద్దరు చిన్నకొడుకులు.

(2) డాక్టరు 'ప్రిమ్‌రోజ్' కుమార్తెలకు 'జిప్సీ' స్త్రీ యొకతె, భావిజీవితమును గూర్చి జ్యోతిషము చెప్పును.

ధవళగిరిలోనికి బైరాగి యొకడు వచ్చును. ఆతడు సర్వశక్తిసంపన్నుడను నమ్మకము ప్రజలకు గలుగును. సిద్ధాంతి, పూజారి మొదలైనవారా నమ్మకమును రాజశేఖరుడుగారికికూడ గలిగింతురు. ఆతనికి రసవాద విద్యయందు గొప్ప నేర్పుకలదను ప్రతీతిపడును. ఈ లోపుగా దేవుని ఉత్సవము వచ్చును. ఆ సమయమందు రుక్మిణియొక్క కాసులపేరు నెవరో అపహరింతురు.[3] సిద్ధాంతి హరిశాస్త్రిలను వానిని తీసికొని వచ్చి, ఆతడు మాంత్రికుడనియు పోయిన వస్తువులనుగూర్చి చెప్పగలడనియు పలికి, రాజశేఖరుడుగారికి నమ్మకము పుట్టించును. ఇరువురును కలిసి, రాజశేఖరునకు నమ్మకము కలిగింపగా, హరిశాస్త్రిలు కొంత కర్మకలాపము నడపి యొక చాకలి యా నగ తీసెనని చెప్పును. నగ లభింపకున్నను, హరిశాస్త్రిలునకు బహుమతి లభించును. దానిని సిద్ధాంతియు నాతడు పంచుకొందురు. ఈ విధముగా రాజశేఖరుని మంచితనము కొల్లగొట్టబడుచుండును. ఇంతలో నెవడో వచ్చి రుక్మిణి భర్తయగు నృసింహస్వామి, కాశీనుండి తిరిగి వచ్చుచు మార్గమధ్యమున చనిపోయెనని చెప్పును. అందరును విచారింతురు. రుక్మిణి దుఃఖముచేత మంచము పట్టును. సమస్త చికిత్సలు జరుగును. తుదకు హరిశాస్త్రిలు వచ్చి భూతవైద్యము చేయును. కొన్నినాళ్ళకు జ్వరము సహజముగా తగ్గిపోవును.

సంసారమునకు క్రమక్రమముగ ధనము చాలకుండుటచేత సువర్ణవిద్యను సంపాదింపవలెనను కోర్కె రాజశేఖరునకు కలుగును. ఊరియందున్న బైరాగి తన కా విద్య తెలియునని నమ్మించి, రాజశేఖరుని ఇంటిలోనున్న బంగారము వెండివస్తువుల నన్నింటిని తెప్పించి, వాని నన్నింటిని బంగారముగ చేయుదునని చెప్పి, ఆయనను ఏమరించి వానితో పలాయనము చిత్తగించును.[4] క్రమక్రమముగా రాజశేఖరునకు బీదతనము వచ్చును. బంధుమిత్రుల రాక సన్నగిల్లును. అంతకుపూర్వ మాతనివలన లాభములను పొందినవారు సైతము మాయనను తప్పించుకొని తిరుగుచుందురు. ఆయనవలన బాగుబడిన దామోదరయ్య, నారాయణ మూర్తులుకూడ తప్పించుకొని తిరుగుచుందురు. ఈ పరిస్థితులలో రాజశేఖ

(3) 'మోసెస్' ను మోసముచేసి ఆతని గుఱ్ఱమునకు బదులుగా సులోచనములను మారువేషముననున్న 'జెన్‌కిన్‌సన్' అంటగట్టును.

(4) కొడుకు మోసపోయిన తరువాత, తమ కింక మిగిలియున్న గుఱ్ఱము నొకదానిని అమ్మి ధనమును తెచ్చుటకై 'ప్రిమ్‌రోజ్' బయలుదేరును. కాని, ఆతనిని కూడ, మారువేషములోనున్న 'జెన్‌కిన్‌సన్' మోసము చేయును.

రునకు గ్రామాంతరము వెడలిపోవుటయే గత్యంతరముగా నుండును. ఆయన కాశీయాత్రకు బయలు దేరును. ఆయన వెడలిపోవుచున్నాడని విని పేదప్రజ లందరు విచారము ప్రకటింతురు.[5]

రాజశేఖరుడుగారు ధవళగిరి నుండి రాజమహేంద్రవరము చేరి, అట బంధువుల ఇంటిలో కొన్నినా ళ్ళుందురు. దరిద్రదేవతతో స్నేహమైన నాటి నుండియు రాజశేఖరునకు ప్రపంచజ్ఞాన మధికమగుచు వచ్చును. తాము ధవళగిరి నుండి తెచ్చిన సామగ్రిని రాజమహేంద్రమున బంధుగృహమున నుంచి, రాజ శేఖరుడుగారు కాశీకి బయలుదేరుదురు. వారి కుటుంబము రాజానగరము సమీ పించునప్పటికి మార్గమధ్యమున వడదెబ్బ తగిలి పడిపోయిన రాజొకడు వారికి తారసిల్లును.[6] ఆతని నోటిలో నీరుపోసి రక్షించుటకు కులభేదములడ్డురాగా, జను లందరు, నీటికై తపించుచున్న రాజును చూచుచు ఊరకుందురు. రాజశేఖరుడు గారు తా నాతని నోట నీరుపోసి యాతనిని బ్రతికించి ఆ రాజుయొక్క కృత జ్ఞతకు పాల్పడును.[7] ఆ రాజు పేరు రామరాజు. ఆతడు, తానొక పులిచే తరుమ బడుటయు, తన చేతిలోని కత్తి కట్టు సాయముతో దానిని నిర్జించుటయు మొదలగు విషయములను జెప్పి, వా రా వేసవిలో కాశీ యాత్రకు పోవుట మంచిదికాదనియు, పెద్దాపురమును పాలించుచున్న కృష్ణజగపతి మహారాజు గారు మిక్కిలి ధర్మాత్ములనియు వారి రాజ్యమున భీమవరములో నుండు డనియు చెప్పును. రాజశేఖరు డాతని మంచి తనమునకు మెచ్చుకొనును. రామ రాజు, చీకటి పడకపూర్వమే వారు పెద్దాపురము చేరవలెననియు, లేకున్న దొంగలభయము మార్గమధ్యమున విస్తారమనియుచెప్పి తనదారిని తాను బోవును.

రామరాజు వెడలిపోయిన తరువాత వారు భోజనాదికమును ముగించు కొని బయలుదేరుదురు. కాని వారిని కొందరుదొంగలు మోసముచేసి దోచుకొన బోవుచుండగా రామరాజువచ్చి దొంగలనుపారద్రోలును. దొంగలు మొట్టమొదట

---

(5) నిర్ధనుడైన 'ప్రిమ్‌రోజ్' కుటుంబముతో గ్రామాంతరమునకు బయలుదేరును. ఆతని పొరుగువారైన పేదప్రజలు వారిని కొంతదూరమువరకు సాగనంపుదురు.

(6) 'ప్రిమ్‌రోజ్' నకు, మధ్యమార్గములో బసచేసిన ఒక పాంథశాలలో, 'బర్చెల్' తో స్నేహమగును.

(7) తనవద్ద నప్పటికున్న ధనమునంతను దానముచేసి నిర్ధనుడయిన 'బర్చెల్' నకు స్వల్ప ధనసాహాయ్యముచేసి 'ప్రిమ్‌రోజ్' ఆతని కృతజ్ఞతకు పాల్పడును.

వచ్చి ఎదిరించినప్పుడు రుక్మిణికి తలమీద దెబ్బతగిలి ఆమె పడిపోవును. దొంగలు పారిపోయిన తరువాత వారందరు నామె మరణించినదని తలంచి విలపింతురు. ఆ రాత్రి శవము వద్దనే గడపనెంచిరి గాని, ఆ ప్రాంతమందు పులుల సంచారము విశేషమని రామరాజు చెప్పుటచే, వారు విడువలేక విడువలేక ఆ శవము నరణ్యమున విడిచి, మరునాటి యుదయమున వచ్చి దహన సంస్కారాదులు చేయవచ్చునని ఎంచి, రామరాజుతో పెద్దాపురము చేరుదురు. ఆ గ్రామము చేరిన తరువాత రామరాజు వారిని, పెద్దాపురమునకు సమీపముననే గల పుణ్యక్షేత్రమగు భీమవరములో నుండుడని నొక్కిచెప్పి తానేగును.

రామరాజు చెప్పినట్లే, రాజశేఖరుడుగారు మోసములకు పుట్టినిల్లైన పెద్దాపురమును విడిచి, భీమవరము చేరుదురు.[8] అట నొక చిన్న యిల్లు అద్దెకు తీసికొని ఎటులనో కాలక్షేపము చేయుచుందురు. కొంత కాలమునకు తనతో తెచ్చుకొనిన డబ్బయిపోవుటచే నేదయిన ఉద్యోగమును సంపాదింప వలెనను కోరిక వారికి కలుగును. ఆ యూరిలోని కొందరుమిత్రులు వారిని; శ్యామల కోట యధిపతియు, రాజబంధువును, కారాగృహాధికారియు నగు శోభనాద్రి రాజుగారిని కలిసికొని ఉద్యోగ ప్రయత్నము చేయుడని హెచ్చరింతురు.[9] రామరాజు భీమవర మప్పుడప్పుడు వచ్చి వీరియోగక్షేమములు విచారించుచుండును. ఒకనాడు రాజశేఖరుడు శోభనాద్రిరాజు దర్శనమునకు పోయి లాభము లేక తిరిగి వచ్చును. ఇంటిలోని పరిస్థితు లంతకంతకు విషమ మగుచువచ్చుచుండుట చేత, సుబ్రహ్మణ్యము నెచ్చటికైన పంపవలెనని భార్యా భర్త లిరువురు నిశ్చయించుకొని, ఆతనిని పిఠాపురము పంపుదురు.[10]

కొంతకాలమునకు రాజశేఖరునకు శోభనాద్రిరాజుతో స్నేహమయినది.[11] ఆతడీయనకు పెండ్లి కెదిగిన కూతురు గలదని విని ఆమెకు మంచి సంబంధము

---

(8) 'ప్రిమ్‌రోజ్' తన గ్రామమును విడిచి గ్రామాంతరమున. చర్చి ఉద్యోగిగా నివసించుచుండును.

(9) 'సైక్వైర్ థారన్ హిల్' తో పరిచయము కలుగును. 'ప్రిమ్‌రోజ్' యొక్క గ్రామము 'థారన్ హిల్' యొక్క యాజమాన్యమున నుండును.

(10) తనపొట్ట తాను పోసికొనవలెనని చెప్పి కుమారుడైన 'జార్జి' ని 'ప్రిమ్‌రోజ్' బుద్ధులు చెప్పి పంపించివేయును.

(11) 'థారన్ హిల్' మెల్లమెల్లగా 'ప్రిమ్‌రోజ్' ఇంటికి రాకపోకలు సాగించును. ఎదిగిన కూతుళ్ళుగల 'ప్రిమ్‌రోజ్' గృహ మతనికి ఆకర్షకమైనది.

తానె చూచెదనని పలుకును. శోభనాద్రిరాజు స్తోత్రప్రియుడు. తన్ను పొగడు చుండు మిత్రులతో నాతడెప్పుడు పరివేష్టింపబడి యుండును. రాజశేఖరునకు కూతురి వివాహము తగిన వరునితో చేయవలెనని యున్నదని విన్న సిద్ధాంతి యొకడు, తన కట్టి వరునిగూర్చి తెలియుననియు, వారిది పెద్దాపురమనియు, శోభనాద్రిరాజుగారు చెప్పినచో ఆ సంబంధము కుదురుననియు పల్కును. తరువాత రాజశేఖరుడు గారును,సిద్ధాంతియును శోభనాద్రిరాజు గారి దర్శనము చేయుదురు. అట రాజశేఖరుడు వినునట్లుగా సిద్ధాంతి మంచిరాజు పద్మరాజు గారి సంబంధము మంచిదని రాజుగారికి చెప్పగా, నాత డంగీకరించును. రాజశేఖరుడు తన కుమార్తె కెట్లైన ఆ సంబంధము కుదర్చవలసినదిగా రాజును ప్రార్థించును.[12] రాజన్ని ఏర్పాట్లును చేయును. రాజశేఖరుడు, భార్య పరమానంద భరితులగుదురు. పెండ్లి పనులు చురుకుగా జరుగు చుండును. ఇంక రేపు రాత్రి పెండ్లి యనగా, ఎవ్వరో కూలివాడు రాజమహేంద్రవరము నుండి జాబుతెచ్చి సీత కిచ్చును.[13] ఆ సమయమున రాజశేఖరుడుగారు ఇంటిలో లేనందున మాణిక్యాంబయే ఆ కూలివానికి కూలి నిచ్చి ఉత్తరమును తీసికొనును. కూలివాడు వెడలిపోవుచు, తన చేతికఱ్ఱ నట దిగబెట్టిపోవును. సీత యా కఱ్ఱను పడకగదిలో పెట్టును. తరువాత కొంతసేపటికి రాజశేఖరుడు వచ్చి జాబు చూచి, రాజమహేంద్రవరములోని తన బంధువు చనిపోయెనని చెప్పును. అందరు దుఃఖింతురు. రాజశేఖరునకు మైలయగుటచే వివాహ మాగిపోవును. తరువాత కొన్నిదినములకు, రాజమహేంద్రములో చనిపోయినాడని రాజశేఖరుడుగా రనుకొనుచున్న బంధువు ఆయనకు సంతలో కనబడగా; వివాహమును ఆపుచేయుటకై ఎవరో దుర్మార్గులు పన్నిన కుతంత్రమిది యని రాజశేఖరుడుగారు తలంతురు. ఆయన ఇంటికివచ్చి విషయమంతయు భార్యకు చెప్పగా, వా రా కూలివా డెవరా యని వితర్కింతురు. ఇంతలో

---

(12) 'ప్రిమ్‌రోజ్' కుటుంబముతో ఆతని కూతుళ్ళు కలసియున్నచో తన ఆటలు సాగవని, వారి నెట్లులైన లండను తీసికొనిపోవలెనని 'థారన్ హిల్' ఊహించి, లండను నుండి యిరువురు స్త్రీలను రప్పించును. వారితో ప్రిమ్‌రోజ్ భార్యకు, కూతుళ్ళకు పరిచయము చేయును. ఆ పరిచయము నాటినుండి 'ప్రిమ్‌రోజ్' భార్యయు, కూతుళ్ళును లండనుకుపోవు నుత్సాహముతో నుందురు. అంతయు సిద్ధమగును.

(13) లండను పోయినచో ఆ బాలికలు చెడిపోవుదురని ఎంచి, 'బర్చెల్' లండనులోని స్త్రీలకు లేఖ వ్రాసి వీరి ప్రయాణము నాపివేయును.

కూలివాడు దిగవిడచిపోయిన కట్టుసంగతి జ్ఞప్తికి వచ్చి సీత దానిని తండ్రికి చూపును. అతడు దానిని రామరాజు కత్తికట్టుగా గుర్తించి, రామరాజు చేసిన ద్రోహమునకు మిక్కిలి విచారించును.[14] ఇంతలో రామరాజచ్చటకు వచ్చును. రాగానే, రాజశేఖరుడు కోపముతో నాతనిని తూలనాడి, తన గుమ్మము త్రొక్కవలదనును. రామరాజు వెడలిపోవును.[15] తరువాత చావు బ్రతుకులలో నున్న సిద్ధాంతి వలన రాజశేఖరునకు వరుని చెడ్డతనము తెలియును. అతడు ధనవంతుడు కాడనియు, శోభనాద్రిరాజునకు ముండలను తార్చువాడనియు, సిద్ధాంతి చెప్పగనే రాజశేఖరునకు కోపమును, రామరాజును దూషించినందులకు పశ్చాత్తాపమును గలుగును.[16] వెంటనే రాజశేఖరుడు కోపముతో పోయి శోభ నాద్రిరాజును తూలనాడును. అంతనారాజు, రాజశేఖరుడు కుమార్తె వివాహ మునకై తనవద్ద పుచ్చుకొన్న రూపాయల నిచ్చిపొమ్మని బలవంతము చేయును. నిర్ధనుడైన రాజశేఖరు డీయలేకుండుటచే, శోభనాద్రిరాజు అయనను చెరలో బెట్టించును.[17] మాణిక్యాంబ చేయునదిలేక దుఃఖించుచుండును. ఇది జరిగిన కొలదినాళ్లకు సీత నెవరో ఎత్తుకొనిపోవుదురు.[18] మాణిక్యాంబ దుఃఖము ఇనుమడించును.

ఉద్యోగమును సంపాదించుకొని పొట్టపోసికొనవలె ననుకొని బయలు దేరిన సుబ్రహ్మణ్యము, పీఠికాపురాధీశ్వరుడయిన విజయరామరాజుగారి యొద్ద ఉద్యోగమును సంపాదించెను.[19] నాటినుండియు తోడిఉద్యోగుల కందరకును తలలోపలి నాలుకవలె, సాయము చేయుచు సుబ్రహ్మణ్యము గౌరవముగ నుండును. ఇంతలో నీలాద్రిరాజనునాత డొక డీతనితో స్నేహము చేయును. స్నేహముచేసి యాతనివలన రాజుగారి కోటయొక్క పటమును వ్రాయించి

(14) 'ప్రిమ్‌రోజ్' కుటుంబములోనివారికి 'బర్చెల్' చేతిపెట్టెయు, అందాతడు లండను లోని స్త్రీలకు వ్రాసిన లేఖయు కనబడును. అతడు చేసిన ద్రోహమున కంద రాశ్చర్య పడుదురు.

(15) 'బర్చెల్' ను 'ప్రిమ్‌రోజ్' తూలనాడును. అతడు వెడలిపోవును.

(16) 'థారన్‌హిల్' చే మోసముచేయబడిన 'ఒలీవియా' తన తండ్రితో, 'బర్చెల్' యొక్క మంచితనమును గూర్చి చెప్పగా, 'ప్రిమ్‌రోజ్' తా నాతనని దూషించినందులకు పశ్చాత్తాపపడును.

(17) 'థారన్‌హిల్' కోపముతో 'ప్రిమ్‌రోజ్' ను చెరలో పెట్టించును.

(18) 'సోఫియా' ను దుర్మార్గు లెవరో ఎత్తుకొనిపోవుదురు.

(19) 'జార్జి' యొక్క ఉద్యోగ ప్రయత్నములు.

పుచ్చుకొనును. తరువాత కొంతకాలమునకు రాజుగారి కోటలో దొంగలు పడి ధనమునుదోచుకొందురు. రాజకీయోద్యోగులలో కొందరాపనిని సుబ్రహ్మణ్యమే చేసెననియు, తా మంజనము వేయించి ఆ విషయమును గ్రహించితిమనియు ప్రచారముచేయ మొదలిడుదురు. సుబ్రహ్మణ్యము తనమీదకు నింద ఇట్లురాగా, బాగుగా నాలోచించి ఈ పని నీలాద్రిరాజే చేసియుండునని నిర్ణయించుకొనును. వెంటనే మరునాడు రాజదర్శనమునకు పోయి, తనతో పదుగురు భటులను పంపినచో ధనమును తెచ్చి యిచ్చెదనని చెప్పును. రా జాతని మాటలయందు నమ్మకముంచి భటులను పంపును. ఆతడా భటులతో నీలాద్రి రాజింటికిపోయి అక్కడ భూమిలో పాతిపెట్టబడిన రాజుగారి ధనమును త్రవ్వి తీయించి రాజుగారి కప్పగించును. నీలాద్రిరాజింటిలో, మున్ను తమ ఇంటినుండి బైరాగి ఎత్తుకొని పోయిన ధనము, నగలుకూడ కనబడును. పిఠాపురము రాజు, తాను పెద్దాపురము రాజునకు సామంతుడు గనుక, నీలాద్రిరాజును భటులతోను, సుబ్రహ్మణ్యముతోను పెద్దాపురము రాజయిన కృష్ణజగపతి మహారాజుకడకు పంపును.

రాజశేఖరుని రెండవకుమార్తె యయిన సీత నెత్తుకొని పోయినవారు, జగ్గమపేట దారిని పోవుచు ఆయూరి గ్రామకరణము యొక్క ఇంటివద్దనాగి, ఆమెకన్నము పెట్టించుటకు యత్నింతురు. ఈ సమయమున సీత గోలచేయగా, ఆ దారిని పోవుచున్న రామరాజామెను రక్షించును.[20] ఆ కరణముగారి ఇంట నున్న సుబ్బరాయడను కుఱ్ఱవాడు, తాను రాజశేఖరు నెరుంగుదునని చెప్పి సీతా రామరాజులతోకలిసి భీమవరమునకు బయలు దేరును. రామరాజు వారి నాయూరిలో దింపి తాను వెడలిపోవును. సీత తన తల్లిని కలిసి కొనును. సుబ్బరాయడు, ఎప్పుడో చనిపోయిన రుక్మిణి యని గుర్తించి, మాణిక్యాంబ సంతోషించును.

చెరలోనున్న రాజశేఖరుడుగారికి మంచిరాజు పాపయ్యా యను వానితో పరిచయ మగును. ఆ పాపయ్యా తన జీవిత చరిత్రను చెప్పుచు, సీతనీయవలె ననుకొన్న మంచిరాజు పద్మరాజు తన కుమారుడనియు, తానే బైరాగి వేష మున మార్గమధ్యమున రాజశేఖరుని మోసము చేసితిననియు పలుకును. తమకు నాయకుడు శోభనాద్రి రాజనియు చెప్పును. అట్లు చెప్పి తాను పూర్వము రాజశేఖరున కపాయము కలుగున ట్లపకారములు చాల చేసినందులకు పశ్చాత్తాప పడుచున్నట్లును, తానిప్పు డాయన కొక యుపకారము చేయ నెంచు

(20) 'బర్చెల్' దుర్మార్గుల బారి నుండి 'సోఫియా' ను రక్షించును.

చున్నట్లును చెప్పి; ఆయనను పెద్దాపురము రాజయిన కృష్ణజగపతికి విజ్ఞాపన పత్రిక వ్రాయునట్లు ప్రోత్సహించును.[21] కాని, దానికి వెంటనే రాజుగారి యొద్దనుండి జాబు రాకుండుటచే, రాజశేఖరుడు, రాజబంధువు మీద చేసిన ఫిర్యాదు గనుక బదులు రాదని నిస్పృహ వహించును.

ఇంతలో కృష్ణజగపతిరాజుగారు చెరసాలలోనికి వచ్చి బంధితులలో నొకరు పెట్టుకొనిన అర్జీని విచారింతురను మాట బయలుదేరును. అటులనే ఆయన ఒకనాడు చెరసాలలో సభతీర్చి, రాజశేఖరుని పిలిపించి అన్నియు వినును.[22] రాజశేఖరునకు, రామరాజే కృష్ణజగపతియని అప్పుడు తెలిసి, తన్ను క్షమింపుడని వేడుకొనును. కృష్ణ జగపతి ఆయనను చెర నుండ విడిపించును. శోభనాద్రి రాజునకు శిక్ష విధింతురు. రాజశేఖరుడు తన కుటుంబమును కలిసికొని రామరాజే పెద్దాపురము రాజని చెప్పును.[23] తరువాత రుక్మిణి తన చరిత్ర నంతను చెప్పును. తనకు తలపై దెబ్బతగిలినప్పుడు తాను చనిపోలేదనియు; తనను వారందర రరణ్యమున చనిపోయెనని విడిచిపోగా, కొంతసేపటికి తెలివి వచ్చి మెల్లగా నింకొక గ్రామము చేరినట్లును, అట పురుష వేషమును ధరించి సుబ్బరాయడను పేర కరణముగారింట నున్నట్లును రుక్మిణి చెప్పును. అందరును మరల కలిసికొనినందులకు సంతోషింతురు.[24]

కొంతకాలము తరువాత రాజశేఖరుని మేనల్లుడును, దామోదరయ్య కొడుకును నయిన శంకరయ్య వచ్చి వారిని కలిసికొనును. అతడు తన తండ్రి చనిపోయినట్లును, తానింక నా గ్రామములో నుండరాదని వచ్చివేసినట్లును చెప్పి, పోయినదనుకొన్న రుక్మిణి కాసులపేరును రాజశేఖరునకిచ్చును. తరువాత

---

(21) 'జెన్‌కిన్‌సన్', జైలులోనున్న 'ప్రిమ్‌రోజ్' దురవస్థకు జాలిపడి, 'థారన్‌హిల్' యొక్క బంధువైన 'సర్‌విలియమ్ థారన్‌హిల్' న కొక వినతి పత్రమును వ్రాయుడని 'ప్రిమ్‌రోజ్' ను ప్రోత్సహించును.

(22) చెరసాలలో 'సర్‌విలియమ్ థారన్‌హిల్' కొలువుతీర్చి 'ప్రిమ్‌రోజ్' యొక్క అర్జీని విచారించును.

(23) 'ప్రిమ్‌రోజ్' నకు, ఆతని కుటుంబమువారికి 'బర్చెల్' సామాన్యుడు కాడనియు, 'సర్‌విలియమ్ థారన్‌హిల్' అనియు తెలియును. అందరు నాతనిని క్షమింపుడని ప్రార్థింతురు.

(24) 'ఒలీవియా' చనిపోలేదని తెలిసి 'ప్రిమ్‌రోజ్' సంతోషించును. 'జార్జి' కూడ చెర నుండి విముక్తుడగును.

రాజశేఖరుడు గారి కన్నియయు శుభపరంపరలే.[25] కాశీలో చనిపోయినాడను కొన్న నృసింహస్వామి తిరిగివచ్చి రుక్మిణిని సంతోషపెట్టును. సుబ్రహ్మణ్యము భటులతో నీలాద్రిరాజును పెద్దాపురము పంపి, తాను భీమవరము వచ్చి తన కుటుంబమును బంధువులను జూచి పరమానందభరితుడగును.

తరువాత కృష్ణ జగపతిరాజుగారు పెద్దాపురములో పెద్ద సభ చేసి, ఆ సభలో నీలాద్రిరాజును విచారించుటకు పూనుకొనిరి.[26] నీలాద్రిరాజు తన జీవిత చరిత్రమును పూసగ్రుచ్చినట్లు వివరించును. బైరాగి వేషమున రాజశేఖరుడు గారిని మోసముచేసి, ధనమును నగలను కాజేసినది తానే యనియు, రాజుగారి ధనాగారమును దోచినదియు తానే యనియు చెప్పును. కృష్ణజగపతి, ఆతడు పశ్చాత్తాపపడినందులకు తక్కువ శిక్ష వేయును. పిదప రాజశేఖరుడుగారి మాన్యములను విడిపించిఇత్తురు. రాజశేఖరుడుగారు సీతను శంకరయ్యకిచ్చి వివాహము చేయుదురు. సుబ్రహ్మణ్యమునకు కరణముగారి కూతు నిచ్చి వివాహము చేయుదురు. రుక్మిణీనృసింహస్వాములు సుఖముగనుందురు[27] రాజశేఖరుడుగారు లోకజ్ఞానముతో సుఖముగ నుందురు.

పైని వివరింపబడినట్లు, రెండు నవలలలోని ముఖ్యఘట్టములను ఒకచో చేర్చి పరిశీలించినచో, దేహబంధమున (Structure) వీనికి గల పోలికలు తెల్లమగును. ప్రాచ్య పాశ్చాత్య సంఘజీవితమునందు గల భేదములనుబట్టి తెలుగు నవల రచయిత, కథాశరీరమున కొన్ని మార్పులను చేసెను. ఈ మార్పులవలన, ఆయాభాగములలో రెండు నవలలకు పోలికలు తగ్గిపోయినను, ఈ మార్పుల వలన సిద్ధించిన ఫలితములలో రెండు నవలలకును భేదము కన్న సామ్యమే అధికము. వీనిని కొంత పరిశీలింపవలసి యున్నది. ఇట్టి మార్పులను చేయుటకు గల కారణములు, ముఖ్యమైనవి రెండు. భిన్న సంస్కృతులకు చెందిన నవలలగుటవలన, మార్పులు చేయవలసి వచ్చుటను, మొదటి కారణముగ పేర్కొన వచ్చును. వీరేశలింగం పంతులుగారు, "మనలోఁ గల మూఢవిశ్వాసములను

(25) 'ప్రిమ్‌రోజ్' ధనము నపహరించి పారిపోయిన వర్తకుడు పట్టుబడుటచే ఆతనికి మరల ధనము వచ్చును.

(26) 'జెన్‌కిన్‌సన్' జీవిత చరిత్ర.

(27) 'ఒలీవియా' ను 'థారన్‌హిల్' న్యాయసమ్మతముగనే వివాహమాడినట్లు తేలును. 'సోఫియా' ను 'సర్‌విలియమ్ థారన్‌హిల్' వివాహమాడును. 'జార్జి' తాను ప్రేమించిన 'మిస్ విల్మాంట్' ను వివాహమాడును.

పోఁగొట్టవలెనన్న ముఖ్యోద్దేశముతో" దీనిని వ్రాయుటచే, ఆంగ్లమూలములో లేని ఆచార వ్యవహారాదుల వర్ణనలు మొదలుగ కొన్ని దీనియందు చేర్చుట రెండవ కారణము. ఈ రెండు కారణములవలన, ఆంగ్లమూలమునకు తెలుగు నవలకు భేదములు చాల నున్నట్లు కన్పట్టును గాని, సూక్ష్మముగ చూచిన వీనిలో వైషమ్యముకంటె సామ్యమే అధికముగ నున్నట్లు తోపకమానదు.

రెండు కథలలోను నాయకుడు ధర్మబుద్ధి కలవాడు. విధివశంబున దరిద్రుడై కష్టముల ననుభవించినవాడు కాని, కష్టములు రావలసినవాడు కాడు. దరిద్రుడైన తరువాత ఉన్న ఊరిలో పొట్టపోసికొనలేక, గ్రామాంతరము పోవలసినవా డయ్యెను. అట, అధికారములోనున్న వారితో పొసగనందున చిక్కులకు లోనగుట, రెండింటి యందును సమానమే. రెండింటిలోను; మారు వేషములో నుండి, నాయకుని కుటుంబముతో మిక్కిలి స్నేహముగనున్న మహాప్రభువుచేతనే—సర్వనాశనము కాకుండ—నాయకుడు రక్షింపబడుట సమానమే. నాయకుని పెద్దకుమారుడు, నాయకుడు దరిద్రుడగుటతోడనే, తన పొట్టతాను పోసికొనుటకై పోవు సన్నివేశము, రెండింటను గలదు. నాయకుని కుమార్తెలిద్దరు కష్టముల పొందుటయు, చివరకు మహాప్రభువుయొక్క కరుణ వలన రక్షింపబడుటయు, రెండు నవలల యందును సమానమే. నాయకుని కుటుంబమును కష్టములపాలు చేసినవాడు; నాయకుని రక్షించిన, మారువేష ములో నున్న మహాప్రభువునకు, బంధువగుట రెండింటను సమానము. రెండు నవలలలోను, ప్రధానమైన సన్నివేశము కథాంతమున జైలులో జరుగుట ముఖ్యముగా గమనింపవలసిన విషయము. ఇట, ఆంగ్లనవలలో వలెనే ఆంధ్ర నవలయందును, మహాప్రభు వొకరు కొలువుదీర్చి దుష్టశిక్షణము, శిష్టరక్షణము చేయును. మహాప్రభువే మారువేషములో నుండి తమతో సంచరించుచు తమ గుణగణాదులను లెక్కించుచుండెనని, ఆంగ్లాంధ్ర నవలలోని నాయకు లెరుంగరు. జైలులోనున్న కథానాయకుడందే బంధింప బడిన ఇంకొక బంధి తుని సలహా ననుసరించి, మహాప్రభువునకు లేఖ వ్రాయుటయు, రెంటను సమానమే. ఆ బంధితుడే; కథానాయకుడు, తన్ను బాధించిన రాజబంధువుపై తెచ్చిన యభియోగము, రుజువగుటకు సాయపడుటయు, రెండు నవలల యందును కలదు. రెండు నవలలయందును; మారువేసములో నుండి తమకు సాయమగుచు వచ్చిన మహాప్రభువును; కథానాయకులు గుర్తింపక, తూలనాడి పంపుట కలదు. ఇట, పేర్కొనబడినవి రెండు నవలలకు గల ముఖ్య సామ్య

ములు. ఇవియే కథాశరీరమునకు సౌందర్యము తెచ్చినవి. కనుకనే వీనికి ప్రాముఖ్య మధికము.

ఇంక, వైషమ్యములలో ముఖ్యమైన వానిని పేర్కొనుచు, వాని కారణములను నిరూపించుచున్నాను. ఆంగ్లనవలలో, కథానాయకుని పెద్ద కూతురును వివాహమాడుదునని నమ్మించి మోసముచేసినవాడు, కథానాయకునిపై అధికారము కలవాడు. మొదటినుండియు మారువేషములో నుండి, కథానాయకుని తుదకు రక్షించి, ఆతని రెండవ కుమార్తెను వివాహమాడిన వాడు మహాప్రభువు. ఈ కల్పనను యథాతథముగ తెలుగునవలలో నుంచుటకు వీలులేక పోయినది. తెలుగు నవలలోని కథానాయకుడు బ్రాహ్మణుడు. ఆతనిని రక్షించినవాడు క్షత్రియుడు. క్షత్రియుడు బ్రాహ్మణుని కుమార్తెను వివాహ మాడుట సంప్రదాయ విరుద్ధమైనది గనుక, పంతులుగారు కథలో కొన్ని మార్పులను చేసిరి. హిందూ సంప్రదాయము ననుసరించి బ్రాహ్మణులలో బాల్యవివాహము లున్నవి గనుక, ఆ బాలికలు—ఆంగ్ల నవలలోని వారివలె—యుక్తవయస్సు వచ్చినవారు కారు గనుక; అట్టి వివాహము జరుగకుండ ఆపవలెనన్న క్రొత్తకల్పన చేయవలెను. కథానాయకునకు 'మైల' వచ్చుటచే వివాహ మాగిపోవును గనుక పంతులుగారట్లు కల్పించిరి. కథానాయకుని మొదటి కుమార్తెను, ఆతనిని బాధించుచువచ్చిన రాజబంధువే లేవతీసికొని పోయినట్లు ఆంగ్ల నవలలో కలదు. ఇట్టిదికూడ వర్ణభేదములు గల హిందూ సంఘమున పొసగదు గనుక; పంతులుగారు తెలుగు నవలలోని కథానాయకుని పెద్ద కూతురున కంతకు పూర్వమే వివాహమైనట్లును, భర్త చనిపోయినాడని వారందరు తలంచుచున్నట్లును, తుట్టతుద కామె దొంగలవలన దెబ్బతిని యడవిలో పడిపోగా నామె మరణించిన ట్లెంచి వారందరును ఆమెను విడిచి వెడలిపోయినట్లును కల్పించిరి. ఇట్టి చిన్ని చిన్ని మార్పులకు కారణములు; ప్రాచ్య పాశ్చాత్య సంఘములలో గల భేదములును, హిందూ సంఘమును విమర్శించు సన్నివేశములను కల్పింపవలయునను పంతులుగారి యభినివేశమును; అని ముందే వ్రాసితిని గదా!

ఆంగ్ల నవలలోని కథానాయకుడైన 'డాక్టరు ప్రిమ్‌రోజ్' ను 'రాజశేఖర చరిత్రము' లోని 'రాజశేఖరుడు గారు' చాలవరకు పోలుదురు. ఆయన కుమారుడైన 'సుబ్రహ్మణ్యము' ఆంగ్లనవలలోని 'జార్జి' ని పోలును. ఆంగ్ల నవలలో ప్రిమ్‌రోజ్' నకు సాహాయ్యము చేసిన 'బర్చెల్' (**Mr. Burchell**) ను, తెలుగు

నవలలోని 'రామరాజు' పోలును. పోలుటయే కాదు, 'బర్చెల్' పాత్రను మనస్సులో నుంచుకొనియే పంతులుగారు రామరాజు పాత్రను సృష్టించినారని దృఢముగ చెప్పవచ్చును. 'బర్చెల్' మారువేషములో నున్న 'సర్ విలియమ్ థారన్‌హిల్' (Sir William Thornhill) అను ప్రభువు. మారువేషములో నున్న పెద్దాపురము మహారాజైన కృష్ణజగపతియే రామరాజు. ఆంగ్ల నవల యందు ప్రారంభము నుండి తుదివరకు 'బర్చెల్' ఎట్లు 'ప్రిమ్‌రోజ్' ను ఆతని కుటుంబమును, రక్షించునో అట్లే తెలుగు నవలలో రామరాజు, మొదటి నుండి చివరవరకు రాజశేఖరుని, ఆతని కుటుంబమును రక్షించును. ఆంగ్ల నవలలోని 'బర్చెల్'నకు చేతికట్టె ఎట్లుకలదో, తెలుగునవలలోని రామరాజునకు కత్తికట్టె కలదు. 'థారన్‌హిల్' ప్రోత్సాహమున 'ప్రిమ్‌రోజ్' కుమార్తెలు లండనుపోయి చెడిపోవుదురను భయమున రహస్యలేఖ వ్రాసి, వారినెట్లు 'బర్చెల్' రక్షించెనో; శోభనాద్రిరాజు ప్రోత్సాహమున తన రెండవ కుమార్తెయైన సీతను, రాజశేఖరుడుగారు పద్మరాజను భ్రష్టున కిచ్చి పెండ్లిచేయ నెంచగా, రామరాజు మారువేషమున—రాజశేఖరుడుగారికి మైలవచ్చినట్లున్న—లేఖను సృష్టించి తెచ్చి, ఆ వివాహము నాపెను. దీనివలన, అట నాంగ్లనవలలో 'బర్చెల్'నకు తిట్టులు వచ్చినట్లే; ఇట తెలుగునవలలో 'రామరాజు'నకు తిట్టులు వచ్చెను. 'ప్రిమ్‌రోజ్' రెండవ కుమార్తెయైన 'సోఫియా'ను దుర్మార్గు లెత్తుకొని పోవుచుండగా, 'బర్చెల్' వారి బారినుండి ఆమెను రక్షించును. తెలుగు నవలలో 'సీత'ను, 'పద్మరాజు' యొక్క భటులెత్తుకొని పోవుచుండగా, రామరాజామెను రక్షించి యామె కుటుంబమున కప్పగించును. కథాంతమున, దుష్టులను శిక్షించి రాజశేఖరుడుగారిని 'కృష్ణజగపతి'యైన రామరాజు రక్షించి నట్లే; ఆంగ్లనవలలో 'సర్ విలియమ్ థారన్ హిల్' దుష్టులను శిక్షించి 'ప్రిమ్ రోజ్'ను రక్షించును. అది యాంగ్లసంఘము గనుక, 'సర్ విలియమ్' తాను ప్రేమించిన 'సోఫియా' యను 'ప్రిమ్‌రోజ్' కుమార్తెను వివాహ మాడెను. తెలుగునవలలో వర్ణభేదమునుబట్టి, రాజశేఖరుడుగారి కుమార్తె మేనల్లున కీయబడినది. ఇట్లు, రామరాజు పాత్రకును, ఆంగ్లనవలలోని 'బర్చెల్' పాత్ర కును కల్పనలో సన్నిహిత సంబంధము కలదు.

ఆంగ్లనవలలో 'ప్రిమ్‌రోజ్'ను సమస్తవిధముల బాధించిన 'స్క్వైర్ థారన్‌హిల్' (Squire Thornhill) తెలుగునవలలో, శోభనాద్రి రాజయ్యెను. 'థారన్‌హిల్' ఆంగ్లనవలలో 'సర్ విలియమ్'నకు బంధువైనట్లే, తెలుగు

నవలలో శోభనాద్రిరాజు, రామరాజు వేషమున మెలగిన కృష్ణజగపతికి బంధువు. ఆంగ్లసంఘములో వర్ణభేదము లేదు గనుక, 'ప్రిమ్‌రోజ్' పెద్ద కుమార్తెను, 'స్క్వైర్ థారన్‌హిల్' లేవదీసికొనిపోయి వివాహమాడినట్లు, ఆంగ్లనవలలో కలదు. హిందూసంఘమున వర్ణభేదము కలదు గనుక, 'స్క్వైర్ థారన్‌హిల్'ను పోలిన శోభనాద్రిరాజు, రాజశేఖరుడుగారి కుమార్తెను వివాహమాడుటకు వీలులేదు గనుక; పంతులుగారు నూతన కల్పన చేసిరి. శోభనాద్రిరాజు తన భృత్యుడైన పద్మరాజున కామెనిచ్చి వివాహము చేయ సంకల్పించి, రాజశేఖరుని ఒప్పించును. ఇదియే ఆ కల్పన. ఆంగ్లనవలలో, 'బర్చెల్' తన మిత్రుడైన 'ప్రిమ్‌రోజ్' కుమార్తెలను రక్షించినట్లే; తెలుగు నవలలో 'రామరాజు' తన కాపుడైన రాజశేఖరుడుగారి కుమార్తెలను రక్షించును.

ఆంగ్లనవలలో; 'ప్రిమ్‌రోజ్'తో బాటు జైలులోనున్న 'జెన్‌కిన్‌సన్', ఆతని దుర్దశనుజూచి జాలివహించి, ఆతనికి—సమస్త విషయములును, 'సర్ విలియమ్ థారన్‌హిల్' నకు లేఖా మూలమున తెలియజేయ వలసినదని— సలహా ఇచ్చును. ఆ సందర్భములోని వాక్యము లివి.

"......though you refuse to submit to the nephew, I hope you have no objections to laying your case before the uncle, who has the first character in the kingdom for everything that is just and good. I would advise you to send him a letter by the post, intimating all his nephew's ill-usage, and my life for it, in three days you shall have an answer."[14]

తెలుగు నవలలో సరిగానట్లే, రాజశేఖరుడు గారితో జైలులో నున్న పాపయ్యా సలహా నిచ్చును. ఆ సందర్భములోని వాక్యము లివి.

"......నేను మీకు పూర్వము గొప్ప యపకారము చేసితిని; దానికి మాఱుగా నిప్పుడుపకారము నొకదానిని చేసెదను. పెద్దాపురపు రాజుగారు బహుయోగ్యులు; శోభనాద్రిరాజు మిమ్మిట్లు నిర్బంధ పెట్టుచున్న సంగతి మనవి వ్రాసికొన్న యెడల మిమ్ము తక్షణమే విడుదలచేయుదురు. కాగితము మొదలయినవి నేను తెప్పించి యిచ్చెదను."[15]

ఆంగ్ల నవలలోని 'జెన్‌కిన్‌సన్' పాత్రకును, తెలుగు నవలలోని నీలాద్రి రాజు పాత్రకును చాల పోలికలు గలవు. ఇరువురు దొంగలే. ఇరువురు కథా

---

14. The Vicar of Wakefield. Chapter - XXVIII.
15. రాజశేఖరచరిత్రము. *1935*. పుట - 183, 184.

నాయకులను (ప్రిమ్‌రోజ్ - రాజశేఖరుడు) మోసగించినవారే. ఆంగ్లనవలలో 'ప్రిమ్‌రోజ్' ను అతని కుమారుడైన 'మోసెస్'ను మోసగించినట్టి 'జెన్‌కిన్‌సన్' వలెనే; తెలుగు నవలలో నీలాద్రిరాజు, రాజశేఖరుడుగారిని, ఆయన కుమారుడైన సుబ్రహ్మణ్యమును మోసగించును. రెండు నవలలలోని దొంగల (జెన్‌కిన్‌సన్ - నీలాద్రిరాజు) జీవిత చరిత్రలలోను చాల పోలికలు గలవు. శ్రీ పంతులు గారు, ఆంగ్ల నవలలోని 'జెన్‌కిన్‌సన్' పాత్ర ననుసరించి, నీలాద్రిరాజు పాత్రను చిత్రించిరని చెప్పవచ్చును. 'జెన్‌కిన్‌సన్' తన జీవిత చరిత్రను చెప్పు సందర్భమున ఆంగ్ల నవలలో ఇట్లు పలుకును.

*ఆంగ్లము* : "Ah! Sir, had I but bestowed half the pains in learning a trade that I have in learning to be a scoundrel, I might have been a rich man at this day."[16]

నీలాద్రిరాజు తన జీవిత చరిత్రను చెప్పు సందర్భమున నించుమించుగా ఈ మాటలనే వాడును.

*తెలుగు* : "నేను మోసములను నేర్చుకొనుటలో నిచ్చిన శ్రద్ధలో సగమైనను ఏదోయొక వృత్తిని నేర్చుకొనుటలో నిచ్చియుంటినేని, నేనీపాటికి యెంతో భాగ్యవంతుడనై యుందును."[17]

*ఆంగ్లము* : "Thus I was at last obliged to turn sharper in my own defence, and have lived ever since, my head throbbing with schemes to deceive, and my heart palpitating with fears of detection."[18]

*తెలుగు* : "...కలలో సహితము నేను జేసిన ఘోరకృత్యములకు రాజభటులు నన్నుఁ గొనిపోయి శిక్షించుచున్నట్టు కనఁబడి యులికిపడుచుందును."[19]

*ఆంగ్లము* : "......yet still the honest man went forward without suspicion, and grew rich, while I still continued tricksy and cunning, and was poor, without the consolation of being honest."[20]

---

16. The Vicar of Wakefield. Chapter - XXV.
17. రాజశేఖరచరిత్రము. 1935. పుట - 216.
18. The Vicar of Wakefield. Chapter - XXVI.
19. రాజశేఖరచరిత్రము. 1935. పుట - 214.
20. The Vicar of Wakefield. Chapter - XXVI.

తెలుగు : "......అది యేమి మాయయో కాని నే నెన్నివిధముల మోసము చేసి ధనము సంపాదించుకొనుచున్నను బీదవాఁడనుగాను, అతడు ధనవంతుఁడు గాను ఉంటిమి." [21]

పై నుదాహరింపబడిన వాక్యములను బట్టి వీరేశలింగం పంతులుగారు తమ నవలలో నీలాద్రిరాజు పాత్రను సృష్టించుటకు ; ఆంగ్ల నవలలోని 'జెన్‌కిన్‌సన్' పాత్ర నెంతవర కుపయోగించుకొనిరో తెలియగలదు.

ఇదిగాక, తెలుగు నవలలోని కథానాయకుడైన రాజశేఖరుడు క్రమ క్రమముగ దరిద్రుడగుచు వచ్చును. ఈ సందర్భమున మొట్టమొదట నాయన కుమార్తె యయిన రుక్మిణి యొక్క కాసులపేరు పోవుటయు, తరువాత వారి వస్తువులన్నియు స్వర్ణయోగము తెలియునని నటించిన బైరాగివశ మగుటయు నను రెండు సన్నివేశములు కల్పింపబడినవి. ఆంగ్ల నవలలో గూడ రెండు సన్నివేశములే కల్పింపబడినవి. మొట్టమొదట 'మోసెస్' మోసముచేయబడుట, తరువాత 'ప్రిమ్‌రోజ్' మోసము చేయబడుట ; అనునవి ఆ సన్నివేశములు. సన్నివేశములలోని విషయ వైవిధ్యమునకు కారణము ఆంధ్రాంగ్ల నవలల సాంఘిక వాతావరణములో భేదముండుటయే.

ఈ రెండు నవలల నిట్లు పరిశీలించిన తరువాత పంతులుగారు 'రాజశేఖర చరిత్రము' పీఠికలో వ్రాసినట్లు "కథను గల్పించుటలో గోల్డు స్మిత్తను నింగ్లీషు కవీశ్వరుని గ్రంథ సాహాయ్యమును గొంత" పొందినట్లే తెలియును. ఇంకను సూక్ష్మముగా పరిశీలించినచో, ఆ సాహాయ్యము సామాన్యమైనది కాదని కూడ తెలియును.

కథ :

ఆంగ్లసాహిత్య ప్రభావమున శ్రీ వీరేశలింగం పంతులుగారు వ్రాసిన పుస్తకములలో 'సత్యరాజ పూర్వదేశ యాత్రలు' అనునది యొకటి. దీని రచననుగూర్చి పంతులుగారు తమ స్వీయచరిత్రములో నిట్లు వ్రాసిరి.

"1891-వ సంవత్సరమునందు స్త్రీల విషయమున మనవారు చేసిన యన్యాయములు తేటపడునట్లుగా వ్యాజరీతిని సత్యరాజ పూర్వదేశ యాత్రల యొక్క ప్రథమభాగమును రచించి ప్రకటించితిని. నే నింగ్లీషున 'గల్లీవర్సు ట్రావెల్సు' (**Gulliver's Travels**) చదివినప్పుడు వ్యాజరూపమున మనలోని

**21.** రాజశేఖరచరిత్రము. **1935.** పుట - **217.**

23

దురాచారములను మూఢవిశ్వాసములను పరోక్షముగాఁ బ్రదర్శించునట్టి పుస్తకమును నాలుగు భాగములుగాఁ జేయవలెనని బుద్ధిపుట్టి మొదట నీ భాగమును జేసితిని."[22]

ఆంగ్లములో 'జొనాథన్ స్విఫ్ట్' (Jonathan Swift) అను రచయిత (1667-1745) 'గలివర్సు ట్రావెల్సు' అను గ్రంథమును వ్రాసెను. (1726) ఆకాలమునాటి ఆంగ్ల రాజకీయములలో ముణిగి తేలిన వ్యక్తి 'స్విఫ్ట్' తనకు సమకాలికమైన ఇంగ్లండులోని దౌర్జన్యములను, సంఘములోని అవినీతిని, మూఢవిశ్వాసములను, ప్రభువుల నిరంకుశత్వమును, అవహేళనము చేయుచు 'గలివర్సు ట్రావెల్సు' వ్రాసెను. ఆనా డింగ్లండులో 'విగ్గు' (Whigs) లకును, 'టోరీ' (Tories) లకును రాజకీయసమరము జరుగుచుండెను. ఈ యుద్ధములో న్యాయమును ధర్మమును విసర్జించి, రాజకీయ నాయకులు స్వలాభాపేక్షచే సమస్త దుర్మార్గములు చేయుచు విజృంభించుచుండిరి. రచయితలు కూడ ధనాపేక్షచే రాజకీయపక్షముల కనువుగ వ్రాయుచు సత్యమును లెక్కచేయకుండిరి. ఇట్టి పరిస్థితులుగల ఇంగ్లండులో 'స్విఫ్ట్' కలము చేతబట్టెను.[23] కాలానుగుణముగ 'స్విఫ్ట్' కూడ రాజకీయపక్షములను మార్చుచు వచ్చినను, యావజ్జీవము నాతనికి స్వాతంత్ర్య మన్నను, ప్రజాస్వామ్య మన్నను, ఔదార్యగుణము లన్నను, అభిమాన మెక్కువ. నిరంకుశాధికార మన్న ఆతనికి ఏవగింపు. రాజకీయముగ పరిపాలనలోనున్న పక్ష మాతని కనుకూలముగ లేకున్నను, ప్రజలలో నాతనికి మంచి పలుకుబడి యుండెను. ఇట్టి పరిస్థితులలో నాతడు 'ట్రావెల్స్ ఆఫ్ లెమ్యుయల్ గలివర్' (Travels of Lemuel Gulliver) అనునట్టి 'అవహేళన రచన' (Satire) చేసెను. అతిరహస్యముగ నచ్చయిన ఈ గ్రంథమునకు అనతికాలములోనే ప్రఖ్యాతి వచ్చెను.

ఇది నాలుగు భాగములుగ వ్రాయబడినది. మొదటి భాగములో 'గలివరు' యొక్క 'లిల్లిపుట్' (Lilliput) యాత్ర వర్ణింపబడినది. ఈ దేశమునందు మనుష్యులు ఆరంగుళము లుందురు. కాని వారిలో కుట్రలు, అసూయలు, రాజకీయ కలహములు చాల కలవు. ఇవన్నియు—ఆరంగుళముల మనుష్యు

22. స్వీయచరిత్రము. 1915. పుట - ౧౮౩.

23. "It was in this time of private immorality, of political faithlessness, of large reward for well-done literary service, that Jonathan swift undertook to carve out for himself a career." (Introduction — Gulliver's Travels. 'Thomas Nelson & Sons' Edition.)

లలో 'గలివరు'న కర్థరహితముగ, హాస్యాస్పదముగ కన్పట్టును. నవ్వు పుట్టించును. నాటి ఇంగ్లీషు సంఘమున నిట్టి జీవితమే కలదు. మానవుడింత అల్పుడై నప్పు డిట్టివన్నియు నేలయని 'స్విఫ్ట్' అపహాస్యము చేయును.

గలివరుయొక్క రెండవ యాత్ర 'బ్రాబ్డింగునాగు' దేశమునకు (**Brobdingnag**). ఇచ్చట గలవారందరు నతి దీర్ఘకాయులు. ఈ దేశప్రభువు సమీపమున గలివరు, ఇంగ్లండులోని రాజకీయ సంస్థలను, నాయకులను, న్యాయధర్మములను—నమ్మటకు వీలులేనంతగా—పొగడును. కాని. ఆరాజు నిశితముగా ప్రశ్నింపగా, గలివరు తన దేశములోని చెడ్డతనము నొప్పుకొనును. ఇట్లు ఇంగ్లండులోని రాజకీయ పక్షములను, పరిపాలనా విధానమును, నిరంకుశులైన ప్రభువులు ప్రజలను పీడించుటయు 'స్విఫ్ట్' విమర్శించెను.

గలివరుయొక్క మూడవ యాత్ర అతనిని 'లపుట' (**Laputa**) అను ప్రాంతమునకు తీసికొని పోవును. అటనుండి తత్పరిసరములకు పోవును. అట, వాణిజ్య వ్యాపారములందును, తత్త్వజ్ఞాన విషయమున, మంత్రతంత్రముల విషయమున ప్రజలలో విపరీత భావములు వ్యాప్తిలో నుండెను. 'స్విఫ్ట్' తన కాలము నా ఁడింగ్లండులోని వారికి గల మూఢవిశ్వాసములను; దయ్యములు, పరలోకము మొదలగువాని విషయములోను, మాంత్రిక శక్తుల విషయమందును గల నమ్మకముల నిట హేళన చేసెను. నాటి ప్రజలలోని మూఢభావములను నిర్దాక్షిణ్యముగ విమర్శించెను.

'గలివరు' చివరియాత్ర మనుష్యులకు ప్రాముఖ్యములేని ప్రాంతమునకు. ఇట 'గుఱ్ఱము'నకు మనుష్యుడు బానిస. మానవత్వములేని ప్రభువులనిట 'స్విఫ్ట్' ఘోరముగ ప్రదర్శించెను.

ఇట్టి 'బృహదవహేళన గ్రంథము' వ్రాయుటకు ఆ కాల పరిస్థితులు, 'స్విఫ్ట్' యొక్క మనఃస్థితి కారణములు. ప్రపంచము 'స్విఫ్ట్'న కెట్లు కన్పట్టెనో ఒక విమర్శకుడిట్లు వ్రాసెను;

**"Looking out from his unwilling retirement, with a heart full of misery, upon world which had deceived and disappointed him, Swift saw only the dark side of human character and conduct. He saw no private virtue; no public honour or integrity; no wisdom; no genuine concern for the welfare of the State. He saw unfaithful spouses; unprincipled lawyers; incapable and venal judges; doctors ignorant and blundering, and ever ready to commit a crime in order to conceal a mistake; philosophers and projectors filled with**

**impracticable ideas; self-seeking politicians; unworthy aims, shameful successes; an oppressed people whose substance was wasted by their rulers; fraud and folly enthroned in all high places."[24]**

ఈ గ్రంథము ననుసరించి తెలుగులో 'సత్యరాజా పూర్వదేశ యాత్రలు' వ్రాసిన శ్రీ వీరేశలింగం పంతులుగారు. తన కాలమునాటి ఆంధ్ర సంఘమును నిశితముగ విమర్శింపవలెనను దృష్టితో దీనిని వ్రాసినట్లు స్వీయచరిత్రలో వారే చెప్పిరి. పంతులుగారికిని, అవహేళన రచనలు చేయుటయందు ప్రతిభ కలదు గనుకను; నాటి ఆంధ్ర సంఘములో 'స్విఫ్ట్' విమర్శించిన ఆంగ్ల సంఘములోని దురాచారములను బోలినవి కొన్ని గలవు గనుకను; తెలుగు గ్రంథమును మిక్కిలి ప్రచారమును పొందెను.

పంతులుగారు రచించిన 'సత్యరాజా పూర్వదేశ యాత్రల' యొక్క ప్రథమభాగము 'ఆడు మళయాళ' మను పేరున బాగుగా వ్యాప్తికి వచ్చినది. సంఘసంస్కరణ ప్రియులైన వీరేశలింగంపంతులుగారు మనదేశములో స్త్రీలకు జరుగుచువచ్చిన అన్యాయముల నెత్తిచూపి, సంఘములో వారి విషయమున సదభిప్రాయము గలిగింపవలెనను నుద్దేశముతో దీనిని వ్రాసిరి. 'స్విఫ్ట్' ఆంగ్లములో వ్రాసిన రచనాపద్ధతిని వా రవలంబించినారుగాని, 'గలివర్సు ట్రావెల్సు' లోని కథా సంవిధానమును వారెక్కువగా గ్రహింపలేదు. ఆడ మళయాళములో స్త్రీలకే సమస్త హక్కులనియు; పురుషులకే హక్కులు లేవనియు, అట్టిచో 'సత్యరాజు' వంటి పురుషు డొక్కడే యున్నచో నాత డెన్నిబాధలు పడవలెనో నిరూపించు వ్యాజమున; సమస్త హక్కులును గల పురుషులతో నిండిన మన సమాజమున స్త్రీ కెంత బాధయుండునో చూపుటకు యత్నించినారు పంతులుగారు. దీనికిని, ఆంగ్ల కథకును ఎట్టి సంబంధమును లేదు.

ఒక వ్యక్తి తన దేశములోని పరిస్థితులకు సరిగా విరుద్ధముగ నున్న పరిస్థితులు గల దేశములో నెట్లుండునో చూపి, తన దేశములోని పరిస్థితులలో గల చెడ్డను సంస్కరించుకొనుటకు యత్నింపవలెనని చెప్పుటయే పంతులుగారి యుద్దేశము. ఈ భావమును వ్యక్తముచేయుటకు అపహాస్యమునకు మించిన ఆయుధము లేదని ఆంగ్లరచయిత లెందరో రుజువుచేసిరి. వారిలో మహా ప్రజ్ఞానిధి 'స్విఫ్ట్'. ఈ భావమును పంతులుగారు వారి యొద్ద నుండి గ్రహించిరి.

---

24. Introduction — Gulliver's Travels. Thomas Nelson & Sons' Edition.

'గలివర్సు ట్రావెల్సు' లో వలెనే; సత్యరాజను వ్యక్తి ఆయా యాత్రలు చేసినట్లు కల్పించుట యందును, గ్రంథము 'ఉత్తమ పురుష' లో రచించుట యందును[25] గ్రంథ ప్రారంభము కథానాయకుని జీవిత కథనముతో ప్రారంభమగుట యందును; 'సత్యరాజా పూర్వదేశయాత్రలు' ఆంగ్లములోని 'గలివర్సు ట్రావెల్సు' ను పోలియున్నది. అడ మళయాళములో గల కథాభాగమునకును 'లిల్లిపుట్' (Lilliput) దేశమునందు జరిగినట్లు వర్ణింపబడిన కథాభాగమునకును పోలికయే లేదనవచ్చును.

సత్యరాజా పూర్వదేశ యాత్రలయొక్క ద్వితీయ భాగములో లంకాద్వీపయాత్ర కలదు ఆడు మళయాళమునుండి సత్యరాజు లంకాద్వీపమునకు వచ్చిపడును. ఈ భాగములోని కథకును, 'స్విఫ్ట్' యొక్క 'గలివర్స్ ట్రావెల్స్' లోని 'బ్రాబ్డింగ్‌నాగ్' (Brobdingnag) యాత్రా కథకును చాల పోలికలు గలవు. 'బ్రాబ్డింగ్‌నాగ్' లోని ప్రజలందరు మహా దీర్ఘకాయులు. వీరి చేతులలో 'గలివరు' నలిగిపోవును. లంకాద్వీపములో రాక్షసులుందురను మన సంప్రదాయమును గ్రహించి, పంతులుగారు సత్యరాజున కందు దీర్ఘకాయులైన రాక్షసులే కనబడినట్లు వ్రాసిరి. రావణ వధానంతరమునుండి నాటివరకు ఆ రాజ్యమును విభీషణుడే పరిపాలించుచుండుటచే నందు నరమాంస భక్షణ లేదట! అందు వలన సత్యరాజు బ్రతికినాడు.

'స్విఫ్ట్' తన గ్రంథములో గలివరు, 'బ్రాబ్డింగ్‌నాగ్' చేరిన వెంటనే ఒక మహాకాయుని చూచుననియు, అతడు గలివరును జూచి ఆశ్చర్యపడి యాతనిని పైకెత్తి, సమీపమున నుంచుకొని పరిశీలించుననియును, ఈ క్రింది విధముగా వర్ణించెను.

"......And therefore, when he was again about to move, I screamed as loud as fear could make me; whereupon the huge

---

25. ఆంగ్లమూలము : "My father had a small estate in Nottinghamshire. I was the third of five sons. He sent me to Emmanuel College in Cambridge at fourteen years old, where I resided three years, and applied myself close to my studies......" (Gulliver's Travels — A Voyage to Lilliput.)

తెలుగు 'సత్యరాజా పూర్వ దేశయాత్రలు' మొదటి భాగము.

"నేను పరీధావి సంవత్సర చైత్ర శుద్ధ నవమి మంగళవారమునాఁడు పుష్యమీనక్షత్రమందు విజయనగరములో పూర్వము శ్రీరాములవారు పుట్టిన దినముననే జన్మించితిని. మా యింటిపేరు పత్రివారు. నేను వ్యాసరాయాచార్యులవారి పుత్రుఁడను. నా తల్లి లక్ష్మిబాయమ్మ.." (అడుమళయాళము).

creature trod short, and looking round about under him for sometime, at last espied me as I lay on the ground. He considered awhile, with the caution of one who endeavours to lay hold on a small, dangerous animal, in such a manner that it shall not be able either to scratch or bite him, as I myself had sometimes done with a weasel in England. At length he ventured to take me behind, by the middle, between his fore-finger and thumb, and brought me within three yards of his eyes, that he might behold my shape more perfectly. I guessed his meaning, and my good fortune gave me so much presence of mind that I resolved not to struggle in the least as he held me in the air, above sixty feet from the ground, although he grievously pinched my sides, for fear I should slip through his fingers."[26]

లంకాద్వీపములో చేరిన సత్యరాజా తనకు గల్గిన అనుభవముల నిట్లు చెప్పినట్లు పంతులుగారు వ్రాసిరి.

"నా ప్రాణము లెంతసేపటికి మరల వచ్చి నా బొందిలో చేరుకొన్నవో నేను నిశ్చయముగ చెప్పలేను గాని యవి చేరిన పిమ్మట నేను కన్నులు విచ్చి చూచునప్పటికి నేను మునుపున్నచోట లేక భూమి కిరువది యడుగుల యెత్తున చెట్టుక్రింద నా కగపడిన రాక్షసుని యొక్క యొక యఱచేతిలో నున్నాను. వాని యొక్క రెండవ చేతిక్రేళ్ళు రెండు నా నడుమును చుట్టుకొని యున్నవి. నా తొడలకంటెను నెక్కువ లావుగానున్న యా వ్రేళ్ళనడుమ నడకొత్తులోని పోకలాగున నిఱుకుకొని బాధపడుచు పయి వంకఁ జూచునప్పటికి వానిముఖ మప్పుడు సమీపమున నాకు మఱింత స్పష్టముగాఁ గానఁబడినది."[27]

"......కొంతసేపు నా మొగమువంకను చేతులవంకను వంగిచూచి యాశ్చర్యపడి, పురుగును కఱచిపోవునేమోయని భయపడి మనము నేర్పుతో పట్టుకొనునట్లు మెల్లగా తనచేయి నా వెనుకకు పోనిచ్చి సాహసించి చటుక్కున ముందఱివ్రేళ్ళతో నా నడుము పట్టుకొని, పయికెత్తి, వెల్లవెలికిలఁబట్టి మొగము చేరువను బెట్టుకొని కొంతసేపు నన్ను నిదానించి చూచి బల్లమీదఁ బెట్టెను... కఱుతునో కుట్టుదునో యన్న భయముచేత నన్నతఁడుగట్టిగా పట్టుకొన్నందున

26. Gulliver's Travels — Brobdingnag.

27. సత్యరాజా పూర్వ దేశయాత్రలు. పుట - 8.

వ్రేళ్ళ యొత్తుడుచేత నానడుము నలిగి తరువాత మూఁడు దినముల వఱకును నానడుము నొప్పి పోయినది కాదు."[28]

లంకాద్వీపములో సత్యరాజు యొక్క ప్రారంభ చర్యలను వర్ణించు నప్పుడు పంతులుగారు, గలివర్సు ట్రావెల్సులోని బ్రాబ్డింగునాగు ననుసరించి రనుట కింకను నిదర్శనములను చూపవచ్చును. లంకాద్వీపములో సత్యరాజు మొట్టమొదట పొందిన అనుభవములకును, గలివరు, బ్రాబ్డింగునాగులో మొట్ట మొదట పొందిన అనుభవములకును; వర్ణనవిషయమున, భావవ్యక్తీకరణమున చాల పోలికలు గలవు. వానిలో నింకను కొన్నింటిని జూపుచున్నాను.

*Gulliver's Travels*: "He then placed me softly on the ground upon all fours, but I got immediately up, and walked slowly backward and forward, to let those people see I had no intent to run away. They all sat down in a circle about me, the better to observe my motions."[29]

*సత్యరాజా పూర్వదేశ యాత్రలు*—"......రెండవసారి తెలివి తెచ్చుకొని కన్నులువిచ్చి చూచునప్పటికి నేను మొదట ననుకొన్నట్లుగా పయికి పిన్న రాక్షసుని నోటిలోనికిఁ బోక క్రిందికి భూమిమీఁదికి వచ్చియున్నాను. అప్పుడు భూమి మీఁదనున్న నన్నా యిరువురు రాక్షసులును మోకాళ్ళమీఁద గూరుచుండి వంగి నా యవయవములను శోధించి చూచుచున్నారు. ఆ సమయమునందు నేను కదలి భూమిమీద నడువ నారంభింపగా వారు సంతోషించి........"[30]

'గలివర్సు ట్రావెల్సు' లోని కథా సన్నివేశములను పంతులు గారు కొన్నింటిని యథాతథముగ స్వీకరించిరి. అందు కథకు సంబంధించిన వానిలో, 'గలివరు'న కాతిథ్యమిచ్చిన గృహయజమాని కూతురుపాత్రను బోలినపాత్రయే లంకాద్వీప కథలోకూడ నుండుట, ముఖ్యమయినది. రెండు పుస్తకములలోను కథానాయకుని రక్షణభార మామె కప్పగింపబడినది.

*Gulliver's Travels*: "My mistress had a daughter of nine years old, a child of towardly parts for her age, very dexterous at her needle, and skilful in dressing her baby. Her mother and she contrived to fit up the boy's cradle for me against night......She was likewise my school mistress, to teach me the language......She gave

---

28. Ibidem. పుట - 10.
29. Gulliver's Travels— Brobdingnag.
30. సత్యరాజా పూర్వ దేశయాత్రలు. లంకాద్వీపము. పుట - 10.

me the name of 'grildrig'......The word imports......the English 'Manikin'. To her I chiefly owe my preservation in that country."[31]

సత్యరాజా పూర్వదేశ యాత్రలు: "......నా క్రొత్త యజమానిపేరు మహాకాయుడు. ఆ నామధేయము చేతనే యతఁడు రాజ బంధువుఁడయినట్లు మీరూహింపవచ్చును. అతఁడు నాయందు పుత్రవాత్సల్యము కలవాడయి నాయన్నపానాదులనుగూర్చి ప్రతిదినమును తానేవిచారించుచు, మూషికమార్జాలాది జంతువులవలన నాకేవిధమయిన యపాయమును గలుగకుండ రక్షించుచుండుటకయి యెనిమిదేండ్ల ప్రాయముగల తన పుత్రికకు నన్నప్పగించెను. అక్కడ ఎలుకలు మన దేశపు కుక్కలంతలేసి యుండును, ఇఁక పిల్లులన్నో మన గోవులకంటె కొంచెము పెద్దవి. కాఁబట్టి యిట్టి పెద్ద జంతువులవలన నావంటి యల్పశరీరి కపాయము సంభవించుట యేమి యాశ్చర్యము?...."[32]

వీరేశలింగం పంతులుగారు లంకాద్వీపములోనివారు సత్యరాజును 'వాలఖిల్యు'డని పిలిచెడివారని వ్రాసిరి. ఈ నామము ఆంగ్ల గ్రంథములో 'గలివరు'నకు బ్రాబ్డింగునాగు ప్రాంతీయులిచ్చిన 'మేనికిన్' (Manikin) అను నామమునే పోలియున్నది. ఈ మాటకు పొట్టివాడని అర్థము. 'గలివరు'ను సంరక్షించుచు వచ్చిన ఆ బాలికపేరు 'గ్లండల్‌క్లిచ్' (Glumdalclitch). ఈమెను తెలుగులో పంతులుగారు 'మండోదరి' అని పిలిచిరి.

లంకాద్వీప కథలో సత్యరాజు కావించిన చర్చలకును, బ్రాబ్డింగునాగులో గలివరు కావించిన సంభాషణలకును పోలికలు తక్కువ. తెలుగు పుస్తకములో పంతులుగారికి జ్యోతిష శాస్త్రాదులయందుగల అవిశ్వాసమునకనుగుణమైన వాదనలు గలవు. హిందువులలో ప్రబలియున్న మూఢవిశ్వాసములు అని పంతులుగారు తలచిన వాని విమర్శలు తెల్గు పుస్తకమున విశేషముగా, దీర్ఘముగా నున్నవి. ఆంగ్ల గ్రంథములో రాజకీయములకు సంబంధించిన చర్చలు చాల గలవు.

'గలివరు' ను రాజదంపతులు తమ బండిలో కూర్చుండబెట్టుకొని తీసికొని పోయిన విధానమునకును, సత్యరాజు నాతని యజమాని తీసికొనిపోయిన విధానమునకును పోలికలు గలవు.

*Gulliver's Travels*: "......My master, pursuant to the advice of his friend, carried me in a box, the next market-day, to the

---

31. Gulliver's Travels— Brobdingnag.
32. సత్యరాజా పూర్వదేశయాత్రలు. లంకాద్వీపము. పుట - 16.

neighbouring town, and took along with him his little daughter, my nurse, upon a pillion behind him. The box was close on every side, with a little door for me to go in and out, and a few gimlet - holes to let in air. The girl had been so careful as to put the quilt of her baby's bed into it, for me to lie down on. However, I was terribly shaken and discomposed in this journey, though it were but of half an hour; for the horse went about forty feet at every step, and trotted so high that the agitation was equal to the rising and falling of a ship in a great storm......"[33]

*సత్యరాజాపూర్వదేశ యాత్రలు* : "...... నా యజమానుఁడు నా యాలయము యొక్క తలుపులు మూయించి నన్నుఁ గొనిపోయి తన గుఱ్ఱపు బండిలో తానుఁ గూరుచున్న మెత్తమీఁద నన్ను తన కుడివైపునఁ గూర్చుండఁ బెట్టుకొనెను. నే నెక్కిన బండి రాక్షసిబండి యనియు, దానికిఁ గట్టఁబడిన గుఱ్ఱములు రాక్షసి గుఱ్ఱములనియు నేనిప్పుడు వేఱుగఁ జెప్పనక్కఱలేదుగదా! ఆ బండి ధవళేశ్వరపు కొండంత యున్నది; దానికిఁ గట్టఁబడిన గుఱ్ఱములును ఒక్కొక్కటి పది యేనుఁగులంత లేసియుండి నా దృష్టికి నడగొండలవలెఁ గానఁబడినవి." [34]

'గలివర్సు ట్రావెల్సు'లో కూడ, గలివరుయొక్క మొట్టమొదటి యజమానుడు, గలివరును తన ఇరుగు పొరుగు వారికి జూపి ధనమును సంపాదించి నట్లు గలదు. సత్యరాజా పూర్వదేశ యాత్రలలో, సత్యరాజును స్వగృహమున నిడుకొనిన రాక్షసుడు, ఆతని వలన ధనమును సంపాదించెను. 'గలివరు'ను ఒక 'విలక్షణ ప్రకృతి'గ ప్రదర్శించి ఆతని యజమానుడు ధనమును సంపాదింపగా; సత్యరాజు యొక్క రూపమును జూచి, లంకాద్వీపములోని వారందరునాతనిని వాలఖిల్య మహర్షి యని భావించి, భూరిదక్షిణలచే తృప్తి పొందించుటచే, ఆతని యజమానుడు ధనమును సంపాదించెను. ఈవిషయమును వీరేశలింగం పంతులు గారిట్లు చమత్కారముగా వ్రాసిరి.

"......నన్ను శోధించి చూచి వాలఖిల్య మహర్షినిగా నిశ్చయించిన పౌరాణికులును జ్యోతిశ్శాస్త్రవేత్తలు నా రాకను గ్రామమునం దంతటను ప్రకటించినందున జనులు తీర్థప్రజవలె వచ్చి నన్ను దర్శించిపోవ మొదలు పెట్టిరి...నన్ను దర్శింప వచ్చు వారందరును నాయందు భక్తిగలవారయి

33. Gulliver's Travels— Brobdingnag.
34. సత్యరాజాపూర్వదేశయాత్రలు. లంకాద్వీపము. పుట - 39

ఫలములను కానుకలను దెచ్చుచు వచ్చుటచేత మాయింట ప్రతి దినమును ఫల రాసులు పర్వతోపమానము లగుచు వచ్చెను. నా యజమానుఁడు వానినన్నిటి నంగడికిఁ బంపి యమ్మించుచు వచ్చుటచేత తద్విక్రయము కొంతవఱ కాతనికిని లాభకరముగానే యుండెను. నా మూలమున తన యప్పులు కూడ తీఱుమార్గ మేర్పడినందున నా యజమానుఁడు తన హృదయములో సంతోషించి కొంత కాలమయిన తరువాత దక్షిణలుకూడ నేర్పఱచి యాత్రాపరులను ప్రోత్సాహ పఱచుచు వచ్చెను." [35]

ఆంగ్లములో, ఈ విధానమే ఇంకొక విధముగా వర్ణింపబడినది. అట, గలివరు యజమాను డాతనిని పదిమందికి ప్రదర్శించి ధనమును సంపాదించుచు వచ్చినట్లుగ 'స్విఫ్ట్' ఇట్లు వ్రాసెను :

"......My master, finding how profitable I was like to be, resolved to carry me to the most considerable cities in the kingdom... My master's design was to show me in all the towns by the way, and to step out of the road, for fifty or a hundred miles, to any village or person of quality's house where he might expect custom."

"......My master took a lodging in the principal street of the city, not far from the royal palace, and put out bills in the usual form, containing an exact description of my person and parents...... I was shown ten times a day, to the wonder and satisfaction of all people." [36]

లంకాద్వీపము కథకును, బ్రాబ్డింగునాగు కథకును పైని చెప్పినటుల సన్నివేశ కల్పనలో కొన్ని పోలిక లున్నను; మిగిలిన కథయందు పోలికలు తక్కువ. 'స్విఫ్ట్' రాజకీయమైన అవహేళనమును గూడ చేసెను. పంతులుగారు, తన కాలమునాఁటి పరిస్థితుల ననుసరించి, రాజకీయ విషయములు తప్ప మిగిలిన సాంఘికాది విషయముల నన్నింటిని పరామర్శించెను. ముఖ్యముగా నాయన విమర్శించినది జ్యోతిషశాస్త్రము. 'గలివర్సు ట్రావెల్సు'లోని 'బ్రాబ్డింగునాగు' కథలో దీని ప్రస్తావన తక్కువ.

లంకాద్వీపమునుండి సత్యరాజు తప్పించుకొని పోయినట్టి విధానము నకును, గలివరు బ్రాబ్డింగునాగునుండి తప్పించుకొని పోయిన విధానమునకు —

35. సత్యరాజా పూర్వదేశయాత్రలు. లంకాద్వీపము. పుట 25

36. Gulliver's Travels — Brobdingnag.

పద్ధతులు వేరైనను — పోలికలు గలవు. 'గలివరు' నివాసస్థలమైన పెట్టె నొక పెద్ద గ్రద్ద తన్నుకొనిపోయి సముద్రమున పడవైచును. ఆ సమయమున సముద్రములో పయనించుచున్న ఒక ఓడలోనివా రతనిని పైకిదీసి రక్షింతురు. సత్యరాజా పూర్వదేశ యాత్రలలో, ఆతనిని లంకాద్వీపమునుండి తీసికొని పోయినది ఒక కోతి. ఆ కోతి, హనుమంతుని యపరావతారమని సత్యరాజు నమ్మెను.

బ్రాబ్డింగునాగులో 'గలివరు' నొక కోతి ఎత్తుకొని పోయినట్లును, అచ్చటి రాజభటు లాతనిని రక్షించినటులను వర్ణన కలదు. కథ యొక్క మధ్యభాగమున వచ్చిన ఆ సన్నివేశమునే గ్రహించి, కథ యొక్క యంతము నందు పంతులుగారు చేర్చిరనవచ్చును. హనుమంతుడే లంకనుండి సత్యరాజును రక్షించినాడను విషయమును సోపపత్తికముగ చేయుటకై యిట్లు వ్రాసియుందురు. ఈ సందర్భమున గలివర్సు ట్రావెల్సులో కోతి గలివరు నెత్తుకొనిపోవుట ఇట్లు వర్ణింపబడెను.

"......the monkey, looking in at every side, put me into such a fright that I wanted presence of mind to conceal myself under the bed, as I might easily have done......he at length seized the lappet of my coat and dragged me out. He took me in his right forefoot, and held me as a nurse does a child she is going to suckle......In these diversions he was interrupted by a noise at the closet door...... Whereupon he suddenly leaped up to a window......and thence upon the leads and gutters, walking upon three legs, and holding me in the fourth, till he clambered up to a roof next to ours......Some of the people threw up stones, hoping to drive the monkey down......"[37]

సత్యరాజా పూర్వదేశ యాత్రలలో, లంకా ద్వీపమున నొక వానర మాతనిని ఎత్తుకొనిపోయినది. ఆ వానరమే ఆతని నా ద్వీపము నుండి తప్పించినది. ఈ సందర్భమున నం దిట్లున్నది.

"...... మఱియొక దిక్కు నుండి శ్మశానముల దాటి పెద్ద వానర మొకటి నా వంకకే వచ్చుచుండెను..........ఏమఱియున్న సమయమునందు మెల్లగా వానరము నా వద్దకు వచ్చి నన్ను చంకఁబెట్టుకొని చెట్టుమీఁది కెగఁ

37. Gulliver's Travels — Brobdingnag.

ప్రాకెను...ప కొమ్మనైన నను గట్టిగా కౌఁగిటఁబట్టుకోవలెనన్నను పట్టుకోనీయక, యీ పాడుకోతి యెడమచేతితో భల్లూకపు పట్టు పట్టి నన్నొడిలోఁ బెట్టుకొని కదలనియ్యకున్నది. ......తాటక వృక్ష మారోహించుట చూచి యీ దుష్ట వానరము నన్ను విడిచి పాఱిపోక, తనతోఁకను నేను మొదట ననుకొన్నట్టుగా నా మెడకుఁ గాక నా పొట్టకు చుట్టఁబెట్టి నన్ను తన వీపుఁ మీద నదిమిపెట్టి యీ చెట్టుమీఁదినుండి మఱియొక చెట్టుఁ మీఁదికి దుమికెను. అంతట తాటక చెట్టు దిగివచ్చి హిడింబితో నేమో యాలోచించి, వానరమును రాళ్ళతో విసర నారంభించెను. దానికి సహాయురాలై హిడింబియు మా మీద శిలలు రువ్వ సాగెను."[38]

'లంకాద్వీప కథ' రచనలో వీరేశలింగం పంతులుగారు, 'గలివర్సు ట్రావెల్సు' నెంతవర కనుసరించిరో సోదాహారణముగా తెలిపితిని. ఈ అను సరణములో సన్నివేశముల యనుసరణ మున్నంతగా భావానుసరణములేదు. దానికి కారణము: పంతులుగారు హిందూ సంఘములోని దురాచారములను విమర్శించుటయే పనిగా పెట్టుకొని వ్రాసినవారగుటయే. ఈ విషయమును పంతులుగారే "వ్యాజ రూపమున మనలోని దురాచారములను మూఢ విశ్వాసములను పరోక్షముగాఁ ప్రదర్శించునట్టి పుస్తకమును...చేయవలెనని బుద్ధిపుట్టి"[39] వ్రాసినట్లు, స్వీయ చరిత్రములో వ్రాసిరి. 'అడుమళయాళము' 'లంకాద్వీపము' లను నీ రెంటిని పంతులుగారు పైని వివరించబడిన ఉద్దేశముతో వ్రాసినను; 'అడుమళయాళము'ను మన సంఘములో "స్త్రీల విషయమున మనవారు చేసిన యన్యాయములు తేటపడునట్లు" ను,[40] "లంకాద్వీపము"ను "జోతిశ్శాస్త్రములోని జాతక భాగముయొక్కయు ముహూర్త భాగము యొక్కయు నవిశ్వసనీయతను పరోక్షముగాఁ దెలుపుటకు"ను[41] వ్రాసినారు. పంతులుగారింకను మూఁడు నాలుగు భాగములను—గలివర్సు ట్రావెల్సులో నున్నట్లు—చేయ సంకల్పించిరిగాని, వానిని చేసినట్లు లేదు.

---

38. సత్యరాజా పూర్వదేశ యాత్రలు. లంకాద్వీపము. పుట - 100
39. స్వీయచరిత్రము 1915. రెండవ భాగము. పుట - ౧౮౩
40. స్వీయచరిత్రము 1915. రెండవ భాగము. పుట - ౧౮౩
41. స్వీయచరిత్రము 1915. రెండవ భాగము. పుట - ౧౮౪

ఆంగ్లములోగల 'గలివర్సు ట్రావెల్సు' అను 'హేళన గద్యరచన' ననుసరించి 'సత్యరాజా పూర్వదేశయాత్రలు' తెలుగులో రచించి పంతులుగారు, కథా సాహిత్యమున నూతన మార్గమును ద్రొక్కిరి. అంతకుపూర్వ మిట్టి పద్ధతిలో సుదీర్ఘముగ రచింపబడిన 'అవహేళన గద్యరచన' తెలుగులో లేదు.

**అనువాద కథ :**

"స్త్రీలు వినోదకరముగాఁ జదువుకొని యానందించుటకు తగియుండునని తలఁచి, షేక్స్పియరు మహాకవియొక్క నాటకముల ననుసరించి యింగ్లీషులో ల్యాంబను (Charles Lamb) నతఁడు వచనరూపమున రచియించిన కథలలో పదునాఱింటిని"[42] వీరేశలింగం పంతులుగారు "సులభశైలిని" తెనిగించిరి. ఇట్లు తెనిగించిన కథలనామములను, పంతులుగారు తెలుగులో పెట్టిన పేరులను క్రిందిపట్టికలో నిచ్చుచున్నాను.

| ఆంగ్లనామము | తెలుగుపేరు |
|---|---|
| 1. The Comedy of Errors | చమత్కార రత్నావళి |
| 2. The Merchant of Venice | కురంగేశ్వర వర్తక చరిత్రము |
| 3. Cymbeline | కళావతీ పరిణయము |
| 4. The Taming of the Shrew | గయ్యాళిని సాధుచేయుట |
| 5. Pericles | రఘుదేవరాజీయము |
| 6. King Lear | చిత్రకేతు చరిత్రము |
| 7. The Winter's Tale | సుమిత్ర చరిత్రము |
| 8. Timon of Athens | దానకేసరి విలాసము |
| 9. All's Well that ends Well | సతీమణి విజయము |
| 10. As you like it | వైదర్భీవిలాసము |
| 11. Much Ado About Nothing | భానుమతీ కల్యాణము |
| 12. Twelfth Night | సరసమనోభిరామము |
| 13. The Two Gentlemen of Verona | కుమారద్వయ విలాసము |
| 14. Measure for Measure | ధర్మకవచోపాఖ్యానము |

42. స్వీయచరిత్రము 1915. రెండవ భాగము. పుట - ౧౫౦

**15. Othello** పద్మినీ ప్రభాకరము
**16. Romeo and Juliet** మాలతీ మధుకరము

ఆంగ్లములో వచనరూపమున నున్న ఈ కథల ననుసరించి పంతులుగారు చక్కని వచనరచన చేసిరి. ఇట్లాంధ్రీకరించుటలో పంతులుగారు స్వాతంత్ర్యము నవలంబించి మూలకథలోని దేశముల పాత్రల నామములను మార్చుటయే కాక; సన్నివేశములను గూడ మార్చిరి. మన యాచార వ్యవహారములకును పాశ్చాత్యదేశముల యాచార వ్యవహారములకును గల భేదములే ఇట్టి మార్పులకు కారణము. ఇట్టి మార్పులు లేకున్నచో మనవారి కా కథలు, ఇంపుగా నుండవని వారభిప్రాయపడిరి. ఈ యభిప్రాయములో సత్యము లేకపోలేదు. నాడేమి నేడును; పాశ్చాత్యకథలను యథాతథముగ స్వీకరించిన నాటకములు నవలలు తెలుగు ప్రజల యాదరాభిమానములను; మూల సన్నివేశములను గ్రహించి మన యాచార వ్యవహారముల కనువుగ నలతియలతి మార్పులనుచేసి, దేశముల పాత్రల నామములను మార్చి చేసిన రచనలవలె; చూరగొనుట లేదను విషయ మందరికిని తెలిసినదే గదా !

ఈ కథల యనువాదములో పంతులు గారు ముఖ్యముగా చేసిన మార్పులు స్త్రీల ప్రవర్తనకు సంబంధించినవి. పాశ్చాత్య దేశములలో స్త్రీల కున్నంత స్వేచ్ఛ భారతస్త్రీలకు లేదుగనుక, ఆంగ్లనాటకములలోని స్త్రీలు ప్రవర్తించినటుల తెలుగు కథలలోని స్త్రీలు ప్రవర్తించినటుల వ్రాసిన యెడల చదువరులకు తృప్తికరముగ నుండదు. ఇట్టి స్త్రీలు మనదేశమున కలరాయని ఆశ్చర్యపడవచ్చును. పాత్రల నామములును, దేశముల నామములును మార్చకున్నచో నట్టి యాశ్చర్యము కలుగక పోవచ్చును గాని, ఆంధ్రపఠితలకు కథలును పాత్రలును సన్నిహితము గాకుండ పోవును ఈ చిక్కుల నుండి తొలగుటకు పంతులుగారు ఈ పద్ధతి నవలంబించిరి. ఈ పద్ధతి, నవీనులమైన మనకు నచ్చకున్నను, ఉబుసుపోకకై స్త్రీలు చదువుకొను కథలను కల్పించిన పంతులు గారికి, ఆశ్రయింప దగినదే.

ఈ కథలలో ప్రేమ, త్యాగము, క్రౌర్యము, ఈర్ష్య మొదలుగాగల ప్రాథమికోద్వేగములు గల భాగములను అవి ప్రపంచములోని మానవులందరకు సమానము గనుక—పంతులుగారు మార్పుచేయక అట్లే యుంచుటచే, 'షేక్స్పియరు హృదయము' పఠితలకు తెలియకపోదు.

ఆత్మ కథ :

ఆంగ్ల సాహిత్యప్రభావమున బయలుదేరిన పంతులుగారి రచనలలో – భావానుసరణమంతగా లేకున్నను – 'స్వీయచరిత్ర' విశిష్టమైనది. 'జీవిత చరిత్ర' ను బోలినదే ఈ యాత్మ కథయు. దానివలెనే దీని యందును సత్యమునకును, సాహిత్య సౌందర్యమునకును తావున్ననాడే యిది సాహిత్యమగును. కేవలము తిథులను ఏకరువుపెట్టిన నిది సాహిత్యము కాజాలదు. దీని రచనలో జీవిత చరిత్ర రచనయందు దున్నంత స్వేచ్ఛ కూడ లేదు. తన్ను తాను పొగడుకొనుట గాని, తెగడుకొనుట గాని లేకుండ దీనిని వ్రాయవలెను. ఇది కత్తిపై సాము. కనుకనే ఆత్మకథను గూర్చి 'జాన్సన్' (Dr. Johnson) ఇట్లనినాడు :

"A man cannot with propriety speak of himself, except he relates simple facts; as, 'I was at Richmond'; or, what depends on mensuration; 'I am six feet high'. He is sure that he has been at Richmond; he is sure he is six feet high; but he cannot be sure he is wise, or that he has any other excellence. Then, all censure of a man's self is oblique praise. It is in order to show how much he can spare. It has all the invidiousness of self-praise and all the reproach of falsehood." [43]

ఆత్మకథ వ్రాయుట ఇంత కష్టమైనను, అట్టి 'మాదిరి కథ' తెలుగు వచనములో నంతకుపూర్వము ప్రచారమున లేకున్నను; తమకు సహజమైన ధైర్యముతో, న్యాయదృష్టితో 'స్వీయచరిత్రము' [44] వ్రాయుట కుపక్రమించి శ్రీ పంతులుగారు కృతకృత్యులైరి. ఇందు చాలవరకు సత్యవిషయములే చెప్పబడి యుండుట చేతను, తన్ను గూర్చి యితరులన్న వాక్యములను మాత్రమే సాధారణముగా వ్రాయుట చేతను, పంతులుగారి స్వీయ చరిత్ర యా కాలము నాటి సాంఘిక వ్యవస్థను తెలిసికొనుటకు ముఖ్యాధారముగ నున్నది. ఇట్టి కృషిలో కృతకృత్యులగుటకు పంతులుగారికి మార్గదర్శకములైనవి ఆంగ్ల గ్రంథములే.

పంతులుగారు స్వీయ చరిత్రము ఆంగ్లములోని 'ఫలానా' స్వీయ చరిత్రను పోలినదని చెప్పలేముగాని, వారి గ్రంథములోని విషయ విభాగ పద్ధతి,

43. Boswell's Life of Johnson; Everyman Edition. Vol II; Page-231.

44. స్వీయచరిత్రము మొదటి భాగము 1911 లోను, రెండవ భాగము 1915 లోను విజ్ఞానచంద్రికా గ్రంథమాలలో అచ్చయినది.

ఇతరులు వ్రాసిన లేఖల నుదాహరించుపద్ధతి[45] పత్రికలు మొదలగునవి వ్రాసిన భాగముల నుదాహరించు పద్ధతి, పరిశీలించి చూచినచో వారెన్నియో ఆంగ్ల 'జీవిత చరిత్ర' లను, 'స్వీయ చరిత్ర' లను సూక్ష్మముగ పరిశీలించినారని తెల్లమగును.

వీరేశలింగం పంతులుగారు, నేటి పరిభాషలో చెప్పవలెనన్న, వాస్తవిక రచయిత (Realistic Writer). ఈ వాస్తవికత ఆయన స్వీయ చరిత్ర యందును బాగుగ కన్పట్టును. సమకాలికమైన విషయములను విమర్శించుచు వారు వ్రాసిన వ్యాసములు, నాటకములు, ప్రహసనములు వాస్తవిక జగత్తునకు సంబంధించినవి. ఈ వాస్తవికతయే వారి స్వీయ చరిత్రలోను కన్పట్టును. అనేక రంగములలో గొప్ప కృషిచేసినవారు గనుకనే పంతులుగారు స్వీయ చరిత్రలో అక్కడక్కడ "నేనిది చేసితిని, అది చేసితిని" అని వ్రాయవలసి వచ్చినది. ఈ వ్రాతలు కొందరికి 'స్వోత్కర్ష' వలె కన్పట్టినను, అవి సత్యములేయని వారి జీవితము నెరింగినవారికి తెలియకపోదు.

సమకాలికమైన వాస్తవిక రచనలు 'జీవిత చరిత్ర' రచనపై కూడ తమ ప్రభావమును జూపునని పాశ్చాత్యులందరు నంగీకరించినదే. ఆంగ్ల సాహిత్య విషయమున నిది సత్యమని క్రింది వాక్యములు చూపుచున్నవి.

"Inevitably the essay on contemporary manners, the novel of contemporary life, exercised a powerful and durable effect upon the development of English biography."[46]

స్వయముగా సమకాలిక జీవితమును విమర్శించుచు రచనలు సాగించిన పంతులుగారు, తమ 'స్వీయ చరిత్ర' రచన విషయమునను ఇట్టి వాస్తవిక దృష్టినే యవలంబించిరనుట ఆశ్చర్యపడవలసిన విషయముకాదు. ఇట్లు ఆదర్శప్రాయమైన స్వీయచరిత్రను వ్రాసి వారు తరువాతివారికి ఈ సాహిత్యశాఖలో మార్గదర్శకులైరి.

---

45. జీవితచరిత్రలలో లేఖల నుపయోగించు పద్ధతిని, ఆంగ్లములో మొట్టమొదటిసారిగా వాల్టన్ (Walton) ప్రవేశ పెట్టినట్లును, మేసన్ (Mason) దానిని బాగుగా వినియోగించుకొనినట్లును తెలియుచున్నది.

"Mason's Life of Gray.........is the first biography deliberately written on the "Life-and-letters" method. Walton, it is true, had introduced letters into some of his biographies, but he had done so with no very deliberate purpose. Mason's purpose was deliberate and avowed."

(The Development of English Biography by Harold Nicolson; Page - 77).

46. 'The Development of English Biography' by Harold Nicolson; Page - 71.

వ్యాసరచన

తెలుగులో వ్యాసరచనకు[47] వీరేశలింగం పంతులుగారు చేసిన సేవ అపారము. ఆ సేవను గుర్తించియే తెలుగుసహృదయలోకము వారికి 'గద్యతిక్కన' అను బిరుదము నిచ్చినది. సంస్కృత సమాసములతో నిండిన ప్రౌఢాంధ్రరచన సాగించుటతో సాహిత్యజీవితమును ప్రారంభించిన పంతులు గారు, ఔచిత్యము ననుసరించి వ్యావహారిక భాషను వాడవచ్చునను నంత వరకు పోవుటయేగాక, అట్టిభాషగల కొన్ని రచనలనుకూడ చేసి చూపిరి. ఇట్టి పరివర్తనము వారిలో కలుగుటకు ముఖ్యకారణములు ఆంగ్లసాహిత్య పఠనమును, సాహిత్యప్రయోజనమును దానివలన బాగుగా గుర్తించుటయును. తెలుగుప్రజలలో చైతన్యమును కలిగించుటకు వచనరచనయే నవీనకాలమున నుపాదేయమని గుర్తించుటయేగాక, అంతశ్శుద్ధిగల ఆ మహనీయుడు పద్యము నువ్రాయకూడదను నిర్ణయమునకు కూడవచ్చెను.

"తెలుఁగులో పద్యకావ్యములు వలసినన్ని యున్నందున పద్యకావ్య విరచనమును మానివేసి వచనకావ్యములులేని కొఱఁతను దీర్చుటకయి తద్రచనమునందే నా కాలమును వినియోగింపఁ దలఁచియున్నవాఁడనగుట చేత...... " (స్వీయచరిత్రము; రెండవభాగము పుట; - ౧౫౩.)

"భాషవలని ప్రయోజనమేమి? జనులు తమ యభిప్రాయముల నొండొరు లకుఁ దెలుపుకొనుట. భాషలోని గ్రంథములవలని ప్రయోజనమేమి? తమ భావములను దూరముననున్న వారికిని రాఁబోవుతరముల వారికిని సులభముగా తెలుపుట. అట్టి సౌలభ్యము విగ్రహమువంటి పుస్తకములవలనఁ గలుగునా? కలుగదు.... అట్లయినచో గ్రంథము లెట్లుండవలయును? అందఱికిఁ దెలియు నట్లు సులభముగా నుండవలెను; అని నాలో నేనాలోచించుకొని ముందు వ్రాసెడు పుస్తకములను విగ్రహమువలెఁగాక సుగమములుగా నుండునట్లు

---

47. సి. పి. బ్రౌనుదొర 'ఇంగ్లీషు - తెలుగు' నిఘంటువు (1852) నందు. 'Essay' అనుమాటకు అర్థవివరణముచేయు సందర్భమున, 'వ్యాసము' అను మాట ప్రయోగించెను.

"Essay. n. s. (add) is commonly called in Madras వ్యాసము. Essayist. n. s. he who makes an attempt, who writes an Essay, an author ప్రయత్నము చేసేవాడు. (In Madras commonly called వ్యాసము వ్రాసేవాడు గ్రంథకర్త)

అనగా, 1852 నాటికే ఈ శబ్దము ప్రచారమున నుండెనన్నమాట.

వ్రాయనిశ్చయించుకొని నా యభిప్రాయమును నాలోపలనే యుంచుకొనక పత్రికాముఖమునఁ దెలిపితిని."

(స్వీయచరిత్రము, రెండవభాగము; పుట - ౧౫౬)

గ్రంథములను సాధారణముగా సలక్షణమైన సులభశైలిని రచియింప వలెననియే నా యభిప్రాయమైనను విషయానుగుణముగా తత్తదుచితరీతిని గ్రామ్యభాషయందు సహితము గ్రంథములను వ్రాయవచ్చుననికూడ నాయభిప్రాయము. పూర్వ వ్యాకరణములన్నియుఁ బద్యకావ్య రచనకొఱకే వచన కావ్యములు లేని కాలములో పుట్టిన వగుటచేత నందలి లక్షణము లనేకములు వచన కావ్యాభివృద్ధికి తగవనియు నిప్పటి కాలమునకుఁ దగినట్టుగా వ్యాకరణమును మార్చుకోవలెననియు నేననుకొని యీ కాలమునకును వచన రచనాభివృద్ధికిని తగినట్టుగా నొక నూతన వ్యాకరణమును వ్రాసి దానికి లక్ష్యముగా నొక వచనకావ్యమును జేయవలెనని పలుమాఱు దలపోసితిని."

(స్వీయచరిత్రము; రెండవభాగము; ౧౫౭.)

పైని, కొంచెముదీర్ఘముగనున్నను, ఉదాహరింపబడిన పంతులుగారి వాక్యములనుబట్టి తెలుగులో వచన రచన విషయమున వారికిగల యభిప్రాయములు మనకు తెలియును. నాటికి విప్లవాత్మకములైన ఈ యభిప్రాయముల పుట్టుకకు వారికిగల ఆంగ్ల సాహిత్య పరిచయమే కారణము. తెలుగులో వచనరచనను, విద్యార్థుల యుపయోగమునకై రచింపవలెనను నూహ బొడమునంతవరకు చిన్నయసూరి ప్రభృతులపై ఆంగ్ల విద్యావిధానము తన ప్రభావము చూపగా; ఆంగ్ల సాహిత్యామృతమును గ్రోలిన పంతులుగారిపై. తేటతెల్లమగు వచన రచన గావింపవలెనను నూహ పుట్టునంతవరకు నాప్రభావము పడినది.

సంఘములోని దురాచారములను విమర్శించి, ప్రజలకు వారలవాటు పడిన విషయములలోగల చెడ్డ నెత్తిచూపుటకు, సాహిత్యము నుపయోగించిన మహానుభావుడు, వీరేశలింగము పంతులుగారు. సాహిత్య ప్రయోజనములలో 'ఉపదేశము'ను మనవారు పూర్వమే పేర్కొనినను, వీరేశలింగం పంతులుగారు కలము చేబట్టువరకు నెవరును, తెలుగులో నావిషయమై తీవ్రముగ కృషి చేయలేదనవచ్చును. ఒక్క వేమన దీని కపవాదమయినను, అతడును పద్యములలో నీ ప్రబోధమును చేసెను. ఆంగ్ల సాహిత్యపఠనమువలన; సాహిత్య ప్రయోజనమును, దానిశక్తియు, పూర్ణముగ గ్రహించిన పంతులుగారు, వచనమును తన కుపకరణముగ గ్రహించి, ఒకవంక సాహిత్యమునకు నింకొకవంక

సంఘమునకు సేవచేసిరి. ఆంగ్ల వచనరచనను తీర్చి దిద్దుటలో 'జాన్ డ్రైడన్' (John Dryden; 1631-1700) నకుగల స్థానమే తెలుగులో వీరేశలింగం పంతులుగారి కీయవలెనని నా తాత్పర్యము

ఆంగ్లసాహిత్యములో 'డ్రైడన్' యొక్క కృషినిగూర్చి యొక విజ్ఞాని యిట్లు వ్రాసినాడు.

"With Dryden it may be said that modern Prose had 'arrived'. He threw off the old poetic encumbrances; he made the standard one of correctness and he matched his prose with the social and scientific needs of his own day. One of the most important of these needs was a vehicle for the discussion of public affairs, of manners and modes, of problems of daily conduct, and the like. Dryden's prose was exactly what the situation required. It was clear, flexible, and urbane. There was in it no exploitation of erudition, yet it had enough of scholarly allusion to interest the cultivated reader without embarrassing the unlearned."[48]

ఈ పై వాక్యములన్నియు యథాతథముగ, వీరేశలింగంపంతులుగారికి కూడ నన్వయించునుగదా! వచనరచన విషయమున వీరిరువురకు పోలిక యుండుటయేగాక, భావములందును చాల పోలికలుగలవు. 'అవహేళన కావ్యములు' వ్రాయుటలో నిరువురు సిద్ధహస్తులు. సాహిత్యప్రయోజనము సంఘశ్రేయమేయని ఇరువురి విశ్వాసమును.

పంతులుగారు వ్యాసములు[49] వ్రాయని విషయములేదు. ప్రతి వ్యాసమునకును వెనుక ఆంగ్ల భాషలోని ఒక వ్యాసము కలదని చెప్పుట హాస్యాస్పదము కాని; ఆ వ్యాసములు బయలుదేరుటకు కారణమైన చిత్త సంస్కారము వారికి ఆంగ్ల సాహిత్యావలోకనమున కలిగినదనుట సత్యదూరమును గాదు, అగౌరవమును కాదు. ఒక ప్రత్యేక సాహిత్యశాఖలో కృషి ప్రారంభించువానికి, ఆ కృషిని ప్రారంభింపవలెనను సంస్కారమును కలిగించిన భావము నిచ్చిన సంపర్కము ప్రధానమైనది గాని; ఆ సంపర్కము కలిగిన భాషలోని సాహిత్య శాఖలోని రచనలకు అంత ప్రాధాన్యములేదు. పంతులుగారి వ్యాస

48. Getting to know English Literature By T.G. Williams. 1951. page-110.

49. వ్యాసరచన వ్యాప్తికి వచ్చిన తొలినాళ్లలో; వ్యాసమునకు— ప్రమేయము (శ్రీ స్వామినీన ముద్దు నారసింహనాయనిగారు). సంగ్రహము (శ్రీమాన్ పరవస్తు వేంకట రంగాచార్యులుగారు). ఉపన్యాసము (శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారు) అను నామములు వాడుకలో నుండెను.

ముల విషయమున నిది సత్యము. ఆంగ్ల సాహిత్య సంపర్కముతో వారి మనసు మారినది. బుద్ధి వినూత్న పథముల పయనించినది. ఈ పయనమే, నవ్యసృష్టికి దోహదము. దోహదమునుబట్టి ఫలరీతియుండునుగదా!

వీరేశలింగం పంతులుగారు వివిధ విషయములపై వ్యాసములు వ్రాసిరి. వారి వ్యాసములు దేశభక్తిని, సత్ప్రవర్తనమును, నీతిని ప్రజలకు బోధించును. పంతులుగారి కాలములో దేశము నైతిక పతనమును పొందియుండెను. దురాచారములు మిక్కిలి ప్రబలియుండెను. సంఘపరమైనవి, వ్యక్తిగతమైనవి ఎన్నియో చెడ్డఅలవాటులు దేశమున వ్యాపించియుండెను. ఈ చెడ్డతనమును ఎదుర్కొనుటకు నిర్విరామ కృషిచేసిన మహానుభావుడు వీరేశలింగంపంతులు. ఈ చెడ్డ నెదుర్కొనుటలో సాహిత్యము నుపకరణముగ గ్రహించెను కనుకనే. ఆతని కిట ప్రసక్తి వచ్చినది. కేవల సంఘసంస్కర్త కిట ప్రసక్తి లేదు.

దురాచారములే గాక దేశములో నజ్ఞానమును పెరిగియుండెను. మూఢ విశ్వాసములు ప్రబలియుండెను. స్త్రీల విషయమున సంఘములో చాల నప చారములు జరుగుచుండెను. వీని నన్నింటిని రూపుమాపుటకై బద్ధకంకణుడై వీరేశలింగంపంతులుగారు కలము చేబూనెను. వ్యాసముల రూపమున ప్రజోపయోగములగు విషయములపై నెన్నియో రచనలుచేసి, వీరేశలింగం పంతులుగారు విజ్ఞానమును ప్రజలలో వ్యాపింపజేసిరి.

వ్యాసరచనలో పంతులుగారు సిద్ధహస్తులు గనుక, వారికి 'గద్యతిక్కన' అను బిరుదము, ఆంధ్రసాహిత్యములో వచనరచనను సృష్టించినవారను పేరును వచ్చినవిగాని; వారికి పూర్వమీశాఖలో కృషిచేసినవారు లేరనికాదు. ఇట్లు కృషిచేసినవారిలో మొదటివారు శ్రీస్వామినీన ముద్దు నారసింహనాయని గారనియు, వారి వ్యాససంపుటి 'హితసూచని' అనియు నింతకుపూర్వమే వ్రాసితినిగదా![50] ఈ గ్రంథమును పంతులుగారు చూచిరనుటకు నిదర్శనములు గలవు, 'శ్రీరంగరాజు చరిత్ర'యను నవలను చూచినారనుటకు, 'రాజశేఖరచరిత్రము'లో నిదర్శనము లున్నట్లే; 'హితసూచని' యను వ్యాస సంపుటిని చూచినారనుటకు పంతులుగారు వ్రాసిన వ్యాసములలో నిదర్శనములు గలవు. అట్టివానిలో నొకదానిని చూపుచున్నాను.

సంఘశ్రేయమును మనసులో నుంచుకొని 'హితసూచని'ని వ్రాసిన 'నాయడు'గారు; సంఘములోని దురాచారములను, మూఢవిశ్వాసములను

50. ఈ పరిశోధన గ్రంథములో పుట - 270 చూడవలసినది.

విమర్శించిరి. వారట్లు విమర్శించినవానిలో 'దయ్యములకు సంబంధించిన నమ్మకములు' కల భాగమునకు 'రక్షఃప్రభృతి ప్రమేయము' అనిపేరు. దీని యందొకచోట 'నాయడు'గారిట్లు వ్రాసిరి.

"చనిపోయిన మనుష్యులు కొందరు రక్షస్సులున్ను - పిశాచములున్ను - భూతములున్ను - దయ్యములున్ను - ఐ - తమకు ఏ విధమైన యిలాకాలేని వారి గృహములయందు కూడా ప్రవేశించి వాటిలో నివసించియుండే మనుష్యులకు కనపడకుండా నుండి తాళములు వేసియుండేగదులలోను పెట్టెల లోను ఒకదానిలో నుంచబడిన వస్తువులు మరియొకదానిలో నుండేలాగు చేయడమున్ను - అటువంటి యొక పెట్టెలో నుంచబడిన వస్త్రములలో మధ్య వస్త్రముయొక్క కొన్నిపొరలు కాలియుండేలాగు చేయడమున్ను - ఇండ్లమీద రాళ్ళు పడేలాగు చేయడమున్ను - చూరులయందు ఒకానొకప్పుడు లోపల అగ్నిగల గడ్డితుట్టెలుగాని కొరువులుగాని పొగరాజుతూనుండేలాగు దోపి యుంచడమున్ను[51] - ఒకరు - ఇద్దరు - ముగ్గురు - నలుగురు - ఎత్తడమునకు భారముగానుండే వస్తువులు ఒకచోటనున్నవి మరియొకచోట పడియుండే లాగు చేయడమున్ను — శుభ్రముగానున్న స్థలములయందున్ను — వస్తువుల యందున్ను — అసహ్యములైన వస్తువులు ఉండేలాగు చేయడమున్ను ఇంకా ఇటువంటి చాలా తొందరలు జరిగించడమున్ను—ఆయిండ్లలో నివసించే వారు వాటిలో నుండలేక మరి వేరేయిండ్లకు వెళ్ళితే అక్కడకిన్ని, గ్రామాం తరములకు వెళ్లితే అక్కడికిన్ని, కూడా వెళ్లి సదరు తొందరలే జరిగించడ మున్ను కలదని చాలామంది నమ్ముతున్నారు కాని ఇది వాస్తవము కాదు."[52]

"రక్షస్సులు మొదలైనవి మనుష్యులను ఆవహిస్తవని నమ్మేవారు సదరు అశక్తములను పొందినవారిని రక్షస్సులు మొదలైనవి ఆవహించినట్టు ఎంచుకో వడమున్ను కలదు—ఆ అశక్తములను పొందినవారు వారి స్వభాషల నేమి వారికి వచ్చియుండే భాషాంతరములనేమి శ్లోకములనేమి పద్యములనేమి అని మిత్తముగానున్ను స్వభావమునకు భిన్నముగానున్ను చాలామట్టుకు అసందర్భ ములుగానున్ను వచించడము కలఘు—వారికిరాని భాషలను—శ్లోకములను— పద్యములను— కూడా వినియుండడముచేత జ్ఞాపకము ఉన్నమట్టుకు సదరు ప్రకారమే వచించడమున్ను కలదు—మరిన్ని వారిలో నొకానొకరు తమశక్తికి

51. హితసూచని 1862; రక్షః ప్రభృతి ప్రమేయము. పుట - ౬౩.

52. హితసూచని 1862; రక్షః ప్రభృతి ప్రమేయము. పుట - ౬౪.

సంపూర్ణముగా సరిపడియుండే భారమును ఎప్పుడైనా విశేష ప్రయత్నముచేత వహించడమున్ను కార్యమును చేయడమును కలదు— సదరహీప్రకారము వచించడమున్ను భారమును వహించడమున్ను కార్యములను జరిగించడమున్ను అమనిషి పూర్వము సహజముగా[53] జరిగించేవి కానందున వీటిని విన్నటు వంటిన్ని—చూచినటువంటిన్ని—వారు వాస్తవము కనిపెట్టలేక భ్రమనుపొంది ఆమనిషి తనకు రానిభాషలు మొదలైనవి వచించినట్టున్ను—ఎత్తలేని భార మును ఎత్తినట్టున్ను—చేయలేని కార్యమును చేసినట్టున్ను—ఎంచుకొని వాటినిపెంచి చెప్పడమున్ను కలదు గాని భూతము మొదలైన పేర్లుగల రోగ ములలో నొక రోగముగల మనిషి సంకోచమున్ను భయమున్ను లేని హేతువు చేత కొంచెము విపరీతముగా భాషలను శ్లోకములను వచించినా—కృత్య ములను జరిగించినా ఆ మనిషికి రానటువంటి భాషలున్ను శ్లోకములు మొద లైనవిన్ని యథాక్రమముగా వచించడమున్ను నిజబలమువల్ల విశేష ప్రయ త్నముమీదనైనా చేయలేని కార్యములను చేయడమున్ను అసంభవముగా నెంచవలసినది—యొకానొక కుటుంబము వారిలో ఒకానొకరు యజమానిని వంచించే కపటబుద్ధిచేతనున్ను భూతావేశమైనట్టు చాలా వికార చిహ్నములను కనుపరచేది కద్దు." [54]

దీని తరువాత 'హితసూచని' లో జగదీశభట్టాచార్యుడను బ్రాహ్మణునకు సంబంధించిన కథ గలదు. ఈ కథలో నొక 'బ్రహ్మ రక్షస్సు' జగదీశ భట్టాచా ర్యుని ఆవహించుట వలన నాతనికి పాండిత్యము వచ్చినదను నభిప్రాయము ముఖ్యమైనది. దీనిని కూడ 'నాయడు' గారు ఖండించిరి.

శ్రీ వీరేశలింగం పంతులుగారు దయ్యములు మొదలగునవి లేవనియు, భూతవైద్యులనువారు వారి జీవనమునకై దయ్యములున్నట్లు కథలు కల్పింతు రనియు వారి వ్యాస సంపుటిలో వ్రాయుచు, ఇంచుమించుగా 'హితసూచని' లోని పై వాక్యములను బోలిన వాక్యములనే గ్రాంథిక భాషలో నిట్లు రచించిరి.

"తాళము వేసియున్న పెట్టెలలోని వస్తువుల నొకదానిలోనివాని మఱి యొకదానిలోనికి మార్చుటయు, దండెముల మీఁదగాని, పెట్టెల లోపల గాని యుండు వస్త్రములను రెండవవా రెఱుఁగకుండఁ దీసి కొన్ని పొరలను గాల్చి

53. హితసూచని 1862; రక్షః ప్రభృతి ప్రమేయము. పుట - ౨౦.

54. హితసూచని. 1862 ; రక్షః ప్రభృతి ప్రమేయము. పుట - ౨౮

చల్లార్చి మఱల నెప్పటిచోప్పున మడతలుగాఁ బూర్వ స్థలములలో నుంచుటయు శుభ్రములైనచోటుల నసహ్యములైన వస్తువులు పడియుండులాగున జేయుటయు, చూరులలో మండుచుండు గడ్డితుట్టలు రాఁజుచుండు కొఱవులు దోపుటయు మొదలగు దుష్కార్యములను జేయుచుండు నాచారముకలవారుగా నున్నారు......... ఇద్దఱు ముగ్గురి కెత్తరాని బరువుల నొకచోటనున్న వానిని వేఱొకచోట నుండునట్టును, ఇండ్లమీఁద రాళ్లు బొగ్గులు మొదలగునవి పడునట్లును చేయించుచు నుండుటయు...... భూత భీతి చేత దేహమును మఱచి పరవశమయి యున్నప్పుడు కొందఱు స్వభాషలో నొండె నితర భాషలలో నొండెఁ దామువిన్న పద్యములను మాటలను స్వభావమునకు భిన్నముగాఁ గారణములేనిదే యసందర్భముగా వచించుట కలదు........... కొందఱు సుందరులు తామువిన్న భాషలను శ్లోకములను గ్రహించుటయును, రోగాదికముచేఁ దెలివియొక్క సహజస్థితి తప్పియున్నప్పుడు లజ్జాభయములులేక సంకోచపడక వాని నుచ్చరించుటయు, చూచినవారి కది విపరీతముగాఁ దోచి భ్రాంతిపడుటయు కూడఁ దటస్థించును." [55]

పంతులుగారి వాక్యములనుబట్టి వారు 'హితసూచని' ని చూచినారని చెప్పవచ్చును. మరియు 'హితసూచని' గ్రంథకర్త—స్వామినీన ముద్దు నారసింహనాయునిగారు—రాజమహేంద్రవరవాసి. 'హితసూచని' ని చూచియున్నను పంతులుగా రేలకో దాని నెచ్చటను పేర్కొనలేదు. ఇటుల పంతులుగారికి పూర్వమే వ్యాసరచన యున్నను; చ్యుతసంస్కారమ. కాని భాషలో, వివిధవిషయములపై చాల వ్యాసములు వ్రాసినవారు వారేగనుక వారి కెక్కువ పేరు వచ్చినది. వారి వ్యాసరచనకు పురికొల్పినది, ఆంగ్లసాహిత్యములో విశిష్టస్థాన మాక్రమించినవ్యాసమే అనుటలో విప్రతిపత్తి లేదు.

## చరిత్ర గ్రంథములు :

ప్రాచ్యపాశ్చాత్యదేశములలో మిక్కిలి పేరుపొందినవారి జీవితచరిత్ర (Biography) లను వ్రాసి, యీ విధమైన రచనలకు మార్గదర్శకులైనవారు కూడ వీరే. ప్రాచీనకాలమున తెలుగునకు 'ఒరవడి' గా పనిచేసిన సంస్కృతములో 'హర్షచరిత్ర' మొదలైన జీవితచరిత్ర లున్నను, పంతులుగారు ఆంగ్ల

55. వీరేశలింగ కవికృత గ్రథములు ; రచనలు ఎనిమిదవ సంపుటము (వ్యాసములు) పుటలు - 388, 389, 390.

సాహిత్యములో గల జీవితచరిత్రల ననుసరించియే వారి రచనాపద్ధతిని తీర్చి దిద్దుకొని రనవచ్చును. సంస్కృతచరిత్రలలోవలె వీరి జీవితచరిత్రలయందు పాండిత్యప్రదర్శనము గాని, చరిత్రకు సంబంధింపనివి గాని, అతిశయోక్తులతో నిండిన వర్ణనలుగాని ఉండవు. సలక్షణమైన భాషలో గొప్పవారి చరిత్రలు, ప్రజలకు నీతి నుపదేశించుటకై, వీరిచే వ్రాయబడి యున్నవి. ఇట్టివి వ్రాయుటలో పంతులుగారు; భారతదేశమునకు మాత్రమే సంబంధించినవారిని గూర్చి కాక, విదేశీయులైన మహానుభావుల చరిత్రలను కూడ గ్రహించి రచించిరి.

జీవితచరిత్ర (Biography) అను దానిని 'ఆక్సఫర్డు ఇంగ్లీషు నిఘంటువు' ఇట్లు నిర్వచించెను :

"......the history of the lives of individual men as a branch of literature."

ఈ నిర్వచనము ననుసరించి వ్రాయుచు, 'హెరాల్డ్ నికొల్సన్' (Harold-Nicolson) అను ఆంగ్లరచయిత తన గ్రంథములో నిట్లు 'జీవితచరిత్ర'ను నిర్వచించెను.

"......It prescribes by implication that biography must be a truthful record of an individual and composed as a work of art; it thus excludes narratives which are unhistorical, which do not deal primarily with individuals, or which are not composed with a conscious artistic purpose."[56]

పంతులుగారి 'జీవితచరిత్ర'లలో నీ ధర్మములన్నియు నించుమించుగా కలవు. సత్యముకాని విషయములను చెప్పకుండుటలోను, వ్యక్తులనుగూర్చి వ్రాయుటలోను, సాహిత్యదృష్టిని మరువకుండుటలోను వీరి 'జీవితచరిత్రలు' ఆంగ్లజీవితచరిత్రల కేమాత్రమును తీసిపోకుండనున్నవి.

ప్రజలకు విజ్ఞానాభివృద్ధి కలిగించు సమస్తవిషయములపై గ్రంథములు రచింపవలెనని దీక్షవహించిన పంతులుగారు 1894-95 లో 'స్వదేశ సంస్థాన చరిత్రలు' అను పుస్తకమును చిత్రపటములతో ముద్రించిరి.

స్త్రీల కష్టసుఖములు తమవిగా భావించి, వారి యభ్యుదయమునకై జీవితమంతయు కృషిచేసిన పంతులుగారు; ప్రపంచములోని ఉత్తమస్త్రీల జీవితములను, ఆంధ్రవనితలకు ఆదర్శములుగ నుండవలెనను నుద్దేశముతో, తెలుగులో రచించిరి. ఈ జీవితచరిత్రలలో, పాశ్చాత్యదేశములకు సంబంధించిన

---

56. 'The Development of English Biography' by Harold Nicolson. Hogarth Lectures on Literature. London, 1927 page - 8.

కాంతలచరిత్రలు, మొదటిభాగముగ వెలువడెను. పాశ్చాత్యదేశములలో స్త్రీలు చేసిన ఘనకార్యములకు చరిత్రలలో స్థానముండుటచేతను, భారత దేశములోని స్త్రీల ఘనకార్యములనుగూర్చి సాధారణముగా సాంధ్రస్త్రీలకు తెలిసియుండుటచేతను; పంతులుగారు పాశ్చాత్యస్త్రీల జీవిత చరిత్రమును మొదటిభాగముగ ప్రచురించుటకు కారణము. ఇందు "గ్రేసు డారిలింగు కన్య,' 'అర్లియన్సు కన్యయనబడు జోన్ ఆఫ్ ఆర్కు,' 'ఎలిజబెత్ ఫ్రైదొర సాని,' 'లేడీ జెన్‌గ్రే,' 'మేరీ కార్పెంటరు,' అను నింగ్లీషు కాంతలయొక్క చరిత్రములును, ఉత్తమమాత యను నుపన్యాసమును, ఉన్నవి.[57]" చిత్ర పటములతో నచ్చయిన ఈ యెనుబదిపుటల గ్రంథము, మంచి ప్రచారమును పొందెను.

పంతులుగారు జీవించియున్న కాలమున భారతదేశమును పరిపాలించు చున్న 'విక్టోరియా మహారాజ్ఞి' జీవిత చరిత్రమునుగూడ వారు రచించి 1897లో ప్రచురించిరి. ఇది వ్రాయుటకు వారు చాల గ్రంథములను శోధించి పరిశీలించి వ్రాసిరి. ఇదికూడ నొకవ్యక్తిజీవితమునకు సంబంధించినదియు, యథార్థవిషయ ములతో కూడియున్నదియు నగుటచే సాహిత్యములో చేరదగిన జీవితచరిత్రయే యగును. పంతులుగారేదివ్రాసినను, సొగసుగ నుండును గనుక దీనికి శిల్ప విషయమునను లోటులేక 'జీవితచరిత్ర' నిర్వచనమున కుదాహరణ ప్రాయము గనే యున్నది.

పంతులుగారు రచించిన మహాపురుషుల చరిత్రలు రెండు. జీససుచరిత్ర, రామమోహనరాయలచరిత్ర అనునవి యీరెండును. ఈ రెండింటిలో జీసస్ చరిత్ర 1894 లో ప్రారంభింపబడి 1913 లో ముగిసినది. ప్రపంచ ప్రవక్త లలో నొకడైన 'జీసస్' చరిత్రమును పంతులుగారు నిష్పక్షపాతబుద్ధితో మిక్కిలి మనోహరముగా రచించిరి. భారతదేశములో సాంఘిక విప్లవమును, భావవిప్లవ మును దెచ్చిన మహానుభావుడైన రామమోహన రాయలచరిత్రను పంతులు గారు రచించిరి. పంతులుగారికి ఆదర్శప్రాయుడైన ఈ మహామహుని చరిత్ర వ్రాయుటలో పంతులుగారు గొప్ప ప్రతిభను చూపిరి. పంతులుగారు వ్రాసిన ఈ జీవితచరిత్రలను పరిశీలించినప్పుడు; 1896 లో 'సర్ సిడ్నీలీ' (Sir Sidney Lee) 'జీవితచరిత్ర'ను వ్రాయు నుత్సాహము పుట్టుటనుగూర్చి పలికిన, **"an instinctive desire to do honour to the memories of those who, by**

---

57. స్వీయచరిత్రము ; రెండవ భాగము; 1915. పుట - ౨౨౧

character and exploits, have distinguished themselves from the mass of their countrymen"[58] అను వాక్యములు సత్యముగా గోచరించును. ఈ దృష్టితోడనే పంతులుగారు మహాపురుషుల, ఉత్తమ స్త్రీల జీవిత చరిత్రలు వ్రాసిరి.

పంతులుగారు జీవిత చరిత్రలను ప్రత్యేక దృష్టితో రచించిరి. మహానుభావుల జీవిత చరిత్రల నుండి మనము గ్రహింపవలసినది చాల కలదనియు, ఆ విషయములను గ్రహించుటకు చరిత్ర గ్రంథముల కంటె జీవిత-చరిత్ర లెక్కువగా నుపకరించుననియు వారి యూహ.

తెలుగు వచన రచనను గూర్చి వ్రాయునపుడు ఆంగ్ల సాహిత్య మందలి 'డ్రైడన్' (Dryden) కవికి, పంతులుగారికి గల పోలికలను గూర్చి వ్రాసితిని. జీవిత చరిత్ర రచన విషయమునను ఆంగ్లములో 'డ్రైడన్' నకు ప్రత్యేకత యొకటి కలదు. ఆంగ్లభాషలో 'జీవిత చరిత్ర' (Biography) అను మాటను మొట్టమొదటిసారిగా వాడినవాడు 'డ్రైడన్' కవియే అని తెలియుచున్నది.

"In 1683 he prefaced an edition of Plutarch with an Introduction in which the actual word "biography" first occurs in English, and is defined as "the history of particular men's lives.""[59]

చరిత్ర కంటె 'జీవిత చరిత్ర' యందు వైశిష్ట్యము కలదని ఆ యాంగ్ల కవి (Dryden) ఇట్లు వ్రాసెను :

"........pleasure and instruction......the perfection of the work and the benefit arising from it are both more absolute in biography than in history........."[60]

జీవిత చరిత్ర యొక్క ప్రత్యేకతను గుర్తించినవారు గనుకనే వీరేశలింగం పంతులుగారు 'ఆంధ్ర కవుల చరిత్ర' ను రచించిరి. చారిత్రకాధారములు గాని, పుస్తకములు గాని విశేషముగ వెలుగులోనికి రాని యా కాలమున నట్టి కృషికి పూనుకొనుటలోనే పంతులుగారి కార్యదీక్షయు, పరిశోధనాశక్తియు తేటతెల్లమగును. 'కవుల చరిత్ర' ను పంతులుగారికి పూర్వమే గురుజాడ

---

58 Lecture republished in Cornhill Magazine, March 1896, as quoted by Harold Nicolson in his book on 'The Development of English Biography', Page-11.

59. Ibidem. Page-70.

60. Ibidem. Page-71.

శ్రీరామమూర్తిగారు 'కవి జీవితములు' అని ప్రారంభించినను,[61] వారు ఆ గ్రంథమును పూర్తి చేయలేకపోయిరి.

కవుల చరిత్ర విషయములో తాము పడిన కష్టములనుగూర్చి పంతులుగారే తమ స్వీయచరిత్రలో నిట్లు వ్రాసిరి : "పైకి చూచువారికి కవుల చరిత్ర విషయమున నేను పడినపాటు తెలియకపోవచ్చును గాని యే యితర గ్రంథ రచనావిషయమునను నే నింత కష్టపడలేదని నమ్ముచున్నాను."[62] ఈ కవుల చరిత్రను మూడు భాగములుగ విభజించి యందు మొదటిభాగమును 1887లో ప్రకటించిరి. మన దేశములో చరిత్రలను వ్రాయు నాచారము లేకుండుటచే, కవుల చరిత్రలను వ్రాయునప్పుడు వీరేశలింగముగారు చాల శ్రమపడిరి. ఆంగ్లములో 'జాన్సన్' (Dr. Johnson) కవిజీవితములు (Lives of the Poets) మిక్కిలి శ్రమపడి వ్రాసెను. గురుజాడ శ్రీరామమూర్తిగారును, వీరేశలింగం పంతులుగారును ఆంగ్లరచయితల పద్ధతుల ననుసరించియే తమ గ్రంథములను రచించిరనుటకు గ్రంథనామములే నిదర్శనములుగ నున్నవి.

వీరేశలింగంపంతులుగారి 'కవుల చరిత్ర' సాహిత్య విమర్శగనే గాక, జీవితచరిత్రగ కూడ గ్రహింపవలెను. కవుల జీవితములనుగూర్చి లోకమున వాడుకలో నున్న కథలను, భావములను తన గ్రంథములో ప్రవేశపెట్టి, వానిపై తన యభిప్రాయమును నిష్కర్షగను నిశితముగను చెప్పెను. ఈ విషయమున 'జాన్సన్' తో వీరికి పోలిక గలదు. 'జాన్సన్' ఒక వ్యాసమున 'జీవితచరిత్ర' వ్రాయు విషయమును గూర్చి ప్రసంగించుచు, తద్రచయిత లక్ష్యము నిట్లు నిరూపించెను :

"If we owe regard to the memory of the dead, there is yet more respect to be laid to knowledge, to virtue, and to truth."[63]

---

61. "ఆంధ్రకవుల చరిత్రములను సిట్టి నవీన గ్రంథము నాంధ్రభాషయందు మొట్ట మొదటఁ గల్పించినది శ్రీ (గురుజాడ) శ్రీరామమూర్తి పంతులువారే యయినను, ఈ యాంధ్ర కవుల చరిత్రము శ్రీరామమూర్తి పంతులువారి కవి జీవితములకంటె ననేక కారణములచే నెక్కుడు ప్రాశస్త్యమునుగాంచి యున్నదని చెప్పవలసి యున్నది."

(వీరేశలింగకవి చరిత్రము - తోలేటి వేంకట సుబ్బారావుగారు. తొలికూర్పు 1894; మలికూర్పు 1910; పుట - 253.)

62. స్వీయచరిత్రము, రెండవ భాగము; 1915. పుట - ౨౦౩.

63. 'The Development of English Biography' By Harold Nicolson; Page-82.

కవుల చరిత్రను వ్రాయునపుడు పంతులుగారు పై వాక్యముయొక్క సత్యము నెప్పుడును మరువలేదు. కవులనుగూర్చి వ్రాయునపుడు తమ అంతరాత్మకు తోచినట్లును, తమకు లభించినంతవరకు గల చరిత్రసామగ్రి తెలిపినట్లును, వ్రాయుటవలన తదితరములైన కారణము లేవియు నాయనను బాధింపలేదు. కనుకనే కవుల చరిత్ర; ఉత్తమ జీవితచరిత్రయును, విమర్శగ్రంథము నైనది.

## శాస్త్రగ్రంథములు :

భాషాసాహిత్యవేత్త యయిన పంతులుగారు, తమ కృషిరంగముకాని విజ్ఞానశాస్త్ర విషయములనుగూర్చియు గ్రంథములు రచించి తమ బహుముఖ ప్రజ్ఞను చాటిరి. ఆంగ్లసాహిత్య ప్రభావముగా నీ రచనలను చెప్పలేముగాని, సంధియుగమున నొక ప్రజ్ఞానిధి మనస్సుపై పాశ్చాత్యవిజ్ఞాన సంస్కృతులెంత లోతుగా పనిచేయునో గ్రహించుట కీ కృషి విషయము పనికివచ్చును. పంతులుగారు సహజముగ సాహితీసేవకుడయినను, అజ్ఞానములోనున్నజాతి నుద్ధరింప బద్ధకంకణుడై యుండుటచే విజ్ఞానశాస్త్రగ్రంథ రచనము చేయుటయు తన విధిగా నెంచుకొనెను. పంతులుగారికి సమకాలికులలో ప్రత్యేకత తెచ్చినది ఈ బుద్ధి విశేషమే. ఈ విషయమునను పంతులుగారు కొంద రాంగ్లేయ సాహిత్య వేత్తలను పోలుదురు. పదునెనిమిదవ శతాబ్దిలో ఆంగ్లశాస్త్రవేత్తలు కొందరు తమ విజ్ఞానశాస్త్రగ్రంథములను సాహిత్యయోగ్యతలు గలవానినిగా రచించిరి. అంతకుముందు శతాబ్దిలో సర్ ఫ్రాన్సిస్ బేకన్ (Sir Francis Bacon; 1561-1626) మొదలైనవారు వారి శాస్త్రగ్రంథములకు సాహిత్య గౌరవమును సంపాదించి మార్గదర్శకులైరి. 'ఏడమ్ స్మిత్' (Adam Smith; 1723-1790) మొదలైనవారు పదునెనిమిదవ శతాబ్దిలో సాంఘిక శాస్త్రవిజ్ఞానమును సాహిత్యరూపముగల రచనలలో ప్రపంచమున కందజేసిరి. పంతులుగారు, ఇట్టి వారిని ఒరవడిగ పెట్టుకొని పాశ్చాత్య విజ్ఞానశాస్త్రగ్రంథములను తెలుగులోనికి తెచ్చుటకు యత్నించి కృతకృత్యులైరి. వారి చేతిలో శాస్త్రగ్రంథము సాహిత్యగ్రంథ మయ్యెననుట అతిశయోక్తికాదు.

పంతులుగారు సాహిత్యములోను, సంఘములోను విప్లవము తీసికొని వచ్చి జనుల భావములలో మార్పు తేవలెనని యత్నించిరి. ఈమార్పు వచ్చుటకు విజ్ఞానశాస్త్రజ్ఞానమును ప్రజలకావశ్యకమే. అట్టి జ్ఞానవంతులైన ప్రజలహృదయ

క్షేత్రములలోనే తాము చల్లిన భావబీజములు మొలకలెత్తునని ఆయనకు తెలియును. అందులకే ఆయన శాస్త్రగ్రంథరచనకు పూనుకొనెను.

"జనులలోఁ గల మూఢవిశ్వాసములు పోవుటకుఁ బ్రకృతి శాస్త్రజ్ఞాన మావశ్యకమని తలఁచి, తెలుఁగులోఁ బ్రకృతి శాస్త్రములు లేకుండుట విచారించి, యా లోపమును సాధ్యమైనంతవఱకుఁ బోఁగొట్టవలెనన్న యుద్దేశముతో," పంతులుగారు 1878.వ సంవత్సరమునకు పూర్వమే ప్రశ్నోత్తర రూపమున పదార్థ వివేచక శాస్త్రమును రచించిరి. 1888 లో 'శారీర శాస్త్రము'ను రచించి ప్రచురించిరి. దీని నా దినములలో నందరు మెచ్చుకొనిరి. నాడు బందరునుండి వెలువడుచున్న 'హిందూ దేశాభిమాని' యను పత్రిక ఏప్రిల్ 6 వ తేదీని 1889 లో, ఇట్లు పంతులుగారి పుస్తకమునుగూర్చి వ్రాసెను.

"Mr. Kandukuri Veeresalingam Pantulu, the senior Pandit of the Government College, Rajahmundry, has published a free Translation of Professor Huxley's Physiology......From the preface of the book we learn that the Pandit has taken great pains in going through all the books relating to the subject both English and Telugu......... Madras Presidency may very well feel proud of having a native like Mr. Veeresalingam........."[64]

స్త్రీల యభ్యుదయమునకై పనిచేసిన ఈ మహనీయుడు, వారికి ఆరోగ్య విధులనుగూర్చి తెలుపుటకై 1889 లో 'దేహారోగ్య ధర్మబోధిని' అను గ్రంథమును ప్రచురించెను. ప్రజలలో జ్యోతిశ్శాస్త్ర విషయమునగల మూఢాభిప్రాయములను పారద్రోలుటకై 1895 లో ప్రాచ్య పాశ్చాత్యగ్రంథము లనేకములు చదివి 'జ్యోతిశ్శాస్త్ర సంగ్రహము'ను ప్రచురించెను. జంతువులకు సంబంధించిన విజ్ఞానము ప్రజలకు గలుగుటకై 1893 లో 'జంతుస్వభావ చరిత్రము'ను ప్రకటించిరి.

ఇట్లు విజ్ఞాన శాస్త్రగ్రంథములు రచించుటయేగాక, బాలురకు సులభముగా నుండుటకై, ఆంగ్ల వ్యాకరణపద్ధతిని 'సంగ్రహ వ్యాకరణము' అను తెలుగు వ్యాకరణము నొకదానిని 1872 లో రచించి 1875 లో ప్రకటించిరి. దీనినిగూర్చి తమ స్వీయచరిత్రలో; "బాలురకు సుబోధ మగునట్లుగా వర్ణపరిచ్ఛేదము, పదపరిచ్ఛేదము, వాక్య పరిచ్ఛేదము, కావ్య పరిచ్ఛేదము, అని యింగ్లీషు పద్ధతి ననుసరించి నేను సంగ్రహ వ్యాకరణము చేసితిని" అని వ్రాసిరి. ఇట్లు ప్రజోపయోగములగు శాస్త్రగ్రంథములను పంతులుగారు తెలుగులోనికి తెచ్చిరి. ఈ రచనలకు వారిని పురికొల్పినది వారికిగల పాశ్చాత్య సంస్కారము.

---

64. స్వీయచరిత్రము. రెండవభాగము. 1915. పుటలు - ౧౫౩, ౧౫౪, ౧౫౫.

ప్రహసనములు :

సాహిత్యముద్వారమున సంఘసంస్కరణము చేయవలెనని బద్ధకంకణు లైన పంతులుగారు, సంఘములోని దురాచారములను ఎగతాళి చేయుచు ప్రహసనముల నెన్నింటినో రచించిరి ఈ ప్రహసనములు చాలవరకు, ఆంగ్ల సాహిత్యమందలి మాతృకల ననుసరించి రచింపబడినవే. ప్రతిభావంతుడైన రచయిత చేయునట్లే, పంతులుగారు ఆంగ్లరచనలను చదివి ఆ సంస్కారముతో తెలుగునందు రచనలు చేసిరిగాని, ఆంగ్లములో గల ప్రహసనములను యథాతథముగ ననువదింపలేదు. ఈ విషయమై వారు తమ స్వీయచరిత్రలో నిట్లు వ్రాసిరి :

"అపూర్వబ్రహ్మచర్య ప్రహసనము, విచిత్రవివాహ ప్రహసనము, మహా బధిర ప్రహసనము, పునర్మరణ ప్రహసనము, బలాత్కార గానవినోద ప్రహసనము, కలహప్రియా ప్రహసనము, మహామహోపాధ్యాయ ప్రహసనము, యోగనిద్రా ప్రహసనము, మహావంచక ప్రహసనము, అసహాయశూర ప్రహసనము అను పదియు నింగ్లీషుభాషలో నున్న ప్రహసనముల ననుసరించి పేరులను కొంత కథను తెనుగువారి కనుకూలముగా నుండులాగున నేను మార్చి చేసిన ప్రహసనములు." [65]

పంతులుగారు 1886-వ సంవత్సరమునందు 'అపూర్వ బ్రహ్మచర్య ప్రహసనము' రచించిరి [66] మిగిలినవికూడ ఆ ప్రాంతములోనే రచించి రన వచ్చును. "ఇంగ్లీషులోని ప్రహసనముల ననుసరించి" యనిమాత్రమే పంతులు గారు వ్రాసిరిగాని, ఏ ప్రహసనములో పేర్కొనలేదు. ఏ ప్రహసనముల ననుసరించియుందురో సూక్ష్మముగ పరిశీలించినచో కొన్ని విషయములు తెలియును. ఈ పరిశీలనమునకు పూర్వము, ఆంగ్లసాహిత్యములో నే కాలమున సాంఘిక విమర్శలు గల ప్రహసనములు బయలుదేరెనవో పరిశీలించినచో కొన్ని విషయములు మనకు తెలియును. పంతులుగారు 'షేక్స్పియరు' నాటకములలో కొన్నింటిని, 'షెరిడెన్' నాటకములలో కొన్నింటిని అనుసరించి తెలుగులో రచనలు చేసిరి. ఆ యాంగ్లకవుల నడుమ కాలములో గల కవులరచనలను కొంత పరిశీలించినచో విషయము తేటతెల్ల మగును

---

65. స్వీయచరిత్రము. రెండవభాగము. 1915. పుట - ౨౧౩.

66. వీరేశలింగకవి చరిత్రము – తొలేటి వేంకట సుబ్బారావు. తొలికూర్పు 1894; మలికూర్పు 1910; పుట - 248.

ఆంగ్ల నాటక రంగమున 'షేక్స్పియరు' (1564-1616) మహాకవి యుగము ముగిసినతరువాత నంధకార మావరించినది. 1642-వ సంవత్సరము సెప్టెంబరు 2-వ తేదీనాడు ఆంగ్ల ప్రభుత్వము చేసిన శాసనముతో తాత్కాలికముగా ఆంగ్ల నాటకరంగము అజ్ఞాతవాసములోనికి పోయెను అప్పటికప్పుడే ఆంగ్లనాటకము వెఱ్ఱితలలు వేయజొచ్చినది.[67] మరల నాటకము, రెండవ ఛార్లసు రాజ్యమునకు వచ్చినప్పటి నుండియు ప్రజాదరణమును పొందెను. రెండవ ఛార్లసు నాటకములు వేయుటకై రెండు నాటకశాలలకు అధికారమిచ్చెను. దీనితో మరల ఇంగ్లీషు నాటకము క్రొత్తజీవమును పొందెను.[68]

ఇంగ్లీషు రంగస్థలము 1660 మొదలు 1700 వరకు క్రొత్త పద్ధతిలో నుండెను. ఈ కాలములో రంగస్థలము నాదరించినవారు చాలమంది రాజాశ్రితులును, వారి యనుయాయులును. అందువలన నాటక రచనలోను, ప్రదర్శనమునను చాల మార్పులు వచ్చెను. ఈ మార్పుల వలన రెండు విధములయిన నాటక రచన జరుగుటకు వీలయ్యెను. ఇందు మొదటిది, ఆదర్శప్రాయమైన వీరోచితమగు కారుణికము (Heroic Tragedy). రెండవది సంఘ విమర్శనాత్మకమైన ప్రహసనమును బోలిన రచన (Comedy of Manners). ఈ రెండు విధములయిన రచనలు బయలుదేరుటకు నాటి కాలము కూడ చాల తగియుండెను లోపములతోనిండిన సంఘములో; సాధించుటకు వీలులేని, ఆదర్శప్రాయములైన భావములతో నిండినది 'వీరోచితమగు కారుణికము'. ఇది ప్రజల భావాంబరముననే కలదుగాని వాస్తవముగా లేదు. లేనిదానిపై గల మక్కువ, ఈ 'నాటక పద్ధతి' రూపమున నభివ్యక్తమయినది. సంఘ విమర్శనాత్మకమైన నాటకము మనుష్యులను విమర్శించుటకు బదులుగా, వివిధములైన మనస్తత్త్వములు గలవారి పుట్టుకకు కారణమైన సంఘ వ్యవస్థను అవహేళనము

---

67. "The ordinance of 2 September, 1642, which decreed that 'publike Stage-Plays shall cease, and bee forborne', marked, rather than caused, the end of that great dramatic era which had risen to full height in Shakespeare and had already lapsed into literary and moral decadence."

(English Drama of the Restoration and Eighteenth Century (1642-1780) By G. H. Nettleton, New York, 1914. Page-1).

68. "With the creation of two companies of actors, under letters patent issued by Charles II, 21 August, 1660, and with the establishment of the two 'Patent Theatres', the period of modern English drama may be said to have been inaugurated."

(Ibidem. Page-2).

చేయుచు ప్రజల యాదరమును పొందినది. ఆ నాటక దర్పణమున ప్రజలు తమ ముఖములను చూచుకొనుటతో దానికి కృతకృత్యత సిద్ధించెను.

ఆంగ్లవిమర్శకులచే 'రెస్టొరేషన్ డ్రామ' (Restoration Drama) అని పిలువబడు నాటకపద్ధతి వీరేశలింగం పంతులుగారిని బాగుగా నాకర్షించిన ట్లున్నది. ఈ నాటకపద్ధతిలో వారికి కావలసిన 'సంఘవిమర్శ' కలదు. సంఘమందలి వివిధ శ్రేణులకు చెందిన మనుష్యుల ఆచారవ్యవహారముల విమర్శయే ఈ నాటకమునకు ప్రాణము. ఇంగ్లీషులోకూడ నీ పద్ధతి ఫ్రాంసుదేశమునుండి వచ్చిన కొన్ని భావబీజములవలన వ్యాప్తినొందినదే. మోలియర్ (Molière) వంటి పరాసునాటకకర్తలు ఆంగ్లనాటకకర్తల కెన్నియో భావముల నప్పుగా నిచ్చిరి.[69] పైనుండి వచ్చిన భావములు, దేశీయములైన భావములు కలిసి, ఆంగ్లనాటకక్షేత్రమును సారవంత మొనరించినవి.

ఈ ఆంగ్లనాటకరంగస్థలమున ప్రధానపాత్రయైన మహాకవి 'డ్రైడన్' (John Dryden. ; 1631-1700) నాటకకవిగా పెద్దపేరు సంపాదింపకున్నను; అన్నిరంగములలోను కృషిచేయుటవలనను, సమకాలిక మయిన రచనావిశేషములను నిశితముగా విమర్శించుటవలనను, ఈ రంగమున ప్రత్యేక స్థానమును పొందియుండెను.[70]

సమకాలికమగు ఆచార వ్యవహారముల విమర్శించు నాటకమును రచించినవారిలో, మొదటివాడు 'జార్జి ఎథెరిజ్' (George Etherege ; 1635-1691). పరాసుకవియైన 'మోలియర్' ననుసరించి నాటకములను ఈతడు రచించెను. ఈతని తరువాత ఈ పద్ధతిని నాటకములు రచించినవాడు 'విలియమ్ వైకర్లే' (William Wycherley ; 1640-1716). ఈతడును పరాసు నాటకము యొక్క ప్రభావమునకు లోనయినవాడే. ఈ కాలమందు ప్రఖ్యాతికి వచ్చినవాడు 'విలియమ్ కాన్గ్రీవ్' (William Congreve ; 1670-1729).

---

69. "The advent of the master of French comedy brought to English playwrights of the new era a model to admire and imitate......with the reopening of the theatres and the growth of Molière's reputation, English writers turned increasing attention to French Comedy."

(Ibidem. Page-51).

70. "At the centre of all lies John Dryden (1631-1700), with his varied achievement in comedy, heroic play and tragedy, and above all his critical capacity for estimating his own and other men's literary attainments."

('A short History of English Drama' by B. Ifor Evans ; a Pelican Book; Page-110.)

నిజముగా ఇంగ్లీషు 'కామెడీ' ఈతని చేతులలో పరిణతి పొందినది. సాంఘికేతి వృత్తము గల ఈ రూపకమును, సంస్కృతములోని 'ప్రకరణము'తో పోల్చవచ్చును. ఇది, కేవలము పోలికకొరకే గాని, రెండింటికిని చాల భేదములు గలవు. ప్రహసన మని వీరేశలింగం పంతులుగారు వ్రాసినది; 'ఇంగ్లీషు కామెడీ' నుండియు, 'ఇంగ్లీషు ఫార్సు' నుండియు కూడ కొంత కొంత స్వీకరించి వ్రాసినది. వీరేశలింగం పంతులుగారి 'ప్రహసనములు' కేవలము ఫార్సులు కావు. కొంత సన్నివేశ కల్పనము ; పాత్ర పోషణముండును గనుక. కేవలము 'ఇంగ్లీషు కామెడీ' అనుటకును వీలులేదు, పాత్రపోషణముగాని, సన్నివేశ కల్పనముగాని, వీరిప్రహసనములలో పరిణతి పొందియుండదు గనుక. ఈసందర్భమున నొక ఆంగ్ల విమర్శకుడు వ్రాసిన ఈ క్రిందివాక్యములను పరిశీలించినచో ఈ విషయము తేటతెల్లమగును.

"There is very little true comedy in English......For comedy is more than farce, the play where untoward incidents render the characters ridiculous, and it is also more than the play of intrigue with a happy ending, which the histories of drama so often for convenience classify under comedy. Nor is it burlesque, for there the movement, however amusing, depends upon some life other than its own. Comedy, in its truest interpretation, depends, as Meredith saw, upon a conception of society, and the comic writer will hold up the mirror to his age, depicting its eccentricities, its deviations from some agreed norm."[71]

పై వాక్యములను పృష్ఠభాగము (Background) గ నిడుకొని వీరేశలింగంపంతులుగారి ప్రహసనములను పరిశీలింపవలయును. అట్లు పరిశీలించినపుడు ఆయన కళాప్రతిభలు, ఆయనలోపములు, ఆయన ఆంగ్ల సాహిత్యమునుండి గ్రహించిన విషయములు తెల్లమగును. పైని వివరింపబడిన నాటకకర్త లందరికంటెనుకూడ పంతులుగారికి 'నైతికదృష్టి' తీవ్రము. ఆయన వారిశిల్పమును గ్రహించినంతగా, వారి దృక్పథమును గ్రహింపలేదు.

ఇంగ్లీషులో ఆచార వ్యవహారములను విమర్శించు నాటకములను వ్రాసి పేరు పొందినవారి కాలములో నింకను ఇరువురు గలరు. వీరిరువురిలో మొదటివాడు 'జార్జ్ ఫర్క్వహార్' (George Farquhar; 1678-1707) రెండవవాడు

71. Ibidem; Page-113.

'సర్ జాన్ వాన్బ్రిగ్' (Sir John Vanbrugh; 1664-1726). ఈ యిరువురును 'కాన్గ్రీవ్' (Congreve) అంతటి ప్రతిభావంతులు కాకపోయినను, 'కామెడీ' వ్రాయుటలో దిట్టలే. వీరిరువురితో ఈ 'యుగము' (Restoration Period) సాహిత్యవిషయమున నంతమైనట్లే యెంచవచ్చును.

పదునెనిమిదవ శతాబ్ది, పందొమ్మిదవ శతాబ్దిలోని పూర్వార్ధము; నాటకరచన విషయమున, ఇంగ్లీషు సాహిత్యమున ఊషరక్షేత్రము.

**"It cannot be denied that the eighteenth century and the first fifty years of the nineteenth were, with the exception of only some half-a-dozen names, a dreary period as far as dramatic authorship is concerned."[72]**

ఈ కాలమందు బయలుదేరిన రచనలలో వీరేశలింగంపంతులుగా రనుసరింపవలసిన వేమియు లేవనవచ్చును. కాని పదునెనిమిదవ శతాబ్దిచివరి భాగమున ప్రతిభావంతులైన; 'ఆలివర్ గోల్డ్స్మిత్' (Oliver Goldsmith; 1728-1774.) 'షెరిడన్' (Sheridan; 1751-1816) అనువార లవతరించి ఆంగ్లసాహిత్యములో క్రొత్తదనమును మరలతెచ్చిరి. శ్రీ వీరేశలింగంపంతులు గారు వీరిరువుర ననుసరించి రచనలుచేసిరని మనకు తెలిసినవిషయమే. ఈ విధముగా పరిశీలించి చూచినప్పుడు, పంతులుగారి ప్రహసనములకు మాదిరిగా 'రెస్టొరేషన్ డ్రామా'ను (Restoration Drama) గ్రహింపవచ్చును.

పందొమ్మిదవ శతాబ్దిలో, తన సాహిత్యజీవితమునంతను ఇంచుమించుగా గడిపిన పంతులుగారు; పదునేడు, పదునెనిమిది శతాబ్దులలో బయలుదేరిన ఆంగ్లసాహిత్యమును మాదిరిగా గ్రహించిరనుటలో విప్రతిపత్తి ఏమియును లేదుగదా!

ఇంక నిప్పుడు పంతులుగారు రచించిన ప్రహసనములను వరుసగా— ఆంగ్లసాహిత్య ప్రభావము కొరకు పరిశీలింపవలసియున్నది. ఇంగ్లీషు సాహిత్య ప్రభావము కల మొదటి ప్రహసనము 'అపూర్వ బ్రహ్మచర్య ప్రహసనము'. రమాకాంతము పంతులు పరస్త్రీలోలుడు. అందువలన ఆయన సేవకుడైన కరటకరెడ్డి పంతులునకు వెరచి తనకు వివాహముకాలేదని ఆయనతో చెప్పును. ఒకనాడు పంతులు తన భార్య పుట్టింటికి పోగా జూచి, ఇంకొకరి భార్యను సాగనంపుటకై పోవును. పంతులు పోగా చూచి సేవకుడు తన భార్యను పంతు

72. Ibidem; Page-127.

లింటికి తెచ్చును. ఇంతలో పంతు లింటికి మరలివచ్చి సేవకుని భార్యను చూచి భ్రాంతిపడును. సేవకుడు ఆమె తన భార్యయని గాని, ఆతడు తన భర్తయని ఆమె గాని చెప్పరు. పంతులు భ్రుకుటిమించ గొట్టుచుండగా పంతులు భార్య శ్యామలాంబ పుట్టింటి నుండి తిరిగివచ్చును. ఆమెను చూచినచో భార్యకు కోపము వచ్చునను భయమున పంతులు సేవకునిలో, ఇంటిలో గల స్త్రీ దాసి యనియు, సేవకుని భార్య యనియు చెప్పుమనును. ఆత డట్లే చెప్పును. శ్యామలాంబ తనకు మంచి దాసి లభించినందులకు సంతోషించును. భార్య వలన తిట్లు తప్పినవని పంతులు సంతోషించును. పంతులుతో తానింక నిర్భయముగా గృహస్థునని చెప్పవచ్చునని సేవకుడు సంతోషించును.

ఈ ప్రహసనమునకు 'ఇది మూల'మని చెప్పుట కష్టముగాని, నాయకుని అవినీతినిబట్టి ఆతడు 'రెస్టొరేషన్' నాటకములలోని కొందరు నాయకులను పోలియున్నాడనవచ్చును. ఇట్టి స్త్రీలోలుని పాత్రలను 'ఎథెరిజ్' (Etherege) 'వైకర్లే' (Wycherley) అనువారు సృష్టించిరి ఈ ప్రహసనమున పాశ్చాత్య సంప్రదాయములు అడుగడుగున కలవు.

సేవకుడయిన కరటకరెడ్డి భార్య మోహిని, తనభర్త తప్పుచేయగా "వక్క ముద్దుపెట్టు క్షమిస్తాను" అని పలుకును. భార్యాభర్తలిట్లు తగవులాడు కొనుచుండగా గృహ యజమానురాలు శ్యామలాంబవచ్చి, సంగతేమియని మోహినిని ప్రశ్నించును. ఆ సంభాషణ ఇది.

"మోహి—అమ్మా! తప్పితమంతా ఇతనిదే. నేను తనకు ముద్దియ్యబోతే పుచ్చుకున్నాడుకాడు."

"శ్యామ—యేమిటి! పెళ్ళాము ప్రేమతో ముద్దుయిస్తే పుచ్చుకున్నావు కావా? ఏది, ఇప్పుడు నా యెదుట ముద్దుపెట్టుకో."

(అపూర్వ బ్రహ్మచర్య ప్రహసనము; ఒకటవ సంపుటము, 1949, పుట-26.)

పై వాక్యములను చదివినవారికి, అవి తెలుగులో సహజముగాలేవనియు, ఆంగ్ల సంస్కృతి వాసనావాసితము లనియు తెలియదా?

దీని తరువాత పరిశీలింపవలసినది వారి "విచిత్ర వివాహప్రహసనము." 'ధనకోటిరాజు' అను హైకోర్టు వకీలు నారీద్వేషి. ఆతని అన్నకుమారుడైన 'వేంకటపతిరాజు' నకు వివాహమాడవలెనని యున్నను, ధనకోటిరాజు ఒప్పు కొనడు. తుదకు 'వేంకటపతిరాజు' బాధను పడలేక, ఇరువదివేల రూపాయలు

తెచ్చియిచ్చు వధువులభించినచో వివాహాము చేయుదునని మాట ఈయగా, వేంకటపతిరాజు తత్ప్రయత్నమున నుండును. వేంకటపతిరాజు రతిసుందరియను నామెను ప్రేమించెను. ఆమె మేనత్త మోహినీదేవి. ఆమెకు రతిసుందరిని వేంకటపతిరాజు వివాహామాడుట ఇష్టము. ఒకనాడు మాటలసందర్భమున వేంకటపతిరాజుతో ధనకోటిరాజు తాను వివాహామాడుట యనునది యుండ దనియు తనచేత వివాహామాడించినచో వేంకటపతిరాజునకు ఇరువదివేల రూపాయలిత్తుననియు పందెము వేయును. రతిసుందరి మేనత్తయైన మోహినీ దేవి మోసముచేసి ధనకోటిరాజును తాను వివాహామాడి, రతిసుందరీ వేంకట పతిరాజుల వివాహామునకు ధనకోటిరాజంగీకరించునట్లు చేయును.

ఈ ప్రహసనమును సూక్ష్మముగ పరిశీలించినచో, దీనియందు 'విలియమ్ కాన్గ్రీవ్' (William Congreve) రచించిన 'ది ఓల్డ్ బేచ్ లర్' (The Old Bachelor) అను నాటకము యొక్క ఛాయలు కన్పట్టును. పంతులుగారి ప్రహస నములోని ధనకోటి రాజునకును, ఆంగ్లనాటకములోని 'హార్ట్ వెల్' (Heartwell) నకును చాల పోలికలు గలవు. 'హార్ట్ వెల్'ను గురించి "...the surly old bachelor, pretending to slight women, secretly in love with Silvia," అని పలికిరి. ధనకోటిరాజు కూడ నట్టివాడే. మోహినీదేవిని చూచి నప్పటినుండియు, "ఆహాహా! ఈవిడెది బహు సుందరమయిన విగ్రహాము. మొగం యెప్పుడూ నవ్వుతూ కలకల లాడుతూ వుంటుంది. నాకు యీామె భార్య అయితే నేను బహు సుఖంగా వుందును. భార్యా? ఆమాట తలపెట్ట కూడదు. వద్దు వద్దు. ఈ యింద్రియ సుఖాపేక్షనుంచి నా హృదయము మళ్ళునుగాక!"[73] అని డోలాందోళిత మనస్కుడగును.

ఆంగ్ల నాటకములో 'హార్ట్ వెల్' (Heartwell) రహస్యముగా 'సిల్వియా' (Silvia) గృహామునకు పోబోవుచు తనలో తానిట్లనుకొనును.

"Heart—Why, Whither in the devil's name am I a - going now? Hum—let me think - is not this Silvia's house, the cave of that enchantress, and which consequently I ought to shun as I would infection? To enter here, is to put on the envenomed shirt, to run into the embraces of a fever, and in some raving fit be led to plunge myself into that more consuming fire, a woman's arms. Ha! Well recollected, I will recover my reason, and begone."

73. వీరేశలింగకవికృత గ్రంథములు: మొదటి సంపుటము. (ప్రహసనములు) 1949. పుట — 58.

"......O thou delicious, damned, dear, destructive Woman! 'sdeath, how the young fellows will hoot me! I shall be the jest of the town. Nay, in two days, I expect to be chronicled in ditty, and sung in woeful ballad, to the tune of "The superannuated Maiden's Comfort" or "The bachelor's fall"............"[74]

లోపల కుతూహలమున్నను, సంఘము తన్ను హేళనము చేయునేమో యన్న భీతిని 'హార్ట్ వెల్' ప్రదర్శించినట్లే; వేంకటపతిరాజు తన్ను చూచినవ్వు నేమోయను భీతి ధనకోటిరాజును బాధించుచుండెను.

"ధనకోటిరాజు—.........నా మనస్సులోవున్న అభిలాష ప్రకారంగా యిప్పుడు యీవిడెను వివాహం చేసుకోవడానికి వప్పుకుంటే యీ దౌర్భాగ్యుడు వేంకటపతిగాడు బ్రతికివున్నంతకాలమూ నన్నాక్షేపించి నవ్వుతూ వుంటాడు."

(విచిత్ర వివాహ ప్రహసనము. పుట—65).

మీరుకూడ నెప్పుడో స్త్రీల వలలలో పడెదరని వేంకటపతిరాజు పలుకగా, ధనకోటిరాజు, "నేను పెళ్ళి కావలెనని కోరేకాలమా? యెన్నటికిన్నీరాదు. నేను భార్య కావలెనని కోరేటంత గాడిదనయితే........." అని సమాధాన మిచ్చును.

ఆంగ్లనాటకములో ఇట్టి సన్నివేశమునందే 'హార్ట్ వెల్' (Heartwell) ఈ విధముగా పల్కెను.

"Heart—Marry, quotha! I hope, in Heaven, I have a greater portion of grace, and I think I have baited too many of those traps to be caught in one myself."[75]

ఆంగ్లనాటకములో—నాటి సంప్రదాయము ననుసరించి— కొంత శృంగారము ప్రతిమించియున్నది. తెలుగు ప్రహసనములో నట్లుకాదు. ఆంగ్ల నాటకమునందు ముఖ్య కథకు అంగములుగా కొన్ని సన్నివేశములు కలవు. తెలుగుకథయందవి లేవు. ఆంగ్లనాటకమును సింహావలోకనముచేయుచు నొక విమర్శకు డిట్లు వ్రాసెను.

"The conclusion is not a triumph of good over evil, but of the keen over the stupid."[76]

---

74. 'The Old Bachelor' (1693) by William Congreve. (Act-III; Scene-II).
75. Ibidem (Act-I; Scene-I)
76. 'A short History of English Drama' by B. Ifor Evans.
(A Pelican Book) Page-115.

ఈ వాక్యము తెలుగు ప్రహసనము విషయమునను సత్యమే. ఇందు మోహినీదేవి తన చాకచక్యమువలన, ధనకోటిరాజును 'బుట్టలో వేసి', తన మేనకోడలును వేంకటపతిరాజునకిచ్చి వివాహము చేయును. నారిద్వేషియైన ధనకోటిరాజును తాను వివాహమాడును.

ఆంగ్లనాటకముల పఠనమువలన కలిగిన సంస్కారముతో పంతులుగారు దీనిని వ్రాయుటచే అక్కడక్కడ, మన సంఘములో కన్పట్టని, వింతవింత సంభాషణలు కలవు. మోహినీదేవిని మొదటిసారి చూచినప్పుడు ధనకోటిరాజు మాటలు అట్టివే. మోహినీదేవి ముప్పదియేండ్లవరకు వివాహములేక బ్రహ్మచారిణిగా నుండుటయు, ఆమెతో వేంకటపతిరాజు సంభాషణలుకూడ నిట్టివే.[77]

ఆంగ్లసాహిత్య ప్రభావమున పంతులుగారు రచించిన మూడవ ప్రహసనము 'మహాబధిర ప్రహసనము'. సుమంత్రుడను నాతడు తన కుమార్తెయైన ఇందుముఖిని ధనవంతుడైన ధనపాలుడు అను వానికీయ నిశ్చయించుకొనెను. కాని, ఆమె కాతనియందు ప్రేమలేదు. వివాహమునకు పూర్వ మందరు అన్నపూర్ణమ్మయను పూటకూళ్ళమ్మ యింటిలో బసచేయుదురు. ధనపాలుని ప్రవర్తనవలన ఆతడు నీచుడనియు, లుబ్ధుడనియు, వదరుబోతనియు అందరకును తెలియును. ఇంతవరకు వచ్చినతరువాత పిల్లనీయకున్న బాగుగ నుండదని సుమంత్రుడు తన కూతునిచ్చుటకే నిశ్చయించుకొనును. ఇందుముఖ చెలికత్తె పేరు విశాలాక్షి. విశాలాక్షి అన్నగారైన విజయవర్మను ఇందుముఖి ప్రేమించును. విజయవర్మ ఆ పూటకూళ్ళ యింటికేవచ్చి బధిరునిగ ప్రవర్తించును. అందరితోడను కలిసి భోజనమునకు వచ్చును. ఇందుముఖీ విశాలాక్షు లాతనిని గుర్తింతురు. ధనపాలుడు మాత్రము ధనమీయకుండ క్రొత్తవాడెవడో భోజనమునకు వచ్చెనని విసుగుకొనును. భోజనానంతరము, ధనపాలుని గది లోనికి పోయి విజయవర్మ నిద్రించును. దీనికి విసుగుకొని ధనపాలుడు, విజయవర్మను శిక్షింపనెంచి ఇరువురు సేవకులను, గదిలో నిద్రించుచున్నవానిని

---

77. "ధన—ఏమి మాటినా యిప్పటికీ నీ రూపము యౌవన పురుషులను వివాహానికి ఆకర్షించేలాగువే ఉన్నది గాని మరివక విధంగా లేదు. ఇప్పుడే యింత మనోరంజకముగా ఉన్న నీ రూపము అప్పుడెంత మహోద్రేకం కలుగచేసేదిగా ఉండేదో?" (పుట-45).

"వేంక—నీకు యిప్పుడు ముప్ఫయి యేళ్ళయినా నిండాలేవు. నీవు యే ఉపాయం చేతనైనా మా చిన్నాయనగారి మనస్సు చలింపచేసినట్టయితే, ఆయన ఖజానాలోంచి యిరవై సంచులు కదిలి నా చేతుల్లోకి వస్తవి." (పుట-38).

వీథిలోని మురికికాలువలో పడ(దోసిరండని నియమించును. బధిరునిగా నటించుచున్న విజయవర్మ ఇదంతయువిని, గదిలోనుండి వెలుపలకువచ్చును. విజయవర్మ ఏమి చేయుచున్నాడో చూడవలెనని గదిలోనికి వచ్చిన ధనపాలుని, ఆతని సేవకులే శిక్షించి వీథిలో కూలవేయుదురు. ఈ కథను విజయవర్మ సుమంత్రున కెరింగింపగా నాతడు తన కుమార్తెను విజయవర్మకిచ్చుట కంగీకరించును. ధనపాలుడు సిగ్గుపడి వెడలిపోవును.

పంతులుగా రీ ప్రహసనములో పాత్రల నామములను దేశీయముగా మార్చనను దీనిలో పాశ్చాత్యవాసన పోలేదు. మురికిగుంటలో పడ(దోయబడి, సిగ్గుతో లేచి వచ్చుచున్న ధనపాలునితో విజయవర్మ ఇట్లనును.

"విజ— ....మీ రిప్పు డా చిన్నదాన్ని వదిలిపెట్టనైనా వదిలి పెట్టవలెను. లేదా నాతో దెబ్బలాటకయినా రావలెను." (ప్రహసనము. పుట - 103.)

విజయవర్మయొక్క ఈ మాటకు ధనపాలుడుపిరికివాడుగనుక, "నేను దెబ్బలాటకు రాను", అని పలుకును. మాటపట్టింపునకై దెబ్బలాడుట, దెబ్బలాటకు (Duel) రమ్మనుట, ఆనాటి ఇంగ్లీషు సంఘములో విశేషముగ ప్రబలియుండెను. సాహిత్యమునందును నిట్టి దెబ్బలాటను వర్ణించుట తరుచుగా కన్పట్టుచుండును. పంతులుగారు దీని నిట్లే యుంచిరి. ఆనాటి సంఘములో 'ఇన్' (Inn)అని చెప్పబడు వసతి గృహములకు సంఘమున చాల స్థానముండెను. మహాకవులు మొదలు ముష్కరులైన తస్కరులవరకు నందరును వీనియందే సమావేశమై కార్యక్రమమును నిర్ణయించుకొనుటయు గలదు. ప్రహసనములోని అన్నపూర్ణమ్మ పూటకూళ్ళ ఇల్లట్టిదే.

ఆంగ్లములో 'జార్జ్ ఫర్క్వహార్' (George Farquhar) వ్రాసిన 'ది బోజ్ స్ట్రాటజెమ్' (The Beaux Stratagem) అను నాటకమునకు దీనికిని కొంత పోలిక కలదు. ఈ కథ 'లిచ్‌ఫీల్డ్' (Lichfield) ప్రాంతములోగల ఒక 'ఇన్' (Inn) నందు ప్రారంభమగును. ఇది నాటకముగనుక పూర్ణముగా నితివృత్తమభివృద్ధి చేయబడినది. ప్రహసనమట్లుగాదు.

ఇంగ్లీషు నాటక కథాప్రారంభమునకును, తెలుగు ప్రహసన ప్రారంభమునకును గూడ కొంత పోలిక కలదు. ఇంగ్లీషు నాటకములో 'ఇన్' యజమానియైన 'బోనిఫేస్' (Boniface) తన సేవకుల నిట్లు పిలుచును

**"Boniface—Chamberlain! maid! Cherry! daugther Cherry! all asleep? all dead?"[78]**

తెలుగులో ప్రహసన ప్రారంభమున పూటకూళ్ళమ్మ ఇట్లు సేవకులకై అరచును.

"అన్నపూర్ణమ్మ—ఓరీ! సుబలా! రామా! కృష్ణా! ఒక్క చండిక తప్ప నవుకర్లు యెవరూ కనపడరేమి? బజారికి వెళ్ళడానికి యిక్కడ వక్కడూ లేడు." (ప్రహసనము పుట—68)

ఇంగ్లీషు కథలో 'ఎయిమ్‌వెల్' (**Aimwell**) ను 'ఆర్చెర్' (**Archer**) ను కలిసి వివాహాన్వేషణమునకై బయలుదేరి, ఆ 'ఇన్' ప్రాంతముననే కృతకృత్యులగుదురు. తెలుగుకథ దీనిని కొంతవరకనుకరించెను.

'పునర్మరణ ప్రహసనము' కూడ ప్రేమకు సంబంధించిన కథయే. సాహసవర్మయను నాతడు చాల కష్టములు పడి మనోరంజనియను నామె నెట్టకేలకు వివాహామగుట ఇందలికథ. మనోరంజని తనప్రేమను సాహసవర్మకు లేఖలమూలమున తెలియజేయుచుండును. తుట్టతుదకు సాహసవర్మ ఒక బుట్టయందు కూర్చుండి రహస్యముగా మనోరంజని ఇంటికివచ్చును. అక్కడ ఎత్తులకు పై ఎత్తులు వేసి ఎట్టకేలకు మనోరంజని తండ్రి యనుజ్ఞపొంది సాహసవర్మ ఆమెను వివాహామాడును.

ఈ ప్రహసనకథకు ప్రత్యేకముగ వొక ప్రహసనము మూలమని చెప్పలేముగాని,'రెస్టొరేషన్' నాటకములోని ప్రతిధ్వనులు ఇందు చాలగలవు. ఇందు వచ్చు స్త్రీ పురుషుల సంభాషణలు ఆంగ్లసంఘమును తలపింపజేయుచుండును. ఇంగ్లీషు నాటకములలో 'మై డియర్', 'డార్లింగ్' అని భార్యాభర్తలు నలుగురి ఎదుటను చాల చనువుతో అనుకొనుట కలదు. అటులనే ఇందు 'ప్రాణప్రియా', 'ప్రాణేశ్వరా' మొదలగునవి చాలగలవు. మృదుభాషిణి (మనోరంజని మేనత్త) తనభర్తతో, "మనంకూడా వెళ్ళి పడుకొందాములండి. ప్రాణేశ్వరా! మీకు యింకా నిద్రరావడంలేదా?" అని పలుకును. నలుగురుగల ప్రదేశమున మనవారిట్లనుట పొసగదుగదా! ఆంగ్లసంఘములో 'వైను' (**Wine**) లేకుండ జీవితముండదు. తెలుగు ప్రహసనములో 'పానకము', 'పానకం గిన్నెలు', చాలచోట్ల వచ్చును. ఇది మన సంప్రదాయముకాదు. మన 'పానకము' వైనుకాదు. కథనుబట్టి నిషాచేయు పదార్థమనియే దానిని

78. **The Beaux Stratagem (1707) by George Farquhar.**

గ్రహింపవలెను. కథను, సన్నివేశములను, పాత్రల నామములను పంతులుగారు మార్చి వేసినను ప్రహసనమున ఆంగ్ల నాటక ప్రతిధ్వనులు, విజ్ఞులకు వినబడుచునే యుండును.

ఈ ప్రహసనమునందు వలెనే, ఇంకను కొన్ని ప్రహసనములందును ఆంగ్లనాటకముల ప్రతిధ్వనులు వినవచ్చుచుండుటచేతనే, మూలములను నిష్కర్షగ నిర్ణయింపలేకున్నను, ఈ ప్రహసనములపై ఆంగ్లసాహిత్య ప్రభావము పడిన దనుట. పంతులుగారును, ఆంగ్లసాహిత్య పరిచయము తోడనే వీనిని వ్రాసినారని ఎంచవలెనుగాని, కేవలానువాదములని ఊహింపరాదు.

పంతులుగారు రచించిన 'బలాత్కార గానవినోద ప్రహసనము' నకును 'విలియమ్ వైకర్లే' (William Wycherley) రచించిన 'ది జంటిల్‌మన్ డాన్సింగ్ మాస్టర్' ('The Gentleman Dancing-Master' - 1672) నకు కొన్నిపోలికలు గలవు. పంతులుగారు తమ ప్రహసనమునందు నాయకుని సంగీత విద్వాంసునిగ జేసిరి. ఆంగ్ల నాటకములో నాయిక తన ప్రియుని, నాట్యము నేర్పు నుపాధ్యాయుడని చెప్పి, ఇతరుల సంశయమును నివారణచేయును. నాట్యోపాధ్యాయుని పాత్రకంటె సంగీత విద్వాంసుని పాత్ర సంప్రదాయ సిద్ధముగ నుండునని తలంచి పంతులుగారట్లు కల్పించిరి. ప్రహసనములోని కథానాయిక లీలావతి. ఈమె తండ్రి గాన ప్రియుడు ఈమెకు తన మేనబావ యైన సంగీతరావునందు ప్రేమ. సంగీత విద్వాంసునకుగాని తన కూతు నియ్యనని భీష్మించుకొని తండ్రి యుండగా, తన ప్రియునిచే సంగీతము పాడించి, అది విని తనతండ్రి ఆనందించు నట్లుచేసి, తరువాత సత్యమును చెప్పి తన వివాహమునకై లీలావతి తండ్రి యనుజ్ఞ పొందుట యనునది దీనిలోని కథ.

ఆంగ్లనాటకమున పరాసునాటక ప్రభావము చాల కన్పట్టును. నాటి యాంగ్ల సంఘ సంప్రదాయముననుసరించి, నాయిక తన ప్రియుని నాట్య వేత్తగా మిగిలినవారికి నిరూపించును. తెలుగు ప్రహసనములో నాయిక తన ప్రియుని గాయకునిగా నిరూపించును. ఇంతకంటె పోలిక లీ రెంటికి గానరావు.

'కలహప్రియ ప్రహసనము' లో ప్రత్యేకత ఏమియులేదు. కనకాంగి కథానాయిక. ఆమె విశ్వకర్మ యను నాతనిని ప్రేమించును. కనకాంగి పెంపుడు తండ్రి ఆమెను విశ్వకర్మ కిచ్చి వివాహముచేయ నెంచును. ఇంతలో కలహప్రియయైన సుబ్బమ్మ వచ్చి కొండెములు చెప్పి కనకాంగి విశ్వకర్మల పెండ్లి చెడగొట్టును. ఇంతలో కనకాంగి సోదరుడు వచ్చి, కనకాంగి జన్మవృత్తాంత

మును జెప్పును. తుదకు, ఆమె యొక ధనవంతుని కూతురని తేలును. విశ్వకర్మ తనపనికి పశ్చాత్తాపపడి ఆమెను వివాహమాడును. కలహప్రియయైన సుబ్బమ్మ కొండెములు చెప్పు స్వభావముకలది కనుక, ఇట్లు చిక్కులు వచ్చెనని అందరును గ్రహించి ఆమెను తూలనాడి శిక్షింతురు. కనకాంగీ విశ్వకర్మలు సుఖముగ నుందురు.

ఈ ప్రహసనము తత్కాల సాంఘికాచారములను విమర్శించుటలో ఆంగ్ల నాటకములను పోలియున్నదే కాని, ప్రత్యేకముగ నొక నాటకము దీనికి మూలమని చెప్పజాలము. ఈ ప్రహసనములోని సుబ్బమ్మను పోలిన పాత్రలు ప్రపంచమునందు చాలచోట్ల నుందురుగదా! మిగిలిన ప్రహసనముల వలెనే ఇందును నాయికా నాయకులు—రచయిత, పాశ్చాత్య సంప్రదాయము ననుస రించుటవలనకాబోలు—బహిరంగముగా కౌగిలించుకొనుట, ముద్దుపెట్టుకొనుట చేయుదురు. భారతీయ సంప్రదాయము ననుసరించి ఆలింగన చుంబనాదులను రంగస్థలముపై ప్రదర్శింపరాదుగదా! పంతులుగారే భారతీయేతివృత్తములు గల నాటకములను వ్రాయునప్పు డిట్లు వ్రాయలేదు. ఈ ప్రహసనములోని నాయకుడైన విశ్వకర్మ ప్రియురాలితో నిట్లనును:

విశ్వ: "మనం యిద్దరమూ యిప్పుడు మళ్లీ స్నేహితులమయినామా? అయినట్టే తోస్తూవున్నది. నీ మొఖానికి యిప్పుడు కళ చేరుకున్నది. పెదవుల సందు నుంచి చిరునవ్వు బయలుదేరుతూ వున్నది. నీ ముఖ వికాసము చూస్తే నాకు సంతోషంగా వున్నది. నాకు వక్క ముద్దు పెట్టు, మళ్లీ స్నేహితుల మవుదాము, (అని కౌగిలించుకొని ముద్దుపెట్టుకొనుచున్నాఁడు.)[79]

ఇట్లు వ్రాయుట పంతులుగారి పద్ధతికి విరుద్ధము. ఆంగ్ల సాహిత్యము ననుసరించినారు గనుకనే యిట్లు వ్రాసినారు. తెలుగు కారకమునకు భిన్నముగా నున్న చివరి వాక్యములు "Kiss me. We shall be friends"అన్న వాక్య ములకు తెలుగు కాదా? ఆంగ్లసంఘమున ముద్దుపెట్టుకొనుట సామాన్యాచా రము. మన సంఘమున నది గోప్యమైన విషయము. దీని నింత సామాన్యముగ వాడుటలోనే పంతులుగారు 'ఇది ఎరువు సొమ్ము' అని మనకు చూపుట కలదు.

మిగిలిన ప్రహసనములలో వలెనే దీని యందును స్త్రీలు చాల స్వేచ్ఛను ప్రదర్శింతురు. ఇది నాటికి మన దేశమున నున్న విషయము కాదు. పంతులుగారి

79. వీరేశలింగకవికృత గ్రంథములు. 1949. మొదటి సంపుటము. (ప్రహసనములు.) కలహప్రియాప్రహసనము. పుట - 206.

వంటి సంఘ సంస్కర్తలుకూడ ఇంతదూరముపోరు. ఇది మనసంఘమున నున్నది కాదు. ఇట్టి భాగములు ఈ ప్రహసనములపై ఆంగ్ల సాహిత్య ప్రభావము పడినదని తెలుపును.

చదువురానివారు చదువుకొన్న వారివలె వేషధారణచేసి, లోకమునెట్లు ప్రతారించుటకు ప్రయత్నింతురో, చివరకు వారే యెట్లు భంగపడుదురో మహామహోపాధ్యాయ ప్రహసనమున పంతులుగారు చూపిరి. ఈ ప్రధానవస్తువున కొక ప్రేమకథను కలిపిరి. విద్యాలయందాదరముగల కళావిదుడనువాడు వయస్సు వచ్చిన ధీనిధియను తన కుమారునకు సంస్కృతము చెప్పింపవలెనని యొక మహామహోపాధ్యాయునకు వార్త పంపును. ధీనిధికి వసంతతిలకయను కన్యను వివాహమాడవలెనని యుండెనుగాని, సంస్కృతము చదువుకొనవలెనని లేదు. వసంతతిలకకు, ఆమె చెలికత్తెయైన చంద్రికకుకూడ వివాహాపేక్షయే యుండెను. ఇంతలో మహామహోపాధ్యాయుని సేవకుడైన భీముడనువాడు, కళావిదుడు వ్రాసిన లేఖ పండితునకు చూపక ధనాపేక్షచే తానే మహామహోపాధ్యాయునిగ బయలుదేరి, కళావిదుని కలిసికొనును. చంద్రిక భీమునంతకు పూర్వము ప్రేమించియున్న దగుటచే, ఆతనిని గుర్తుపట్టును. వసంతతిలక ధీనిధిని ప్రేమించినదగుటచే భీముడు తనగుట్టు వారు బయటపెట్టకున్నచో తాను ధీనిధికి వసంతతిలకకు వివాహమగుటకై యత్నింతునని వాగ్దానము చేయును. భీముడు రాకపూర్వము ధీనిధికి చదువు చెప్పిన గురువుయొక్క ఈర్ష్యవలన రహస్యభంగమగును. కళావిదుడు సత్యమును గ్రహించి రెండు వివాహములును చేయును.

ఈ ప్రహసనములో పంతులుగారు; వసంతతిలకయు, చంద్రికయు మాటాడుకొను ఘట్టమును కేవలము 'రెస్టొరేషన్' నాటకము ననుసరించియే వ్రాసినారనవచ్చును. లేనిచో ఇంత అవినీతికరముగ నాయిక తన దాసితో మాటాడుచున్నట్లు వ్రాయుట పొసగదు. ఆంగ్లనాటకములలో నాయిక (Heroine) తనదాసి (Maid)తో నిట్లు మాటాడునట్లు చాల 'రెస్టొరేషన్' నాటకములలో కలదు. తెలుగు ప్రహసనములోని సంభాషణయిది.

"వసంతతిలక—ఓసీ! నీతో చెప్పనా? నాకు కామబాధ మహావిస్తారంగా వున్నది. నాకు యిప్పుడు యేమి చెయ్యటానికి తోచకుండా వున్నది."

"చంద్రిక — నాకూ అలాగేవున్నది."

వసం: "చంద్రీ! నేను వెనుక యెప్పుడూ కామంచేత యింతబాధ యెరగను."

చంద్రి: అమ్మా! నాబాధ యెవరితో చెప్పుకోను[80]."

ఇట్టి సంభాషణ క్షీణయుగములోని ప్రబంధ నాయికలుకూడ చేయరు. 'రెస్టొరేషన్' నాటకములలో ఇట్టి సంభాషణలు మిక్కుటము. అందు నాయికయు చెలికత్తెయునేగాక, స్త్రీపురుషులుగూడ నసభ్యముగ మాటాడుకొందురు. ఉదాహరణముగ నీక్రిందిసంభాషణను గ్రహింపవచ్చును. ఇందు కథానాయికయు నామె చెలికత్తెయు ప్రసంగించుచున్నారు.

"Silvia—Ha! Ha! Ha! an old fox trapped!"

(Enter Lucy).

"Bless me! you frighten me. I thought he had been come again, and had heard me."

"Lucy—Lord, Madam, I met your lover in as much haste as if he had been going for a midwife!"

"Silvia—He's going for a parson, girl, the forerunner of a midwife, some nine months hence.– well, I find dissembling to our sex is as natural as swimming to a negro; we may depend upon our skill to save us at a plunge, though till then we never make the experiment."[81]

ఈ సంభాషణలోని అనౌచిత్యము, అసభ్యతలనుగూర్చి వేరుగా వ్రాయ నక్కరలేదు.

ఇంక వివాహమునకు పూర్వము పై నాటకములోనే నాయిక ఒక ప్రియునితో నిట్లు మాటాడును.

"Heartwell— .........If this be not love, it is madness, and then it is pardonable. Nay, yet a more certain sign than all this, I give thee my money."

"Silvia—Ay, but that is no sign; for they say gentlemen will give money to any naughty woman to come to bed to them. O Gemini! I hope you don't mean so, for I won't be a whore."

"Heartwell—(aside) The more is the pity."

---

80. Ibidem. మహామహోపాధ్యాయ ప్రహసనము. పుట-213.

81. The old Bachelor by William Congreve. (Act-III; Scene-IV). ఈ నాటకము 1693 లో వెలువడినది.

"Silvia—Nay, if you would marry me, you should not come to bed to me, you have such a beard, and would so prickle one. But do you intend to marry me?"[82]

ఇది వ్రాసిన ఆంగ్లనాటకకర్త 'కాన్గ్రీవ్' (Congreve) 'స్విన్బర్న్' (Swinburne) చే ఈ విధముగా పొగడబడినవాడు.

"Congreve's intellect is clear, cold, and narrow; it has the force and brightness of steel; the edges of it, so to speak, are cut out hard and sharp. There is more weight and matter in Congreve than in any English dramatist since the Restoration; and at worst he is no coarser than his time."

ఇట్టి 'కామెడీ'లను చదివినతరువాత వ్రాసిన ప్రహసనములు గనుకనే, సహజముగా ధర్మబద్ధ జీవితమునుగూర్చి వ్రాయు పంతులుగారుకూడ, మహామహోపాధ్యాయ ప్రహసనముననేమి ఇతర ప్రహసనములలో నేమి, కొంచెము 'మోతాదు మించిన' శృంగార సంభాషణలు, వారిపాత్రలచే చేయించిరి.

ఈ ప్రహసనములలోని వాతావరణము, సన్నివేశ కల్పనము, సంభాషణారచన, అన్నియు పాశ్చాత్య నాటకములనే పోలియున్నవని; వీనిలోని అసహజత్వమే మనకు తెలియజేయును. తెలుగు ప్రహసనముచివర, మహామహోపాధ్యాయుని వేషమునవచ్చిన భీముడు, తాను క్షమింపబడిన తరువాత, "... యిఖముందు అయ్యగారి యింటికి మీరు వచ్చినప్పుడు మీకందరికీ తలుపులు నేనే తీస్తూవుంటాను," అని పలుకును. ఇట్లు తలుపులుతీయు సంప్రదాయము, దానికి ప్రత్యేకముగ సేవకుడు; ఆంగ్ల సంఘములోని 'బట్లర్' (Butler) ను జ్ఞాపకము చేయుటలేదా? పంతులుగారెన్ని మార్పులు చేసినను ఇట్టి వచ్చుటచ్చుట తలచూపుచునే యున్నవి.

పంతులుగారి యోగనిద్రాప్రహసనము కూడ పై నుదాహరింపబడిన ప్రహసనములవలెనే ప్రేమకు సంబంధించినదే. మతిమంతుడను వృద్ధుడొకడు యోగాభ్యాసము పిచ్చిలోబడి, అట్టివారినందరిని చేరదీయుచుండును. అతని మేనల్లుడు సుబలుడు. సుబలునకు మతిస్థిరము లేదనియు నాతనిని తన యోగ శక్తిచేత వశము చేసికొనవలెననియు మతిమంతుని ప్రయత్నము. మతిమంతుని పిచ్చినుండి తప్పించి యాతనికుమార్తెయైన సుమతిని వివాహమాడవలెనని సుబలుని యత్నము. సేవకుడైన రాముని సాయముతో నీ పనిని సుబలుడు సాధించును. ఇది దీనియందలి కథ.

---

82. Ibidem. (Act-III; Scene-IV).

ఈ ప్రహసనమునకు కేవల మిది మూలమని చూపదగిన ఆంగ్లనాటకము లేదు. మిగిలిన ప్రహసనములవలెనే యిదియును నొక నిర్ణీత మార్గములోనే నడచినది. ఇందలి స్త్రీపాత్రలు ప్రతిక్షణము మూర్ఛపోవుటగాని, మూర్ఛ పోవుదుమని యనుటగాని చేయుదురు.

"గౌరి— అలాగైతే నాకు మరీభయం వేస్తూవున్నది. మూర్ఛ వస్తూవున్నది." ఇది ఆంగ్లనాటకములలో నాయికలు సుకుమారులని చెప్పుటకై పనికివచ్చు నొక విధానము (Swooning). ఆంగ్లములోని 'స్వూన్' (Swoon) అను పదమును మూర్ఛయని యనువాదము చేయుట సొగసుగాలేదు.

ఇందును సంభాషణలలో అసభ్యత చాల కలదు. నాయికయైన సుమతి నాయకునితో, "నన్ను ముట్టుకోకు. పడుచువాళ్ళు యెదిగిన ఆడదాన్ని ముట్టుకోరాదు" అని పలుకును. ఈ ప్రహసనములో 'బెన్‌జాన్సన్' (Ben Jonson) వ్రాసిన 'ది ఆల్కెమిస్ట్' (The Alchemist) లోని లక్షణములు కొన్నిగలవు. అక్కడ స్వర్ణవిద్యమీది పిచ్చి. ఇక్కడ యోగవిషయమున పిచ్చి.

మహావంచక ప్రహసనములో ధనవంతురాలైన ఒక కన్యను వివాహమాడుటకు నిర్ధనుడైన కంఠీరవదేవు చేయు ప్రయత్నములు, తుదకుఆతని ప్రేమకు మెచ్చి, నిర్ధనుడయినను తన కుమార్తె నాతనికే యిచ్చి జియ్యారుసూరి యను ధనవంతుడు వివాహము చేయుటయు కలదు. కంఠీరవదేవనువాడు ధనవంతుడైన జియ్యారుసూరి కుమార్తెయైన రామామణిని ప్రేమించును. ఆమెయు నాతనిని ప్రేమించును. కాని జియ్యారుసూరి మాత్రము ధనహీనునకు తనపుత్రిక నీయనని యాతనితో చెప్పును. రామామణిని వివాహమాడుటకై కంఠీరవదేవు తాను ధనవంతుడననియు, తన తండ్రిని సూరి యొద్దకు పెండ్లిమాటలకై పంపుదుననియు నసత్యమాడును. జియ్యారుసూరి యంగీకరించును. అంత కంఠీరవదేవు తన తండ్రిగా వేషము వేయుటకు వంచకాచార్యులనువాని నొకనిని నియమించును. వంచకుడు వృద్ధుని వేషము వేసికొని జియ్యారుసూరిని మోసగించుటకు వచ్చి యాతనితో కంఠీరవదేవుని గూర్చి మాటాడుచుండును. ఇంతలో కంఠీరవదేవు తాను చేసిన మోసమునకు పశ్చాత్తాపపడి జియ్యారుసూరితో సత్యము చెప్పివేయును. అందుల కాతడు సంతోషించి, ధనహీనుడైనను కంఠీరవదేవు యోగ్యుడని తలచి తన కూతు నాతని కిచ్చి వివాహము చేయును

ఈ ప్రహసనములోను, తా వలచిన కన్యను నాయకుడు కష్టముల నన్నింటిని ఎదుర్కొని వివాహమాడుటయే ఇతివృత్తము. ఇంచుమించుగా

పంతులుగారి ప్రహసనము లన్నింటిలోను నిదియే కథ. ఈ కథ, ఈ ప్రహసనములో అసభ్యతలేకుండ చక్కగ చెప్పబడినది. ఇట్టివి ఆంగ్లనాటక కథలు కొన్ని కలవు.

ఈ ప్రహసనమునకు మూలమనదగునది 'సర్ జాన్ వాన్బ్రిగ్' (Sir John Vanbrugh—1664 - 1726) వ్రాసిన 'ది కాన్ఫెడెరసీ' (The Confederacy) అను నాటకము. ఇందు 'డిక్ యేమ్లెట్' (Dick Amlet) అనువాడొకడు బీదవాడైనను ధనవంతుడైన 'కల్నల్ షేప్లే' (Col. Shapely) అను పేరున చలామణి యగుచుండును. ఆతని స్నేహితుడును, కుట్రదారుడునైన 'బ్రాస్' (Brass), ఆతనికి సేవకుని (Valet) వలె నటించుచుండును. 'డిక్' దనవంతుడైన 'గ్రైప్' (Gripe) అనువాని కుమార్తెయైన 'కొరిన్న' (Corinna) ను వివాహమాడుటకై యత్నించును. ఆ కృషిలో మాయలమారియైన 'బ్రాస్' ఆతనికి సాయపడుచుండును. 'డిక్' తల్లియైన 'మిసెస్ యేమ్లెట్' (Mrs. Amlet) పేదరాలైనను, తన కుమారునకు చాల ధనమీయగలనని ప్రగల్భములు పలుకును. కాని తుదకు రహస్యభంగమై 'డిక్' పేదవాడని తేలును. అయినను 'కొరిన్న' ఆతనినే వివాహమాడును.

ఈ రెండు కథలకు చాల పోలికలు గలవు. 'డిక్' వలెనే కంఠీరవదేవు తాను ధనహీనుడైనను దనవంతునివలె నటించును. 'మిసెస్ యేమ్లెట్' పాత్రకుబదులు తెనుగులో కంఠీరవదేవుని తండ్రివలెనటించిన వంచకాచార్యులు. 'డిక్' యొక్క సేవకునివలె 'బ్రాస్' నటించినట్లు, కంఠీరవదేవునకు నారాయణుడను సేవకుడు గలడు. ఆంగ్లకథలో ధనము లేకపోయినను, తాను 'డిక్' నే వివాహమాడుదునని 'కొరిన్న' పలికినట్లే, తెలుగు కథలో రామామణికి కంఠీరవదేవుని యందు ప్రేమ యుండుటచే నామెయు నట్లే పలుకును. ఆంగ్ల కథలో 'మిసెస్ యేమ్లెట్' నడుమ ప్రవేశించి 'డిక్' తన పుత్రుడని చెప్పి రహస్యభంగము చేయును. తెలుగు కథలో, మొదటినుండియు మోసము చేసిన, కథను చాలవరకు నడిపిన, కంఠీరవదేవునకే పశ్చాత్తాపమువచ్చి నిజము జియ్యారు సూరికి చెప్పినట్లు కల్పింపబడినది.

ఆంగ్లగృహములలో 'స్టడీ' (The study) అనిగాని, 'లైబ్రరీ' (The Library) అనిగాని ఒకగది ఉండుటయు క్రొత్తవారినందు గృహయజమానులు కలిసికొనుటయు సంప్రదాయము. తెలుగు ప్రహసనములో

నిట్టి సంప్రదాయమునే పంతులుగారు నెలకొల్పి 'పుస్తకములగది' యని దానికి పేరిడిరి.

"పార్వతి — అమ్మా ! బాబయ్యగారి సెలవయింది. మిమ్మలిని ఆయన *పొస్తకాలగది లోకి* తీసుకుని రమ్మన్నారు."

(మహావంచక ప్రహసనము పుట—304)

"కంఠీరవదేవు — అలాగయితే కార్యం యెంత శీఘ్రంగా నెరవేరితే అంతమంచిది. ఆయన పొస్తకాలంటే చెవికోసుకుంటాడు. ఆయన యిప్పుడు *పొస్తకాల గదిలో* వున్నాడు." (మహావంచక ప్రహసనము పుట—306)

ఆంగ్లములోని 'కామెడీ' ల ప్రభావమున పంతులుగారు రచించిన తుది ప్రహసనము 'అసహాయ శూర ప్రహసనము'. భావరాజు భీమరాజను నాతడు పరాక్రమవంతుడని శూరుడని చెల్లుబడి. కాని ఆయన పిరికివాడు. ఆయనభార్య భ్రమరాంబ. కూతురు సరస్వతి. ఈమె వీరభద్రుడను వానిని ప్రేమించినది. ఒక నాటిరాత్రి భీమరాజు నాటకపుపాకలో పెంటయ్యయను వానితో మాటపట్టింపు వచ్చి దెబ్బలాడును. ప్రక్కవారు పురికొల్పిగా, భీమరాజును పెంటయ్యయును, తమలోతాము ద్వంద్వయుద్ధము చేసికొని, కోపమును తీర్చుకొనవలెనని నిర్ణయించుకొందురు. ఇరువురును పిరికివారుగనుక, పదిమందివద్ద నట్లు పలికినను, ఒకరినొకరు తెలిసికొనకుండుటకై తప్పు చిరునామాలిచ్చుకొందురు. అది తెలియనందున, నిరువురునుభయపడుచు నొకరినొకరు తప్పించుకొనవలెనని నిర్ణయించుకొందురు. ఈ ప్రయత్నములో పెంటయ్య, ఊరిచివర నున్నదిగదాయని, తెలియక భీమరాజు గృహములోనే యద్దెకు దిగును. అట నాకస్మికముగ నొకరినొకరు కలిసికొందురు. అంతకుపూర్వమే సరస్వతిని ప్రేమించిన వీరభద్రరాజక్కడకు రాగా, పెంటయ్య 'భీమరాజు'తో యుద్ధముచేయు సందర్భమున తనకు సాహాయ్యము చేయవలసినదని ఆతనిని వేడుకొనును. ఆతడంగీకరించును. ఈ విషయము తెలియని భీమరాజు, తనపూర్వ పరిచయమునుబట్టి, పెంటయ్యతో జరుగు యుద్ధములో తనకు సాయము చేయుటకై రమ్మని వీరభద్రరాజునకు కబురంపును. వీరభద్రరాజు వచ్చి యిరువురకు సంధిచేయును. తరువాత సరస్వతీ వీరభద్రరాజుల వివాహమగును. వీరభద్రరాజు వేసిన ఎత్తువలన, ఇరువురి గౌరవములు దక్కి, ప్రాణనష్టము లేకుండ యుద్ధముచేసి, శూరులమనిపించుకొనుట జరిగినదిగదాయను నానందమున, నిద్దరును సుఖముగనుందురు.

ఈ ప్రహసనములో పంతులుగారు పాశ్చాత్యసంఘ సంప్రదాయములనే చాలవర కనుసరించిరి. అసలు, మాట పట్టింపువలన 'ద్వంద్వయుద్ధము' (Duel) చేయుట యనునది పదునేడు, పదునెనిమిది శతాబ్దులలో, ఆంగ్ల సంఘములో విశేషముగనుండి, సాహిత్యములోనికి ప్రవేశించినది. ఇంక 'మహాశూరులైన' భీమరాజు పెంటయ్యలు తమకు బదులుగా వీరభద్రరాజును శత్రువుతో పోరాడ వలసినదని ప్రార్థించుటయు నట్టి సంప్రదాయములోనిదే. గృహిణియైన భ్రమరాంబ తన యింటికి వచ్చిన పెంటయ్యతో, "నాలుగు అణాలు యిస్తే యీ పూట మీకు పెరుగుతో భోజనం పెడుతాను" అని అనుటయును, ఆంగ్ల సంప్రదాయమైన 'ధనమిచ్చు అతిథి' (Paying Guest) అను విషయమును జ్ఞప్తికి తెచ్చుచున్నది.

ద్వంద్వయుద్ధము నిర్ణయమైన తరువాత వారిరువురకు వీరభద్రరాజే మధ్యవర్తి (Seconds in a Duel) గా నుండి, వారు ఏ ఆయుధములతో యుద్ధము చేయుదురని ప్రశ్నించును.

"వీరభద్రరాజు—యుద్ధములో మీ ఆయుధము లేమిటి ?"

"పెంటయ్య—నా తాజాకలం నీ స్నేహితుడికి చూపించవలెను."

"వీరభద్రరాజు—తెలిసింది. ఆయుధాలు తుపాకీలు. వొకరికొకరికి పదిహేను బారల దూరము." ((ప్రహసనము. పుట-338).

ఈ వాక్యము లన్నియు ఆంగ్లనాటక వాసనావాసితములే. ఈ సంప్రదాయము వారిదే. ఈ "తుపాకీలు" అక్కడివే!

'ఇంగ్లీషు కామెడీ' లలో తెలుగు ప్రహసనములోని 'వీరుల' ను బోలిన వారు చాలమంది వర్ణింపబడియున్నారు. షేక్స్పియర్ మహాకవియొక్క సృష్టియయిన 'ఫాల్స్టాఫ్' (Falstaff) పాత్రలో కూడ; పంతులుగారి 'వీరుల' లక్షణములను మనము చూడవచ్చును. పంతులుగా రిట్టి వనేక పాత్రలను మనసులో నుంచుకొని ఈ ప్రహసనములోని పాత్రలను సృష్టించిరి.

ఆంగ్లములో 'బోమాన్ట్' (Beaumont) 'ఫ్లెచ్చర్' (Fletcher) అను కవులు (1584-1616 ; 1579-1625) 'ఏ కింగ్ అండ్ నో కింగ్' (**A King and No king**) అను నాటకమును (1612) వ్రాసిరి. ఈ నాటకము కథకును ప్రహసనకథకును సంబంధమంతగా లేదుగాని; ప్రహసనములోని 'వీరుల'కును ఆంగ్ల నాటకములోని 'వీరుల'కును కొంతపోలిక కన్పట్టుచున్నది.

ఆంగ్ల నాటకములో 'కెప్టెన్ బెస్సూస్' (Captain Bessus) అను పాత్రకలదు. ఈతనికిని 'భావరాజు భీమరాజు'నకును చాల పోలికలు గలవు. 'కెప్టెన్ బెస్సూస్' పిరికివాడైనను, వీరుడని పేరు సంపాదించెను. ఈవిషయమును గూర్చి అత డిట్లు తనలో తాననుకొనును

"Bessus—They talk of fame; I have gotten it in the wars, and will afford anyman a reasonable pennyworth. Some will say, they could be content to have it, but that it is to be achieved with danger: but my opinion is otherwise: for if I might stand still in cannon-proof, and have fame fall upon me, I would refuse it. My reputation came principally by thinking to run away; which nobody knows.........I was never at battle but once, and there I was running.........but was so afraid that I saw no more than my shoulders do, but fled with my whole company amongst my enemies, and overthew'em. Now the report of my valour is come over before me........."[83]

ఇట్లు "విధివశంబున వీరుడైన" 'కెప్టెన్ బెస్సూస్'ను, ద్వంద్వ యుద్ధమునకు ఆహ్వానించు వార్తను తీసికొని ఒకడు వచ్చును. అతనితో, తాను రెండు వందల పండ్రెండు ద్వంద్వయుద్ధములు చేయవలెను గనుక కొంతకాలము నిరీక్షింపవలెనని 'బెస్సూస్' చెప్పును. వార్తాహారుడు వెడలిపోవును. మొట్టమొదట తన్ను ద్వంద్వయుద్ధమునకు పిలిచిన వానికిని ద్వంద్వ యుద్ధమం దెక్కువ మక్కువలేదని 'కెప్టెన్ బెస్సూస్' ఇట్లు తనలో తాననుకొనును.

"Bessus—Certainly my safest way were to print myself a coward, with a discovery how I came by my credit, and clap it upon every post. I have received above thirty challenges within this two hours. Marry, all but the first I put off with engagement; and, by good fortune, the first is no madder of fighting than I; so that that's referred: the place where it must be ended is four day's journey off, and our arbitrators are these; he has chosen a gentleman in travel, and I have a special friend with a quartan ague, like to hold him this five years, for mine; and when his man comes home, we are to expect my friend's health ........"[84]

ఈ ఆంగ్లనాటక భాగములను చదువుచున్నప్పుడెల్ల, పంతులుగారి ప్రహసనములోని 'భీమరాజు పెంటయ్యలు' జ్ఞప్తికి వచ్చెదరు. ఆంగ్లనాటకము

83. 'A King and No King' by Beaumont and Fletcher. (Act-III; Scene-II).
84. Ibidem.

లోని 'కెప్టెన్' వలెను, అతనిని ద్వంద్వయుద్ధమునకు కవ్వించినవానివలెను, భీమరాజు పెంటయ్యలు కన్పట్టెదరు.

వీరేశలింగం పంతులుగారి కాలమునకును, 'రెస్టొరేషన్' నాటకము బయలుదేరిన కాలమునకును కొన్ని పోలికలుండుటచేతనే, పంతులుగారు ఆంగ్లములోని 'కామెడీ ఆఫ్ మేనర్స్' (Comedy of Manners) ప్రభావమున ప్రహసనములు రచించిరి. ఆ ప్రహసనములు మన కాలమునాటికి మోటుగా ఉన్నను, అవినీతి— అన్నిరంగములలోను— విశేషముగ పెరిగి, యున్న పంతులుగారి కాలమునాడు, ప్రహసనములలో ప్రదర్శింపబడిన పాత్రల వంటి వ్యక్తులు జీవితనాటకరంగమునను గలరు. అందువలననే నైతికదృష్టిగల పంతులుగారు ప్రహసనములలో నట్టి పాత్రలను సృష్టించి సంఘములోని వాస్తవస్థితిని ప్రజల 'కనువిప్పు'నకై, ప్రదర్శించిరి

ఆంగ్లనాటకానువాదములు :

ప్రహసనముల తరువాత ఆంగ్లసాహిత్య ప్రభావముగల పంతులుగారి రచనలు, వారి ఆంగ్లనాటకానువాదములు. ఇవి నాలుగు. అందు, చమత్కార రత్నావళి (The Comedy of Errors) ; వినీసువర్తక చరిత్రము (The Merchant of Venice) అనునవి షేక్స్పియర్ మహాకవివి; కల్యాణ కల్పవల్లి (The Rivals); రాగమంజరి (The Duenna) అనునవి షెరిడెన్‌కవివి. ఇందు వినీసువర్తక చరిత్ర మసంపూర్ణము. చమత్కార రత్నావళి కేవల వచన నాటకము. రాగమంజరి గద్యపద్యాత్మకము. కల్యాణ కల్పవల్లి మరల వచన నాటకము. ఈ నాటకములలో, వినీసువర్తక చరిత్రమునందు మూలములోని పేరులే తెలుగులో గూడ వాడబడెను. మిగిలిన మూడు నాటకములలో తెలుగు పేరులు. ఇట్లు మార్పులు చేయుటనుగూర్చి పంతులుగారు వారి స్వీయ చరిత్రలో రెండు చోటులందిట్లు వ్రాసిరి. గోల్డ్‌స్మిత్ యొక్క 'ట్రావెలర్'ను గూర్చి వ్రాయుచు పంతులుగారు ;

"ఆచార వ్యవహారములును పేరులును దేశములును మనవారికి వింతగాఁ గనఁబడును గాన కేవల మూలార్థానుసారముగా భాషాంతరీకరింపబడిన పాశ్చాత్య గ్రంథములు మనవారికంతగా రుచింపక పోవచ్చును."[85] అని పలికిరి.

85. స్వీయచరిత్రము. రెండవ భాగము. 1915. పుట-౨౨౨.

ఆంగ్లనాటక కథలను తెలుగువచనములో ననువదించు సందర్భమున, తాము గావించిన మార్పులను గూర్చి ఇట్లు వ్రాసిరి.

"... నాటక కథలను నేను తెలిఁగించునపుడు మునుపున్న పేరులకు మాఱుగా మనదేశపు పేరులు పెట్టి అందున్న దేశములను మన భరతఖండము లోని దేశములనుగా మార్చి, కథలో మన యాచార వ్యవహారములకుఁ బ్రతి కూలముగా నున్న భాగముల ననుకూలముగా నుండునట్లుచేసి, సాధ్యమైనంత వరకు మనవారికింపుగా నుండునట్లు చేసితిని."[86]

ఆంగ్ల నాటకముల ననుసరించి వ్రాయునప్పుడు—వినీసు వర్తకచరిత్రము నందు తప్ప—పంతులుగారు, తెలుగు ప్రజలకు రుచించుటకై, పాత్రల నామ ములను, కొన్ని సన్నివేశములను, దేశముల పేరులను, పరికరముల పేరులను మార్చి, స్వతంత్ర నాటకములవలె నుండునట్లు రచించిరి.

పంతులుగారు 'చమత్కార రత్నావళి'ని 1880 లో రచించిరి. తద్రచనా సందర్భమును గూర్చి పంతులుగారే యిట్లువ్రాసిరి.

"1880 - వ సంవత్సరమునందు ధార్వాడ నాటక సమాజమువారు మా పట్టణమునకు వచ్చి గొప్ప పాకవేసి దానిలో తమ నాటకముల నాడి పోయిన తరువాత పాక తీసివేయక ముందే యా నాటకశాలలో నాడింపవలె నన్న కుతూహలముతో శ్రీహర్షదేవ విరచితమైన రత్నావళీ నాటికను సంస్కృ తమునుండి గద్యపద్యములతోను, ఇంగ్లీషు కవులలో నగ్రగణ్యుఁడుగా పరిగ ణింపఁబడెడు షేక్స్పియరు మహాకవి విరచితమైన కామెడీ ఆఫ్ ఎర్రర్సు నాట కము నింగ్లీషునుండి గద్యాత్మకముగాను, అత్యంత శీఘ్రకాలములో తెలిఁగించి యా రెంటిని తన్నాటకశాలలో జయప్రదముగా ప్రదర్శింపించితిని."[87]

'చమత్కార రత్నావళి'ని తెలుగు చేయుటలో పంతులుగారు చాల స్వేచ్ఛను జూపిరి. పూర్వాపరసంబంధము తెలియుటకై మూలములోగల కొన్ని వాక్యములను విపులీకరించి వ్రాసిరి. కథాప్రారంభమునను పంతులుగారు మూలమందు లేని కొంతభాగమును కల్పించి వ్రాసిరి. ఈవిషయములనుగూర్చి చర్చించుటకు పూర్వము నాటకములోని పాత్రల దేశముల నామములను ఎట్లు మార్చినారో తెలుపుటకు, మూలనామములతోఁబాటు వానినిఇచ్చుచున్నాను.

86. స్వీయచరిత్రము. రెండవ భాగము. 1915. పుట-౧౯౦, ౧౯౧.

87. స్వీయచరిత్రము. రెండవ భాగము. 1915. పుట-౧౬౧.

Solinus — Duke of Ephesus
ధర్మపాలుడు — చోళమండలపురాజు.

Aegeon — A merchant of Syracuse
వర్ధమానుఁడు — పాండ్యదేశమునందలి మధురాపురపు వర్తకుఁడు.

Antipholus of Ephesus, } Twin Brothers, sons to Aegeon
Antipholus of Syracuse } and Aemilia
పెద్దవసంతకుఁడు — వర్ధమానునకును చారుమతికిని గలిగిన కవల బిడ్డలలో నొకడు.
చిన్నవసంతకుఁడు — పైవారి కవలబిడ్డలలో నింకొకడు.

Dromio of Ephesus } Twin Brothers, attendants on the two
Dromio of Syracuse } Antipholuses.
పెద్దలక్ష్మణుఁడు — పెద్దవసంతకుని సేవకుఁడు. చిన్న లక్ష్మణుని సోదరుఁడు.
చిన్నలక్ష్మణుఁడు — చిన్న వసంతకుని సేవకుఁడు. పెద్దలక్ష్మణుని సోదరుఁడు.

Balthazar — A merchant
కాంచనగుప్తుఁడు — ఒక వర్తకుఁడు; పెద్ద వసంతకుని మిత్రుడు.

Angelo — A goldsmith
విశ్వకర్మ — కంసాలి.

Merchant — Friend to Antipholus of Syracuse
ధనమిత్రుఁడు—చిన్న వసంతకుని మిత్రుఁడగు ఆంధ్రదేశపు వర్తకుఁడు

Pinch — A schoolmaster and a conjurer
దుర్గాచాను — భూతవైద్యుఁడు.

Aemilia — Wife to Aegeon, an Abbess at Ephesus
చారుమతి — వర్ధమానుని భార్య; వసంతకుల తల్లి.

Adriana — Wife to Antipholus of Ephesus
సీత — పెద్ద వసంతకునిభార్య.

Luciana — Her sister
సుభద్ర — సీత చెల్లెలు.

Luce — Servent to Adriana
పరిచారిక — ఒక పరిచారిక,

A courtezan
ప్రభావతి — కాంచీపురమునందలి యొక స్త్రీ.

Gaoler
శ్వేతవాహనుఁడు — కారాగృహాధికారి.

వీరుగాక; కొందరు భటులు, పౌరులు మొదలగువారు కలరు.

తెలుగు నాటకమంతయు సులభమైన వచనములో వ్రాయబడినది. మూలములో షేక్స్పియరు, గద్య పద్యాత్మకముగ రచించెను. కేవలము వచనమందు వ్రాయుటయేగాక, మూల కథ బాగుగ తెలియుటకై క్రొత్త భాగములను కొన్నింటిని పంతులుగారు కల్పించిరి. ఇట్లు కల్పించినవానిలో ముఖ్యమైనది నాటక ప్రారంభమున కల్పించినది. ఈ మార్పులు, కథ బాగుగ అర్థమగుటకు చేయబడినవేగాని, సన్నివేశములను సృష్టించి రసమును వృద్ధి చేయుటకు కల్పింపడినవిగావు. దీనియందలి కథ తేటతెల్లమయినదే. వర్ధమానుడను వర్తకునకు చారుమతి భార్య. వారి కిద్దరు కవలపిల్లలు. వారి పేరులు పెద్ద వసంతకుడు, చిన్న వసంతకుడు నని. వీరికి సేవకులుగ పనికి వచ్చుటకై; పెద్ద లక్ష్మణుడు, చిన్న లక్ష్మణుడు అను కవల బిడ్డలనే పరుకొని వర్ధమానుడు వారిని గూడ పెంచుచుండెను. విధివశంబున వర్ధమానుడు, భార్య ఓడ మునుగుటవలన వే రగుదురు. అటులనే పెద్ద వసంతకుడు, పెద్ద లక్ష్మణుడును ఒక చోటునకును; చిన్న వసంతకుడు, చిన్న లక్ష్మణుడును ఇంకొక చోటునకును కొట్టుకొని పోవుదురు. ఇరువది సంవత్సరముల తరువాత మరల నందరును కాంచీపురమున కలియుదురు. వసంతకులు, లక్ష్మణులు పోలికలలో హెచ్చుతగ్గులు లేనివా రగుటవలన కొన్ని విచిత్రములయిన సన్నివేశములు తటస్థమగును. తుద కందరును పరస్పరము తెలిసికొందురు.

ఈ కథా ప్రారంభము, కాంచీపురమున ధర్మపాలమహారాజు నాస్థానమున నగును. మథురాపురపు వర్తకులైన వర్ధమానుడు (Aegeon, a merchant of Syracuse) ధర్మపాలుని (Solinus) ఆజ్ఞ నుల్లంఘించి కాంచీపురము (Ephesus) నకు వచ్చును. ధర్మపాలు డాతనితో సంభాషించుటతో నాంగ్ల నాటకము ప్రారంభమగును.

Act I; Scene I; A Hall in the Duke's Palace.
Enter Duke, Aegeon, Gaoler, Officers, and other Attendants

Aege— Proceed, Solinus, to procure my fall,
And by the doom of death end woes and all.

Duke— Merchant of Syracuse, plead no more.
I am not partial to infringe our laws:

The enmity and discord which of late
Sprung from the rancorous outrage of your duke
To merchants, our well-dealing countrymen,
Who, wanting guilders to redeem their lives,
Have seal'd his rigorous statutes with their bloods,
Excludes all pity from our threat'ning looks.[88]

ఆంగ్లమూలములో నున్నట్లు తెలుగులో నాటకప్రారంభమున్నచో తెలుగు వారి కర్థము కాదనుభావముతో పంతులుగారు; వర్ధమానుని మాటలకు పూర్వము, భద్రుడను సేవకుని, శ్వేతవాహనుడను కారాగృహాధికారిని ప్రవేశ పెట్టి, వారిచే వర్ధమానునిగూర్చి ధర్మపాల మహారాజునకు చెప్పించిరి. ఈ వివరణము తెలుగువారికి ఆవశ్యకమని పంతులుగారు తలంచిరి.

తెలుగు నాటకప్రారంభ మిట్లున్నది :

ప్రథమాంకము. ప్రథమరంగము — కాంచీపురము, సభామందిరము.

(ధర్మపాల మహారాజుగారు సింహాసనాసీనులయి యుండఁగా భద్రుఁడను ద్వారపాలకుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

భద్రు — (చేతులు జోడించుకొని) ధర్మపాల మహాప్రభూ! దేవర వారికేదో ముఖ్యాంశము నివేదింపవలసియుండి కారాగృహాధికారియైన శ్వేత వాహనుఁడు భటులతోడ వచ్చి తమ సందర్శనార్థమయి వాకిట వేచి యున్నాఁడు. ఆజ్ఞయయ్యేనేని, ఆతనిని స్వామిసమ్ముఖమునకు తోడితెచ్చెదను.[89]

రాజాజ్ఞ నియ్యగనే శ్వేతహనుడు ప్రవేశించి ఇట్లనును "శ్వేత—... ఈ ప్రాతఃకాలమున పాండ్యదేశపు వర్తకుఁడయిన యీతఁడు మన పురవీధు లలో తిరుగుచుండగా రాజభటులీతనిని పట్టుకొని నావద్దకు తీసికొని వచ్చినారు, పలినవారి యుత్తరువు నిమిత్తమై యీతని నిక్కడకుఁ గొనివచ్చినాఁడను."[90] వెంటనే ధర్మపాల మహారాజు వర్తకునివైపు తిరిగి యీతని పేరడుగును. ఇక్కడ నుండి పంతులుగారు మూలమునను సరించిరి.

"వర్త—నా పేరు వర్ధమానుఁడు. స్వామీ! నాకు శీఘ్రముగా మరణదండనమును విధించి నేటితో నా కష్టములను గట్టెక్కింపుఁడు."

88. The Comedy of Errors. Act I; Scene I.
89. చమత్కార రత్నావళి (1917) ; వీరేశలింగకవికృతగ్రంథములు. మూడవ సంపుటము - నాటకములు; పుట - 1.
90. Ibidem.

"ధర్మ—ఓయీ ! నీవు మాయెదుట మఱేమియుఁ బలుకఁబోకుము. ఒక్కని కొఱకయి పాక్షికబుద్ధి వహించి మాదేశపు శాసనముల నెన్నటికిని మేము మీఱఁగలవారముకాము. అక్రమముగా నిచ్చుకొమ్మన్న ధనము నిచ్చుకోలేకపోయిన మాత్రముచేత నాఁడాప్రకారముగా మీరాజు క్రూరుఁడయి న్యాయమార్గమున సంచరించుచున్న మా దేశపు వర్తకుల నందఱిని చంపించినప్పటినుండియు, మాహృదయమునందు మీదేశస్థుల విషయమయి లేశమయినను దయయనుమాట పుట్టకున్నది."[91]

ఈ యనుసరణమునుబట్టి చూచినచో పంతులుగారు స్వతంత్రముగా తెలుగునాటకము నెట్లు విస్తృతపరచిరో తెలియును. ఇట్లు విస్తృతపరచుటయే గాక, మూలములోని మాటలను కొన్ని చమత్కారముగ తెలుగులోనికి పంతులుగారు తెచ్చిరి. ఈ మాటల యనువాదము వింతగ వినపడును.

ఆంగ్లమూలము :

"Angelo— *Come, Come* ; you know I gave it you even now.
Either send the chain or send by me some token."[92]

తెలుగు :

"విశ్వకర్మ—*రండి రండి* ఇంతకుమునుపే మీ చేతికి చంద్రహార మిచ్చినాను గదా ? ఆ చంద్రహారమయినా లేకపోతే మఱివక వస్తువు యేదైనా ఆనవాలిచ్చి పంపండి."[93]

ఈ విధముగా ననుసరణములో నచ్చటచ్చట 'చిలుకపలుకు'ల వలె ఆంధ్రానువాదము జరిగినది. మొత్తముమీద మూలములోని భావములను సన్నివేశములను యథాక్రమముగాననుసరించుచునే వీరువిస్తృతముచేయుచువచ్చిరి.

'కామెడీ ఆఫ్ ఎఱ్ఱర్స్' అను నాటకమును 'చమత్కార రత్నావళి' యను పేర వచనముగ ననుసరించి వ్రాయుటయే గాక; ఆంగ్లనామము తోడనే పంతులుగారు దీనిలోని ప్రథమాంకమును, ద్వితీయాంకములోని కొంత భాగమును, ద్విపదగ రచించిరి. ఈ యనువాదము ఇంగ్లీషులోని మూలమును యథాతథముగ ననుసరించి చేసినది. ఇందు ప్రారంభ మాంగ్ల నాటకములో వలెనే యుండెను.

---

91. Ibidem. పుట - 2.
92. The Comedy of Errors. Act IV; Scene I.
93. చమత్కార రత్నావళి. పుట - 39. (1917 ప్రచురణము)

"ప్రథమాంకము ; 1. ప్రదేశము - ప్రభుమందిరమునందలి చావడి.

(ప్రభువు, వర్తకుఁడు, కారాగృహాధిపతి ఉద్యోగస్థులు ఇతర సేవకులు ప్రవేశించిన మీఁదట)

పజియన్ — నరపాల! యురుదెబ్బ నను శిక్షసేయ,
మరణదండమున మాను నా వెతలు.

ప్రభు — వర్తక! మఱియేమి పలుకకు మింక
వార్తలకొ అకుఁగా నకట! మూలంక
ధర్మశాస్త్రంబుల తగవేదఁగాను,
గూర్మిఁ, బాతీకబుద్ధిఁ గూరను నేసు." [94]

ఈ విధముగా మూలానుసార మీ యనువాదము సాగినది. ఇందునను. ఆంగ్లములోని కొన్ని వాక్యములు విడువబడినవి. 'పజియన్' తన భార్యను గూర్చి పలుకు సందర్భమున రాజుతో నిట్లనును.

"Aegeon—And the great care of goods at random left,
Drew me from kind embracements of my spouse :
From whom my absence was not six months old,
Before herself, — *almost at fainting under*
*The pleasing punishment that women bear,*—
Had made provision for her following me,
And soon and safe arrived where I was.
*There had she not been long but she became*
*A Joyful mother of two goodly sons;*-"[95]

ఈ పాదములకు పంతులుగారిట్లు తెలుగు వ్రాసిరి.

"పజి—తెరువున నొక మూల దిగఁబెట్టి చన్న
సరకులనైనను జాగ్రత్తసేయు
ఘనుఁడాతఁ డెలనాగ కౌఁగిలినుండి,
నను సమాకర్షించెఁ దన దేశమునకు;
ఆఱుమాసములైన నరుగకమున్న
*తీఱని విరహంపుఁ దీవ్ర వేదనను*
*చిక్కి నగంబయి చక్కెరబోఁడి*

94. వీరేశలింగకవికృతగ్రంథములు (1950). నాలుగవ సంపుటము.
కామెడీ ఆఫ్ ఎఱర్స్, పుట - 866.

95. The Comedy of Errors; Act I; Scene I.

గ్రక్కునఁ బయనంపుఁ గార్యముల్నడపి,
సేమంబుతోవచ్చి చెచ్చెరఁ దాను
మేమున్న సీమను మేరమైఁజేరె:
*చిరకాల మచట వసింపక మున్న*
*తరుణి యిద్దఱ ముద్దు తనయులఁగాంచె.*"[96]

'ఏజియన్' భార్య గర్భవతి యైనదని చెప్పుటకు షేక్స్పియర్ "almost at fainting under, The pleasing punishment that women bear" అని సొగసుగా వ్రాసెను. ఈ పాదములకును, "There had she not been long but she became, A Joyful mother of two goodly sons" అన్న పాదములకును సమన్వయము చక్కగా కుదిరినది.

పంతులుగారి యనువాదములో "తీఅని విరహంపుఁ దీవ్రవేదనను, చిక్కి నగంబయి చక్కెరబోఁడి" అను పాదములకును, "చిరకాల మచట వసింపక మున్న, తరుణి యిద్దఱ ముద్దు తనయులఁగాంచె" అను పాదములకును సమన్వయము చక్కగా కుదురలేదు. ఈ విధముగ సూక్ష్మ పరిశీలనముచేసినపుడు, పంతులుగారు యథామాత్ృకానువాదములో గూడ స్వేచ్ఛచూపిరని తెలియును.

1880 - వ సంవత్సరములోనే పంతులుగారు; "షేక్స్పియరు మహాకవియొక్క నాటకములలో నొక్కటియైన మర్చెంట్ ఆఫ్ వినీస్ (The Merchant of Venice) అను నాటకములోని ప్రథమ ద్వితీయాంకములను వినీసు వర్తక చరిత్రమనుపేర ద్విపద కావ్యముగానుచేసి ప్రకటించితినిగాని... ముగింపలేదు";[97] అని తమ స్వీయచరిత్రలో వ్రాసిరి.

ఈ నాటకానువాదములో పంతులుగారు ఆంగ్లమూలములోని పేరులను మార్చకుండనుంచి, ద్విపదగ రచించిరి. 1880 వ సంవత్సరములోనే, జనవరినెలలో గురజాడ శ్రీరామమూర్తిగారు 'మర్చెంట్ ఆఫ్ వినీస్' నాటకమును 'వెనీసువణిజనాటకము' లేక 'సుహృత్సు భాషితము' అనుపేర నాంధ్రీకరించిరి.[98] శ్రీరామమూర్తిగారు గద్యపద్యములను రెంటిని తమ యనువాదమున, నుపయోగించిరి. వీరేశలింగం పంతులుగారు, వీరిమార్గము ననుస

---

96. వీరేశలింగకవికృత గ్రంథములు (1950). నాలుగవ సంపుటము. కామెడీ ఆఫ్ ఎఱ్ఱర్స్. పుట - 869.
97. స్వీయచరిత్రము; రెండవభాగము; 1915. పుట - ౧౬౧.
98. ఈ పరిశోధన గ్రంథములో పుట - 305 చూడవలసినది.

రింపలేదు. 1875 - వ సంవత్సరమున వావిలాల వాసుదేవశాస్త్రిగారు 'జూలియస్ సీజర్' అను నాటకమును మంజరీ ద్విపదలో "సీజరు చరిత్రము" అను పేర నాంధ్రీకరించిరి.[99] వీరేశలింగం పంతులుగారీ మార్గము ననుసరించి కాబోలును, తమ యనువాదమును ద్విపదలో చేసిరి.

పంతులుగారు 'వెనీసు వర్తక చరిత్రము:' ననువదించుటయందు, మూలము నించుమించుగా మార్పులుచేయకుండ తెలుగునకు తెచ్చిరి. గురుజాడ శ్రీరామమూర్తిగారు తమ యనువాదములో; మన సంప్రదాయమునకు విరుద్ధములైన భావములను, ఐతిహ్యములను అనువదింపక విడిచిరి. పంతులుగారట్లుగాక; నాటకములోని నామములను మార్చినప్పుడు మన సంప్రదాయము యొక్క ప్రస్తావన యేలయనితలంచి కాబోలు, తమ యనువాదమును యథామూలముగ చేసిరి. ఈవిషయమున వీరు, వావిలాలవారి మార్గమునుగాని, గురుజాడ శ్రీరామమూర్తిగారి మార్గమునుగాని యనుసరింపక, స్వతంత్రమయిన మార్గమును త్రొక్కిరి. బెసానియో (Bassanio) ప్రేమించిన పోర్షియ (Portia) యొక్క సౌందర్యము నాతడు, మిత్రుడైన 'ఆంటోనియో' (Antonio) కు వర్ణించి చెప్పు సందర్భమున పంతులుగారు మూలము ననుసరించి ఈ క్రింది విధముగా ననువాదము చేసిరి.[100]

"బస్సానియో — కలదు 'బెల్మంట'ను గ్రామంబునందు
జలజాక్షి యొక్కతె సౌందర్యరాశి,

---

99. ఈ పరిశోధన గ్రంథములో పుట - 291 చూడవలసినది.

100. వీరేశలింగకవికృతగ్రంథములు (1917). మూడవ సంపుటము ; వెనీసువర్తక చరిత్రము. పుట - 799, 800.

ఆంగ్లమూలము :

" Bassanio— In Belmont is a lady richly left;
And she is fair, and, fairer than that word,
Of wondrous virtues : sometimes from her eyes
I did receive fair speechless messages :
Her name is Portia; nothing undervalued
To Cato's daughter, Brutus' Portia:
Nor is the wide world ignorant of her worth ;
For the four winds blow in from every coast
Renowned suitors; and her sunny locks
Hang on her temples like a golden fleece;
Which makes her seat of Belmont Colcho's strand,
And many Jasons come in quest of her.

The Merchant of Venice. Act I; Scene I.

'సౌందర్య'మనుమాట చాలదా యింతి
యందమ్ముఁ దెలుపంగ నావంతయేని;
ధనవంతురాలామె గుణవంతురాలు.
మును గొన్ని వేళల ముదమొప్పఁ దనదు
కనుదామరలనుండి కరుణమై నాకుఁ
బనిచెను ధ్వనిలేని వర్తమానముల.
ఆమె నామము 'పోర్షి' అరసిచూడంగ
నేమిటఁ గొఱవడదించుకయేని
'కేటో'కుఁ గూతురై మేటియైనట్టి
'బ్రూటను' భార్యయౌ 'పోర్షి'యన్ సతిక.
మృగనేత్రమహిమంబు మితిలేనియట్టి
జగమెఱుంగనిది లేశంబునుగాదు;
ఆమెను జేపట్ట నాత్మలఁగోరి
కాముకజనులు నల్గడలయందుండి
పలుసుప్రసిద్ధులు వచ్చుచునుంద్రు.
*తళతళలాడెడి తరుణి ముంగురులు*
*కనక కేశంబుల కాంతిని బూని*
*కణతలపైవ్రాలి, ఘనతఁదానున్న*
'బెల్మంటు' గ్రామంబుఁ జెను'కాల్చిసు'నుగ
మేల్మిఁ జెందింపంగ, మెచ్చికరంబు
చేరిదురచ్చోటు 'జేసను'వంటి
వారలనేకులు వామాటికొఱకు."

ఇట యథామూలముగ "కనకకేశముల"ని (Sunny Locks) పంతులుగారనువదించిరి. గురుజాడ శ్రీరామమూర్తిగారట్లుగాక "ముంగురులూహింప నళులు;" అని యనువాదము చేసిరి. ఈయనువాదము భారతీయ సంప్రదాయాను సారము చేయబడి సౌందర్య హేతువైనదని శ్రీరామమూర్తిగారూహించిరి. కాని, నాటకములోని పేరులు, సన్నివేశములు, కథ మార్పు చేయనప్పుడు సామాన్యమైన ఇట్టిమార్పులు, నాటక సౌందర్యము నినుమడింపజేయునవి కాకుండుటయేగాక, "పోర్షియ" జుట్టు భారతనారి జుట్టువలె తుమ్మెదలవలె నల్లగా నున్నదనుట, హాస్యాస్పదమని పంతులుగారూహించి యుండవచ్చును.

పంతులుగారాంధ్రీకరించిన షేక్స్పియర్ నాటకము లివి మాత్రమే. తరువాత పంతులుగారు షేక్స్పియర్ నాటకానువాదములను విడిచి; 'షెరిడన్' (Sheridan) నాటకములలో మిక్కిలి పేరుపొందిన 'ది రైవల్స్' (The Rivals); 'ద డ్యూయెన్నా' (The Duenna) అను నాటకములను గ్రహించిరి. ఆచార వ్యవహారములను అవహేళనముచేయు నాటకములను (Comedy of Manners) వ్రాయుటలో సిద్ధహస్తుడైన 'షెరిడన్' నాటకములవైపు పంతులుగారు తమ కలమును త్రిప్పుట, వారి 'రచనాపరిణామము' ననుసరించియే యున్నది. ప్రహసనములతో తృప్తిపొందక వారు; సాంఘికేతివృత్తము కలది, ఆచార వ్యవహారముల నపహాస్యము చేయునదియునగు సంస్కృతములోని 'ప్రకరణము'ను విశేషముగ పోలిన, నాటకరచనకు గడంగిరి.

'షెరిడన్', పదునెనిమిదవ శతాబ్ది యుత్తరార్ధములో అత్యుత్తమ నాటకములను రచించిన ప్రజ్ఞానిధి. ఈతని నాటకములను గూర్చి యొక ప్రఖ్యాతాంగ్ల విమర్శకు డిట్లనెను.

"The dramatic work of Richard Brinsley Sheridan (1751-1816) marks at once the height of the reaction against sentimental drama and the most finished achievement of the English comedy of manners." [101]

'షెరిడన్' వ్రాసిన నాటకములన్నియు నించుమించుగా నాలుగు సంవత్సరములలో — The Rivals (1775); St. Patrick's Day (1775); The Duenna (1775); The School for Scandal (1777); The Critic (1779)—వ్రాయబడినవి. వీరేశలింగంపంతులుగారు వీనిలో రెంటిని— The Duenna, The Rivals — రాగమంజరి, కల్యాణకల్పవల్లి అను నామములతో తెలుగు చేసిరి.

'రాగమంజరి' యాంధ్రీకరణమును గూర్చి పంతులుగారు తమ స్వీయచరిత్రలో నిట్లు వ్రాసిరి. "ఈ నాటకము (ప్రహ్లాద) తరువాత జేయఁబడిన నాటకము రాగమంజరి. ఇది 'షెరిడన్' అను నింగ్లీషుకవిచే రచియింపఁబడిన

---

101. 'English Drama of The Restoration and Eighteenth Century' (1642-1780) By George Henry Nettleton.
New York; 1914. Page - 291.

'డ్యూయనా' యను నాటకకథ ననుసరించి చేయఁబడినది. ఇందలి కథ మిక్కిలి రమ్యమై యుండును." [102]

'రాగమంజరి' యను నాటకము, 'డ్యూయనా' (1775) వెలువడిన తరువాత సరిగ నూటపది సంవత్సరములకు 1885 లో వెలువడినది. ఇది ఆంగ్లములో గేయము (Songs) లతో నిండియున్న నాటకము. ఆంగ్ల రంగస్థలమున నిది ప్రదర్శింపబడినప్పుడు (21-11-1775) ప్రజాదరణమును విశేషముగా పొందెను. ("...the lively and successful Comic Opera...") మూలములో గేయము లుండుటనుబట్టి పంతులుగారు కూడ దీనియందు పద్యములను, పాడుటకు వీలయిన ద్విపదలను తెలుగులో నుంచిరి. ఆంగ్లములో ఈ రెండు నాటకములును (The Duenna, The Rivals) ఒకే సంవత్సరములో (1775) రచింపబడినను; తెలుగులో రాగమంజరి 1885 లోను, కల్యాణవల్లి 1894 లోను రచింపబడెను.

---

102. స్వీయచరిత్రము ; రెండవ భాగము ; 1915. పుట - ౧౭౫.

రాగమంజరి (The Duenna) లోని పాత్రలు :

పురుషులు :

Don Jerome (సుదర్శనవర్మ) — విజయవర్మకును, భానుమతికిని తండ్రి.

Don Ferdinand (విజయవర్మ) — సుదర్శనవర్మ కొడుకు. సుదంతప్రియుడు.

Don Antonio (కామపాలుడు) — భానుమతి ప్రియుడు.

Issac Mendoza (వసుకాముడు) — భానుమతిని వివాహమాడ గోరినవాడు.

Don Carlos (చంద్రకేతుడు) — వసుకాముని మిత్రుడు.

Fr. Augustine (నారాయణశర్మ) — పురోహితుడు.

Fr. Paul (గండభేరుండాచార్యులు) — కేశవస్వామి అర్చకుడు.

Fr. Francis (కంఠీరవాచార్యులు) — రెండవ అర్చకుడు.

Lopez (దామోదరుడు) — విజయవర్మ సేవకుడు.

స్త్రీలు :

Donna Louisa (భానుమతి)—సుదర్శనవర్మ కూతురు. కామపాలుని ప్రియురాలు.

Donna Clara (సుదంత) — విజయవర్మ ప్రియురాలు.

Duenna (రాగమంజరి) — భానుమతి పరిచారిక.

స్థలము : Seville (ఉజ్జయిని)

దారకుడు — సుదర్శనవర్మ సేవకుడు.

ఘటకుడు — ,,

చతురిక — భానుమతి పరిచారిక.

సుదంత పరిచారిక.

ఆంగ్లకథ ననుసరించి వ్రాయుటలో, షేక్స్పియర్ నాటకముల విషయమున చూపిన స్వేచ్ఛనే ఈ నాటకముల విషయమునను పంతులుగారు జూపిరి. పేరులను మార్చుటయేగాక; తెలుగువారికి కథ సుగమ మగుటకు, కథాపరిణామమును నక్కడక్కడ వీరు విపులీకరించిరి

'ది డ్యూయన్నా'(The Duenna) లోని కథ సామాన్యమైనదే. సుదర్శనవర్మ (Don Jerome) కూతురయిన భానుమతి (Donna Louisa) తండ్రి యెంచిన వరుడైన వసుకాము (Isaac Mendoza) నొల్లక, తాను ప్రేమించిన కామపాలు (Don Antonio) నే వరింప నిశ్చయించుకొని, తనపరిచారికయైన రాగమంజరిని (The Duenna) తన స్థానమున నిలిపి, తాను గృహమును విడిచిపోవును. భానుమతి సోదరుడైన విజయవర్మ (Don Ferdinand) ఆమె స్నేహితురాలయిన సుదంత (Donna Clara) ను వివాహమాడ నెంచును. మారువేషమున నున్న రాగమంజరినే భానుమతి యనుకొని వసుకాముడు వివాహమాడుటయు; భానుమతీ కామపాలు రొక దేవాలయమున రహస్యముగ వివాహమాడుటయు; సుదంతా విజయవర్మల వివాహము జరుగుటయు; తుదకు సుదర్శనవర్మ పశ్చాత్తాపపడి కూతురును, నల్లుని, కోడలిని, కొడుకును ఆదరించుటయు నిందలి కథ. ఈ కథలో రాగమంజరి పాత్రకు చాల ప్రాముఖ్య ముండుటవలన, మూలములో వలెనే పంతులుగారు కూడ రాగమంజరి యను పేరే నాటకమునకు పెట్టిరి.

ఈ నాటకములో పంతులుగారు చేసిన మార్పులు ; మతవిషయములకు, సాంఘికాచారములకు సంబంధించినవి. మూలనాటకము కూడ నాటి సాంఘికాచారముల నవహేళనము చేయునదగుటచే, పంతులుగారికి తెలుగులో నట్టి పని చేయుట కవకాశము బాగుగ లభించినది.

సుదర్శనవర్మయు, విజయవర్మయు భానుమతి వివాహ మాడవలసిన వానిని గూర్చి ప్రసంగించుకొను సందర్భమున ; మూలములో భానుమతి (Donna Louisa) తనతండ్రి యెంచినవాడు తనకు నచ్చడనియు నాత డన్యమతస్థుడనియు పల్కును. తండ్రి యంగీకరింపక, ఆత డన్యమతస్థుడు కాడనియు, ఒకప్పు డన్యమతస్థు డయినను నిప్పుడు మతము మార్చుకొనెననియు పల్కును. ఆ సందర్భమున మూలములోని సంభాషణమును, పంతులుగారి యనువాదమును క్రింద నిచ్చుచున్నాను. వీని తులనాత్మక పరిశీలనమువలన పంతులుగారు చేసిన మార్పులు వ్యక్తమగును.

ఆంగ్లము — "Don Jerome—.........what is your objection to him?"

"Don Ferdinand — He is a *Portuguese*, in the first place."

"Don Jerome — No such thing, boy; he has forsworn his country."

"Donna Louisa — He is a *Jew*."

"Don Jerome — Another mistake: he has been a *Christian* these six weeks."

"Don Ferdinand — Ay, he left his old religion for an estate, and has not had time to get a new one."

"Donna Louisa — But stands like a dead wall between *church* and *synagogue*, or like the blank leaves between the Old and New Testament."[103]

తెలుగు— "సుదర్శనవర్మ......నీ కతనియందేమిలోపము కనఁబడినదో చెప్పు."

"విజయవర్మ— మొదటిమాట అతఁడు విదేశస్థుఁడు."

"సుదర్శనవర్మ— ఆ సందేహముతో పనిలేదు. అతఁడు స్వదేశము విడిచి తండ్రినాటినుండియు ఇక్కడనే యుండుటచేత ఈదేశస్థుఁడే యయినాఁడు."

"విజయవర్మ—అతనిది *శివమతము*."

"సుదర్శనవర్మ— ఇది మఱియొక తెలియనిమాట. అతఁడీ రెండు మాసములనుండియు విష్ణుమతస్థుఁడయినాఁడు"

"విజయవర్మ— అవునవును. అతఁడు ధనము నిమిత్తము పూర్వుల నుండియు వచ్చుచున్న స్వమతమును వదలిపెట్టినాడు. ఈ క్రొత్త మతమును మార్చుకొనుట కింకను ఆవశ్యకము రాలేదు కాబోలును!"

"భానుమతి— అతఁ డిప్పు డేమతములోను లేక దేవాలయమునకును మసీదునకును మధ్యా నూఁగులాడుచున్నాఁడు."

(రాగమంజరి, ప్రథమాంకము మూడవరంగము)

పంతులుగారికి మతము పేరిట దేవాలయాదులలో జరుగుచున్న అత్యాచారములన్న కంటగింపు. మతాచార్యుల శీలసంపదయందు నమ్మకములేదు. వారి నవహేళనముచేయు రచనలను వారు సొంతముగ చాల వ్రాసిరి. అట్టి వారికి, ఇంగ్లీషు నాటకములోని తన భావములతో సారూప్యముగల ఘట్టము ననువదించుటయన్న కుతూహలమెక్కువ.

103. 'The Duenna'. By Richard Brinsley Sheridan. Act-I; Scene-III

ఆంగ్లము—"A Room in the Priory."

("Father Paul, Father Francis, Father Augustine and other Friars, discovered at a table drinking.")

"Paul — Brother Francis, toss the bottle about, and give me your toast."

"Fran — Have we drunk the Abbess of St. Ursuline?"

"Paul — Yes, yes; she was the last."

"Fran — Then I'll give you the blue - eyed nun of St. Catherine's."

"Paul — With all my heart (Drinks) Pray, brother Augustine, were there any benefactions left in my absence?"

"Aug — Don Juan Corduba has left a hundred ducats, to remember him in our masses."

"Paul — Has he? let them be paid to our wine-merchant, and we'll remember him in our cups, which will do just as well. Anything more?"

"Aug — Yes; Baptista, the rich miser, who died last week, has bequeathed us a thousand Pistoles, and the silver lamp he used in his own chamber, to burn before the image of St. Anthony."

"Paul — 'T was well meant, but we'll employ his money better— Baptista's bounty shall light the living, not the dead. St. Anthony is not afraid to be left in the dark, though he was—(Knocking) See who's there."[104]

తెలుగు—("కేశవస్వామి గర్భాలయము ముందరి మండపము.")

"గండభేరుండాచార్యులును, కంఠీరవాచార్యులును. క్రింద పళ్ళెములో ప్రసాదముంచుకొని చేతులలో గిన్నెలు పట్టుకొని కూరుచుండి ప్రవేశించుచున్నారు."

"కంఠీ—స్వామీ! మీ పెరుమాళ్ళుబుడ్డి నావద్దికిఁ బంపుడు. ఈ మధ్యాహ్నము స్వామికి భోగము చేయించిన పద్మావతి పేరుచెప్పి యింకొక గిన్నె త్రాగవలెను. ఈరాత్రి పెరుమాళ్లు మనలో తాండవమాడవలెను (అని చేతిలో గిన్నె త్రాగి రెండవచేయి చాచుచున్నాఁడు.)"

"గండ—నేను గ్రామాంతరముపోయిన నాలుగు దినములలోను స్వామివారి కెవ్వరెవ్వ రే యే తిరుకైంకర్యములు చెల్లించినారు?"

104. 'The Duenna'. By R. B. Sheridan. Act-III; Scene-V

"కంఠీ—మన పట్టణములోని మధుసూదనదాసుఁడు స్వామికి కంఠాభరణము చేయించుమని నూరు వరహాలు సమర్పించినాఁడు."

"గండ—స్వామికిఁగాదు మన సానికి కంఠాభరణము చేయింతము, అది స్వామి మెడలోకంటె దాని మెడకే యందముగా నుండును. ఇఁక భక్తు లెవ్వరును మ్రొక్కులు చెల్లింపలేదా ?"

"కంఠీ — చెల్లించినారు. మన పట్టణములో లోభియని పేరుపడిన యా ముసలి గోవిందసేనుఁడు చచ్చినతరువాత తనపేరు స్థిరముగా నుండుటకయి పెరుమాళ్ళ సన్నిధానమునందు నందాదీపము పెట్టుమని వెండి దీప స్తంభమును, ఏఁటేట ధనుర్మాసములో తన పేరుపెట్టి యొకనా డుత్సవము చేయించుమని వేయివరహాలును, అమ్మవారికి పట్టుచీరయు, సమర్పించినాఁడు."

"గండ — అతఁడు పరమభాగవతోత్తముఁడు. ఆ వైకుంఠములో స్వామి సన్నిధానమంద నిత్య ముక్తులలో చేరియుండును. అతఁడిచ్చిన సొమ్మె లాగున వినియోగింపవలెనో తరువాత సావకాశముగా నాలోచింతము కాని దీపస్తంభము మాట ముందుగా పరిష్కరింతము. బ్రతికియున్న భూదేవత లుండగా దానిని ప్రాణములేని రాతి దేవతలయొద్ద నుంచఁ గూడదు. స్వామివారికి చీకటిలో భయములేదు. ఆదీపము మన గదిలోనే పెట్టుకొందము. ఆపట్టుచీర నీవు నీ భార్యకిచ్చుకో. ఎవరో తలుపు తట్టుచున్నారు."

(రాగమంజరి. తృతీయాంకము. ఐదవరంగము.)

రాగమంజరి నాటకములో పంతులుగారు మన సంప్రదాయమునకు తగినట్లు మార్పులు చాలచేసిరి. కాని అచ్చటచ్చట, పాశ్చాత్య సంప్రదాయముల వాసనలు గుబాళించుచునే యున్నవి.

సుదర్శనవర్మ కుమారుడైన విజయవర్మ, సుదంతను వివాహము చేసికొని తండ్రి యింటికి తిరిగివచ్చును. ఆ సందర్భమున సంతోషముతో సుదర్శనవర్మ పల్కిన పల్కులు, మన సంప్రదాయమునకు కేవలము విరుద్ధములు.

ఆంగ్లము—"Don Jerome—Gadsbad; and a great fortune! Ferdinand, you are a prudent young rogue, and I forgive you ; and, ifecks, you are a pretty little damsel. *Give your father-in-law a Kiss.........*"

"Donna Clara — There, old gentleman; and now mind you behave well to us."

"Don Jerome — Ifecks, *those lips ha'n't been chilled by kissing beads*! Egad, I believe I shall grow the besthumoured fellow in Spain. Lewis! Sancho! Carlos! d'ye hear? are all my doors thrown open? Our Children's Weddings are the only holidays our age can boast........."[105]

తెలుగు: "సుదర్శనవర్మ—ఇది మహాభాగ్యము! నీవెంతో తెలివిగల పడుచువాడవు, నిన్ను క్షమించినాను. ఓ ముద్దులకోడలా! నీవు చక్కని చిన్నదానవు *నీ ముసలిమామగారి కొక్కసారి నీనవ్వుమొగము ముద్దిమ్ము*."

సుదంత - అయ్యో! ఇఁకముందు మీరు మమ్మాదరించి కడుపులో పెట్టుకోవలెను. (అని చేయి ముద్దిచ్చుచున్నది)"

సుదర్శనవర్మ—*తావళములు త్రిప్పుటచేత నీచేతులింకను గఱకు పాఱలేదే!* నేనిప్పుడు సంతోషము పట్టఁజాలకున్నాను. ఓరీ! దామోదరా! ఘటకా! జారకా! మన వీధితలుపులు తీసియుంచినారా? ఈ వయస్సున మాకు బిడ్డల వివాహములే గొప్ప వేడుకలు."

(రాగమంజరి, తృతీయాంకము, రంగము ఏడు.)

పంతులుగారు; తెలుగు నాటకములో సుదర్శనవర్మ కోడలి మొగమునకు బదులుగా చేతిని ముద్దుపెట్టుకొన్నట్లు మార్చినను; అదిగూడ మనసంఘములో లేదు గనుక అసహజమై వింతగనే యున్నది.

ఇట్టి మార్పులను చాల చోటులందు పంతులుగారు చేసినను, ఈ నాటకము మన దేశమునకు సంబంధించినది కాదని చూపజాలిన 'పాశ్చాత్యవాసనలు,' తెలుగు నాటకములో చాలచోట్ల కలవు. వీనినిగూడ పరిహరించి యున్నచో 'రాగమంజరి' నాటక మింకను రసవంతముగనుండి యుండెడిది. ఆంగ్ల సాహిత్య ప్రభావము దీనియందెల్లెడల కన్పట్టుచునే యున్నది.

ఆంగ్లములోని 'ది రైవల్స్' (The Rivals) అను నాటకమునకు తెలుగులో పంతులుగారు 'కల్యాణ కల్పవల్లి'అని పేరుపెట్టి అనువాదము చేసిరి. దీనినిగూర్చి వారు తమ స్వీయచరిత్రలో నిట్లువ్రాసిరి. "నాచేత రచియింపఁబడిన నాటకములలోఁ గడపటిది కల్యాణ కల్పవల్లి యనునది. ఇది 'షెరిడన్' అనెడి ఇంగ్లీషు కవిచేత'ది రైవల్సు' (The Rivals) అను పేరితో నత్యంత మనోహరముగ రచియింపఁబడిన యైదంకముల నాటకమునకు తెలుఁగు. ఇందలి కథ

105. 'The Duenna'. By R. B. Sheridan. Act-III; Scene-VII

రాగమంజరి యితివృత్తమున కంటెను నధిక హృదయాకర్షకముగా నుండును. అయినను మనవారి కా దేశస్థుల యాచార వ్యవహారములు క్రొత్తవిగాను తమ వానికి విరుద్ధములుగాను కనఁబడుటచేత నిట్టివాని నంతగా నాదరింపరు. దీనిని 1894-వ సంవత్సరమునందు ముద్రించి ప్రకటించితిని."[106]

కల్యాణ కల్పవల్లి నాటకములో నాయిక కళావతి (Lydia). ఈమె వీర సేనుని (Sir Anthony Absolute) పుత్రుడయిన విక్రమసేనుని (Captain Absolute) ప్రేమించినది. విక్రమసేనుఁడు కళావతిని ప్రేమించినను, తన నిజ నామము తెలిసినచో నామె ప్రేమింపదను భీతిచే విజయపాలుడను నామముతో నామె యెదుట వ్యవహరించుచుండును. కళావతి మేనత్తయయిన సుభద్రమ్మ (Mrs. Malaprop) తన మేనగోడలు తాను వెదకి తెచ్చినవానిని గాని, ఇతరుని వివాహమాడరాదను పట్టుదల కలది. పురుషోత్తము దేవుడను (Sir Lucius O' Trigger) వాడును, దామోదరవర్మ (Acres) అను నాతడును గూడ కళావతిని ప్రేమించిరి. కళావతి యొక్క చెలికత్తెయైన చారుమతి (Julia) విక్రమసేనుని స్నేహితుడయిన దర్పసారుని (Faulkland) ప్రేమించినది.

---

106. స్వీయచరిత్రము ; రెండవ భాగము 1915. పుట-౧౮౧, ౧౮౨.

కల్యాణకల్పవల్లి (The Rivals) లోని పాత్రలు

పురుషులు :

Sir Anthony Absolute (వీరసేనుడు) — విక్రమసేనుని తండ్రి.
Captain Absolute (విక్రమసేనుడు) — కళావతి ప్రియుడు.
Faulkland (దర్పసారుడు) — చారుమతి ప్రియుడు.
Acres (దామోదరవర్మ) — కళావతిని వరింపగోరిన రాజపుత్రుడు.
Sir Lucius O'Trigger (పురుషోత్తమదేవుడు) —కళావతి తన్ను ప్రేమించినదనుకొన్న క్షత్రియవీరుడు.
Ensign Beverley (విజయపాలుడు) — విక్రమసేనుని మారుపేరు.
Fag (రాముడు) — విక్రమసేనుని భృత్యుడు.
David (మాధవుడు) — దామోదరవర్మ సేవకుడు.
Thomas (శంకరుడు) — వీరసేనుని బండివాడు.

స్త్రీలు :

Mrs. Malaprop (సుభద్రమ్మ) — కళావతి మేనత్త.
Lydia (కళావతి) — విక్రమసేనుని వరించిన రాజపుత్రి.
Julia (చారుమతి) — దర్పసారుని వరించిన రాజపుత్రి.
Lucy (మంథర) — సుభద్రమ్మ దాసి.

సుభద్రమ్మ తన మేనగోడలు విషయమున కరకుగానున్నను, తాను మారు పేరుతో పురుషోత్తమదేవునకు ప్రేమలేఖలు వ్రాసెడిది. ఈలేఖలను, దాసియైన మంథర (Lucy) తీసికొని పోయెడిది. కళావతి విక్రమసేనుని ప్రేమించినను; ఆతనిని గాంధర్వవిధిని వివాహమాడినగాని దానిలో సొగసు లేదనియు, పెద్ద లందరు నంగీకరించి చేసిన వివాహములో శోభ తక్కువయనియు తలంచు వింత ప్రకృతిగలది. ఇది గ్రహించినవాడు గనుకనే విక్రమసేనుడట్లు మారువేష ముతో నామెను చేరుటకు యత్నించెను. సుభద్రమ్మకు విక్రమసేనుడే విజయ పాలుడని తెలియదుగనుగ, ఆమె కళావతీ విజయపాలుల వివాహమునకు వ్యతి రేకత చూపెను. నాటకాంతమున వీరందరికి అభిప్రాయభేదములు తొలగి కళా వతీ విక్రమసేనులకు, చారుమతీ దర్పసారులకు వివాహమగును. సుభద్రమ్మ ప్రేమలేఖలు వ్రాసెడిదను విషయముకూడ బయల్పడి ఆమె హాస్యాస్పదు రాలగును.

ఆంగ్లమూలములో 'మిసెస్ మేలప్రాప్' (Mrs. Malaprop) పాత్ర సృష్టి అద్భుతమయినది. ఒక మాటకు బదులుగా ఇంకొకమాట వాడుట ఈమె ముఖ్యలక్షణము. ఈ వాడుటవలన సభ్యులలో నవ్వు పుట్టును. ఈ నాటకము బయలుదేరిన తరువాత, అట్టి వాడుకకు 'మేలప్రాపిజమ్' (Malapropism)[107] అనుమాట బయలుదేరినది. ఆంగ్లనాటకములో ఈ పాత్రకు గల సొగసు తెలుగు నాటకములోని సుభద్రమ్మకు రాలేదు. ఆమెనుగూర్చి ఆంగ్ల విమర్శ కులు "Whatever aspersions maybe cast upon her 'parts of speech', Mrs. Malaprop remains, among a host of dramatic predecessors and imitators, the unrivalled queen of the dictionary,"[108] అనిన మాట సత్యము.

ఈ నాటకానువాదమునను పంతులుగారు 'రాగమంజరి'యం దవలం బించిన విధానమునే యవలంబించిరి. మూలములోని వర్ణనలను కొన్నింటిని వారు మార్చివేసి క్రొత్తవి కల్పించిరి. ఈ కల్పనలలో కొన్ని మన సంప్రదాయ

107. "malaprop (ism), n. Ludicrous misuse of word, esp. in mistake for one resembling it (e. g. a nice derangement of epitaphs for one arrangement of epithets). Hence malapropian a. (f. Mrs. Malaprop in Sheridan's Rivals."
(Oxford English Dictionary)

108. 'English Drama of the Restoration and Eighteenth Century' by G. H. Nettleton. New York. 1914. page - 298.

మునకు సంబంధించియుండి రమణీయముగ నున్నవి. ఉదాహరణకొఱకు కొన్నింటి నిచ్చుచున్నాను.

ఆంగ్లము—"Fag—Rich!—Why, I believe she owns half the stocks! Zounds! Thomas, she could pay the national debt as easily as I could my washerwoman! she has a lap-dog that eats out of gold, — *she feeds her parrot with small pearls*, — and all her threadpapers are made of bank - notes!"[109]

తెలుగు: "రాముడు—భాగ్యమో గీగ్యమో నాకు తెలియదు ఆవిడెయింట్లో మోహిరీలు మీ పశువులదొడ్లో గడ్డిపరకల లాగు యెక్కడచూచినా దొర్లుతూ వుంటవి. పశువుల కడుగు గోలెములుకూడా వారింట్లో బంగారపువే. *పంజరంలో చిలుకలకు మంచిముత్యాలు మేత పెడతారు.*"

(కల్యాణకల్పవల్లి, ప్రథమాంకము, మొదటిరంగము)

ఆంగ్లము—"Thos—May one hear her name?"

"Flag — Miss Lydia Languish—But *there is an old tough aunt in the way*; though, by-the-by, she has never seen my master–"[110]

తెలుగు: "శంకరుడు—ఆవిడపేరు యెవరైనా వినవచ్చునా?"

"రాముడు—ఆవిడపేరు కళావతి. అయితేనేమి కాని ఆచిన్నదానికి *మునలిమేనత్త వొకతె పానకంలో పుడకలాగు* ప్రతిబంధకంగా వున్నది. అయినా కానీ ఆపెద్దావిడ యిదివరకు నా యజమానుణ్ని యెప్పుడూ చూడలేదు...."

(కల్యాణకల్పవల్లి, ప్రథమాంకము. మొదటిరంగము)

సుభద్రమ్మ (**Mrs. Malaprop**) తన మేనగోడలు శృంగార గ్రంథములు చదివి చెడిపోకుండ చూచుచుండును. కాని, కళావతి (**Lydia**) మేనత్తకు తెలియకుండ ఆ గ్రంథములను తనదాసియైన మంథర (**Lucy**) చేత తెప్పించుకొని చదువుచుండును. ఈ సందర్భమున మూలములోని గ్రంథనామములకు బదులుగ, పంతులుగారు తెలుగులోని శృంగార ప్రబంధముల నామములను పేర్కొనిరి.

సుభద్రమ్మ తనమేనగోడలిని చూపించుటకై వీరసేనుని (**Sir Anthony Absolute**) తీసికొని, ఆమె గదిలోనికి వచ్చును. ఆమెవచ్చుచున్నటుల మంథర

109. 'The Rivals' by R. B. Sheridan. Act. I; Scene I.
110. Ibidem.

వలనవినిన కళావతి, తానంతకు పూర్వము చదువుచున్న శృంగార గ్రంథములను దాచివేసి, పెద్దలంగీకరించు శిష్టగ్రంథములను పైనుంచును. ఈ సందర్భమున ఆంగ్లములోను తెలుగులోనుగల భాగముల నుదాహరించుచున్నాను.

*ఆంగ్లము*—"Lydia— Here, my dear Lucy, hide these books. Quick, Quick! —Fling *Peregrine Pickle* under the toilet - throw *Roderick Random* into the closet – put *The Innocent Adultery* into *The whole Duty of Man* — thrust *Lord Aimworth* under the sofa – Cram *Ovid* behind the bolster - there - Put *The Man of Feeling* into your Pocket — so, so—now lay *Mrs. Chapone* in sight, and leave *Fordyce's Sermons* open on the table."

"Lucy — O burn it, ma'am! the *hair - dresser* has torn away as far as Proper Pride."

"Lydia — Never mind - open at Sobriety — Fling me *Lord Chester field's Letters.* Now for'em."[111]

*తెలుగు :* "కళావతి—ఓసీ! మంథరా! ఈ పుస్తకములు తీసిదాచు వేగిరము! వేగిరము! *రుక్మిణీకల్యాణము* పెట్టెలసందునఁ బడవేయుము. *విజయవిలాసము* పరుపుక్రింద పెట్టు. *భాగవతము సప్తమ స్కంధము* తెఱచి బల్లమీఁద పెట్టు."

"మంథర—వాఁడు సప్తమస్కంథం లెండి. *వంటబ్రాహ్మఁడు* పొస్తకంలో చుప్పనాతికథపట్టు వచ్చేదాక చించివేశాడు."

"కళావతి—పోనీ! ఉన్నంతవఱకు తెఱచిపెట్టి గూటిలోనున్న *గజేంద్రమోక్షము* నామీఁద గిరవాటుపెట్టు. వారు వచ్చుచున్నారు. నీవు వెళ్ళిపో.

(కల్యాణకల్పవల్లి, ప్రథమాంకము. రెండవరంగము)

ఒకమాట అనుటకు బదులుగా, అపార్థము కలుగు నింకొక మాటను, సరియయిన మాటయేయని తలంచి ప్రయోగించుట, ఆంగ్లనాటకములోని మిసెస్ మేలప్రాప్ (Mrs. Malaprop) యొక్క లక్షణము. ఇది ఆంగ్ల నాటకములో మిక్కిలి నవ్వు పుట్టించు విషయము. తెలుగు నాటకములోని సుభద్రమ్మ మాటలలో ఈ సొగసు తెచ్చుటకై పంతులుగారు ప్రయత్నించినట్లు లేదనుట కెన్నియో యుదాహరణములను జూపవచ్చును.

*ఆంగ్లము*—"Mrs. Malaprop—you thought, Miss! (Miss Lydia)...... But the point we would request of you is, that you will

111. Ibidem. Act. I; Scene II.

promise to forget this fellow - *to illiterate him*, I say, quite from your memory."[112]

ఇక్కడ, "నీవు ప్రేమించిన వానిని పూర్తిగా మరచిపొమ్ము. అతనిని నీ మనస్సులోనుండి తుడిచివేయుము;" అను అర్థమున to obliterate (Blot out) అని ప్రయోగించుటకు బదులుగా మిసెస్. మేలప్రాప్ to illiterate అని ప్రయోగించి నవ్వు పుట్టించినది. ఈ భాగము నీ క్రింది విధముగ పంతులుగారు తెలుగు చేసిరి. ఈ యనువాదమున సొగసే లేదు.

తెలుగు—"సుభద్రమ్మ—అమ్మాయీ! నీవేమయిన ననుకొందువు... ...మేమిప్పుడు నిన్ను ప్రార్థింప వచ్చిన సంగతి విను. *నీవతని మఱచిపోయెద నని* మా చేతిలో చెయ్యివేయవలెను."

(కల్యాణ కల్పవల్లి, ప్రథమాంకము, రెండవ రంగము.)

*ఆంగ్లము*—"Mrs. Malaprop — Now don't attempt *to extirpate* yourself from the matter; you know I have proof controvertible of it."[113]

ఇక్కడ "నా కీ విషయమేమీ తెలియదని నీవు తప్పించుకొనుటకు ప్రయత్నింపకుము. లాభము లేదు;" అను నర్థమున to extricate (Disentangle) అని వాడుటకు బదులుగా మిసెస్, మేలప్రాప్ to extirpate అని వాడినది.

ఈ వాక్యమునకు పంతులుగారిట్లు తెలుగు చేసిరి·

*తెలుగు*—"సుభద్రమ్మ-కళావతీ! *నీవు మాట మఱపించి తప్పించుకో చూడకు.* నీ నేరమునకు నావద్ద తగినంత నిదర్శనమున్నది."

(కల్యాణ కల్పవల్లి. ప్రథమాంకము. రెండవ రంగము.)

ఈ నాటకములో మిసెస్ మేలప్రాప్‌నకున్న ప్రాముఖ్యమంతయు నామె మాటలను బట్టి వచ్చినదియే. తెలుగు నాటకములో సుభద్రమ్మ కట్టి ప్రాముఖ్యము లేదు. కాని పంతులుగారు కొన్నికొన్ని చోటులందు; మూలములో మిసెస్, మేలప్రాప్ అన్న మాటలవలె నే వింతగా నుండునట్లు, తెలుగు నాటకములో సుభద్రమ్మచేత మాటాడించిరి. ఉదాహరణగా నిది గ్రహింపవచ్చును.

*ఆంగ్లము*—"Sir Anthony Absolute — Why, Mrs. Malaprop, in moderation now, what would you have a woman know?

"Mrs. Malaprop — Observe me, Sir Anthony. I would by no means

112. Ibidem.
113. Ibidem.

wish a daughter of mine to be a *progeny of learning*...... I would never let her meddle with Greek, or Hebrew, or algebra, or simony, .........neither would it be necessary for her to handle any of your mathematical, astronomical.........instruments ........Then Sir, she should have a *supercilious* knowledge in accounts;—and as she grew up, I would have her instructed in *geometry*, that she might know something of the *contagious* countries......and likewise that she might *reprehend* the true meaning of what she is saying. This, Sir Anthony, is what I would have a woman know; — and I don't think there is a *superstitious article* in it."[114]

ఈ వాక్యములు ఇంగ్లీషుభాష యున్నంతకాలము హాస్యమును పుట్టించుచునే యుండునట్టివి. సర్వజ్ఞురాల ననుకొనుచునే మిసెస్. మేలప్రాప్ ఎంత తెలివితక్కువగా మాటాడుచున్నదో మన కవగతమగును. Prodigy of Learning అనుటకు బదులుగా Progeny of Learning అనుట; Superficial Knowledge అనుటకు Supercilious knowledge అనుట ; Geography అని వాడుటకుబదులు Geometry అనుట ; Contiguous countries అనుటకు బదులు Contagious Countries అని ప్రయోగించుట ; Comprehend అను నర్థమున Reprehendఅని ప్రయోగించుట ; Superfluous Particle అనబోయి Superstitious article అనుట; మిసెస్. మేలప్రాప్ పాత్రయొక్క వైలక్షణ్యమును మనకు చూపునవి. ఇట్టి చమత్కారమును పంతులుగారు సుభద్రమ్మ పాత్ర విషయములో తెలుగునందు తీసికొని రాలేకపోయినను, కొంతవరకు నీ సందర్భమున నిట్లువ్రాసి వైలక్షణ్యమును సంపాదించిరి.

తెలుగు —"వీరసేనుడు—అది సరి కాని స్త్రీ లెంతవరకు చదువవలెనని నీ యభిప్రాయము ?"

"సుభద్రమ్మ — బాలికలు విద్యలలో పండితురాండ్రు కావలెనని నే నెప్పుడును జెప్పను. వారికి సంస్కృతములోను వేదాంతములోను పాండిత్య మక్కఱలేదు. ఇంటి లెక్కలు వ్రాయుటకు కొంచెము వ్యాకరణము వచ్చియుండవలెను. చదివిన పద్యమర్థము చేసికొనుటకు కొంచెము గణితశాస్త్రము తెలిసియుండవలెను. తప్పులు లేకుండ నుత్తరము వ్రాయఁగలుగుటకు కొంచెము

114. Ibidem.

తర్కము నేర్చుకోవలెను. స్త్రీల కింతవఱకు విద్యచాలును. నేను చెప్పినది సరిగా నున్నదా?" (కల్యాణ కల్పవల్లి. ప్రథమాంకము. రెండవరంగము.)

పంతులుగారి రచనలో వైలక్షణ్యము కలదుగాని, ఆంగ్ల మూలములోని సొగసులేదు. ఈ ఒకచోటునందే ఈ మాత్రమైన విలక్షణత సుభద్రమ్మ వాక్యములకు కల్పించిరి గాని, మిగిలిన స్థలములందు మామూలుగానే ఆమెచే మాటాడించిరి.

ఆంగ్లనాటకములో, పాశ్చాత్య పౌరాణిక నామములను పాత్రలు తమ సంభాషణలో గ్రహించిన ఘట్టములందు పంతులుగారు మన పురాణములలోని నామములను వాని స్థానమున గ్రహించిరి. అట్టిచో మూలములోని శబ్దానుసరణముగాక భావానుసరణము చేసిరి.

పురుషోత్తమదేవుఁడు (Sir Lucius O' Trigger) ను, దామోదరవర్మ (Acres) యును ద్వంద్వయుద్ధమునుగూర్చి ప్రసంగించు పట్టున మూలమందిట్లున్నది. ఇందు పాశ్చాత్యపౌరాణిక వీరులు పేర్కొనబడిరి.

ఇంగ్లీషు—" Sir Lucius— What the devil signifies right, when your honour is concerned? Do you think *Achilles*, or my little *Alexander the Great*, ever inquired where the right lay? No, by my soul, *they drew their broad-swords*, and *left the lazy sons of peace to settle the justice of it.*"

" Acres— Your words are a grenadier's march to my heart! I believe courage must be catching!" [115]

తెలుగు — "పురుషోత్తమదేవుడు - అవమానము సంభవించినప్పుడు న్యాయమెవరికి కావలెను? పూర్వము *హిరణ్యకశిపుఁడును రావణాసురుఁడును* విజయయాత్ర బయలుదేరినప్పుడు న్యాయ మాలోచించియే బయలుదేరినారా? లేదు లేదు. వారు మహాశూరులయి *యెదిరించినవారి తలలెల్ల కొబ్బరిపుచ్చెల లాగున ఖడ్గములతో నెగరవేసి న్యాయమునిమిత్తమయి మనసువచ్చినచోట మొట్టపెట్టుకొండని పిఱికిపందలను వదలి వేసినారు.*"

"దామోదరవర్మ — నీ శూరవాక్యములు ప్రతాపోద్దీపకములుగా నున్నవి."
(కల్యాణ కల్పవల్లి. తృతీయాంకము. నాల్గవరంగము.)

115. 'The Rivals' by R. B. Sheridan, Act. III; Scene IV

పాశ్చాత్యవీరుల నామములకు బదులుగా ప్రాచ్యపౌరాణిక పురుషుల నామములను గ్రహించి, పంతులుగారు మూలములోని పాత్రలయొక్క మనోభావమును తెలుగువారికి వ్యక్తము చేయుటకు ప్రయత్నించిరి. ఇట్టి ప్రయత్నము లెన్నియైనను, మూలములోని సొగసు—అందులో అది పాశ్చాత్య భాషలోనిది అయినప్పుడు— తెలుగులోనికి రాదని పంతులుగారికి తెలియక పోలేదు. ఈయనుసరణములు తెలుగువారి కంత రుచింపవని వారికి తెలియకకాదు. మరి ఈ యనువాదములు ననుసరణములు చేయుటకు ముఖ్య కారణముగా : "హూణకవుల పోక లొకయింత తెలుపంగఁ దెలుఁగువారి కొఱకు,"[116] నని పంతులుగారు వేరొకస్థలమందు నుడివిన మాటలే, యన్ని చోట్ల లందు ననువదించుకొనవలెను. వారికిగల ఈ దృష్టియే ; పందొమ్మిది. ఇరువది శతాబ్దుల సాహిత్యవాహినులనడుమ, వారి రచనను వారధిగచేసినది.

ఆంగ్లసాహిత్యవాసనా వాసితమైన సంస్కారముతో పంతులుగారు రచనలను చేసినను; సాధారణముగా వారు, ఇంగ్లీషు మాటలను యథాతథ ములుగ తమ రచనలలో జొనుపలేదు. కాని కొన్ని కొన్ని హాస్యరచనలలో ఆంగ్లశబ్దములను విచ్చలవిడిగా ప్రయోగించిరి.

'వినాయకచతుర్థి' అను హాస్యరచనలో వారు ఇంగ్లీషును విశేషముగా వాడిరి. ఉదాహరణకు క్రిందివాక్యములను గ్రహింపవచ్చును.

("దంభవ్రతుఁడు విఘ్నేశ్వరపూజ కారంభించుచుండగా, బిడాల వ్రతుఁడును బకవ్రతుఁడును ప్రవేశించుచున్నారు.")

"దంభ — ఓసి దీనిసిగ కొయ్యా! ఆ ర్యాట్ (Rat) మళ్ళీ వస్తూందిరా. ఓరీ బిడాలవ్రతా! నీవు సంస్కృత క్లాసు (Class) లో చదువుకొంటూ వున్నావుకదా! నీవు విఘ్నేశ్వరపూజ బ్రీఫు (Brief) గా చేయిస్తూ. లేకపోతే ర్యాట్ వచ్చి వుండ్రం ముక్క తన మౌత్తు (Mouth) లో వేసుకు పోతుంది. కర్ర తేరా ర్యాట్టును కొడదాము."

"బిడా—నాన్సెన్సు (Nonsense). మడికట్టుకొని ర్యాటూ, క్లాసూ, బ్రీఫూ, మౌత్తూ అని ఇంగ్లీషుమాట లనవచ్చునా?"

"దంభ—యింతాకా బకవ్రతుడు యెలుకంటే కోపపడ్డాడు. గనుక ర్యాట న్నాను. తెలుగుమాట అంటే మా అవ్వ అర్థం తెలిసి కోపపడుతుందేమో

116. 'పథికవిలాసము' (Goldsmith's The Traveller) నకు తుదిని పంతులుగారు చెప్పిన పద్యములోని భాగము.

అని బ్రీఫుగా అన్నాను. క్షమించి వేగిరం చేయిస్తూ, నీకు దక్షిణ యిస్తాను."

"ఒక—మినిట్టు (Minute) లో చేయిస్తాను. దక్షిణ టూ కావర్సు (Two Coppers) టూకావర్సూ ఇచ్చినావంటే యీరాత్రికి చుట్టలకు వేరే వెతుక్కోనక్కరలేదు. పూజచేయిస్తానుపట్టు."[117]

ఇట్టి హాస్యరచనలో ఇంగ్లీషు శబ్దములను విరివిగా ప్రయోగించినను ఇట్టి రచన పంతులుగారికి క్వాచిత్కముగాని సామాన్యముగాదు.

## పద్యకావ్యములు :

శ్రీ వీరేశలింగం పంతులుగారు, ఆంగ్లకవుల ననుసరించి రచించిన తెలుగు పద్య కావ్యములు కొన్ని కలవు. పాండిత్య ప్రకటనకై పంతులుగారు వివిధ నియమముల నుంచుకొని వ్రాసినపద్యకావ్యములు— శుద్ధాంధ్రనిరోష్ఠ్య నిర్వచన నైషధము, రసికజన మనోరంజనము (అచ్చ తెనుగు), శుద్ధాంధ్రోత్తర రామాయణము (1872), శుద్ధాంధ్ర భారత సంగ్రహము (1878) మొదలైనవి— ఎన్నియోగలవు. వానిపై ఆంగ్లసాహిత్య ప్రభావములేదు. లేకపోవుటయేగాక, అవి ఏ ప్రబంధకవియో వ్రాసినట్లుండును. ఆంగ్ల కావ్యముల ననుసరించివ్రాసిన ఆయన తెలుగు కావ్యము లట్లుగాక సులభశైలిలోనుండి, మూలకవుల మార్గములను తెలియజేయునవియై యుండును.

ఆంగ్ల కవుల కావ్యముల ననుసరించి వీరు రచించిన పద్య కావ్యములలో ముఖ్యమైనవి రెండు కలవు. 'విలియమ్ కౌపర్' (William Cowper ; 1731-1800.) అను నాంగ్లకవి రచించిన 'జాన్ గిల్పిన్' (The Diverting History of John Gilpin) అను కావ్యము ననుసరించి పంతులుగారు 'జాన్ గిల్పిన్' అను పేరనే తెలుగులో నొక పద్యకావ్యము వ్రాసిరి. ఇది ఆంగ్ల కావ్యము ననుసరించి చేసిన రచనలలో మొదటిది. ఆంగ్ల కవియైన 'ఆలివర్ గోల్డ్‌స్మిత్' (Oliver Goldsmith— 1728-1774) వ్రాసిన 'ట్రావెలర్' (The Traveller) అను పద్యకావ్యమునకు పంతులుగారు 'పథిక విలాసము' అను నామమున చేసిన అనువాదము రెండవది. ఈ కావ్యముల ననుసరించుటలో పంతులుగారు పోయిన పోకడలను గుర్తింపవలసి యున్నది.

---

117. వీరేశలింగకవి కృతగ్రంథములు. ఒకటవ సంపుటము. ప్రహసనములు. మూడవ కూర్పు. 1949 పుట - 705. వినాయచతుర్థి.

పంతులుగారు స్వీయ చరిత్రములో వ్రాసిన "రాజశేఖర చరిత్రమునకు ముందు కౌపరనెడి యింగ్లీషు కవీశ్వరుడు రచియించిన జాన్ గిల్పిననుపుస్తకమును...పద్యములతో చేసితిని"[118] అను వాక్యముల వలన నిది రాజశేఖర చరిత్రము (1878 లో నిది భాగములుగ ప్రచురింపబడి 1880 లో పుస్తక రూపమున ముద్రింపబడెను.) కంటె ముందే రచింపబడెనని తెలియుచున్నది. కాని దీని కంత పేరు రాలేదు. కనుకనే, పంతులుగారి యొక్క గ్రంథములలో ఆంగ్ల సాహిత్య ప్రభావము విశేషముగగల మొదటి గ్రంథము, 'రాజశేఖర చరిత్ర'మని గ్రహించుట అయినది.

'జాన్ గిల్పిన్' కధ హాస్యరస ప్రధానమైనది. గేయాత్మకమైన శైలి (Ballad Form) ననుసరించి కౌపర్ వ్రాసెను. ఈ కథ హాస్యరస ప్రధానముగ నుండవలెననియే, కౌపర్ తలంచినట్లాతని వాక్యములు తెలియజేయుచున్నవి.

"I little thought when I was writing the history of John Gilpin that he would appear in print. I intended to laugh, and to make two or three others laugh, of whom you were one. But now all the world laughs, at least if they have the same relish for a tale ridiculous in itself, and quaintly told, as we have."[119]

ఆంగ్లములో నిది మిక్కిలి సులభశైలిలో కౌపర్ వ్రాసెను. ఆతనికి సహజమైన శయ్యాలాలిత్యము ఈ కావ్యమున కలదు. 'జాన్‌గిల్పిన్' అనునాతడు తన భార్యతోను, కుటుంబముతోను— వివాహమైన ఇరువదియేండ్లకు— వివాహ వార్షికోత్సవము చేసికొనవలెనని భార్య పోరగా, ప్రక్క గ్రామమునకు బయలుదేరును. కుటుంబమంతయు గుఱ్ఱపుబండిలో బయలుదేరును. 'గిల్పిన్' తన మిత్రుని యొద్ద గుఱ్ఱము నొకదాని నెరువు తెచ్చుకొని దానిపై బయలుదేరును. ఆ గుఱ్ఱము గిల్పిన్ మాట వినక, ఆతని భార్య మొదలైనవారున్న గ్రామమును దాటి పరుగెత్తి, తన యజమానుడున్న గ్రామమును చేరును. అట మరల నదలింపబడి, నడుమ నెక్కడను నాగక, ఆతనిని మరల బయలుదేరిన ప్రాంతమునకే తెచ్చును. మార్గమధ్యమున ఈ స్వారిని చూచినవారందరు 'గిల్పిన్' పందెమువేసి, స్వారిచేయుచున్నాడని తలంతురు. భార్య భయపడి ఆతనిని రక్షింపుమని వెనుక నొక గుఱ్ఱముపై

118. స్వీయచరిత్రము : 1919 ; రెండవ భాగము ; పుట - 152.

119. Cowper's letter to Mr. Unwin; Dated 18th Nov. 1782. (From Cowper's Letters.)

నొకసిని పంపును. వా డాతనిని వెంటాడును. ఇది చూచిన ఆరుగురాశ్వికులు, 'గిల్పిన్' దొంగతనముచేసి పారిపోవుచుండగా ఆతని నెవరో వెంటాడుచున్నా రనుకొని, తామును 'గిల్పిన్' వెనుక గుఱ్ఱములపై పోవుదురు. ఉత్సవమందు త్రాగుటకై యాతడు రెండు సారాసీసాలను తెచ్చుకొనుచుండును. అవి ఈ 'పందెము' లో పగిలి దారియందు కాల్వలు కట్టును. దీనిలోని కథ ఇది.

ఆంగ్లములోని భాషా సౌలభ్యము, హాస్యరసమును వెల్లివిరియించు కథా సంవిధానము ; వీరేశలింగం పంతులుగారిని ఈ కావ్యమువైపు ఆకర్షించి యుండును.[120] పంతులుగారి కథాసంవిధానమును గాని, పేరులనుగాని మార్చక యథాతథముగ ననువదించిరనవచ్చును. ఇంచుమించుగా నిది ఆంగ్లములో నుండి తెలుగులోనికి పద్యకావ్యమును తెచ్చుటలో పంతులుగారి ప్రథమ ప్రయత్నము వంటిది గనుక, అచటనచట మూలభావము రాకుండుటయు, వచ్చినను సొగసుగా లేకుండుటయు, కొన్ని పట్టులందు మూలము నపార్థము చేసికొనుటయు కలదు. ఈ విషయ పరిశీలనము నిట కొంత చేయుచున్నాను.

మూల రచన పాశ్చాత్య సంప్రదాయానుసారము జరిగినది గనుక దాని యనువాదములో మన సంప్రదాయమునకు విరుద్ధమైన భావములు రాక తప్పలేదు. సంతోష సమయమున గూడ 'గిల్పిన్' భార్య పొదుపుగా సంసారమును నడపునది గనుక ఉత్సవమునాడు వేరుగా ద్రాక్షాసవము కొనవలదనియు, గృహమందు కలదానినే ఉపయోగింతమనియు మగనికి చెప్పును. దానికి సంతోషించి 'గిల్పిన్', భార్యను ముద్దుపెట్టుకొనునని మూలమున నిట్లు కలదు :

> "John Gilpin *Kissed his loving wife*;
> O'erjoyed was he to find,
> That though on pleasure she was bent,
> She had a frugal mind."

మూలములోని సౌలభ్యమును తెచ్చుటకై పంతులుగారు తేటగీతిలో అనువాదముచేసిరి. ఈ పద్యమున కనువాదమిట్లున్నది.

---

120. "కౌపరని యెడి యింగ్లీషు కవి వరుండు
హాస్యకృతిగాఁగ మును చేసినట్టి దీనిఁ
దేటగీతలతోడను దెనుఁగు నందుఁ
గందుకూరి వీరేశలింగము రచించె.
('జాన్ గిల్పిన్' - ఆంధ్రానువాదములోని తుది పద్యము.)

"దాని కపరిమితానందమూని, యాతఁ
డట్టి సంతోష సమయంబునందుఁ గూడఁ
బ్రియ వధూమణి తా మితవ్యయమునందె
పెద్ద తవిలియుంటకు ముద్దు పెట్టుకొనియె."[121]

ఉన్నదున్నట్లు తెలుగులోని కిట్టిది యనువదింపబడుట వలన తెలుగువారి చెవుల కిది వింతగా తోపకమానదు.

ఈ కథలో వచ్చిన ఆంగ్లనామము లన్నింటిని ఇంచుమించుగ తెలుగులో నుపయోగించిన పంతులుగారు, కొన్నిచోట్ల స్వతంత్రించి, ఆ పేరులను విడిచి వేసిరి. ఇందులకు కారణ మంతగా కన్పట్టదు, కొన్ని ఉదాహరణల నిచ్చుచున్నాను.

ఆంగ్ల మూలము— "Smack went the whip, round went the wheels,
Were never folk so glad,
The stones did rattle underneath,
As if *Cheapside*[122] were mad."

ఆంధ్రానువాదము—

"చబుకు కదలెను; జక్రముల్ సరగఁ దిరిగె
బండిలోనివా రానంద భరితులయిరి;
కలగల మటంచు దిగువను శిలలు మొరసె,
నడుగు తట్టునకును వెట్టి తొడరినట్లు."[123]

ఆంగ్ల మూలము— "When *Betty* screaming came down stairs,
The wine is left behind!"

ఆంధ్రానువాదము—

"ద్రాక్ష సారాయి మఱచిరో తరలిరంచు
నరచుచును మేడ దిగివచ్చె నబల యొర్తు"[124]

---

121. వీరేశలింగకవికృత గ్రంథములు - నాలుగవ సంపుటము. 1950 పుట - 824. పద్యము - 8.

122. "Cheapside. A street in the city of London. In old times it was a market-place, and contained a cross, pulled down by the puritans in 1645." (Cowper's Shorter Poems edited by W.T. Webb, M. A. London, 1896;page—90).

123. వీరేశలింగకవికృతగ్రంథములు - నాలుగవ సంపుటము. 1950. పుట - 824. పద్యము - 11.

124. Ibidem. పుట - 825. పద్యము - 15.

ఇచ్చుట, 'బెట్టీ' (Betty) అనునది 'ఎలిజబెత్' (Elizabeth) అనుదానికి హ్రస్వ రూపము. ఇట నిదియొక పరిచారికపేరు. [125]

పంతులుగారి యనువాదములో మూలములోని భావమును వారు చక్కగా తేలేదని తెలియజేయు భాగములు కొన్ని గలవు. కొన్ని పట్టులందు మూలభావమునకు విరుద్ధముగ అనువాదమున్నది.

గుఱ్ఱము తాను చెప్పినట్లు వినక, దానికి తోచినట్లు పరుగెత్తుచుండగా, గిల్పిన్ చేయునదేమియులేక గుఱ్ఱము నిట్లదలించెనని ఆంగ్లమూలమున గలదు.

"So, "*Fair and softly*", *John he cried*,
But *John he cried* in vain;
That trot became a gallop soon,
In spite of curb and rein."

ఈ పద్యమును వీరేశలింగముపంతులుగా రిట్లనువదించిరి :

"అందుచే *జానటంచును నఱచె నతఁడు*
స్పష్టము*గ* మెల్ల నది యెల్ల వ్యర్థమయ్యె
పగ్గమును గళ్ళెమును గల్గి పనికిరాక
యల్ల దాఁటుతె వడిఁ బరుగయ్యెఁ గాన" [126]

ఈ యనువాదములో పంతులుగారు మూలార్థము ననుసరింపలేదని తెలియుచునేయున్నది. మూలములో "Fair and softly" అనునది గుఱ్ఱము నుద్దేశించి 'గిల్పిన్' అన్న మాటలు. 'జాన్' అరచెను గాని, "జానటంచును" నరవలేదు. ఇప్పుడు "స్పష్టముగ మెల్లన్" అను మాటలకు దేనితో నన్వయము! ఈ సందర్భమున నాంగ్ల వ్యాఖ్యాన మిట్లున్నది ·

"Fair and softly." *Addressed to his horse* to induce him to go at a gentler pace."

"John he cried. In ballad style for "John cried." For this *reduplication of the subject*, cf. Shakespeare, I Henry, the Fourth III, II. 60 : The skipping king he ambled up and down."[127]

---

125. "Betty a short form of Elizabeth; here the servent-maid's name." (Cowper's Shorter Poems edited by W. T. Webb, London, 1896. page-90)

126. వీరేశలింగకవికృత గ్రంథములు. నాలుగవ సంపుటము. 1950. పుట - 826, పద్యము - 22

127. Cowper's Shorter Poems Edited by W. T. Webb, M. A. London, 1896. Page — 90.

ఇటులనే పంతులుగారు ఈ క్రింది పద్యము ననువదించునపుడును మూల భావము ననుసరింపలేదు. 'గిల్పిన్' గుఱ్ఱము మీద స్వారిచేయుచుండగా నాతని నడుమున కిటునటు కట్టియున్న సారాసీసాలు పగిలి, సారాయి గుఱ్ఱము దేహముమీదుగా క్రిందకు కారెను. గుఱ్ఱము ప్రక్కల కీ యాసవము కారిన వెంటనే, ప్రక్కల నుండి పొగ లెగసెను. ఇక, మూలమును, అనువాదములో పోల్చిచూతము.

ఆంగ్లము :

> "Down ran the wine into the road,
> Most piteous to be seen,
> Which made *his horse's flanks to smoke*
> *As they had basted been.*"

తెలుగు :

> "కాంచుటకు నెంతయును జాలిగదురునట్లు,
> తెరువునిండను సారాయి దిగువఁగాఱె;
> *మున్ను కఱ్ఱతోఁ గడుఁ గొట్టియున్న కతన,*
> *హయము ప్రక్కలఁ బొగ లేచె నందుచేత.*"[128]

ఇట 'As they had basted been' అను పాదమును పంతులుగారు 'మున్ను కఱ్ఱతోఁ గడుఁగొట్టియున్న కతన' అని అనువాదము చేసిరి. ఈ సందర్భమున నాంగ్లవ్యాఖ్యానములో నిట్లున్నది.

"As they had etc., as though they had been basted. To baste is to drop fat over meat while it is being roasted."[129]

'Baste' అను ఆంగ్లశబ్దమునకు పైని ఇచ్చిన అర్థమున్ను, కొట్టుటయను అర్థమును రెండును కలవు. తెలుగులో, ఒకే అర్థముగల శబ్దమును ప్రయోగించుటవలన, మూలములోని సొగసు రాలేదు. ఇంగ్లీషుమాట యొక్క అర్థము, 'పొగలేచెను' అనుదానికి చక్కని ఉపపత్తి చూపును.

ఆంగ్ల సంప్రదాయము ననుసరించి, 'కౌపర్' కాలమునాటివారు, సహజమైన కేశసౌభాగ్యముతో తృప్తినొందక, పురుషులు 'విగ్గు' (Wig) లను, కృత్రిమ కేశపాశమును ధరించువారు. 'గిల్పిన్' కూడ నట్లే ధరించినట్లు కౌపర్ వర్ణించెను. ఈ శబ్దమును పంతులుగారు—కృతకశిఖ, కల్లజుట్టు, మాయ

128. వీరేశలింగ కవి కృత గ్రంథములు. నాలుగవ సంపుటము. 1950. పుట - 828. పద్యము - 32.

129. Cowper's Shorter Poems edited by W. T. Webb, M. A, London, 1896, page — 91.

జుట్టు అను శబ్దములతో వ్యవహరించిరి. ఇట్టి జుట్టును ధరించుట పాశ్చాత్యులలో నాటి సంప్రదాయమని తెలియని తెలుగువారికి—"పోయె జుట్టును టోపి బోడితలగ;" "ఆ కృతక శిఖ, కుళ్లాయినన్నుఁ జేరు," "కల్లిజుట్టు టోపియుఁ గొంచునల్లవచ్చె;" "పోయె మాయజుట్టుఁ బెనుకుళ్లాయి మిగుల;"అను పాదముల యర్థమే బోధపడదు. మూలములో, "My hat and *wig* will soon be here;" "Away went hat and *wig*;" "whence straight he came with hat and *wig*;" "went Gilpin's hat and *wig* ;" అను పాదముల కున్నంత అర్థబోధక శక్తి—సంప్రదాయ వైరుధ్యమువలన — తెలుగు పాదములకు లేదుగదా !

పంతులుగారు సులభభాషలో దీనిని వ్రాసి, ఆంగ్ల సాహిత్యమందలి పద్యకృతిని తెలుగులోనికి తెచ్చుటకు దారిచూపిరి. కాని వీరియనువాదమునందు మూలములోని భాషాసౌలభ్యము వచ్చినను, భావగాంభీర్యమంతగా వచ్చినట్లు లేదు. ఇందుల కిది ప్రథమ ప్రయత్నమగుట కారణముకావచ్చును.

ఆంగ్లములోనుండి పంతులుగారు తెలుగులోనికి తెచ్చిన రెండవ పద్యకావ్యము 'ఆలివర్ గోల్డ్‌స్మిత్' వ్రాసిన 'ట్రావెలర్' అనునది. దీనిని వీరు 'పథికవిలాసము' అను పేరున ఆంధ్రీకరించిరి. దీనినిగూర్చి వారు తమ 'స్వీయ చరిత్రము' నం దిట్లు వ్రాసిరి.

"1892-వ సంవత్సరమునం దింగ్లీషులో గోల్డుస్మిత్తను కవీశ్వరుఁడు రచించిన "మార్గస్థుడు"అను పద్యకావ్యమును పథికవిలాసమను నామముతోఁ బద్యరూపమునఁ దెనిఁగించితిని."[130]

'పథికవిలాసము'కూడ అనువాద విషయమున 'జాన్‌గిల్పిన్' కావ్యమునే పోలియున్నది. కాని దీనికిని దానికి నొక్క భేదము. 'జాన్‌గిల్పిన్' రచనయందు తేటగీతులనే పంతులుగారు వాడిరి. 'పథికవిలాసము'న వివిధ పద్యభేదములను పంతులుగా రుపయోగించిరి. 'గోల్డ్‌స్మిత్' మహాకవి, 'ట్రావెలర్' కావ్యమున 'హీరోయిక్ కప్లెట్' (Heroic Couplet)అను ద్విపదనుబోలిన దానిని వాడెను. పంతులుగారు తమ రచనలో వృత్తములను జాతులను వాడిరి. ఈ విధముగ, నిది మూలములోవలె ఒకేఛందమున వ్రాయబడినదికాదు.

గోల్డ్‌స్మిత్, 1755 ఫిబ్రవరి మొదలు 1756 ఫిబ్రవరి వరకు యూరపులో చేసిన సంచారములో 'ట్రావెలర్' అను పద్యకావ్యమును వ్రాయవలెనని సంకల్పించెను. ఇది 1765 లో గ్రంథరూపమున వెలువడినది. ఈ కావ్యము 'గోల్డ్‌స్మిత్' అన్నగారికి (Rev. Henry Goldsmith) అంకితమీయబడినది.

130. స్వీయచరిత్రము. రెండవభాగము, 1915. పుట - ౨౨౨.

ఈ కావ్యమును వ్రాయుటలో తనకుగల యుద్దేశమును, 'గోల్డ్‌స్మిత్' తానే ఇట్లు తన అన్నగారికి అంకితమిచ్చుచు వ్రాసిన 'లేఖ'లో వ్రాసెను.

"What reception a poem may find, which has neither abuse, party, nor blank verse to support it, I cannot tell, nor am I solicitous to know. My aims are right. Without espousing the cause of any party, I have attempted to moderate the rage of all. I have endeavoured to show, that there may be equal happiness in states, that are differently governed from our own; that every state has a particular principle of happiness, and that this principle in each may be carried to a mischievous excess."

('The Traveller or A Prospet of Society'; Dedication.)

ఈ పద్యకావ్యములో కథకుగాని, వ్రాసిన విధానమునకుగాని ఎక్కువ ప్రాముఖ్యము లేదు. ఒక సామాన్యవ్యక్తి, ప్రపంచమును మమతావిరహితముగ చూచినప్పుడు కన్పట్టు సత్యమే ఇందు ప్రదర్శితమైనది. మానవునకు సుఖదుఃఖముల నిచ్చునది ఆతని మనస్సే — చాలవరకు — అని నిర్ణయింపబడినది. ఈ కావ్యమునుగూర్చి మెకాలే (Macaulay) చక్కగా నిట్లు వ్రాసెను.

"In the Traveller the execution, though deserving of much praise, is far inferior to the design. No philosophical poem, ancient or modern, has a plan so noble, and at the same time so simple. An English wanderer, seated on a crag among the Alps, near the point where three great countries meet, looks down on the boundless prospect, reviews his long pilgrimage, recalls the varieties of scenery, of climate, of Government, of religion, of national character, which he has observed, and comes to the conclusion, just or unjust, that our happiness depends little on political institutions, and much on the temper and regulation of our own minds."[131]

సంఘ సంస్కరణాభిలాషులును, నైతికజీవితమును ప్రజలలో పెంపొందింప జేయవలెనను పట్టుదల కలవారును అగు వీరేశలింగం గారిపై, ఈ కావ్యము తన ప్రభావమునుజూపి, తెలుగులో దీనిని వారు వ్రాయునట్లుచేసినది. ఇది 1892 లో రచింపబడినదని పంతులుగారు వ్రాసిన వాక్యములనుబట్టి (స్వీయచరిత్రము) తెలియుచున్నది. అప్పటికప్పుడే వీరేశలింగంగారు మంచి పేరు ప్రఖ్యాతులను పొందిరి. జీవితములో వివిధమార్గములలో పయనించి కష్టసుఖములను రుచిచూచిన పంతులుగారు, ఆంగ్లసాహిత్యములోనుండి 'ట్రావెలర్'

131. Encyclopaedia Britannica; 'Goldsmith' By Macaulay. February, 1856.

అను పద్యకావ్యము ననువాదమునకు నెన్నుకొనుటలో ఆశ్చర్యములేదు. జీవికి సుఖమన్నది, తన మనస్సునందును, తాను నమ్మిన కార్యమును లోకమునకు వెరవక చేయుట యందును కలదని, ఆయన అప్పటికే గ్రహించెను. గోల్డ్‌స్మిత్ కూడ ఈ సత్యమునే తనకావ్యమున వ్యక్తము చేసెను. ఇందులకే పంతులుగారు దీనిని గ్రహించిరి.

ఈకావ్యమును వ్రాయుటలో తమకుగల యుద్దేశమును పంతులుగారే 'పథికవిలాసము' చివర నిట్లు వ్రాసిరి.

"హూణకవుల పోక లోకయింత తెలుపంగఁ
దెలుఁగువారికొఱకుఁ దేటగాను
'గోల్డుస్మిత్తు'ను కవిగూర్చిన యట్టి యీ
పథికచరిత మేను వ్రాసినాఁడ."

(పథికవిలాసము; పద్యము—117)

ఆంగ్ల కావ్యములోని కొన్నిపాదములను ఒకభాగముగ గ్రహించి, పంతులుగారు, ఆ భాగములోని భావమును పూర్ణముగ వ్యక్తము చేయజాలిన వృత్తమునుగాని, జాతులకుచెందిన పద్యమునుగాని గ్రహించి రచనను సాగించిరి. పద్యము యొక్క ఎన్నిక, మూలములోని భావవిస్తీర్ణతపై నాధారపడియుండు నట్లు పంతులుగారు రచించిరి. కనుకనే వీరు కందపద్యము మొదలు సీసము వరకుగల పద్యభేదములను గ్రహించి రచనలు సాగించిరి. కాని కొన్నిచోట్లు లందు మూలభావము చాల ఎక్కువగానున్నప్పుడు రెండు మూడు పద్యములు వ్రాయుటయు కలదు. 'ఆల్ప్స' (Alps) శిఖరమున కూర్చుండి యూరపు నంతను సింహావలోకనము చేయుచున్న సందర్భమున ఆంగ్లకవి ఇట్లు వ్రాసెను.

"E'en now, where Alpine solitudes ascend,
I sit me down a pensive hour to spend;
And, plac'd on high above the storm's career,
Look downward where a hundred realms appear;
Lakes, forests, cities, plains, extending wide,
The pomp of kings, the shepherd's humbler pride."[132]

ఈ పద్యములను పంతులుగారిట్లు రెండు పద్యములలో ననువదించిరి.

"ఇప్పుడు సైతి 'మాల్ప్స' శిఖరీంద్ర వివిక్తపదంబుఁజేరి, యొ
క్కప్పుడు గాలివానలకు నందని యున్నతమైన చోట నే

132. The Traveller — Lines 31 to 36.

చొప్పుగఁ గూరుచుండి, వగపొందుచుఁ గాలము నెట్లొ నెట్టుచున్
దప్పక చూచెదన్ దిగువతట్టున నూర్లకొలంది దేశముల్."

"సరసులుఁ గాంతారంబులుఁ
బురములును బయళ్లు దిశలఁ బొలయుచు దృగ్గో
చరమగు నివె భూపాలుర
సురువై భవమల్పతరపు గోపుని స్థితియున్."

(పథికవిలాసము - పద్యములు - 8,9.)

పాశ్చాత్య దేశములకుగాని, పాశ్చాత్య పౌరాణిక గాథలకుగాని ప్రసక్తి లేని పద్యభాగములు తెలుగులోనికి పంతులుగారు చక్కగా ననువదించిరి. అట్టి ప్రసక్తిగల పద్యభాగములను యథాతథముగ ననువాదము చేయుటవలన, ఆ భాగములు మాత్రము, తెలుగులో మిగిలిన పద్యభాగములనడుమ అతుకక, విలక్షణముగ నున్నవి. రెండు భిన్నసంస్కృతులుగల సాహిత్యములలో అనువాదముల కిట్టివైలక్షిణ్యము తప్పదుగదా! సార్వజనీనమైన భావములుగల పద్యభాగము లెట్లనువదింపబడెనో ఈ క్రింది యుదాహరణమువలన తెల్లమగును.

"As some lone miser visiting his store,
Bends at his treasure, counts, re-counts its o'er;
Hoards after hoards his rising raptures fill,
Yet still he sighs, for hoards are wanting still"[133]

దీనికి పంతులుగారి యనువాద మియ్యది.

"ఘనలోభాత్మకుఁ డొంటిగాఁ దనధనాగారంబు దర్శించి, యో
లిని గూర్చుండి ధనంబుఁ బల్మఱును దా లెక్కించి లెక్కించి, యా
ధనముల్ కుప్పలు కుప్పలై కడుఁబ్రమోదంబియ్య, నుప్పొంగు; నా
వెనుకన్ గన్గొని వెచ్చనూర్చు మఱియున్ విత్తంబు లేకున్కికిన్."

(పథికవిలాసము - పద్యము —13.)

ఆంగ్లసాహిత్యములోని కవిసమయములను తెలుగులోనికి చక్కగా తెచ్చి, తెనుగువారికి వాని సౌందర్యమును కొన్ని స్థలములందు పంతులుగారు చూపిరి. ఈ రచన నవ్యకవిత్వోద్యమమునకు నాందివలె నున్నది.

ఆంగ్లము — "While sea-born *gales their gelid wings expand*
To winnow fragrance round the smiling land"[134]

తెలుగు—"కలకలను నవ్వు నీ భూమికాంతమీఁద

---

133. The Traveller — Lines 51 to 54.
134. The Traveller — Lines 121 to 122.

వింతవలపులు కలయంగ విసరు కొలకు
నబ్బెఁ బొడము *గంధవహవిహంగమములు*
చల్లనగు తమఱెక్కలఁ జాచు నెపుడు."

(పథికవిలాసము - పద్యము - 32.)

ఇట, ఆంగ్లములోని 'fragrance' అను శబ్దమును 'వలపులు' అని యనువాదముచేసి, పంతులుగారు మూలమునకు వన్నెపెట్టినారు. (వలపు - సువాసన, ప్రేమ.) 'గోల్డ్‌స్మిత్' కవి 'రొమాంటిక్' కవి కాకున్నను, ఆ ఛాయలను చూపినవాడే. పంతులుగారును, తమ తరువాత రాబోవు భావకవిత్వ మహోద్యమమునకు (**Romantic Movement in Telugu Literature**) దారి చూపుచున్నారా యనునట్లు; క్రొత్త కవి సమయములు, భావములు, ఆశయములుగల ఆంగ్లకావ్యము నాంధ్రీకరించిరి. ఈ క్రిందివానిని చూడుడు.

ఆంగ్లము— " Fir'd at the sound, *my genius spreads her wing*,
And flies where Britain courts the Western spring ;
Where lawns extend that scorn Arcadian pride,
And brighter streams than fam'd Hydaspes glide." [135]

తెలుగు—

"ఇట నాబుద్ధి 'బ్రిటానియా' యనినతోనే *పక్షముల్* విప్పి యె
క్కటఁ బర్వెత్తు, నెటన్ 'బ్రిటన్' పడమటంగామించుఁ బుష్పర్తు, వె
చ్చటఁ 'నార్కేడియ శోభ మించు మఁ దృణస్థానంబులేపారు' నె
చ్చటఁ బాఱున్ నదులందమై యల 'హిడాస్పస్' కంటె, నచ్చోటికిన్."

(పథికవిలాసము - పద్యము - 86)

"గంధవహ విహంగమములు" "నాబుద్ధి.....పక్షముల్ విప్పి" మొదలైన కవి సమయములు తెలుగు సాహిత్యమునకు క్రొత్తలు. భావి భావ కవిత్వోద్యమ సూచకములు. ఇవిగాక, భావకవిత్వోద్యమములో ప్రథమస్థానము నాక్రమించిన 'స్వాతంత్ర్య పిపాస'ను గూర్చిన పద్యభాగములును 'పథికవిలాసము'లో చాల గలవు. కవితలో 'స్వేచ్ఛ' యను భావమును, కవితావస్తువుగా పాశ్చాత్యులు బాగుగా స్వీకరించిరి. ఆభావమును, ఇందు చాలసారులు వ్యక్తమయినది.

---

**135. The Traveller — Lines 317 to 320.**

ఆంగ్లము— " While e'en the peasant boasts these rights to scan,
And learns to venerate himself as man. " [136]

తెలుగు— తన స్వాతంత్ర్యంబులనట
ఘనతఁ బరీక్షింప బీదకాపును గడగున్
మనుజుండయి పుట్టుటచేఁ
దన కర్హంబైన మాన్యతను గన నేర్చున్."

(పథికవిలాసము - పద్యము - 90)

ఈ భావములన్నియు క్రమక్రమముగ ఆంగ్ల సాహిత్య ప్రభావము వలన ఆంధ్ర సాహిత్యమందు ప్రతిబింబింప, ఆ సాహిత్య స్వరూపమేమారి 'అభినవ కవిత' పుట్టినది. కొందరు మాత్రమే స్వాతంత్ర్యము ననుభవించుచుండ నితరులు బానిసలుగ నుండుట పొసగదను విషయ మెంత చక్కగా చెప్పబడినదో క్రింది పద్యపాదములను పరిశీలించిన తెలియగలదు.

ఆంగ్లము— "O then how blind to all that truth requires,
Who think it freedom when a part aspires !" [137]

తెలుగు— "మించు కొందరు మాత్రమె కాంచునపుడు
దాని స్వాతంత్ర్యమంచును దలఁచువారు
సత్య మర్థించు దానికి సర్వమునకు
నుర్వి నెంత యంధులు గాఁగ నున్నవారు."

(పథికవిలాసము - పద్యము - 102)

ఇటులనే, కవి 'ఆత్మీయతాముద్ర'కు నిదర్శనములనదగిన పద్యభాగములు ఇందు కలవు. తెలుగు కవిత్వములో 'ఆత్మాశ్రయకవిత్వము' (Subjective Poetry) తక్కువ. ఆంగ్ల కవిత్వములోకూడ నద్దానికి 'రొమాంటిక్' కవుల కాలములోనే విశేష వ్యాప్తి. 'గోల్డ్ స్మిత్' ముందు రాబోవు కాలమును సూచించు నట్లుగా తన కవిత్వములో కొంత దీనికి తావిచ్చెను. పంతులుగా రట్టి పద్య కావ్యము ననువదించి, తమ తరువాత విశేష వ్యాప్తిలోనికి రానున్న ఆత్మాశ్రయకవిత్వపథమునకు, అప్రయత్నముగ దారిచూపిరి. ఈ పద్యపాదము

136. The Traveller — Lines 33 to 34.
137. The Traveller — Lines 377 to 378.

లెటుల ఆత్మాశ్రయకవిత్వమునకు చక్కని ఉదాహరణములో విశేష పరిశీలన మక్కరలేకుండగనే తెలియునుగదా !

ఆంగ్లము— "And thou, fair Freedom, taught alike to feel
The rabble's rage, and tyrant's angry steel;
Thou transitory flower, alike undone
By proud contempt, or favour's fostering sun,
Still may thy blooms the changeful clime endure,
I only would repress them to secure:"[138]

తెలుగు—

"ఉరుశోభ నలరారు నో స్వతంత్రత్వమా !
యల్లరి మూఁకల యాగ్రహమునఁ,
గ్రూర మహీపాల కుపితాసి నొక్కట
బాధలుపడ నలవడితి వీవు;
గర్వ సంయుత తిరస్కారంబుచే నొందె,
జెలిమిఁబెంచు కృపార్కుచేత నొందె,
సమరీతిఁ జేటొందు క్షణభంగురంబైన
యలరుఁబోలెడు దానవైన నీవు,
సతతమును మాఱుచుండు దేశంబునందు
నీ వికాసముల్ స్థిరముగా నిలుచుఁగాత;
వానిని సురక్షితముగఁ గాపాడుకొఱకె
యొకటనేను నిరోధించు చున్నవాఁడ."

(పథికవిలాసము-పద్యము-99)

ఈ పద్యమువలన ఆంగ్లేయులకు స్వాతంత్ర్యమన్న నెంతప్రీతియో, వా రెంత శ్రమపడి దానిని సంపాదించిరో మనకవగతమగును. ఇట్టి భావములు గల ఆంగ్లసాహిత్యమును, బానిసలుగనున్న మనవారు చదివి—మనము స్వతంత్రముగ నున్నప్పుడు వారితో సంపర్కము కలిగియున్న, వారి సాహిత్య ప్రభావము మనపై నింకొకవిధముగ నుండియుండవచ్చును—ఈ స్వేచ్ఛావాయువులను 'తెనుగుతోట'లోనికి తెచ్చిరి.

---

138. The Traveller — Lines 365 to 370.

ఈ 'పథికవిలాసము' వలన పంతులుగారికెక్కువ ధనలాభము కలిగినట్లు లేదను[139] దానినిబట్టి దీనికి నాడెక్కువ ప్రచారము లేనట్లు తెలియుచున్నది. కాని, దీనికి ఆంధ్రసాహిత్య పరిణామదశలో నొక విశిష్టస్థానము కలదనిమాత్రము నిస్సంశయముగ చెప్పవచ్చును.

పంతులుగారు; తన తరువాతి తరమువారికి అన్ని సాహిత్యశాఖలలోను మార్గదర్శకులుగాని, పద్య కవిత్వములో మాత్రము కారని నమ్మువారు 'జాన్ గిల్పిన్', 'పథికవిలాసము'లను జాగరూకతతో పరిశీలించి చూడవలసియున్నది.

## పత్రికా నిర్వహణము :

సామాన్యవిజ్ఞానమును, సాహిత్యసంస్కృతులను ప్రజలలో వ్యాప్తికి దెచ్చి సంఘము నావరించియున్న అజ్ఞానాంధకారమును పారద్రోలవలెనని బద్ధకంకణులైన పంతులుగారు; తమ ఆశయసిద్ధికి పత్రికలుకూడ చక్కని సాధనములని గుర్తించినవారగుటచే, పత్రికానిర్వహణమునకు పూనుకొనిరి. నాడు, పండితులైన వారందరు—ఎప్పుడో ఒకప్పుడు—పత్రికలను నిర్వహించినవారే. పత్రికా ప్రచురణమునకును ముద్రణమునకును అవినాభావ సంబంధముండుటచే; మనదేశమున ముద్రణాభివృద్ధి జరుగుచువచ్చిన పందొమ్మిదవ శతాబ్ది ఉత్తరార్ధముననే, పత్రికలు విశేషముగ వ్యాప్తికి వచ్చెను.

పంతులుగారు సొంతముగా నిర్వహించిన పత్రికలలో 'వివేకవర్ధని' విశిష్టమైనది. ఇది, 1874 డిసెంబరులో ప్రారంభమైనది. ఈ పత్రికనుగూర్చి వారు, "కొందఱితోడఁ దేటమాటలతోను, మఱి కొందఱితోడం బ్రౌఢోక్తుల తోడను, గొందఱితో వినోదంబులతోడను, గొందఱితో శాస్త్రప్రసంగంబుల తోడను, గొందఱితో భగవద్విషయంబులతోడను, గొందఱితోఁ గవిత్వగోష్ఠి

139. "1892-వ సంవత్సరమునం దింగ్లీషులో గోల్డుస్మిత్తను కవీశ్వరుఁడు రచించిన "మార్గస్థుఁడు" అను పద్యకావ్యమును పథికవిలాసమను నామముతోఁ బద్యరూపమునఁ దెనిఁగించితిని. ఆచారవ్యవహారములును పేరులును దేశములును మనవారికి వింతగాఁ గనఁబడునుగాన కేవల మూలార్థానుసారముగా భాషాంతరీకరింపఁబడిన పాశ్చాత్య గ్రంథములు మనవారి కంతగా రుచింపకపోవచ్చును. భాషాంతరము సుగమముగాను మనోహరముగాను నున్నదని ప్రకటింపఁబడిన కాలమునందు మహామహోపాధ్యాయ కొక్కొండ వేంకటరత్నము పంతులువారు మొదలయినవారు శ్లాఘించిరిగాని దానిని గొని చదువు మహాజనుల సంఖ్యనుబట్టి మనవా రంతగా నాదరించిరని నేను భావింపను."

(స్వీయచరిత్రము. రెండవభాగము. 1915. పుట - ౨౨౨.)

తోడను ప్రోద్దుపుచ్చుచు నెల్లర యుల్లంబుల రంజిల్లఁజేయుచుండు" నని వ్రాసిరి. దీనినిబట్టి, ఈ పత్రిక యొక్క 'ఆశయవిస్తృతి' తెలియగలదు. పంతులు గారిచే జన సామాన్యమున కర్థమగు సులభభాషలో రచనలు చేయించి నదియు, వ్యాసరచనను ప్రోత్సహించినదియు, ఈ పత్రికయే.

ఆంగ్ల దేశములో కూడ పత్రికలే సార్వజనీనమైన సులభభాషను ప్రచారము లోనికి దెచ్చెను. పంతులుగారును అట్లే సులభమైన గ్రాంథికాంధ్రమును ప్రచారమునకు దెచ్చిరి. నాటివరకు, ఇంచుమించుగ, మంచి రచయితలందరును సమాసబంధురమైన ప్రౌఢరచనలను చేయుటయందే ఎక్కువ మక్కువ చూపుచు వచ్చిరి. పంతులుగారు మొట్టమొదటిలో నట్టి పక్షపాతమును జూపినను క్రమక్రమముగ మారి, తమ తరువాతి తరమువారికి ఆదర్శము కాగల సులభ శైలిని ప్రచారములోనికి దెచ్చిరి. వీరు తెలుగు సాహిత్యమునకు చేసిన సేవలు రెండింటిలో—ఆంగ్ల సాహిత్యములోని ప్రక్రియల నన్నింటిని, ఇంచుమించుగ, తెలుగులోనికి తెచ్చుట మొదటిది— లక్షణ యుక్తమైన చక్కని తేటతెలుగును వచన రచనల మూలమున ప్రచారమునకు తెచ్చుట యను రెండవది, మిక్కిలి గణనీయమైనది. ఈ కృషికి దోహదము చేసినది వారి పత్రికా ప్రచురణము.

శ్రీ వివేకవర్ధని ప్రారంభ సంచికయందు వీరు ప్రకటించిన ఈ క్రింది పద్యము వారిని గూర్చియు, వారి ఆశయములను గూర్చియు తెలుపును.

"బ్రాహ్మణుండను హూణభాష నేరిచి యందు
నేఁ బ్రవేశపరీక్ష నిచ్చినాఁడ
నాంధ్రమున నొకింత యభిరుచి గలవాఁడ
దేశాభివృద్ధికై లేశమైన
బాలుమాలక పాటుపడ నిచ్ఛ గలవాఁడఁ
గవితాపటిమ కొంత గలుగువాఁడ
నోపిక సర్వజనోపయోగములైన
విషయమ్ములును నీతివిషయములును
సులభశైలి నందఱకును దెలియునట్టు
కఠిన సంధులు లోనుగాఁ గలవి విడిచి
వ్రాయుదు నొకప్పు డన్యదేశీయములును
లోనుగాఁగల వానినిఁ బూని కూర్తు."[140]

140. వివేకవర్ధని; డిసెంబరు, 1874.

ఈ పద్యమును బట్టి పంతులుగారు సులభశైలి నెంత అభిమానించిరో తెలియగలదు. కనుకనే వీరు, "ముందు వ్రాసెడు పుస్తకములను విగ్రహాము[141] వలెఁగాక సుగమములుగా నుండునట్లు వ్రాయ నిశ్చయించుకొంటి" నట్లు తమ స్వీయ చరిత్రలో వ్రాసిరి. ఈ నిర్ణయము, తెలుగు వచన రచనకు స్వర్ణ యుగమును ప్రసాదించెను. పంతులుగారు తెలుగులో సులభశైలికి రూపురేఖలు దిద్ది, తెలుగు రచయితలకు క్రొత్తబాట చూపిరి.[142]

---

141. శైలివిషయమున నాటి తెలుగు రచనలు ఎట్లుండెడివో, వీరేశలింగంపంతులు గారు, తమ రచనలచే ఈ రంగమున తెచ్చిన విప్లవ మెట్టిదో తెలిసికొనగోరువారికి; 'రాజ శేఖర చరిత్ర'నుగూర్చి అభిప్రాయమిచ్చు సందర్భమున, 1878 లో 'హిందూ' (The Hindu) పత్రిక వ్రాసిన ఈ క్రింది వాక్యములు అమూల్యములు :

"As Yet the complaint has been that the Vernacular literature is barren of good and useful books and the few that it contains are unintelligible to the general reader, their style being too highly artificial and difficult to be of any interest to students of ordinary attainments. This defect especially in the Telugu literature, of sacrificing ideas at the shrine of jingling words, is somewhat being remedied by the useful publications of the School Book Society. But we are afraid that these works err in the opposite extreme. In aiming at simplicity they too often set at nought the first principles of grammar and sometimes violate the very genius of the language ...........we are glad therefore, to find that Mr. Kandukuri Viresalingam Pantulu has struck on the happy mean between the two. His style is pleasant and idiomatic, neither cumbrous and difficult nor flagging and tame ...........we did not think that the author of Vigraham which was intended to be a sequel to Chinnaya Soori's Neethi Chandrika could altogether cast away his old associations and take to a totally different path in Telugu literature."

"We sincerely hope that Mr. Viresalingam will be long spared to his country and by his laudable efforts create an oasis in the barren desert of Telugu literature."

142. బహుజనహితముకొరకు తమ శైలిని మార్చుకొని రచనలు సాగించిన వీరేశలింగం పంతులుగారు; ఇరువదవ శతాబ్దిలో ఆంధ్ర సాహిత్య పథమును తీర్చి దిద్దిన వ్యావహారికభాషోద్యమమునకును, తాము కీర్తిశేషులగుటకు కొలది నెలల ముందు, సుముఖులుగ నుండిరని, శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారి ఈ క్రింది వాక్యముల వలన తెలియుచున్నది.

"1919-వ సంవత్సరము ఫిబ్రెవరి తే 28 దిని రాజమహేంద్రవరమునందు కీ॥ శే॥ రా॥ బ॥ కందుకూరి వీరేశలింగం పంతులుగారు అధ్యక్షులుగా, "వర్తమానాంధ్ర భాషా ప్రవర్తక సమాజము" స్థాపించుటకు ఏర్పాట్లు జరిగినవి; గాని పంతులుగారు మరి మూడు మాసములలోగానే పరమపదము పొందుటచేత, సమాజము ఉద్దేశించిన కార్యములు నెరవేరలేదు." (గద్య చింతామణి [1933]: పుట - ౧౬.)

ఆ నాడు సాహిత్యమునకు విశేష సేవ చేసినది, 'చింతామణి' పత్రిక. ఇది రాజమహేంద్రవరమునుండి, శ్రీ న్యాపతి సుబ్బారావు పంతులుగారి యాజమాన్యమున, వీరేశలింగంపంతులుగారి తోడ్పాటుతో వెలువడెడిది. 1891 లో స్థాపింపబడిన ఈ పత్రిక, ఇంచుమించుగా పదిసంవత్సరములపాటు గొప్ప సాహిత్యసేవ చేసినది. అంతకుపూర్వము ముద్రింపబడని ప్రాచీన కావ్యము లెన్నియో దీనియందు ప్రకటితము లగుచుండెడివి. ఇవిగాక, వీరేశలింగము పంతులుగారు తమ రచనలను, తమ సమకాలికుల రచనలను యథోచితముగ ఇందు ప్రకటించుచుండెడివారు. ఈ పత్రిక నిర్వహించిన అత్యుత్తమ కార్యములలో 'తెలుగు నవలల పోటీపరీక్షలు' అగ్రగణ్యములు. మొట్టమొదటిసారి ఈ పోటీపరీక్షలు' 1893 లో జరిగెను. చింతామణి పత్రిక నిర్వహించుచు వచ్చిన ఈ పోటీపరీక్షల వలననే పందొమ్మిదవ శతాబ్ది చివరి పది సంవత్సరములలో తెలుగులో చాల నవలలు బయలుదేరెను. శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహంగారి వంటి నవల రచయితలు బయలుదేరుట కవకాశము లభించినది. 1897 లో వీరేశలింగంపంతులుగారు రాజమహేంద్రవరమును విడిచి, మద్రాసు పోవుట తోడనే; రాజమహేంద్రవరమునుండి 'చింతామణి నవలల పోటీపరీక్షలు' ముగిసినట్లే ఎంచవచ్చును. శ్రీ న్యాపతి సుబ్బారావు పంతులుగారు, చింతామణి పత్రికను, చెన్నపురినుండి నడపుటకు వీరేశలింగంపంతులుగారి కిచ్చివేసిరి. చెన్నపురిలో వీరేశలింగంపంతులుగారు చింతామణి ముద్రాక్షరశాల స్థాపించి, పత్రిక నచ్చటనుండి నడపుచువచ్చిరి

శ్రీ వీరేశలింగంపంతులుగారు తమ 'హాస్యసంజీవని' యందు హాస్యరచనను ప్రకటించి, తెలుగుపత్రికలో హాస్యరచనకు మార్గదర్శకులైరి. సంఘవిమర్శనాత్మకములైన ఈ రచనలును, వారి సంఘసంస్కరణోద్యమమునకు చాల సాయపడెను.

'వీరేశలింగకవి రచనలు - ఆంగ్లసాహిత్యము' అను ఈ భాగమున; ప్రత్యక్షముగనో పరోక్షముగనో ఆంగ్లభాషా సాహిత్యముల ప్రభావము పడిన వారి రచనలను (నవల, కథ, అనువాదకథ, ఆత్మకథ, వ్యాసరచన, చరిత్ర గ్రంథములు, శాస్త్రగ్రంథములు, ప్రహసనములు, ఆంగ్లనాటకానువాదములు, పద్యకావ్యములు, పత్రికానిర్వహణము) పరిశీలించుట అయినది.[143] ఇందు

143. "He (Viresalingam Pantulu) was pratically the first literary man in Telugu to have employed every variety of literary form - novel, poem, drama, satire, pamphlet, magazine and autobiography."

(Pioneer of Modernism in Andhra—K. Iswara Dutt; 'Swatantra Weekly, Madras; 17-4-1948)

పరిశీలింపబడినవిగాక, వారింకను నెన్నియో రచనలనుచేసిరి. సంస్కృతములో నుండి అభిజ్ఞానశాకుంతలము మొదలయిన నాటకముల ననువదించిరి.[144] దక్షిణ గోగ్రహణము మొదలయిన స్వతంత్రనాటకముల విరచించిరి. తిర్యగ్విద్వన్మహాసభ మొదలయిన హేళనరచనలను చేసిరి. బ్రాహ్మ వివాహము, వ్యవహారధర్మబోధిని మొదలయిన సాంఘిక నాటకములను రచించిరి. ప్రభుత్వమువారు కోరగా వాచకములను వ్రాసిరి. స్త్రీ నీతిదీపికను బోలిన శతకములను వ్రాసిరి. వీనియందు ఆంగ్లభాషా సాహిత్యముల ప్రభావము స్ఫుటముగా కన్పట్టదు. కాని, ఈ రచనలకు వెనుకనున్న సృజనశక్తి; సంస్కృతాంధ్రాంగ్ల సాహిత్యముల సారమును గ్రోలి పరిపుష్టమైనదని చెప్పుటలో అతిశయోక్తి లేదు. దీర్ఘకాలము నిద్రాణమైయున్న ఆంధ్రజాతిమేధాసంపత్తి, పునరుజ్జీవనము పొందుచున్న సంధికాలములో; వివిధ దృక్పథముల, సంస్కృతుల, సాహిత్యముల సమన్వయదృష్టితో చూడగల ప్రజ్ఞతో వీరేశలింగం పంతులుగా రుద్భవించిరి.

దేశకాల పరిస్థితుల ననుసరించి, వారు ఏ ఒక్క సాహిత్య ప్రక్రియను గాక వివిధములైన ప్రక్రియలను చేబట్టి రచనలు కావించిరి. ఇట్లు వారి ప్రతిభా స్రవంతి బహుముఖముల ప్రవహించుటచే, రచనలన్నియు సమాన స్థాయి'లో నుండవు ఇందులకు కారణము వారి కృషివైశాల్యమేగాని, ప్రతిభయొక్క పరిమితత్వముకాదు. దీనిని గుర్తించియే వారు తమ స్వీయ చరిత్రలో నిట్లు వ్రాసిరి.

"తెలుఁగు భాషను వృద్ధి చేయవలెనన్న యభిలాష నాకు మొదటి నుండియు విశేషముగా నుండెను. నేను నా కాలమునంతను భాషాభివృద్ధి నిమిత్తమే యుపయోగించి పాటుపడిన పక్షమునఁ గొంతవఱకు నా యభిలాషము నెఱవేఱియుండునేమో! వెనుకటి ప్రకరణములను మీరు సావధానముగా చదివి యుండిన యెడల నేనొక్క పనితోఁ దృప్తినొందక యేక

---

144. వీరేశలింగంపంతులుగారు నాటక రచన చేయుటయేగాక, విద్యార్థులచే నాటకముల నాడించిరి. దీనిని గూర్చి, వావిలాల వాసుదేవశాస్త్రిగారు తమ 'ఉత్తర రామ చరిత్ర' నాటకమున, ఆంగ్ల పీఠికలో (9-11-1883) నిట్లు వ్రాసిరి.

"It must, ofcourse, be a source of pleasure to all workers in this field and to those interested in their success, that under the auspices of Mr. Veeresalingam Pantulu, a dramatic company was formed by the students of our college, who performed on the stage his Ratnavali and Comedy of Errors......".

కాలమునం దెన్ని పనులను పైని వేసికొని నిర్వహింపఁ జూచుచుండెడివాఁడనో మీకు విశదమయి యుండును. *ఇన్ని పనుల నొక్కసారిగా పైని వేసికొనుటచే నేనేపనిని తృప్తికరముగా నిర్వహించుటకు సమర్థుఁడను కాకపోతిని.* దీనికి తోడు నేనెప్పుడును దృఢగాత్రుఁడనుగాక ప్రకృతిచేత రోగశీలమైన దుర్బల శరీరము గలవాఁడను. ఇట్లయ్యును నేను కొంచెములో కొంచెము నాయభిలాష సిద్ధిని బడసితి ననుకొనెదను. నే నారంభించిన కాలమునందు తెలుఁగులో నిప్పటివలె వివిధములైన పుస్తకములులేవు. వివిధములేమి ? ఇంచుమించుగా నేవిధమైన వియు వచన రూపమున లేవనియే చెప్పవచ్చును. అప్పుడన్నియు నూతనసృష్టి చేయవలెను; అందుచేత నప్పటివారికి కష్టము లెక్కువ, సౌలభ్యములు తక్కువ..........అయినను ప్రథమ ప్రయత్నము లెప్పుడును ప్రథమ ప్రయత్నములే. అవి దోష బహుళములయి యుండుట స్వాభావికము. మనము వృద్ధి పొందఁగలుగుట చేసిన తప్పులనుబట్టియే కాఁబట్టి *మొదట చేయఁబడిన నా పుస్తకములను తరువాతివారి గురుతర పుస్తక రచనకుఁ గొంత తోడుపడ వచ్చును.*”[145]

ఆంధ్రసాహిత్య రంగములో నింతటి వైశిష్ట్యముగల కృషిని చేసినవ్యక్తి గనుకనే, పంతులుగారి రచనలను— ఆంగ్లసాహిత్య ప్రభావము అను దృష్టి కోణమునుండి—కొంతవిపులముగా పరిశీలించుట జరిగినది. ఆయన తరువాత వచ్చిన వారిలోగాని, సమకాలికులలోగాని, బహుముఖముగ నిట్లు కృషిచేసిన వారు లేరన్నను సత్యదూరము కాదు.[146] ఏకదేశముగ వారిని మించినవా రుండ వచ్చునేమోగాని, బహుజనహితమే పరమలక్ష్యముగ; సాహిత్యక్షేత్రమున,

---

145. స్వీయచరిత్రము; రెండవభాగము (1915); పుట - ౨౩౨.

146. “Swimming against Time's current Viresalingam changed the current of life in Andhra, with no predecessor in his line and no successor of equal stature.”

“...... .....His versatility was hardly surpassed while as a writer of prose he was unequalled. Later-day trends and developments in Telugu Literature have failed to dislodge him from the peaks on which he stood, as a class apart.”

(Pioneer of Modernism in Andhra—K. Iswara Dutt; 'Swatantra Weekly;' Madras; 17-4-1948.)

సాంఘిక రంగమునగూడ సవ్యసాచివలె విజృంభించినవారు వరుడు.[147] సాంఘిక రంగములో వారుచేసిన కృషి దేశవ్యాప్తముగ తన ప్రభావమును నెరపి, మేధావుల మన్ననల నందినది.[148] సాహిత్యరంగములో వారుచేసిన కృషి నవ్యయుగావతరణమునకు నాందీవాక్యమైనది. ఇట్టి బహుముఖకృషికి; పంతులు గారికి భావసంపత్తిని సమకూర్చినది, బలము నిచ్చినది, సహజప్రతిభావంతులైన వారిపై, పాశ్చాత్య సాహిత్య విజ్ఞానములు— ఇంగ్లీషుభాష ద్వారమున— నెరపిన ప్రగాఢ ప్రభావము.

---

147. తమకు గురుతుల్యులయిన శ్రీ వీరేశలింగంపంతులుగారి నిష్కామ కర్మాచరణమును గూర్చి, శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు చెప్పిన ఈ క్రింది పద్యము ఇట స్మరణార్హము.

"తన దేహము తన గేహము
తన కాలము తన ధనమ్ము తన విద్య జగ
జ్జనులకు వినియోగించిన
ఘను డీ వీరేశలింగకవి జనులారా!"

148. పంతులుగారి జయంతి (1848) యొక్క శతవార్షికోత్సవ సందర్భమున (1948) వారి సంఘసేవపై తమ యభిప్రాయములను వెలిబుచ్చిన పెద్దలయొక్క వాక్యములే ఇందులకు తార్కాణము.

(Swatantra Weekly, Madras; 17-4-1948; Centenary Tributes.)

డా॥ సర్వేపల్లి రాధాకృష్ణ పండితులు :

"Sri Viresalingam Pantulu was one of the earliest pioneers in South India to demand and work for radical changes in our society. Like all pioneers, who are ahead of their time, he suffered misunderstanding and persecution. We owe it to his memory to work for social regeneration even as he did, braving all ridicule and danger."

శ్రీమాన్ చక్రవర్తి రాజగోపాలాచారిగారు :

"Andhradesh and Andhra people could not be what they are if Viresalingam had not arrived to vitalise them. He was one of the great men of India, of keen insight, great courage and dynamic energy. He fought against untruth and championed the cause of progress with Herculean vigour. Andhra is legitimately proud of him; so should all people in South India who know his work very well. His greatness rests on its own strength and not on any memorials we can raise or maintain."

ప్రఖ్యాత తమిళ కవియైన 'సుబ్రహ్మణ్య భారతి' తన 'చంద్రిక' యను రచనలో వీరేశలింగం పంతులుగారిని పేర్కొని, వారి సంఘసేవ నుగ్గడించెను.

★

## పంతులుగారి సమకాలికుల రచనలు

## ఆంగ్లసాహిత్యము

ఆంగ్లసాహిత్య సంస్కృతుల ప్రభావమున, సాహిత్యక్షేత్రమున బహుముఖములైన కావ్యశాఖలను నెలకొల్పిన వీరేశలింగంపంతులుగారిని గూర్చియును, వారికంటె ముందు ఆంగ్లసాహిత్య ప్రభావమున విశిష్టములైన కొన్ని నవ్యప్రక్రియలలో రచించినవారిని గూర్చియు పరిశీలించుట ఐనది. వీరందరియందును; రచనా వైవిధ్యమునందును, విస్తృతియందును, సమకాలిక సంఘముపై ప్రభావమును చూపుటయందును, మిన్నలని ఏకగ్రీవముగ ఆంధ్రదేశమంతయు నంగీకరించిన వీరేశలింగంపంతులుగారి రచనలపై ఆంగ్ల సాహిత్యప్రభావ మెట్లు పడినదో, విపులముగా చర్చించుట ముగిసినది. ఇంక, పంతులుగారి సమకాలికులలో ప్రత్యేకశాఖలలో ప్రఖ్యాతికి వచ్చిన పెద్దల రచనలపై ఆంగ్లసాహిత్య ప్రభావ మెంతవరకు పడినదో పరిశీలింపవలసి యున్నది. వీరిలో చాలమంది ఇరువదవ శతాబ్దిలో కొంతవరకు జీవించి యున్నను; వారి రచనలలో చాలభాగము పందొమ్మిదవ శతాబ్దియొక్క ఉత్తరభాగమునకే చెందియుండుటచేతను; వారిలో చాలమంది ఇరువదవ శతాబ్దియందు తాము జీవించియున్న కాలమున, ఈ "పరిశోధన" దృష్టి ననుసరించి విలక్షణరచనలు చేసినవారుగాక, తామంతకు పూర్వము చేసిన రచనలపై, తమ ప్రచారమున కాధారపడియున్నవారగుటచేతను; వీరేశలింగం పంతులు గారికి సమకాలికులగుట చేతను; ఈ శీర్షికక్రిందకు వచ్చిరి. ఈ నిర్ణయమును, ఆ యా రచయితల జననతిథులనుబట్టి చేయుట అయినది. *1880 వ సంవత్సరమునకు ముందు పుట్టినవారందరు, ఇంచుమించుగా, నిందు చేర్చబడిరి.*[1] ఇరువదవ శతాబ్దిలో, వివిధ సాహిత్యశాఖలలో కృషిచేసి పేరుపొందిన మహనీయులందరు, 1880 వ సంవత్సరమునగాని, దాని తరువాతగాని పుట్టినవారే.

---

1. తాము చేసిన రచనలచేత, నడిపిన ఉద్యమములచేత; ఇరువదవ శతాబ్దిలోని రచయితలకు సన్నిహితులుగ నున్నవారిని (శ్రీ గురజాడ అప్పారావుగారు. శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారు మొదలైనవారు) 1880-వ సంవత్సరమునకు ముందు పుట్టినవారైనను; ఇందు చేర్చలేదు. వారి రచనలు, ఇరువదవ శతాబ్ది రచయితల రచనలతోబాటు పరిశీలనకు వచ్చును.

ఈ విభజన, నా రచనకు సౌలభ్యము నిచ్చుటకై చేసినదగాని, త్రికాలాబాధితమై నిష్కర్షగ నుండుననికాదు. ఇది సాహిత్యచరిత్ర కాదు గనుక, ఆంగ్లసాహిత్య ప్రభావము సోకిన ప్రఖ్యాతరచయితల రచనలే ఈ "పరిశోధన"కు సామగ్రి.

పందొమ్మిదవ శతాబ్దియొక్క ఉత్తరార్ధములోని రచయితలు విశేషముగా కృషిచేసిన రంగములు రెండు. నవల, రూపకము అనునవి ఆరెండును. పద్యరచన గద్యరచన వీరిలో చాలమంది చేసినను, వానిపై ఆంగ్ల సాహిత్య ప్రభావము, నవల నాటకములపై పడినంత పడలేదు. ఇట్లు వీరేశలింగం పంతులుగారి సమకాలికుల రచనలలో, నవలల రూపకములపై ఆంగ్ల సాహిత్య ప్రభావము విశేషముగ పడుటచే, ఈ రెండింటిని కొంత విపులముగ పరిశీలింపవలసి యున్నది.

రూపకము :

పైని పేర్కొనబడిన సాహిత్య శాఖలలో నవల మన సాహిత్యమునకు క్రొత్తది. అంటుమొక్క. రూపకము మనకు క్రొత్త కాకపోయినను—సంస్కృత రూపకములు భారతీయు లందరివిగనుక—తెలుగులో రూపకము పందొమ్మిదవ శతాబ్దియొక్క యుత్తరార్ధమునగాని బయలుదేర లేదనవచ్చును. తెలుగులో రూపకరచన కాద్యు లెవరను ప్రశ్న, ఇట పుట్టుచున్నది. శ్రీ వావిలాల వాసుదేవ శాస్త్రిగారు 1883 లో తాము రచించిన 'ఉత్తరరామ చరిత్రము'ను ప్రచురించుచు, దాని పీఠికలో తమ గురువర్యులయిన బ్రహ్మశ్రీ కోరాడ రామచంద్ర శాస్త్రిగారు (1816-1900) రూపక రచనకు—సంస్కృతము నుండి తెలుగులోని కనువాదము చేయుటయందు - ఆద్యులని వ్రాసిరి.[2] దీనితో

2. "... .....It was, however, very unfortunate that Telugu language had, till very recently, laid no pretensions to the possession of Dramatic Literature... But, when after what may be termed the Revival of Telugu Literature has set in, it has struck my Guru, Brahmasri Korada Ramachandra Sastri Garu of Masulipatam, how sadly defective our native tongue was in dramatic works—not to speak of the consequent absence of facilities to elevate the moral tone of the masses, that great pandit translated Venisamhara of Bhattanarayana, whose Telugu translation has, somehow, not yet passed through the press. Mr. Kokkonda Venkataratnam Pantulu, residing in Madras, followed in the wake and published his version of the Narakasura Vijaya Vyayoga of Dharmabhatta."

(ఉత్తరరామ చరిత్రము - వావిలాల వాసుదేవశాస్త్రి తెలుగుసేత. మొదటికూర్పు - 1883. పీఠిక.)

శ్రీ నిడుదవోలు వెంకటరావుగారేకీభవింపలేదు. 'కొక్కొండ వెంకటరత్నము పంతులు' అను శీర్షిక క్రింద 'భారతి'లో వ్రాయుచు నిట్లనిరి. "క్రీ. శ. ౧౮౭౦ ప్రారంభమున పంతులుగారు మహామహోపధ్యాయ బిరుదాంచితుడు, సాహిత్య రత్నాకర గ్రంథకర్తయు ప్రసిద్ధాంధ్ర దేశీయాలంకారికుడును నగు వారణాసి ధర్మసూరి విరచిత 'నరకాసుర విజయ వ్యాయోగము'ను శ్లోకమునకు పద్యములు వచనమునకు గద్యమును రచించి, భాషాంతరీకరణ నాటకములకు మార్గదర్శకులైరి."[3] భారతిలోని ఈ వ్యాసములోనే వారు తమ యభిప్రాయము నకు బలము కలుగుటకై; వెంకటరత్నము పంతులుగారి నాటకముపై నాటి పండితులైన రేకము రామానుజ సూరిగారు, బహుజనపల్లి సీతారామాచార్యులు గారు, చదలువాడ సీతారామ శాస్త్రులుగారు వ్రాసియిచ్చిన పండితాభిప్రాయముల నిచ్చిరి. ఇందు, శ్రీ రామానుజసూరి "ఇది వరకు సంస్కృతానుసారిగ దెలుగున నాటక గ్రంథ మెద్దియులేదు. దానికి మీరు ప్రాథమికులైతిరి." (8-3-1872) అనియు; సీతారామాచార్య సీతారామ శాస్త్రులు గారలు "మొట్టమొదట యీ పూన్కి తమదిగా నేర్పడినది మిక్కిలి గౌరవావహమని తలంచుచున్నాము." (10-4-1872) అనియు చెప్పిరి.[4] కాని, కోరాడ రామచంద్ర శాస్త్రిగారు, 1860 ప్రాంతము నాటికే (నరకాసుర విజయ వ్యాయోగముకంటె ముందు) 'మంజరీ మధుకరీయ నాటకము'ను స్వకపోల కల్పిత కథతో రచించినట్లు తెలియుచున్నది. అయినను, ఇందలిశైలి కఠిన పాకమున బడుటచేతను, గ్రంథము 1908 వరకు అచ్చుకాకుండటచేతను, దీనికి ప్రచారమురాలేదు. ఇట్లే వీరి వేణీసంహారము తెలుగు సేతయు నాడు ముద్రణ భాగ్యమును పొంది ప్రచారమునకు రాకపోవుటచేత, అచ్చయిన 'నరకాసుర విజయ వ్యాయోగము' (శ్రీ కొక్కొండ వారిది) నాటి పండితులచే ఆంధ్రీకృత రూపకములలో మొదటిదిగా పేర్కొనబడెనని మనము తేల్చవచ్చును. ఇంతవరకు వ్రాసిన దానినిబట్టి; మొదటి స్వతంత్ర నాటకమును, మొదటి అనువాద నాటకమును (సంస్కృతమునుండి) శ్రీకోరాడ రామచంద్ర శాస్త్రిగారే వ్రాసినట్లు స్పష్టము. కాని, మచిలీపట్టణములో (శాస్త్రిగారున్న ఊరు) మద్రాసులోకంటె (కొక్కొండవారున్నది) ముద్రణ సౌకర్యములు

3. కొక్కొండ వెంకటరత్నం పంతులు - నిడుదవోలు వెంకటరావుగారు. ఖర, చైత్రము, పుట - ౩౬౯. (April — 1951)

4. Ibidem.

తక్కువగా నుండుటచే కాబోలు, శాస్త్రిగారి నాటకములు చాల సంవత్సరముల వరకు అచ్చుకాక, ప్రచారమునకు రాలేదు. అచ్చయిన మొదటి ఆంధ్రీకృత నాటకము శ్రీ కొక్కొండవారి నరకాసుర విజయ వ్యాయోగమే అనవచ్చును.

మహామహోపాధ్యాయ పరవస్తు రంగాచార్యులుగారు (1822-1900) 'అభిజ్ఞాన శాకుంతల నాటకము'ను 1872 వ సంవత్సరమున కొంత తెనిగించి తమ పత్రికయందు ప్రకటించిరి. దీనినిచూచి వీరేశలింగంపంతులుగారును దాని యాంధ్రీకరణమునకు పూనుకొని 1876 లో రెండంకములను 'వివేకవర్ధని'లో ప్రకటించిరి.[5] తరువాత, చాల నాటకములు బయలుదేరెను. ముందు వెలువడిన నాటకములకు ప్రచారము క్రమక్రమముగా తగ్గిపోవుటతోడనే, వాని ముద్రణ కాలమును విస్మరించుట జరుగునుకదా! వెంకటరత్నము పంతులుగారి నాటకమునకు నిట్లేయయినది.

సంస్కృతాంధ్రీకరణములకును, ఆంగ్లసాహిత్య ప్రభావము సోకని స్వతంత్ర నాటకములకును ఇట ప్రసక్తిలేదుగనుక, వానినిగూర్చి వ్రాయక ఆంగ్ల సాహిత్య ప్రభావము సోకినవానిని గూర్చి మాత్రము వ్రాయవలసియున్నది. నాటకమనునది—ఏ భాషలోనుండి అనువదింపబడినను—ఎప్పుడు తెలుగునందు ప్రారంభమయినదను విషయమును నిర్ణయించుటకై పై చర్చ చేసితిని.

ఆంగ్లములోనుండి ప్రప్రథమమున తెలుగులోనికి నాటకమును తెచ్చిన గౌరవము శ్రీ వావిలాల వాసుదేవశాస్త్రిగారికి (1851-1897) దక్కినది. వారి 'సీజరు చరిత్రము' (1875-76) లో గ్రంథరూపమును బొందిన విషయము మనకు తెలిసినదే.వీరే 1880 లో 'నందకరాజ్యము'అను స్వతంత్ర నాటకము నొకదానిని గూడ వ్రాసిరి. తెలుగునందు బయలుదేరిన సాంఘికేతి వృత్తముకల మొదటి స్వతంత్ర నాటకమిదియే యని కొందరి యూహ.

తెలుగులో మొట్టమొదట సంస్కృతాంగ్లములనుండి యనువాద నాటకములను వెలయించినవారెవరో తెలిసికొనిన తరువాత, ఆకాలమున నాటకాభి

---

5. స్వీయచరిత్రము - రెండవభాగము. 1915. పుట - ౧౬౯.

వావిలాల వాసుదేవశాస్త్రిగారి 'ఉత్తరరామ చరితము' పీఠికలో (9-11-1883) ఈ విషయమై ఇట్లున్నది.

"Then Sriman Paravastu Venkata Ranga Acharyar Averghal of Vizagapatam, commenced translating the well-known Sakuntala.........Afterwards, my friend Mr. Kandukuri Veeresalingam...has taken up the same play."

వృద్ధికి, పరిస్థితుల యానుకూల్యమును పరిశీలింపవలసియున్నది. ముందు పేర్కొనబడిన రచయితలు నాటకములు వ్రాయుటకు, ఆ సాహిత్యశాఖయందలి గౌరవమే ముఖ్యకారణమనవలెను. కాని, తరువాత తరువాత నాటకములు వ్రాసినవారికి ప్రత్యక్ష ప్రోత్సాహము నిచ్చినవి; దేశములో నాడు హిందీ నాటకముల నాడుచు సంచరించుచున్న సంచారనాటక సమాజములు. ఈ సమాజములకు ప్రోత్సాహమిచ్చినది, కలకత్తా, బొంబాయి మొదలయిన పెద్ద పట్టణములందు స్థాపింపబడిన ఆంగ్లనాటక సంఘములు. తెలుగుదేశములో నాడు పర్యటనముచేసి; నవీన నాటకరచనకును ప్రదర్శనములకును మనవారిని పురికొల్పినవి, ఈ హిందీనాటక సమాజములే.

ఈ విషయమునుగూర్చి వీరేశలింగంపంతులుగారే తమస్వీయ చరిత్రయందిట్లు వ్రాసిరి. "1880-వ సంవత్సరమునందు ధార్వాడ నాటక సమాజము వారు మా పట్టణమునకు వచ్చి గొప్పపాక వేసి దానిలో తమ నాటకముల నాడిపోయిన తరువాత పాక తీసివేయకముందే యా నాటకశాలలో నాడింపవలెనన్న కుతూహలముతో శ్రీ హర్షదేవ విరచితమైన రత్నావళీ నాటికను సంస్కృతమునుండి పద్యగద్యములతోను, ఇంగ్లీషుకవులలో నగ్రగణ్యుఁడుగా పరిగణింపఁబడెడు షేక్స్పియరు మహాకవి విరచితమైన కామెడీ ఆఫ్ ఎర్రర్స్ నాటకము నింగ్లీషునుండి గద్యాత్మకముగాను, అత్యంత శీఘ్రకాలములో తెలిఁగించి యారెంటిని తన్నాటకశాలలో జయప్రదముగా ప్రదర్శింపించితిని."[6]

ఈ విషయమునేగూర్చి చిలకమర్తి లక్ష్మీనరసింహము పంతులుగారిట్లు వ్రాసిరి. "ధారవాడ నాటక సమాజమువారు మొట్టమొదట తెనుగుదేశమునకు 1880 సంవత్సరమున వచ్చి, 1885 న సంవత్సరమున మరల వచ్చిరి. ఆ సమాజమునకు నాయకుడైన వామనభట్ట జోషికిని, దక్కన సభ్యులకును మనస్పర్థలు గలిగినందున, నేలూరు పట్టణమున నతడు తన సమాజమునుండి విడిపోయి, సమాజముమీద కోపముచేత మరియొక సమాజము దానికి పోటీగా లేవదీయదలచి, మనయాంధ్ర యువకులను కొందరను జేర్చుకొని యొకనాటక సమాజమును లేవదీసెను. దానికే యేలూరుకంపెనీయని పేరు. ధారవాడ నాటకసమాజమువారివలెనే వీరును హిందీలో నాటకము లాడెడివారు."[7]

6. స్వీయచరిత్రము - రెండవభాగము. 1915. పుట - ౧౬౧.
7. స్వీయచరిత్రము - చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు. (1945) పుట - 59.

పైని పేర్కొనబడిన, సుప్రసిద్ధులైన ఇరువురి మాటలవలన, ఆంధ్రదేశములో నాటకరచనాభివృద్ధికిని, నాటక ప్రదర్శనాభివృద్ధికిని ప్రోత్సాహకులు ధార్వాడ వారని తేలినది. వారు ఆంగ్లనాటక ప్రదర్శనములవలన ప్రోత్సహింపబడినవారు. కనుక, ఆంధ్రదేశములో మొట్టమొదటి నాటకరచనకు ప్రదర్శనమునకు చాల సన్నిహిత సంబంధముండెడిదని తెలియుచున్నది. కేవలము సాహిత్యము కొరకే నాటకరచన యచ్చటచ్చట జరిగినను, అది చాలస్వల్పము. 'ధార్వాడ నాటకకంపెనీ' వారి రాకతో తెలుగుదేశములో సంచలనము ప్రారంభమయ్యెను. కవులు నటులు కలసి పనిచేయజొచ్చిరి. అంతకు పూర్వము తెలుగు దేశమందు దేశినాటకములైన యక్షగానములేగాని, నవీన నాటకములైన మార్గనాటకములులేవు.[8] నవీన నాటకావతరణము జరిగినతరువాత; మొట్ట మొదట కేవల గద్యనాటకములు, తరువాత గద్యపద్య నాటకములు— అనువాదములు, స్వతంత్రములు— బయలుదేరెను. ఈ యనువాదములలో ఆంగ్ల భాషనుండి చేసినవి, సంస్కృతమునుండి చేసినవి కూడ కలవు. ఇది నాటక రచనయొక్క పరిణామము.

నాటక ప్రదర్శనమునకు సంబంధించిన దశలనుగూర్చి శ్రీ పింగళి లక్ష్మీకాంతముగారిట్లు వ్రాసిరి. "ధార్వాడ కంపెనీరాకయు, మార్గ నాటకావతారమును సమకాలికములు గాన, అదిజరిగి సుమారు ఏబది సంవత్సరములై యుండును. ఈ యర్ధశతాబ్దిలో దీనికి మూఁడుదశలు గడచినవి; నాల్గవది నడచుచున్నది."[9] మొదటి రెండు దశలలోను నాట్యసంఘములు వినోద సంఘములే గాని, వృత్తిసంఘములు గావు. మూఁడవదశయందు పెద్దపెద్ద కంపెనీలు బయలుదేరినవి. "సంఘములుబీటుపడి భిన్నములగుట, ఐక్యముచెడియసూయలు రగులుట లోనగు పతనహేతువులన్నియు మూఁడవదశలోని ముచ్చటలు."[10] నాల్గవదశలో నాటక ప్రదర్శనములు క్షీణించుటకు మొదలుపెట్టెను. కాని, నేడు పరిస్థితులు కొంత మెరుగగుచున్నవి.

---

8. "ధార్వాడ కంపెనీవారు మన రాష్ట్రమునకు రాకపూర్వము మనకు దేశినాటకములైన యక్షగానములేగాని, మార్గనాటకములు లేవు." 'అధ్యక్షోపన్యాసము' (ఆంధ్ర నాటక కళాపరిషత్తు, 1937)—శ్రీ పింగళి లక్ష్మీకాంతముగారు (గౌతమ వ్యాసములు.)

9. Ibidem. అధ్యక్షోపన్యాసము- 1937.

10. Ibidem.

ఇట్లు రచనకు సంబంధించిన దశలను గూర్చియు, ప్రదర్శనములకు సంబంధించిన దశలనుగూర్చియు దిఙ్మాత్రముగ గ్రహించిన తరువాత ఆంగ్ల సాహిత్యప్రభావము నాటకరచనపై, రచయితలపై, నేవిధముగ పడినదియో పరిశీలింపవలసి యున్నది.

ఆంగ్లనాటకముల ననుసరించి రచనలుచేసిన శ్రీ వావిలాల వాసుదేవ శాస్త్రిగారిని గూర్చియు, గురుజాడ శ్రీరామమూర్తిగారిని గూర్చియు, చర్చించుట ముగిసినదిగదా! వీరి తరువాత, ఆంగ్ల నాటకముల ననుసరించి రచనలను సాగించిన వీరేశలింగంపంతులుగారి రచనలను, సాకల్యముగ చర్చించుట అయినది. ఇక ప్రథమాంధ్ర నాటకకర్త అయిన కోరాడ రామచంద్రశాస్త్రి (1816-1900) గారినిగూర్చి కొంచెము తెలిసికొనవలసియున్నది. వీరు సుప్రసిద్ధులైన శిష్టు కృష్ణమూర్తిశాస్త్రిగారి శిష్యులు. ఈ విషయమును వీరు తమ 'మంజరీ మధుకరీయము' (1860 నాటికే వ్రాయబడిన స్వతంత్రనాటకము) ప్రస్తావనలో ప్రస్తుతించియున్నారు. కాలమునుబట్టి; స్వతంత్ర నాటకమును వ్రాయుట యందును, ఆంధ్రీకృత (సంస్కృతమునుండి) నాటక రచనయందును ఆద్యులు వీరని నిర్ణయమైనది. చిరకాలము వీరు బందరు నోబిలుకళాశాలలో పనిచేసిరి. ఇందువలన వీరికి ఆంగ్లభాషాసాహిత్య విషయములు కర్ణతాడితములగుచుండెడివని యూహింపవచ్చును. కాని, ఆ ప్రభావమున వీరు రచనలు సాగించినట్లు కన్పట్టదు. వీరు సంస్కృతములోనుండి తెలుగులోనికి, ఇంచుమించుగా, అన్ని ప్రఖ్యాతనాటకములను—ఉన్మత్తరాఘవము(అచ్చు, 1891), ముద్రారాక్షసము, శాకుంతలము, వేణీసంహారము, ఉత్తరరామ చరితము అనువానిని—అనువదించిరి. కాని వీరి గ్రంథములు, అచ్చగుట ఆలస్యమగుటచే కాబోలు, మంచి ప్రచారమును పొందలేదు.

మహామహోపాధ్యాయ బిరుదాంకితులును సర్వతంత్ర స్వతంత్రులు నయిన పరవస్తు వేంకట రంగాచార్యులుగారు (1822-1900) ఆంగ్లభాషా కోవిదులు కాకున్నను, పాశ్చాత్య నాగరకతా సంస్కృతులను గూర్చి ఎరుగనివారు కారు. సంస్కృతమునుండి 'అభిజ్ఞాన శాకుంతలము'ను మొట్టమొదట తెలుగులోనికి తెచ్చుటకై కృషిచేసిన మహానుభావులు. నాడు ఆంధ్రదేశములో విజృంభించిన క్రైస్తవమిషనరీల ప్రచారము నరికట్టుటకై, వారి వాద గ్రంథముల నన్నింటిని చూచి, విమర్శించిన వీరికి, పాశ్చాత్య సంప్రదాయములతో బాగుగ పరిచయమున్నది. వీరిరచనలలో తలమానికమైనది 'శబ్దార్థ సర్వస్వము.

దీని రచనలో వారి కాదర్శప్రాయమైనది, ఆంగ్లములోని 'ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికా, (Encyclopaedia Britanicca).

వీరేశలింగంపంతులుగారితో నన్నివిధముల సమానులును, మహామహోపాధ్యాయ బిరుదాంకితులునగు కొక్కొండ వేంకటరత్నం పంతులుగారు (1842-1915) పందొమ్మిదవ శతాబ్ది ఉత్తరార్ధములోని ప్రఖ్యాతపురుషులలో నొకరు. తమ మార్గములు - సాంఘిక సాహిత్య రంగములలో - వేరగు వరకు వీరును, వీరేశలింగంపంతులు గారును స్నేహితులు. వీరు సంస్కృతములో వారణాసి ధర్మసూరి రచించిన 'నరకాసుర విజయవ్యాయోగము'ను 1871 లో ఆంధ్రీకరించి 1872 లో ముద్రించిరి. సంస్కృతానువాదములలో అచ్చయిన మొదటిరూపక మిది. శ్రీ కొక్కొండవారే తమ అనువాదమున సూత్రధారునిచే ఇట్లనిపించిరి.

" ఆంధ్రమున రూప్యకాద్యమిదియగుట దీన
రచన యెట్టైటొయుండుఁ బాత్రత నరసిన
రసికు లీ కృతి హార్యనుగ్రహము కలిమి
సత్యభామ యటంచెంచి సంతసిలరె."

పంతులుగారి రెండవ ఆంధ్రీకృతరూపకమును, వ్యాయోగమే. సంస్కృతములో కాంచనాచార్యుడను కవి రచించిన 'ధనంజయ విజయవ్యాయోగము'ను వీరు 1894 లో గ్రంథరూపమున తెలుగులోనికి తెచ్చిరి. ఇది ఉత్తర గోగ్రహణమునకు సంబంధించిన ఇతివృత్తము కలది. వీరి మూడవ ఆంధ్రీకరణ రూపకము 'ప్రసన్న రాఘవనాటకము'. సంస్కృతములో జయదేవుడు రచించిన దాని కిది తెలుగు. ఈ నాటకమును 'శల్యపరీక్ష' చేసినట్లు విమర్శించినారు శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారు. మిగిలిన విమర్శ లెట్లున్నను, వీరి రచనలు కఠినశైలిలో నుండునని అందరు నంగీకరింతురు. వీరు 'శ్రీమతీ మాధవ నాటకము'ను స్వతంత్ర నాటకమునుగూడ రచించినట్లు తెలియుచున్నది. ఇది అముద్రితము. రూపకములతో తృప్తిపొందక వీరు 'అజామిళోపాఖ్యానము' అను యక్షగానమును గూడ రచించిరని తెలియుచున్నది. వీరి రచనలు పుస్తక రూపమును బొందుటకుముందు, శ్రీవనప్పాకము ఆనందాచార్యులుగారి 'వైజయంతి' పత్రికలో ప్రకటింపబడుచుండెడివి. వీరే శ్రీ కొక్కొండ వారికి 'ఆంధ్రజాన్సన్' అను పేరునిచ్చిరి. ("...I shall have said all that one need, by stating that he may be aptly, likened to Dr. Samuel Johnson...")

సంస్కృతాంధ్రాంగ్ల తమిళాది బహుభాషలలో వీరు పండితులైనను, సుప్రసిద్ధ రచయితలయినను; ప్రత్యక్షముగ ఆంగ్లసాహిత్య ప్రభావమున వీరు సాగించిన రచనలు లేవనవచ్చును. రూపకములను-సంస్కృతము నుండి అయినను-తెలుగు లోనికి తేవలెనను కుతూహలమును వారికి కలిగించినది, ఆంగ్లసాహిత్య వాసనావాసితమైన నాటి శిష్టసంఘము కావచ్చును.

స్వతంత్ర నాటకములను, సంస్కృత నాటకానువాదములను చేసి, ఆంధ్ర సాహిత్య లోకమున మిక్కిలి ప్రఖ్యాతిని బొందినవారు శ్రీ వేదము వేంకట రాయశాస్త్రిగారు (1853-1929). కవిగా, పండితునిగా, వ్యాఖ్యాతగా, విమర్శకునిగా వీరు పేరుపొందిరి. సంస్కృతాంధ్రాంగ్ల తమిళాది బహుభాషలలో వీరు కోవిదులు. ప్రాచ్యపాశ్చాత్య సాహిత్య సంప్రదాయముల నాకళింపునకు తెచ్చుకొనినవారు. కనుకనే వారు తెలుగులోని నాటకరచనను గూర్చి 'గ్రామ్య భాషాప్రయోగ నిబంధన' మను నుపన్యాసమున నిట్లు వ్రాసిరి.

"మనవారు మేఁకదాటుగా చిరకాలము పురాణముల నాంధ్రీకరించి తర్వాతం బ్రబంధంబుల విసిగి యిపుడు అన్యములందొడంగినారు. మఱియు గీర్వాణ నాటకముల నెఱింగియు హూణనాటకములంజదువవఱకు నాటకముల వ్రాయరైరి. గీర్వాణకథల నెఱింగియు హూణనవలలంగాంచినదనుక నవలల వయిం బడరైరి......."[11]

విశాలదృష్టి. గొప్ప పాండిత్యము గల శాస్త్రిగారు, నాటకములలో 'పాత్రోచిత భాష' యనునది తెలుగువారి కిచ్చిరి. వీరు సంస్కృతము నుండి నాగానందమును 1891 లో తెలుగుచేసి యందు మొట్టమొదటిసారిగా పాత్రోచితభాష వాడిరి. ఆనాడు దీని విషయమై పండితులలో వాదోపవాదములు చెలరేగినవి. సంస్కృతములో పాత్రలు తమ యోగ్యతలనుబట్టి వివిధ భాషలు (ప్రాకృత సంస్కృతములు) మాటాడుటయు, ఆంగ్లనాటకములలో కూడ పాత్రల యోగ్యతనుబట్టి, మాటాడు పదజాలము మారుటయును, గుర్తించిన శాస్త్రిగారు నాగానందము నిట్లాంధ్రీకరించుటలో వింతలేదు. "ఆంధ్రవాఙ్మయమున పాత్రోచితభాషయందు రచియింపఁబడిన ప్రథమనాటక మిదియే."[12] వీరు 1896 లో 'అభిజ్ఞానశాకుంతలము'ను, 1910 లో 'ప్రియదర్శిక' 'నాటికను, 1919 లో 'మాళవికాగ్నిమిత్రము'ను, 1920 లో 'ఉత్తర

---

11. వేదము వేంకటరాయశాస్త్రులవారి జీవితము, పుట - 57.

12. Ibidem. పుట - 59.

రామచరిత్రము'ను, 1921 లో 'రత్నావళి' 'విక్రమోర్వశీయము'లను ఆంధ్రీక రించిరి. ఈ నాటకములన్నింటను పాత్రోచితభాష వాడిరి. ఆంగ్లసాహిత్యము లోని మెలకువలు గ్రహించినవారగుట, వీరు సంస్కృతాంధ్రీకరణములలో సైతము, భాషావిషయకమైన క్రొత్తదనమును తెచ్చిరి.

ఆంగ్లసాహిత్యములో నత్యుత్తమ నాటకములని గణుతింపబడు 'షేక్స్పి యర్'లోనుగాగల కవులరచనలను, పాశ్చాత్యరూపక సంప్రదాయములను బాగుగా శాస్త్రిగారెరుంగుదురనుటకు వారి రచనలేగాక ఈ క్రింది వాక్య ములు నాధారము.

"శాస్త్రిలవారు సంస్కృత నాటకములను పాఠము చెప్పునప్పుడు ఆ సంవత్సరము విద్యార్థులకు పాఠ్యమైన షేక్స్పియరు నాటకముతో దానిని పోల్చి ప్రాచ్య పాశ్చాత్యరూపక సామాన్యలక్షణములను బోధించువారు."[13]

శ్రీవేదము వేంకటరాయశాస్త్రిగారి స్వతంత్రనాటకములు మూడు—ప్రతాపరుద్రీయము (1897); ఉషాపరిణయము (1901); బొబ్బిలియుద్ధ నాటకము (1916); అనునవి. ఈ నాటకములు మూడును శాస్త్రిగారి ప్రతిభా విశేషమును చూపజాలినవే. ఈ మూడు నాటకములును త్రివిక్రముని పాద త్రయమువలె, త్రిలింగదేశము నావరించి, వారికి శాశ్వత యశస్సు నార్జించి పెట్టెను. ఇందు రెండు చారిత్రక నాటకములు. పౌరాణికము ఒకటి. పౌరాణిక నాటకము కోమలమైనది. మిగిలినవి గంభీరములు.

వీనిలో 'ప్రతాపరుద్రీయము' కాలమునుబట్టియు, గుణవిశేషము బట్టియు ప్రథమగణ్యము. ఈ నాటకము (1897) బయల్వెడలుటకు మున్ను శాస్త్రిగారు ప్రతాపరుద్రుని కథను, వారికి దోచినట్లు విరివిచేసి కథారూపమున 1883 లో ప్రచురించిరి. తరువాత ఈ కథనే మాతృకగాగొని ఈ యద్భుత నాటకమును సృష్టించిరి. రసపోషణమునందును, కథాసంవిధాన నైపుణ్యము నందును, పాత్రనిర్మాణ చాతుర్యమునందును, పాత్రోచిత భాషాప్రయోగ విషయమునను ఈ నాటకము మిన్న. 1897 వ సంవత్సరము తెలుగు సాహిత్యచరిత్రయందు మిక్కిలి ప్రాముఖ్యముగలది. ఆ సంవత్సరమున, మూడు స్వతంత్రనాటకములు తెలుగులోనికి వచ్చెను. చారిత్రక నాటకముగా 'ప్రతాపరుద్రీయము'; సాంఘికనాటకముగా శ్రీగురుజాడ అప్పారావుగారి

13. Ibidem- పుట - 111.

'కన్యాశుల్కము'; పౌరాణిక నాటకముగా శ్రీ ధర్మవరము రామకృష్ణమాచార్యులుగారి 'చిత్రనళీయము'; ఆ ఏడు బయలుదేరినవే.

'ప్రతాపరుద్రీయము'నకు ఆంగ్లసాహిత్యములోని ఏ యొక నాటకముతోడను ప్రత్యేక సంబంధములేదుగాని; షేక్స్పియర్ నాటకములలోని 'హాస్యగాండ్ర'ను పోలిన పాత్రలు తెలుగు నాటకమున చాల గలవు. షేక్స్పియర్ యొక్క చారిత్రక నాటకముల పఠనము, శాస్త్రిగారిని చాల కదిపియున్నది. హెన్రీ ది ఫోర్త్, పార్ట్ I (Henry the IV; Part I) లోని 'ఫాల్‌స్టాఫ్' (Falstaff) మొదలయినవారి హాస్యము; 'ది మర్చెంట్ ఆఫ్ వెనీసు' (The Merchant of Venice) నాటకములోని 'లాన్సెలెట్ గాబో', 'గ్రేషియానో' (Launcelot Gobbo, Gratiano) మొదలైనవారి హాస్యము; 'ప్రతాపరుద్రీయము'నందలి 'పేరిగాడు,' 'చెకుముకిశాస్త్రి' మొదలయినవారి హాస్యము ఒకే తెగకుచెందినవి. హాస్యరచనలు సంస్కృతములో చాల తక్కువ. సంస్కృత రూపకములలోని— మృచ్ఛకటికముతప్ప— విదూషకాదుల హాస్యము అంత రమణీయముగాదు. ప్రతాపరుద్రీయములోని హాస్యము వానిని వేనిని బోలక, ఆంగ్లనాటకములలోని హాస్యమును పోలియున్నది.

సంస్కృత రూపకములలోని 'ముద్రారాక్షసము'వలె 'ప్రతాపరుద్రీయము' నందలి కథావస్తువు రాజకీయ తంత్రముతో కూడినది. కాని, తెలుగు నాటకములోని హాస్యరస పోషణము, సంస్కృత రూపకములో లేదు. తెలుగు నాటకములోని హాస్యరస పుష్టికి, తెలుగు రచయితయొక్క ప్రతిభయు, ఆంగ్ల నాటకముల పఠనమును కారణములు. పాత్ర పోషణమునందు, రచనా చమత్కృతియందు మాత్రమేగాక, శ్రీ శాస్త్రిగారు 'నాటకదేహబంధము'ను నిర్మించుటయందును నేర్పుచూపిరి. పాశ్చాత్యదేశములలో సాహిత్య మీమాంసకు భిక్షపెట్టిన ఆరిస్టోటల్ (Aristotle) నాటకములో 'దేహబంధము'నకెక్కువ ప్రాముఖ్యమిచ్చుచు నిట్లు వ్రాసెను. "Beginners succeed in character and diction but not in structure" (Aristotle's Poetics). శ్రీ శాస్త్రిగారు నాటక నిర్మాణమున ప్రజ్ఞను ప్రదర్శించి, తమ ప్రతిభను ప్రకాశింపజేసిరి.

'ప్రతాపరుద్రీయము' వెలువడిన తరువాత; పండితులనేకులు, విద్యాసంస్థలు, పత్రికలు, దానిపై నభిప్రాయము లిచ్చుట జరిగినది. అందు 'మద్రాసు క్రైస్తవ కళాశాలా పత్రిక' ఇట్లు వ్రాసినది.

"We shall content ourselves with saying that Prataparudriya by itself would suffice to answer those who seek to belittle the literary intellect of South India. The Drama however marks a new departure in Telugu Literature. Secondly, the drama is the work of one who has before now tried his skill in the interpretation of the Sanskrit dramatists and had made a name for exactness of rendering and for his high attainments in Telugu composition both in prose and verse. Further, he has studied the dramatic art with special attention, not only for the gratification of his own scholarly instincts, but also with a view to the practical application of his studies and researches in the representation of the classical Sanskrit dramas. *He has also cultivated a knowledge of the drama as understood and enacted by the Masters of the West.* A work by such an author should certainly evoke the interest of the educated public."[14]

ఈ వాక్యములనుబట్టి వేంకటరాయ శాస్త్రిగారికి ఆంగ్ల సాహిత్యముతో గల పరిచయ మర్థమగును. పాశ్చాత్యులు నాటక నిర్మాణములో నుపయోగించు శిల్ప విషయములను కొన్ని వీరుపయోగించుకొనిరి. సంస్కృతరూపకములలో అంకములను రంగములుగ విభజించు నాచారము లేదు. మధురోదాత్త రసభావ నిరంతరమైనదని రచయితలకు తోచిన కథాంశమును అంకములందు ప్రదర్శించుటయు నీరసము ననుచితమునగు దానిని అర్థోపక్షేపకముల సూచించుటయు; సంస్కృత రూపకముల యాచారము. అంకము, ఆసన్ననాయకమైగాని ప్రత్యక్ష నేతృ చరిత్ర పురస్కృతముగాగాని యుండవలెనని నిర్ణయించుకొనుటచే, వారి 'అంకము'లలో నీరసము, అనుచితమునగు వానికి తావు లేదు. నీరసమైనను కథా సందర్భమునకు కావలసిన వివరణముయినచో దానిని అర్థోపేక్షకములలో సూచించెడివారు. ఆంగ్ల నాటకములలో ముఖ్య భాగములుగ 'అంకములు', అంకములందు 'రంగములు', ఉండుట సంప్రదాయము. శ్రీ శాస్త్రిగారు తమ స్వతంత్ర నాటకములలో నీపద్ధతి నవలంబించిరి. వీరు అంకములను దృశ్యములుగ, రంగములుగ విభజించిరి.

శ్రీ శాస్త్రులుగారి మిగిలిన రెండు స్వతంత్ర నాటకములలో—ఉషాపరిణయము, బొబ్బిలియుద్ధనాటకము—కూడ నిర్మాణమున పాశ్చాత్యనాటక

14. "Madras Christian College Magazine"; September, 1898.
ఉదాహృతభాగము 'వేదము వేంకటరాయశాస్త్రులవారి జీవితము'నుండి సంగృహీతము. పుట - 64.

సంప్రదాయములు కొన్ని యనుసరింపబడినట్లు తోచుచున్నది. ఈ నాటకములలో 'బొబ్బిలియుద్ధ నాటకము' గంభీరములైన వీర కరుణ రసములకు స్థానమగుటచే నందు హాస్యరసము ప్రతాపరుద్రీయముకన్న తక్కువ. ఉషాపరిణయము శృంగారరస ప్రధానమైన నాటకమగుటచేతను, శృంగారమునకు అంగముగా హాస్యమును పోషించుట సర్వ సమ్మతమగుటను ఆ నాటకమునను హాస్యరసము వెల్లివిరిసినది.

శ్రీ శాస్త్రిగారు సంస్కృత నాటక మర్యాదలనే చాలవరకు పాటించిరి. కాని, సన్నివేశముల ననుసరించి సంస్కృతాలంకారిక వచనములకు భిన్నముగా నడచుటయు గలదు. ప్రతాపరుద్రీయ బొబ్బిలియుద్ధ నాటకములు వీరరస ప్రధానములు గనుక వానియందు, సంప్రదాయానుసారము శరదృతువు వర్ణింపబడినది. ఈ రెండు నాటకములును పది పది యంకములు గలవి. ఉషా నాటకమున ఏడంకములు కలవు. సంస్కృతాలంకారికవచనానుసారము విష్కంభాదులనుగూడ నాటకములలో నుపయోగించిరి. నిర్మల చిత్తముతో నానందింపవలసిన సభ్యునకు ఉద్వేగము కల్గింపరాదను నుద్దేశముతో సంస్కృత నాటకములలో "దూరాధ్వానం, వధం, యుద్ధం, రాజ్యదేశాదివిప్లవం..." మొదలగునవి సూచింపవలెనుగాని, ప్రదర్శింపరాదను నియమము నాలంకారికు లేర్పర్చిరి. సంస్కృత నాటక కర్తలు వీనిని పాటించిరి. శ్రీ శాస్త్రిగారును కొన్ని స్థలములందు వీనిని పాటించినను, కొన్నిచోట్ల పాటింపలేదు. రంగస్థలమునందు యుద్ధాదికమును చూపరాదు గనుక, వారి 'బొబ్బిలియుద్ధ నాటకము'లో యుద్ధ ప్రకారమంతయు నివేదకులువచ్చి నివేదించినట్లు వ్రాసిరి. వేణీ సంహార నాటకమున దుర్యోధనునకు భటుడువచ్చి యుద్ధక్రమమును వివరించినట్లు కలదు. 'బొబ్బిలి' నాటకమున వీరీ పద్ధతినే యవలంబించిరి. కాని, ఆనాటకమందే—రంగరాయాదుల మృతి, విజయరామరాజును పాపారాయుడు పొడిచి చంపుట, మొదలయిన ఉద్వేగకర విషయములను ప్రదర్శించు భాగమున నీరుంచిరి. ఇది సంస్కృత సంప్రదాయమునకు విరుద్ధము. ఆంగ్ల సంప్రదాయమునకనుకూలము. ఆంగ్ల నాటకములలో యుద్ధములు, హత్యలు, రంగస్థలముమీద జరిగినట్లు చూపుటయే సంప్రదాయము. షేక్స్పియర్ మహాకవి నాటకములలో కత్తి యుద్ధములు, పొడిచి చంపుటలు రంగస్థలముననే ప్రదర్శింపబడునట్లు రచింపబడెను. 'హామ్లెట్' నాటకమందు నాటకాంతమున ముగ్గురు నలుగురు కత్తి దెబ్బలవలన చనిపోవుదురు. ఇట్టి సంప్రదాయమును

వారు తమ వీరరస ప్రధానములైన నాటకములలో ప్రవేశ పెట్టిరి. బొబ్బిలి యుద్ధ నాటకమునకు విషాదాంతము కాదగిన లక్షణములన్నియు నున్నను. శ్రీ శాస్త్రిగారు చిన రంగరాయని పట్టాభిషేకముతో నాటకము ముగించి దానిని మన సంప్రదాయానుసారము సుఖాంతముగ చేసిరి. ప్రతాపరుద్రీయము నను నిట్లే. ఉషానాటక మెట్లును మోదాంతమే. ఈ మూడు స్వతంత్ర నాటకములను సంస్కృత నాటక సంప్రదాయము ననుసరించి నాందీ ప్రస్తావనల తోడనే ప్రారంభించిరి. ఇటుల శ్రీ శాస్త్రిగారు, ప్రాచ్య పాశ్చాత్య సాహిత్య పద్ధతుల నాకళింపునకు తెచ్చుకొన్నవారు గనుక, యథానుకూలముగ ఆయా పద్ధతుల ననుసరించిరి. వీరి నాటకములకు ఆంగ్ల నాటకములు మాతృకలు కాకున్నను, వీరి నాటక నిర్మాణమున పాశ్చాత్య సాహిత్య సిద్ధాంతముల ప్రభావము కన్పట్టుచునే యున్నది. 'ఆరిస్టోటల్' చెప్పిన ఐక్యత్రయమునందు వీరు 'కార్యైక్యము'న కెక్కువ ప్రాధాన్య మిచ్చిరి.

సంస్కృత నాటకములలోవలె ప్రాకృతాదుల సాహాయ్య మపేక్షింపకయే 'పాత్రోచిత' భాషను ప్రయోగించి భాషా వైవిధ్యమును; ఆంగ్లనాటకములలోవలె; శాస్త్రిగారు సంపాదింపగలిగిరి. వీ రాంధ్రనాటక రచనమున కిచ్చిన యుపకరణములలో నిది యొకటి.

వేదము వేంకటరాయ శాస్త్రిగారి రచనలలో వ్రేలుపెట్టి "ఇది ఆంగ్ల సాహిత్యమునుండి గ్రహింపబడినది" అని చెప్పుట కుదరదుగాని, వారి రచనల వెనుక ఆంగ్లసాహిత్య సంస్కృతుల ప్రభావము మాత్రము ఎల్లెడల—స్వతంత్ర నాటకములందు— కలదు.[15]

'ఆంధ్రనాటక పితామహ' అను బిరుదమును వహించి, ఇంచుమించు ముప్పది నాటకములను రచించిన శ్రీ ధర్మవరం రామకృష్ణమాచార్యులు (1853-1912) గారు నటునిగా, నాటకకర్తగా చాల ప్రఖ్యాతిపొందిరి. వీరు రచించిన నాటకములలో—వరూథిని (1917), చిరకారినాటకము (1919). పాంచాలీ స్వయంవరము (1924 రెండవ కూర్పు). మోహినీ రుక్మాంగద నాటకము (1931 రెండవకూర్పు), పాదుకాపట్టాభిషేకము (1926 నాలుగవ కూర్పు,) ప్రమీలార్జునీయము (1925 రెండవ కూర్పు), బృహన్నల (1929

15. "హూణ రూపక రసం బుదరంబు నిండారఁ
ద్రావి గజ్జునఁ ద్రేఁచి తవిసినారు."

(శ్రీ వేదమువారి ఉషానాటకము.)

రెండవ కూర్పు), అజ్ఞాన మణిమంత నాటకము (1929 మూడవ కూర్పు), విషాద సారంగధర నాటకము (1926 ఆరవ కూర్పు), సావిత్రీ చిత్రాశ్వ నాటకము (1925 మూడవ కూర్పు), ముక్తావళి నాటకము (1915 మొదటి కూర్పు), ప్రహ్లాదనాటకము (1927 ఆరవకూర్పు), చిత్రనళీయము (1897 మొదటి కూర్పు), మొదలయినవి ప్రఖ్యాతినిపొందెను. వీరు రచించిన నాటకములలో ఇరువదినాలుగునాటకములు సుఖాంతములు. విషాదాంతములు నాలుగు నాటకములు. అవి — చంద్రహాస (మణిమంత నాటకము), సారంగధర, ముక్తావళి, అజామిళ చరిత్రము, అనునవి. ఇందు అజామిళచరిత్ర మచ్చు కాలేదు. ముక్తావళి మొట్టమొదట విషాదాంతమైనను, అచ్చులో మోదాంతముగా మార్చబడినది.

ప్రాచ్యపాశ్చాత్య నాటకమర్యాదలను బాగుగా గుర్తెరింగి, రంగస్థలానుభవముతో రచనలు సాగించినారు గనుక, వీరినాటకము లన్నియు ప్రదర్శింపబడిన తొలినాళ్ళలో మంచి ప్రచారమును బొందెను. తరువాత కొన్ని నాటకములకు ప్రచారము తగ్గినను; వీరి 'చిత్రనళీయము', 'విషాద సారంగధర', 'చంద్రహాస', 'పాదుకా పట్టాభిషేకము', అను నాటకములు నేటికిని ప్రచారమున నున్నవి.

వీరి నాటకములలో చాలభాగము పందొమ్మిదవ శతాబ్ది తుది భాగములోనే రచింపబడి ప్రదర్శింపబడినను, ముద్రణము మాత్ర మాలస్యముగ జరిగినది. వారు చనిపోయిన తరువాతగాని కొన్ని అచ్చుకాలేదు.

ఆంగ్లనాటక మర్యాదలను పట్టుదలతో తెలుగులోనికి తెచ్చినట్టివారిలో వీరొకరు. వీరు స్థాపించిన 'సరసవినోదినీసభ'యందు ఇంగ్లీషు నాటకములాడునప్పుడుకూడ వీరు పాత్రధారణము చేయువారు. వీరికి షేక్స్పియర్ మహాకవిపై గౌరవ మధికమగుట, తాముసు ఆ యాంగ్లకవివలె ననేక నాటకములను రచింపవలెనను పూనికతో నన్ని నాటకములను రచించిరి. అంకమును రంగములుగ విభజించుట, నాటకమును విషాదాంతముగ నొనరించుట, పాత్రపోషణమును ఆంగ్లనాటకములలోని పాత్రపోషణమును బోలియుండునట్లు చేయుట మొదలగు పద్ధతులను వీరవలంబించిరి.

వీరు కొన్నికొన్ని నాటకములలో ఇంగ్లీషుశబ్దములను పాత్రలచే ప్రయోగింప జేసినారు. అట్టినాటకములలో 'చిరకారి' నాటకమొకటి. ఇందు పాత్రలు

ఆంగ్లపదములను యథానుకూలముగ నిట్లు వాడుదురు.

(చిరకారి నాటకము : తృతీయాంకము, ప్రథమరంగము)

"1 వ, విటుడు—ఈనాడు Carriage కొంచెము విఱిగినది." (పుట—17)

"1 వ, విటుడు—వారు (భోగమువారు) లేకపోయిన నీ music యెక్కడ, singing and dancing parties ఎక్కడ." (పుట—18)

"1 వ, విటుడు—Nonsense ఏమి పిచ్చిమాటలు? వేశ్యల యిండ్లకుఁబోవు మా wives నిట్లాడెదవా ? ఇంకొకసారి యీ మాటన్న slipper or whip" (పుట—19)

పాత్రలు తెలుగుతో ఇంగ్లీషు కలిపి మాటాడుట, వీరేశలింగం పంతులు గారి సాంఘిక రూపకములతో ప్రారంభమై, ధర్మవరం వారి వంటి రచనలతో క్రమాభివృద్ధిపొందెను.

శ్రీ ఆచార్యులు గారి కీర్తికి పతాక లనదగిన నాటకములు వారి విషాదాంత నాటకములు. ఈ నాటక రచనా పద్ధతిని వారు పాశ్చాత్య నాటక సాహిత్యమునుండి ఎరువుతెచ్చుకొనిరి. ఎరువు తెచ్చుకొన్న ఈ సొమ్ము మహాప్రతిభావంతులగు వీరికి బరువుగాక, ఎంతయో అందముగా ఒప్పియుండెను. వీరి విషాదాంత నాటకములలో చెప్పుకొనదగినది ఒక్క 'విషాద సారంగధర' నాటకమే. చంద్రహాస నాటకమును బలవంతముగా మోదాంతము జేసి అచ్చువేసిరి. అజామిళచరిత్రలో అజామిళుని మృతి మనకు విషాదమును కలిగింపదు. చంద్రహాసనాటకములో 'దుష్టబుద్ధి' ఒక్కడే చనిపోవును. అతని మృతి సభ్యులకు విషాదజనకము కాదు.

శ్రీ ఆచార్యులుగారు కొన్ని విషాదాంతనాటకములను రచించి వానికి రంగస్థలమున మెప్పురాదను భయమున వానిని మోదాంతములుగా మార్చి వేసిరి. తరువాత విషాదసారంగధర నాటకమునకు వచ్చిన పేరును జూచి, మోదాంతముగ మార్చిన కొన్ని నాటకములను మరల విషాదాంతముగ మార్చిరి. ఈ విషయమును, వారి 'చంద్రహాస' నాటకము మూడవ కూర్పున (1929) విజ్ఞాపనలో — ఈ విజ్ఞాపనము శ్రీ డి. కె. కృష్ణమాచార్యులుగారు (ప్రచారకులు) వ్రాసిరి — తెలియజేసిరి.

"ఆంధ్ర సారస్వతము దినదినమునకును విస్తరించుచున్నది. లోకుల ఛాందసత నానాటికి తగ్గుచున్నది. ఇదియొక శుభసూచన. ఎంత రుచికరము లైనను, ఎంత నీతిదాయకములైనను నాదరింపబడకుండిన విషాదాంత

నాటకము లిప్పు డత్యంతాదరమును బడయుచున్నవి. ఇందులకు విషాద సారంగధర నాటకమే తార్కాణము. అది యిప్పుడే యాఱవసారి ముద్రింప బడి, ఏడవ ముద్రణమున కెదురు చూచుచున్నది. దీనివలన ఖేదాంతనాటకములు మనవారి నెంత యాకర్షించియుండుట తెల్లమగుచున్నది."

"తొలుదొల్త నీ చంద్రహాస నాటకము సైతము విషాదాంతముగానే రచియింపబడియుండె. కాని యట్టి నాటకము లంతగా నాదరింపఁబడని యా కాలమున ఖేదాంతముగానే దీని బ్రదర్శింపగాని, ప్రకటింపగాని ధైర్యము చాలమి, గ్రంథకర్త దీనిని, దన మనసొప్పకున్నను, మోదాంతముగ మార్చె. అట్లే దీని ప్రథమ ముద్రణము గావింపఁబడియె. కాని యిటీవల స్థితిగతులఁ బరామర్శించి కవి తొలుత నుద్దేశించిన విధముననే యిది యిప్పుడు ఖేదాంతముగ ముద్రింపఁబడియె."

పై వాక్యములు, ఆంధ్ర సహృదయ లోకములో 'అభిరుచి' ఎటుల క్రమక్రమముగ మారుచు వచ్చెనో, తెలియజేయుచున్నవి. విషాదాంత నాటకములకుగల ప్రత్యేక స్థానమునుగూర్చి, 'విషాద సారంగధర నాటకము'నకు గల 'ఉపోద్ఘాతము'లో శ్రీ ఆచార్యులుగారే ఇట్లు వ్రాసిరి.

"...ఈ నాటకము 1887 సంవత్సరమునఁ బ్రప్రథమమున బళ్ళారిలో బ్రదర్శింపఁబడియె. నాటకమునందలి కథా విశేషమో జనులకుఁగల యాదరము విశేషమోకాని, అప్పటినుండి యింతవఱకు వేఱువేఱు చోట్ల నెన్ని మాఱు లీ నాటకమాడినను, దిదృక్షులకు నెడము సవరించుటయే కష్టముగా నుండు. అది యిదివఱకు దృశ్యనాటకమైయుండి యిప్పుడు దోషజ్ఞుల హస్తముల కెక్క నుంకించుచున్నది."

"...ఈ కథయే యప్రశస్తమనియు సవతితల్లి కుమారుని మోహించుట దుర్నీతిదాయకమనియు నాటకమునకు దగినది కాదనియుఁ గొందఱి యభిప్రాయము. నీతియు దుర్నీతియుఁ బరస్పరము నాధారములు గల్గినవి. దుర్నీతి యించుకైనన్ బ్రకటింపకున్న నీతికిఁ గాంతి గలుగదు... కావున నీతి కుదర్పవలెనన్న, దుర్నీతి నించుక ప్రకటించియే తీరవలెనని నా సవినయ విజ్ఞాపనము."

"ఈ నాటకము విషాదాంతముగా నొనర్పఁబడి యున్నది. ఇది క్రొత్త పద్ధతి యనుట యెఱుఁగనివాఁడఁగాను. ఆంగ్లేయభాషయం దిట్టి విషాద నాటకము లనేకములు గలవు. నీతిబోధ విషాద నాటకములయందువలె మంగ

శాంత నాటకములయందుఁ గలుగఁజాలదని నాకుఁ దప్పని యభిప్రాయము. కావున నీ క్రొత్తపద్ధతి ననుసరించితి."

విషాద సారంగధర నాటకమునకు శ్రీ ఆచార్యులుగారు వ్రాసిన యుపోద్ఘాతము, విషాదాంత నాటకమునుగూర్చి ఆంధ్ర సహృదయులకు తెలియజేయు లఘు వ్యాసమువలె రమణీయముగ నున్నది.

శ్రీ ఆచార్యులుగారి నాటకరచనాపాటవమునకు వన్నెలు దిద్దినది, ఆంగ్లసాహిత్య విజ్ఞానమేయని నమ్మువారును కలరు. సంస్కృతాలంకారికుల సంప్రదాయములకంటె నధికముగా వీరు పాశ్చాత్య సాహిత్య సంప్రదాయములను గ్రహించుటయే యందులకు కారణము. శ్రీ ఆచార్యులుగారి ప్రతిభను కీర్తించుచు ; వారి 'పాదుకా పట్టాభిషేకనాటకము'నకు ఉపోద్ఘాతము వ్రాసిన శ్రీ గురురాజారావుగారిట్లు వ్రాసిరి. (1926).

"ఈ కవితల్లజుఁ డాంధ్రనాటకముల రచించుటలో నవీనఫక్కిని ద్రొక్కి యాంధ్రనాటక కళకు వింతవన్నె పెట్టెననుట సర్వజనసమ్మతము."

"ఈ కవి నాటకరచనలో గీర్వాణకవులు దృశ్య ప్రబంధరచనా విషయమున నేర్పరచిన నిబంధనలఁ గట్టుదిట్టముల గమనింపక పోయినను, జగత్ప్రసిద్ధుఁడగు "షేక్స్పియరు" అను నాంగ్ల నాటకకర్తను గొన్ని యంశముల ననుకరించియున్నాఁడు. గీర్వాణ నాటకరచనా సంప్రదాయమునకు విరుద్ధముగ నీ కవి, సారంగధర నాటకమును విషాదాంతముగ నొనరించియుండుట "షేక్స్పియరు" మహాకవి యొక్క యనుకరణమును స్పష్టముగ సూచించుచున్నది. "షేక్స్పియరు" మహాకవి రచించిన విషాదాంత నాటకములలోని దుష్ట (Villainous) పాత్ర లీ కవి నాటకములోను గలవు. సారంగధరలోని చిత్రాంగిపాత్రయు, నీ నాటకములోని (పాదుకా పట్టాభిషేకము) మంథరయు నట్టి పాత్రలే. కాని, షేక్స్పియరు మహాకవి పోషించియుండు దుష్టపాత్రలకును, నీ కవి పోషించియుండునట్టి పాత్రలకును నొక ముఖ్య తారతమ్యమును చూడగలము." సారంగధరుడు చిత్రాంగి ప్రభావము క్రిందకు రాకుండుట వలన నాశనము పొందెను. భరతుడు మంథర ప్రభావమునకు లోనుగాగాకుండుటచే మహానుభావు డనిపించుకొనెను. కాని, మంథర కుట్ర అందరకు దుఃఖకారణమయ్యెను. సారంగధర పాదుకా పట్టాభిషేకములలో, సారంగధర నాటకమే నిజమైనవిషాదాంతము. 'పాదుకా పట్టాభిషేకము'లో దశరథుని చావును, మంథర మృతియు నున్నను, ఆ నాటకము 'సారంగధర' వంటిది కాదు.

ఆంగ్లములో విషాదాంత నాటకములు చాల నున్నను, పాశ్చాత్య సాహిత్యములో మొట్టమొదట నిట్టివానికి నిర్వచనము చెప్పినవాడు క్రీ. పూ. నాల్గవ శతాబ్దిలోనివాడైన అరిస్టోటల్ (Aristotle) అను గ్రీకు తత్త్వవేత్త. ఈతడు 'పొయిటిక్స్' (Poetics) అను గ్రంథమున, విషాదాంత నాటకము (Tragedy) నిట్లు నిర్వచించెను.

"Tragedy is a representation of an action, which is serious, complete in itself, and of a certain limited length; it is expressed in speech made beautiful in different ways in different parts of the play; it is acted, not merely recited; and *by exciting pity and fear it gives a healthy outlet to such emotions*."[16]

విషాదాంతనాటకము, కరుణా సంత్రాసములను ఉద్రేకింపజేసి, సభ్యుల మనములనుండి, వానిని పారద్రోలును. దీనివలన వారికి చిత్తస్వాస్థ్యము గలుగును. పైని వ్రాయబడిన 'అరిస్టోటల్' నిర్వచనమును విమర్శకు లనేక విధములుగ విమర్శించి వ్యాఖ్యలు వ్రాసిరి. కాని, మనలోని కరుణా సంత్రాసములను పైకితెచ్చి, విషాదాంతనాటకము మనహృదయములను క్షాళనము(Catharsis) చేసి శాంతిని చేకూర్చునను విషయమున మాత్రము ఏకవాక్యత కలదు. కామక్రోధాదులు మానవులందరిలో నుండునట్టి భావములే. కాని ఇవి, ధర్మము, నీతి మొదలైన అంతరంగ నిర్బంధములచేత కట్టబడి యుండును. కాని, వీని యావేగమునునిరోధించుట దేహమునకు, మనస్సునకు, మంచిదికాదు. నాటకములలో వానిని తీవ్రముగా ననుభవించిన, ఇతరులకు హానిచేయకుండ నవి మనలో నుండి తొలగిపోవునని ఈ వాదముయొక్క సారాంశము. కాని, ఈ వాదమును ఖండించినవారు లేకపోలేదు. కాగా, విషాదాంత నాటకములలో, నాటకములోని పాత్రల సుఖదుఃఖములతో మనము తాదాత్మ్యమును పొందెదముగనుక, మనలోని సుఖదుఃఖాదులకొక విధమైన బహిర్గతి కలుగుననియు, దానివలన మనకు చిత్త ప్రసాదనము కలుగుననియు, తుదిపలుకు.

షేక్స్పియర్ మహాకవి వ్రాసిన విషాదాంత నాటకములను వ్యాకరించి చూచినప్పుడు, మనకు కొన్ని ముఖ్య సూత్రములు గోచరించును. అతని నాటకములలోని పాత్రలు తమ జీవితములను, తమ్మాశ్రయించుకొని యున్న వారల జీవితముల నాశనము చేసికొనుటకుగల కారణములను ఈ విధముగా క్రోడీకరింపవచ్చును.

16. 'Tragedy' by F. L. Lucas; page — 13.

(1) నాయకు డుత్తమ పదస్థుడయినను, అరిషడ్వర్గములలో నేదో యొకదానికి; తాత్కాలికముగాగాని; శాశ్వతముగాగాని లోగియుండుట;

(2) ఆతనిలోని హృదయ దౌర్బల్యమునకును, ఉదాత్త భావములకును సంఘర్షణవచ్చి, తాత్కాలికముగనైన దౌర్బల్యము జయించుట;

(3) ఆతని చిత్త సంక్షోభమే, యాతనిని డోలాందోళిత మనస్కునిజేసి, దుష్కార్యాచరణమునకు ప్రేరేపించుట;

(4) ప్రత్యక్ష దృష్టికి ఘోరముగా కన్పట్టని స్వల్పలోపమైనను, ప్రమాదమైనను, నాయకుని జీవితమును విషాదాంతముగా చేయుట;

(5) నాయకునకు సంబంధములేని స్వల్ప కారణము వలనగూడ, నాతడు విధివశమున దుర్గతికి పాలగుట;

(6) శోచనీయమైన ఆతని స్థితికి సభ్యులు జాలిపడి, ఎంతవాని కెంత గతి పట్టినదని విలపించుట ; అనునవి,

విషాదాంత నాటకములలో సాధారణముగా నుండు పరికరమని పెద్ద లందరు నంగీకరించిరి. పైని వివరింపబడిన లక్షణములన్నియు నొక నాటకమున నుండవలెననిగాదు. నాయకుని జీవితము నాశనమగుట కే యొక్కటియైనను చాలును. ఈ దృష్టితో మనము చూచినప్పుడు సంస్కృత నాటకములలో నిట్టి విషాదాంత నాటకము లేల లేవో తెలియును. కేవలము నాయకుని చావున్నంత మాత్రమున నొక నాటకము విషాదాంతముకాదు. జీమూత వాహనుడు గౌరీ వరప్రసాదమువలన బ్రతుకక చనిపోయినచో నాగానంద నాటకము విషాదాంతము కానేరదు. ఆతని మృతికి కారణము జీమూత వాహనుని స్వార్థత్యాగము. ఇది దోషముగా పరిగణింపరాదుగనుక, ఆతడు చనిపోయినట్లు వ్రాసినచో సామాజికుల ధర్మతృష్ణ తీరదు సరిగదా, వారిలో కొందరికి ధర్మముపై ఏవముకూడ జనించును. కనుకనే కవి జీమూతవాహనుని బ్రతికించినాడు. నాటకధర్మములలో నొకటియగు సంభావ్యత (Probability) ఆతని పునర్జీవమునే కోరును. ఇటులకాక ఊరుభంగాది నాటకములు 'మృతి' తోడనే అంత మగును. కాని అవి విషాదాంతములుకావు. ఆ 'మృతి' వలన సామాజికులు భావనిర్భరత తీరిన నిశ్వాసము విడుతురుగాని, దుఃఖపూరిత మైన నిట్టూర్పు విడువరు. ఇది దీని శోధన.

విషాదాంతములగు ఆంగ్లనాటకములలో ఒక్కొక్కప్పుడు నిరపరాధులు శిక్షితులగుటయు కలదు. షేక్స్పియర్ మహాకవి 'కింగ్ లియర్' (King Lear)

నాటకములో (Cordelia) 'కోర్డీలియా' అట్టిది. 'ఒథెల్లో' (Othello) నాటకమందు 'డెస్డిమోనా' మృతియట్టిది. ఇట, మన విషాదమునకు పాత్రములైన పాత్రలు 'కింగ్ లియర్', 'ఒథెల్లో' అనువారు, 'కోర్డీలియా', 'డెస్డిమోనా' లపై మనకు సానుభూతి. ఇట నింకొక ధర్మసూక్ష్మముగూడ కలదు. అధర్మ సంహారమున, ధర్మము తన్నుదాను కొంతత్యాగము చేసికొన్నగాని, పరిపూర్ణజయము ధర్మమునకు కలుగదను గంభీరసత్యము దాగియున్నది.

విషాదాంత నాటకము యొక్క విజయము 'వస్తువు'పై కూడ నాధారపడియున్నది. కథాగమనము కార్యకారణ సంబంధయుతమై యున్నప్పుడే విషాదాంత నాటకము మన హృదయదౌర్బల్యములను పూర్తిగా క్షాళనము చేయగలదు. ఈ యభిప్రాయమునే 'లూకాస్' (F.L. Lucas) ఇట్లు వ్యక్తము చేసెను. **"There shall be nothing which is not clearly caused by what precedes, nothing which is not clearly the cause of what follows."**[17]

నాయకుడు తనకు తెలిసి దోషము చేసినను, తెలియక దోషము చేసినను శిక్షననుభవింపవలెననియు, దోషమును వెన్నంటి శిక్షరూపమున ఫలితము వచ్చుటయే, విషాదాంత నాటకకర్త 'ఇతి వృత్తము' నందు కల్పించునది యనియు 'లూకాస్' (F. L. Lucas) వ్రాసెను.

**"The universe may proceed by law; but it knows no justice. For its laws are those of cause and effect, not of right and wrong."**[18]

ఇంక, విషాదాంత నాటకము యొక్క పాత్రలను గూర్చి వ్రాయుచు ఆవిమర్శకుడే, పాత్రలు సజీవములై యుండి వ్యక్తిత్వము గలిగియుండవలెనని ఇట్లు వ్రాసినాడు.

**"......there is no rule about the character of tragic characters execpt that they must have character; and we can only add that not wickedness, but weakness, remains the hardest of all human qualities to make dramatic."**[19]

శ్రీ ఆచార్యులుగారు వ్రాసిన విషాద సారంగధర నాటకములో; పాశ్చాత్య నాటకములలో నాయకునిలో నుండు లోపములవంటి వానిని కొన్నింటిని; సారంగధరునియందు మనము చూడవచ్చును. ఇందు మొట్ట

17. 'Tragedy' by F. L. Lucas. page — 75.
18. Ibidem. page — 105.
19. Ibidem. page — 110.

మొదటిది ఆతని 'ధర్మమూర్ఖత'. రెండవది యువకుడైన ఆతనిలో మిగిలియున్న పావురముల యాటయందలి చాపల్యము.[20] సుబుద్ధి ఎన్నిసారులు చెప్పినను సారంగధరున కా ఆటయందలి మక్కువ పోలేదు. ఇది, పల్నాటివీరుడైన బాలచంద్రుని బొంగరముల యాటవంటిది. దానివలెనే యిదియు చెడ్డపరిణామములకు దారితీసినది.

సారంగధరుడు, 'ధర్మమూర్ఖత' వలననే అపాయమును బొందెను. "నన్ను నీ విటు వెలార్చుట కాలాహిఫాలముఁ ద్రొక్కుటయగు! కడ తేఱఁజాలవు! సాహసమున నీకుఁ బ్రాణాపాయము న్బొసగింతు"[21] నని, తన్ను సారంగధరు డొల్లనందులకు కినిసి చిత్రాంగి పలుకగా; సారంగధరుడు, "నీవే చెడుకాలము కలిమి నేదేని బొంకుఘటించిన నాకేమి యపాయము గలుగఁ గలదో చూచెదఁగాక! నీవేమి చేయగలవో చూచెదఁగాక! ధర్మమున కట్టి దుస్థితి కలుగఁగలదేమో చూచెదఁగాక"![22] అని పల్కెను. ధర్మనిరతుడైన సారంగధరుడట్లు పలుకుటలో వింతలేదు. కాని, ఆమెను తృణీకరించి వచ్చిన తరువాత, తన జాగరూకతలో తా నుండవలెనను లోకజ్ఞానమైన లేనివానివలె ప్రవర్తించెను. న్యాయస్థానమున నోరు కదల్పక, అన్నియు చిత్రాంగి నడిగి తెలిసికొనుడని పల్కెను. ఇదియు అనుభవశూన్యతనే తెల్పును. ఇంక, సుబుద్ధియో తాను సారంగధరుని చేతిలోచేయివేసి ప్రమాణము చేసినందు వలన, మిత్రుని మృతిని చూచుచు నూరకుండును గాని రాజుతో సత్యము చెప్పడు. పిచ్చివానివలె నటించును. ఈ పిచ్చి, హేమ్లెట్ (Hamlet) యొక్క పిచ్చిని తలపించుచున్నది. సారంగధరునియొక్క, సుబుద్ధియొక్క ఈ లోపములకు తోడు, విధికూడ సారంగధరునకు విరుద్ధముగా పనిచేసెను. సత్యమును గ్రహించినరాజు, సారంగధరుని శిక్షను నిలుపుచేయుడని ఆజ్ఞాపత్రముతో సేవకుని పంపును. కాని, ఆ సేవకునకు అడవిలో దారి తెలియకుండుటచే, ఆలస్యమయి, సారంగధరుడు శిక్షను పొందిన తరువాత; ఆస్థానమును చేరును. ఇది విధివిలాసము. సారంగధరునకు కన్యలను వెమకుపనికై నియోగింపబడిన

---

20. "నీతిజ్ఞ - నయార్ణవా: మనరాజున కింకను మృగయావ్యసనము విడువలేదు."
"నయా- ఇదియొక పిచ్చి. ఇతనికిది. సారంగధరునకుఁ బావురములపిచ్చి."
(ప్రథమాంకము; ప్రథమరంగము)

21. విషాద సారంగధర నాటకము. (1926) పుట - 25.

22. Ibidem. పుట - 27.

విభావసుడను నాతడు, చిత్రాంగి సారంగధరునే వలచినదని ఎఱుంగును. ఆ మాట నామె, సారంగధరుని చెవిని వేయుమనినదికూడ. కాని వేయివరహాలు లభించుటతోడనే ఆతడిది మరచిపోయెను.[23] ఇది మరువకున్నచో రాజరాజు చంద్రకళను, సారంగధరుడు చిత్రాంగిని పరిణయమాడి యుండెడివారేమో! రాజరాజునకు వారిరువురు తన యంతఃపురమున నుండవలెనను భావమే కాని మిగిలినదేదియులేదు. ఈ విషయములను గూర్చి శ్రీ ఆచార్యులుగారే నాటకమందలి ఉపోద్ఘాతమున నిట్లు వ్రాసిరి.

"సారంగధరుని వివాహము కొఱకు రాకన్నియలఁజూచి వారి రూప పటములఁ గొనివచ్చుటకు దేశదేశములకు బ్రాహ్మణుల రాజు పంపుటయు హిరణ్యుఁడును విభావసుఁడును గ్రమముగాఁజంద్రకళయొక్కయు, చిత్రాంగి యొక్కయుఁ బటములఁ దెచ్చుటయుఁ, ఆ రెండురూపముల సౌందర్యాతి శయమునఁ దారతమ్యము విమర్శింపరాక యా యిరువురు దనయింట నుండు టకై సారంగధరునకుఁ జంద్రకళను వివాహముచేసి చిత్రాంగిని రాజు తానే పెండ్లియాడుటయు, చిత్రాంగి సారంగధరుని మోహించియుండినను, రాజున కాంతరితుఁడైన తన తండ్రిమాట మీఱఁజాలక రాజరాజుం బరిణయ మాడుటయు ... విశదపడు. చిత్రాంగి మోహము విభావసుఁడెఱిగియుండియు రాజరాజునకుగాని సారంగధరునకుగాని యా వార్త యెఱింగింపకుండుట వలన మహానర్థము ప్రాప్తించుట విస్పష్టమగు. ఈ కథవలనఁ జిత్రాంగి దుర్మోహ మున కించుక క్షమాపణ గలిగెడి"

ఇటుల, సారంగధరుని నాశమునకు—ఆతనికిగల పావురముల యాట యందలిపిచ్చి, 'ధర్మమూర్ఖత,' విధివిలాసము; తోడ్పడెను. చిన్నలోపమైనను నాయకునియం దుండినట్లు చెప్పి, యదివాని పతనహేతువైనదని కార్యకారణ

---

23. "విభావసుఁడు—అయిన నాకొక్కటి మాత్రము చింతాకరముగానున్నది. మనము తీసికొనిపోయిన చిత్రపటము జూచినది మొదలు చిత్రాంగి సారంగధరునే భావించియున్నది. నన్ను రహస్యముగాఁ బిలిపించి తన మనవి సారంగధరుని కెంతెంతో చెప్పుమన్నది. నిన్ను గా కింకొక్కనిఁ బతిగాఁ బడయనని విన్నవింపుమన్నది. ఆమె కెంత ఆశాభంగము గలిగెను!"

"హిరణ్యుఁడు— మఱి నీవు సారంగధరునితో నిది చెప్పితివా?"

"విభావసుఁడు— వల్లకాఁడు. వేయి వరహాల సంభ్రమమువనే నా ప్రౌఢంతయుఁ బోయినది."

(విషాద సారంగధర నాటకము - పూర్వరంగము.)

సంబంధమును జూపుట విషాదాంత నాటకలక్షణము. షేక్స్పియర్ నాటకము లలో— హేమ్లెట్ యొక్క 'అనిశ్చితత్వము'; ఒథెల్లో యొక్క 'సంశయాత్మ'; లియర్ యొక్క 'స్తోత్ర ప్రియత్వము'; మేక్బెత్ యొక్క 'దురాశ'; రోమియో జూలియట్టుల 'సంభ్రమము'; వారివారి వినాశములకు దారితీసినట్లే; సారంగ ధరుని లోపములు—స్వల్పములైనను—వాని నాశమునకు దారితీసెను.

చిత్రాంగి హృదయములో మంచిచెడ్డలకగు సంఘర్షణ ఆ పాత్రకు వన్నె తెచ్చెను. ప్రపంచములో అన్నియు మంచిగుణములే కలవారుండనట్లు, అన్నియు చెడ్డగుణములు కలవారు నుండరు. చిత్రాంగికూడ నట్టిదేయని ధ్వనింపజేసి ఆమె దోషమును కొంతతగ్గించుటకు కవి ప్రయత్నించెను. ఆమె ఆత్మగతములు మొదలగునవి 'లేడీమేక్బెత్' (Lady Macbeth) యొక్క స్వగతాదులను జ్ఞప్తికి తెచ్చుచున్నవి.

ఇట్లు విషాద సారంగధర నాటకమును పరిశీలించి చూడగా, నిందు ఆంగ్ల విషాదాంత నాటకముల పోలికలు; నాటక దేహబంధమునందును, పాత్రచిత్రణాదులయందును కలవని తేలుచున్నది.

శ్రీ వీరేశలింగం పంతులుగారి సమకాలికులలో నాటక కర్తగా, కవిగా పేరొందిన వారిలో శ్రీ వడ్డాది సుబ్బారాయ (1854-1938) కవిగా రొకరు. వీరు కొన్ని ఆంధ్రీకరణములను, స్వతంత్ర నాటకములనుగూడ రచించిరి. వీరి సంస్కృత నాటకములలో వేణీసంహారమునకు మిక్కిలి పేరు వచ్చినది. సంస్కృతములోని భట్టనారాయణుని ప్రౌఢోక్తి వీరి ఆంధ్రీకరణమున చక్కగ వచ్చినదని పేరు వచ్చెను. స్వతంత్ర నాటకములలో చండకౌశికాది నాటకములకు పేరు వచ్చినది. ఆంగ్ల సాహిత్యముతో వీరికి పరిచయమున్నను, ఆ సాహిత్య ప్రభావము పడినదని నిష్కర్షగ చెప్పదగిన నాటకము వీరిది లేదు. స్వతంత్ర నాటకములలో; అంకములను రంగములుగా విభజించుట మొదలగు పాశ్చాత్య నాటకముల సామాన్య ధర్మములు కన్పట్టుచున్నవి.

శ్రీ ధర్మవరము రామకృష్ణమాచార్యులుగారి వలెనే బళ్ళారి వాస్తవ్యులయి పదులకొలది నాటకములను రచించి ప్రఖ్యాతి పొందినవారు శ్రీ కోలాచలము శ్రీనివాసరావుగారు (1854-1919). వీరికిని రామకృష్ణమాచార్యులు గారికినిగల ముఖ్య భేదము విషాదాంత నాటకరచనా విషయమున. శ్రీనివాసరావుగారికి విషాదాంత నాటకములన్న అనిష్టము. కాని వీరును కొన్ని విషాదాంత నాటకములను రచించిరి. వీరు మొత్తము 'ఇరువది ఎనిమిది'

నాటకములను రచించిరి. ఇందు 'రామరాజు చరిత్ర' ప్రఖ్యాతి పొందినది. దాని తరువాత—సీమంతినీ నాటకము (1899 మొదటికూర్పు); సీతా కల్యాణము (1922 మొదటికూర్పు); బభ్రువాహన నాటకము (1923 మొదటి కూర్పు); శిరోమణి నాటకము (1925 మొదటికూర్పు); లంకాదహన నాటకము (1924 మొదటికూర్పు); కీచకవధ లేక సైరంధ్రి (1924 మొదటి కూర్పు); సునందినీ పరిణయ నాటకము (1924 నాల్గవకూర్పు); మానాపమాన నాటకము (1925 మొదటికూర్పు); శ్రీ మదాలసా నాటకము (1926 రెండవకూర్పు); శ్రీ మైసూరు రాజ్యము (1925 మొదటికూర్పు); ప్రహ్లాద నాటకము లేక దానవవధ (1920 మొదటికూర్పు); శ్రీ చంద్రగిర్యభ్యుదయము (1925); మొదలయిన నాటకములు రంగస్థలమున ప్రదర్శింపబడెను. వీరును కొన్ని నాటకములలో నటించుటయు కలదట.

ఆంగ్ల సాహిత్యముతో వీరికి గాఢమైన పరిచయముండుటయేగాక, ఆ భాషలో 'ప్రపంచనాటక చరిత్ర'ను రచించిన మనీషి. ఈ విషయము, వారి మృతి తరువాత ముద్రింపబడిన బభ్రువాహననాటక విజ్ఞప్తియం దిట్లు చెప్పబడినది. "ఆంగ్లేయభాషయందుఁ బ్రపంచనాటక చరిత్రనే రచించిన మహాశయుని నాటకానుభవమిట్టిదని వ్రాయఁబూనుటకంటె నూహింప విడుచుటమేలు."

దేశకాలపాత్రానుసారము నాటకరచనలో క్రొత్త తీరుతెన్నులేర్పడు ననియు వానిని పరిగ్రహించుట లగ్గుకాని ఎగ్గుకాదనియు వీరి యభిప్రాయము. దీనిని వీరు తమ 'సీమంతినీనాటక' ప్రస్తావనలో (1899) నిట్లు తెలిపిరి. "ఆధునిక కవులు పురాతన నాటకంబులు శోధించి స్వారస్యము గ్రహించి, స్వానుభవముచే మించి నాటకంబులు రచియింతురు. కాలానుగుణంబుగఁ గొన్ని పూర్వాచారములను త్యజించినను నది యొక సుగుణముగానే మనము గ్రహింపనగును."

ఈ కవి విషాదాంత మోదాంత నాటకముల విషయమున తనకుగల యభిప్రాయములను నిష్కర్షగ, నిశితముగ నిట్లు 'మానాపమాన నాటకము'న వ్రాసెను.

"షేక్స్పియరు కాలమున గంభీరనాటకము (Tragedy) లెటు తలయెత్తెనో యదేరీతిగ 'బెన్‌జాన్సన్' యను కవి మోదాంత నాటకములకు గలశమెత్తెను. ఈవిషయమును నాచేఁ వ్రాయబడిన **'The Dramatic History of the World'** లో చూడనగును."

"యూరోపియన్ భాషలలోఁ బేరందిన మోదాంతనాటకములు విశేషముగ నేఁ జదివినాను. వానిలో దేనికిని నీ 'మానాపమాన నాటకము' తల వంచునదికాదు. అచటనచట వన్నె హెచ్చింపజేసినదనియే నా తాత్పర్యము. అడిసన్[24] గారి The Rivals, The School of Scandle యను నాటకము లందుగల సంభాషణ మతి రమ్యమని పండితుల తాత్పర్యము. ప్రస్తుత నాటక సంభాషణ మతి స్తుత్యముగ నున్నది."

"....మనవారు ఇతరదేశస్థుల గ్రంథములను జూడరు. చదువరు. అందులో నుండు స్వారస్యమును గ్రహింపరు. అటువలెనే తా మొనరింప యత్నింపరు. ఇటులైన నాటక భాషాభివృద్ధి యెటులగును? గంభీరనాటకములలో భాష యెటులుండవలెను, మోదాంత నాటకభాష యెటులుండవలె నను తారతమ్య మెట్లు దెలియవచ్చును?"

ఈ కవి మానాపమాన నాటకము నింతగా మెచ్చుకొన్నను, తెలుగు సాహిత్యములో దానిస్థానము అనువాద నాటకమునకున్న స్థానముమాత్రమే. దీనిని శ్రీనివాసరావుగారు 'బాలగంధర్వ' నాటక కంపెనీవా రాడిన మహారాష్ట్రి నాటకమునుండి యనువదించిరి. మూలగ్రంథకర్త 'కృష్ణాజి ప్రభాకర్ ఖాడీల్కర్'. ఇది "గృహకృత్య సాంబంధిక మోదాంత నాటకము" (Domestic Drama). ఈ నాటకమును రచించిన మూలకర్త, ఆంగ్లనాటక కర్తయైన 'షెరిడన్' మొదలయినవారి నాటకములను చదివియే తన నాటకమును రచించెను. ఈ విధముగా తెలుగునాటకము "మూలమునకు రెండంతరువుల దిగువను" ("Twice removed from the original") కలదనవచ్చును.

శ్రీనివాసరావుగారి పౌరాణిక నాటకముల కన్న చారిత్రక నాటకములు మిన్నలు. ఇందు వీరు పాత్రపోషణ విధానమున, రంగ నిర్వహణమున షేక్స్పియర్ మొదలైన కవుల ననుకరించిరి. ఈ యనుకరణము భావానుకరణముగాక, నిర్మాణమునకు సంబంధించిన యనుకరణము. అంకమును రంగాదులుగ విభజించుట, దీర్ఘ స్వగతములు, మొదలగు వాని విషయమున పాశ్చాత్యనాటక పద్ధతులనే యనుసరించినను, ఆ వాఙ్మయవిషయమున వారికి గల పరిచయమునకు తగిన నాటకము వ్రాయలేదు.

---

24. The Rivals, The School for Scandal అను నాటకములను రచించిన నాటకకర్త 'షెరిడన్' గాని 'అడిసన్' కాదు. ఇది ప్రమాద పతితము.

"అల్పదోషమైనా కావ్యమందు సహించక విమర్శచేసేటప్పుడు యముని కన్న ఎక్కువ నిర్ఘృణుఁడని పేరుపొందిన పండితు"డని శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారిచే కీర్తింపబడిన శ్రీ కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు (1863-1940) విమర్శకునిగా, నాటకకర్తకంటె ఎక్కువ పేరు సంపాదించిరి. సంస్కృతాంధ్రాంగ్లములలో నిశితమైన పాండిత్యముగల వీరు, సంఘములోని కొన్ని దురాచారములను నిరసించు సాంఘిక నాటకములను వ్రాసిరి. అట్టివానిలో 'మంగతాయి' (1926 మొదటి కూర్పు) అనునది ప్రఖ్యాతికి వచ్చెను.

ఈ నాటకమునుగూర్చి వారు పీఠికలో; "మనలో సాంఘిక స్థితిగతులఁ జిత్రించురూపకములు తక్కువగనున్నవి. కాన, వాని వ్యక్తీకరించు రూపకము వ్రాయఁదలచితిని......వేశ్యాసాంగత్యమునందలి నష్టములను సువ్యక్తము చేయనెంచి విలాసికయను నీ రూపకవిశేషమును విరచించితిని;" అని వ్రాసిరి. ఇది ఏకాంకముగలది. రంగములు పందొమ్మిది. కాని, నాందీ ప్రస్తావనలు కలవు. నాటక శరీరమునకు సంబంధించిన విషయమిది. వర్ణనలు మొదలయినవి నవ్యముగా నున్నవి. నాయికను వర్ణించు ఘట్టమున కవి "అన్ని వడ్డించిన యనంటి యాకు వీపు" అని వ్రాసెను ఇది ఆంగ్లసాహిత్యములోని ఏ నాటకమును పూర్ణముగ పోలియుండకున్నను; నవీన సంస్కారమును ప్రదర్శించునదియే యీ నాటకము. నాయికయైన 'మంగతాయి' సంగీతమును వినుచు, రసికశేఖరుడు, ఆరవ రంగములో నిట్లనును.

"The man that hath no music in himself,
Nor is not moved with concord of sweet sounds,
Is fit for treasons, stratagems and spoils."

పై విధముగా షేక్స్పియర్ మహాకవిని ఉదాహరించుటయేగాక, ఆంగ్ల శబ్దములను పద్యములందు కూర్చుటయు కలదు. "వేశ్యలందు గలుగు మోజు, వేడ్కసేయనౌ డిసీజు" అని యొకచో కవికూర్చెను. ఇట్లు బ్రహ్మయ్యశాస్త్రి గారు చమత్కారముగా తమరచనను చేసిరి.

తెలుగు భాషలోనేగాక, హిందూస్థానీ భాషలోను పెక్కు నాటకములు వ్రాసి సమకాలమువారి మెప్పు లందినవారిలో శ్రీ నాదెళ్ళ పురుషోత్తమకవిగా రొకరు (1863-1938). వీరు శతాధిక గ్రంథకర్తలు. వీరి నాటకములలో 'చంద్రహాస చరిత్రము' వన్నె కెక్కినది. దీని పీఠికయందు కవి తన సాహిత్య కృషి నిట్లు పేర్కొనెను. "నా 16 వ యేటను 'అహల్యా

సంక్రందన' నాటకమును రచించితిని. ఆ మరు సంవత్సరము 1880 లో నది ముద్రింపఁబడినది...1884 మొదలు 1886 వఱకు బందరు నేషనల్ థియేట్రికల్ సొసైటీవారి ప్రేరణమున 'హిందూస్థానీ' భాషలో 32 నాటకములు వ్రాసి వారి కిచ్చితిని. వా రవి 10, 15 ఏండ్లు పలుమా అనేకపురములందుఁ బ్రదర్శించి పొగడ్తలుగాంచిరి. తత్సమాజ సంబంధికుల కోర్కెల ననుసరించి 1892 దర్మిలాను హరిశ్చంద్ర నాటకము, పారిజాతాపహరణము, సారంగధర నాటకము, ద్రౌపదీ వస్త్రాపహరణము, చంద్రహాస చరిత్రము నని ఆ తెలుగు నాటకములు వ్రాసి వారి కిచ్చితి..." ఇట్టి కృషి చేసిన తెలుగు నాటకకర్త యింకొకడు లేడు. పాశ్చాత్య నాటక సామాన్య ధర్మములగు, అంకములను రంగములుగా విభజించుట మొదలయినవి వీ రనుసరించిరిగాని, ఆంగ్ల నాటక భావానుసరణము అంతగా చేయలేదు.

హాస్య రచయితగా, నాటక కవిగా యావదాంధ్ర విఖ్యాతిని పొందిన శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు (1865-1940) సంస్కృతాంగ్ల నాటక సంప్రదాయములను బాగుగా జీర్ణము చేసికొని, పౌరాణిక, సాంఘిక చారిత్రక నాటకములను వ్రాసినారు. రాముని నాయకునిగా చేసికొని— కల్యాణ రాఘవము, పట్టభంగ రాఘవము, వనవాస రాఘవము, విజయ రాఘవము అను నాలుగు నాటకములను వీరు రచించిరి. శ్రీకృష్ణుని నాయకునిగా చేసికొని రాధాకృష్ణ నాటకమును రచించిరి. సారంగధర, నర్మదాపురుకుత్సీయము, విప్రనారాయణ అను రూపకములనుగూడ నేర్పుతో రచించిరి. ప్రచండ చాణక్యము, చూడామణి, బుద్ధబోధసుధ, అను చారిత్రక నాటకములను రచించిరి. కోకిల, సరస్వతి, పూర్ణిమ, సరోజిని, వీరమతి, మాలతీమాల, రాతిస్తంభము, వృద్ధవివాహము, కంఠాభరణము మొదలయిన సాంఘికనాటకములను రచించిరి. సమర్థతతో వీ రిన్ని నాటకములను రచించిరి గనుకనే వీరికి ఆంధ్రప్రజలు 'ఆంధ్ర కాళిదాసు', 'అభినవ షేక్స్పియరు' అను గౌరవవాచకములైన బిరుదులిచ్చిరి. పౌరాణిక నాటకములలో వారు' ఆంధ్ర కాళిదాస' బిరుదమును; చారిత్రక సాంఘిక నాటకములలో వారు 'అభినవ షేక్స్పియరు' బిరుదమును సార్థకము చేసికొనినారు. అన్నివిధములైన నాటకములయందును రచనా శిల్పమున సమానమైన ప్రతిభనే చూపినారు.

ఇప్పుడు, వీరికిగల 'రెండవబిరుదు', మన పరిశీలనకు వలసినది. వీరి నాటక రచనమునకు గురుపీఠమును అధిష్ఠించియున్న రెండు సంప్రదాయ

ములలో — ఆంగ్లనాటక, సంస్కృత నాటక సంప్రదాయములు—రెండవది. వీరి సాంఘికచారిత్రక నాటకములలో సార్థకత చెందినదని వ్రాసితిని. పాశ్చాత్య నాటకములనుండి అందరును ఎరువు తెచ్చుకొన్న సామాన్యవిషయములను విసర్జించిన తరువాత, వీరి నాటకములలో కనవచ్చు ఆంగ్లనాటకానుసరణ ములను మనము పరిశీలింపవలసి యున్నది.

వీరి సాంఘిక నాటకములలో కోకిల, సరస్వతి అను వానిలో షేక్స్పి యర్ యొక్క కథాకల్పనా నైపుణ్యము, రసవద్రచన కన్పట్టును. ఈ నాటక ములలో, షేక్స్పియర్ రచించిన **Mid - Summer Night's Dream; Twelfth Night; Comedy of Errors** నాటకములలోని హాస్య సంభాషణ, అతిలోక సౌందర్యమును జ్ఞప్తికి దెచ్చు రమ్య పద్యరచన, కలదు. ఆంగ్ల మహాకవియగు షేక్స్పియర్ కేవల నాటక ర్తకాదు; కవిగూడ. ఇట్టి ప్రతిభకు ఛాయయనదగు ప్రజ్ఞకల శ్రీ పానుగంటివారు, తమ నాటకములలో; ఆంగ్ల నాటకములలోని శబ్దలాలిత్యము, అర్థసౌకుమార్యము, భావబంధురత చాల వరకు సాధింపగలిగిరి.

వీరి నాటకములలో షేక్స్పియర్ నాటకములతీరు ననుసరించినది 'ప్రచండ చాణక్యము' అను నాటకము. ఇది 1909 జనవరిలో వెలువడినది. కథాసంవిధానమునను, సన్నివేశ నిర్వహణమునను, లౌకికానుభవములను సూత్రప్రాయముగ చెప్పుటయందును, శ్రీ పానుగంటికవి, షేక్స్పియర్ ననుస రించెను. ఈ నాటకములో మగధాధిపతియైన నందుడు, చెలికాడయిన వసంతుని చెప్పుడుమాటలను విని చాణుక్యునిపై క్రోధమును పెంచుకొనును. ఈ సందర్భ మున కవియొక్క రచన; 'ఒథెల్లో' **(Othello)** నాటకములో, 'అయాగో' **(Iago)** తనమాటలవలన, 'క్యాసియో' **(Cassio)** పై 'ఒథెల్లో' కు ఈర్ష్య పుట్టించునట్టి సందర్భమును జ్ఞప్తికి తెచ్చుచున్నది.

ప్రచండ చాణక్యములోని కథాకల్పనకును, 'ఒథెల్లో' నాటకములోని కథాకల్పనకును కొంచెము పోలికగలదు. మగధరాజైన నందుడు, చాణుక్యుని చాల గౌరవించుచుండును. ఆరాజునకు రాక్షసుడు ప్రథమమంత్రి. చాణుక్యుడు ద్వితీయమంత్రి. ఆతని ప్రథమభార్య సునంద, భోగస్త్రీ మురి. మురయొక్క కుమారుడైన చంద్రగుప్తుడు రాజగునని ఒక జ్యోతిష్కుడు చెప్పగానే సునందకు ఈర్ష్యకల్గును. ఆమె, మురా చంద్రగుప్తుల నెట్లు వదలించుకొనుటయా యని ఆలోచించి ప్రథమమంత్రి యగు రాక్షసునితో నీ విషయమై సంప్రతించును.

చాణుక్యు నెట్లైన వదలించుకొనవలెనని తలంచుచున్న రాక్షసుడు, మురా చాణక్యులకు కామసంబంధము గలదని రాజునకు నచ్చజెప్పినచో రాజు మురా చాణక్య చంద్రగుప్తులను వెడలగొట్టుననియు, దానివలన సునందకు సపత్ని తప్పుటయు, ఆమె కుమారుడైన నందుడే రాజ్యమునకు వచ్చుటయు జరుగుననియు రాక్షసుడు పల్కును. ఈ యుక్తి నందరు మెత్తురు. రాజుతో ఈ విషయము వ్యంగ్యముగా చెప్పుటకు వసంతుని నియోగింతురు. రాజునకింకను నమ్మకము కలిగించుటకై, రాజు మురకిచ్చిన బంగారు గాజులను, ఆమెకు తెలియకుండ నపహరించి చాణక్యుని పెట్టెలో పెట్టెదరు. రాజు వసంతుని మాటలను నమ్మి మురా చాణక్య చంద్రగుప్తులను పరాభవించి, దేశబహిష్కార శిక్ష విధించును. ఇంక మిగిలిన కథయంతయు ముద్రారాక్షస కథనే పోలియుండును.

ఇంతవరకు ఈ కథ, 'ఒథెల్లో' లోని కథను ప్రాథమిక విషయములలో పోలియున్నది. 'అయాగో', 'ఒథెల్లో' మనస్సును 'డెస్డిమోనా' విషయమున, విరిచివేయును. 'డెస్డిమోనా'కు 'క్యాసియో' తోగల గౌరవ పరిచయమును, 'అయాగో' అపార్థస్ఫూర్తి కలుగునట్లు 'ఒథెల్లో'కు చమత్కారముగ చెప్పును. 'అయాగో' విషవాక్యములవలన క్రమ క్రమముగా; ఒథెల్లోకు తన మిత్రుడైన 'క్యాసియో'పైని, తన ప్రేయసియైన 'డెస్డిమోనా'పైని నమ్మకము తగ్గిపోవును, 'డెస్డిమోనా' యొక్క రుమాలు, బయటపడకూడని సమయమున బయల్పడి, నాటకము యొక్క క్రమము నంతటిని మార్చి, దానిని విషాదాంతముగ చేయును. ప్రచండ చాణక్య నాటకము కొన్ని ఆయువుపట్టులవంటి కథా సన్నివేశములను, ఆంగ్లనాటకమైన 'ఒథెల్లో' నుండి స్వీకరించెను. వసంతుడు 'అయాగో'ను పోలును. మురగాజులు, 'డెస్టిమోనా' రుమాలునుపోలును.

'ఒథెల్లో' యొక్క ఆశ్రయము పోయిన 'క్యాసియో' సదయహృదయుడై పోయి; తన పక్షమున కృషిచేసి, 'ఒథెల్లో'కెట్లయిన తనపైనిపూర్వమున్న ఆదరమును సంపాదించి పెట్టవలెనని 'డెస్డిమోనా' ను ప్రార్థించును. నిర్మలచరితయగు నామె అందులకంగీకరించును. ఈ విషయమై వీరు సంభాషించుట దూరమునుండి 'అయాగో', 'ఒథెల్లో'లు చూతురు. ఆ సమయమున నర్మగర్భముగ మాటాడి 'అయాగో' 'ఒథెల్లో' హృదయమున సంశయ బీజమును నాటును. ఆంగ్ల నాటకములో నిదియంతయు మూడవ అంకములో మూడవ రంగమున జరుగును. ఇది ఒక్క రంగముగనే రచింపబడినను దీనియందు ఆరు

రంగములున్నవని తలంపవచ్చునని పాశ్చాత్య విమర్శకులందురు. ఈ నాటకమునకు ప్రాణమైన రంగమిది. ఇందే 'అయాగో' తనవాక్చాతుర్యముచేత 'ఒథెల్లో' మనసు విరిచి, ఆతనిని దుష్కృత్యమునకు ప్రేరేపించును. (**The Temptation Scene**). తెలుగు నాటకములోనిది ప్రథమాంకమున నగును.

తృతీయాంకములోని మూడవ రంగమున 'అయాగో' ద్రోహము క్రమపరిణామము నెట్లు పొందెనో, 'క్యాసియో'పై 'ఒథెల్లో' వీరునకు కోపమును, ప్రియురాలైన 'డెస్డిమోనా' శీలముపై శంకయు నెట్లు సోపాన క్రమమున నభివృద్ధిపొందినదియో షేక్స్పియర్ మహాప్రతిభతో చిత్రించెను. ఈ రంగమును ఆరు లఘు ఘట్టములుగ విభజింపవచ్చునంటిని. 'ఒథెల్లో' హృదయమందలి సంశయక్రోధము లెట్లు సోపానమార్గమున ఈ నిశ్రేణిక నెక్కి, అంత ఎత్తునుండి బేలయైన 'డెస్డిమోనా' పైని, విహితుడైన 'క్యాసియో' పైని ఎట్లు విరుచుకొనిపడెనో, ఈ రంగమున ప్రదర్శితమైనది.

(1) తన చెలియగు 'ఎమీలియా' ప్రోత్సాహమునను, తనకు 'క్యాసియో' యందు గల అభిమానమునను, తనయందు 'ఒథెల్లో' కు గల ప్రేమను ప్రదర్శింపవలెనను దర్పమునను 'డెస్డిమోనా' ఏకాంతముగ 'క్యాసియో'ను కలిసికొనుటకు అంగీకరించినది, మొదటిఘట్టము. అయాచితముగ వచ్చిన ఈ అవకాశమును, 'అయాగో' చక్కగా వినియోగించుకొనెను. "**Ha ! I like not that**" అని ఆకస్మికముగా నని 'అయాగో' వెంటనే 'ఒథెల్లో' హృదయమున సంశయ బీజము వేసెను.

(2) 'ఒథెల్లో' ఈ మాటలను అంతగా పట్టించుకొనలేదు. కాని, తనను చూచి 'క్యాసియో' చల్లగా జారిపోవుట, ఆతనిని గూర్చి 'డెస్డిమోనా' గట్టిగా ప్రార్థించుట, 'ఒథెల్లో' వీరునకు నచ్చలేదు. ఇది రెండవ ఘట్టము.

(3) 'అయాగో' మొట్టమొదటిసారి, అందరు వెడలిపోయిన తరువాత 'ఒథెల్లో'ను కలిసి మాటాడును. 'అయాగో' తన కుత్సిత శక్తిని పూర్ణముగా వినియోగించి, 'ఒథెల్లో' హృదయమును కలంచును. 'డెస్డిమోనా'తో మాటాడుచున్న 'క్యాసియో' వారి రాకను చూచి జారిపోవుట, ఆతనికి పూర్వమునుండియు 'డెస్డిమోనా' తోడి పరిచయముండుటయను విషయములను గ్రహించి, ఏదియో చెప్పకూడనిది యున్నట్లును, కాని తన హృదయము కలగుండు వడుచున్నట్లును నటించుచు శీలము ధనముకంటె నధికమను వాక్యముల నిట్లు పలుకును.

"Good name in man and woman, dear my Lord,
Is the immediate jewel of their souls :
Who steals my purse steals trash ; 't is something, nothing,
'T was mine, 't is his, and has been slave to thousands,
But he that filches from me my good name,
Robs me of that which not enriches him,
And makes me poor indeed."

ఇట్లు పలికి, ఒథెల్లో హృదయమునందు కోపమును రగుల్కొల్పును. తరువాత వెనీసుస్త్రీల మోసమునుగూర్చియు, 'డెస్డిమోన' తన తండ్రిని మోసము చేయుటనుగూర్చియు, 'డెస్డిమోనా' తనజాతివారి నొల్లక 'ఒథెల్లో'ను వివాహమాడుటను గూర్చియు, వ్యంగ్యముగా పల్కును. ఇంక 'ఒథెల్లో' మనస్సు మనస్సులో లేకుండపోయినది. ఇది మూడవ ఘట్టము.

(4) మనోవేదనవలన కలిగిన శిరోవేదనవలన బాధపడుచున్న 'ఒథెల్లో'ను 'డెస్డిమోనా' సమీపించి, ఆతనికి విందునుగూర్చి జ్ఞప్తికి తెచ్చును. ఆతడు, "I have a pain upon my forehead here" అని చెప్పగానే, ఆమె తన రుమాలుతో నతని తలకు కట్టుకట్ట నెంచును. అది చాలదు. వెంటనే ఒథెల్లో, "your napkin is too little:" అని పల్కును. అది క్రింద పడిపోవును. ఒథెల్లో, "Let it alone. Come, I'll go in with you", అని లోనికి పోవును. తన భర్తను మెప్పించుటకు 'ఎమీలియా' దానిని గ్రహించి 'అయాగో' కిచ్చును. 'అయాగో' కిది, మేఘములేని వృష్టియగును. తరువాత నంతయు నాతనికి సులభమే. ఆ రుమాలు క్రిందపడుట, విధి ప్రేరణము.[25] విషాదాంత నాటకముల కట్టి ప్రేరణము సామాన్యమే.

(5) ఈ ఘట్టములో 'అయాగో' తనభార్య తెచ్చియిచ్చిన రుమాలు గ్రహించును. కుత్సితుడైన ఆతని ఆనందార్ణవమునకు అవధిలేదు.

(6) ఈ ఘట్టములో 'డెస్డిమోనా' జీవితముపై పిడుగుపడును. 'ఒథెల్లో' తన మిత్రుడైన 'క్యాసియో'ను చంప నాజ్ఞాపించును. 'అయాగో' మెల్లిగా 'క్యాసియో' స్థాన మాక్రమించును. తరువాత, ఈ రంగములోని నిర్ణయము లమలులోనికి వచ్చుటయే మిగిలిన అంకములలోని కథ.

'ప్రచండ చాణక్యము' నందు 'ఒథెల్లో' నాటకములో 'అయాగో' చేసిన పనిని వసంతుడు చేయును. 'క్యాసియో'తో ఏకాంత భాషణము చేయుచు

25. "The resort to the handkerchief is brought about very simply and naturally, but the dropping of it is a pure accident, a part of Iago's fabulous good luck, hardly better motived than the exchange of rapiers in Hamlet."
—C. H. Herford.

'డెస్డిమోనా' కనబడినట్లు, మురఇంటికి పోవుచు చాణక్యుడు కనంబడెనని వసంతకుడు నందరాజుతో చెప్పును. దీనివలన నందరాజునకు సంశయము కలుగును. కుమారునకు మహాయోగము పట్టనున్నదని దైవజ్ఞుడు చెప్పిన వెంటనే మురి, నంద మహారాజు తనకిచ్చిన గాజులను సవతి యింటిలో మరచి పోయి, సంతోషముతో స్వగృహమునకు పోవును. 'డెస్డిమోనా' యొక్క రుమాలును 'అయాగో' వినియోగించినట్లు, ఈ గాజులను 'మురి'పై నేరారోపణము చేయుటకు వసంతుడు వినియోగించును. ఆంగ్ల నాటకములో 'క్యాసియో, డెస్డిమోనా'లు 'ఒథెల్లో' యొక్క ప్రేమకు దూరమగుదురు. తరువాత 'డెస్డిమోనా' చంపబడుట, 'క్యాసియో' క్షతగాత్రుడగుట జరుగును. ప్రచండ చాణక్యమునందు మురా చాణక్య చంద్రగుప్తులు దేశ బహిష్కార శిక్షను పొందుదురు.

వసంతుడు మాటాడిన మాటలు కొన్ని 'అయాగో' నోటినుండి గ్రహింపబడినట్లున్నవి. శీలము ధనముకంటె ఘనమైనదని 'అయాగో' పలికినట్లే వసంతకుడును నందునితో నిట్లు పలుకును.

"వసంతుడు—...ఎంతధన మపహరించినను సంతోషమే. ధనహర్తయైన చోరుని దలవ్రక్కలు చేసియైనను దానిని తిరిగి సంపాదింపవచ్చును, గాని హరింపఁబడిన మర్యాదను తిరిగి దీసికొని వచ్చుటెటులు ?"

(ప్రచండ చాణక్యము. ప్రథమాంకము. పుట —41.)

ఇట, వసంతుడు నందుని హృదయములో విద్వేషమును రేకెత్తించిన భాగమును శ్రీ పానుగంటివారు, షేక్స్పియర్ ననుసరించి వ్రాసిరని, రెంటిని పోల్చిచూచిన వెంటనే తెలియును. సంభాషణలు విసుగుపుట్టక జడ యల్లికగా ముచ్చట గొలుపుచున్నవి, ఈ సంభాషణరచనా పాటవమే ప్రచండచాణక్య నాటకమునకు గంభీరనాటక (Tragedy) లక్షణములను పూర్ణముగా పట్టించినవి.

రంగస్థలమున ఉద్వేగమును కలిగించు మృతి, యుద్ధము మొదలగునవి చూపకూడదను సంస్కృతాలంకారికుల వచనములుగూడ నిక్కడ ఉల్లంఘింపబడినవి. నాటకాంతమున రంగస్థలముపై హత్యలు చాల జరుగునట్లు ప్రచండ చాణక్యమున కల్పింపబడెను. చాణక్యుడు నందుని చంపుట, నందపుత్రులను చంపుట మొదలగునవన్నియు రంగముననే నిర్వర్తింపబడి, జుగుప్సను కలిగించునవియై యున్నవి.

శ్రీ పానుగంటివారు సాంఘిక నాటకములలో హాస్యరసమును— అతి కటువుగ నది కొన్ని కొన్ని ప్రదేశములలో నుండుట కలదు— చక్కగా పోషించిరి. కంఠాభరణ నాటకములో సుబ్బిసెట్టి షష్టిపూర్తి, కృష్ణారావు వేశ్యాలోలత్వము, సోమావధాని ఛాందసము చమత్కారముగ వర్ణింపబడెను. ఇట్టి హాస్య నాటక రచనలలో వారు 'ఇంగ్లీషు కామెడీ' ననుసరించి రచనలు చేసిరి. కృష్ణారావు వేశ్యాలోలుడై భార్యను పుట్టింట దిగవిడుచును. తరువాత కొంతకాలమున కామెనే వేశ్య యనుకొని సంభాషించును. ఇట్టి సన్నివేశములు, ఆంగ్లభాషలోని 'రెస్టొరేషన్ కామెడీ' యందుండును. సరస్వతి నాటకములోని జయరామసింగు పాత్రకూడ ఆంగ్లనాటకములలోనుండి వచ్చినదే. సంస్కృత నాటకములలో హాస్యమనునది విదూషకుని మాత్రమే అంటిపెట్టుకొని—ఒక్క మృచ్ఛకటికము మాత్రము దీని కపవాదము—యుండును. అందైన, వికారరూపమును బట్టియు, ఆతని భోజన ప్రియత్వమును బట్టియు, హాస్యము పుట్టును. ఆంగ్ల నాటకములలో నట్లుగాదు. శ్రీ పానుగంటివారి నాటక రచనా పాటవము సంస్కృతాంగ్ల నాటక సంప్రదాయముల సమ్మిశ్రణము వలన కలిగినది గనుక, వీరి నాటకములలో చక్కని హాస్యముండును. విషాదాంత నాటకములు, మోదాంత నాటకములు చాల వ్రాసి కీర్తిపొందిన శ్రీ పానుగంటి లక్ష్మీ నరసింహారావుగారి ప్రతిభకు ఉద్దీపనకారులు సంస్కృతాంగ్ల సాహిత్యములు. ప్రకరణము ననుసరించి ఇందు రెండవదానినిగూర్చి వ్రాయబడినది.

వ్రాసిన నాటకములు తక్కువే యయినను మంచి ప్రచారమునకు వచ్చిన నాటకములను రచించినవారు శ్రీ కూచి నరసింహముగారు (1866-1940). వీరి నాటకములకు నాందీ ప్రస్తావనలు శ్రీ పానుగంటివారును, వారి నాటకములకు నాందీ ప్రస్తావనలు వీరును వ్రాయుట సంప్రదాయము. వీరి నాటకములలో మిక్కిలి ప్రఖ్యాతికి వచ్చినవి; రూపలత, వనవాసి యనునవి. ఇందు రూపలతకథ సంస్కృతమందలి కథాసరిత్సాగరమునుండి గ్రహింపబడినది. ఈ నాటక ప్రస్తావనలో ఈకవి "ఆంగ్లేయభాషయం దసమాన లసమాన సాహితీ సంపత్తి సంయుతుండు" అని కీర్తింపబడినాడు. సూత్రధారుని ఈ మాటలకు పారిపార్శ్వకుడు, "ఆంధ్రభాషా పాండిత్యముమాట ముందుగాఁ జెప్పక, యాంగ్లేయభాషా పాండిత్యమునుగూర్చి చెప్పెదవేల? ఆంధ్ర గ్రంథ రచన కది యున్నగాని, పనికిరాదా యేమి?" అని పలుకును. ఈ నాటకమున

తొమ్మిది అంకములు గలవు. రంగములులేవు. ఆంగ్లభాషా కోవిదుడు కవియని చెప్పుటేగాని, ఆంగ్ల నాటకానుకరణ మేమియు ఇందు కానరాదు.

వీరి రెండవ నాటకము వనవాసి. "ఆంగ్లేయ కవియగు 'టామస్ పార్నెల్' ఆంగ్ల పద్య రూపముగా రచించిన 'హర్మిట్'లోని కథను దీసికొని, మన దేశాచార సంప్రదాయముల కనుకూలించునట్లు మార్పులుచేసి యీ 'వనవాసి' యను తెలుగు నాటకమును" కవి రచించెను. ఈ నాటక రచనకు కారణ మిట్లు ప్రస్తావనలో చెప్పబడినది,

"నటి—ఈయన వ్యాస భట్టారకుని మాని, పార్నెల్ మహర్షికి భిక్షా వందన మేల చేయవలసి వచ్చెను ?"

"సూత్రధారుఁడు—మన నరసింహాకవి పీఠికాపురోన్నత పాఠశాలా ప్రథమోపాధ్యాయుఁడు. ఈయన 'పార్నెల్సు హర్మిట్' అను గ్రంథము నెన్ని పర్యాయములోఁ బాఠశాలలోని పైతరగతి బాలురకు బోధించినారు. దానిలోని యమూల్యమగు నీతి సారమును బాలురింకను బాగుఁగా దెలిసి కొనుటకై....యీ కథను దృశ్య ప్రబంధముగా రచించినారు."

'హర్మిట్' పద్యకావ్యము ననుసరించి రచింపబడిన దీనియందు కథ తక్కువ. పావకు డను వనవాసియగు యతి భగవంతునిలీలను గ్రహింపలేక తపించుచుండును. ఆతనికి జ్ఞానోపదేశము చేయుటకు భగవంతుడు దారకుడను దేవదూతను పంపును. మనుష్యరూపమును ధరించివచ్చిన దారకునితో కలిసి పావకుడు దేశాటనమునకు బయలుదేరును. మొదట వీరిరువురు యశోభాగుడను దంభదాత ఇంటికేగుదురు. ఆతడు వీరిని సత్కరించి పంపును. పోవునపుడు దారకుడు యశోభాగుని ఇంటిలోని స్వర్ణపాత్రనొకటి దొంగిలించును. అచ్చటి నుండి వీరు తుషాదుడను ధనవంతుడైన లుబ్ధుని గృహమునకు పోవుదురు. ఆతడు విసిగికొనుచు వీరికి రెండు మెతుకులు పెట్టును. దారకుడు సంతోషించి, తాను దొంగిలించిన గిన్నెను తుషాదునకు దానముచేయును. ఇదంతయు పావకున కాశ్చర్యము గొల్పును. అక్కడనుండి వారు, ధనికుడైన ముక్తవర్మ యను భక్తుని ఇంటికి పోవుదురు. వారి కతిథిసత్కారముచేసి ముక్తవర్మ తృప్తిని పొందును. తొట్టిలో పండుకొనియున్న ముక్తవర్మ బాలుని దారకు డా రాత్రి చంపి పావకునితో కలిసి వెడలిపోవును. ఇంక పావకుడు సహింపలేక, తాను చేసినపనులకు కారణమును దారకుడు చెప్పకున్నచో తన చేతియం దాతనికి చావు తప్పదని పల్కును. దారకుడు నవ్వుచు తాను పావకునకు

జ్ఞానోపదేశము చేయుటకై పంపబడిన దేవదూతననియు; దంభదాత యొద్ద నుండి స్వర్ణపాత్ర నపహరించి ఆతని దంభత్వమును పోగొట్టినట్లును, దానిని తుపాదునకు దానముచేసి, ఆతనికి ఇచ్చుటను నేర్పినట్లును చెప్పును. పావకు డాశ్చర్య చకితుడై, భక్తుడయిన ముక్తవర్మ కుమారుని చంపుటకు హేతు వేమని యడుగును. కుమారుని చూచుకొని ఆతడు భగవంతుని మరచుచున్నా డనియు, ఆ లంపట మొక్కటియు తొలగినచో ఆతని భక్తి నిరాటంకముగా వెలుగుననియు దారకుడు చెప్పగా విని పావకు డాతనిని క్షమింపుడని వేడును. భగవంతుని లీలలకు కారణము లూహించుట మన పని కాదనియు, ఆతని ఇష్టము నెరవేర్చుటయే మానవుని పని యనియు దీని నీతి.

ఆంగ్లములోనుండి కథ గ్రహింపబడినను, ఇందు పాశ్చాత్య వాసనలు లేవు. పరమార్థమునకు సంబంధించిన ఈకథను మన సంప్రదాయమునకు తగిన నామములతో, భావములతో కవి తెలుగున రచించెను. ఒకటి రెండు చోటు లందు క్రైస్తవమతమున ప్రచారముగల భావములు చెప్పబడెను. భగవంతుని గూర్చి క్రైస్తవులు అను "Thy will be done" అనునది "ఏది యిష్టమొ నీకదియోశ! చేయుము" అని వ్రాయబడినది. క్రైస్తవమతమున భగవంతుడు తన పనులను నెరవేర్చుకొనుటకు దేవదూతలను పంపుటయు (Angels), వారు మనుష్యవేషమున భూలోకమునకువచ్చి, తమకు నిర్దేశింపబడిన కార్యమును చేయుటయు కలదు. క్రైస్తవమతమున దేవుని 'తండ్రి' (Father) అని వ్యవహరించుట కలదు. తనరాకకు కారణమును చెప్పుచు దారకు డిట్లు పలుకును :

"నీతపంబు చూచి నీ విమలంబైన
చరిత మరసి యెంతొ సంతసించి
నిన్ను బాధపెట్టు నిఖిల సంశయములు
వాపఁ దండ్రి నన్ను బంపినాడు."

(వనవాసి—పుట—95.)

ఇంతకంటె ఈ నాటకమున ఆంగ్ల సాహిత్యమునకు చెందిన భావములు లేవు.

కవిసార్వభౌములును, శతాధిక గ్రంథకర్తలును, ఆస్థాన కవులును నైన, శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు (జననము, 1866) కొన్ని నాటకములను రచించిరి. వీరి నాటకములలో— బొబ్బిలి యుద్ధనాటకము,

వేణీసంహారము, కలభాషిణి, తిలకమహారాజు నాటకము, ముఖ్యమైనవి. వీర రసప్రధానమై ప్రౌఢపద బంధురమై వీరి బొబ్బిలినాటక ముండును. కలభాషిణి స్వతంత్ర నాటకము. కథ తెలుగు ప్రబంధమునుండి గ్రహింపబడినది. రసవంత ముగ నున్నది. తిలకమహారాజు నాటకము తిలక్ మృతితో నంతమగును. ఇందు పార్లమెంటుసభ్యులు, విక్టోరియా మొదలగువారు పేర్కొనబడిరి. వీరి నాటకములపై పాశ్చాత్య నాటకముల ప్రభావము చాలతక్కువ.

పందొమ్మిదవ శతాబ్దిచివర, వీరేశలింగం పంతులుగారి తరువాత అంత పేరుపొందిన శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు (1867-1946) నవలలను, నాటకములను చాల వ్రాసి వాసిగాంచిరి. 1889లో వీరు రచించిన గయోపాఖ్యానము నేటికి లక్షపై పాతికవేల ప్రతు లమ్ముడుపోయినదన్న వీరి నాటకములకుగల ప్రచారము తెలియగలదు. రాజమహేంద్రవర వాస్తవ్యులైన వీరికి నాటక రచనమున ప్రోత్సాహమిచ్చినవారు శ్రీ ఇమానేని హనుమంతరావు నాయుడుగారు[26] (1854—1913).

శ్రీ చిలకమర్తివారు నాటకరచన కుపక్రమించు నాటికి వచన నాటకములకే ఎక్కువ వ్యాప్తిగలదు. పైప్రాంతములనుండి నాటక సమాజములు వచ్చి రాజమహేంద్రవరమున నాటకములు వేయుచుండగా, వీరును కుతూహలపడి నాటకరచన కుపక్రమించిరి. వీరి మొట్టమొదటి వచననాటకము కీచకవధ (1889). ఇందు, ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశంపంతులుగారు ద్రౌపదిపాత్రను ధరించిరట ! ఆ సంవత్సరమే (1889) ద్రౌపదీపరిణయమును రచించిరి. గయోపాఖ్యాన నాటకము 1889 డిసెంబరులో రచింపబడెను. ఈ నాటకమునుగూర్చి వారు తమస్వీయచరిత్రలో నిట్లు వ్రాసిరి.

"నా నాటకము లన్నిటిలో గయోపాఖ్యానమే జనాకర్షకమైనది... ఇప్పటికి లక్షప్రతులకంటె నధికముగ ఖర్చుపడినవి."

(శ్రీ చిలకమర్తివారి స్వీయచరిత్ర. పుట—256.)

26. రాజమహేంద్రవర వాస్తవ్యులైన వీరికి నాటకములన్న మిక్కిలి ఇష్టము. వీరు నటులుకూడ. 'రాజమహేంద్రవర హిందు నాటక సమాజము' అను పేర నొక సమాజమును స్థాపించి వీరు యువరచయితలను, యువనటులను ప్రోత్సహించుచు వచ్చిరి. ఈ సమాజము వారే, శ్రీ చిలకమర్తివారి నాటకములను మొట్టమొదట ఆడిరి. నాయుడుగారు పాఠశాలలో నుపాధ్యాయులు గనుక, చురుకైన పిల్లలను నాటకములలోనికి తీసికొనుచుండిరి. ఈ బాలురు నాటకములలో స్త్రీపాత్రలను ధరించుచుండిరి. ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశంపంతులుగారు, వీరి ప్రోత్సాహమువలన చిన్నతనములో ఇట్టి పాత్రలను చాల ధరించిరట!

1890 లో పారిజాతాపహరణమును, నలనాటకమును వీరు రచించిరి. తరువాత 1890 మార్చి నెలలో సీతాకల్యాణమును రచించిరి. సంస్కృతములో నుండి వీరు భాసుని నాటకముల ననువదించిరి. గయోపాఖ్యానము తరువాత మిక్కిలి ప్రసిద్ధికి వచ్చిన వీరి నాటకము ప్రసన్న యాదవనాటకము (1906). వీరు స్పృశించి యలంకరింపని సాహిత్యశాఖలేదు. 1890 లో రాజమహేంద్రవరము వచ్చి ఉపన్యసించిన సాధారణ బ్రహ్మసమాజ మతబోధకులైన శ్రీ పండిత శివనాథశాస్త్రిగారు, వీరినిగూర్చి విని, షేక్స్పియర్ మహాకవితో నీయనను పోల్చిరట. మంచి ప్రచారములోనున్న నాటకములను వ్రాసినకవి గనుక ఆ పోలిక తగియేయున్నది. కాని, వీరి నాటకములలో ఆంగ్ల నాటకముల ననుసరించి బయలుదేరినవి లేవనియే చెప్పవచ్చును. నాటక రచనలో వీరి కింకొకరు మార్గదర్శకులు కారు. వీరు నాటకరచన చేయునాటికి దేశములో బహువిధ నాటకము లప్పుడే బయలుదేరెను. రాజమహేంద్రవరముననే వీరేశలింగం పంతులుగారు వీరికి మార్గదర్శకులుగ నుండిరి. పాశ్చాత్య నాటకములలోని సామాన్య ధర్మములగు అంకవిభజనము, రంగ విభజనము మొదలగునవితప్ప వీరి నాటకములో ప్రత్యేకముగా చూపింపదగిన పాశ్చాత్య నాటకానుకరణము కానరాదు.

మహాకవులుగా యావదాంధ్రమున పరిగణింపబడిన తిరుపతి వేంకట కవులు (తిరుపతి శాస్త్రిగారు 1871 - 1919; వేంకట శాస్త్రిగారు 1870 - 1950) అనేకదశలు రంగస్థలమును, ఫలిన నాటకముల నెన్నింటినో రచించిరి. పాండవ జననము, పాండవోద్యోగము, పాండవాశ్వమేధము, పాండవ రాజసూయము, పాండవ విజయము, పాండవ ప్రవాసము, మొదలయిన స్వతంత్ర నాటకములను; ముద్రారాక్షస, మృచ్ఛకటిక, బాల రామాయణాది అనువాద నాటకములను ఎన్నింటినో వీరు రచించిరి, పల్లెటూళ్ల పట్టుదలలు మొదలైన హాస్యనాటకములు రచించిరి. మహాప్రతిభావంతులైన వీరికి ఆంగ్ల సాహిత్యముతో ప్రత్యక్ష పరిచయము లేకున్నను, మిత్రులవలన దానిలోని గుణములను గ్రహించినవారే. కాని, వీరు రచించిన నాటకములన్నియు నించుమించుగా సంస్కృతాలంకారికుల పద్ధతి ననుసరించియే రచింపబడెను. కాని, వీరు రచించిన నాటకములలో 'ఎడ్వర్డు పట్టాభిషేక' మనునది కొంత ఆంగ్ల వాసనగల నాటకము. దీనికి, ఇతివృత్తము కూడ కొంత కారణము. ఈ నాటకము పోలవరము జమీందారయిన శ్రీరామచంద్ర

వేంకట కృష్ణారావుగారి ప్రోత్సాహము వలన కవులు రచించిరి. ఈ విషయ మును గూర్చి ప్రోత్సాహకులు సుదీర్ఘమయిన ఆంగ్లపీఠికలో నీ క్రింది విధముగా వ్రాసిరి.

"The following drama was written under my suggestions by the twin poets and Sathavadhanis—Pandit Thirupaty Sastry and Pandit Venkata Sastry in adaptation of the drama of the well known poet Pandit Vidyanatha in Sanskrit, illustrating the art and science of Dramaturgy..............But as the year before last was marked by the coronation of our beloved Emperor, King Edward VII, I suggested to them, that instead of merely translating the drama of Vidyanatha from Prataparudreeyamu, for rendering its translation complete, they might suiting the occasion, write a drama, on similar lines illustrating the great Historic incident of the coronation of the King Emperor." (Foreword)

ఈ నాటకములో ఆంగ్ల నామములు మొదలగునవి ప్రకరణానుకూల ముగ చాల వాడబడెను. కొన్ని కొన్ని చోట్ల చమత్కారములయిన కల్పనలు చేసిరి. ఎడ్వర్డు ప్రభువు ఏడవవాడగుటను గూర్చి కవు లిట్లు చమత్కరించి వ్రాసిరి.

"చక్రవర్తులు మును హరిశ్చంద్ర ముఖ్యు
లార్వు రేగిరి రాజు లీ యవనియందు
సప్తముడుగాన నెడ్వర్డు చక్రవర్తి
సప్తమెడ్వర్డుఁ డనుమాట సార్థకంబు."

(ప్రథమాంకము - ప్రస్తావన)

ఈ నాటకములో ఢిల్లిలోని దర్బారు,అచ్చటకు వచ్చిన స్వదేశ సంస్థా నాధిపతులు మొదలగువారందరు వర్ణింపబడిరి. ఆంగ్లరాజ్యము శాశ్వతమగు గావుత మను కోరికతో ఇది ముగింపబడెను. 'The Sun never sets on the British Empire' అనునది యిట్లు వ్రాయబడెను.

"భాస్కరుని కస్తమయమను పల్కు లేని
యంత దేశంబు జయము జయంబనంగ
లోటు లేకుండఁ బాలించు లోకవిభుఁడ
వీవు పొందం గలుగు ప్రియం బేది యింక !"

ఇంతకంటె వీరి రచనలలో ఆంగ్ల సాహిత్య ప్రభావముగల నాటకములులేవు.

తిరుపతి వేంకట కవులకు పోషకులై, సంస్కృతాంధ్రాంగ్ల భాషలలో పండితులై బహుగ్రంథముల రచనను చేసినవారు, పోలవరము జమీందారగు శ్రీ కొచ్చెర్లకోట రామచంద్ర వేంకట కృష్ణారావుగారు (1871-1919). వీరు ఇంగ్లీషు భాషలో షెరిడన్ కవి రచించిన 'ది స్కూల్ ఫర్ స్కేండల్' ('The School for Scandal') అను నాటకమును తెలుగు చేసిరి. ఈ విషయమును గూర్చి వారు గ్రంథపీఠికలో నిట్లు వ్రాసిరి.

"This drama is a free rendering of "Sheridan's School for Scandal" into Telugu. There are in English many prose - dramas, some written purposely to suit the stage and others more with the object of bringing social evils and pernicious customs of society in a graphical form before the view of the public and thereby impressively demonstrating the dangers resulting to the individual members of the society and society itself. Judging this prose-drama of Sheridan, it must be said that it is purely a 'Socio-Comedy' written by the author to illustrate the dangers that persons indulging in scandals are sure to fall into and bring upon others............But unfortunately in Telugu even the few translations of the English prose-dramas that have been published, are not cared after by the reading public and no attempt of their presentation on the stage has ever been till now made............" "ఈ నాటకమునకు వ్రాసిన తెలుగు పీఠికలో కృష్ణరావుగారు ఇట్లు వ్రాసిరి. "...ఈతడు వ్రాసిన నాటకములలో రెండు నాటకముల ననుసరించి మ. రా. రా. రావు బహద్దర్ కందుకూరి వీరేశలింగము పంతులవారింతకు మునుపే రాగమంజరియు, కల్యాణ కల్పవల్లియు రచించిరి. నీతిబోధకమును, హాస్యరసప్రధానమును నగు నీ నాటకమును సులభమగు రీతిని వచనరూపముగా వ్రాసి నే నిప్పుడు ప్రచురించుచున్నాడను."

ఈ నాటకము మొట్టమొదట 'అపవాదతరంగిణి' అను పేర 1900 లో సరస్వతి పత్రికలో ప్రకటింపబడెను. ఈ నాటకమున రచయిత కొన్నిమార్పులను చేసెను. ఈ మార్పులు నాటకము మన సంప్రదాయమున కనుకూలముగ నుండవలెనని చేసినవి. అందు ముఖ్యమైనది 'దామోదరవర్మ' తన వార్ధకము వరకు వివాహమునే యాడకుండి తరువాత చిరకాలమునకు పెండ్లి చేసికొనెనని వ్రాయబడియున్న యంశమును; "మన యాచారములకు విరుద్ధమని" యాతడు ప్రథమమున వివాహమాడి తన భార్య మృతినొందిన తరువాత చాలకాలము వివాహమాడక తిరిగి వార్ధకమున పెండ్లిచేసికొనెనని, రచయిత

మార్చెను. ఈ మార్పునకు సార్థకతలేదు. ఇట్టివే కొన్ని స్వల్పములైన మార్పులు చేయబడినను, నాటకమునకు ప్రచారము— ఒకసారి ఎస్. ఎస్. ఎల్. సి. (S. S. L. C.) పరీక్షకు పఠనీయగ్రంథముగ నుంచుటతో— ముగిసెను.

ఆంగ్ల నాటకములు సిద్ధహస్తుల చేతులందు కూడ, తెలుగుభాషలో ప్రచారమునకు వచ్చునట్లు రచింపబడలేదు. పందొమ్మిదవ శతాబ్ది యొక్క ఉత్తరభాగమున చాలమంది రచయితలు—ఎక్కువ పేరు పొందినవారు కారు—ఆంగ్లనాటకముల ననుసరించి, తెలుగులో వ్రాసిరి. వీరిలో చాలమంది, తమ విద్యార్థిదశలో తాము చదివిన నాటకములనే తరువాత అనువదించినట్లు తోచుచున్నది. ఈ నాటకములకు రంగస్థలమునగాని, విద్యావంతుల హృదయ రంగములగాని ప్రవేశము కలిగినట్లే తోచదు. కొన్ని పఠనీయములుగా నియమింపబడినప్పుడు "విద్యార్థులు" చదువుట, "అధ్యాపకులు" పాఠము చెప్పుట జరిగియుండును. ఆంగ్లనాటకముల ఆంధ్రానువాదములను ఇంగ్లీషుభాష తెలిసిన వారేగాని ఇతరు లంతగా ఆదరింపలేదని తెలియుచున్నది. ఆ భాష తెలిసిన వారు—వా రనువాదకులైనప్పుడు తప్ప—ఆంగ్ల నాటకముల నాదరించి నంతగా, ఆంధ్రానువాదముల నాదరింపలేదు. కొందరు 'ఇంగ్లీషు ట్రాజెడీ' ననుసరించి నాటకములను రచించినారమని చెప్పుకొన్నను, ఇంగ్లీషు కవుల ప్రతిభా వ్యుత్పత్తులు వీరికి లేకుండుటచే, ప్రతిజ్ఞ లెన్నిచేసినను రససిద్ధిని పొందలేకపోయిరి. కాని, వీరి కృషి నాటివారి మనస్సులలో ఆంగ్ల సాహిత్య మాక్రమించుకొనిన స్థానమును గూర్చి మనకు ముఖ్యముగా తెలియజేయును. ఇట్టి నాటకములలో కొంతకు కొంత రమణీయములైన వానిని క్రింద పరిశీలింతును.

శ్రీ పనప్పాకము . శ్రీనివాసాచార్యులుగారు 1900 లో కనకాంగి యను నాటకమును రచించి ప్రకటించిరి. నాటకము చివరగద్యలో వీరు "హూణాంధ్రభాషాభ్యాస సుకవితోల్లాస శ్రీనివాసాచార్య"అని వ్రాసికొనిరి. నాటక ప్రారంభమున ఆంగ్లములో పీఠిక (Preface) వ్రాయుచునిట్లనిరి.

"In writing this drama I had before me the best tragedies of the immortal Shakespeare to guide me in the development of characters."

ఇంతేగాక, ఇంగ్లీషుకవియైన 'పోప్' (Pope) నుండి కొన్ని పద్యపాదములను ఉద్ధరించివ్రాసి, తనకృషిని లోకులు మెచ్చుకొనవలెనని వ్యంగ్యముగా సూచించిరి.

ఈ రచయితకున్న ఉత్సాహము మెచ్చదగినదే కాని, రచనలో సొగసు తక్కువ. ఇందు మదనుడనువాడు నాయకుడు. ఆతనిభార్య కనకాంగి. మదనుడు వేశ్యాలోలుడై తిరుగుచుండ, ఆతని విరోధులు ఆతనిభార్యను చంప నొక మందిత్తురు అది విషముగాక నిద్రకు మందగును. తరువాత పశ్చాత్తాప పడిన మదనుడు కనకాంగి చనిపోయెనేమో అని విచారించుచుండగా నామె బ్రతుకును.ఆంగ్ల నాటకమైన 'రోమియోఅండ్ జూలియట్'నుండి'నిద్రమందు'ను కవిగ్రహించినను, రెంటను పర్యవసానములు భిన్నములగుట ఆంగ్లనాటకములోని గంభీర భావము తెలుగునందు కలుగలేదు. మన సంప్రదాయము ననుసరించి రచయిత దీనిని సుఖాంతము చేసెను. ఇంక, ఈతనికి ఎదుట షేక్స్పియర్ కవియొక్క అత్యుత్తమ విషాదాంత నాటకములున్ననేమి ? యని మన కని పించును. ఆ కాలమునాటి రచయితల మనః ప్రవృత్తి నిది తెలుపగలదు.

ఇంగ్లీషులోని 'ఒథెల్లో' నాటకము ననుసరించి 'పుళిందాసుశీలము' అను నాటకమును శ్రీ బి. శ్రీనివాసరావుగారాంధ్రీకరించి 1909 లో ప్రకటించిరి. మూలనాటకములోని పేరులు, సంప్రదాయములు దీనియందు మార్చబడెను. మూలములోని 'అయాగో' ఇందు 'ఉగ్రుడు' అగును. 'ఒథెల్లో' పుళిందుడగును. 'డెస్డిమోనా' 'సుశీల' యగును. 'ఎమీలియా' కమలయగును. 'క్యాసియో' కృష్ణుడగును. ఇట్లు పేరులను మార్చి వ్రాసినానుగదా యని రచయిత తృప్తిపడి యుండవచ్చునేమోగాని, ఇట్లు మార్చిన నాటకములో ఇంగ్లీషు నాటకములో నున్న దేశ నామాదులు కొన్ని మిగిలిపోయి తెలుగు నాటకమును అపహాస్యము పాలుచేయుచున్నవి. ఉదాహరణలు—

ఇంగ్లీషు—"**Iago**—(క్యాసియో కలలో అన్నమాటలుగా, అయాగో నాయకుడైన ఒథెల్లోకు చెప్పుచున్నాడు.) "**Cursed fate that gave thee to the *Moor*" (Act III; Scene III.)**

తెలుగు—"ఉగ్రుడు—దుర్దైవంబు నిన్ను మూరున కిచ్చివేసెనుగదా !"
(పుళిందాసుశీలము. పుట-61)

ఇంగ్లీషు—"**Othello** (డెస్డిమోనాతో) **That handkerchief did an *Egyptian* to my mother give" (Act III; Scene IV)**

తెలుగు—"పుళిందుడు—(సుశీలతో) ఆ రుమాలు నొక *ఐగుప్తదేశ* వాసురాలు మా తల్లి కిచ్చినది" (పుట-65)

ఇంగ్లీషు—"**Othello**—(ఆత్మహత్య చేసికొనుటకు ముందు) ...... **that in *Aleppo* once, where a malignant and a turban'd Turk, Beat a *Venetian*....**" (**Act V; Scene II**)

తెలుగు—"పుళిందుడు...ఇంతేకాక అలిప్పోలో నొకసారి తురుష్కుండొక *వినీసీయుని* జంపి ......" (పుళిందాసు శీలము. పుట—107.)

ఇట్టివి చాలగలవు. ఇవి సంస్కరింప బడకున్నప్పుడు, నాటకములోని పేరులను మార్చినను, నాటకము రక్తికట్టదు.

ఈ నాటకము (**Othello**) నే, శ్రీ రెంటాల వేంకట సుబ్బారావుగారు 'అథిలబింబము' అను పేర రచించి 1911 లో ప్రచురించిరి. దీనికి 'అభినవ భారతము' అను పేరు పెట్టినారుకూడ. ఇందు నాటక ప్రారంభమున కవి, అవతారికలో షేక్స్పియర్‌ను కీర్తించుచు పద్యములను వ్రాయుటయేగాక, ఆ కవి రచించిన నాటకములపేరుల నన్నింటిని తెనుగున నిట్లుకూర్చి పద్యములను వ్రాసెను.

"అథి, లాహ్లేథ, లయార్క, రమ్యక, తిమన్యాథీన, సీజర్, మహా
పథ, ప్రక్లేశక, సింహలీనక, కళాపాత్రా, త్రయోల్లాసక్ర
స్యథ, కర్యాలన సాఖ్యబింబకము లీరాజున్ విషాదాత్మక
ప్రథమంబుల్; పతనప్రదర్శనములన్ బాటింపవే జ్ఞానమున్ ?"[27]

(అభినవ భారతము. అవతారిక. పుట—IV.)

---

27.

| | |
|---|---|
| Othello | అథిల |
| Hamlet | ఆహ్లేథ |
| King Lear | లయార్క |
| Romeo and Juliet | రమ్యక |
| Timon of Athens | తిమన్యాథీన |
| Julius Caesar | సీజర్ |
| Macbeth | మహాపథ |
| Pericles | ప్రక్లేశక |
| Cymbeline | సింహలీనక |
| Antony and Cleopatra | కళాపాత్ర |
| Troilus and Cressida | త్రయోల్లాసక్రస్యథ |
| Coriolanus | కర్యాలనప |

'ప్రళయ, ప్రతిక్రియా, వణిజ, భ్రాంతి వివాహ, వివాహభంగ, ధూ
ర్తలలన, కాముకాపజయ, భ్రాంతివిలాస, సతీజయ, ప్రవా
సలలిత, మిత్రవంచన, వసంతవినోద, పతివ్రతా, స్మరా
నలవిఫలాఖ్యలౌ పదియు నాల్గు ముచావహ బింబరత్నముల్."[28]

(అవతారిక, పుట—IV.)

"ఈరేను బింబకము లాం
గ్లోరాజుల చరితములను గొన్నిటిఁ దెల్పున్
బోరుల వధల స్మీఱుచు;
నారయ నన్నియును ముప్పదా ఱ్వింబమ్ముల్."

(అవతారిక. పుట—IV.)

ఈ నాటకమున ప్రస్తావనలో సూత్రధారుడు ప్రవేశించి ద్విపదలో 'అథిలబింబము' కథ ముందు చెప్పును. దీని తరువాత నాటకము ప్రారంభమగును. ఆంగ్లనాటక క్రమము ననుసరించుటలో సహృదయులకు కష్టము కలుగవచ్చునను భావముతో నీ ప్రస్తావన, రచయిత వ్రాసెనని తోచుచున్నది. ఇందు—నాటకమున—వివిధములైన చందము లుపయోగింపబడినవి. ఈ నాటకములోని పాత్రల పేరులన్నియు ఆంగ్లసమములు. 'ఒథెల్లో' అథిలుడయ్యెను. 'డెస్డిమోనా' దళదమాన యయ్యెను. 'అయాగో' అయాగు డయ్యెను. ఇటులనే మిగిలిన పేరులును మార్చబడెను.

ఇట్లు జాగరూకతతో వ్రాయబడిన ఈ నాటకమున గూడ, దేశకాల పాత్రలను తెలుగు రచయిత విస్మరించి వ్రాసిన భాగములు గలవు. రోడెరిగో (Roderigo) తో మాటాడుచు 'అయాగో' (Iago) ఇట్లు పలుకును : "And, though he in a fertile climate dwell, Plague him with *flies*..." ఈ మాటలను తెలుగులో రచయిత ఇట్లనువదించెను : "పూఁ జాన్పుపైన

---

28. The Tempest (ప్రళయ); Measure for Measure (ప్రతిక్రియ); The Merchant of Venice (వణిజ); Twelfth-Night (భ్రాంతివివాహ); Much Ado about Nothing (వివాహభంగ); The Taming of the shrew (ధూర్తలలన); The Merry wives of Windsor (కాముకాపజయ); The Comedy of Errors (భ్రాంతివిలాస); All's well that ends well (సతీజయ); As you like it (ప్రవాసలలిత); The Two Gentlemen of Verona (మిత్రవంచన); A Midsummer Night's Dream (వసంతవినోద); The Winter's Tale (పతివ్రత); Love's Labours Lost (స్మరానలవిఫల).

నిమ్మగఁ బండి యుండంగఁ గొల్లేటి దోమలు కుట్టినట్లు". రచయితకు కొల్లేటి దోమలబాధ యనుభవమై యుండవచ్చును గాని 'అయాగో' కట్టి అనుభవము లేదుగదా! ఇట్టివే యింకను, "మాలగాడైవునీవు"; "యమునికడకు పంపుట"; "కోయమందులు"; మొదలైనవి. ఇవిగాక; తెలుగురచయిత ఇంగ్లీషు మాటలకు అనువాదములుగా వింతవగు మాటలను కొన్నింటిని వాడి, సూక్ష్మముగా నాటకమునుపరిశీలించు వారికి హాస్యమును పుట్టించును. ఇది హాస్యరసముకాదు. హేళనకైన నవ్వు. అట్టి మాటలలో, 'ఒథెల్లో' నోటినుండివచ్చు "కాఫి నీరు గ్రాఁచుపాత్ర" యనునది ఒకటి. ఒథెల్లో బలవంతముగా డెస్డిమోనా నపహరించెనను అపవాదును డ్యూకు (Duke) విచారణచేయు సందర్భ మది. అందరి యెదుటకు డస్డిమోనా వచ్చితానే, ఒథెల్లో గుణగణములను చూచి, యాతనిని పరిగ్రహించితినని పల్కెను. ఆ సందర్భమున 'ఒథెల్లో' అందరు వినుచుండగా నిట్లుపలికిన ట్లాంగ్లమున గలదు.

ఆంగ్లము—"Othello—………………Let housewives make *a skillet* of
my helm……………" (Act I; Scene III.)

దీనికి తెలు గిట్లు కలదు. "అథిల—………నాశిరస్త్రమ్ము కాఫినీరు గ్రాఁచు
పాత్రఁ జేయుఁడు నన్ బరాభవింప"

(అథిలబింబము—పుట—60.)

ఇట 'skillet' అను శబ్దమునకు "కాఫి నీరుగాచు పాత్ర" అనునది రసవంతమైన యనుసరణము కాదు. ఈ శబ్దమునకు; "small metal pot with long handle & usu. legs used in Cooking" (Oxford English Dictionary) అని యర్థము. ఈ యనుసరణములు చేయువారికి ఆంగ్ల సాహిత్యమును తెలుగులోనికి తెచ్చుట యందుగల కుతూహలము, మిగిలిన విషయములలో లేదన్నట్లు తోచును.

పందొమ్మిదవ శతాబ్ది తుదిభాగములో రచనలు చేసినవారికి, ఆంగ్ల నాటకముల విషయమునగల యభిమానమును మనము గ్రహించుటకు మంచి దృష్టాంతము నిచ్చునది, శ్రీరామ్ వీరబ్రహ్మముగారు రచించిన 'వాసంతిక' (1912) అనునాటకము. ఈ "గ్రంథము చిరకాలముక్రిందట మద్బాల్య మిత్రులును సహపాఠకులు నగు మ॥ రా॥ శ్రీ పెద్దిరామయ్య, బి. ఏ., ఎల్. టి., గారి ప్రోత్సాహంబుచే స్కాటునవలయగు 'బ్రైడ్ ఆఫ్ లేమర్ మూర్' అను నొకానొక యింగ్లీషుగాథనుండి యనువదింపబడి రచింపబడినది" అని రచయిత

వ్రాసెను. ఈ నాటకములో పస తక్కువేగాని, దీనిపీఠిక; ఆంధ్ర సాహిత్యముపై ఆంగ్ల సాహిత్యప్రభావము నన్వేషించువారికి; నాటి ఆంధ్రరచయితల మనః ప్రవృత్తిని తెల్పుటకు పనికివచ్చును. పీఠికను రచించినవారు శ్రీ పెద్ది రామయ్యగారు. బందరులోని నోబిల్ కళాశాలాధ్యాపకులు. తెలుగులోని నాటక రచననుగూర్చి ప్రస్తావించుచు వా రిట్లు వ్రాసిరి.

"మన మితర విషయములలో నింగ్లీషుభాష మనకుం దెలియుటవలనఁ జాలలాభములను బొందినట్లే నాటక రచనయందు సైతము అట్టి సాయ మెందువలనఁ బడయఁగూడదో తెలియరాకున్నది.........."

"నాకు జూడగాఁ దెలుఁగు నాటకము లింగ్లీషునాటకములంత రమ్యములుగా నుండమికి రెండు కారణములు గానవచ్చెడిని. ఇందు *మొదటిది* కార్యనియమము (Unity of Action). ఇయ్యది యాంధ్రనాటకముల యందంతగా గణింపబడుచుండినటులఁ గానరాదు..."

"......గ్రంథ మెట్టిదియైన సద్దానిఁ జదువుటవలన మనకు మనస్సంతోషము గలిగి ప్రపంచ వ్యవహారము లెక్కుడుగాఁ దెలియవలయును గావున మనుష్యుల వ్యాపారములన్నియు భగవంతుడే ప్రత్యక్షమై నడుపుచున్న మన యత్నములకంత యవకాశముండదు. మఱియు దైవసహాయము పూర్వ కాలమం దెంత యెక్కుగానున్నను నిప్పటికాలమున మన యభివృద్ధి మన యత్నములనుబట్టి యుండును. కావున నీ నాటకమునందు వచ్చు పాత్రల వ్యాపారములలో భగవంతు నంతగాఁ బురిగొల్పక ప్రపంచరీతుల నెఱిఁగింపఁ బ్రయత్నము చేయవలెను. మఱియు స్థలకాల నియమములు (Unities of Place and Time) హూణభాషా కవిధీరుఁడగు షేక్స్పియరు సైతము గమనింపక పోవుట చేత మన మవ్వానింగూర్చి విచారింపక పోవుటచే నష్టములేదు. *రెండవకారణ* మేమన నాటకములయందు వచ్చుపాత్రల స్వభావము బాగుగఁ దెలియపఱచ కుండుటయే. దీని నింగ్లీషున 'Characterization' అందురు."

తెలుగున నాటక మెట్లుండవలెనని ఆనాటి పెద్ద లనుకొనుచుండిరో దీని వలన తెలియును. మనవారికి నాటకములను విమర్శించుటకు 'కొలబద్ద' పాశ్చాత్యనాటకమని తేలినది. సంస్కృతాలంకారికుల మాటలనుబట్టి నాటకములను విమర్శించుటతగ్గినదని తేలినది. రసము, ధ్వని మొదలైన మాటలేవియు నిందు లేవు. ఐక్యత్రయము, పాత్రపోషణము మొదలైన పాశ్చాత్యనాటక లక్షణములే మనకు ఉపాదేయములైనవి. వీని మంచిచెడ్డలతో నిట ప్రసక్తిలేదు.

సహృదయులైన రసికుల, రచయితల, మనః ప్రవృత్తులనుబట్టియే రచన లుండును గనుక; వానిలో ఆంగ్లసాహిత్య ప్రభావ మెట్టిమార్పులను దెచ్చెనో పరిశీలించినవారికి, రచనలలోని క్రొత్తదనము అర్థమగును.

నవల :

వీరేశలింగం పంతులుగారి సమకాలికులలో నాటకములు వ్రాసినంత మంది నవలలు వ్రాయలేదు. దీనికి కారణము నాటకము దృశ్యమగుటయు, నవల శ్రవ్యమగుటయు నని గ్రహింపవచ్చును. నాటకము నానందించుటకు చదువు రానక్కరలేదు. నవల నానందించుటకు దానిని చదువగలిగి యుండ వలెను. వచన ప్రబంధమని నవలను మొట్టమొదట పిలిచెడి వారన్నచో వారి దృష్టిలో ప్రబంధమునకును– శ్రవ్యకావ్యము– నవలకును పద్య గద్య భేదము తప్ప ఇంకేదియు లేదన్నమాట. వీరేశలింగము పంతులుగారి రాజశేఖర చరిత్ర మమ్ముడుపోవుటకు చాలకాలము పట్టినదికాని, నాటకముల కట్లుకాదు. కనుక తెలుగులో మొట్టమొదట, నాటకములు బయలుదేరినంత త్వరితముగా నవలలు బయలుదేరలేదు. నాటకములు ప్రజల కానందము నిచ్చుటయేగాక, నటులకు జీవికను కూడ గల్పించునవి. నవలల కిట్టి శక్తి లేదుగదా !

ఆంగ్ల సాహిత్యములోని వివిధ శాఖలను తెలుగులోనికి తేవలెనను సంకల్పముతో పనిచేసిన పంతులుగారు నవల రచనను చేసినను, రాజశేఖర చరిత్ర తరువాత నవలను వ్రాయకుండుటకుగల కారణము, దానికి ప్రజా దరణము లేకుండుటయే.

దీనినిగూర్చి, పంతులుగారు ఇట్లు వ్రాసిరి.

"వేయి ప్రతులుగల మొదటి కూర్పు అమ్ముడు పోవుటకే బహు సంవత్సరములు పట్టినది. అందుచేత నిప్పుడు నవలలనఁబడెడు వచన ప్రబంధము లను వ్రాయు ప్రయత్నమును మానివేసితిని."[29]

ఈ ప్రక్రియలో వీరేశలింగంపంతులుగారి కృషినిగూర్చియు, దానిపై గల ఆంగ్లసాహిత్యప్రభావమును గూర్చియు ముందే గ్రహించితిమి. వీరి తరువాత చక్కని నవలలనువ్రాసిన వీరి సమకాలికులు శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహము గారు. వీరు వీరేశలింగం పంతులుగారివద్ద తమ చిన్నతనములో చదువుకొనిరి.[30]

29. స్వీయచరిత్రము; రెండవభాగము; 1915. పుట - 144.

తరువాత లక్ష్మీనరసింహముగారు వీరేశలింగం పంతులుగారి నవలలనే ఒరవడిగ పెట్టుకొని మొట్టమొదట నవల రచనకు గండంగిరి. ఈ విషయమును కూర్చి శ్రీ లక్ష్మీనరసింహముగారే వారి స్వీయచరిత్రలో నిట్లు వ్రాసిరి. "నవలలు వ్రాయుటకు మాకప్పుడు వీరేశలింగముగారు వ్రాసిన 'రాజశేఖర చరిత్ర' యను నవలయే యాదర్శకము. ఆ నవలను నే నామూలాగ్రముగ జదివి, నవలలు రచియించు పద్ధతి తెలిసికొని, 'రామచంద్ర విజయము'ను వ్రాసితిని."[31]

శ్రీ చిలకమర్తివారు వ్రాసినన్ని నవలలను ఆ కాలములో వ్రాసినవా రెవరును లేరు. వీరు వ్రాసిన నవలలలో చరిత్రాత్మకనవల్ల లధికము. ఈ సత్య మును పురస్కరించుకొని వీరికి ఆంధ్ర ప్రజలు 'ఆంధ్రస్కాట్' అను బిరుదము నిచ్చిరి. 'రొమాంటిక్' (Romantic) కవియైన 'సర్ వాల్టర్ స్కాట్' నవలలలో వలెనే వీరి నవలలయందును వర్ణనకు ప్రాముఖ్య మధికము. 'స్కాట్' తన లోని కాల్పనిక (Romantic) ప్రతిభ యొక్క ప్రకాశమునకు తగినవిధముగా ప్రాచీనగాథలను తన నవలలకు 'వస్తువు'గా గ్రహించెను. అట్లాతడు గ్రహించినను, ఆ నవలలలోని పాత్రలు, ఆతని సమకాలిక సంఘములోనివారి వలెనే ఉండును. వారి కోరికలు, కష్టసుఖములు మొదలగు హృదయసంబంధి విషయముల నన్నింటిని, 'స్కాట్' రమణీయ ప్రతిభతో వర్ణించెను. శ్రీ చిలకమర్తివారి ప్రతిభకూడ నట్టిదే. మధ్యయుగమునాటి చరిత్రను పృష్ఠభాగముగ నిడుకొని 'స్కాట్' తన నవలలను వ్రాయగా, శ్రీ లక్ష్మీ నరసింహముగారు భారతదేశ చరిత్రను నేపథ్యముగ నిడుకొని తమ నవలలను వ్రాసిరి. ఆంధ్ర సాంఘిక జీవనము కనులకు గట్టినట్లు చూపు ఆంధ్రులకు సంబంధించిన నవలలు వ్రాసిరి. వంగజీవితమును ప్రదర్శించు నవలల ననువాదము చేసిరి. శ్రీ చిలకమర్తి లక్ష్మీ నరసింహముగారు కాలము ననుసరించి, శిక్షణము ననుసరించి సంప్రదాయ రూఢమైన పద్ధతి కలవాటుపడిన వారయినను, రచనలందును మనఃప్రవృత్తి యందును కాల్పనిక లక్షణములు కూడకొన్ని కలవారే. వీరినవలలయం దీలక్షణము బాగుగా కన్పట్టును. ఆంగ్ల సాహిత్య ప్రభావము ప్రత్యక్షముగను,

---

30. "కందుకూరి వీరేశలింగముపంతులుగా రప్పుడు పహాయాంధ్రోపాధ్యాయుడుగ నుండి, మాకు తెలుగు చెప్పుచుండిరి."

శ్రీ చిలకమర్తివారి స్వీయచరిత్రము ; పుట - 46.

31. శ్రీ చిలకమర్తివారి 'స్వీయచరిత్రము' ; పుట - 103.

వంగాది సాహిత్యముల ద్వారమున పరోక్షముగను, వీరినవలలపై కలదు. రచనా విధానమును, వర్ణనాపద్ధతిని, పాత్రపోషణ చిత్రణములను ఆంగ నవలల నుండి గ్రహించినంతగా వీరు, ఆంగ్ల కథలను, భావములను గ్రహింపలేదు.

ఆ కాలమున, నవలలను వ్రాయుటకు రచయితలకు మంచి ప్రోత్సాహ మిచ్చిన పత్రిక 'చింతామణి'. శ్రీ చిలకమర్తివారి నవలలనుగూర్చి ప్రస్తావించు నప్పుడు 'చింతామణి' పత్రికను పేర్కొనకతప్పదు. ఈ పత్రికను శ్రీ న్యాపతి సుబ్బారావుపంతులుగారు స్థాపించిరి. దీని కండగ వీరేశలింగంపంతులుగా రుండిరి. 1891 లో స్థాపింపబడిన ఈ పత్రికలో ప్రాచీనకవుల కావ్యము లెన్నియో మొట్టమొదటిసారిగా వెలుతురును చూచినవి. 1893 వ సంవత్సర ములో, "శ్రీ సుబ్బారావుపంతులుగారు పాశ్చాత్యదేశ పద్ధతిని మన భాషలో గూడ నాఖ్యాయికలను వ్రాయింపదలచి, పోటీ పరీక్షలు పెట్టి, వారి స్వధనములో నుండి బహుమానముల నీయ నారంభించిరి. ఈ యుత్కృష్ట కార్యమువలననే మనదేశములో క్రొత్తనవల లెన్నో తలయెత్తినవి."[32]

1893-వ సంవత్సరములో జరిగిన పోటీలకు మూడు నవలలు మాత్రమే వచ్చినవి. అందులో రెండింటికి మాత్రము బహుమానములు వచ్చెను. మొదటి బహుమానము డెబ్బదియైదు రూపాయలు. రెండవ బహుమానము ఏబది రూపాయలు. ఈ నవలలో మొదటి బహుమానముపొందిన నవల పేరు 'ధర్మవతీ విలాసము'. దీనిని శ్రీ ఖండవల్లి రామచంద్రుడుగారు రచించిరి. రెండవ బహుమానమును పొందిన నవల పేరు 'సంజీవరాయ చరిత్రము'. దీనిని శ్రీ టి. సూర్యనారాయణగారు రచించిరి. ఈ సంవత్సరము పోటీలో శ్రీ చిలక మర్తి లక్ష్మీనరసింహంగారు పాల్గొనలేదు. ఈ నవలలు 1894 లో అచ్చయినవి.

బహుమానధనము తక్కువగ నుండుటచే మంచి నవలలు వచ్చుటలేదని శ్రీ సుబ్బారావు పంతులుగా రభిప్రాయపడి, 1894 లో మొదటి బహుమాన మును నూటయిరువది యైదురూపాయలను చేసిరి. ఈ సంవత్సరము శ్రీ చిలకమర్తివారు 'రామచంద్ర విజయము'ను రచించి పోటీకి పంపిరి. ఆ సంవత్సరము పోటీకి పదునాల్గు నవలలు వచ్చినవి. పరీక్షకులుగా శ్రీ వావి లాల వాసుదేవశాస్త్రిగారును, శ్రీ వీరేశలింగము పంతులుగారును, శ్రీ ఆచంట

32. Ibidem; పుట - 101.

సుందరరామయ్యగారను జిల్లాకోర్టు న్యాయవాదియు, నియమింపబడిరి. ఈ పరీక్షకులలో — వాసుదేవశాస్త్రిగారును, సుందరరామయ్యగారును, 'రామచంద్ర విజయము'నకు మొదటి బహుమానమీయవలెననిరి. వీరేశలింగంపంతులుగారు మాత్రము ప్రథమ బహుమానము, శ్రీ గోశేటి కనకరాజుగారు రచించిన 'వివేక విజయము'న కీయవలెనని తీర్పుచెప్పిరి. తుదకు బహుమాన ధనమును మొత్తముగాచేసి దానిని రచయితల కిరువురకు సమముగా పంచిరట![33]

ఆ కాలములో బయలుదేరిన నవలలకు నామముల తుదను 'చరిత్ర' యనునది — శ్రీరంగరాజు చరిత్ర (1872); రాజశేఖర చరిత్ర (1880); సంజీవరాయచరిత్ర (1893)—సామాన్యముగా కన్పట్టుచున్నది. ఆంగ్లభాషలో కూడ మొట్టమొదట నవలలకు, "The Story of ..." అనిగాని "The History of ..." అనిగాని పేరులుండెడివి.

వీరేశలింగము పంతులుగారి తరువాత, అహమహమికతో, నవలలను రచించినవారు శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారును, శ్రీ ఖండవల్లి రామచంద్రుడుగారును నై యుండిరి. కాని, చిలకమర్తివారికి బహుశాఖలలో రచనలుచేయు నేర్పుండుటచే కాలక్రమమున పేరెక్కువగా సంపాదించిరి. వారితో పోటీచేసి నవలలను రచించిన వారిపేరు క్రమక్రమముగా సన్నగిల్లుటచే, వీరేశలింగంపంతులుగారి తరువాత నవల రచయితగ చిలకమర్తివారికే పేరు వచ్చెను.

1896-వ సంవత్సరములో నవలలపోటీకి పీరు 'హేమలత'యను నవలను బంపిరి. ఇది చరిత్రాత్మకమగు నవలయగుటయే దీని విశేషము. 'రాజశేఖర చరిత్రము' చదివి 'రామచంద్రవిజయము' వ్రాయుట నేర్చుకొని నటులనే; ఆంగ్లములోని "మెడోస్ టెయిలర్ "అను రచయిత నవలలను చదివి చరిత్రాత్మకమగు నవలలను వ్రాయుపద్ధతిని వీరు గ్రహించిరి. ఈ విషయమునుగూర్చి తమ స్వీయచరిత్రలో శ్రీ లక్ష్మీనరసింహముగారిట్లు వ్రాసిరి. "పూర్వము తెలుగు నవలలకు వీరేశలింగముగారి 'రాజశేఖరచరిత్ర'యే మార్గదర్శకముగ నుండెను. అది చరిత్రాత్మకమైన నవలకాదు. అది సాంఘికమైన నవల. దానిని చదివియే నేను రామచంద్ర విజయమును వ్రాసితిని. చరిత్రాత్మకమైన నవల వ్రాయవలెనని సంకల్పము నాకు గలుగగా, నప్పుడు పూర్వము 'మెడోసు టెయిలర'ను దొరగారు వ్రాసిన నవలలో టిప్పుసుల్తాను, తార, చాందుబీబి,

33. Ibidem. పుట—102.

యను నవలలను నామిత్రుడైన యొక యువకునిచే జదివించుకొని వింటిని. అవి విన్నతరువాత చరిత్రాత్మకమైన నవల వ్రాయువిధము నాకు దెలిసినది. అనంతరము నేను 'హేమలత, వ్రాసితిని.'[34]

ఆ సంవత్సరము పోటీకి పదినవలలువచ్చినవి. వీరేశలింగం పంతులుగారు, వడ్డాది సుబ్బారాయకవిగారు, ఆచంట సుందరరామయ్యగారు; నవలలకు పరీక్షకులుగ నుండిరి. వీరు మువ్వురును చిలకమర్తివారి 'హేమలత'కు ప్రథమ బహుమానమిచ్చిరి. శ్రీ ఖండవల్లి రామచంద్రుడుగారి 'లక్ష్మీసుందర విజయము'నకు రెండవ బహుమాన మిచ్చిరి. ఇది 1897 లో అచ్చయినది.

1897 లో జరిగిన నవలలపోటీలో శ్రీ చిలకమర్తివారి "అహల్యాబాయి" అను నవలకు ప్రథమ బహుమానము వచ్చినది. దేశములో "లక్ష్మీనరసింహముగారు నవల వ్రాసిపంపిన సంవత్సరము వారికేగాని, మరియెవరికిని బహుమానము రాదని వాడుకపడెను."[35]

1897 తో నవలలపోటీ ఆగిపోయెను. అంతవరకు రాజమహేంద్రవరమున నుండి, న్యాపతి సుబ్బారావుపంతులుగారికి చేదోడు వాదోడుగానున్న వీరేశలింగంపంతులుగారు మద్రాసు పోదలంచుటచేతను, 'చింతామణి'[36] పత్రిక

34. Ibidem. పుట-127.

35. శ్రీ చిలకమర్తివారి స్వీయచరిత్రము. పుట-135.

36. 'చింతామణి' (రాజమహేంద్రవరము) 'నవలల పోటీ'లలో బహుమానము పొందిన నవలలు : రచయితలు.

| | | | |
|---|---|---|---|
| 1893 | ధర్మవతీ విలాసము | — | ఖండవల్లి రామచంద్రుడుగారు |
| | సంజీవరాయ చరిత్ర | — | తల్లాప్రగడ సూర్యనారాయణరావుగారు |
| 1894 | రామచంద్ర విజయము | — | చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు |
| | వివేక విజయము | — | గోటేటి కనకరాజుగారు |
| 1895 | త్రివిక్రమ విలాసము | — | లేకుమళ్ళ రాజగోపాలరావుగారు |
| | మాలతీ రాఘవము | — | ఖండవల్లి రామచంద్రుడుగారు |
| 1896 | హేమలత | — | చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు |
| | లక్ష్మీసుందర విజయము | — | ఖండవల్లి రామచంద్రుడుగారు |
| 1897 | అహల్యాబాయి | — | చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు |

శ్రీ రెంటాల వెంకటసుబ్బారావుగారి 'కేసరీ విలాసము', శ్రీ కూనపులి లక్ష్మీనరసయ్యగారి 'భక్షి' అను నవలలు పై నవలలతో ఇంచుమించుగా సమకాలికముగ బయలుదేరినవే.

రాజమహేంద్రవరము నుండిగాక, మదరాసునుండి బయలు వెడలనుండుట చేతను, క్రమముతప్పక ప్రతిసంవత్సరము జరిగిన నవలలపోటీ నిలిపివేయబడినది. దానితో శ్రీ లక్ష్మీనరసింహముగారితో పోటీచేసిన వారందరు నవలలు వ్రాయుట మానుకొనుట జరిగినది. లక్ష్మీనరసింహముగారు మాత్రము నవలలను వ్రాయుచునే యుండిరి.

1898 లో శ్రీ లక్ష్మీనరసింహముగారు 'సౌందర్య తిలక' అను నవలను ప్రారంభించి, తమ పత్రికయగు 'సరస్వతి' యందు ముద్రించుచు వచ్చిరి ఈ పత్రికకగు వ్యయమును శ్రీ పోలవరము జమీందారుగారు భరించుచుండిరి. ఈ నవలయొక్క మొదటి భాగము 1899 డిసెంబరునాటికి పూర్తియయ్యెను. రెండవభాగము 1900 డిసెంబరు నాటికి పూర్తియయ్యెను. దీని తరువాత 'కర్పూరమంజరి' అను నవలను వ్రాసి మొదటిభాగమును 1906 లో ముగించిరి. ఈ నవల తరువాత చిలకమర్తివారు; ప్రఖ్యాత వంగరచయిత యయిన శ్రీ రమేశచంద్రదత్తు ఆంగ్లములో వ్రాసిన 'ది లేక్ ఆఫ్ పామ్స్' (The Lake of Palms) అను నవలను, 'సుధాశరచ్చంద్రము' అనుపేర తెనిగించిరి. ఇవిగాక వారింకను—కృష్ణవేణి, మణిమంజరి, గణపతి, రాజరత్నము అను వానిని రచించిరి.

వీరు రచించిన సాంఘిక నవలలలో 'రామచంద్ర విజయము' గొప్పది. రామచంద్రుడను పేద యువకుడు, అనేక కష్టములు పడి, తన తెలివితేటల చేతను, శీలసంపదచేతను, విరోధుల నందరిని జయించి, తన కాతిథ్య మిచ్చిన ధనవంతుల ఇంటి బిడ్డనే పరిణయమాడి సుఖపడుట ఇందలి కథ. ఈ నవలను చదువుచున్నప్పుడు ఆంగ్లములో ఛార్లెస్ డికెన్స్ (Charles Dickens: 1812-1870) వ్రాసిన ఆలివర్ ట్విస్ట్ (Oliver Twist) ; నికొలస్ నికెల్బీ (Nicholas Nickleby); డేవిడ్ కాపర్ఫీల్డ్ (David Copperfield) అను నవలలు జ్ఞప్తికి వచ్చును. 'రాజశేఖర చరిత్రము' చదివి "నవలను వ్రాయుట నేర్చుకొంటి" నను మాటలలో సత్యముండవచ్చును గాని; పైని పేర్కొనబడిన నవలలను చదువకున్నచో, శ్రీ లక్ష్మీనరసింహముగారు 'రామచంద్ర విజయము' నట్లు వ్రాసియుండెడివారుకారు. కథాగమనములో రాజశేఖర చరిత్రకు, రామచంద్ర విజయమునకు పోలికలు చాల తక్కువ. రామచంద్రునివంటి పాత్ర అందుగాని, రాజశేఖరునివంటి పాత్ర ఇందుగాని లేదు.

'ఆలివర్ ట్విస్ట్' నవలలో సత్ప్రవర్తనగల బాలుడు కష్టముల నెట్లెదుర్కొని జయమును పొందునో చక్కగా చూపబడెను. ఈ నవలద్వారమున, తనకాలములోని క్రూరహృదయులకొక సందేశమును 'డికెన్స్' ఇచ్చినాడు. వాస్తవికత యొక్క పాలు 'డికెన్స్' నవలలలో ఎక్కువ గనుకనే వానికా పేరువచ్చెను. 'ఆలివర్ ట్విస్ట్' వలెనే రామచంద్ర విజయములోని రామచంద్రుడును దరిద్ర బాలుడు; శీలసంపత్తి కలవాడు. సంఘములోని దురాచారములను చూచి ఆశ్చర్యపడి, అనేకకష్టములకు గురియైనవాడు. ఆంగ్లనవలలో (Oliver Twist) వస్తువునకంత ప్రాముఖ్యములేదు. దానికి(Plot) కొంత ప్రాముఖ్యము నిచ్చుచు డికెన్స్, 'నికొలస్ నికెల్బీ' రచించెను. దీనినుండి శ్రీచిలకమర్తివారు గ్రహించినది "యార్క్‌షైర్‌స్కూల్ సీన్స్" (Yorkshire School Scenes) రామచంద్ర విజయములో, బడులలో చదువురాని ఉపాధ్యాయులు పిల్లలనెట్లు భయంకరముగా, చావబాదెదరో జాలిపుట్టునట్లు శ్రీ లక్ష్మీనరసింహముగారు వర్ణించిరి. రామచంద్రునకు ఆశ్రయమిచ్చిన శరభరాజుగారి రెండవకుమారుడైన నరసింహమునకు అక్షరాభ్యాస మహోత్సవము జరుగును. ఆబాలుని, అమలాపురములోగల ఒక వీథిబడిలో వేయుదురు. అక్కడి బడిపంతులు పిల్లలను శిక్షించు విధమును కనులకు గట్టునట్లు లక్ష్మీనరసింహముగారు వర్ణించిరి.[37] ఆ సందర్భములోని ఈ క్రిందివాక్య మొక్కటియు ఆబడి కలరూపును తెలుపుటకు చాలును.

"ఆ పాఠశాల యమలోకమును, జదువవచ్చిన బాలురు నరకమనుభవింప వచ్చిన పాపకర్ములును బంతులొక యమధర్మరాజునుగా నుండెను."

డికెన్స్ వ్రాసిన 'డేవిడ్ కాపర్‌ఫీల్డ్' నవలలోని 'డేవిడ్' తో రామచంద్రుని పోల్చవచ్చును. డేవిడ్ యొక్క కష్టములు, ఇతరులచేత నాతడు మోసగింపబడుట మొదలయిన వన్నియు రామచంద్రవిజయమున రూపాంతరమును బొందియున్నవి. రామచంద్రవిజయములోని శోభనాచలము, వెంకటరత్నములు; మికబెర్ (Micawber), ఉరయా హీప్ (Uriah Heep) లకు సాహిత్యప్రపంచమున సోదరులు.

శ్రీ లక్ష్మీనరసింహముగారు చారిత్రక నవలలను వ్రాయుటకు పూర్వమందు 'మెడోస్ టెయిలర్' (Meadows Taylor; 1808—1876) రచనలను చదివి, తద్రచనా విధానము ననుసరించినట్లు తెలిసికొంటిమి. ఇట 'మెడోస్

37. 'రామచంద్రవిజయము' చిలకమర్తివారి షష్టిపూర్తి ముద్రణము. సంపూర్ణ గ్రంథావళి (1927) పుటలు-330, 331, 332, 333.

'టెయిలర్' ను గురించి కొంత గ్రహింపవలసియున్నది. ఈతడు 1808 లో 'లివర్‌పూల్' నందు జన్మించెను. తరువాత పదునైదు సంవత్సరములకు ఇండియా వచ్చెను. ఇండియా వచ్చిన తరువాత కొంతకాలము బొంబాయిలో కంపెనీపనిలో నుండి తరువాత నిజాము సేనలో చేరెను. 1824 మొదలు 1860 వరకు మనదేశములోనుండి సివిల్, మిలిటరీ పనులను చూచుచుండెను. ఈతని జీవితములో మొదటి ఏబది సంవత్సరములు, పందొమ్మిదవ శతాబ్ది పూర్వార్ధమందు పడుటచే; 1857 లో జరిగిన సిపాయిల విప్లవమునకు పూర్వ మున్న దేశస్థితి ఈతనికి బాగుగా తెలియును. కనుకనే ఈతని రచనలలో చాల భాగము భారతదేశమునకు సంబంధించినది. ఈతడు వ్రాసిన మొదటి గ్రంథము 'కన్ఫెషన్స్ ఆఫ్ ఎ థగ్ (**Confessions of a Thug**). ఇది 1839 లో అచ్చ యినది. దీనికి వచ్చిన ప్రచారము ప్రోత్సహింపగా మిగిలిన గ్రంథముల నాతడు వ్రాసెను.[38] 1840 లో 'టిప్పుసుల్తాను'; 'సీత' 1872 లోను; 'చాంద్‌బీబీ' 1875 లోను; ప్రచురింపబడెను. ఇవి ఆతని ముఖ్యమైన నవలలు. 'తార' అను నవల 1863 లో ప్రకటింపబడెను.

ఆంగ్లనవల మంచి పేరుపొందియున్న కాలములో 'టెయిలర్' రచనలు బయలుదేరెను. సర్ వాల్టర్ స్కాట్ 1832 లో చనిపోయెను. కనుక, 1840 లో వచ్చిన టిప్పుసుల్తాను నవలలో 'స్కాట్' యొక్క వర్ణనాపద్ధతి మొదలైనవి బాగుగా వచ్చెను. జరిగిపోయిన కాలమును, సంగతులను కాల్పనిక దృష్టితో జూచుట 'టెయిలర్', స్కాట్ నుండియే గ్రహించెను. ఆ కాలము లోనే నివసించి, చరిత్రాత్మక నవలనే వ్రాయుచు, 'స్కాట్' ప్రభావమునుండి తప్పించుకొనుట జరుగునదికాదు. కనుక 'టెయిలర్' నవలలలో, 'స్కాట్' నవలలలోని జగత్తే ప్రతిబింబించినది. ఈ పరిస్థితులలో చరిత్రాత్మకమైన నవల వ్రాయదలచిన చిలకమర్తివారి దృష్టి 'టెయిలర్'పై బడుట సహజము.

చిలకమర్తి లక్ష్మీనరసింహముగారి 'హేమలత' 1896 లో రచింపబడెను. అంతకుపూర్వము ఇరువది సంవత్సరముల క్రిందటనే, ఆంగ్లసాహిత్యరంగములో

---

**38. "The confessions have been received with much greater interest and success than I had ever ventured to hope for. It was curious to here people wondering over the book and discussing it, and evidently the subject was a new sensation to the public. I was asked also to write another book, which should take the place of an historical novel, and become the forerunner of a series of such Indian works, and Tippu Sultan was chosen as the subject".**

—The Story of my life by M. Taylor. 1877.

పేరుపొందె. చనిపోయిన (1876) 'మెడోస్ టెయిలర్' పుస్తకములు వీరి నాకర్షించుట వింతగాదు. ఆతడును భారతదేశమునకు సంబంధించిన కథలను గ్రహించి వ్రాయుట, లక్ష్మీనరసింహముగారికి మరింత ప్రోత్సాహము కలిగించి యుండును. వీరి నవలలపై 'స్కాట్' ప్రభావము కొంతవరకు ప్రత్యక్షముగను, కొంతవరకు 'టెయిలర్' నవలల ద్వారమునను పడినదనవచ్చును.

నవలను ప్రారంభించునపుడు వర్ణనలతో ప్రారంభించుట ఆనాటివారి కలవాటు. ఎవరో మార్గస్థుడుగాని, సేనాసమూహముగాని, అరణ్యములవెంట బయలుదేరి పోవుచున్నారనిగాని, లేక ఒకవీరుడు గుఱ్ఱముపై నెక్కి పోవు చుండగా బందిపోటుదొంగ లెదిరించినట్లుగాని, నిర్జన ప్రదేశమునుండి యొక స్త్రీ ఆర్తనాదము వినవచ్చినట్లుగాని వ్రాయుట ఇట్టి నవలలలో పరిపాటి. కథలు వేరైనను కథా ప్రారంభము లొకవిధముగనే యుండును. కథయన్న అట్లుండ వలెనని వారనుకొనిరి. ఈ పద్ధతినే తెలుగులో చిలకమర్తివారు నవలంబించిరి. ఆంగ్లములోని 'టిప్పుసుల్తాను' నవల ప్రారంభమునకును, 'హేమలత' నవల ప్రారంభమునకును గల పోలికలుకొన్ని క్రింద చూపబడెను.

*Tippu Sultan*—Chapter I—How a great Lord travelled with his young wife — (i) The Journey.

"Towards the close of a day of intense heat, about the middle of June, 1788, a large party might have been seen straggling over the plain which extends southwards of the Fort of Adoni."

"The leader, a man of perhaps fifty years of age, rode a powerful Dekhan horse of great spirit. But the animal was weary with travelling over miry roads the greater part of the day, and it, and its rider, were splashed with mud from head to foot."

"The rider's head was wrapped up in thick folds of muslin to protect it from the scorching heat of the sun. His face was dark-skinned and much pitted with small-pox, but his eyes were large and black and seemed to flash with a sudden light when any stumble of his tired horse provoked an impatient jerk of the bridle..............".

హేమలత నవలలోని కథకును దీనికిని సంబంధము లేకున్నను, అది 'టిప్పుసుల్తాను' నవలవలెనే ప్రారంభమగును. ఇది శిల్పవిషయకమైన అనుసరణ మును దెల్పును.

హేమలత—మొదటి ప్రకరణము—"ఒకనాటి సూర్యాస్తమయ సమయమున శరీరమునందంతట భస్మము పూసికొని కాషాయాంబరములఁ

గట్టుకొనిన యొక మార్గస్థుఁడు యమునానది వైపునకు వచ్చుచుండెను. అతఁ డేగ్రామమునుండి వచ్చుచుండెనో యే గ్రామమునకుఁ బోవుచుండెనో యెఱిఁగిన వా రెవ్వరును లేరు.........అది వేసవికాల మగుటచేతను, సకల జంతు భయంకరముగా నామధ్యాహ్నము గాడ్పు వీఁచుటచేతను నామను ష్యుఁడు మార్గాయాసమువలన డస్సియుండెను......ఆతడు రమారమి నలు వది సంవత్సరముల వయస్సు గలిగియున్నను, నంతవయస్సుగల వానివలెఁ గన్పడఁడు. ఆమనుష్యుఁడు పొడగరికాఁడు గాని కేవలము పొట్టియని చెప్పుటకు వీలు లేదు. శరీరము చామనచాఁయ గలదియై యుండును......"

'హేమలత' నవలలోని కథ 'అల్లాఉద్దీన్' కాలములో జరిగినట్లు వ్రాయ బడినది. 'భీమసింగు' యొక్క భార్యయైన 'పద్మిని' నెక్కైన తన కొప్పగించినచో సంధికుదురునని సుల్తాను కబురంపుటయు, రాజపుత్రులందుల కియ్యకొనకుండు టచే యుద్ధముజరిగి వారు మడియుటయు, రాజస్థాన చరిత్ర తెలిసినవారి కందరకు పరిచయమైన కథయే. ఇందు మొట్టమొదటిసారి భీమసింగును ముస్లిములు పట్టుకొనగా, రసపుత్రవీరులు పల్లకులలోపోయి, ఆ ప్రభువును విడిపించుకొని వచ్చుటవరకు మాత్రమే కలదు.

'టిప్పుసుల్తాను' నవలలోవలెనే ఇందును ఒక 'రహిమాన్ ఖాన్' గలడు. అందాతడు టిప్పుసుల్తానున కాప్తుడు. ఇందితడు అల్లాఉద్దీనున కాప్తుడు. రెండు కథలకును పృష్ఠభాగముగ (**Background**) ముస్లిము ప్రభువులపాలనమే. పాత్రపోషణ విషయముననను, సంభాషణను నడపుటయందును గూడ, ఆంగ్ల నవలనే చిలకమర్తి వారు అనుసరించుట జరిగినది.

చిలకమర్తివారి ఇంకొక చరిత్రాత్మక నవల 'అహల్యాబాయి.' ఇది 1897 లో రచింపబడినది. దీనియందును 'మెడోస్ టెయిలర్' రచించిన ఆంగ్ల నవలల ఛాయలుగలవు. 'టెయిలర్' ఆంగ్లములో 'చాంద్ బీబీ' యను నవలను రచించెను. 'చాంద్ బీబీ' సాహస కృత్యములందు వర్ణింపబడినట్లే ఇందు, 'అహల్యాబాయి' సాహసకృత్యములు వర్ణింపబడెను. ఇంతియేగాక, ఈ నవల లోని కొన్ని సన్నివేశములు, 'టిప్పుసుల్తాను' నవలనుండి చిలకమర్తివారు గ్రహించినట్లు కన్పట్టుచున్నది.

'టిప్పుసుల్తాను' నవలలో 'అబ్దుల్ రహిమాన్ ఖాన్', ఒక పల్లకిలో తన భార్య నెక్కించుకొని సాయంకాలమున చీకటిపడిన తరువాత ఆదోనినుండి బయలు వెడలి వచ్చుచుండును. మార్గాయాసముచే నందరు బడలి యుందురు.

అప్పుడప్పు డాతడు పల్లకిలోనికి తొంగిచూచుచు లోనిస్త్రీకి ధైర్యము చెప్పుచుండును.[39] ఇట్టిదే సన్నివేశము 'అహల్యాబాయి' లో కూడ కలదు. అక్కడ పల్లకిని పట్టించుకొని వచ్చుచున్నవాడు 'రాణోజీ హోల్కారు'. పల్లకిలోని కన్య,అతడు వివాహమాడుటకై తెచ్చుచున్న 'కమల'యను నామె. అందరును బడలియుండుటచే, నీతడును పల్లకిలోనికి తొంగిచూచుచు, లోనిస్త్రీకి ధైర్యము చెప్పుచుండును. 'రహిమాన్ఖాన్' వర్ణనకును, అహల్యాబాయి నవలలోని 'రాణోజీ హోల్కారు' వర్ణనకు పోలికలు గలవు.[40]

'టిప్పుసుల్తాను' నవలలో 'అబ్దుల్ రహిమాన్ఖాన్' అందమైనవాడు కాడుగాని సమర్థుడనివర్ణింపబడినది. ఆ వర్ణనయొక్క సారాంశమే, 'అహల్యాబాయి' నవలలోని 'రాణోజీ హోల్కారు' విషయమున చేయబడెను.

**Tippu Sultan—"......The leader, a man of perhaps fifty years of age, rode a powerful Dekhan horse of great spirit...His face was dark-skinned and much pitted with small-pox, but his eyes were large and black......In truth, soiled and bespattered though he was, Abdul Rahiman Khan, trusted Officer of Tippu Sultan, was a striking figure on these broad plains..." (Chapter I).**

అహల్యాబాయి—" ......రాణోజీహోల్కారున కప్పటికి నేబది సంవత్సరములకంటె నొకటి రెం డెక్కువ యుండునేగాని తక్కువలేవు ... తెలివితేటలుగల మహారాష్ట్రుడగుటచే నతిత్వరితముగా రాజ్యముననున్న ముఖ్యోద్యోగస్థులలో నొక్కడై యుండెను ...... అతడు సౌందర్యములేని నల్లని మోటుమనుజుడని చెప్పుటకంటె వాని యాకారము వర్ణింపనక్కఱలేదు. ... ............" (మూడవ ప్రకరణము.)

పల్లకిలో పయనించుచున్న భార్యకు ధైర్యము చెప్పుటకై, 'ఖాన్' పల్లకిలోనికి తలదూర్చి ఆమెతో మాటాడును. చిలకమర్తివారి నవలలోగూడ 'రాణోజీ' యట్లే మాటాడును.

**Tippu Sultan—"What say you, my soul?" cried the Khan to the inmate of the palankin; "you have the choice of a comfortable supper and a dry lodging, or no supper and perhaps no roof over your head; you see what it is to follow the fortunes of a soldier."**

**(Chapter I; The Journey.)**

---

39. Tippu Sultan—Meadows Taylor. I Chapter.

40. అహల్యాబాయి—శ్రీ చిలకమర్తివారు; ప్రకరణము మూడు.

అహల్యాబాయి : "ఓంకార నాదములతో బోయలు పల్లకి మోయుచుఁ దనవెంట రాఁగా రాణోజీ హోల్కారు గడియగడియకు సకిలించుచు నలిసి మోయలేక తన్ను మోయుచున్న గుఱ్ఱమునెక్కి......మార్గశ్రమచేఁ జెన్ను చెదరి విసిగియున్న యా సుందరి పల్లకికి సరిగా మధ్యమధ్య నొకమాఱు తన గుఱ్ఱమును నడిపించుచుఁ "గమలా! నీవు మిగుల శ్రమపడినట్లున్నావు. వచ్చి నంతదూరము రానక్కఱలేదు. కావలసిన యెడల నాదగ్గఱనున్న రొట్టెలు నాల్గు తిను"మని యోదార్పు మాటలు పలుకుచు వడిగ నడుగులువైవుఁడని బోయలను హెచ్చరించుచు రాణోజీ......" (మూడవ ప్రకరణము)

ఆంగ్లనవలలోని మొదటి ప్రకరణము, తెలుగు నవలలోని మూడవ ప్రకరణము పోల్చిచూచినచో; చిలకమర్తివారు 'టెయిలర్'ను ఎంతగా అనుసరించిరో స్వయంవ్యక్తమగును. పైని పేర్కొన్న సన్నివేశముల తరువాత, రెండు నవలలలోను కారణములు వేరైనను పరిస్థితు లొక విధముగనే పర్యవసించును. 'అబ్దుల్ రహిమాన్ ఖాన్'నకు మార్గమధ్యమున ఒక ఏరు దాటవలసి వచ్చును. ఆ తొందరలో, ఆ చీకటిలో బోయలు పల్లకిని నీటిలో పారవేయుదురు. పల్లకిలోని 'కమనీయమూర్తి' కొట్టుకొని పోవును. ఖాన్ నీటిలో నామెకై పడును. అక్కడి పల్లెలోని యువకు డొకడు (కాశిం ఆలీ) ఆమెను రక్షించును.

అహల్యాబాయి నవలలో పల్లకితో కలిసి రాణోజీ పయనించు చుండగా ఒక వృషభము చెలరేగి వారిపై బడును. అది కోపముతో రాణోజీని పొడిచి క్రిందపడవేసి, పల్లకిపై పడును. లోని స్త్రీ (కమల) మూర్ఛపోవును. ఇంతలో సేవకుల కేకలువిని, శ్యామసుందర దత్తను యువకుడు ఎద్దును సంహరించి వారిని రక్షించును. "ఏటి" సన్నివేశమును తొలగించి "వృషభ" సన్నివేశమును ఇచ్చట చిలకమర్తివారు పెట్టిరి. దీనికిని ఆంగ్లములో మూలము కలదు. 'సర్ వాల్టర్ స్కాట్' రచించిన 'బ్రైడ్ ఆఫ్ లేమర్మూర్' (**Bride of Lammermoor**) అను నవలలో, కథా నాయకు డిల్లే ఒక జంతువు బారినుండి కథానాయికను రక్షించును. 'ఆంధ్ర స్కాట్' బిరుదాంకితులైన శ్రీ చిలకమర్తివారు, స్కాట్ నవలనుండి ఈ సన్నివేశమును గ్రహించి యుండిరనుటలో ఆశ్చర్యములేదు.

ఈవిధముగా చిలకమర్తివారి నవలలపై ఆంగ్ల సాహిత్యప్రభావముకలదు. కాల్పనిక జగత్తును సృష్టించుటలో నేర్పరియైన స్కాట్ నవలలు, వాని ప్రభావముసోకిన మెడోస్ టెయిలర్ నవలలు; చిలకమర్తి లక్ష్మీనరసింహాము

గారి చరిత్రాత్మకమైన నవలలను తీర్చిదిద్దుటలో సాయపడినవి. లక్ష్మీనరసింహముగారి ఈ యనుసరణము కొంత ప్రత్యక్షముగను, కొంత పరోక్షముగను జరిగిన దనవచ్చును. "సాధారణముగా మనము గౌరవించుదానిని తెలియకయే అనుసరింతుము" అను 'కోల్‌రిడ్జ్' కవి వాక్యమును ("We insensibly imitate what we habitually admire"—Coleridge) లక్ష్మీనరసింహముగారి విషయమున కొంతవరకు అన్వయింపవచ్చును.

వీరినవలలలో 'కర్పూరమంజరి' రచనా సౌష్ఠవమున తక్కినవానికంటె మిన్న. ఇందువచ్చు రుద్రభట్టుపాత్ర చక్కగా చిత్రింపబడినది. దుర్మార్గుడైన రుద్రభట్టువేయు ఎత్తులు, సన్మార్గులకు వానివలన కలుగుబాధలు మొదలగు వానిని వీరు చక్కగావర్ణించి, రుద్రభట్టుపాత్రను పోషించిరి. ఈపాత్ర చిత్రణమున వీరు షేక్స్పియర్ నాటకములలోవచ్చు కుత్సితుల పాత్ర చిత్రణమును బాగుగ పరిశీలించి చేసిరనవచ్చును. ఇంకను, ఈపాత్రకును, స్కాట్ నవలయగు 'సర్జన్స్ డాటర్' (The Surgeon's Daughter) నందు వచ్చుపాపయ్య[41] పాత్రకును కొన్ని పోలికలున్నట్లు కన్పట్టును.

సుధాశరచ్చంద్రము (The Lake of Palms) వంగీయుని రచన యగుటచే, దాని ననుసరించుటలో లక్ష్మీనరసింహముగారు చూపిన ప్రత్యేకత అంతగాలేదు; ఇటులనే 'దాసీకన్య' మొదలయిన నవలల విషయమునను. లక్ష్మీనరసింహంగారు సాహసకథలతో గూడిన 'రాజస్థాన కథావళి'ని ఆంగ్లమునుండి యనువదించుటలోనే వారి హృదయమునకుగల కాల్పనిక (Romantic) ప్రవృత్తి వ్యక్తమగును.

1880-వ సంవత్సరమునకు పూర్వము జననతిథి కలవారిలో చిలకమర్తి వారికంటె ఎక్కువ నవలలు వ్రాసినవారులేరు. కనుకనే వీరినవలలు, కొంత విపులముగా పరిశీలింపబడినవి.

చిలకమర్తివారి నవలలలో ఎక్కువసంఖ్య, పందొమ్మిదవశతాబ్ది ఉత్తర భాగములోనే రచింపబడెను. ఇరువదవ శతాబ్దిలో మొదటి మూడు నాలుగు దశలలోను నవలరచన బాగుగ అభివృద్ధికివచ్చినను; నాటిరచయితలలో, ఇంచుమించుగ అందరును 1880 లో గాని, తరువాతగాని పుట్టినవారే. కనుక ఇచ్చట వారి రచనలకు ప్రసక్తిలేదు. కాని, 1880-వ సంవత్సరమునకు ముందు జననతిథిగల వారిలో ఇరువదవ శతాబ్దియందును నవలలు వ్రాసినవారు

41. ఈ పరిశోధన గ్రంథములో పుట-155 చూడవలసినది.

చిలకమర్తి వారుకాక—కొందరున్నారు. వారిలో కొందరి రచనలపై ఆంగ్ల సాహిత్య ప్రభావమును పొడగట్టుచున్నది. ఇట్టి రచనలలో, 'మాలపల్లి' ప్రధానమైనది. దీనిరచయిత, సుప్రసిద్ధ దేశభక్తులు సంఘ సంస్కర్తలునగు ఉన్నవ లక్ష్మీనారాయణగారు (1873-1958.)

ఈనవల నాటి సాంఘిక వైజ్ఞానిక రాజకీయార్థిక పరిస్థితులకు దర్పణప్రాయమైనది.[42] మాలపల్లికథ నాలుగు భాగములుగ నున్నది. ఇందు రెండవ భాగములోని కథానిర్మాణమును పరిశీలించినచో, ఆంగ్లములో మిసెస్. హెన్రీ ఉడ్ (**Mrs. Henry Wood**) రచించిన 'ఈస్ట్ లిన్' (**East Lynne**)యొక్క ప్రభావము దీనిపైనున్నట్లు కన్పట్టును. ఈ భాగముకాక, మిగిలిన మూడు భాగములును, ఉన్నవవారు కల్పించినవే. ఇందే, లక్ష్మీనారాయణగారు వారి అనుభవములను, ఆదర్శములను, పాత్రలద్వారమున చక్కగా వ్యక్తీకరించిరి.

'మాలపల్లి' నవలలోని, ఇంచుమించుగా ఆంగ్లనవలకు నకలైన, రెండవ భాగమందలి కథఇది. కథకు నాయకుడనదగు రామానాయడు విశాల భావములు కలవాడు. ఆతనికి కులభేదములన్న కంటగింపు. హరిజనులతో కలసి మెలసి తిరుగుచుండును. ఇవన్నియు ఆతని తండ్రికి కిట్టవు. హరిజనులకు పెద్ద, సత్పురుషుడైన రామదాసు. ఆతని కుమారుడైన సంగమదాసు రామానాయనికి మిక్కిలి స్నేహితుడు. వీరిద్దరును సంస్కరణాభిలాషులు.

రామానాయనిభార్య కమల. లౌకికములైన సమస్త భోగములందును ఆమెకు మక్కువ ఎక్కువ. ఆమెకు సాహుకార్ష్ణుడను కుమారుడుకలడు. రామానాయని జీవితము సంఘసేవ కంకితమగుటచే, ఆతడు ఇంటివద్ద ఎక్కువకాలము భార్యాపుత్రులతో గడపలేడు. ఇంతలో, రామానాయని తండ్రి కోపోద్రేకమున సంగమదాసును హత్యచేయును. దీనితో రామానాయనికి విరక్తికలుగును. ఈ సందర్భమున, రామానాయని బంధువును అందగాడును నగు మోహనరావుతో కమలకు పరిచయమగును. ఆతని యౌవనము, అందము, భోగలాలసత కమలకు నచ్చి ; కుమారుని, భర్తను విడిచి ఆమె ఆతనితో లేచిపోవును. ఈ సంఘటనతో రామానాయనికి విరక్తి ఇంకను అధికమగును. తన కాలమునంతను మానవ సేవయందు వినియోగించు చుండును. సాహుకార్ష్ణుడు పెరుగుచుండును.

---

42. "The novel, if it be anything, is contemporary history, an exact and complete reproduction of the social surroundings of the age we live in."
—George Moore (1852-1933)

'మాలపల్లి'కి, ఈ నిర్వచనము చక్కగా అన్వయించును.

మోహనరావుతో లేచిపోయిన కమల సుఖపడలేదు. క్రమక్రమముగా మోహనరావున కామెపై మోజును, ఆమె కాతనిపై మోహమును తగ్గనారంభించును. వారు విడిపోవుదురు. తరువాత నామెకు మశూచికమువచ్చి, గుర్తు పట్టుటకు వీలులేనంతగా మారిపోవును. అట్టి స్థితిలో, ఆమెకు పశ్చాత్తాపము కలుగును. పుత్రప్రేమయు పెల్లుబికి వచ్చును. వెంటనే ఆమె, శాంతమ్మ అని తనపేరు మార్చుకొని తనభర్త గ్రామమునకే బయలుదేరిపోయి, భర్తయింటి యందే సాహూకృష్ణునకు దాదిగా పనికి కుదురును. ఆమె విరూపమునుచెంది యుండుటచే, ఎవరును ఆనవాలు పట్టరు. పుత్రప్రేమతో ఆమె సాహూకృష్ణుని సాకుచుండును. కాని, ఇంతలో సాహూకృష్ణునకు జబ్బుచేసి; ఎవరెన్ని మందు లిచ్చినను, శాంతమ్మ (కమల) ఎంత ఉపచారము చేసినను; చనిపోవును. ఆమె హృదయము బ్రద్దలగును. తాను తిరిగి వచ్చినపని నిరర్థకమైనదని ఆమె క్రుంగి కృశించును. రామానాయడు నిర్లిప్తుడై జీవయాత్ర సాగించుచుండును. కొంతకాలమునకు ఆమెకును జబ్బుచేసి మరణశయ్యపై నుండును. తనకిక మరణమాసన్నమైనదని ఆమె తెలిసికొని, భర్తయగు రామానాయని పిలిపించి, ఆతనికి నిజస్థితి నెరింగించి, క్షమింపుడని వేడును. ఉదార హృదయుడగు రామానాయ డామెను క్షమించుటయు, ఆమె చనిపోవుటయు జరుగును.

దీనితో ఆంగ్లనవలయొక్క ప్రభావము సోకిన, మాలపల్లి నవలలోని రెండవభాగ మంతమగును. మిగిలిన భాగములలో లక్ష్మీనారాయణగారు, నవలలోని హరిజన కుటుంబము యొక్క భాగ్యపరిణామమును, నాటి పరిస్థితులను పృష్ఠభాగమున నుంచి, వాస్తవికతతో చిత్రింతురు.

మాలపల్లి నవలపై తన ప్రభావము నెరపిన, ఆంగ్లనవల 'ఈస్ట్ లిన్' (**East Lynne**) లోని కథ ఇది.

'ఈస్ట్‌లిన్' అనునది ఒక ఇంటిపేరు. ఆంగ్లనవలలో కథానాయకుడన తగినవాడు 'కార్లైల్' (**Carlyle**). ఈతడు 'ఇసబెల్' (**Isabel**) ను వివాహమాడును. వారికి సంతానముకూడ కలుగును. కొంతకాలము వీరు సుఖముగా ఉన్న తరువాత, 'ఇసబెల్' జీవితములోనికి 'ఫ్రాన్సిస్ లెవిసన్' (**Francis Levison**) వచ్చును. తన గార్హస్థ్య జీవితముతో కొంత విసిగియున్న 'ఇసబెల్' నకు, 'లెవిసన్' యొక్క ఉత్సాహపూరితమైన జీవితము ఆకర్షకముగ నుండి; ఆమె తన సంతానమును భర్తను విడిచి; 'లెవిసన్'తో లేచిపోవును. కొంత కాలము ఈ జీవితము గడిచిన తరువాత, 'లెవిసన్' ఆమెను పరిత్యజించి

ఇంకొకతెను వివాహమాడును. ఆమె తన పొరపాటునకు పశ్చాత్తాపపడును. ఇట్లామె జీవయాత్ర ఎట్లో సాగించుచుండగా, ఒక రైలుప్రమాదమునకు గురియై, ఇతరులు గుర్తుపట్టుటకు వీలులేనంతగా వికారమయగును. తరువాత నామె, 'మదామ్ వైన్' (Madame Vine) అను పేరుతో తన భర్త ఇంటికే వచ్చి, తన పిల్లలకు 'గవర్నెస్' (Governess)గా ఉద్యోగమునకు కుదురును. ఈ పనిలోనుండగనే, ఆమెకుమారుడు, జబ్బుచేసి చనిపోవును. ఈ దుఃఖముతో నామె, మంచముపట్టి తనకు మరణమాసన్న మైనప్పుడు భర్తను పిలిపించి సంగతి అంతయుచెప్పి, ఆతనిని క్షమింపవేడి, మరణించును.

ఈ కథలను రెండింటిని పరిశీలించిన సహృదయులకు, తెలుగు నవలలోని కథపై ఆంగ్లనవల ఎట్లు తన ప్రభావమును చూపెనో స్పష్టమగును. ఈ కథా కేంద్రముచుట్టు, మిగిలిన కథనంతటిని అల్లి, లక్ష్మీనారాయణగారు ఒక ఉత్తమ నవలను తెలుగులో రచించిరి.

1880-వ సంవత్సరమునకు పూర్వము జననతిథి కలవారి రచనలలో ; 'చరిత్ర చతురానన' చిలుకూరి వీరభద్రరావు (1872—1939) గారి 'నాయకురాలి దర్పము' (చారిత్రక నవల, 1916) వలెనే కొన్ని రచనలున్నను వానిపై ఆంగ్ల సాహిత్య ప్రభావము ప్రస్ఫుటము గాకుండుటచే, వానికిట ప్రసక్తిలేదు.

## పద్యకవిత :

ఇరువదవ శతాబ్దికి పూర్వము ఆంగ్లకవిత్వ ప్రభావమున అవతరించిన ఆంధ్రకవిత తక్కువ. వీరేశలింగంపంతులుగారి వంటివారు, ఆంగ్లములోని కొన్ని పద్యకావ్యములను తెలుగులోనికి తెచ్చినను, భావకవితోద్యమము వంటి దేదియు నాడు బయలుదేరలేదు. నాటికింకను తెలుగు కవిత్వముపై సంస్కృతప్రభావ మధికముగ నుండుటచే; వచన రచయితలుగూడ పద్యరచనకు గడంగినపుడు, సాధారణముగా గీర్వాణమార్గముననే త్రొక్కుచు వచ్చిరి. ఆంగ్లవిద్యయొక్క ప్రభావముక్రింద, ఇంగ్లీషు పద్యకావ్యములను చదివి ఆనందించి అనుసరించు రచయితలు, ఇరువదవ శతాబ్ది వచ్చువరకు అధికముగా లేరు. ఆంగ్లసాహిత్యములోని 'రొమాంటిక్' (Romantic) కవుల ప్రభావము సోకువరకు, తెలుగులో పద్యకవిత నవ్యమార్గమును త్రొక్కలేదనుట సత్యదూరముకాదు. ఈ కవుల ప్రభావము, ఇరువదవ శతాబ్ది తొలియుషస్సు నందు గాని, మన సాహిత్యముపై పడలేదు. 'రొమాంటిక్' కవులుకూడ పందొమ్మిదవ

శతాబ్దికి చెందినవారగుటచే—ఇంచుమించుగా ఇంగ్లీషు 'రొమాంటిక్' కవులందరు, పందొమ్మిదవ శతాబ్ది పూర్వార్ధమునకు చెందినవారే[43] —ఆ శతాబ్దికే చెందిన వీరేశలింగంపంతులుగారివంటి వారిపై తమ ప్రభావమును ఆ కవులంతగా నెరపలేదు. సాధారణముగా నాటి తెలుగుకవులు ; పదునెనిమిదవ శతాబ్ది లేక అంతకుముందు శతాబ్దులకు చెందిన ఇంగ్లీషుకవుల రచనలను అనుసరించినట్లు కన్పట్టుచున్నది. ఈ సూత్రము ననుసరించియే, పందొమ్మిదవ శతాబ్దికిచెందిన 'రొమాంటిక్' కవుల ప్రభావము, ఇరువదవ శతాబ్దిలోని తెలుగు కవులపై పడినది. ఇదిగాక, పందొమ్మిదవ శతాబ్ది మన సాహిత్య చరిత్రలో వచనయుగముగ పేర్కొనదగియున్నది. నాడు, వచనరచనకున్న ప్రచారము, ఇంక దేనికిని ఉన్నట్లులేదు. ఇది వచనయుగము గనుకనే, ఈ యుగమునకు కర్తగా 'గద్యతిక్కన' వీరేశలింగంపంతులుగారు, అంగీకరింపబడిరి.

ఇక, పద్యకవితయందు కుతూహలముగల కవులలో చాలమంది పురాణ ఫక్కినే రచనలు సాగించుచు వచ్చిరి. మిగిలినవారిలో కొందరు ఎడనెడ ఆంగ్ల సాహిత్యవాసనలుగల రచనలనుచేసిరి. తక్కిన కొందరు ప్రకరణమునుబట్టి, రసోచితముగ ఇంగ్లీషుమాటలను వాడుచువచ్చిరి. ఇట్లు ప్రత్యక్షముగ గాని, పరోక్షముగ గాని ఆంగ్లభాషా సాహిత్యముల ప్రభావమును—అత్యల్పమైనను, తమ రచనలలో చూపినవారిలో ప్రముఖుల రచనల నిప్పుడు పరిశీలింపవలసియున్నది.

'మహామహోపాధ్యాయ' బిరుదాంకితులైన కొక్కొండ వెంకటరత్నం పంతులుగారు (1842-1915), అప్పటి 'ప్రిన్స్ఆఫ్ వేల్స్' భారతదేశపర్యటనమును పురస్కరించుకొని (1877) 'ప్రిన్స్ఆఫ్ వేల్స్ తారావళి' అను పద్యకావ్యమును రచించిరి. ఇందు కథాప్రసంగమునుబట్టి, ఉచితరీతిని, ఆంగ్లశబ్దములను వాడిరి. ఈ 'పర్యటనము'ను పురస్కరించుకొని భారతభాషలలో వ్రాయబడిన రచనలలో, కొక్కొండవారి 'తారావళి' బహుమాన యోగ్యమైనదిగా

---

43. ప్రముఖులైన ఇంగ్లీషు రొమాంటిక్ కవులు :
విలియమ్ వర్డ్స్వర్త్ (William Wordsworth; 1770—1850)
సర్ వాల్టర్ స్కాట్ (Sir Walter Scott; 1771—1832)
ఎస్. టి. కోల్రిడ్జ్ (S. T. Coleridge; 1772—1834)
లార్డ్ బైరన్ (Lord Byron; 1788—1824)
పి. బి. షెల్లీ (P. B. Shelley; 1792—1822)
జాన్ కీట్స్ (John Keats ; 1795—1821)

నిర్ణయింపబడి, నాడు పాశ్చాత్యుల మన్ననల నందెను. దీనికి ఆంగ్లానువాదము కూడ సమకూరెను. అనగా, మన విద్వత్కవులు ముస్లిముల పరిపాలనయందు వారినిగూర్చి తెలుగులో వ్రాయునపుడు, పాలకుల భాషలలోని శబ్దములను నిస్సంకోచముగ ప్రయోగించినట్లే, ఇంగ్లీషు మాటలనుకూడ ప్రయోగించుచు వచ్చిరన్నమాట. ఇది సాహిత్య ప్రభావముగా చెల్లుబడికాకున్నను, భాషా ప్రభావముగా పరిగణింపనగును. ఆంగ్లసాహిత్య పిపాసువులు కాని, విద్వత్కవులపై ఇంగ్లీషు ప్రభావము, భాషామాత్రముగా నిలిచినదనుటలో విప్రతిపత్తిలేదు.

"ఇటీవల ననగా నాంగ్లప్రభుత్వ మారంభమైన పిమ్మట నుద్భవించిన కవులలో నందు నించుమించుగ మా సమకాలికులగు కవులలోఁ బ్రాచీన సంప్రదాయముగఁ గవి సామగ్రిని సేకరించి రచనకుం గడంగువారు వీరుదక్క లేరు", అని చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారిచే కీర్తింపబడిన దాసు శ్రీరాములుగారు (1846—1908) 'దేవీభాగవతము' (1908) మొదలయిన బృహద్గ్రంథములతో బాటు, 'తెలుఁగు నాఁడు' అను 'వీధి' ని కూడ రచించిరి. ఇందు యథోచితముగ, రసపోషణకై ఇంగ్లీషు మాటలను వాడుటకు వీరు వెనుదీయలేదు. మచ్చునకు, ఈ ఉదాహరణములను గ్రహింపవచ్చును.

"నడువీధి రెడ్డిగాలిడి రచ్చ దీర్చుచో
సివిలుజడ్జీ లని చెప్పవచ్చు" (నియోగులు).

"ముదికరణాలు రాముగుడి మోసల రచ్చలు దీర్చి, భారతాల్
చదువుచు, లోకవార్తల ప్రశంసల నంద్రు; తెలుంగు బాస మం
చిది, మన పిల్లకాయలు వచించెడి *యింగిలివీసు* పుస్పుసన్.
బెదవులు దాఁట దెంతటి *'ఎఫే'* యు *'బియే'* *'ఎమియే'* వచించినన్"

ఇట్లీ కవిపుంగవుండు, తనకున్న ఆంగ్లభాషా విజ్ఞానమును సంస్కృతాంధ్రముల వలెనే, తన వ్యుత్పత్తిలో నొక భాగముగా చేసికొనెను.

ఆంగ్లములోనుండి తెలుగులోనికి మొట్టమొదట నాటకమును తెచ్చిన వావిలాల వాసుదేవశాస్త్రిగారు (1851—1897) ఆంగ్లములోనుండి 'కౌపర్' రచించిన **'On the receipt of my mother's picture out af Norfolk'** అను పద్యమును, 'మాతృ స్వరూపస్మృతి' అనుపేర తెలుగు చేసిరి. వీరుకూడ వీరేశలింగం పంతులుగారివలెనే, ఆంగ్ల కవులలో 'కౌపర్' (1731—1800) ను ఎన్నుకొనుట గుర్తింపవలసినది. పందొమ్మిదవ శతాబ్దిలోని మన రచయితలకు, పదునెనిమిదవ శతాబ్దిలోని ఆంగ్ల రచయితల నెన్నుకొనుట సహజముగనే

యున్నది. వాసుదేవశాస్త్రిగారి రచన ప్రౌఢముగ నున్నను, మూలములోని సారళ్యము మాత్రము రాలేదు.

సుప్రసిద్ధ విద్వత్కవులైన వడ్డాది సుబ్బారాయడుగారు (1854—1938) ఆంగ్లసాహిత్య ప్రభావమును ప్రత్యక్షముగ చూపురచనలను చేయకున్నను, వారు రచించిన 'స్మృతి' కావ్యములకు వెనుక ఆంగ్లకవుల 'స్మృతి కావ్యములు' నెరపిన ప్రభావము కలదనవచ్చును. వడ్డాది వారి 'సుతస్మృతి', 'సతీస్మృతి' ఇట్టివే.

బహుభాషాకోవిదులు, హరికథాపితామహులు నయిన ఆదిభట్ల నారాయణదాసుగారు (1864-1945), ప్రపంచకవులగు 'షేక్స్పియర్—కాళిదాసు'ల కవిత్వపు సొగసులను, తులనాత్మకముగచూపు 'నవరసతరంగిణి' అను గ్రంథమును సంకలనముచేసిరి. ఇది, దాసుగారికి ఆంగ్ల సాహిత్యముపై గల ప్రభుత్వమును, అభిరుచిని తెలుపజాలియున్నది. ఇదిగాక వీరు వివిధ భాషలలో పాదములుగల పద్యములను రచించిరి. ప్రాచీనకవులు, బహుభాషాకోవిదులము తామని చూపుటకు ప్రాకృతాదులను ప్రయోగించినట్లే, దాసుగారు సంస్కృతాదులతోపాటు ఇంగ్లీషునకుకూడ స్థానమిచ్చి[44] తమ హృదయ వైశాల్యమును జూపిరి. ఇంతియేగాక, ఆంగ్లకవియైన 'గోల్డ్‌స్మిత్' యొక్క 'ట్రావెలర్' (The Traveller)ను జ్ఞప్తికితెచ్చు 'బాటసారి'—దీనికి ఆంగ్లకావ్యముతో పోలిక కొంతతక్కువ—అను కావ్యమునుగూడ రచించిరి.

సుప్రసిద్ధ పండితులనియు, విజ్ఞాన వేత్తలనియు సమకాలము వారిచే కీర్తింపబడిన ఆచంట వేంకటరాయ సాంఖ్యాయనశర్మగారు (1864-1933),

44. భ్రాజతే కుక్కుటే । శ్వర మాధవాలయాభ్యాం ఘనారూఢ సౌ । ధాంతరేణ (సంస్కృతము)
హాసిల్ హమీషజ । హాన్ తాజ్‌నమూన బిహిష్మత్తుమసాఫిర్బి । హీరిసాల (ఫార్సీ)
*రావు సూర్యారావు । రాజాబహాదుర్ది ఛారిటబిల్రూల్ప్రె । జన్ట్సెరెవరి (ఇంగ్లీషు)
చదువుల పుట్టిల్లు । చల్వతెమ్మెర జల్లుమేల్పొల్లు పొగడిక । మీరఁజెల్లు (తెలుగు)
మేటి పంటల పెంకి క । ల్మి మెదలంకి (తెలుగు)
*బెస్టు టౌని న్గోదావరీ । ఈస్టు దిసిజె (ఇంగ్లీషు)
మర్జుపీర్వ జవాన్ జవాల్ । మీర్జనాన (ఫార్సీ)
పీఠికాపురమేవ త్రి । విష్టప మిహ (సంస్కృతము)

* Rao Surya Rao Rajah Bahadur the Charitable rule presents a reverie.
* Best town in Godavari east this is a.

ఇంచుమించుగ అన్ని సాహిత్య ప్రక్రియలలోను కృషిచేసిరి. కాని వీరికి ప్రకృతి శాస్త్రవిజ్ఞానమన్న ఆదరము హెచ్చు. ఆ విజ్ఞాన ప్రచారమునకు చాల గ్రంథములను వ్రాయుటయేగాక, అందలి ప్రకృతి సూత్రముల నుటంకించుచు, హాస్యరసము వెల్లివిరియు పద్యములనుగూడ రచించిరి. ఇవి వీరికిగల ఆధునిక విజ్ఞానమునకు నిదర్శనములు. ఈ క్రింది 'సంఘ సంస్కరణము'లోని పద్యము, పై విషయమును చక్కగా రుజువు చేయుచున్నది.

"నెలఁతలు చంటిబిడ్డలకుఁ బాల్గుడుపుటే
ప్రకృతి ధర్మంబని పలుకరాదు
ప్రకృతి శాస్త్రజ్ఞులౌ పండితుల్ డార్వీను
మున్నగువారలు కొన్నిచోట్ల
పురుషులు రొమ్మునం బొడమిన పాలతో
శిశుపోషణంబని చెప్పినారు
ప్రకృతి ధర్మంబులు ప్రభవించు నశియించు
నభ్యాసపద్ధతి ననుసరించు
..............................+

ఈపద్యములో 'డార్విన్' (Darwin) యొక్క 'అభ్యాసపద్ధతి' (Use and Disuse) సిద్ధాంతము, హాస్యరచనకు చక్కగా అన్వయింపబడినది.

'ఆంధ్రస్కాట్' బిరుదాంకితులైన చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు (1867-1946) పందొమ్మిదవ శతాబ్దిలో ఉత్తరార్ధమున నాటక రచయితగా నవల రచయితగా ప్రఖ్యాతిపొంది, ఆజన్మాంతము ఆకీర్తిని నిలుపుకొన్నవారు. వీరేశలింగంపంతులుగారి శిష్యులైన వీరు, ఇంచుమించుగా గురుతుల్యులు. ఆంగ్ల సాహిత్యప్రభావము సోకిన వీరి నవలలేగాక, ఆంగ్లములోనుండి వీరనువదించిన 'రాజస్థాన కథావళి'కూడ వీరికి ఆంగ్లసాహిత్యముతోనున్న సన్నిహితత్వమును మనకు తెలుపును. ఇరువదవ శతాబ్దిలో, భావకావ్య ప్రపంచమున విశిష్టస్థానమును గడించుకొన్న 'దేశభక్తి'గీతములను ఆలపించిన ప్రప్రథములలో వీరున్నారు. 1907 లో 'బిపిన్ చంద్రపాల్' ఆంధ్రదేశమునకు వచ్చిన సందర్భములో, సహజ కవితాధారతో వీరుచెప్పిన—

"భరతఖండంబు చక్కని పాడియావు
హిందువులు లేఁగ దూడలై యేడ్చుచుండ

తెల్లవారను గడుసరి గొల్లవారు
పిదుకుచున్నారు మూతులు బిగియఁగట్టి"

అనుపద్యము అజరామరము. నాటి సాంఘిక రాజకీయపరిస్థితులు, స్వాతంత్ర్యమునకు, ప్రాణముకంటె ప్రాధాన్యమిచ్చు ఆంగ్లసాహిత్యము యొక్క పఠనము; వీరిని ఉద్రిక్తులనుచేసి, ఉత్తమకవిత వ్రాయించెను. వీరును ఇంగ్లీషు మాటలను ప్రయోగించు విషయమున, హృదయ వైశాల్యమును జూపిరి. 'కృపాంభోనిధి'ని సంబోధించుచు పద్యములు చెప్పు సందర్భమున, తగిన ఉపమానమని యెంచి వీరు తమ మనస్సును 'రబ్బరు'తోపోల్చి ఇట్లు వ్రాసిరి.

"బలిమిన్ రబ్బరు లాగసాఁగి మొదటన్ స్వస్థానముంజేరు నా
వల, నట్లే బలిమి న్మనస్సును భవత్పాదద్వయిన్నిల్ప నా
స్థలమం దయ్యది నిల్వ కెప్పటియటుల్ దౌర్గత్యముంజెందు, ని
ష్ఫలమౌ నాజతనం, బిఁకేమిగతి దేవా ! సత్కృపాంభోనిధీ !"

ఈ భక్తునకిట, ఆధునిక సంప్రదాయము బలిమిని, అత్యుదాత్త భావమును వ్యక్తీకరించు సందర్భమునకూడ ఆంగ్లపదము అప్రయత్నముగ వచ్చెను !

ఉపాధ్యాయునిగా, గవర్నమెంటు ట్రాన్సలేటరుగా, దేశభక్తునిగా పేరెన్నికగన్న, చెన్నాప్రగడ భానుమూర్తిగారు (1868-1945) సంస్కృతాంధ్రాంగ్లములలో మంచి పండితులు, కవులు. వంగరాష్ట్రవిభజన సందర్భమును పురస్కరించుకొని వీరు రచించిన 'భారత ధర్మదర్శనము' మిక్కిలి ఉత్తేజకరమైన కావ్యము (1905). మన మన్ని వస్తువులకును విదేశీయులపై నాధారపడవలసి వచ్చెనేయని చింతించుచు వీరు వ్రాసిన ఈ పద్యము, వీరి స్వాతంత్ర్య పిపాసను తెలుపునదై యున్నది.

"ప్రొద్దున లేవంగ బొయిరాజవలెనన్న
నగ్నిహోత్రము స్వీడ నంపవలసె
నాబాలగోపాల మఖిలంబునకు
మాన్చెస్టరు పుట్టములన్నేయవలసె
మునిమాపు వ్యాయామమునకు కందు
కములు లండను బంపుచుండవలసె
వ్రాతకు లేఖనీ పత్రము ల్వలయుచో
నాస్ట్రియా జర్మనీ లంపవలసె

చిన్నబిడ్డలు ద్రావంగ క్షీరములును
భాగ్యవంతుల పాలకు పంచదార
యూరిపేదల గంజికి యుప్పుగల్లు
నన్యదేశంబు లంపగనయ్యె నకట"

(భారత ధర్మదర్శనము; 'హిందూదేశ దైన్యవిచారము')

"భరతఖండంబు చక్కని పాడియావు" అను చిలకమర్తి[45] వారి పద్యమును బోలిన పద్యములు 'నక్షత్రమాల'గా వీరు రచించి, భారతీయులకు కర్తవ్యము నుపదేశించుచు నిట్లు వ్రాసిరి.

"దుడుకుఁదనమునఁ దిర దీ గడుసుఁదనము
గాన తాపుల్ఖు పోటులు గార్యమనక
లేఁగలన్నిటి నేకమౌలా గొనర్చి
నేర్పుతోఁ దల్లి యెగఁజేప నేరవలయు."

దేశీయవిషయములే గాక, ఉత్తమాశయము లితర దేశమునకు చెందిన వైనను పరిగ్రాహ్యములే యను భావము కలవారు గాన వీరు, టాల్‌స్టాయ్ మహాశయుని కథననుసరించి (ఆంగ్లానువాదము), మన పరిస్థితుల కనుగుణముగ నుండునట్లు విషయమున మార్పులుచేసి, 'పరమార్థతత్త్వసారము'ను రచించిరి. కథలోని సన్నివేశములలో కొన్నితప్పు మిగిలినవి మార్చుటచేతను, భారతీయ తత్త్వదృష్టికి అనుకూలముగా నుండునట్లు విషయవివరణము మార్చుటచేతను; ఈ కావ్యము స్వతంత్ర కావ్యమువలెనే యున్నది.

ఆంగ్లసాహిత్యములోని మెలకువలన్నియు గ్రహించిన వీరు[46] ఆంగ్లకవి 'టెన్నిసన్' (Lord Tennyson; 1809-1892) యొక్క 'లేడీ క్లేర్' (Lady Clare)అను కావ్యము ననుసరించి, తెలుగులో 'మాలతీరాజహంసము' అను ఖండకావ్యమునుకూడ రచించిరి. పందొమ్మిదవ శతాబ్దికి చెందిన ఒక ప్రఖ్యాత ఆంగ్లకవి కావ్యమును తెలుగులోనికి తెచ్చి, భానుమూర్తిగారు తమ

---

45. వీరు చిలకమర్తివారికి బాల్యస్నేహితులు, సహాధ్యాయులు. దీనిని పురస్కరించుకొని వీరు చిలకమర్తివారి 'హేమలత' (నవల) ను నాటకముగా చేసిరి. "నాటక రచన నాంగ్లేయ నాటక సంప్రదాయముల ననుసరించి చేసితిని", అని వారు పీఠికలో ప్రస్తావించిరి. ఇందే, నాటకములో పాదుషా తెలుగు పద్యము చదువుట ఎట్లని ప్రశ్నించుకొని, "షేక్స్పియరు మహాశయుఁడు సీజరుచే నింగ్లీషు మాట్లాడించ లేదా" అని సమాధానము చెప్పుకొనిరి.

46. వీరు 'షేక్స్పియర్' రచించిన 'కింగ్‌లియర్' (King Lear) నాటకమును 'మందపాల చరిత్రము' అనుపేర గద్యపద్యములతో నాటకముగా తెలుగుచేసిరి.

తరమువారు సాధారణముగా త్రొక్కని మార్గమున పయనించిరి. ఇదిగాక వీరు, పదునెనిమిదవ శతాబ్దికి చెందిన ప్రఖ్యాత ఇంగ్లీషుకవి 'థామస్ గ్రే (Thomas Gray; 1716-1771) యొక్క 'ఎలిజీ' (Elegy written in a Country Churchyard)ని, తెలుగులోనికి 'శైవశ్మశాన విలాపము' అనుపేర, తెచ్చిరి. 'చర్చి' ఆవరణలోని గోరీలనుగూర్చి వ్రాయక, శైవశ్మశానమనుట—శైవులును శవములను పాతిపెట్టెదరను నుద్దేశముతో కాబోలు— కవి శీర్షికలో చేసినమార్పు. ఇది మన సంప్రదాయమున కనుకూలముగా నుండునని వారూహించినట్లున్నది. ఉపమానములు, కవిసమయములు అన్నియు భారతీయములుగనే ఒనరించిరి. ఇట నుదాహరణముగా నీయబడిన తెలుగు పద్యమును ఆంగ్ల మూలముతో పోల్చిచూచిన, ఈ విషయము వ్యక్తమగును.

"మౌనులపై ననుగ్రహ సమగ్రతఁ బూని చరించు భూజన
స్థానము దుష్టదానవ వితానవిహీనముఁ జేయు రాములుఁ
మానస మందె భాగవత మాధురి నానుచునుండు వ్యాసులుం
బూనిక బంధులం బుధులఁ బోర వధింపని ధర్మసూను లి
చ్చో నిదురించు చుండనగుఁ జూవె యమర్త్యసుఖంబు లందుచున్"

"Some village Hampden that with dauntless breast
The little tyrant of his fields withstood,
Some mute inglorious Milton here may rest,
Some Cromwell guiltless of his country's blood."

ఇట్లు భానుమూర్తిగారు 'శైవశ్మశాన విలాపము'ను, 'ఎలిజీ' ననుసరించి రచించిరి. మూలములో నున్నదాని నున్నట్లుగాక, మన సంప్రదాయమున కనుగుణముగ మార్చి వ్రాయుట నాటి శిష్టాచారమువలె నున్నది.

విద్వత్కవులైన తిరుపతి వేంకటకవులు (1871-1919; 1870-1950) ఆంగ్లసాహిత్య వాసనావాసితమైన సంఘమున, ఆంగ్ల సాహిత్యవేత్తలైన మిత్రులనడుమ మెలగుటచే; వారి కవిత్వమునను అక్కడక్కడ ఈ సాహిత్య గంధము నాసాపుటములకు సోకును. కాని, ఇది చాలతక్కువ ప్రదేశములలోనని గుర్తింపవలెను. వారిపై ఈ ప్రభావము; కొన్ని ఇంగ్లీషుమాటలను ప్రయోగించుటతోను— తిరుపతిశాస్త్రిగారు కీర్తిశేషులైన తరువాత వేంకటశాస్త్రి గారు, లౌకిక విషయములపై వ్రాసిన రచనలలో ఇవిఎక్కువ — సమకాలిక సంఘమును వర్ణించు పట్టులందు పాశ్చాత్యులను పేర్కొనుటతోను, ఆంగ్ల

ములో 'ఎడ్విన్ ఆర్నాల్డ్' (Sir Edwin Arnold) వ్రాసిన 'లైట్ ఆఫ్ ఏషియా' (Light of Asia) ను, ఆంగ్లము తెలిసినవారి సాయముతో అనువదించుట తోను, ముగిసినదని ఎంచవచ్చును.

తిరుపతి వేంకటకవుల 'బుద్ధచరిత్రము' నకు ఆంగ్లములో ఉపోద్ఘాతము వ్రాయుచు, శ్రీ రంగాచారిగారిట్లనిరి.

"This story of Buddha's life in Telugu poetry is, as the authors say, mainly based on Edwin Arnold's Light of Asia and Aswaghosha's Buddhacharitra............ Both the authors are Pandits of the pure Indian type, and the Light of Asia was translated for them into Telugu prose by a modern English knowing graduate. ............This association of the Pandit authors with English knowing graduates in the production of this work is obviously responsible for its being so chaste in style as well as in sentiment and for its freedom from much of the grotesqueness of the decadent poetry and vitiated taste........."

గ్రంథకర్తృ విజ్ఞాపనములో కవులును, తమకీకథ తెలిసినవిధము నీ రీతిగ వర్ణించిరి. ........"ఒకనాఁడు తమ (శ్రీ పోలవరం జమీందారుగారు) దర్శనమునకుం జనుదెంచిన మమ్ముంగాంచి యీ ప్రస్తావనఁదెచ్చి ఆర్నాల్డుకవి రచించిన "లైట్ ఆఫ్ ఏషియా" యను నాంగ్లేయభాషా గ్రంథమును జదివి దాని భావమంతయు మాకు బోధించిరి. ఇదివఱకెన్నఁడును వినియుండని వారమగుటచే మేమును నమ్మహానుభావుని చరిత్రమునకుఁ గడు నద్భుతమును సంతోషమును జెంది......... ఆర్నాల్డుకవి గ్రంథముననుసరించి ౨౦౦ పద్యములుగల యాఱాశ్వాసముల ప్రబంధమును రచించితిమి."

ఇట్లిది, ఆంగ్లములోని గ్రంథము ననుసరించి వ్రాయబడినను, వర్ణనలన్నియు ప్రబంధ ఫక్కిలో నడచినవి. శ్లేషమొదలయిన వివిధాలంకారములతో వర్ణనలు చేయబడెను. బుద్ధుని కథయైనను, ప్రసంగవశమున కవులు పురాణ గాథలను గూడ నిందు చేర్చిరి. మహాకవులైన వీరి రచనలో 'బుద్ధచరిత్రము' మహాప్రబంధమయినది. కథను గ్రహించుట కాంగ్లగ్రంథ మాధారమైనను, దానిలోని పోకడలేవియు నిందంతగా గానరావు.

తిరుపతి వేంకటకవులు, వారి 'శ్రవణానందము' లో నొకచోట, నదీ తీరమును వర్ణించుపట్టున హూణుల విహారమును పేర్కొనిరి.

"అపరరోధో విహారాగతాసమాన
హూణమిథునావలోకనాహుూయమాన
హాలికాన్యోన్యభాషణ వ్యాకులంబు
చేతముగరంచు నొక్క ధునీతటంబు"

ఈ కావ్యము వస్తువునందు, వర్ణనయందు, శైలియందు నవీనమైన మార్గమును త్రొక్కి తరువాతి నవ్యకవుల రచనలకు మార్గదర్శకమో అన్నట్లుండును. "కవుల మున్పటి రూల్సుకుఁ గట్టుపడము" అని చెప్పుటలోనే; భావస్వాతంత్ర్యముతో బాటు, భాషాస్వాతంత్ర్యమును వీరు ప్రకటించిరి.

'కామేశ్వరీ శతకము' నందు, ప్రాసంగికముగా వీరు ప్రయోగించిన ఇంగ్లీషు మాటలు, లెక్కలేనన్ని కలవు. వేంకటశాస్త్రిగారిని, నాటిప్రభుత్వము ఆస్థానకవిని చేయగా, ఆ సమ్మాన సభలో వారుచెప్పిన పద్యములలో, ఇంగ్లీషు మాటలు తెలుగు మాటలతో నీరక్షీరన్యాయమున కలసిమెలసి యున్నవి.

ఈ క్రింది పద్యములలోని ఇంగ్లీషుమాటలు ఈ విషయమును రుజువు చేయును.

"ప్రతిసంవత్సర మింక నాకిడుఁ బ్రజారాజ్యంబు వేయారు లు
న్నత ముద్యోగముచేసి వానిమెయిఁ "బెన్షన్" గొన్న బల్మేటికిన్
భృతకంబిచ్చు విధాన, దీనికి భవత్ప్రేమమ్మె తోడౌచు దీ
ర్ఘతరం బాయు వొసంగఁగావలెఁ గృపార్ద్రా! తల్లి కామేశ్వరీ!"

"ఆయుర్దాయము మూఁడు భాగములు సేయన్ దాన "వన్ థర్డు" బో
సేయంగా మిగిలెన్ శరీరము కడున్ జీర్ణించి శుష్కించె; శే
షాయుర్దాయము భోజ్యమౌట కడుగడ్డే తోఁచుఁ ద్వత్సన్నిధి
స్థాయింగా నొనరింపు మేమిటికిఁకన్ జాలంబు కామేశ్వరీ!"

ఇట్లు, దేశకాల పాత్రములనెరింగి కవిత చెప్పిన ఈ కవిపుంగవుల వాక్కు, "ప్రాచీన సరణికి భరతవాక్యము, నవీన సరణికి నాందీవాక్యము" గనుకనే, వీరి రచనలలో 'ఇంగ్లీషుమాటలు' స్థానమును సంపాదించెను.

1880-వ సంవత్సరమునకు పూర్వము జననతిథి గలవారిలో కొందరు; ఆంగ్లకాల్పనిక కవుల రచనల ప్రభావమునకులోనై, ఇరువదవ శతాబ్దియొక్క రెండుమూడు దశలలో నవ్యరచనలు సాగించినవారున్నారు. అప్పటి కప్పుడే 'భావకవితోద్యమము' దేశమున విజృంభించుటచే, వీరును ఆ వాతావరణము

ననుసరించి, రచనలు సాగించినను, వీరిని ఆ ఉద్యమ ప్రారంభకులని చెప్పుటకు వీలులేదు. ఇట్టివారిలో, జనమంచి వేంకటరామయ్యగారు(1872-1933)ఒకరు. వీరి రచనలలో 'నవకుసుమాంజలి' అను ఖండకావ్య సంపుటము, ఈ శాఖకు చెందినది. ఇందు ఇరువదిమూడు ఖండకృతులు గలవు. ఇందలి ప్రతి ఖండ కావ్యమునకు వెనుక నొక ఆంగ్లమూలమున్నదని చెప్పలేము గాని, వీరి కవితా హృదయమును స్పదింపజేసిన వానిలో ఆంగ్లకవిత్వమునకు అగ్రస్థానమున్నది. ప్రకృత్యుపాసకులైన వీరి కవితపై 'వర్డ్స్‌వర్త్' (William Wordsworth: 1770-1850) కావ్యముల ప్రభావము కన్పట్టును. సులభమును, రమణీయ మును అగు పదజాలముతో వీరి పద్యములు హృద్యముగ నుండును. కవితా సరస్వతిని గూర్చి వీరు 'నవకుసుమాంజలి' పీఠికలో నిట్లు వ్రాసిరి.

"ఈ శూన్య ప్రపంచమం దాదేవి కొక్కతెకే నేను కావలసిన వాఁడను. నాకుఁ గావలసినదియు నాదేవియే. ఏమనఁగా కవితయే నాజీవిత సర్వస్వము కవితయే నాకు స్వర్గద్వారము. కవితయే నాకు మోక్షసాధనము." ఈవాక్య ములు వీరి కవితాహృదయమును మనకు తెలియజేయును. 'కవి' యొక్క విశిష్టతను గూర్చి చెప్పుచు వీరు వ్రాసిన—

"తత్త్వవేత్తకు నేది సత్యముగఁ దోచు
నదియె సౌందర్యరూపమై యమరుఁ గవికి"

అను పద్యపాదములు;'కీట్స్' (John Keats; 1795-1821) యొక్క 'ఎన్డిమియాన్' (Endymion) లోని—

"Beauty is truth, truth beauty: that is all
We know on earth and all we need to know"

అను పద్యపాదములను జ్ఞప్తికి తెచ్చుచున్నవి.

ఈ తెలుగు కవియొక్క 'నాదారితోడు' మొదలగు ఖండకావ్యములు— విషయము వేరైనను - భాషాలాలిత్యము, రచనాశిల్పము, మొదలైనవానిలో 'వర్డ్స్‌వర్త్' యొక్క 'ది సాలిటరీ రీపర్' (The Solitary Reaper) ను బోలిన ఖండకృతులను, తలపింప జేయును.

నాటి పరిస్థితుల ననుసరించి, జాతీయభావములను ప్రకటించు 'అమృత భాండము' అను ఖండకావ్యమునుగూడ వీరు రచించిరి. "హైందవ స్వరాజ్య సమితి వారి రాయబారమే యిందలి ప్రకృత విషయము. ఈ ప్రకృతము,

అప్రకృతమైన గరుడయాత్రాకథలోఁ గొన్నిపట్ల స్ఫుటముగాను, గొన్నిపట్ల సూచనగాను వర్ణింపఁబడినది. ప్రకృతాప్రకృతముల నొండొంటితో సందర్భింపఁ జేసి కావ్యమును కడవఱకును నేకార్థ సమవేతముగా నిర్వహించుటకై రెంటి యందును గొన్ని యావశ్యకములైన మార్పులు చేయఁబడెను. కావ్యాదిని ప్రతిజ్ఞాతమైన దాస్యనివృత్తికి, కావ్యాంతమందు సిద్ధ్యసిద్ధిరూపముగాఁ జెప్పఁ బడుటచే, పురాణ కథకును బ్రస్తుత కథకును, ఫలసమన్వయము కుదుర్పఁబడెను. ఇది యెట్లంటేని, "వినత సమ్మోద ముద్రితాస్య యగుచు వడ్డించె నమృతంబు" అని చెప్పఁబడుటచే దేశమున సంస్కరణముల తాత్కాలికాంగీకారము, గరుడుని బంధవిముక్తిచే లోకమాన్యుని తదనంతర నిర్యాణమును, కాద్రవేయుల యాశా భంగముచేఁ బ్రజల కిప్పటి ద్వంద్వపరిపాలనమువలని యల్పప్రయోజకత్వమును సూచితములు."

ఇట్లీకవి, ఆంగ్లసాహిత్యముతోడి పరిచయము తన ప్రతిభకు ప్రోత్సాహ కారి కాగా, 'నవకుసుమాంజలి' రచించెను.

వీరేశలింగం పంతులుగారి శిష్యురాలును, 'స్త్రీవిద్య'కై కృషిచేసిన వారును అగు కొటికలపూడి సీతమ్మగారు (1874-1936) అనేకములైన పద్య కావ్యములను రచించిరి. వీనిలో, ఆంగ్లకావ్యము ననుసరించి వారు రచించిన, 'లేడీ జేన్ గ్రే' అను పద్యకావ్యము (1915) ఈ సందర్భమున పేర్కొనవలసి యున్నది.

ఇట్లే 'కవిగా'రని ప్రసిద్ధి పొందియున్న మారేపల్లి రామచంద్రకవి (1874-1951) గారి 'పశ్చాత్తాప మహత్త్వము'ను కూడ ఇట స్మరింపవలసి యున్నది. ఇది ఆంగ్లములోని 'పేరడైజ్ అండ్ పెరి' ననుసరించి తెలుగులో వ్రాయబడిన కావ్యము. ఈ కవులు తమ కావ్యముల రచనావిధానమున, వీరేశలింగం పంతులుగారి ఆంగ్లానువాదములను ఆదర్శములుగ గొని చేసినట్లు కన్పట్టును.

క్రైస్తవ మతగ్రంథములను చక్కని పద్యకావ్యములుగ రచించిన హిందువులలో అగ్రగణ్యులు మంత్రిప్రెగడ భుజంగరావుగారు (1876-1940). వీరు - మత్తయి సువార్త, మార్కుసువార్త (1914), యోహాను సువార్త, క్రైస్తవ గూఢార్థ దీపిక (1915) మొదలైనవి తెలుగున రచించి; తెలుగులో హిందువులచే రచింపబడిన క్రైస్తవ మతగ్రంథములకు వన్నె పెట్టిరి. ఆంగ్లములో

నుండి తెలుగులోనికి వచ్చిన ఈ రచనలు; విశాలహృదయులైన హిందువులను క్రైస్తవధర్మ మెట్లాకర్షించినదియో, అన్యమత గ్రంథములను తెలుగులోని కెట్లు హిందువులు తెచ్చుటకు ప్రయత్నించిరో, తెలుపజాలి యున్నవి.

1880-వ సంవత్సరమునకు ముందు జనన తిథిగల వారిలో ప్రముఖులైనవారి పద్యరచనలపై ఆంగ్లసాహిత్య సంస్కృతులు నెరపిన ప్రభావమును, ఇంతవరకు, కొంతకుకొంత పరిశీలించుట అయినది. ఇదంతయు, తరువాతి నవ్యకవితోద్యమ వికాసమునకు పూర్వరంగమైనది.

వ్యాసరచన:

పందొమ్మిదవ శతాబ్ది ఉత్తరార్ధములో రూపకము, నవల, పద్యకవిత, తరువాత అభివృద్ధికి వచ్చినది వ్యాసము. దేశకాల పరిస్థితులుకూడ దీనికనుకూలముగనుండెను. ముద్రణా యంత్రముల అభివృద్ధితో పత్రికలు విరివిగా బయలు దేరి, వచనరచనకు చక్కనిదోహదముచేసెను. పాశ్చాత్య విజ్ఞాన సంస్కృతులను గాని, ప్రాచ్య సాహిత్య సంస్కృతులనుగాని ప్రజలలో, మున్నెన్నడు లేనివిధమున ప్రచారము తెచ్చుటకు మంచిసాధనము వచనమే అని రచయితలు గుర్తించిరి. వెంటనే గ్రంథవిమర్శలు, వ్యాఖ్యానములు, నిర్దిష్టవిషయములపై వ్యాసములు బయలుదేరెను. ఉత్సాహపూరితమైన ఈకృషికి వెనుక, సామాన్య కారణములుగా ఆంగ్లభాషా సాహిత్యముల పఠన పాఠనాదులను పేర్కొనవచ్చును. అంతియేగాని, ప్రతిరచనకు ఆంగ్లమూల మొకటి యున్నదనికాదు. అట్లు మూలము లున్నవియు లేకపోలేదు. కాని, వచనములో గ్రంథవిమర్శ, విషయ వివరణాత్మకమైన వ్యాసము, ఆంగ్ల సాహిత్య ప్రభావము సోకని కాలమున తెలుగులో లేవుగనుక; ఈకృషిఅంతయు తత్ప్రభావజనితమని స్థూలముగా చెప్పవచ్చును.

1880-వ సంవత్సరమునకు పూర్వము జననతిథిగల రచయితలలో కొంతమంది; పందొమ్మిదవశతాబ్ది ఉత్తర భాగముననేగాక ఇరువదవ శతాబ్ది పూర్వభాగమునను కొంతకాలము, రచనలు సాగించిరి. వీరిని వచనరచనకు పురికొల్పినవానిలో పందొమ్మిదవ శతాబ్దిలోని కారణములేగాక, ఇరువదవ శతాబ్దిలోని కారణములును– స్వాతంత్ర్యోద్యమము మొదలయినవి, కలవు. ఇట్లు రచనలు సాగించనవారిలో ముఖ్యులు; పందొమ్మిదవ శతాబ్దిలోని పత్రి

కలయందేగాక, ఇరువదవ శతాబ్దిలోని పత్రికలయందును వ్యాసరచనలుచేసి, ఈశాఖను పెంపొందించిరి. ఇట్టివారిలో చాలమంది; వీరేశలింగంపంతులు గారికి, వయస్సులో చిన్నవారైన సమకాలికులు.

తెలుగులో వ్యాసరచనాభివృద్ధికి మిక్కిలి తోడ్పడినవి పత్రికలు. ఇవి, ఈకృషికి దోహదముచేసి, రచయితల సాహిత్యవ్యవసాయమునకు క్షేత్రములై, సత్ఫలముల నిచ్చినవి. పందొమ్మిదవశతాబ్ది ఉత్తరార్ధములో ఇట్టి పత్రికలలో తత్త్వబోధిని (1864), ఆంధ్రభాషా సంజీవని (1871), పురుషార్థ ప్రదాయిని (1872), వివేకవర్ధని (1874), అముద్రిత గ్రంథచింతామణి (1885), చింతామణి (1891), సరస్వతి (1898) అనునవి ముఖ్యమైనవి; గొప్ప సాహిత్యసేవ చేసినవి. ఇరువదవ శతాబ్ది మొదటి రెండుమూడు దశలలోని పత్రికలలో— కృష్ణాపత్రిక (1902), ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక (1911), ఆంధ్రపత్రిక (1914, మదరాసు), భారతి (1924) మొదలయినవి; వ్యాస వాఙ్మయమును వృద్ధిపొందించినవి. 1880-వ సంవత్సరమునకు ముందుపుట్టి, ఇరువదవ శతాబ్దిలో కొంతవరకు జీవించి యున్నవారందరు, ఈ పత్రికలలో వ్రాసినవారే.

పందొమ్మిదవ శతాబ్ది ఉత్తరార్ధములో బయలుదేరిన విమర్శవ్యాసము లను విషయమునుబట్టి రెండుగా విభజింపవచ్చును. భాషకు సంబంధించిన శాస్త్ర విమర్శ మొదటి విభాగము. సాహిత్యమునకు సంబంధించిన సహృదయ విమర్శ రెండవ విభాగము. అప్పటికప్పుడే పాశ్చాత్య భాషాశాస్త్రవేత్తలు చేసిపోయిన భాషాకృషిని గుర్తించి, వారి అడుగుజాడలలో పోయి, వారి సిద్ధాంతములను ద్రావిడభాషల కన్వయించి కృషిచేయువారు కొందరు; అటులగాక ప్రాచీన వ్యాకరణాదుల ననుసరించి కేవలము శబ్దముల సాధుత్వాసాధుత్వముల విమర్శ చేయువారు కొందరు, మొదటి విభాగమున బయలుదేరిరి. వీరికే ఆ రోజులలో పలుకుబడియు, ప్రాచుర్యమును. అధికము. ఎడనెడ నాడు సాహిత్యమునకు సంబంధించిన సహృదయ విమర్శ కన్పట్టినను, అది చాల స్వల్పము. కాలక్రమ మున; సహృదయ విమర్శయు వికాసమును పొందుచువచ్చెను.

నాడు శాబ్దిక చర్చలకు ప్రాముఖ్యము నిచ్చిన విమర్శలలో, శ్రీ కొక్కొండ వేంకటరత్నం పంతులుగారి 'ప్రసన్నరాఘవము' పై శ్రీవేదము వేంకటరాయశాస్త్రిగారు రచించిన 'విమర్శ' ను ఉదాహరణముగా గ్రహింప వచ్చును. ఇరువురును విద్వత్కవులే. ప్రసిద్ధులే. సజ్జనులే. కాని, విమర్శ వ్రాయు

నప్పుడు శబ్దగతదోషముల నేకరువు పెట్టుటయు, వ్యక్తిదూషణము చేయుటయు ఆవశ్యకములని తలంచినట్లుగా నాటి విమర్శలున్నవి.[47] 'ప్రసన్న రాఘవము' పై గల 'విమర్శ'లోని ఈ క్రింది వాక్యములను చూడుడు.

"శ్రీ కొక్కొండ వేంకటరత్నము పంతులుగారు రచించిన యాంధ్ర ప్రసన్నరాఘవము నాయుద్యమమున కత్యంతోపయుక్తముగా నున్నందున దానిని విమర్శింప దొరఁకొంటిని... ఈ గ్రంథమందు భాషాంతరీకరణము ప్రాయికముగా తప్పుగా నుండును. మూలమున కిది మూలముగను, దీనికది టీకగను ఉండును... ఛందోవ్యాకరణముల కిది వేరుపురువు...సావధానముగా తత్త్వమరయువారు వీరికి సంస్కృతము తెలియదనియు, దేవనాగరలిపి తెలియదనియు, నాటక లక్షణము తెలియనే తెలియదనియు, ఆంధ్రభాషకు వీరు విషము పెట్టినారనియు, ఇతరుల గ్రంథముల గుణదోషములను చర్చించుటకు వీరు అధికారులు కారనియు, వీరి మతముచే భాష చెడుచున్నదనియు గ్రహింతురు..."

ఇవి, ఒక మహామహోపాధ్యాయునిగూర్చి, ఒక కళాప్రపూర్ణుడు వ్రాసిన వాక్యములు !

ఇట్టి వాదములకు, విమర్శనలకు, చాల తావిచ్చి తెలుగులో విమర్శ వ్యాసమునకు మిక్కిలి ప్రోత్సాహమిచ్చిన పత్రికలలో 'అముద్రిత గ్రంథ చింతామణి' ముఖ్యమైనది. దీనిని పూండ్ల రామకృష్ణయ్యగారు (1860-1904) నడపుచుండెడివారు. 1885 జూన్ నెలలో స్థాపింపబడిన ఈ పత్రిక సుమారు ఇరువది సంవత్సరములు అవిచ్ఛిన్నముగ నడచినది. ఆనాడు మహాపండితులని పించుకొన్న వారందరును ఇందు శాబ్దిక చర్చలు చేసినవారే. వ్యాసములు రచించినవారే. గ్రంథములను ప్రకటించినవారే.

ఈ పత్రికయందు చర్చింపబడిన—శ్యమంతక శబ్దవిచారము, వటుశబ్ద ప్రయోగవిచారము, పరిఘూపరిఘ శబ్దద్వయ సాధుత్వవిచారము, నాటకములలో పాత్రోచిత భాషయొక్క ఔచిత్యచర్చ, రేఫద్వయ విచారము మొదలగు విషయములను పరిశీలించినచో, నాటి విమర్శపద్ధతులు కొన్ని తెలియ గలవు.

---

47. వీరేశలింగం పంతులుగారి, 'కొక్కొండ వేంకటరత్నకవికృత విగ్రహతంత్ర విమర్శనము' నందు నాటి సంప్రదాయము ననుసరించి (గూఢముగ) దూషణమున్నను ; ఈ 'విమర్శనము', వారి దృష్టిననుసరించి సాహిత్య విమర్శ ఎట్లుండవలెనో కూడ, తెలుపును.

ఈ చర్చలలో పాల్గొనని పండితుడు నాడులేడు. అముద్రిత గ్రంథముల ప్రకటనము[48] ఈ పత్రికయొక్క ముఖ్యోద్దేశము గనుక, ఇందు 'ప్రబంధరాజ వేంకటేశ్వర విజయవిలాసము, హరిశ్చంద్రనలోపాఖ్యానము' మొదలైన వెన్నియో ప్రకటింపబడెను.

ఈ పత్రికలో ప్రచురింపబడిన వ్యాసములలో చాలవానిపై ఆంగ్ల సాహిత్య ప్రభావము లేదు. కాల ప్రభావమునుబట్టి రచయితలు వచనమున, వ్యాసరూపమున రచనలు చేసిరి. కాని, రచయితలలో చాలమందికి ఆంగ్ల సాహిత్యముతో పరిచయ ముండుటచే; విషయవిభాగమున, ఉపక్రమణికోపసంహారముల విషయమున, ఆంగ్ల వ్యాసముల 'మాదిరి' ని అనుసరించుట కన్పట్టును.

గ్రాంథికాంధ్రమునకై విశేషకృషి చేసిన జయంతి రామయ్య పంతులు గారు (1860-1941) సంస్కృతాంధ్రములతో బాటు ఆంగ్లమునను నిశితమైన పండితులగుటచే, వారి సాహిత్యకృషిలో పాశ్చాత్య విమర్శన పద్ధతుల నవలంబించిరి. వారి సంపాదకత్వమున బయలుదేరిన గ్రంథముల పీఠికలన్నియు చక్కని విమర్శదృష్టితో వ్రాయబడినవే. ఇందును, వారి 'ఆధునికాంధ్ర

48. 'అముద్రిత గ్రంథచింతామణి' ని గూర్చి పత్రికాధిపతులు వ్రాసిన పద్యములు :

"జతనము మీఱంగ నము
ద్రిత సద్గ్రంథముల నేకరించి కడుఁ బరి
ష్కృతములు గావించి యథా
మతిఁ బత్రికఁగూర్చెదము క్రమంబుగ వానిన్.

"తోరపు నూలుదారములతోఁ బదిలంబుగ గట్టిపెట్టి యుం
జేరుప నందు జీర్ణదశఁ జెంది మొగిం గ్రిమి కీటకచ్ఛటా
పూరితమై వృథానెడు నముద్రిత పుస్తకపంక్తి నెంతయుం
గూరిమి మీర నచ్చునను గూర్చుట నెల్లదె పత్రికాకృతిన్"

"ఒనర మా పూన్కి రసిక జనోపయోగ
మగు కతంబున నిజకార్యముగఁ దలంచి
గైకొనుడు పోషకాద్యధికారములను
శాశ్వతంబుగఁ బత్రిక జరుగుకొఱకు"

కేవలము, ఆంధ్రభాషా సాహిత్యముల అభివృద్ధికొరకే - ప్రకటనలు మొదలయిన వాణిజ్య విషయములు లేకుండ—ఈ పత్రిక ఇంగ్లీషులోని 'ఎథేనియమ్' (Atheneum) వలె నుండవలెనని, శ్రీ పనప్పాకం అనందాచార్యులుగారు చెప్పిరట :

వాఙ్మయ వికాసవైఖరి' యందును, రచనాశిల్పము ఆంగ్లసాహిత్య ప్రభావమున ప్రభవించినదే! 'ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక' (1911) యందు వారు వ్రాసిన వ్యాసములు, వారి బహుముఖ ప్రజ్ఞకు నిదర్శనములు.

క్రమక్రమముగా పండితులైన రచయితలు కేవలము శాబ్దికమైన చర్చలతో తృప్తిపడక, సాహిత్య విమర్శకును పూనుకొనిరి. వీరిది సహృదయుల విమర్శ. ఇట్టి సహృదయ విమర్శకులలో కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు (1863-1940) ఆంగ్లసాహిత్యములోని మెలకువలన్నియు గ్రహించినవారు గనుక; తమ సిద్ధాంతములను స్థాపించుకొనుటకు, ఆంగ్లకవుల రచనలనుండి వాక్యముల నుదాహరించుట కన్పట్టును. దీనికి వారి 'నన్నయభట్టారక చరిత్ర' (1900) నుండి ఉదాహరణల నీయవచ్చును.

నన్నయభట్టారకుని కవితనుగూర్చి వ్రాయు సందర్భమునవారు ఆ కవిని మెచ్చుకొనుచు, నన్నయ కవిత్వమును ఆంగ్లకవియగు షేక్స్పియర్ కవిత్వముతో పోల్చినారు. భారత యుద్ధమున ఎవరెన్ని దినములు పోరిరో తెలుపు భాగమున నొక 'తరళము' క్రింద నదే యర్థమున 'కంద' మొకటి కలదు. తరళ పద్యభావమే యిదియు చెప్పుచున్నప్పుడు పునరుక్తికాదా కందపద్యమని ప్రశ్నించుకొని, శాస్త్రిగారు 'నన్నయభట్టారక చరిత్ర'లో నిట్లు వ్రాసిరి.

"మఱియును షేక్స్పియరు మహాకవి తన "జూలియస్ సీజరు" నాటకములో—"As Caesar loved me, I weep for him as he was fortunate, I rejoice at it; as he was valiant, I honour him; but as he was ambitious, I slew him. There are tears for his love; joy for his fortune; honour for his valour; and death for his ambition". అని వ్రాసియున్నాడు. ఈ పునరుక్తి భావగౌరవమును దెచ్చునదియై సరసముగ నున్నదిగాని దోషముగఁ గాన్పించుట లేదుగదా. అట్లనే నన్నయ భట్టారకుని పద్యద్వయమును సరసముగనే యున్నదిగాని యనవసరముగాఁ గాన్పించుట లేదు."[49]

ఇదంతయు; "పది దినములు భీష్ముఁ డాహవ భారకుండు......మహాభయంకర వృత్తితోన్" అను పద్యముక్రింద, "పదిదినము లైదు ప్రొద్దులు..." అనుపద్యము పునరుక్తి కాదా? అవునా? అను మీమాంస జరుగుచోట; బ్రహ్మయ్యశాస్త్రిగారు వ్రాసిరి. ఇక్కడ, సంస్కృత కావ్యములలోని వాక్యములను

49. సరస్వతి పత్రిక ; జనవరి, 1900 ; పుట—29.

ఉదాహరణమునకై చూపక; ఆంగ్లములోనుండి పోలిక ఎత్తిచూపుటలోనే విశేషమున్నది. నాడు, ఆంగ్లము తెలిసిన పండితు లందరు, ప్రసంగము వచ్చినప్పుడు, సంస్కృత వాక్యముల కిచ్చిన ప్రామాణ్యామే ఇంగ్లీషు రచనలకును ఇచ్చుచుండిరి. ఆంగ్లసాహిత్య ప్రభావ మట్టిది.

బ్రహ్మయ్యశాస్త్రిగారే, "శ్లేషకవిత్వము"ను గూర్చి వ్రాయుచు, శ్లేష సంస్కృతాంధ్రములలోనేగాక ఇంగ్లీషు భాషలోకూడ కలదని సోదాహరణముగా నిరూపించిరి. ఇవన్నియు, సంప్రదాయవాదులైన పండితులుకూడ—కాశీభట్టవారు తీవ్రమైన సంప్రదాయాభినివేశము కలవారు— ఆంగ్లభాషా సాహిత్యములను, సంస్కృతాదులవలెనే, ఎట్లంగీకరించిరో తెలుపును.

మంత్రి భాస్కరునిగూర్చి 'కవుల చరిత్ర'లో గల విషయములు సరిగా లేవని వీరు 'భాస్కరోదంతము' అను విమర్శను వ్రాసిరి (1898). ఇట్లే, వెన్నేటి రామచంద్రరావుగారి 'మనువసు ప్రకాశిక, పై, 'మను వసు ప్రకాశిక విమర్శనము' వ్రాసిరి. ఈ విధముగా కాశీభట్టవారు విమర్శ వ్యాసమును తెలుగులో నభివృద్ధికి తెచ్చిరి. ఈ రచనల కన్నింటికి వెనుక; వారికిగల సంస్కృతాంధ్రములలోని పాండిత్యముతో బాటు, ఆంగ్ల సాహిత్యముతో గల పరిచయమును; నిలిచియున్నది.

ప్రాచీన కావ్యములకు వ్యాఖ్యానములతో బాటు, ఉపోద్ఘాతములును వ్రాసి; కవికాలాదులను గూర్చియు, కవితను గూర్చియు, పాశ్చాత్యపద్ధతి ననుసరించి చర్చించినవారిలో నాగపూడి కుప్పుస్వామయ్యగారు (1865-1951) అగ్రగణ్యులు. సంస్కృతాంధ్రాంగ్ల ద్రావిడభాషలలో నిష్ణాతులైన వీరు, అనేకములైన ప్రాచీన గ్రంథములకు పీఠికలువ్రాసి, పాశ్చాత్యవిమర్శన పద్ధతులను తెలుగు కావ్యముల కన్వయించి చూపిరి.[50] వీరు రచించిన 'పారిజాతాపహరణ పరిమళ వ్యాఖ్య' జగద్విదితము.

ఆంధ్ర సంస్కృతియొక్క సర్వతోముఖాభివృద్ధికి కృతకృత్యతతో సేవ చేసిన కాశీనాథుని నాగేశ్వరరావుగారు (1867-1938) స్వయముగా వ్యాస రచనలు చేసి చూపుటయేగాక, 'ఆంధ్రపత్రిక'ను స్థాపించి, రచయితలను

---

50. "ఆంగ్ల పద్ధతుల ననుసరించి యాంధ్ర గ్రంథముల కుపోద్ఘాతములు రచించిన వారిలో కుప్పుస్వామయ్యగారిది యగ్రతాంబూలము."

—మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు.

(ఆంధ్రరచయితలు [1950] పుట, 211.)

ప్రోత్సహించిరి. వీరు 'ఆంధ్రగ్రంథమాల'ను స్థాపించి, ఉత్తమ పరిశోధకులచే పరిష్కృతములైన ఆంధ్రగ్రంథములను, ప్రచురించిరి. వీరి యాజమాన్యమున 'ఆంధ్రవాఙ్మయసూచిక' అను ముద్రితాముద్రిత గ్రంథములపట్టిక, సిద్ధమైనది. భాష కుపకారకములగు ఇట్టి, పనులను చేయించుటయేగాక, పత్రికలో సంపాదకీయములు వ్రాసి, తెలుగు వచనరచనను తిర్చిదిద్ది, క్రొత్తమార్గములో వీరు నడిపించిరి. నాటికింకను పత్రికలలో వివిధ విషయములపై సంపాదకీయములు వ్రాయుట క్రొత్తగనుక, వీరి సంపాదకీయములు తరువాతి వారికి ఒరవడిగ పనిచేసిన వనుటలో సంశయము లేదు. ఆంగ్ల పత్రికలలోని సంపాదకీయములను, రచనలను బాగుగా నాకళింపునకు తెచ్చుకొన్నవా రగుటచే, వీరు తమ రచనలలో నవ్యతను చూపగలిగిరి.

"అద్యతనాంధ్రకవిప్రపంచనిర్మాత"లని కీర్తింపబడిన చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు (1870–1950) తెలుగులో వ్యాసరచనకు—అందులో, వ్యావహారిక భాషలో వ్యాసమునకు—అమోఘమైన సేవచేసిరి. వారివ్యాసములు; విషయ విస్తృతియందును, భాషా పాటవమునను, క్రొత్తత్రోవ త్రొక్కెను. పరశ్శతముగానున్న వీరివ్యాసములు చదివినవారికి; ఆధునిక సంఘమును గూర్చియు, పాశ్చాత్య సాహిత్యములను గూర్చియు, వీరికెంతలోతైన జ్ఞానమున్నదో తెలియును. మహా ప్రతిభావంతులైన వీరు, ఆంగ్లసాహిత్య నిష్ణాతులైన మిత్రుల సాంగత్యము బలిమిని, ఆసాహిత్యములోని విశిష్ట విషయములను తమకు వలసినంతవరకు గ్రహించిన వారగుటచే, తమ రచనలలో యథోచితముగ వానిని ప్రవేశపెట్టిరి. వీరి వ్యాసములలో అనేకములైన ఇంగ్లీషు మాటలు ప్రవేశార్హతను పొందియున్నవి. సమయోచితములైన మాటలకూర్పు కవులకు సహజమైనదిగదా!

గ్రంథ పరిష్కర్తలుగా యావదాంధ్ర కీర్తినిపొందిన తంజనగరము తేవప్పెరుమాళ్లయ్యగారు (1872–1921) గ్రంథములకు పీఠికల రూపమున, కొన్ని విమర్శ వ్యాసములను బోలినవానిని వ్రాసిరి. నన్నెచోడుడు మొదలగు కవుల కాల నిర్ణయాదులనుగూర్చి, ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక, భారతి మొదలయిన సాహిత్య పత్రికలలో అనేక వ్యాసములు రచించిరి. వీరికికూడ ఆంగ్లసాహిత్యములో పరిచయముకలదు గనుక, తమవిమర్శలనుతీర్చి దిద్దుటలో కొంతకుకొంత ఆంగ్లపద్ధతుల ననుసరించిరి. ఈవిషయమున వీరికిని, నాగపూడి కుప్పుస్వామయ్యగారికిని పోలికలు గలవు.

'చరిత్ర చతురానన' బిరుదాంకితులైన చిలుకూరి వీరభద్రరావుగారు (1872-1939) చారిత్రక వ్యాసము నెంతయో అభివృద్ధికి తెచ్చిరి. చారిత్రక వ్యాసమునందును సాహిత్య సంపదను పరిపోషించుట యందు వీరు నేర్పరులు. వీరు, తిక్కనసోమయాజి, శ్రీనాథకవి మొదలైనవారి జీవితచరిత్రలు రచించుచున్నప్పుడును, అందు వారివారి కవితారీతులను గూర్చిన అభిప్రాయ వ్యక్తీకరణమున విశిష్టతను చూపించిరి. కేవలము చరిత్ర పరిశోధకులే గాక, 'హాస్య తరంగిణి' మొదలయినవి రచించిన ఉత్తమ రచయితలు కూడ.

సుప్రసిద్ధ పరిశోధకులు, సాహిత్యవేత్తలు నయిన కొమర్రాజు వేంకట లక్ష్మణరావుగారు (1877-1923) పరిశ్కృతముగ వ్యాసములు రచించి, వ్యాసవాఙ్మయమును పెంపొందించిరి. వీరి దృష్టిలో చరిత్రకుసాహిత్యమునకు అవినాభావ సంబంధము కలదుగనుక ; తమ సాహిత్య రచనలయందు చరిత్ర దృష్టి, చరిత్రరచనలయందు సాహిత్యరీతి వీరు చూపగలిగిరి. వీరు వివిధ పత్రికలకు వ్రాసిన వ్యాసములు కొన్ని 'లక్ష్మణరాయ వ్యాసావళి'గా రూపొందెను. 'వ్యాసావళి'లోని వ్యాసములు పరిశీలించునప్పుడు ఆంగ్లసాహిత్యములోని వ్యాసములు - రచనాశిల్పమున, భావసంపదయందు, వీరి నెంతగా ప్రభావితములు చేసెనో వ్యక్తమగును. అందు లలితకళలమీది వీరి వ్యాసము, ఈ ప్రభావమును నిశితముగ చూపునదై యున్నది. ఆంగ్లరచయితల రచనలనుండి వీరుదాహరించిన వాక్యములు, కళవిషయమై పాశ్చాత్యులకు గల భావములను వీరు వ్యక్తీకరించిన పద్ధతి, ప్రాక్పశ్చిమభావముల సమన్వయమున వీరవలంబించిన విధానము; పాశ్చాత్య విమర్శ పద్ధతులు వీరిపై నెరపిన ప్రభావమును మనకు తెలుపును. వీరు రచించిన ప్రతి వ్యాసమునకును వెనుక ఆంగ్లవ్యాసము కలదనుట హాస్యాస్పదమే గాని; వీరి రచనావిధానమును తీర్చిదిద్దినది ఆంగ్ల సాహిత్యసంస్కృతులలో వీరికి గల గాఢపరిచయ మనకతీరదు.

తెలుగులో వ్యాసముయొక్క రూపురేఖలను తీర్చిదిద్ది, గంభీర భావ వ్యక్తీకరణమునకు చాలిన ఉదాత్తతను ఈ సాహిత్య శాఖకు కల్పించిన కొద్ది మందిలో ముట్నూరి కృష్ణరావుగారు (1879-1945) ఒకరు. ప్రాక్పశ్చిమ సాహిత్యసంస్కృతుల రుచిర సమ్మేళనము వీరి వ్యాసములలో సర్వత్ర కన్పట్టును. వీరి 'సమీక్షలోని' వ్యాసములను పరిశీలించినవారికి; ఇంగ్లీషు వ్యాసమునుండి రచనా శిల్పమును గ్రహించి వీరెట్లు రచనలు సాగించిరో తెలియును. కృష్ణాపత్రికలోని వీరి సంపాదకీయములుకూడ, వారి బహుముఖ విజ్ఞానమునకు తార్కాణములు.

ఆంగ్ల సాహిత్యముతోను, పాశ్చాత్య విమర్శన పద్ధతులతోను ప్రత్యక్షముగ పరిచయమున్నవారును; కాలప్రభావము ననుసరించి పరోక్షముగ ఆ సాహిత్య విమర్శన పద్ధతులతో సంబంధము కలవారునుకూడ, విమర్శ రచనను చాల సాగించి, విమర్శ వాఙ్మయమును తెలుగులో వృద్ధి పొందించిరి. ఇట్టి రచనలలో; రాయసం వెంకట శివుడుగారి వ్యాసములు, కొచ్చర్లకోట రామచంద్ర వేంకట కృష్ణారావు(1871-1919) గారు ఆంధ్ర వాఙ్మయముపై వ్రాసిన విమర్శ రచన (1896), 'విమర్శకాదర్శక' నడకుదుటి వీరరాజు పంతులు (1871-1937) గారి 'విమర్శన తరంగిణి', మానవల్లి రామకృష్ణ కవి (1875-1957) గారు విస్మృత కవులపై—నన్నెచోడుని కుమారసంభవము నుద్ధరించి వీరు ప్రచురించుట ఇట ప్రత్యేకముగా పేర్కొనదగినది— వ్రాసిన వ్యాసములు, మంత్రిప్రెగడ భుజంగరావు (1876-1940) గారి వ్యాసములు, తేకుమళ్ల రాజగోపాలరావుగారి వ్యాసములు, మేడేపల్లి వేంకటరమణాచార్యులు (1862-1943) గారు వ్రాసిన విమర్శ వ్యాసములు, వఝల చిన సీతారామస్వామి శాస్త్రిగారు (జననము 1878) రచించిన 'వసు చరిత్రవిమర్శనము' (1915) మొదలయినవి పేర్కొనదగినవి. ఈ రచనలన్నింటిపై ప్రత్యక్షముగ ఆంగ్ల విమర్శ రచనల ప్రభావము కలదని చూపుట కష్టముగాని, ఆయా రచనలలో ఆయా రచయితలు ఆంగ్ల గ్రంథములనుండి ఇచ్చిన ఉదాహరణలు, రచనాశిల్పమును గ్రహించుటలో చూపిన ఇంగ్లీషు ప్రభావము, రచయితలు ప్రత్యక్షముగ కొన్నిచోట్ల, పరోక్షముగ కొన్నిచోట్ల ఆంగ్ల సాహిత్యప్రభావమునకు లోనైరని రుజువుచేయును.

పై నుదాహరింపబడిన రచనలకంటె ఆంగ్ల సాహిత్య ప్రభావము ప్రస్ఫుటముగనున్న వ్యాసములు ఆచంట సుందరరామయ్య పంతులుగారి 'అంతఃపురోపన్యాసములు' (Curtain Lectures). ఈ రచనలు, నాఁడు రాజమహేంద్రవరమున ఆంధ్రసాహిత్యాభివృద్ధికి విశేషముగ కృషిచేసిన 'చింతామణి' పత్రికలో ప్రచురితములు. ఈ రచనలు ఆంగ్లసాహిత్యములోనున్న ఇట్టి శాఖాభేదము ననుసరించి పుట్టినవి.

కేవలము ఆంగ్ల వ్యాసములకు అనువాదప్రాయమైన రచనలలో కిడాంబి రామానుజాచార్యులుగారి 'బేకనుపన్యాసములు' పేర్కొనదగును. పదునేడవ శతాబ్ది మొదటి దశలలో ఇంగ్లీషు వచన రచనను తీర్చిన మహా మేధావి 'ఫ్రాన్సిస్ బేకన్' (**Francis Bacon; 1561-1626**). ఈతని 'వ్యాసములు'

విజ్ఞానదాయకము లగుటచే మనవారి నివి ఆకర్షించుటలో వింతలేదు. మానవ జీవితములోని వివిధ రంగములు ఈ వ్యాసములకు విషయములగుటచే, వీనికి ఆదరమును ప్రచారమును అధికమయ్యెను. నేడు మనము వ్యాసమని వ్యవహరించుచున్న దానిని నాడు ఉపన్యాసమని వ్యవహరించుట కలదు.

ఇట్టి వచనరచన కాక ఆంగ్లములోని వ్యాసముననుసరించి పుట్టిన ఇంకొక తరగతికి చెందిన వచనమును రచించినవారు శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు. వీరి "సాక్షి" పేరు వినని అక్షరాస్యులు తెలుగుదేశములో లేరు. శిల్పవిషయమున దీని రచనకు, ఆంగ్లసాహిత్యములోని వ్యాసముల ప్రభావము తగిలినది. 'అడిసన్', 'స్టీల్' అను వారల 'స్పెక్టేటర్' యొక్క ప్రభావము దీనిమీద చాల ఉన్నను, ఆంగ్లములో ఉత్తమ వ్యాసరచయితలుగ పరిగణింపబడెడు 'గోల్డ్‌స్మిత్', 'డీక్వెన్సీ' మొదలయిన వారి రచనల ప్రభావమును దీనిపై కలదు.

"సాక్షి" అను పేరుతో కొన్ని వ్యాసములు 1913 లో 'సువర్ణలేఖ' అను పత్రికలో ప్రకటితములైనవి. వీనికి మూలములని చెప్పబడు ఆంగ్లరచనలు, పదునెనిమిదవ శతాబ్దికి చెందినవి. 'సర్ రిచ్చర్డ్‌స్టీల్' (1672-1729) ను, 'జోసఫ్ ఎడిసన్' (1672-1719)ను కలిసి వ్యాసరచనలు కావించిరి. ఇందు ప్రజల హావభావ విన్యాసములు, సంగీతసాహిత్యములు, మంచిచెడ్డలు, కథలు కబుర్లు, అన్నియు చమత్కారముగా వర్ణింపబడి, అవహేళనము చేయబడుచుండెడివి.[51] తెలుగులో "సాక్షి" తలపెట్టిన పనియు నిదియే. తన పనినిగూర్చి రచయిత "సాక్షి"లో నిట్లు వ్రాసెను. "అయినను ప్రత్యేక రాజకీయ దండనము మాత్రమే నేరము నడగద్రొక్క జాలదు. దానికిదోడు సంఘశిక్ష యుండవలెను...ఇట్టి నేరములనుగూర్చియే మే మిక వ్రాయుచుందుము. నేరముల వెల్లడింతుము. వాని స్వభావముల విశదపఱతుము. వానివలన సంఘమునకు గల్గుహానిని స్పష్టపఱతుము. వానియందు జనుల కసహ్యము గల్గునట్లు సేయుటకై ప్రయత్నింతుము.

"మతవిషయములను గూర్చియు, ఆరోగ్యవిషయములను గూర్చియు, కవితాద్యభిరుచిప్రధానశాస్త్రముల గూర్చియు, సంఘ దురాచారములను

51. "Manners, fashions, literature, stories, moral reflections, all took a turn as themes in brief papers, which were addressed consciously to a middle-class audience."

('A short History of English Literature' by B. Ifor Evans; Page-206)

గూర్చియు, రాజభక్త్యాదుల గూర్చియు, నావశ్యకములని మాకుదోచిన యింక గొన్ని యితరాంశములను గూర్చియు వ్రాయుచుందుము."

ఆంగ్లములో "స్పెక్టేటర్" యొక్క ప్రభావమును గూర్చి యొక సాహిత్య వేత్త ఇట్లనెను. "At the centre of this life, and of its most active focus, the capital, stands a supposed spectator; at work with observant eyes, carefully noting the very details, and the external aspects of the comedy of human relations; with a mind that studies, penetrates, interprets, thoughts and hearts alike; with a moral sensibility, supple and delicate that reacts according to the wishes of conscience."[52] తెలుగు గ్రంథములోని సాక్షి ఇట్టివాడే. ఈతనికి అక్కరలేని పనిలేదు. "మధ్య తరగతి" జనుల జీవితమును ప్రదర్శించుటయే "సాక్షి" సంఘము పని. ఇందు కాలాచార్యుడు, జంఘాలశాస్త్రి, వాణీదాసుడు, బొఱ్ఱయ్య, సాక్షి సభ్యులు. వారిపత్రికపేరు "సాక్షి". ఇందు సమస్తవిషయములును, మోహము మొదలు మోక్షమువరకును చర్చింపబడినను, రాజకీయములులేవు. ఆంగ్లమున నట్లుగాదు. దేశమునకు స్వాతంత్ర్యము లేనిదినములలో బయలుదేరినదగుటచే "సాక్షి" యందు రాజకీయముల అవహేళనము లేదు. శ్రీ పానుగంటివారు ఆంగ్లరచయితల మార్గమునుబట్టి పోయిరిగాని, వారి రచనల ననువదింపలేదు.

**ఇతర రచనలు :**

కేవలము సాహిత్య శబ్దముచే గతార్థములు కాక, వాఙ్మయమున చేరు రచనల నెన్నింటినో, 1880-వ సంవత్సరమునకు పూర్వము జననతిథిగల రచయితలు చేసిరి. ఈ రచనలను—భాషా విషయకములు, వైజ్ఞానికములు, ఐతిహాసికములు అని స్థూలముగా విభజింపవచ్చును. ఈ రచనలు చేసినవారిలో చాల మంది సాహిత్యమునను కృషిచేసి యుండుటచేతను; ఈ వాఙ్మయసృష్టి విషయమున వారికుద్దీపనము కలిగించినది, గురుత్వము నెరపినది "ఇంగ్లీషు ప్రభావము" గనుకను; 'వీరేశలింగ యుగము' యొక్క సర్వతోముఖవికాసమును పూర్ణముగా నర్థము చేసికొనుటకు ఆవశ్యకము గనుకను; ఐతిహాసిక రచనలో చాల వానికి—జీవిత చరిత్రలు మొదలయినవానికి—సాహిత్యత్వముండుటచేతను; ఇతర రచనలలో ముఖ్యమైన వాని నిట పరిశీలింపవలసియున్నది. ఈ రచనలు చేసిన వారిలో పై మూడింటిలో నొక శాఖయందేగాక, రెండింటియందును లేక

52. A History of English Literature By Louis Cazamian; Vol. II Pages-124, 125; London 1927.

మూడింటి యందును కూడ కృషిచేసిన వారున్నారు. రచనా సౌకర్యమునకై అట్టివారి రచనలను కలిపి పరిశీలించుట జరిగినది.

నాటి రచయితలు చేసిన భాషావిషయకమైన కృషిలో మొట్టమొదట, ఆంగ్లవ్యాకరణ పద్ధతి ననుసరించి సాగిన తెలుగు వ్యాకరణ రచనను పేర్కొనవచ్చును. బాలవ్యాకరణాది లక్షణ గ్రంథములున్నను, బాలురకు—ముఖ్యముగా 'ఇంగ్లీషు చదువు'లలో నున్నవారికి—అందుబాటులో నుండుటకై, ఇంగ్లీషు వ్యాకరణ పద్ధతుల ననుసరించి కొందరు తెలుగు వ్యాకరణములు రచించిరి. ఇట్టి వ్యాకరణములలో నాడు ప్రసిద్ధికెక్కినవి; లింగం లక్ష్మాజీ (విశాఖపట్టణములో 'డెప్యూటీ ఇన్స్పెక్టర్ ఆఫ్ స్కూల్స్') గారి 'తెలుగు వ్యాకరణము' (1863), పాపినేని అబ్బాయి నాయుడుగారి వ్యాకరణములు (1868, 1876), మద్దాలి లక్ష్మీనరసయ్య (సివిల్ ఇంజనీరింగ్ శాఖలో తెలుగు మున్షి) గారి 'సంగ్రహాంధ్ర వ్యాకరణము', శ్రేష్ఠలూరు కువ్పనయ్యంగారి 'సర్వలక్షణ సార సంగ్రహము', మొదలయినవి.

అబ్బాయి నాయుడుగారు తమ 'ఆంధ్రవ్యాకరణ సంగ్రహము' (A Manual of Telugu Grammar) నందు దానినిగూర్చి, "...... a good school book on Telugu grammar for Junior classes, on a plan similar to that of an English one" అని, వ్రాసిరి. చిత్తూరులో గవర్నమెంటుజిల్లా స్కూలునం దాంధ్రపండితులైన కువ్పనయ్యంగారు వ్రాసిన 'సర్వలక్షణసార సంగ్రహము' యొక్క పీఠికలో (1926 ముద్రణము) డా. కట్టమంచి రామలింగారెడ్డిగారు, తమ పుట్టుకకు (1880) ముందే ఈ వ్యాకరణము యొక్క మొదటికూర్పు జరిగినదని వ్రాయుచు; "గద్య రచనను గూర్చి చర్చించియుండు వ్యాకరణములు మనభాషలో అంతగాలేవు. ఆ సకృత్తు గ్రంథములనెల్ల కువ్పనయ్యంగారి సర్వలక్షణసార సంగ్రహము ఆద్యము. వ్యాకరణమునకు వచన రచనాకళను అంటుగట్టిన వారిలో వీరు ప్రథములు." అని చెప్పిరి. ఇట్లు అంటుకట్టుటకు, గ్రంథములోని పరిభాష ఆంగ్ల వ్యాకరణ పరిభాష ననుసరించుటకు, రచయితపై పడిన ఇంగ్లీషు ప్రభావమే కారణము. ఈ సందర్భమున, వేదము వేంకటరాయశాస్త్రిగారు తమ 'శిశు వ్యాకరణము' (1886) యొక్క విజ్ఞాపనలో వ్రాసిన, "పూర్వ సంస్కృత భాషా వ్యాకరణ జ్ఞానము నపేక్షింపని తెనుఁగు వ్యాకరణము నొకదానిని రచించిన నెంతయు నుపయోగము గలుగునని అట్టిదానినిగా దీనిని రచించితిని," అను వాక్యము,

నాటి తెలుగు వ్యాకరణముల స్థితిని తెలియజేయుచున్నది. కనుకనే, వీరేశలింగం పంతులుగారును "ఇంగ్లీషుపద్ధతి ననుసరించి" సంగ్రహ వ్యాకరణమును (1875) రచించిరి.

'కాల్డ్వెల్' దొర 'ద్రావిడభాషా వ్యాకరణము' బయలుదేరిన తరువాత (తొలికూర్పు - 1855; మలికూర్పు - 1875), మనవారిలో చాలమందికి భాషా శాస్త్రమునందును, ద్రావిడభాషల తులనాత్మక పరిశీలనమునందును కుతూహలము హెచ్చెను. ఇట్టి విజ్ఞానముతో బయలుదేరిన రచనలలో; వావిలాల వాసుదేవశాస్త్రిగారు ఆంధ్రభాషా తత్త్వమునుగూర్చి చేసిన రచన (1881) టి. ఎమ్. శేషగిరిశాస్త్రిగారు రచించిన 'అర్ధానుస్వారతత్త్వము' (1893) 'ఆంధ్ర శబ్దతత్త్వము' (1896) అనునవి; జయంతి రామయ్య పంతులుగారు, ద్రావిడభాషలను గూర్చియు, నిఘంటునిర్మాణమును గూర్చియు చేసిన రచనలు; మేడేపల్లి వేంకట రమణాచార్యులుగారి 'ప్రాకృత భాషోత్పత్తి' 'ఆర్యభాషా విభాగము' మొదలయినవి; కాశీభట్ట బ్రహ్మయశాస్త్రిగారు తమ భాషాశాస్త్ర పరిజ్ఞానమును తెలుపుచు చేసిన రచనలు 'కాగడా' మొదలయినవి; వేదము వెంకటాచలమయ్య (1864-1931)గారు 'కతిపయ శబ్దార్థ స్వరూప విచారము' అను శీర్షికపై వ్రాసిన వ్యాసములు; వజ్ఝల చినసీతారామస్వామి శాస్త్రిగారి 'ద్రావిడభాషా పరిశీలనము' మొదలయిన గ్రంథములు; పేర్కొనదగినవి. ఈ రచనలుచేసిన వారందరును ప్రత్యక్షముగగాని, పరోక్షముగగాని పాశ్చాత్యుల భాషాశాస్త్ర పద్ధతుల ప్రభావమునకు లోనైనవారే యనుట సత్యదూరము కాదు. వారికి ఆ పద్ధతులను గూర్చిన జ్ఞానము కలదు.

అకారాదిక్రమమున నిఘంటువులను కూర్చుటయు, ఇంగ్లీషు మొదలైన పాశ్చాత్యభాషలలోని పదములను ఆంధ్రపదజాలమున గ్రహించుటయు కూడ; పాశ్చాత్యుల ప్రభావముననే ప్రవర్తిల్లెను.

'ఇంగ్లీషు ప్రభావము' న, వైజ్ఞానికైతిహాసిక రంగములలో మనవారు చేసిన కృషి అమూల్యమైనది. మన నాగరకతాసంస్కృతుల స్వరూపస్వభావములపై ఈ కృషి చూపిన ప్రభావము అత్యంతము ప్రగాఢము. వైజ్ఞానిక రంగములో రచయితలు కావించిన రచనలు, చాలవరకు ఆంగ్లగ్రంథములకు అనువాదప్రాయములు. మొట్టమొదట తెలుగులో ఇట్టి రచనలు కావించిన వారిలో ఇంచుమించుగా అందరును సాహిత్యవేత్తలే. వారికి సాహిత్య పరిజ్ఞానమున్నంత వైజ్ఞానికపరిజ్ఞానము లేదు. నాటికింకను వివిధ శాస్త్రములలో

"ప్రత్యేకకృషి" చేసి నిష్ణాతులైనవారి సంఖ్య తక్కువ. ఉన్నవారిలో ప్రజలకు పనికివచ్చులాగున తెలుగులో వ్రాయగలిగినవారి సంఖ్య మరియు తక్కువ. ఈ పరిస్థితులలో, ప్రజలకు విజ్ఞానమిచ్చు రచనలను చేయవలసిన బాధ్యత సాహిత్యవేత్తలపై—ఇరువదవ శతాబ్ది మొదటిదశలలో ఇది చాలవరకు మారినది—పడినది. ఇందువలననే, వీరేశలింగం పంతులుగారివంటివారు, విజ్ఞానశాస్త్ర గ్రంథములను (పదార్థ వివేచకశాస్త్రము, జంతుస్వభావచరిత్ర మొదలయినవి) తెలుగులో వ్రాయవలసినవారైరి. ప్రపంచచరిత్రలో ప్రతిదేశమునను, విజ్ఞాన శాస్త్ర మభివృద్ధికి వచ్చుచుండిన తొలినాళ్ళలో, సాహిత్యవేత్తలే చాలవరకు శాస్త్రరంగమున కృషిచేసినట్లు కన్పట్టును. ఐతిహాసిక రంగమునను ఇట్లే, సాహిత్యవేత్తలు మొట్టమొదటి రచనలు (వీరేశలింగం పంతులుగారి 'స్వదేశ సంస్థాన చరిత్రలు' మొదలయినవి) కావించిరి.

పాశ్చాత్యదేశములను గూర్చియు, అందలి మహాపురుషులను గూర్చియు చరిత్రలలో చదివిన మనవారికి తమదేశమును గూర్చియు, దేశస్థులనుగూర్చియు వ్రాయవలెనను ఉత్సాహము జనించినది. మొదటినుండియు మనదేశములో ఇట్టి రచనలకు ప్రాముఖ్యము లేకుండుటచే, మనవారికి విషయాభావము లేకున్నను, సామగ్ర్యభావము కలిగెను. పందొమ్మిదవ శతాబ్ది పూర్వార్ధములో పాశ్చాత్యుల, బొర్రయ్యవంటి స్వదేశీయుల, కృషిఫలితముగా, కొంత చరిత్ర సామగ్రి సేకరింపబడియుండెను. ఉత్తరార్ధములోనివా రా సామగ్రిని వినియోగించుకొనియు, నూతనసామగ్రిని సంపాదించుకొనియు గ్రంథరచనకు గడంగిరి.

సుప్రసిద్ధ విద్వాంసులైన కొక్కొండ వేంకటరత్నం పంతులుగారు (1842-1915); నాటి కాలపరిస్థితుల ననుసరించి అప్పటి 'ప్రిన్స్ ఆఫ్ వేల్స్' భారతదేశమును దర్శించిన సందర్భమున ఒక వచనగ్రంథమును రచించిరి. ఇది 1877 లో ముద్రింపబడెను. ఇది రెండుభాగములుగ నున్నది. ఇందు మొదటి భాగమున ఇంగ్లండురాజుల చరిత్ర, రెండవ భాగమున ఎడ్వర్డుప్రభువు భారతదేశ యాత్ర వర్ణింపబడినది. ఇందులకు సామగ్రిని వారు ఆంగ్లగ్రంథములనుండి సంగ్రహించిరి.

నాడు, ఆంధ్రదేశములోని ముఖ్యపట్టణముల చరిత్రలను వ్రాసినవారిలో మామిడి సారంగపాణి, మతుకుమల్లి కృష్ణశాస్త్రి అనువారలు ముఖ్యులు. వీరు కలిసి 'మచిలీ బందరు చరిత్ర' (1879) ను రచించిరి. ఇది అనేక నూతన విషయములతో కూడిఉన్న పరిశోధనగ్రంథము.

'కవి జీవితములు' (1880) వ్రాసి గణనకెక్కిన గురజాడ శ్రీరామ మూర్తిగారు (1851-1899). ప్రత్యేకముగా కొందరు మహాపురుషుల జీవిత చరిత్రలను కూడ వ్రాసిరి. వీనిలో బెండపూడి అన్నమంత్రి చరిత్ర, తిమ్మరుసు చరిత్ర (1898), అప్పయ దీక్షిత చరిత్ర (1897) ముఖ్యమైనవి. వీరు రచించిన 'రావువారి చరిత్ర' (1895) ఉత్తమ పరిశోధనగ్రంథము.

పందొమ్మిదవ శతాబ్ది ఉత్తరార్ధములో చాల జీవితచరిత్రలు బయలు దేరెను. ఇవన్నియు రచయితల ఉత్సాహమును, వారి పరిశోధనాపటిమను తెలుపజాలినవై యున్నవి. వీనిలో రాజా మృత్యుంజయ నిశ్శంక బహద్దరువారి 'కొండదొరల చరిత్ర' (1871); వేంకటకవిగారి 'రావు గంగాధర రామారావు గారి చరిత్ర' (1871); పి. రామదాసుగారి 'భద్రాచల రామదాసు చరిత్ర' (1875); రామానుజాచారి, వీరరంగయ్యగారల 'చాణుక్యుని చరిత్ర' (1885); వేంకట రంగకవిగారి 'పూర్వకవుల చరిత్ర' (1888); భక్తవత్సలనాయుడుగారి 'కాటమరాజుచరిత్ర' (1889); చిలుకూరి వీరభద్రరావుగారి 'వీరేశలింగకవి సంగ్రహజీవితము' (1892); పి. దక్షిణామూర్తిగారి 'పింగళి సూరన జీవితచరిత్ర' (1893); మృత్యుంజయరావుగారి 'చైతన్యుని చరిత్ర' (1893); తోలేటి వేంకట సుబ్బారావుగారి 'వీరేశలింగకవి చరిత్ర' (1894); వి. వేంకట రమణయ్యగారి 'శివాజీ చరిత్ర' (1899); పేర్కొనదగినవి.

పందొమ్మిదవ శతాబ్ది ఉత్తరార్ధమున గొప్ప పరిశోధకునిగ పేరు పొందిన వారిలో తల్లాప్రగడ సుబ్బారావుగారు (1856-1890) ఒకరు. వీరి రచన లలో చాల భాగము ఆంగ్లమున నుండుటచేతను, రాష్ట్రేతర ప్రాంతమున (బరోడా) ఉద్యోగముచేయుటచేతను, వీరి కాంధ్రప్రాంతమునం దంతగా ప్రచా రము రాలేదు. వీరు— బుద్ధ నిర్యాణకాలమును గూర్చియు, శంకరాచార్యుల కాలమును గూర్చియు, ఖారవేలుని శాసనకాలమునుగూర్చియు, చేసిన పరిశోధ నలు ; వేత్తల మన్ననలందెను.

భాషావిషయక పరిశోధనలను, ఐతిహాసిక పరిశోధనలను సమదృష్టితో పరిశీలించిన జయంతి రామయ్యపంతులుగారు, తెలుగుదేశచరిత్రకు సంబంధించిన శాసనముల నెన్నింటినో ప్రకటించిరి. వీరి 'శాసనపద్యమంజరి' భాషావిషయక మైన వీరి పరిశోధనాప్రాగల్భ్యమునకు తార్కాణము, భాషా పరిశోధకులకు ఆలంబనము. ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికలలో వీరు ప్రచురించిన అనేక వ్యాసములు ఇటు వాఙ్మయ సేవకులకు, అటు ఐతిహాసిక పరిశోధకులకుకూడ

నావశ్యకములై వరలినవి. 'సూర్యరాయాంధ్ర నిఘంటువు' యొక్క సంకల నమునకు వీరు ప్రాతిపదిక వేసిరి. వీరు ఇవిగాక, శాస్త్ర పారిభాషిక పదముల పట్టికనుగూడ కొంతవరకు సిద్ధముచేసి ప్రచురించిరి. ఇట్లు, వీరి కృషి పాశ్చాత్య పరిశోధనాపద్ధతుల ప్రభావమున ప్రవర్ధమానమైనది.

సంస్కృతాంధ్రాంగ్ల భాషాసాహిత్యములను తులనాత్మక పరిశీలన దృష్టితో పఠించి, అనేకములైన విమర్శవ్యాసములు రచించిన కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు— మాధవ విద్యారణ్యులు, శిష్టు కృష్ణమూర్తికవి, నారాయణభట్టు, నాచన సోమనాథుడు మొదలయినవారి ప్రత్యేక జీవిత చరిత్రలు వ్రాయుటయేగాక ; 'పెద్దాపుర సంస్థాన చరిత్ర'ను కూడ రచించి ఐతిహాసిక పరిశోధనలో తమకున్న నేర్పును చూపిరి.

శ్రీ శాస్త్రిగారు 'ప్రకృతిశాస్త్ర విషయకవ్యాసములు' కూడ రచించి, తమయొక్క బహుముఖ పాండిత్యమును ప్రకటించిరి.

'మహోపాధ్యాయ' బిరుదాంకితులైన ఆచంట వేంకటరాయ సాంఖ్యాయనశర్మగారు తమ రచనలచే సాహిత్యము నలంకరించుటయేగాక, వైజ్ఞానిక విషయములపై తెలుగులో రచనలుచేసి ఆ శాఖనుకూడ విస్తరింప జేసిరి. వైజ్ఞానిక విషయములపై, తెలుగున వ్యాసములు వ్రాసిన ప్రథములలో వీరినికూడ లెక్కింప వలసినదే. వీరు తమ రచనలను, ఇతరుల రచనలను ప్రకటించుట కనువుగా 'సుజనప్రమోదిని' (10-6-1881, ప్రారంభ సంచిక) అను మాసపత్రికను నడుపుటకు ప్రారంభించిరి. చిన్నవయస్సులోనే పత్రికను ప్రారంభించిన వీరు, నాటి పెద్దలను ఆకర్షించుటలో వింతలేదు. సహజముగా వైజ్ఞానిక విషయములపై నభిమానము కల వీరు; 'రహస్యదర్పణము' అను విజ్ఞానవిషయక వ్యాససంపుటి నొకదానిని ప్రచురించిరి (1894). ఇది, వీరి వైజ్ఞానిక పాండిత్యమునకు నిదర్శనము. దీని తరువాత 'కల్పలత' అను పత్రికను 1903 లో స్థాపించి కొన్ని సంవత్సరములు నడిపిరి. ఈ పత్రికలో వీరు— పదార్థవిజ్ఞాన, రసాయన, జంతు, ఖనిజ, ఖగోళశాస్త్రములకు సంబంధించిన వివిధ విషయములపై వ్యాసములను ప్రకటించి, పాశ్చాత్యశాస్త్రవిజ్ఞానమును తెలుగునాట ప్రచారము చేసిరి.

వీరి రచన లన్నియు, మన మేధావులను పాశ్చాత్య విజ్ఞానశాస్త్రము లెట్లాకర్షించెనో చూపుటకు తార్కాణములు.

'ఆంధ్రుల చరిత్ర' అనినవెంటనే మనకు చిలుకూరి వీరభద్రరావు గారు (1872-1939) జ్ఞప్తికి వత్తురు. వీరు నాటికి ఉపలభ్యమానమైన చరిత్ర సామగ్రిని సమస్తమును నిశితముగా విమర్శదృష్టితో పరిశీలించి, 'ఆంధ్రుల చరిత్ర' రచనకు గడంగిరి. దీని మొదటి రెండు భాగములు 'విజ్ఞాన చంద్రికా మండలి' లో 1910, 1912 సంవత్సరములలో ప్రచురింపబడెను. తరువాతి భాగములు తామే ప్రచురించిరి. ఇట్లు ప్రచురించినను, 'గ్రంథ మండలి' సంపాదకులైన కొమఱ్ఱాజు వేంకట లక్ష్మణరావు గారికి తామెంతగా ఋణపడియుండిరో తెలుపుటకు గాబోలు, తాము 1936 లో ప్రచురించిన 'ఆంధ్రుల చరిత్ర' సంపుటమును వారి కంకితమిచ్చిరి. వీరి రచన సుందరముగ నుండుటచే, ఇతిహాస విషయమునకు కూడ సాహిత్యత్వ మబ్బినది. వీరి 'జీర్ణ కర్ణాటరాజ్య చరిత్రము' నకు ఆంగ్లములో 'సీవెల్' వ్రాసిన 'ది ఫర్గాటెన్ ఎంపైర్' ఆదర్శప్రాయమైనది.

వీరభద్రరావు గారు 'ఆంధ్రుల చరిత్ర' నే గాక, కొందరు మహాపురుషుల జీవిత చరిత్రలను గూడ రచించిరి. ఇవి జీవిత చరిత్రలైనను, ఐతిహాసికాధారములతో చక్కని భాషలో వ్రాయబడినవి. వీనిలో 'తిక్కన సోమయాజి' మొదలయిన తెలుగు కవులు ; 'తిమ్మరుసు' మొదలయిన చారిత్రక పురుషులు చేరియుండిరి. 'అళియ రామరాయలు' జీవిత చరిత్రలో ; ఆంగ్లములో 'ఫాదర్ హీరాస్' వ్రాసిన వ్రాతలను ఖండించి, వీరు రామరాయల జీవితమును యథార్థమైనరీతిని ప్రదర్శించిరి.

చరిత్ర రచనమున పాశ్చాత్యు లవలంబించిన పరిశోధనా పద్ధతులను బాగుగా గ్రహించి, ఆ విధానములను మన పరిస్థితుల కనుగుణముగ మలచుకొని వీరు రచనలు కావించుటచే, అవి అన్నియు ఐతిహాసికాధారములపై నిలిచిన ఉద్గ్రంథములైనవి.

కవిగా, విమర్శకునిగా, విద్వత్తవిపోషకునిగా పేరుపొందిన మంత్రిప్రెగడ భుజంగరావుగారు (1876-1940) నాటి సంప్రదాయము ననుసరించి, వైజ్ఞానిక విషయములపై రచనలు చేసిరి. వీరి వైజ్ఞానిక రచనలలో పదార్థ విజ్ఞానశాస్త్రమునకు సంబంధించినవి నాడు కొంత ప్రచారమునకు వచ్చెను.

పందొమ్మిదవ శతాబ్ది ఉత్తరార్ధములో జన్మించిన ఆంధ్రమహాపురుషులలో నొకరగు కొమఱ్ఱాజు వేంకట లక్ష్మణరావు గారు (1877-1923) ఆంధ్ర భాషా సాహిత్యముల, నాగరకతా సంస్కృతుల వికాసమున కావశ్యకములగు సమస్త విషయములలోను కృషిచేసినవారని స్థూలముగా చెప్పవచ్చును. ఇందు

వీరి దృష్టి, వైజ్ఞానికైతిహాసిక విషయములందు ప్రత్యేకముగా నధికమైనదని చెప్పవచ్చును. దీనికి తగిన సామగ్రి, రాజపోషకులు[53], మిత్రులు వీరికి లభించుటచే, ప్రతిభావంతులును కార్యశూరులునగు వీరు తమ ఆదర్శముల నాచరణలో పెట్టగలిగిరి.

ఆంగ్లములోని 'ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికా' మాదిరిగా, అకారాది క్రమమున ఆంధ్రభాషలో ప్రపంచ విజ్ఞానమును ఆంధ్రుల కందింపవలెనని వీరు ప్రారంభించిన 'ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము' వీరి ప్రజ్ఞాప్రాగల్భమును, కార్యదీక్షను వేనోళ్ల చాటుచున్నది. ఇది సామాన్యుడు తలపెట్టగలిగిన పనికాదు. ఊహాకే అతీతమైనది. అట్టిదానిని ప్రారంభించి, ప్రతిభావంతులను తమకు తోడ్పడుటకు ఆకర్షించి[54], కొంతవరకైనను కృతకృత్యులైన లక్ష్మణరావుగారు సామాన్యులు కారు. వీరికి కాల మనుకూలముగా నున్నచో గ్రంథము పూర్తిఅయ్యేడిదే. 'ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము' ముద్రణము 1912 లో ప్రారంభమై 1920 నాటికి మూడు సంపుటములు ('అ' కారాది విషయములు) పూర్తియైనవి. లక్ష్మణరావుగారు 1923 లో దివంగతులగుటతోడనే దీని ప్రకటన మాగిపోయినది.[55] 'విజ్ఞానసర్వస్వము'ను పరిశీలించువారికి లక్ష్మణరావుగారి బహుముఖప్రజ్ఞ వ్యక్తమగును. దీనిలో వారు స్వయముగా వ్రాసిన వ్యాసములు వివిధశాస్త్రములలో వారికి గల పాండిత్యమును తెలుపును.

---

53. మునగాల రాజాగారయిన శ్రీ నాయని వెంకట రంగారావు (1875-1958) గారికి, లక్ష్మణరావుగారు దివాను. సాహిత్యప్రియులు, భాషాభిమానులునైన రాజావారు; లక్ష్మణరావుగారి 'వ్యాసంగము' నకు అడ్డువచ్చు వ్యవహారములలో వారిని వియమింపకుండుటయే గాక, లక్ష్మణరావుగారు తలపెట్టిన సమస్త కార్యములకు అండగా నిలిచి, వారి కృషిని ఫలవంతమొనర్చి, ఆంధ్రుల కుపకారముచేసిరి. హైదరాబాదునకు చెందిన శ్రీ రావిచెట్టు రంగారావుగారు (1877-1910) కూడ లక్ష్మణరావుగారికి చేదోడు వాదోడుగా నున్నవారిలో నొకరు.

54. 'అబ్రహాం లింకన్' చరిత్ర వ్రాసిన గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు మొదలైన వారెందరో ఇట్లాకర్షింపబడిరి.

55. 'దేశోద్ధారక' కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు తమకు సహజమైన ఔదార్యముతో, భాషాభిమానముతో 'ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము' యొక్క పునర్ముద్రణమునకు 1926-27 లో పూనుకొని, గ్రంథమును అవశ్యకమైన చోటులందు సంస్కరించి, విషయమును పెంచి, రెండు సంపుటములు ప్రకటించిరి. మూడవ సంపుటము యొక్క ముద్రణము పూర్తికాకపూర్వమే దేశోద్ధారకులు దివంగతులగుటచే గ్రంథ ప్రకటన మాగిపోయెను.

'ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము' ప్రారంభించుటకు పూర్వమే లక్ష్మణరావు గారు, దేశీయులకు ఐతిహాసిక వైజ్ఞానిక విషయములలో ఆధునికమైన జ్ఞాన మలవడజేయవలెనను దృష్టితో 1906 లో 'విజ్ఞాన చంద్రికా గ్రంథమాల'ను స్థాపించి, వివిధ శాస్త్రములపై, దేశ చరిత్రలపై జీవిత చరిత్రలపై గ్రంథము లను ప్రకటించిరి. నవలలను వ్రాయించిరి. ఈ గ్రంథములను రచించిన రచయితలలో చాలమంది లక్ష్మణరావుగారికంటె వయస్సులో చిన్నవారైన సమకాలికులు. పాశ్చాత్య విజ్ఞాన శాస్త్రములను, పరిశోధనా విధానములను నవీనపద్ధతిలో నేర్చుకొన్న విద్వాంసులు.[56]

లక్ష్మణరావుగారికి చిన్ననాటినుండియు వైజ్ఞానిక విషయములపై మక్కువ ఎక్కువ. చాల ఇంగ్లీషు పుస్తకములను చదివి, 1898 లోనే వీరు 'విశ్వము యొక్క విరాట్ స్వరూపము', 'విశ్వము యొక్క బాల్యస్వరూపము' అను విషయములనుగూర్చి వ్రాసి రాయసం వెంకట శివుడుగారి 'జనానా' పత్రికలో ప్రకటించిరి. 'విజ్ఞానచంద్రికా గ్రంథమండలి' లో ప్రకటింపబడిన వివిధ శాస్త్రగ్రంథములకు వీరు వ్రాసిన పీఠికలు, ప్రాక్పశ్చిమ శాస్త్రముల యందు వీరికి గల పాండిత్యమునకు నిదర్శనములు. ఐతిహాసిక రంగమున వీరు చేసిన కృషులలో—కొన్ని అమూల్యశాసనముల ప్రకటనము, హిందూ మహాయుగము, మహమ్మదీయ మహాయుగము, శివాజి చరిత్ర మొదలైన గ్రంథముల రచన—ఎన్నదగినవి.

గ్రంథములు వ్రాయుట, వ్రాయించుటకాక; ఆంధ్రులకు వీరుచేసిన అమూల్యమైన సేవలు రెండు. సక్రమమైనపరిశోధనావిధానమును దేశమున నెల కొల్పుట మొదటిది. వైజ్ఞానిక రచనలకు పనికివచ్చు పారిభాషికపదజాలమును

---

56. 'విజ్ఞాన చంద్రికా గ్రంథమాల'లో: రసాయనశాస్త్ర విషయములపై వేమూరి విశ్వనాథ శర్మగారు, పదార్థ విజ్ఞానశాస్త్ర విషయములపై మంత్రిప్రెగడ సాంబశివరావుగారు, ఆరోగ్యశాస్త్ర విషయములపై ఆచంట లక్ష్మీపతిగారు, అర్థశాస్త్ర విషయములపై కట్టమంచి రామలింగారెడ్డిగారు, రచనలు సాగించి, గ్రంథములను ప్రకటించిరి. ఈ గ్రంథమాలలోనే, భోగరాజు నారాయణమూర్తిగారి 'విమలాదేవి'; కేతవరపు వేంకటశాస్త్రిగారి 'రాయచూరు యుద్ధము' మొదలైన నవలలుకూడ ప్రకటింపబడెను.

చిలుకూరి వీరభద్రరావుగారి 'ఆంధ్రుల చరిత్ర' మొదటి సంపుటములును ఇందే ప్రకటింపబడెను. కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారితో ఉన్న సంబంధమునుబట్టి పైవారందరును —జనవతిథినిబట్టి కాక—ఇట పేర్కొనబడిరి.

సృష్టించుట రెండవది. ఈ రెండు పనులయందును వారికి సాయపడినవి, దారి చూపినవి పాశ్చాత్య పరిశోధనాపద్ధతులు. ఆ పద్ధతుల ననుసరించి ఆంగ్లములో బయలుదేరిన గ్రంథజాలము. ఇతర భారతీయభాషలతో కూడ వారికి పరిచయ ముండుటచే, పాశ్చాత్య పరిశోధనాపద్ధతులను ఆయాభాషలవా రెట్లు వినియోగించుకొనిరో ప్రత్యక్షముగ తెలిసికొను అవకాశముకూడ వారికి కలిగినది.[57]

ఇట్లు సాహిత్యములోని వివిధశాఖలలో 'ఇంగ్లీషు ప్రభావము'న కృషి జరిగినది. దేనిపై నెంతవరకు ఈ 'ప్రభావము' పడినదో ఆయాప్రదేశములలో చూపబడినది. విశిష్టముగ ఆ ప్రభావము పడినదని చూపుటకు వీలునీయని రచనలును చాలకలవు. కాని, అవియును ఆ 'వాతావరణము' లోనే బయలు దేరుటచే ఎడనెడ వానికిని ఆ గాలి సోకినట్లుండుటయు కలదు. అందువలన నట్టి వానినిగూర్చి కూడ కొంత వ్రాయవలసివచ్చెను.

ఇంతవరకు, 1880 వ సంవత్సరమునకు పూర్వము జననతిథి గలవారిలో చాలమంది వ్రాసిన వ్రాతలను 'ఇంగ్లీషు ప్రభావము' అను దృక్కోణమునుండి పరిశీలించుట ఐనది. ఇట్టివారిలో ఇంచుమించుగా అందరిపై—ఈప్రభావమునకు లోనుగాక, రచనలు సాగించిన మహానుభావులును కొందరు లేకపోలేదు— ఈ ప్రభావము పడినది. దీనికి లోనైన వారందరును గ్రంథములు వ్రాయలేదు. వ్రాసినవారందరును అన్నిగ్రంథములను, 'ఇంగ్లీషు ప్రభావము' ప్రోత్సాహము కాగా, వ్రాసినవారును కారు.

వీరిలో ఆంగ్లసాహిత్య స్రవంతిలో దిగినవారు కొందరు, జలకమాడిన వారు కొందరు, తరియించినవారు కొందరు, తీరమున నడచినవారు కొందరు: ఎవరేది చేసినను, ఆ నదీశీకరముల చలువ కొంతకుకొంత సోకనివారు అరుదే.

★

---

57. "చారిత్రకుడైన లక్ష్మణరావుగారు యింగ్లీషులో పరిశోధనాన్ని తెలిసివుండడం చేతా, ఆ పరిశోధనం మహారాష్ట్రంలోనూ, బెంగాలులోనూ యెట్లాసాగించారో బాగా చూచి ఉండడంచేతా, దాన్ని మన భాషలోకి తెచ్చాడు." —కురుగంటి సీతారామయ్యగారు

(నవ్యాంధ్ర సాహిత్యవీధులు [మొదటి ముద్రణము, 1942] పుట-౧౧౦.)

# BIBLIOGRAPHY


*Addison, Joseph* ... Writings.

*Arden, A. H.* ... A Progressive Grammar of the Telugu Language (1873).

*Bacon, Sir Francis* ... Writings.

*Banerjea, Sir Surendranath* ... A Nation in Making (1925).

*Basu, Yogindra Nath* ... Life of Madhusudan Dutt (1905).

*Beaumont and Fletcher* ... Writings.

*Bernier* ... Travels in the Moghul Empire (1891).

*Boswell, James* ... The Life of Samuel Johnson.

*Bromley, E. B.* ... They were men sent from God; (Bangalore - 1937).

*Brown, William* ... A Grammar of the Gentoo Language (1817).

*Brown, C. P.* ... The Verses of Vemana (1829).
A Grammar of the Telugu Language (1840)
Telugu—English Dictionary (1852)
English—Telugu Dictionary (1852)
A Dictionary of the Mixed Dialects and Foreign words used in Telugu (1854).

*Burnell, A. C. and Yule, Henry* ... A Glossary of Anglo-Indian Colloquial Words and Phrases (London - 1886).

*Bussy* ... Memoire pour Bussy.

*Caldwell, Rev. R.* ... Dravidian Comparative Grammar (1875, Second Edition).

*Campbell, A. D.* ... A Grammar of the Teloogoo Language (1849, Third Edition).

*Carey, Dr. William* ... Grammar of the Telinga Language (1814, Serampore),

*Cazamian, Louis* ... A History of English Literature (London, 1927).

*Charmichael* ... Manual.

*Congreve, William* ... Writings.

*Cowper, William* ... Writings.

*Dickens, Charles* ... Writnigs.

*Dryden, John* ... Writings.

*Dutt, R, C.* ... The Lake of Palms.

*Elliot, Sir H. M,* ... The History of India as told by its own Historians (1867—1877).

*Etherege, George* ... Writings.

*Evans, B. Ifor* ... A Short History of English Drama.

*Farquhar, George* ... Writings.

*Foster, Sir W.* ... Early English Travellers in India (1921).
The English Factories in India; 1637—1641. (1942).

*Goldsmith, Oliver* ... Writings.

*Gray, Thomas* ... Writings.

*Hamilton, Captain Alexander* A New Account of the East Indies (Edinburgh, 1727).

*Henrywood, (Mrs.)* ... East Lynne.
*Hunter* ... A History of British India (1912).
*Jones, Sir William* ... Introduction to the Asiatic Researches.
*Justamond, J.* ... East and West Indies.
*Kaye* ... Administration of the East India Company (1853).
*Keith, A. B.* ... Speeches and Documents on Indian Policy, 1750—1921; Vol. I (1922).
*Kincaid, Dennis* ... British Social Life in India (London, 1939).
*Lucas, F. L.* ... Tragedy.
*Malleson, G. B.* ... The French in India (1909).
*Morris, Henry* ... A Descriptive and Historical Account of the Godavery District in the Presidency of Madras, (London, 1878)
Simplified Telugu Grammar (London, 1890).
*Nettleton, G. H.* ... English Drama of the Restoration and Eighteenth Century (1642-1780) [New york, 1916]
*Nicolson, Harold* ... The Development of English Biography,
*Norton, George* ... Rudimentals (1841)
*O' Malley, L. S. S.* ... Modern India and the West (Oxford University Press, 1941)
*Orme, Robert* ... History of the Military Transactions of the British Nation in Indostan.
*Parnell, Thomas* ... Writings.
*Penny, Rev. Frank* ... Church in Madras.
*Pope, Alexander* ... Writings.
*Prinsep, J. T.* ... Essays on Indian Antiquities.
*Ramaswami, Cavelly Venkata* ... Biographical Sketches of Dekkan Poets (1829, 1888)
*Roy, Rajah Rammohan* ... English works of (Panini Edition)
*Satthianadhan, S.* ... History of Education in the Madras Presidency (1894)
*Scott, Sir Walter* ... Writings.
*Sewell* ... The Forgotten Empire
*Shakespeare, William* ... Writings
*Sheridan R. B.* ... Writings.
*Smith, Vincent* ... Oxford History of India.
*Srinivasachari, C, S.* ... History of Madras.
*Steele, Sir Richard* ... Writings.
*Swift, Jonathan* ... Writings.
*Taylor, Meadows* ... Writings.
*Tennyson* ... Writings.
*Vanbrugh, Sir John* ... Writings
*Williams, T. G.* ... Getting to Know English Literature.
*Wilson, R. S.* ... The Indirect Effects of Christian Missions in India (1928).
*Wycherley, William* ... Writings.

## CATALOGUES, REPORTS, JOURNALS ETC.


A Descriptive Catalogue of Mackenzie's Collections, with life. Second Edition (Madras, 1882).

A Descriptive Catalogue of the Telugu Manuscripts in the Govt. Oriental Manuscripts Library. Madras. Vol. IX (1947).

A Catalogue Raisonnie of Oriental Manuscripts in the Library of the (Late) College. Fort Saint George, 1857.

Encyclopaedia Britannica

Extract from the 'Report of Col. Prendergast'.

Fort Saint George Gazette, Supplement–July, August. September 1872.

Imperial Gazetter of India; Provincial Series; Madras I (1908)

Journal of the Madras Literary Society (1847)

Lord Macaulay's Minute of Dissent (2–2–1835)

Notes on and Extracts from the Government Records of Fort St. George (1871)

Pioneer of Modernism in Andhra—K. Iswara Dutt (Swatantra Weekly 17–4–1948)

Report from Select Committee on the Affairs of the East India Company, Vol VI (1832)

Sir Thomas Munroe's Minute on Education (25th June 1822)

Some Account of the Literary Life of C. P. Brown.

The Madras Journal of Education (1868)

The Concise Oxford Dictionary (1942)

Viresalingam—Dr. C. R. Reddi (Swatantra Weekly 17–4–1948)

ఆంధ్రదీపిక : మామిడి వెంకయ్యగారు

ఆంధ్ర రచయితలు : మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రిగారు

ఆంధ్ర వచన వాఙ్మయము (1954) నిడుదవోలు వేంకటరావుగారు

ఆచంట వేంకటరాయ సాంఖ్యాయన శర్మగారి రచనలు

ఆచంట సుందరరామయ్యగారి రచనలు

ఆదిభట్ల నారాయణదాసుగారి రచనలు

ఆనందరంగరాట్ఛందము : కస్తూరి రంగకవి

ఆముక్తమాల్యద : శ్రీకృష్ణదేవరాయలు

కందుకూరి వీరేశలింగంపంతులుగారి రచనలు

కన్యాశుల్కము (ప్రథమ ముద్రణము-1897): గురజాడ అప్పారావుగారు

కాటమరాజు చరిత్ర : భక్తవత్సలనాయుడుగారు

కాశీనాథుని నాగేశ్వరరావుగారి రచనలు

కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారి రచనలు

కాశీయాత్ర చరిత్ర (దిగవల్లి వేంకట శివరావుగారి తృతీయ ముద్రణము-1941) : ఏనుగుల వీరాస్వామయ్యగారు

కిడాంబి రామానుజాచార్యులుగారి రచనలు

కూచి నరసింహముగారి రచనలు

కొండదొరల చరిత్ర : మృత్యుంజయ నిశ్శంక బహద్దరువారు

కొక్కొండ వేంకటరత్నంపంతులుగారి రచనలు

కొచ్చెర్లకోట రామచంద్ర వేంకట కృష్ణారావుగారి రచనలు

కొటికలపూడి సీతమ్మగారి రచనలు

కొమఱ్ఱాజు వేంకటలక్ష్మణరావుగారి రచనలు

కోరాడ రామచంద్రశాస్త్రిగారి రచనలు

కోలాచలము శ్రీనివాసరావుగారి రచనలు

క్రిష్టియన్ వేదగ్రంథము

క్రైస్తవ కీర్తనలు (1927)

గిడుగు వేంకట రామమూర్తిపంతులుగారి రచనలు

గురజాడ శ్రీరామమూర్తిగారి రచనలు

గౌతమ వ్యాసములు : పింగళి లక్ష్మీకాంతముగారు

చాటుపద్యమణిమంజరి

చాటుపద్య రత్నాకరము

చాణక్యుని చరిత్ర : రామానుజాచారి, వీరరంగయ్యగారలు

చార్ దర్వీషు (1856) : ఎఱ్ఱమిల్లి మల్లికార్జునుడుగారు

చిలకమర్తి లక్ష్మీనరసింహముగారి రచనలు

చిలుకూరి వీరభద్రరావుగారి రచనలు

చెన్నపురీ విలాసము (వావిళ్ళవారు; 1863, 1941) : మతుకుమల్లి నృసింహకవి

చెన్నాప్రగడ భానుమూర్తిగారి రచనలు

చైతన్యుని చరిత్ర : మృత్యుంజయరావుగారు

జనమంచి వేంకటరామయ్యగారి రచనలు

జయంతి రామయ్యపంతులుగారి రచనలు

తంజనగరము తేవప్పెరుమాళ్ళయ్యగారి రచనలు

తల్లాప్రగడ సుబ్బారావుగారి రచనలు

తిరుపతి వేంకటకవుల రచనలు

తెలుగు వ్యాకరణము (1836) : రావిపాటి గురుమూర్తిశాస్త్రిగారు

తేకుమళ్ళ రాజగోపాలరావుగారి రచనలు

తోభ్యచరిత్ర : పింగళి ఎల్లనార్యుడు

దాసు శ్రీరాములుగారి రచనలు

ధర్మవరం రామకృష్ణమాచార్యులుగారి రచనలు

నడకుదుటి వీరరాజుపంతులుగారి రచనలు

నాగపూడి కుప్పుస్వామయ్యగారి రచనలు

నాదెళ్ళ పురుషోత్తమకవి రచనలు

నీలగిరిచరిత్ర (1864) : జేతపూడి సుందరరాయడుగారు

నీలగిరియాత్ర (మద్రాసు ప్రభుత్వమువారు, 1953) : కోలా శేషాచలకవి

నవ్యాంధ్ర సాహిత్య వీధులు (ప్రథమ ముద్రణము, 1942) : కురుగంటి సీతారామయ్యగారు

పద్మనాభ యుద్ధము : చట్రాతి లక్ష్మీనరసకవి

పనప్పాకము శ్రీనివాసాచార్యులుగారి రచనలు

పరవస్తు చిన్నయసూరిగారి రచనలు

పరవస్తు రంగాచార్యులుగారి రచనలు

పానుగంటి లక్ష్మీనరసింహారావుగారి రచనలు

పాపినేని అబ్బాయినాయుడుగారి రచనలు

పింగళి సూరన జీవితచరిత్ర : పి. దక్షిణామూర్తిగారు

పూండ్ల రామకృష్ణయ్యగారి రచనలు

పూర్వకవుల చరిత్ర : వేంకటరంగకవి

బి. శ్రీనివాసరావుగారి రచనలు

భద్రాచల రామదాసు చరిత్ర : పి. రామదాసుగారు

మంత్రిప్రెగడ భుజంగరావుగారి రచనలు

మచిలీబందరు చరిత్ర : మామిడి సారంగపాణి, మతుకుమల్లి కృష్ణశాస్త్రిగారలు

మద్దాలి లక్ష్మీనరసయ్యగారి రచనలు

మానవల్లి రామకృష్ణకవిగారి రచనలు
మారేపల్లి రామచంద్రకవిగారి రచనలు
మాలపల్లి : ఉన్నవ లక్ష్మీనారాయణగారు
ముట్నూరి కృష్ణారావుగారి రచనలు
మేదేపల్లి వేంకటరమణాచార్యులుగారి రచనలు
రంగరాయ చరిత్రము : దిట్టకవి నారాయణకవి
రఘునాథాభ్యుదయమ్ : రామభద్రాంబ
రఘునాథ నాయకాభ్యుదయము : విజయరాఘవనాయకుడు
రాయసం వెంకటశివుడుగారి రచనలు
రావు గంగాధర రామారావుగారి చరిత్ర : వేంకటకవి
రెంటాల వేంకట సుబ్బారావుగారి రచనలు
లంకా విజయము : పిండిప్రోలి లక్ష్మణకవి
లింగం లక్ష్మీజీగారి రచనలు
వఝ్ఝల చినసీతారామస్వామిశాస్త్రిగారి రచనలు
వడ్డాది సుబ్బారాయడుగారి రచనలు
వసుచరిత్ర (బ్రౌనుదొరగారు ముద్రింపించినది-1844) : రామరాజభూషణుడు
వావిలాల వాసుదేవశాస్త్రిగారి రచనలు
విశ్వగుణాదర్శమ్ : వేంకటాధ్వరి
వీరేశలింగకవి చరిత్ర : తోలేటి వేంకట సుబ్బారావుగారు
వేదము వేంకటరాయశాస్త్రిగారి రచనలు
వేదము వేంకటాచలమయ్యగారి రచనలు
వేదాంత రసాయనము : మంగళగిరి ఆనందకవి
వ్యవహార దర్పణము : వఠ్యం వాసుదేవ పరబ్రహ్మశాస్త్రిగారు
శివాజీచరిత్ర : వి. వేంకట రమణయ్యగారు
శిష్టు కృష్ణమూర్తికవిగారి చాటువులు
శుకసప్తతి : పాలవేకరి కదిరీపతి
శేషగిరిశాస్త్రి (టి. ఎమ్) గారి రచనలు
శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారి రచనలు
శ్రీరంగరాజు చరిత్ర (1872) : గోపాలకృష్ణమసెట్టిగారు
శ్రీరాం వీరబ్రహ్మముగారి రచనలు
శ్రేష్ఠలూరు కుప్పనయ్యంగారి రచనలు

సాహిత్య రత్నాకరమ్ : యజ్ఞనారాయణ దీక్షితులు
స్వారోచిష మనుచరిత్ర (బ్రౌనుదొరగారు ముద్రింపించినది-1851) : అల్లసాని పెద్దన
హంసవింశతి : అయ్యలరాజు నారాయణామాత్యుడు
హితసూచని (1862) : స్వామినీన ముద్దునారసింహనాయనివారు

## నిఘంటువులు, సంచికలు, వ్యాసములు మొదలగునవి.

ఆంధ్రవిజ్ఞాన సర్వస్వము (Vol. II ; 1922)
ఇంగ్లీషు చదువుల చరిత్ర : దిగవల్లి వేంకట శివరావుగారు (కృష్ణాపత్రిక ; 1941)
కొక్కొండ వేంకటరత్నం పంతులు : నిడుదవోలు వేంకటరావుగారు (భారతి ; ఏప్రిల్ 1951)
పురుషార్థ ప్రదాయిని (జనవరి 1872)
బ్రౌణ్య నిఘంటువులు
వివేకవర్ధని (జూలై 1876)
శబ్దరత్నాకరము (1937)
శ్రీ ఆంధ్ర పరిశోధక మహామండలి (పంచమ వార్షికోత్సవ సంచిక, 1922)
శ్రీ శంకరనారాయణ ఇంగ్లీషు-తెలుగు నిఘంటువు
శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు
హిందూదేశాభిమాని (6 ఏప్రియల్ 1889)

★

# INDEX

(గ్రంథస్థమైన రచనల, రచయితల పేరులు మాత్రమే ఇందు కలవు.)

య



ర

★